# గమనిక

'ఆంధ్ర మహిళ' స్త్రీల సచిత్ర మాస పత్రిక. ఆంధ్ర లోకంతో సన్నిహితానుబంధం ఏర్పరచుకొని, మహిళా సంఘంలో నూతన ప్రబోధం కలిగించే ఆశయంతో ఆంధ్ర మహిళా సభ తరపున "ఆంధ్ర మహిళ" పత్రిక 10 సం॥రములనుండి ప్రకాశితమగుచున్నది.

దీనియందు స్త్రీల మనోవికాసానికి తోడ్పడే వ్యాసములు, కథలు, నాటికలు, పిల్లలకు వాలానందం మొదలగు గద్య పద్యాత్మకములైన పలురకముల రచనలున్నవి. సాంఘిక రాజకీయ విషయములు, ప్రభుత్వము వారు దేశాభివృద్ధికై జరుపుచున్న సంక్షేమ కార్యక్రమాలు, స్త్రీలకుపయుక్తమైన గృహ పరిశ్రమలు మున్నగు వానిని గూర్చి మాసామానముయిందు ప్రకటింపబడును.

వార్షిక సంచిక, తపాలా ఖర్చులతోసహా

## సంవత్సర చందా 6-0-0

సేవాసంస్థలకు, గ్రంథాలయములకు, కళాశాల, పాఠశాలలకు,

సంవత్సర చందా రూ. 4-8-0 మాత్రమే.

వివరములకు :

మేనేజరు
'ఆంధ్ర మహిళ'

ఆంధ్ర మహిళా సభ,
24-ఎ, లజ్ చర్చిరోడ్డు, మైలాపూర్, మద్రాసు 4.





న్యూఢిల్లీలోని సెంట్రల్ నర్సింగ్ కాలేజీ విద్యార్థిని, గ్రామీణస్త్రీలకు శాస్త్రయుక్తముగా శిశువులకు ఆహారము నిచ్చుటను గూర్చి విశదపరుస్తూ వుంది.

# ఆంధ్ర మహిళ

వ్యవస్థాపకురాలు :

శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్

యెం.యే., బి.యెల్.,

సంపాదకురాలు :

శ్రీమతి చన్న ఘంటమ్మ

యెం.యే., యెల్.టి.,

సంవత్సర చందా ఆరు రూపాయిలు

ఆంధ్ర మహిళా సభవారిచే స్థాపించబడిన ముద్రణాలయములో
ముద్రితము.

# ఆంధ్ర మహిళా సభ

## సంగీతపు తరగతులు

కర్ణాటక సంగీతము వీణ, గ్రాతములలో లోయర్ గ్రేడ్ పరీక్షలకు శిక్షణ, ఆంధ్ర మహిళా సభ లజ్ చర్చిరోడ్డు భవనములలో, ప్రారంభింప బడినది.

శిక్షణ మాసరుసుము: రూ. 5-0-0.

ప్రవేశ రుసుము: రూ. 3-0-0.

సభ్యత్వ రుసుము మాసమునకు: రూ. 1-0-0.

మిగతా వివరములు సభకు మద్యాహ్నం 3 గంll పైన వచ్చి తెలిసికొనవచ్చును.

## ఖాదీ విక్రయము.

మద్రాసు గౌర్నమెంటు రూరల్ వెల్ఫేరు శాఖలో తయారయిన ఖద్దరు వస్త్రములు, ఆంధ్ర మహిళాసభ లజ్ చర్చి రోడ్డు కార్యాలయంలో విక్రయింప బడుతున్నవి.

చీరలు, ధోవతులు, దుప్పట్లు, చొక్కా, రవికె గుడ్డలు, ఇంకా అనేక రకములైనవి యిక్కడ దొరకును. రూపాయ విలువకు 3 అణాలు తగ్గించి విక్రయించవలసినదిగా వెల్ఫేరు శాఖవారు అనుమతి యిచ్చియున్నారు.

ఉదయం 10 గంll నుండి సాయంకాలం 6 గంll వరకు ఈ విక్రయశాఖలో మీకు కావలసిన వస్తువులు దొరకును.

అ. చన్నఘంటమ్మ.



# ఆంధ్ర మహిళ ప్రచురణలు

—:o:—

త్వరలోనే వెలువడనున్నవి.

## ఏకాంకికలు

రచన: శ్రీ బుద్ధవరపు నాగరాజామాత్యుడు.

క్రౌన్ సైజ్ — 200 పేజీలు

చదువుట కింపగు చక్కటి నాటికలు.



## విడదీసే రైలుబళ్లు

[కథల సంపుటి]

రచన: శ్రీమతి. కె. రామలక్ష్మి.

ఆంధ్ర మహిళా ముద్రణాలయము, ఆంధ్ర మహిళాసభలో ముద్రింప బడుచున్నవి.

# కృతజ్ఞత

శ్రీమతి శివలంక కామాక్షమ్మగారు, ఆంధ్ర పత్రికా ముద్రణాలయములో ముద్రింపబడిన (ఆంధ్ర గ్రంథమాల ప్రచురణలు) ఈ దిగువ పుస్తకాలు, ఆంధ్ర మహిళాసభ గ్రంథాలయమునకు వుచితముగా నిచ్చిరి. వీరికి మా కృతజ్ఞత.

బసవ పురాణం

పంచ తంత్రం

మహాభారతం

ఆంధ్ర వాఙ్మయచరిత్ర

శ్రీ మద్భగవద్గీత

ఆత్మకథ (మహాత్మాగాంధి 2 భా)

రెండు మహానగరాలు

మనిషిలో మనిషి

రాజూ—పేదా

విచిత్ర వ్యక్తి

హకల్ బెరీఫన్

డాన్‌క్విక్ సెట్

కౌంటుఆఫ్‌మాంట్ క్రిస్టో (2 భా)

టామ్‌సాయర్

అల్లీ బిల్లీ లోకంలో అమ్మాయికథ

కాంచన ద్వీపం

జయ నామ సంవత్సర పంచాంగం.

అ. చన్నఘంటమ్మ

# ఆంధ్ర మహిళా సభ

—:o:—

మేమాసములో, సభ విద్యాశాఖకు వేసవి సెలవులు. బెనారెస్, ఆంధ్రమెట్రిక్, ఇ. ఎస్. ఎల్. సి. తరగతులు మూయబడును.

తిరిగి జూన్ 7. వ తేదీని సీనియర్ ఎడ్మిషన్ తరగతి, జూన్ 14 వ తేదీని అన్ని జూనియర్ తరగతులు ప్రారంభ మగును.

క్రొత్త విద్యార్థినులకు ప్రవేశ పరీక్షలు జూన్ 7, 10, 14, 17, తేదీలలో నుండును.

హిందీ, సంగీతము, టైపు, ప్రారిశ్రామిక తరగతులు వేసవిలోకూడ జరుగుచుండును.

జూలై నుండి ఇంటర్‌మీడియట్ తరగతులు ప్రారంభ మగును.

నర్సింగ్ కోర్సుకు, పారిశ్రామిక శిక్షణకు, జూలైలో క్రొత్త విద్యార్థినులు జేర్చు కొనబడుదురు.

వివరములు వలయువారు 0-4-0 అణాలు స్టాంపులు పంపిన వివరముల పట్టీ పంపబడును.

సిలబస్‌తో సహా పూర్తి వివరములకు రూ. 1—2—0 స్టాంపులు పంపవలెను.

ఆంధ్ర మహిళాసభ, లజ్‌చర్చి రోడ్డు ఆఫీసులో ఆదివారము తక్క, 11 గం॥ నుండి 4 గం॥ వరకూ వివరములు కనుక్కొన వచ్చును.

# ఆంధ్రమహిళ

సంపుటి 11 :: మే '54 :: సంచిక 1



ఇంకా బాలానందం, గ్రంథసమీక్ష, వ్యాసాలు, కథలు మొదలైనవి.

సంవత్సర చందా : : ఆరు రూపాయలు.



సంపుటి 11 :: మే '54 :: సంచిక 1

# సంఘాభివృద్ధి ప్రణాళికలు - నర్సుల శిక్షణ

## ఆంధ్ర మహిళా సభ, మదరాసులో శిక్షణ కేంద్రము.

మన ప్రభుత్వపు ప్రథమ పంచవర్ష ప్రణాళిక యొక్క ఆరోగ్యాభివృద్ధి కార్యక్రమంలో, ప్రసవ చికిత్స, శిశుసంక్షేమం, ప్రధానమైనవిగా సూచించబడ్డాయి. మన దేశంలో ప్రసవించిన ప్రతి వెయ్యి మందిలో, 20 మంది ప్రసవకాలములో మృతినొందుచున్నారని, పుట్టిన ప్రతి వెయ్యి మంది పాపలలో 127 గురు చనిపోవుచున్నారని, ప్రణాళికలో పేర్కొనబడినది — ఇతర దేశాలతో పోల్చిచూస్తే యీ సంఖ్య ఎక్కువ. ఇటీవల మలబారులో ప్రసవించిన తల్లుల, శిశువుల మృత్యు సంఖ్య కొంత హెచ్చినదని లెక్కలు వింటున్నాము. ప్రవీణులైన స్త్రీవైద్యులు, మంత్రసానులు, దాయిలు, అనువైన చికిత్సశాలలు, ప్రజాబాహుళ్యానికి అందుబాటులో లేకపోవడం యీ అరిష్టానికి కారణమని ప్రభుత్వము గుర్తించారు.

ఆరోగ్య అభివృద్ధి, ముఖ్యముగా స్త్రీలకు, శిశువులకు సంబంధించిన చికిత్స, సంక్షేమ కార్యక్రమాలు, మగ్రామాల్లో విరివిగా సాగాలని, ప్రభుత్వము దృఢమైన విశ్వాసం కలిగి ఉన్నారు. ఇది ఎట్లు నెరవేరాలి అనే యము, పంచవర్ష ప్రణాళికలో విపులంగా సూచించబడ్డది కూడా. ఇంతవరకూ ప్రసూతి చికిత్స కేంద్రాలు, సంరక్షణ కేంద్రాలు, ధనికులైన ప్రజలు, మిషనరీలు, ఇంకా సేవాసంస్థలు, బాధ్యతవహించి నెలకొల్పినవే వ. కొంతకాలము నుండి, ప్రభుత్వము, మునిసిపాలిటీలు ఇందులో కొంతశ్రద్ధ చూపుచున్నమాట వాస్తవమే అది చాలదు. ప్రభుత్వము దీనిని గూర్చి యింకా తగుశ్రద్ధతీసుకుని, ప్రత్యేక వ్యక్తులు, ప్రత్యేక సంస్థలు. పుచున్న కార్యక్రమాలు బహుముఖాలుగా అభివృద్ధి జెందేటట్టు చేయాలనికూడా ప్రణాళికలో సూచించబడ్డది.

ఈ ప్రణాళిక అమలు జరుగాలంటే, శిక్షితులైన సిబ్బంది అవసరం. అందూ ముఖ్యంగా నర్సులు, త్రసానులు. దాయీలు ఎక్కువగా కావాలి, ఇప్పుడు ప్రారంభించిన అభివృద్ధి కేంద్రాలలో నియోగింపబడుటకు మంది నర్సు—మంత్రసానులను వీలైనంత త్వరలో తర్ఫీదు చేయాలని ప్రభుత్వము నిర్ణయించినారు. ఎనిమిదవ తి, లేక మూడవ ఫారమే అర్హతగల యువతులకు, ఇండియన్ నర్సింగ్ కౌన్సిలువారు ఆమోదించిన శిక్షణ శిక ననుసరించి, రెండు సంవత్సరములపాటు రోగి సంరక్షణ, మంత్రసాని పనులలో శిక్షణ నిచ్చుట ఉత్తమ వీరు భావించినారు.

## సంఘాభివృద్ధి ప్రణాళికలు - నర్సుల శిక్షణ.

ఆంధ్ర మహిళా సభ రెండు సంవత్సరములుగా, ప్రసూతి, రోగి సంరక్షణ, ఉచిత వైద్య శాఖను స్థాపించి నడుపుచున్నది. దీనికి అనుబంధముగా, గత జూలై నుండి నర్సు— మంత్రసానుల శిక్షణ కేంద్రము కూడా స్థాపించినది. ఇందు ప్రస్తుతము 12 గురు యువతులు శిక్షణ పొందుచున్నారు. యీ శిక్షణ కార్యక్రమాన్ని కేంద్ర ప్రభుత్వము ప్రోత్సహిస్తూ, రెండు సంవత్సరములుగా, గ్రాంటు ఇస్తున్నారు. ఇప్పుడు తిరిగి తనకు తక్షణం కావలసిన నర్సు— మంత్రసానులలో, 30 మందికి యీ కేంద్రములో శిక్షణ నీయవలసినదిగా, ప్రభుత్వ ఆరోగ్యశాఖ ఆంధ్ర మహిళా సభ కార్యనిర్వాహకులను కోరినారు. సభ కార్య నిర్వాహక వర్గము దానికి అంగీకరించినారు

ఇదివరకే స్థాపితమై, వివిధ రంగాలలో కృషి చేస్తూఉన్న సేవా సంస్థల, ఇతర సంస్థల సహకారాన్ని ప్రభుత్వము యీ విధంగా కోరడం ఇరుప్రక్కలా చాలా అభిలషణీయమైనది, తృప్తికరమైనదీ అని చెప్పుకోవాలి, తమ సేవా కార్యక్రమాన్ని ప్రభుత్వము ఆమోదించడం నిర్వాహకులు కోరుకొని, గర్వింపదగ్గ విషయం— తమ ప్రణాళికలను కాలవ్యయము లేకుండా, స్వల్ప ధన వ్యయముతో అమలు జరుపుకోగలందులకు అనువైన ప్రజా సహకారం, ఇలాంటి సంస్థల రూపంగా ప్రభుత్వానికి అందుబాటులో నుండడం కూడా సంతోషించవలసిన విషయమే— ఈ సూక్ష్మమును కనిపెట్టిన మన ప్రభుత్వము, తమ ఇతర కార్యక్రమాలకు కూడా, యిలాంటి ప్రజా సంస్థల సహకారమును పొంద గలిగినట్లయితే, అభివృద్ధి సులభసాధ్యమౌతుంది. మారుమూలలనున్న సేవా సమాజాలకు ప్రభుత్వ ప్రోత్సాహమిచ్చు నిమిత్తం ఏర్పడ్డ సంఘ సంక్షేమ కేంద్రశాఖ సమాజాల కార్యక్రమాలను యీ దృక్పథంతో పరిశీలించడం అత్యవసరం--



# అశ్రుతర్పణం

## కీ॥ శే॥ శ్రీ చింతగుంట రాఘవరావుగారు.



మదరాసు హైకోర్టు న్యాయమూర్తి శ్రీ చింతగుంట రాఘవరావుగారు, డి. 13-4-1954 న, మద్రాసు నగరంలో మృతిజెందిరని తెలుపుటకు చాలా చింతిల్లు చున్నాము. బుద్ధి బలమునకు, పాండిత్యమునకు ప్రసిద్ధికెక్కి, ఉన్నత పదవిని అలంకరించిన ఆంధ్రులలో వీరు పేర్కొన దగిన వారు.

ఆంధ్ర మహిళాసభ సేవా కార్య క్రమమును ప్రోత్సహిస్తూ, వారి భార్య అయిన సీతాలక్ష్మమ్మగారి పేర, మహిళా సభలో భోజన గృహము నిర్మించు నిమిత్తము రూ. 8000/- విరాళ మిచ్చి, మహిళోద్యమము పట్ల వారికిగల అదరాభిమానములు క్రియా రూపముగా వెల్లడించిరి. అదియునుగాక, మహిళా సభ అన్ని వ్యవహారములలోనూ, న్యాయవాదిగా సలహాలిచ్చి తోడ్పడెడివారు. ఈయన మృతి వల్ల ఆంధ్ర మహిళాసభ ముఖ్య మిత్రులలో నొకరిని కోల్పోయినది, ఆయన భవ్యాత్మకు శాంతి సమకూర్చమని భగవంతుని ప్రార్థిస్తూ, దుఃఖితులైన భార్యా పుత్రులకు 'ఆంధ్ర మహిళ' అత్యంత సానుభూతిని తెలియజేయుచున్నది.

# 'స్త్రీల అనర్హతల తొలగింపు దినోత్సవము.'

అఖిల భారత మహిళా సంఘం, ఆంధ్ర శాఖవారి యాజమాన్యమున. నెల్లూరు జిల్లాశాఖ, ఇతర మహిళాసంస్థలు 11-4-54 తేది మొదలు 19-4-54 తేదీవరకు స్త్రీల ఆస్తి హక్కుల వారం జరిపిరి. సుదర్శనమ్మ మహిళాసభ, పత్తేఖాన్‌పేట, రంగనాయకుల పేట, నవాబుపేట, మున్నగుచోట్ల సభలు జరిగినవి. ప్రముఖ స్త్రీలందరు సభలయందు పాల్గొనిరి. శ్రీమతులు. డా॥ యస్. లక్ష్మి, డా॥ మ్యాథ్యూసు, ఎ. సత్యవతి, సరోజా చంద్రశేఖర్. అల్లాడి అన్నపూర్ణమ్మ, డేవిడ్, పైడా సుశీలమ్మ, బి. కామేశ్వరి, వంతంగి ఆదిలక్ష్మమ్మ, వి. పట్టమ్మాళ్, దేవతా సరస్వతి, సుబ్బరామగుప్తగార్లు ఉపన్యసించిరి.

19-4-54 తేది 'స్త్రీల అనర్హత తొలగింపు' దినోత్సవం టౌనుహాలులో జరిపినారు. ఉదయం సభకు శ్రీమతి మాదప్పగారు, సాయంత్రం సభకు శ్రీమతి రాధా సుబ్రమణ్యంగారు, అధ్యక్షత వహించిరి. శ్రీమతులు వరుచూరి సూర్యాంబ, భీమా అన్నపూర్ణ, సరస్వతమ్మ, కె. విమల, సి. వి. లక్ష్మీరెడ్డిగార్లు ఉపన్యసించిరి.

పై సభలలో ఈక్రింది తీర్మానములు ఏకగ్రీవముగ ఆమోదింపబడినవి.

1. హిందూ న్యాయ చట్టమును యింతవరకున్ను ప్యాసు చేయకుండా వాయిదా వేస్తున్నందుకు కేంద్ర ప్రభుత్వము పార్లమెంటువారి చర్యను ఈ సభవారు ఖండిస్తున్నారు. హిందూచట్టముకు భాగాలవారీ గాకుండా ఒకేమారు ప్రవేశపెట్టాలనిన్ని, జాయింటు కుటుంబం ఆస్తిలో కుమారులతో పాటు కుమార్తెలకు కూడా సమానమైన భాగమివ్వాలని దాన్ని వారు స్వహక్కులతోటి అనుభవించు కోడానికి హక్కువుండాలని, స్త్రీలకుగూడ, దత్తు తీసుకొనే అధికారం వుండాలని తీర్మానించారు.

ప్రస్తుతం పార్లమెంటు ముందుండె అఖిల భారత బాలల చట్టాన్ని వెంటనే ప్యాసు చేయాలని, బాల్యవివాహ నిరోధక చట్టముతో 45 సంవత్సరములకు మించిన పురుషులు, 18 సంవత్సరములకు లోపలి బాలికలను వివాహ మాడరాదను సవరణ పెట్టాలని, ప్రత్యేక వివాహ చట్టములో వివాహపు వయస్సు బాలురకు 21 సంవత్సరాలకు, బాలికలకు 18 సంవత్సరాల వరకు పెంచాలని తీర్మానించారు.

ఆటం, హైడ్రోజను బాంబులను పూర్తిగ నిషేదించాలని, బికినిలో హైడ్రోజన్ బాంబును వాడినందుకు అమెరికన్ ప్రభుత్వ చర్యను గర్హిస్తూ ఈ విషయమై భారత ప్రధాని నెహ్రూ చేసిన సూచనలను బలపరుస్తూ మరొక తీర్మానం చేశారు.

తదుపరి కుమారి వైదేహి, శ్రీమతి యం. సత్యవతి పాట కచ్చేరీలతోను, కుమారి ఉమ నృత్య ప్రదర్శనములతోను, రాష్ట్ర కార్యదర్శిని వందన సమర్పణతో సభ ముగిసెను.

కార్యదర్శిని.

## ఆంధ్ర మహిళా సభ

## మాతా శిశు సంరక్షణ శాఖ

ఈ శాఖకు సంబంధించిన ఆంధ్ర మహిళా సభ నర్సింగ్ హోమ్‌లోను, ఉచిత వైద్యశాల లోను, చికిత్స పొందుచున్నవారి సంఖ్య దినదినము. అధికమగుచున్నది. చాలా మంది బీదయువతులు ఇక్కడకు వచ్చి, ప్రసవమునకు పూర్వము, అటు తరువాత అవసరమైన చికిత్స పొందుచున్నారు.

ఇందు ప్రస్తుతము 12 మంది యువతులు, నర్సు - మంత్రసాని విద్యలో శిక్షితు లగుచున్నారు త్వరలోనే మరి 12 గురిని యిందు శిక్షణకై జేర్చుకొను ఏర్పాట్లు జరుగుచున్నవి.

అ. చన్నఘంటమ్మ.



# రాజకీయాలు

• శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు •

1954 మార్చి నాలుగో వారం మొదలు ఏప్రిల్ మూడో వారం వరకూ అంతర్జాతీయ రాజకీయ రంగంలో నడిచిన సంఘటనలన్నీ సైనిక వ్యూహాల విస్తరణకూ, ఆయుధ ప్రాబల్య సంపాదనకూ సంభవించినవే. జాతీయ వ్యవహారాల్లో పంచవర్ష ప్రణాళికను అమలు జరిపే సమస్య ప్రాధాన్యత వహించింది. ఆంధ్ర ప్రాంతాభివృద్ధికి సంబంధించిన నందికొండ ప్రాజక్టును ఖోస్లాకమిటీ సూచనల్లో కొంత మార్పుచేసి నిర్మించడానికి ఆంధ్ర హైదరాబాద్ ప్రభుత్వాలు ఒప్పుకున్నవి.

*  *  *

ఈ నెలలో పశ్చిమరాజ్యాలు మరి రెండు సైనిక సమాఖ్యలను స్థాపించటానికి ప్రయత్నాలు ప్రారంభించినవి. ఆగ్నేయాసియా, పశ్చిమ పసిఫిక్ ప్రాంత దేశాలను కలిపి ఒక కూటమిగా తయారు చేయాలని అమెరికా విదేశాంగ మంత్రి డలెస్ ప్రతిపాదించగా, బాల్కన్ ఒప్పందాన్ని తయారు చేయాలని యుగోస్లావ్ నాయకుడు మార్షల్ టిటో ప్రయత్నాలు ప్రారంభించారు. ఇవిగాక, ఇప్పటికే పశ్చిమరాజ్యాలు ఏర్పరచి ఉన్న రక్షణ కూటాలు ఇవి — ఉత్తర అట్లాంటిక్, పశ్చిమ యూరప్ ఒప్పందాలు, ఆంజూస్ (ఆస్ట్రేలియా - న్యూజీలాండ్ - అమెరికా) ఒప్పందం. టర్కీ - పాకిస్థాన్ - అమెరికా ఒప్పందం, అఖిల అమెరికా మహాసభ, ఇవికాక జపాన్, దక్షిణ కొరియా, ఫిలిప్పీన్స్, ఫార్మోజా, సయాంలతో అమెరికాకూ, మధ్య ప్రాచ్య, ఆగ్నేయాసియా దేశాలతో బ్రిటనుకూ సైనిక ఒప్పందాలు విడివిడిగా జరిగి ఉన్నవి. మొసాదిక్ పతనంతో పర్షియా కూడా పూర్తిగా ఈ దేశాల చెప్పు చేతల్లోకి వచ్చివేసింది.

ఏప్రిల్ 26 వ తేదీన జెనీవాలో దూరప్రాచ్య వ్యవహారాల సభ జరగబోతున్నందువల్ల, అమెరికా విదేశాంగ మంత్రి డలెస్ తమ సహచరులంతా తను సూచించిన మార్గానికే కట్టుబడి ఉండేట్లు చేసే నిమిత్తం ఏప్రిల్ మొదటి వారంలో యూరపుకు బయలు దేరారు. అక్కడ బ్రిటన్ ఫ్రాన్సులను అదిలించి, బెదిరించి తన పద్ధతికి ఒప్పుకునేట్లు చేశారు. ఆగ్నేయాసియా పశ్చిమ పసిఫిక్ ప్రాంతంలో సైనిక కూటమిని ఏర్పాటు చేయటమే ఆయన పద్ధతి. ఆయన ఒత్తిడికి బ్రిటన్, ఫ్రాన్సులు లొంగిపోయినవి.

ఆగ్నేయాసియా పశ్చిమ పసిఫిక్ ప్రాంతంలో కమ్యూనిస్టు వ్యాప్తిని అడ్డగించే నిమిత్తం సంయుక్త చర్య తీసుకోవాలని ఆయన అన్నారు. కామన్వెల్తు దేశాలన్నిటికీ సంబంధించిన ఈ అంశాన్ని కామన్వెల్తు ఆచారం ప్రకారం బ్రిటన్ ముందుగానే ఇండియా, సింహళం, పాకిస్థాన్ లకు తెలియజేసి వుండవలసింది. బ్రిటన్ అట్లా తెలియజేయలేదు సరిగదా, ఇండియాకు ముందుగానే తెలియజేశామని బ్రిటిష్ విదేశాంగ మంత్రి ఈడెన్ బుకాయించటం కూడా జరిగింది. ఇండియాకు ఈ విషయం తెలియజేశామని ఈడెన్ ఏప్రిల్ 13 వ తేదీన పార్లమెంటులో ప్రకటించారు. కాని ఆ మర్నాడే డెస్మాండ్ డానలీ అనే లేబర్ సభ్యుడు అది నిజం కాదనీ, ఇండియాకు ఈ వర్తమానం అందలేదని, తెలిసిందనీ విమర్శించారు. దానిమీద భారత ప్రధాని నెహ్రూ ఒక ప్రకటన చేస్తూ ఈ సంప్రదింపుల విషయమై ఇండియాతో సంప్రదించటమన్నది జరగనేలేదనీ, 14 వ తేదీ రాత్రి బ్రిటిష్ హైకమిషనర్ డలెస్ - ఈడెన్ ఒప్పందపు ప్రతినొకదానిని అందజేసినట్లూ తెలియజేశారు.

## రాజకీయాలు

ఆఖరికి ఫ్రాన్సుకు కూడా బ్రిటన్ ఈ వ్యవహారాన్ని ముందుగా తెలియజేయలేదనీ, అందు మూలంగా ఫ్రాన్సుకు నోరు మెదిపే అవకాశం లేకుండా పోయిందనీ ఈ లేబర్ సభ్యుడు ఆరోపించారు. ఇండోచైనాలో ఫ్రెంచివాళ్ళు అనుసరించ దలచుకున్న పద్ధతిని అమెరికా కొట్టిపారేసిందని గమనిస్తే ఈ ఆరోపణ నిజమేనని అనుకోవలసి వుంటుంది.

బ్రిటిష్ లేబర్ పార్టీని నడుపుతున్న మితవాద నాయకులు డలెస్-ఈడెన్ ఒప్పందాన్ని ఆమోదించగా, వామపక్ష నాయకుడు బెవాన్ దానిని నిరసిస్తూ పార్టీ అధిష్ఠాన వర్గ సభ్యత్వానికి రాజీనామా ఇచ్చారు. డలెస్-ఈడెన్ ఒప్పందం వల్ల చైనాను చుట్టుముట్టటం, జర్మనీని సాయుధల చేయటం, జెనీవా సభకు అంతరాయాలు కలిగించటం జరుగుతుందనీ, ఆయన హెచ్చరించారు. ఇటువంటి విపరీత విధానాలను లేబర్ పార్టీ ఆమోదించటమన్నది గత నాలుగు సం॥ల నుంచీ లేబర్ పార్టీ అమెరికాకు లొంగిపోయి నడుస్తున్నట్లు మరొకసారి నిరూపిస్తున్నదని బెవాన్ విమర్శించారు.

డలెస్-ఈడెన్ పథకాన్ని ఇండియా, సింహళం మొదలైన ఆగ్నేయాసియా దేశాలన్నిటిలోనూ విమర్శించారు.

* * *

డలెస్ విధానం అంతటికీ ముఖ్య సూత్రం బలప్రయోగ మొక్కటే కమ్యూనిస్టులను ఆపగలుగుతుందన్న నమ్మకమే, కొంతకాలం క్రిందట పశ్చిమ రాజ్యాలన్నీ ఈ విధంగానే భావించినవి. కాని, చైనా మొదలైన చోట్ల ఇది విఫలం కావటం వల్లనో, అమెరికాతోసహా పశ్చిమ రాజ్యాలన్నిటిలోనూ తిరిగి ఆర్థిక మాంద్యం ఏర్పడే సూచనలు కనిపిస్తున్నందువల్లనో, చాలావరకు అభిప్రాయాన్ని మార్చుకున్నవి. శక్తికి మించిన ఆయుధ నిర్మాణం లాభించదని గ్రహించినవి. కాని డలెస్ మాత్రం - అమెరికాలో అధిక సంఖ్యాకులతోసహా - ఈ విషయాన్ని గుర్తించక వెనకటి పద్ధతినే అనుసరిస్తున్నారు.

ఫ్రాన్సుకూడా మొన్న మొన్నటి వరకూ ఇండోచైనాలో వీట్మిన్‌లను యుద్ధంలో ఓడించాలనే ప్రయత్నించింది. కాని దానికోసం ప్రత్యేకించి పంపబడ్డ జనరల్ నవార్ విఫలుడు కావటంతో, దేశమంతటా వీట్మిన్లు విజృంభించటంతో, సంప్రదింపులతో బయలు పడటం మంచిదనుకుంటున్నది. అసలు జెనీవా సభలో ఇండోచైనా ప్రస్తావన రావటానికి కూడా ఫ్రాన్సే కారణం - అయితే అమెరికా మాత్రం ఇండోచైనాలో ముందు సైనిక విజయం లభించినప్పుడే పరిష్కారం చేసుకోవాలని వాదిస్తున్నది. అమెరికన్ నాయకులు యావన్మందీ, సర్వసేనాని రాడ్‌ఫర్డ్, ప్రభుత్వ ఉపాధ్యక్షుడు నిక్సన్‌లతో సహా, ఫ్రాన్సు ఇండోచైనానుంచి నిష్క్రమించకూడదని హెచ్చరిక చేశారు. ఒకవేళ ఫ్రాన్స్ అక్కడినుంచి తప్పుకుంటే అమెరికా స్వయంగా తన సేనలను పంపి పోరాటం సాగిస్తుందని నిక్సన్ వాషింగ్టన్‌లో అమెరికన్ పత్రికా సంపాదకుల సభలో ప్రకటించినట్లు వార్తలు వచ్చినవి.

ఇండోచైనా తీరానికి అమెరికన్ విమాన వాహకనౌకలు వెళ్ళినట్లూ, అమెరికన్ సప్లయి విమానాలు వివిధ ప్రాంతాలనుంచి పంపబడుతున్నట్లూ వార్తలు వస్తున్నవి. అయితే వీట్మిన్‌లకు స్వజాతీయుల అండ బాగా ఉన్నది. ఫ్రాన్సు నిలబెట్టిన కీలుబొమ్మ ప్రభుత్వాల్లో అంతఃకలహాలు ప్రబలి ఉన్నవి. అమెరికా స్వయంగా అక్కడ జోక్యం కలిగించుకుంటే మరొక ప్రపంచయుద్ధమే ప్రారంభమవుతుందని అమెరికా డెమాక్రాటిక్ పార్టీ ప్రముఖులే కొందరు హెచ్చరిస్తున్నారు.

యూరఫ్ రక్షణ ఒప్పందాన్ని కూడా ఫ్రాన్సు ఇంతవరకూ ఆమోదించలేదు.

* * *

అమెరికా ఆసియాదేశాలను తన పెత్తనం కిందికి తెచ్చుకునేందుకు సామధాన భేదదండోపాయాలను అనుసరిస్తున్నది. సయాం, ఫిలిప్పైన్సులలో దానోపాయం పని చేస్తున్నది. పర్షియాలో దండోపాయం పని చేస్తున్నది. పాకిస్థాన్‌ను బుట్టలో వేయటానికి ఇండియాతో పాకిస్థాన్‌కు ఉన్న కాశ్మీర్ తగాదా ఉపయోగించింది. ఇండోనేషియా స్వాతంత్ర్య వ్యవహారంలో సమితి మధ్యవర్తి సంఘంలో పని చేసిన అమెరికన్ ప్రతినిధి ఎవరికో కోల్బన్ వెనకటి మంచి పేరును ఉపయోగించుకుని, ఇండోనేషియాను పరస్పర రక్షణ ఒప్పందంలోకి లాగాలని ప్రయత్నించారు. అతి

వాద ముస్లింపార్టీ ఆధ్వర్యాన ఏర్పడు మంత్రివర్గంచేత ఒప్పందంపై సంతకాలు కూడా చేయించారు. కాని ప్రజాభిప్రాయం వ్యతిరేకంగా ఉన్నందువల్ల ఆ మంత్రివర్గమే రాజీనామా చేయవలసి వచ్చింది. ఒప్పందం బుట్టదాఖలయింది.

గత యుద్ధకాలంలో ఎంతో బాధపడ్డ ఈ దేశాలన్నీ మరొక యుద్ధం రాకూడదని కోరుతుంటున్నవి. చైనాతో స్నేహ సంబంధాలను కోరుతుంటున్నవి. యుద్ధ ప్రమాదాన్ని తెచ్చి పెడుతోందని అమెరికన్-పాకిస్థాన్ ఒప్పందాన్నే ఖండించిన ఈ దేశాలు ఇప్పుడు డలెస్ ప్రతిపాదించిన ఆగ్నేయాసియా కూటమిని ఎంతవరకు ఆమోదిస్తవో చెప్ప నక్కరలేదు. ఈ దేశాల ప్రధానులంతా ఏప్రిల్ నెలాఖరున కొలంబోలో సమావేశమై ఈ ప్రాంత సమస్యలన్నిటినీ చర్చించబోతున్నారు.

* * *

అమెరికా అనుసరిస్తున్న బలాధికత సిద్ధాంతం 1945లో ప్రారంభమయింది. ఆటంబాంబు తమ ఒక్కరికే తెలుసన్న నమ్మకంతో అమెరికా ఆ సిద్ధాంతాన్ని ప్రతిపాదించగా, పశ్చిమరాజ్యాలన్నీ ఆమోదించినవి. కాని రష్యాకు కూడా ఆటంబాంబున్నట్లు తెలియటంవల్లనూ, ఆయుధోత్పత్తి తమను ఆర్థికంగా కుంగదీస్తున్నందువల్లనూ పశ్చిమ రాజ్యాలకు దాని పట్ల ఆసక్తి క్రమంగా తగ్గిపోయింది. ఆ తరవాత రష్యా అమెరికాలు రెండింటికీ హైడ్రోజన్ బాంబులున్నట్లు తెలియటంతో వాటికి అనుమానాలు మరీ ఎక్కువయినవి. తన దగ్గర చాలా పెద్ద బాంబులున్నవని అందరికీ చెప్పటానికో అన్నట్లుగా పసిఫిక్ సముద్రంలో అమెరికా హైడ్రోజన్ బాంబు పరీక్షలను కూడా జరిపిస్తున్నది. ఇంతలో రష్యా దగ్గర హైడ్రోజన్ బాంబు కూడా ఉన్నట్లు పుకార్లు బయలు దేరినవి.

ఏది ఎట్లా ఉన్నా ఈ ఆయుధాలతో యుద్ధమే జరిగితే, ఎంత భీభత్సం జరుగుతుందో వర్ణించటం కష్టం. బలాధిక్యత కోసం ఒకరు ప్రయత్నిస్తే రెండోవాళ్ళు ఊరుకోరు. అందువల్ల ఆ ప్రయత్నాలను కట్టిపెట్టి వేరే మార్గాన పరిష్కారం చేసుకొనటం ఒక్కటే తరుణోపాయమని ప్రపంచంలో సర్వత్రా భావిస్తున్నారు. ఇందుకోసం అగ్రరాజ్యాలు ఈ బాంబుల ఉత్పత్తిని ఉన్నవి ఉన్నట్లుగా కట్టి పెడుతూ ఒక యథాతథం ఒప్పందాన్ని ముందుగా చేసుకుని, సమస్యను పరిష్కరించు కోవాలని ప్రధాని నెహ్రూ సూచించారు. ఈ సూచనమీద చర్చించటానికి అంతర్జాతీయ ఆయుధాల తగ్గింపు సంఘం అంగీకరించింది. వివిధదేశాల్లోను ప్రజలు నెహ్రూ సూచనను సమర్థిస్తూ ప్రకటనలు, సభలు, సమావేశాలు జరుపుతున్నారు.

* * *

భారత ప్రభుత్వపు పంచవర్ష నిర్మాణ ప్రణాళిక అంత సంతృప్తి కరంగా సాగటంలేదని చెప్పవలసి వుంటుంది. కేంద్ర ఆర్థికమంత్రి ఈ విషయమై పార్లమెంటులోనే ప్రసంగిస్తూ ప్రణాళికలో 80 వంతులు సాగితే అది చాలా గొప్ప సంగతేనని అన్నారు. నిరుద్యోగ సమస్యా పరిష్కారానికి అందులో తగిన ఏర్పాట్లు లేక పోవటమన్నది అట్లా ఉంచినా, అది సరిగ్గా అమలు జరగటం లేదనే దేశంలో అభిప్రాయం వ్యాపించి ఉన్నది.

అసలు పథకాన్ని అమలు జరపటానికి అవసరమయిన డబ్బే లేదని ఆర్థికమంత్రి తెలియజేసి, దానికోసం లోటు ఖజానా పద్ధతి పెట్టుబడిని కూడా అనుసరిస్తామని సూచించి ఉన్నారు. ఇప్పుడు దానికోసం కొత్తగా ఒక ప్రభుత్వ ఋణాన్ని కూడా ప్రారంభించారు.

కేంద్ర మంత్రివర్గంలో ఈ విషయమై అభిప్రాయ భేదాలు వచ్చినవి. వివిధశాఖల ఖర్చులమీద ఆర్థికశాఖ తనిఖీ ఉండాలని ఆర్థికమంత్రి పెట్టిన నిబంధనవల్లనే ప్రణాళిక అమలు ఆగిపోయిందని మిగిలినవాళ్ళు అభిప్రాయ పడటం జరిగింది. దానితో ఆర్థికమంత్రి రాజీనామాను పార్టీకి ఇవ్వటం, పార్టీ దానిమీద చర్చించి, ప్రణాళిక అమలును గురించి విచారణ జరిపించటానికి ఒక కమిటీని ఏర్పాటు చేయ నిశ్చయించటం జరిగింది. ఇతర శాఖల ఖర్చులమీద ఆర్థికశాఖ కంట్రోలు విషయమై తాత్కాలిక ఒప్పందం ఒకటి కుదిరి ఆయన రాజీనామాను ఉపసంహరించుకొనటం జరిగింది.

పంచవర్ష ప్రణాళికను గురించి చేయదగ్గ ముఖ్యావిమర్శ ఒక్కటి. ప్రజల్లో అది ఏవిధమయిన ఉత్సాహాన్ని కలిగించలేకపోయింది.

## రాజకీయాలు

ఆంధ్ర ప్రాంతాభివృద్ధికి అవసరమయిన నందికొండ ప్రాజెక్టుపై ఆంధ్ర, హైదరాబాద్ ప్రభుత్వాలకు ఒప్పందం కుదిరింది. ఆనకట్ట ఎత్తు 590 అడుగులు ఉండాలని అంగీకరించబడ్డది. తరవాత సిద్ధేశ్వరం ప్రాజెక్టుకు అడ్డంకి చెప్పేది లేదని హైదరాబాద్ ప్రతినిధులు హామీ ఇచ్చినట్లు సంజీవ రెడ్డిగారు తెలియజేశారు. నిర్మాణం ఈ సంవత్సరమే ప్రారంభం కావచ్చునని హైదరాబాద్ ఆర్థికమంత్రి మేల్కొటెగారు ప్రకటించారు.

ఆంధ్ర, హైదరాబాద్ ప్రభుత్వాలకు కుదిరిన ఒప్పందాన్ని పట్టి నందికొండ ప్రాజెక్టుపైన ఖోస్లాకమిటీ సూచనల్లో కొన్నిమార్పులు చేయబడినవి. వీటివల్ల గుంటూరు, నెల్లూరు జిల్లాల్లో 7 లక్షల ఎకరాలకు నీళ్ళు దొరకవు. ఖోస్లాకమిటీ సూచనల ప్రకారమే ప్రాజెక్టును నిర్మించాలని ఆందోళన బయల్దేరింది.

ఈ ప్రాజెక్టుమీద ఇంత కాలంపాటు సాగిన సంప్రదింపులు, ప్రాజెక్టులో ప్రతిపాదించ బడ్డ మార్పులు-ఇవన్నీ చూస్తే, ఈ రెండు ప్రాంతాలు ఒకే ప్రభుత్వం కింద ఉండటం ఎంత అవసరమో తెలుస్తున్నది. హైదరాబాద్‌ను విభజించి తెలుగుప్రాంతాన్ని ఆంధ్రలో కలిపివేయాలని హైదరాబాద్, సికిందరాబాద్ కార్పొరేషన్లు కోరినవి. హైదరాబాదును విభజించి తీరాలని ఆంధ్ర, కర్నాటక, మైసూరు, హైదరాబాద్, మహారాష్ట్ర కాంగ్రెసు సంఘాలు కోరుతున్నవి. ఇతర పక్షాలు దీనిని సమర్థిస్తున్నవి. రాష్ట్ర పునర్నిర్మాణ సంఘం దీనిని గమనించి తగిన సూచనలను కేంద్రానికి చేస్తుందని ఆశ. ★

★

మిసెస్ జెర్‌ట్రూడ్ నాజ్లర్ మట్టితో—చేయుచున్న ఒకగిన్నె ఈనాడు, అమెరికన్ స్త్రీలు తమ యింట సాధారణంగా అవలంబిస్తున్న కళయిది.

★





మూలం: ద్విజేంద్రలాల్ రాయి. అనువాదం : శ్రీమతి మాణిక్యవల్లి.

[జరిగిన గాథ :— 'మేవాడ్' రాణా అమరసింహుడు దేశంలో శాంతినీ, ప్రజల సౌఖ్యానందాలనూ కాపాడ దలచి మొగలాయీలతో సంధి చేసుకో దలుస్తాడు. ఆ ప్రయత్నం విఫల మవుతుంది. తత్ఫలితంగా సంభవించిన మొదటి యుద్ధంలో మేవాడ్ గెలుస్తుంది. ఢిల్లీ చక్రవర్తి యీ అవమానంతో క్రుంగి పోతాడు. తన సేనానులలో ఒక్క మహాబత్‌ఖాయే మేవాడ్‌ను జయించగల సమర్థుడని తెలుసు. కాని మహాబత్‌ఖా జన్మతహా మేవాడీయుడు, అమరసింహరాణా పెత్తండ్రి కొడుకు కావడాన మేవాడ్‌కి విరుద్ధంగా అస్త్రం పట్టనంటాడు. కాని తన మామగారు తన మీద ద్వేషంచే పతివ్రత అయిన తన భార్య కల్యాణిని యిల్లు వెళ్ళగొట్టాడని విని, ఉగ్రుడై రాజపుత్ర జాతి నాశనమే లక్ష్యంగా మేవాడ్ పై దండెత్తి పోతాడు. కల్యాణిని ఒంటిగా విడవలేక ఆమెను అనుసరించిన ఆమె అన్నగారు అజయసింహుడు మహాబత్‌ఖా జరిపించిన మారణ హోమానికి బలి అయి పోతాడు. మహాబత్‌ఖా యుద్ధంలో గెలుస్తాడు కాని జన్మతహా రసపుత్రుడు కావడాన రాణా జోలికి పోడు; దుర్గ ప్రవేశంకూడ చేయడు. ఏకాకిగా మిగిలిన అమరసింహరాణా తన దేశం పాటును తలుచుకుని అస్థిరుడై పోతాడు. కొడుకు మృత దేహాన్నీ, మూర్ఛపోయిన కూతురు కల్యాణిని చూసిన గోవిందసింహుడు తన కుటుంబంపాటును, మేవాడ్ పాటును తలుచుకుని భరించలేని దుఃఖంతో అస్థిరుడై పోతాడు. ఉద్రేకంతో గోవిందసింహుడు మహాబత్‌ఖా వద్దకు వెళ్ళి తనతో న్యాయబద్ధమైన యుద్ధానికి రమ్మంటాడు. యుద్ధవిరక్తుడైన ఖా తవ అసమ్మతిని తెలుపుతాడు. ఇంతలో గజసింహుడు గోవిందసింహునిపై తుపాకీ పేల్చి చంపుతాడు. గజసింహుడు వుదయపుర ప్రవేశం కోసం రాగా ద్వారపాలకులడ్డగిస్తే వార్ని తుపాకీలతో పేలుస్తాడు. ఇంతలో అమరసింహుడు వచ్చి గజసింహుడ్ని నేల గూల్చి తను సింహద్వారం తెరుచుకుని లోన ప్రవేశిస్తాడు. ఇక చదవండి.]

—— :o: ——

## ఆరవ రంగం

స్థలం: మేవాడ్ పర్వత సమీప మార్గం. సమయం: సంధ్య.

(సత్యవతి, అరుణసింహుడు, — చారణీలు పాట పాడుతూ వుంటారు.)

(ముగ్గురు సైనికులతో హిదాయతాలీ ప్రవేశం)

హిదా: (సత్యవతితో) మీరెవరు? ఆపాట పాడుతూ తిరుగుతా రెందుకూ?

సత్య: మా కదేపని నాయనా!

హి : ఇంక మీరాపని కట్టిపెట్టాలి

స : ఎందువల్ల?

హి : మీ దేశం మొగలులు జయించేరు కనక.

స : మొగలులకు విజయోస్తు! సాధ్యమైనంత వరకూ స్వాతంత్ర్య రక్షణకై పోరాడాం. సాల లేక తల వంచినప్పుడిక మొగలులతో మాకేలాంటి విరోధం లేదు. కాని మేం యేడవడానికభ్యంతర మేమిటి?

హి : అదంతా నాకు తెలీదు. ఆపాట పనికిరాదు.

అరుణసిం: మానేది లేదు; పాడమ్మా, చూదాం నెవరు అడ్డమొస్తారో?

హి : పాడితే ఖైదు చేస్తాను.

స : పోనీ! ఆ చీకటి కొట్లోనే దుఃఖ గీతి విలపిస్తాం. పాడు బిడ్డా!

హి : (ముందుకు వచ్చి) ఇప్పుడు మీరంతా ఖైదీలు!

అ : (కత్తి దూసి) ఖబడ్దార్! అమ్మ ఒంటిమీద చెయ్యి వేశావంటే తల యెగిరిపోతుంది!

హి : అయ్యో నీయిల్లు బంగారంగానూ! కత్తి దాచెయ్యవోయ్, కుర్రాడా!

అ : దాస్తా! దాస్తా!

హి : (సైనికులతో) వీణ్ణి చంపండి!

(సైనికులు ముందుకు వస్తారు. అరుణుడు వారితో తలపడతాడు)

స : సెహబాస్, బిడ్డా!

(ఒక సైనికుడు గాయపడి పడిపోతాడు)

స : సెహబాస్, బిడ్డా! బొందిలో ప్రాణముండగా చేతనున్న కత్తి విడువకు. పౌరుషమంటే అలా వుండాలి! ఆహా! ఎంత ఆనందం!

(మిగతా యిద్దరి సైనికులకి హిదాయతాలీ తోడవుతాడు. ఇంక కొడుకేలాగా దక్కడని సత్యవతి కళ్ళు మూసుకుంటుంది. ఇంతలో కొందరు సైనికులతో మహాబత్ ఖా వస్తాడు)

మ : హిదాయతాలీ, ఆగు! (అంతా నిలబడిపోతారు)

మ : (హిదాయతాలీతో) ఎంత సిగ్గుమాలిన వాడవు! ఒక్క పసికందు పైకి యిద్దరు జవాన్లని విడిచింది చాలక వారికి సహాయం కూడా చేస్తున్నావు! ఛీ! (అరుణునితో) ధన్యుడవు, బిడ్డా! ప్రాణానికి తెగించి మాతృగౌరవం రక్షిస్తున్నావు! దీర్ఘాయుష్మాన్ భవ!

(ఇంతవరకూ అనిర్వచనీయానందంతో అరుణసింహుని తిలకిస్తున్న సత్యవతి మహాబత్ ఖా వైపు రెండడుగులు వేసి, చటుక్కున వెనక్కి తగ్గి, తల వంచుకుంటుంది. మహాబత్ ఖా సత్యవతిని చూస్తూ వుంటాడు)

మ : అక్కా! నీతో మాట్లాడ్డానికి మొహంచెల్లడం లేదు. అసలు నిన్ను 'అక్కా' అని పిలిచే అధికారమే కోల్పోయాను— యేం చెప్పను? అక్కా నన్ను క్షమించు!

స : ఈశ్వరా! ఎట్టి విషమ ఘట్టం! అనుంగు తమ్ముడు 'అక్కా' అని పిలుస్తుంటే పలికి వాత్సల్యం చూపే అవకాశంలేదు!—

అ : అమ్మా! వారెవరు?

స : మొగలు సేనాధిపతి మహాబత్ ఖా.

మ : నేను నీ మేన మామను బాబూ!

స : అరుణా, పద పోదాం!

మ : అక్కా నన్ను క్షమించి మరీ వెళ్ళు!

స : మహాబత్ ఖా, నువ్వెంత దోషకార్యం చేశావో తెలుసా?

మ : ఆఁ! తెలుసు. స్వగృహానికి స్వయంగా నిప్పుపెట్టి, అగ్ని జ్వాలల్ని రాక్షసానందంతో చూశాను.

స : అంతేనా?

మ : ఇంకేం చేశాను? మతం మార్చుకున్నాను. అది దోషమని నే ననుకోను— ఎవరి నమ్మకం వారిది—

స : బాగా చెప్పేవు! రా, అరుణా పోదాం!

మ : పోనీ ముసల్మాను కావడం తప్పే అనుకో. అయితే అది మానవులు హృదయ మార్దవాన్ని బండలు చేసేటంత భయంకరమైనదా? అక్కా, స్త్రీ హృదయం పావనతకు తపోవనం; ఆత్మత్యాగానికి ఆటస్థలం; ప్రేమకు నందనోద్యానం. ఆచార నియమాలు నవనీత సదృశ్యమైన అలాంటి హృదయాల్ని సైతం పాషాణంగా మార్చి వేస్తాయా? ఒక్క క్షణం నీవు హిందువు, నేను మహమ్మదీయుడిని—నీవు పీడితవు, నేను అత్యాచారిని— అనే విషయం మరచిపో. మన మిరువురము మానవులం— అక్కా తమ్ముళ్ళం అని మాత్రం భావించు. నన్ను యెత్తుకుని త్రిప్పిన నాడు, చెక్కిళ్ళు ముద్దిడి ఆనందాబ్ధి నోలలాడిన నాడు, బుజాన వేసుకుని తిరిగి నిద్రబుచ్చిన నాడు నీలో తొణికిసలాడిన వాత్సల్య వాహిక

యేమైంది? అక్కా—మనం నాటి ఆ మాతృహీన మంద భాగ్యుల మని గుర్తు తెచ్చుకో—

స : శ్రీరామచంద్రా—

మ : అక్కా—

స : ఇంక కాఠిన్యం వహించలేను! గతం నాస్తి—తమ్ముడూ! నీ సర్వాపరాధాల్ని క్షమించాను. పరమేశ్వరుడు నిన్ను క్షమించాలని ప్రార్థిస్తున్నాను! వెళ్ళు, తమ్ముడూ! ఇంక నువ్వు నా దృష్టిలో మొగలు సేనాపతి మహాబత్ ఖాన్ కాదు. ఆ చిన్నారి తమ్ముడు మహీపతివే—

మ : ధన్యుణ్ణి! సెలవు, అక్కా! (నమస్కరిస్తాడు)

స : దీర్ఘాయుష్మాన్ భవ! (అరుణునితో) పద, బిడ్డా పోదాం.

హి : ఎక్కడికి కెడతారు! మీరు ఖైదీలు!

మ : నేనుండగా నా సోదరి నెవరూ కష్టపెట్టలేరు! స్వేచ్ఛగా వెళ్ళు, అక్కా.

హి : ఇప్పుడు సేనాపతి షాహజాదా ఖుర్రం. అందుచేత మీ ఆనతి పాలించలేను.

(ఖుర్రం ప్రవేశిస్తాడు)

ఖు : సరే! నేనే ఆనతిస్తున్నాను. (సత్యవతితో) మీరంతా యింటికి వెళ్ళండి.

హి : ప్రభూ! ఆవిడాపాట పాడి విద్రోహం చల్లుతోంది.

ఖు : దానిలో యేముంది? అదొక దుఃఖ గీతి.

హి : షాహజాదా సాహబ్! యీరకం పాటలు దేశశాంతి భద్రతలకు భంగకరం.

ఖు : మరేం ఫరవాలేదు. శాంతి భద్రతలను కాపాడ్డం పాదుషాకు తెలుసు. అదీగాక యీ రకమైన దేశభక్తి ప్రపూరిత గీతాగానం వల్ల ఒకవేళ మొగలు ఆధిపత్యం దిగజారడమే సంభవిస్తే అది ఒక్క మేవాడ్ నుండే కాదు అఖిల భారతావని నుండి జారిపోయినా మంచిదే. మొగలు సామ్రాజ్యం పిల్లగాలికి పడిపోయే పేక ముక్కల యిల్లు కాదు; అది హిందూ దేశీయుల లోతైన ప్రేమ బలంపై నిర్మింప బడిన కంచుకోట. మాతృదేశాన్ని ప్రేమించి, పూజించే వారి జోలి కెన్నడూ పోవద్దు. అందువల్ల యావత్తు సామ్రాజ్యం దూదిపింజవలె యెగిరిపోయినా విచారం లేదు. తెలిసిందా, హిదాయత్?

హి : జీహాఁ.

ఖు : (సత్యవతితో) నువ్వాపాట పాడు. సోదరీ మీరా పాట పాడుతున్నారని కాదుగాని నేడు మేవాడ్‌లో దానిని వినేవారెవరూ లేరని విచారంగా వుంది. ఫరవాలేదు పాడు సోదరీ. పాడండి, మీతోపాటు నేనూ పాడతాను. హిదాయతాలీ, నీవు కూడా పాడు. (సైనికులతో) మీరూ పాడండి.

(అందరూ పాడుతూ నిష్క్రమిస్తారు)

## ఏడవ రంగం

స్థలం : ఉదయ సాగర తీరం. సమయం : సంధ్య.

మా : నన్నావరించిన తిమిరపు తెరలు తొలగినవి. మబ్బు విడింది, నక్షత్ర కాంతిచే ఉజ్జ్వలమైన నీలాకాశం ద్విగుణీకృత సౌందర్యంతో గోచరిస్తోంది. తరంగ మృదు గంభీరఘోష పూర్వం కంటె వేయిరెట్లు మధురంగా వుంది. నా కర్తవ్యపథం జీవితం లోని చిన్న చిన్న కష్టసుఖాల రంగం నుండి బహుదూరం సాగిపోయింది.

(కల్యాణి వస్తుంది)

మా : కల్యాణీ!

క : రాజకుమారీ!

మా : ఇంకా నీకు రాజకుమారినే? మన మధ్య నూతన సంబంధ మేర్పడిందిగా! సోదరీ! కల్యాణీ! తిరిగి యేడుపా? ఛా!

క : ఏం చెయ్యను, సోదరీ? ఆగడం లేదు. అందుకే నీ దగ్గిరికి పరుగెత్తుకు వచ్చాను. కాస్త ధైర్యం చెబుతావని.

మా : కల్యాణీ, నా సుఖం నువ్వు తీసుకొని, నీ కష్టం నాకిచ్చేసెయ్యి.

క : మీకు సుఖమా?

మా : కాకేం? దుఃఖం నన్ను ఓడించాలని వచ్చింది. కాని అది నన్నెన్నటికీ జయించలేదు. క్రూర మృగాన్ని బంధించినట్లు బంధించి దానిచేత నేను పని చేయించు కుంటాను. విచారం నాకెంతో వుపకారం చేసింది, కల్యాణీ. నిర్విచారం పాలనలో వున్నంతసేపు నాకు విచారం స్వభావం తెలిసింది కాదు. ఇప్పుడు నావునికే విచారం రాజ్యంలో. అంచేత శత్రు స్వరూప అవగాహన అయింది. ఇప్పుడు అది నన్నేం బాధించ లేదు. ఇంతవరకూ అసంపూర్ణంగా వున్న నా జీవితానికి పరిపూర్ణత్వం సిద్ధించింది.

క : ధన్యవు, సోదరీ!

మా : నీవూ ధన్యవు కాగలవు, సోదరీ!

క : ఏ విధంగా?

మా : మన జీవితాలను మానవ కల్యాణాని కంకితం చేదాం. నీ "కల్యాణి" నామం సార్థకం కాగలదు—నాకు సహాయం చేస్తావా?

క : నిరభ్యంతరంగా, సోదరీ!

మా : ధన్యవాదాలు! ఇంక చూడు నీకు ధైర్యం దానంతటదే వస్తుంది. ఆ వ్రతమున్నవారికి దుఃఖమెక్కడిది?

క : కానీ. నాభగ్నప్రేమ నీపనిలో సార్థకం పొందనీ.

మా : మహోబత్‌ఖాపై అసహ్యమింకా పోలేదా?

క : సోదరీ! ఆవేళ వుద్రేకంలో యేమేమో అని "మీరు నా శత్రువులు" అని చెప్పి చక్కావచ్చాను. కాని నాకు వారిని ద్వేషించే శక్తి లేదని తెలుసుకున్నాను. ఎవరి నామస్మరణతో బాల్యావస్థగడచినదో, తరువాత యెవరిని నా జీవిత నావకు ధ్రువ తారగా విశ్వసించానో, యెవరి తలపు రావణకాష్ఠంవలె యీ నిరాశాంధ కారంలో సైతం నిరంతం దహించి వేస్తున్నదో, వారిని యేవగించుకోనడం అసాధ్యం.

మా : దాని అవశ్యకతయూ లేదు. నీ ప్రేమను సర్వ మానవులపై ప్రసరింప చేస్తే నీకు శాంతి లభిస్తుంది. విశ్వ ప్రేమ ప్రతిఫలాన్నపేక్షించదు; దానికి యోగ్యులు, అయోగ్యులు అనే భేదం లేదు. సౌఖ్యముక్తాఫలం సేవాశక్తిలోనే లభిస్తుంది.

(సత్యవతి వస్తుంది)

స : మానసీ! మీ నాన్నగారు పిలుస్తున్నారు.

మా: వారు తిరిగి వచ్చారా?

స : ఆఁ.

మా: సంధి కుదిరిందా?

స : అబ్బే, ఖుర్రం రాణాజీకి పంపిన సంధి పత్రం కేవలం ఆకాశ కుసుమం; మృగతృష్ణ!

మా: కారణం?

స : (కొంతసేపు వూరుకొని) మానసీ, సంధి యెప్పుడూ సరిసమానులకే పొసగుతుంది. చేయీ, చేయీ కలుస్తాయి కాని కాలు వెళ్ళి వీపును స్పృశించ గలదా? జయాప జయాలకు పొత్తు అనోహ్యాం. రాణాజీ దుర్గం విడచి ఫర్మానా యివ్వాలని ఖుర్రం అభిలాష. మానసీ, ప్రతాపసింహ మహారాణా పుత్రునికి యీ అవమానం కంటె మృత్యువు మేలు.

మా: ఇప్పుడు నాన్నగారేం చేయ దలచారు?

స : సామంతుల సమక్షంలో పుత్రుని రాజ్యాభిషిక్తుని చేశారు. రాణితో సహా వారు రాజ్యం విడిచి అరణ్యానికి వెళ్ళిపోతారు. మానసీ, మేవాడ్ పతనమై పోయింది!

మా: మేవాడ్ పతనం పూర్తయిం దనడం యెక్కువ సమం జసం. దాని పతన మేనాడో ప్రారంభమయింది!

స : ప్రారంభ మెప్పుడయిందంటావు?

మా: ఏనాడు ప్రజలు స్వతంత్రాలోచనను వీడి, ఆచారా లను గ్రుడ్డిగా అనుసరించడం మొదలుపెట్టారో ఆనాటి నుండీ. నీరు ప్రవహించినంత కాలం నిర్మలంగా వుంటుంది. ప్రవాహ మార్గానికి అడ్డు కట్టవేసిన నాడు నాచు కట్టడం ప్రారంభమవుతుంది. అలాగే యిప్పుడు జాతిలో స్వార్థం కరడు కట్టుకు పోయింది; భ్రాతృ ద్రోహం, విజాతి ద్వేషంవంటి క్షుద్ర గుణాలు తలెత్తాయి. ఒకప్పుడు వుదాత్తమై, మహోదాత్తమైన హిందూ మతం యిప్పుడు మూఢాచారాల ప్రోగై, నిర్వీర్యమై పోయింది. దేని ధర్మం నశించినదో అది పతనం కాదా? నేడు జాతి యెంత లోప భూయిష్టమై

పోయినదో చూడు. మేవాడ్ పతనం గురించి పూరికే మథనపడి ప్రయోజన మేమిటి ?

స : మనకుపశమనమార్గ మిదేనా ?

మా: కాదు. ఇంతకంటె మేలి మార్గమే వుంది. మేవాడ్ కంటె విలువైనది మన సోదరుల నైతిక బలసంపత్తి. వారు తిరిగి దానిని సంపాదించిననాడు, యీ దుఃఖ నిరాశాంధకారంలో 'ధర్మం' వారి జీవితలక్ష్యమైన నాడు మనకు మేవాడ్‌ను మించిన అధిక భాగ్యం లభించినట్లే. వారిలో ఆ మార్పురాని నాడు వారున్నా లేకపోయినా ఒకటే ; మనం విచారించక్కర్లేదు.

స : సోదరులు నశిస్తూంటే చూస్తూ పూరుకుందామంటావా?

మా: అహం. వారి ఘన ప్రాణాలను కాపాడ్డానికి ప్రయత్నిస్తాం. విఫల యత్నులమైతే—అది ఈశ్వరాజ్ఞ. జాతీయత స్వార్థం కంటె గొప్పది. మానవ ధర్మానికి విరుద్ధమైన జాతీయతను మానవ ధర్మ మహాసాగరంలో విలీనం చేయడం మేలు. ఏ దేశప్రజలలో మానవత్వం మృగ్యమయిందో ఆ దేశం స్వాతంత్ర్యం పోతేపోనీ ; ఆ ప్రజలు మళ్ళీ మనుషులు కాగలుగుతారు.

స : అది సంభవమా ?

మా: ఎందుకు కాదు ? అందుకై మనం పని జరుపుదాం. సత్ప్రయత్న మెన్నడూ నిష్ఫలం కాదు. మన జాతీయుల్ని తిరిగి మానవుల్ని చేదాం.

స : ఏలాగ ?

మా: ప్రజలలో నవచైతన్యం కలిగించి.

స : అంటే ?

మా: అర్థం లేని ఆచారాలకు దాసులు కాక, విచక్షణ కలిగి యెవరికివారు స్వతంత్రంగా ఆలోచించి, సరియైన నిశ్చయానికి వచ్చి వివేకంతో మెలగడం ; ధర్మమైన కర్తవ్యమని తాము విశ్వసించిన దానిని పరుల దూషణ భూషణ తిరస్కారాలను సరకుచేయక నిర్భయంగా ఆచరించడం—వీటిని ప్రజలకు నేర్పాలి. అప్పుడు పాచికట్టిన పాతనమ్మకాల నుండి నూతన అవిర్భవిస్తుంది.

స : నూతన ధర్మమంటే?

మా: దాని పేరు ప్రేమ! దాని వుపాసకులు 'అహం' రహితులై మొదట సోదరుల్ని, పిదప జాతిని, ఆ తరువాత మానవుల్ని అటుపిమ్మట మానవత్వాన్ని ప్రేమించడం నేర్చుకుంటారు. తదుపరి వారి వ్యక్తిత్వానికి ప్రాధాన్యమే వుండదు ; వ్యష్టి సమష్టిలో లీనమవుతుంది. అప్పుడు వారి బాధ్యతను స్వయంగా పరమేశ్వరుడు వహించి, వారిని సేవా సువర్ణ పథంలో నడిపి ధన్యుల్ని చేస్తాడు. సోదరీ జాతీయోన్నతి జన్మ స్థలం రక్త ప్రవాహాలు కాదు. నిర్మల ప్రేమ పూర్వకమైన పరస్పరాలింగనం. చైతన్య దేవుడు చూపిన మార్గంలో పోవాలి. మనలో నీచత్వం, కుటిలత్వం, స్వార్థం కరుడు కట్టుకు పోయి వున్నన్నాళ్ళు ప్రతాప సింహ మహారాణా స్మృతిని శిరస్సున పెట్టుకొని పూజించి కాని గత గౌరవాన్ని తలచుకొని జన్మంతా యేడ్చి కాని ప్రయోజనం లేదు.

(సత్యవతి ఆశ్చర్యంతో చూస్తూవుండగా తెర)

## ఎనిమిదవ రంగం

స్థలం : ఉదయసాగర తీరం. సమయం : సాయంకాలం.

(ఆకాశం మబ్బు క్రమ్మి వుంటుంది. రాణా అమర సింహుడు నిల్చొని వుంటాడు)

రా : ఆకాశం కోపంచే గర్జిస్తున్నది. పర్వతాలు లజ్జచే తలవంచుకొన్నాయి. సరోవరం క్షోభచే శిరస్సును దరకేసి కొట్టుకొంటున్నది. కులదేవతలు రోషంతో ముఖం త్రిప్పుకున్నారు. నాచేతి మీదుగా మేవాడ్—ప్రతాపసింహుని మేవాడ్—పడిపోయింది. అకటా! (పచారు చేస్తూ వుంటాడు. ఇంతలో మహాబత్ ఖా వస్తాడు)

రా : నమస్కారం, జనాబ్ !

మ : మేవాడ్ రాణాకీ జై!

రా : జనాబ్ సిపహ్‌సాలారీ సాహబ్ ! తమరు రుధిర నదులు ప్రవహింప జేయడంలోనే కాదు అవహేళన చేయడంలో కూడ ఘటికులు. "పడిపోయిన మేవాడ్ రాణాకీ జై !" అంటే తీరిపోయేదిగా !

మ : నే పరిహసించడం లేదు, మహారాజ్.

రా : సరి దానికేంలే ! నిన్నోసారి కలుసుకోవాలనుకుంటుండగా నువ్వే వచ్చావు.

మ : ఆజ్ఞాపించండి.

రా : ఏమి వినయం ! ఆ పని మరొకరెవరూ చెయ్యలేరు ; నీవల్లే కావాలి.

మ : ఆజ్ఞాపించండి, మహారాజ్.

రా : మహబత్‌ఖా, ఒక్కసారి నా కళ్ళల్లోనికి చూసి చెప్పు నీవు నా కేమవుతావోను !

మ : మీ సోదరుణ్ణి, మహారాజ్.

రా : ఔనా. నువ్వు చేసిన పని చూడు. మన పితామహ, ప్రపితామహుల భూమి మేవాడ్‌ను యవనుల పాదాక్రాంతను చేశావు. అంతటితో తృప్తి చెందక తత్సంతానం నెత్తురుతో చేతులకు జేగురు పూసుకున్నావు.

మ : మహారాజ్, నేను పాదుషా వుప్పు తిన్నాను.

రా : ఎప్పటినుండి? మహబత్‌ఖా, అసలా పని చేయవలసిన అవసర మేమొచ్చింది ? ఎందుకులే ! యిప్పుడా విషయంలో నీతో వాదించి ప్రయోజనం లేదు, విధర్మియై యవనుల తినే వానికా పని అనుచితం కాదు. నీ చేతిమీదుగా జరిగిన మేవాడ్ ధ్వంసం యింకా పూర్తి కాలేదు. మేవాడ్‌తోపాటు దాని రాణాను కూడా తుదిముట్టించడం ధర్మం. ఇదుగో ! కత్తి, తీసుకో ! (కత్తి అందిస్తాడు)

మ : రాణా___

రా : నే చెప్పిన దాని కడ్డు చెప్పవద్దు. త్వరగా నన్ను చంపు. ఇందువల్ల నీ కళంకం అధికం కాబోదు. నే చెప్పే పని నీకప్రియమైనదీ కాదు. నా రక్తపానం కోసం నువ్వు తపిస్తున్నట్లు నాకు తెలుసు. నన్ను కడతేర్చాలనే ఆగ్రహంతో నీ చేతులు వణుకుతున్నాయి. రా, నన్ను వధించు.

మ : మహారాజ్, మహబత్‌ఖా అంత నీచుడు కాదు. నేను ఖడ్గాగ్నులతో మేవాడ్‌ను రుద్రభూమిగా మార్చేశాను. కాని నేను అధర్మ యుద్ధం చేయలేదు ; ధర్మ యుద్ధం చేశాను.

రా : ఆహా ! ఏమి ! మహబత్‌ఖా దానిని ధర్మ యుద్ధమంటున్నావా ? పిచ్చుకపై బ్రహ్మాస్త్ర మేసినట్లు ఒక చిన్న రాజ్యం పైకి ఒక మహా సామ్రాజ్యపు బృహత్సేనను తీసుకువచ్చి ! దానిని ధర్మ యుద్ధమంటున్నావా? పోనీగాని యింక నీ కర్తవ్య పూరణ కాలస్యం చేయకు. ఈ ఖడ్గరాజాన్ని నా తండ్రి మరణసమయంలో నా చేతి కందించి "దానికి అవమానం మాత్రం రానియ్యవద్దు" అని చెప్పారు. కాని నేను దాని గౌరవం కాపాడ లేక పోయాను. దాని అవమాన కళంకితాన్ని నా శోణితంచేక్షాళనం చెయ్యాలి.

మ : మహారాజ్, మహబత్‌ఖా యోధుడు. అంతేకాని___

రా : సరే, అయితే. యుద్ధాకినిరా !

మ : మహారాజ్, నేను మేవాడ్‌కి విరుద్ధంగా ఖడ్గధారణ చేయడం విరమించాను.

రా : అదెప్పటి నుండి? ఖడ్గం తీసుకో - ఖడ్గం. ఇవాళ మేవాడ్ శ్మశానంలో మాతృదేవి మృతదేహాన్ని భుజం పై వేసుకుని నిన్ను ద్వంద యుద్ధాని కాహ్వానిస్తున్నాను.

మ : మహారాజ్, నామాట ___

రా : అహఁ. ఇప్పుడింకేం వినిపించుకోను. పిరికి మ్లేచ్ఛ ! కులకళంకీ ! యుద్ధానికిరా ! ఇదుగో చూడు నీ ప్రతాపం - ఏ ప్రతాపం కారణంగా అఖిల భారత దేశము కంపించి పోతోందో - దానిని పూరికే విడిచి పెట్టేది లేదు. అధమాధమా ! శనిగ్రహమా !

మ : అయితే యేం చేయను, మహారాజ్ ! యుద్ధం చేదాం. (ఖడ్గధారియై) భద్రం, భారత దేశంలో మహబత్‌ఖాకి ప్రతిద్వంది యెవరైనా వుంటే ఒక్క రాణాజీయే, కాని భద్రం ! (ఇద్దరూ తలపడతారు)

# మేవాడ్ పతనం

రా: ఈ విధంగా అన్నదమ్ముల మధ్య పోరాటం ప్రపంచంలో యెప్పుడూ జరిగివుండదు. ఇంక ప్రళయం తప్పదు!

(ఇంతలో మానసి వచ్చి యిద్దరికీ అడ్డంగా నిల్చుంటుంది.)

మా: ఇదేమిటి, నాన్నగారూ! ఇదేమిటి - (మహొబత్ ఖాతో) శాంతించండి.

రా: అడ్డులేవమ్మా. ఇందులో నువు జోక్యం చేసుకోవద్దు.

మా: నాన్నగారు, శాంతించండి. సర్వనాశనమయిన దేదో అయింది. ఇప్పుడు దానికి మీ సోదరుని రక్తంచే అభిషేకం కూడా చేయకండి. ఈ దుఃఖ సాగరానికి దరి హత్యకాదు; మళ్ళీ మనుష్యులు కావడం.

రా: మనుష్యులు కావడమా? అదెలాగ మానసీ!

మా: శత్రువులు, మిత్రులు అనే భేదభావాన్ని, విస్మరించి, విద్వేషాన్ని విడచి, మనోమాలిన్య, దేశ మాలిన్యాల్ని విశ్వప్రేమ జలాలతో క్షాళనం చేసి ద్వేషాన్ని విడచి మళ్ళీ మనుష్యులుకండి. విరోధి మలినాల్ని విశ్వప్రేమ జలాలతో క్షాళితం చేసి మళ్ళీ మనుష్యులు కండి.

రా: మహొబత్!

మ: మహారాజ్!

రా: నీ తప్పేంలేదు. నాదేతప్పు. సోదరా! నన్ను క్షమించు.

మ: అగ్రజా, మీరు నన్ను క్షమించండి.

(ఇద్దరు కౌగలించు కొంటూండగా తెర)

సంపూర్ణం.

---

# ప్రపంచ ఆరోగ్య దినం

## (రాజకుమారి అమృతకౌరుగారి ప్రసంగం నుండి)

——:o:——

"మిత్రరాజ్య సమితి అనుబంధ సంస్థలన్నిటిలోకి ప్రపంచ ఆరోగ్య సంస్థ, తన స్వచ్ఛంద సహకార కృషి ద్వారా అంతర్జాతీయ సుహృద్భావాన్ని పెంపొందించడానికి అమోఘంగా తోడ్పడింది."

"ప్రెసిడెంట్ రాజేంద్రప్రసాద్ తన సందేశంలో చెప్పారు. 'ప్రపంచ ఆరోగ్య సంస్థ ఆధ్వర్యాన ప్రపంచ ఆరోగ్య దినం 1954 ఏప్రిల్ 7వ తేదీన జరుప బడుతోంది. నర్సింగ్ వంటి అత్యవసరమైన ప్రజారోగ్య రక్షణ సంస్థను పటిష్ఠంగా పెంపొందించ వలసిన ఆవశ్యకతను గురించి మన ప్రజలకు నచ్చ చెప్పడానికి ఈ కార్యక్రమాలు తోడ్పడగలవని ఆశిస్తున్నాను. మన దేశంలో సుశిక్షితులైన నర్సుల సంఖ్య చాలా తక్కువగా వుంది. ఇతోధిక శిక్షణ సౌకర్యాలను కల్పించడం ద్వారా మాత్రమే కాకుండా, యీ ఉత్తమ వృత్తి ప్రాధాన్యాన్ని, మానవాళికి యిందువల్ల కలుగుతున్న శ్రేయస్సును గురించి వివరించడం ద్వారా మన దేశంలో సుశిక్షితులైన నర్సుల సంఖ్య పెరిగేటట్టు మనం సర్వవిధాలా ప్రయత్నం చేయవలసి వున్నది.'

'ఏ జాతి ఆరోగ్యమైనా, మందులు మాకులపైన కాక ఆరోగ్యకరమైన జీవన పరిస్థితులుపై హెచ్చుగా ఆధారపడి ఉంటుంది. అందుచేతనే ప్రజారోగ్య రక్షణకు మనం చేసే ఏర్పాటులన్నీ, జబ్బు వచ్చిన తరువాత చికిత్స చేసే దృష్టిలో కాకుండా, అసలు జబ్బు రాకుండానే ముందు జాగ్రత్తకు తగిన కట్టుదిట్టాలు చేయడం అవసరమనే భావంతో జరుపబడవలసి వుంది. ఏ దృష్టితో చూసినప్పటికి నర్సింగ్ వృత్తిని ప్రత్యేక ప్రాధాన్యం కలదు. ఇండియాలో నర్సింగ్ వృత్తికి ముఖ్యంగా ప్రోత్సహించి, దాని అభివృద్ధికి సర్వవిధాలా సహాయం చేయవలసి వుంది. ఇందువల్ల మనస్సుకు, శరీరానికి కూడా బాధోపశమనం కలుగుతుంది. మన దేశంలో నర్సింగ్ వృత్తి సముచిత గౌరవస్థానాన్ని పొంది, రోగపీడితులకు బాధోపశమనం కలిగించగల సమర్థులను ఆకర్షించగలదనే ఆశిస్తున్నా'నని ప్రధాని నెహ్రూ తమ సందేశంలో చెప్పారు.

"ప్రపంచ ఆరోగ్య సంస్థతో సభ్యత్వం గల దేశాలన్నీ ఈ ప్రపంచ ఆరోగ్య దినోత్సవాలను ఉత్సాహంతో జరుపగలవని ఆశిస్తున్నాను. ఏ జాతి సంపదలకైనా సౌభాగ్యానికైనా ఆరోగ్యమే ప్రాతిపదిక అయినప్పుడు అనారోగ్యం పెరిగిపోతూండడాన్ని ఏ దేశం చూస్తూ ఊరుకుండగలదు?

"ప్రపంచ ఆరోగ్య సంస్థ తొలిసభ్యులలో భారత దేశం ఒకటి. మన దేశంలో వ్యాధి నివారణకు జరుగుతున్న కృషికి ఈ సంస్థ మనకు ఎంతో సహాయం చేసింది. ఇందుకు మనం ఎంతో ఋణపడి వున్నాం. అంతే కాదు. కేవల సాంకేతిక సహాయం, మందులు, పరికరాలు, విద్యార్థి వేతనాలు యివ్వడమే కాకుండా, ప్రపంచంలో అన్ని దేశాల నిపుణులను కలుసుకొని, వారి వారి అనుభవాలను గురించి తెలుసుకొని రోగ నివారణకు సమిష్టి కృషిని సాగించడానికి ఈ సంస్థ ద్వారా అపూర్వమైన అవకాశాలు కూడా మనకు లభించాయి. మిత్ర రాజ్య సమితి అనుబంధ సంస్థలన్నింటిలోకి ప్రపంచ ఆరోగ్య సంస్థ తన స్వచ్ఛంద సహకార కృషి ద్వారా అంతర్జాతీయ సుహృద్భావాన్ని పెంపొందించడానికి అమోఘంగా తోడ్పడింది."



దేశసౌభాగ్యానికి దారిచూపిన

# మహిళల ఉద్యమం

శ్రీమతి కె. రామలక్ష్మి

పాశ్చాత్య దేశాలలోలా ఆర్థిక, రాజకీయ, సాంఘిక సమానత్వం కోసం కాక, మనదేశంలో మహిళల ఉద్యమం ఒక విశిష్ట లక్ష్యంతో ప్రారంభమైంది. మన దేశంలో ఇది తిరుగుబాటు కాదు- ఒక శక్తివంతమైన ఉద్యమమే. ఈ ఉద్యమ ప్రధాన లక్ష్యం- సాంప్రదాయ సిద్ధమైన ఆచారాలనీ, అలవాట్లనీ, యీ వర్తమానపు అవసరాలకి అనుగుణంగా రూపొందించడం.

ఈ యిరవయో శతాబ్దపు తొలి రోజులలో యింగ్లీషు పద్ధతి స్కూళ్ళలోనూ, యూనివర్శిటీలలోనూ చదువుకునే మొగవారి సంఖ్య హెచ్చు కాసాగింది. అంచేతనే, చదువుకొన్నవారి పద్ధతులకీ, యింటివద్ద వారి భార్యల సాంప్రదాయ సిద్ధమైన అలవాట్లకీ మధ్య వైరుధ్యం ఏర్పడింది. అనేక శతాబ్దాల పెంపును పొందిన సాంప్రదాయాలూ, ఆచారాలూ, సడలి పోయే సందర్భాలు యీ శతాబ్దారంభంలో రాక తప్పలేదు.

అజ్ఞానాంధకారాన్ని పారదోలడానికి, సనాతనుల కట్టుబాట్లను సడలించడానికి, అవిరామ కృషి చేసిన మహిళల ఆందోళన.

## సరోజిని ఆధ్వర్యం

తమ వ్యక్తిత్వపు అసాధారణత వల్ల నైతేనే, చైతన్య వంతులైన తమభర్తల వల్లకాని, తండ్రుల వల్ల నైతేనేం యీ పాశ్చాత్య విద్యాసౌరభాన్ని అలవరచుకొన్న కొందరు స్త్రీలు, యీ విద్యని ఎక్కువ మంది స్త్రీలకి వ్యాపింప చెయ్యాలనీ అప్పుడే వారూ యీ క్రొత్త చైతన్యంలో రూపు దిద్దుకొంటున్న సంఘంలో తెలివిగా మసల గలరని తలపోసేరు. ఈ పథంలో వారికి మార్గదర్శి అయినది- సుప్రసిద్ధ రాజకీయవేత్త, కవయిత్రి- శ్రీమతి సరోజినీ నాయుడు. ఈ చైతన్య వంతుల మూలంగానే కాల కమాన మన దేశ మహిళాఉద్యమాలకి ప్రాణం వచ్చింది. ఊత దొరికింది.

1918 ఓటు హక్కు విషయాలు చర్చకు వచ్చేసరికి చాలా మంది స్త్రీలు వినూత్న చైతన్యం కలిగి విద్యావంతులై వుండడం వల్ల పురుషులతో పాటు ఓటు హక్కులు తమకూ కావాలని అడగ గలిగారు. ఓటుహక్కు ప్రతీ పౌరునికీ యివ్వవలెనో, వద్దో, ఆలోచనలు జరిపే టందుకు, ఇంగ్లండు నుండి వచ్చిన 'మాంటిగు-ఛెంమ్స్ ఫోడ్ కమిటీ' యీ మహిళల ఆందోళాన్ని ఎదుర్కొక తప్పలేదు. కమిటీ సభ్యులు మహిళా ప్రతినిధులను కలుసుకొని మాట్లాడుటకు కూడ నిరాకరించారు.

## హక్కుల సంపాదన

ఇరవయో శతాబ్దారంభంలో ఇంగ్లాండులో నడిచిన మహిళల ఉద్యమాన్ని జాగ్రత్తగా పరిశీలించిన హిందూ స్త్రీలు- వారికి తమ సానుభూతి తెలిపారు. అయితే మన వుద్యమ నాయకులకు, పాశ్చాత్యుల విప్లవాత్మక దృష్టి నచ్చలేదు. అందుకే, మన దేశంలో స్త్రీల హక్కుల పోరాటం సాధారణ ఉద్యమంగానేసాగిందిట. ర్పుతో చివరకు తమ కోర్కెలను నెరవేర్చు కున్నారు. పురుషులకి హక్కులు వచ్చిన కొద్ది మాసాలలోనే, మన దేశపు స్త్రీలకీ ఓటు హక్కు వచ్చింది. కాని, ఓటుచేయు అర్హతలు కలిగిన మహిళల సంఖ్య చాలా తక్కువ. ఆ హక్కుల ఆచరణ విషయంలో నున్న నిబంధనలు అటువంటివి. అందుకే "స్త్రీ విద్య"అనే నినాదం బయలు దేరింది. స్త్రీలకి విద్య వుంటేనేగాని దేశంలో రాణించదని గ్రహించిన ఉద్యమ కర్తలు దేశం మొత్తం మీద స్త్రీ విద్యావ్యాప్తి కోసం పాటుపడే ప్రయత్నాలు సాగించారు,

## తొలి సమ్మేళనం

తరువాత పది సంవత్సరాల లోనూ ఉద్యమ కర్తల అలసట లేని పోరాటం వల్ల, స్త్రీ జనంలో చైతన్యం

హెచ్చింది. ఇది గ్రహించిన ప్రముఖులు దేశంలో మొట్ట మొదటి మహిళా సమ్మేళనాన్ని ఏర్పాటు చేశారు. ముఖ్యంగా స్త్రీ విద్యా విషయాలు చర్చించడానికి యీ సమ్మేళనం జరిగింది. దీని నుండే- యావద్భారత మహిళల సమ్మేళనం (All India Women's Conference) రూపొందింది. స్త్రీ విద్య విషయమే కాక, సాంఘిక సమస్యలైన పరదా, బాల్యవివాహాలు మొదలైన వాటిని కూడా ఎదుర్కొనే ప్రయత్నం సాగించింది. ఈ సంప్రదాయ సిద్ధమైన సాంఘిక కట్టు బాట్లను కాదని, మన మహిళలు, తాము సరిదిద్ద వలసిన విషయములలో సాంఘిక సంస్కరణను కూడా చేర్చారు.

## రాజకీయచైతన్యం

రాజకీయ రంగంలో వచ్చే మార్పులతో పాటు, స్త్రీల దృష్టి కూడా వాటిపై ప్రసరించింది. హిందూదేశంలోని లేబరు కష్టసుఖాలను పరిశీలించడానికి 1928 లో లేబరు కమిషన్ వచ్చింది. ఈ కమిషన్, వ్యక్తిత్వం గాంచిన మహిళల సంస్థని సహకరించి ఆలోచన చెప్పమని కోరింది. మహిళలు తమ ఐక్య కంఠంతో తొలిసారిగా సాధింప కల్గినది- లేబరు కమిషను చేసిన సిఫార్సులను (ముఖ్యంగా పరిశ్రమలలో స్త్రీలను గురించి చేసిన వాటిని) ప్రభుత్వం అమలులో పెట్టేలా చేయడం.

బాల్య వివాహాలను నిషేధించే శారదా బిల్లు, మొదటి సారి సనాతనుల ఆందోళన వల్లా, బ్రిటిషు ప్రభుత్వం వల్లా పరాజయం పొందింది. కాని మహిళలు, తమకు సహకారులుగా అభ్యుదయ దృక్పథం కల పురుషులను కూడ గట్టుకొని, తిరిగి ఆందోళన ప్రారంభించి, చివరకు శారదా బిల్లును మళ్ళా చర్చకు తీసుకొని వచ్చి దానిని గెల్పింప కలిగారు.

## మహాత్ముని పిలుపు

హిందూదేశపు స్వాతంత్ర్య పోరాటంలో అతి ఆందోళనా జనితమైన యీ సమయంలోనే ఉదయ తారలా అందరి దృష్టినీ ఆకర్షించి, తన ఆధ్వర్యం క్రింద ప్రజలని చైతన్య పూరితులను చేశాడు మహాత్ముడు. స్త్రీలకి ప్రత్యేక సందేశం యిచ్చాడు. అమూల్యమైన స్వాతంత్ర్యం కోసం స్త్రీ పురుషులు సమంగా శక్తినీ, జీవాలనీ ధార పోసినప్పుడే, దానిని సాధింపగలమనీ, తన సత్యాగ్రహోద్యమంలో పాల్గొని దేశ సౌభాగ్యానికి దారి చూపమని మహాత్ముడు దేశ స్త్రీలని కోరాడు. అత్యాచార పరులైన స్త్రీలు కూడా గాంధీ ఆదేశాన్ని కాదనలేకపోయారు. దేశం మొత్తం మీద స్త్రీలు- జండాలతో ఊరేగింపులు జరిపారు, నినాదాలు చేశారు, పోలీసుల లాఠీలకు గురిఅయి జైలు వాసం కూడా చవిచూశారు. ఉప్పు పన్ను విషయంలో గాంధీజీ వ్యతిరేకతను తెలియ చేసినప్పుడు, యీ సత్యాగ్రహంలో పాల్గొని ప్రభుత్వాన్ని ఎదురించిన స్త్రీలు అనేకులున్నారు. ప్రజాక్షేమ విషయంలో తమ స్థానం ప్రముఖమైనదని తెలుసుకొన్న యీ స్త్రీలలోని చైతన్యం శాశ్వతమైనది. ఈ మార్పు శాశ్వతమైనదని అనుకోడానికి కారణం అది ఒక మానసిక పరిణామ మవడమే.

## కార్య కలాపాలు

ఇంతగా రాజకీయ చైతన్యం వచ్చినా కూడా మహిళా సంస్థల ముఖ్య సమస్యలు— గర్భిణుల ఆరోగ్య విషయాలు. పిల్లల ఆరోగ్యం, విద్యావ్యాప్తి, వయోజన విద్య, సాంఘిక సంస్కరణల కోసం అలజడి, ఆ సంస్కరణలకి చట్టబద్ధమైన ఆచరణ యోగ్యత కలిగించడం, సర్వజనులకీ తెలిసినదే— మన బీద జనాభా- దారిద్యమూ, అసంతృప్తీ, అనారోగ్యమూ దేశం మొత్తం మీద ఎల్లెడలా తాండవిస్తూంది. వీటికిపైన, పురిటి చావులూ, పిల్లల చావులు అత్యధికం. అందుకే వాటి నిర్మూలన విషయంలో తగు శ్రద్ధ తీసుకోక తప్పదు.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం, దేశ విభజన తరువాత దేశంలో అనేక విధాలైన మార్పులు వచ్చాయి. తత్ఫలితంగా మహిళల సంస్థలకి భారం హెచ్చింది. చరిత్ర కనీ వినీ ఎరగనటువంటి జనాభా మార్పు, దేశ విభజన తరువాత జరిగింది. పాకిస్థాన్ నుంచి ధారావాహినిగా వచ్చి పడిన శిబిరమున్న కాందిసీకులకు, మన దేశ స్త్రీలు పునరావాస సదుపాయాలు సమకూర్చకలిగారు. నివాసస్థలాలనీ, చిన్న చిన్న పరిశ్రమలనీ ఏర్పరచి, ఆహార సమస్యనీ ఎదుర్కొందుకై, బీదులని సాగులోకి తేడానికి పాటు పడ్డారు. ఈ దారుణ సమయంలో, తల్లి తండ్రులను, సర్వాన్నీ కోల్పోయిన పిల్లలకు శిశు పోషణాలయాలను, వసతి గృహాలను నిర్మించారు. కరువు బాధితులకి నిధులు సేకరించి, రక్షణ సమకూర్చి, వైద్య సహాయములను సమకూర్చి యెనలేని సేవ చేశారు.

## అంతర్జాతీయ మహిళా సమ్మేళనం

1952 లో అంతర్జాతీయ మహిళా సమ్మేళనం జరిగింది. 'కుటుంబ సమ్యమన సమాజం' (Planned Parent hood)వారి మూడవ సమ్మేళనం యిది. హిందూ దేశంలో జరగడానికి మొదటిది. వీనికి 14 దేశాలనుంచి 470 మంది ప్రతినిధులు వచ్చారు. ఈ సమ్మేళన ఫలితంగా, దేశంలో, ముఖ్యంగా స్త్రీ జనాభిలో ఒక క్రొత్త చైతన్యం బయలుదేరింది. కుటుంబాలు నియమితం చేసుకొంటేనేగాని ఆయురారోగ్యాలు బాగుపడవనే నమ్మకం చాలా మందికి కల్గింది. దేశంలో ఆహార పరిస్థితికీ, జనాభాకీ మధ్య సమన్వయం లేదని అందరూ గుర్తించారు కరువు పీడితం, అనారోగ్య పూరితం అయిన దేశంలో సంవత్సరానికి ఐదు మిలియన్ల జనాభా హెచ్చుతూవుంటే, ప్రభుత్వం వేసే అధికాహారోత్పత్తి ప్రణాళికలూ, ఆరోగ్య సూత్రాలూ అన్నీ వృథాయే. కారణం: పది సంవత్సరాలలో 50 మిలియన్ల జనాభా పెరిగితే మాత్రం, పది సంవత్సరాలలోనే ప్రభుత్వ ప్రణాళికలు పూర్తి ఫలితాలని యిస్తాయా? యివ్వలేవు. అందుకే ఆహార పరిస్థితి బాగుపడే అవకాశాలే రావు. ప్రజలలో దైన్యావస్థ మెండయింది. అందుకే ప్రారంభించిన మూడు సంవత్సరాలలోనూ, యీ కుటుంబ సమ్యమన సమాజం కొన్ని వేల మందికి సలహాలను యిచ్చింది.

తమలో రేకెత్తిన రాజకీయ చైతన్యాన్ని స్త్రీలు కిందటి ఎన్నికలలో చూపారు. అసంఖ్యాకులుగా వెళ్ళి తమ ఓటు హక్కును వినియోగించుకొన్నారు. ఇదే సమయంలో సనాతనుల పెదవాదాలపై దాడి జరుపుతూనే వున్నారు. వివాహాన్ని విడాకులనీ అరికట్టే హిందూ ధర్మ సూత్రాలని కాలాను గుణ్యంగా సవరించి విడాకుల చట్టం కోసం ఆస్థి హక్కుల కోసం పోరాటం సాగించారు. వేల కొలది యువతులు ఉద్యోగాలు స్వీకరించారు, ప్రభుత్వపు అన్ని శాఖలలోనూ స్త్రీలున్నారు. పారిశ్రామిక రంగాలలో కూడా స్త్రీలు ఉద్యోగాలు చేస్తున్నారు. పార్లమెంటులో మంత్రి వర్గంలో, అన్ని శాఖల్లోనూ నారీమణులున్నారు. ఈనాడు స్త్రీలు అనుభవిస్తున్న గౌరవ ప్రతిపత్తులు, మహిళల ఉద్యమం పాతిక సంవత్సరాలుగా పోరి సంపాదించినదే అంటే అతిశయోక్తి కాదు.





పోష్టు బంట్రోతు గ్రామంలో ప్రతి యింటికీ వెళ్ళి వుత్తరాలు యిస్తూన్నప్పుడు, ఈ కొత్త పద్ధతిని పిల్లలు వుత్సాహంగా చూస్తున్న దృశ్యం.

# గ్రామాలలో పోస్టాఫీసుల విస్తరీకరణ

ఈ నాడు భారతదేశపు గ్రామాలలో సుమారు 40000 పోస్టాఫీసులు ఉన్నాయి. ఆగస్టు 1947 నాటికి 18, 121 మాత్రమే ఉన్న పోస్టాఫీసుల సంఖ్య యీనాటికి 40000గా పెరిగింది. అయితే, అప్పటికి 4000 గా నున్న పట్టణ పోస్టాఫీసుల సంఖ్య ఇప్పటికి 6000 మాత్రమే అయినది.

2000 జనాభా గల ప్రతి గ్రామంలోనూ ప్రత్యేకమైన పోస్టాఫీసు ఏర్పడ్డవి. 1956 నాటికి ఇంకా సుమారు 10000 పోస్టాఫీసులు, ప్రారంభింప బడతాయి. వెనుకబడ్డ ప్రాంతాంలలో 400 వరకూ నిర్మాణమౌతాయి. ప్రతి 9 చదరపు మైళ్ళకూ ఒక పోస్టాఫీసు ఏర్పడుతుంది. ఈ ప్రణాళిక వల్ల, ప్రభుత్వానికి ప్రారంభంలో కొంతవ్యయం కలుగుతుంది. అయితే, మరి ప్రజా రాజ్యంలో ప్రతి ఒక్కరికీ యీ సౌకర్యాలు లభించాలంటే, ప్రభుత్వం ఈ రకంగా కొంత ధనం వెచ్చించాలి.



ఢిల్లీ రాష్ట్రములోని గ్రామాలలో కొత్తగా తెరిచిన పోస్టాఫీలవద్ద క్యూలో నిల్చున్న గ్రామస్థులు కొందరు.

# జయ - లక్ష్మి

శ్రీ కన్నెకంటి చినలింగాచార్యులు.

———:o:———

గీ॥ ఖండ ఖండాంతరమ్ముల నిండుకున్న
విప్లవాగ్నుల జల్లార్ప విబుధులెల్ల
శాంతి జలపాత్రధారులై పొంత నడువ.
వెడలె జయలక్ష్మి తా జగద్వీధియందు.

శా॥ త్రాసంబున్ విడిమర్త్యులెల్ల మనసోత్సాహంబు లుప్పొంగమా
యాసల్ పూర్ణముగా ఫలించునని డాయన్ సుస్థిరంబై యహిం
సా సిద్ధాంత నిశాతఖడ్గము కరంబందొప్ప బంగారపుం
సే సల్ జల్లుచు వచ్చుచుండె జయలక్ష్మీదేవిమోదంబుతో.

సీ॥ జయలక్ష్మిరాక దుర్జయ సపత్నానేకముల గుండెగాలమై వెలయు గాక
జయలక్ష్మిరాక రుజామేఘములకు జంఝానిలంబుల ధాకయౌనుగాక
జయలక్ష్మిరాక, దుష్టశరప్రయోగమున కుప సంహార మంత్రమగునుగాక
జయలక్ష్మిరాక, విశ్వజనాళి కనవరతానంద దాయకమగునుగాక.

మహిత జయలక్ష్మిరాక, దుర్మనుజమత్స
రాంబుధూళికి గతకమై యలరుగాక
లలిత గతిమించు మా జయలక్ష్మిరాక.
నిఖిల భరతోర్విని జయంబునించుగాక.

ప్రఖ్యాత విదుషీమణులు—

# రంగాజమ్మ

—శ్రీమతి కాంచనపల్లి కనకాంబ

మొల్ల, తరిగొండ వెంగమ్మ, గంగాదేవి, ముద్దు పళని, మధురవాణి, రామభద్రాంబ, కృష్ణాజీ రంగాజమ్మ యను వారెందఱో ప్రసిద్ధ కవయిత్రులు ప్రఖ్యాతిగాంచి యున్నారు. కాని తంజావూరు విజయరాఘవరాజుగారి యభిమానమునకు పాత్రురాలై యారాజాస్థాన కవయిత్రి యగు రంగాజమ్మ పొందిన గౌరవముల నేకవయిత్రియు పొందలేదు. మొల్ల, వెంగమ్మల కవిత్వమువలె రంగాజమ్మ కవిత్వము ప్రౌఢమైనది.

ఆమె 1633-73 వఱకు జీవించి యున్నట్లు చరిత్రల వలన తెలియుచున్నది. ముఖ్యమైన గ్రంథము లీమెచే రచింపఁ బడినవి మూడు: 1. మన్నారు దాస విలాసము. 2. ఉషాపరిణయము.

ఈ రంగాజమ్మతోఁబాటు చెంగల్వల కాళకవి యను నాతడు విజయరాఘవుని యాస్థానము నందుండెను— విజయనగర రాజ్యమునకు శ్రీకృష్ణదేవరాయలెట్టులో రఘునాధరాయలు తంజావూరు రాజ్యమున కటువంటివాడు. ఆతని కుమారుడు రాఘవరాయలును కవి పండితుల నాదరించు సందర్భమునఁ దండ్రికి దీసిపోడు. వారి కాలమున తంజావూరు లక్ష్మీ సరస్వతుల కాటపట్టయి యుండెను. స్వయముగ కవులగుటచే నీ యిరువురు రాజులును కవి పండిత సమూహమున కాకరమై యుండిరి. వీరి యాస్థానములందు సర్వమతజాతి గౌరవమును జూపుటచే కవయిత్రీమణులాస్థాన కవయిత్రులై పెక్కు గ్రంథముల రచించిరి. రఘునాధరాయల యాస్థానమున మధురవాణి, రామభద్రాంబ యను కవయిత్రులు సంస్కృత కావ్యములను రచించి రాజుగారి కంకితమిచ్చిరి. వీరు తిరుమల తాతాచార్యుల వారి శిష్యులగుటచే విశిష్టాద్వైతులు. తాళ్లపాక వారి పదములు ఈ సమయముననే వ్రాయబడిన వని యందురు. తాళ్లపాకవారి శిష్యురాలే మన కవయిత్రి రంగాజమ్మ.

కం॥ చిన్నన్న ద్విపదకెఱుగును
పన్నుగ పెదతిరుమలయ్య పదముల కెఱుగున్
మిన్నంది మెఱసె నరసిం
గన్న కవిత్వంబు పద్యగద్యశ్రేణికిన్॥

అని ప్రసిద్ధిఁగన్న చిన్నన్న, తిరుమలయ్య, నరసింగన్న యీ కాలమునాటి వారే. చిన్నన్న ద్విపద కావ్యములను, తిరుమలయ్య పదములు అనగా గేయములను, నరసింగన్న కావ్యములను తిరుమల దేవస్థానమువారు ప్రకటించిరి. విజయరాఘవరాయలకు తండ్రివలే ప్రబంధములపై గాక దేశీయ రచనలపైనను ద్విపద కావ్యముల మీదను, నభిమానము మెండు. ఈయన రాజభాషా గౌరవము నాంధ్రమునకిచ్చెను. రంగాజమ్మ కాక చంద్రలేఖ యను మరియొక విద్యావతి యారాజు యొక్క యాస్థానము నందుండెనందురు. ఆస్థానకవియగు చెంగల్వల కాళకవి యామెనిట్లు వర్ణించెను.

"సముఖమున నిల్పి యాముద్దు చంద్రలేఖ
వివిధ విద్యలవినిపించె వింతయనగ"

వివిధ విద్యలనుటలో నాట్యాది విద్యలు కావచ్చును. ఈమెచే రచింపబడిన గ్రంథ మెచ్చటను గానరాదు. కృష్ణమాంబయను మరియొక యాస్థాన కవయిత్రి కలదు. ఈమె రావినూతుల తిరుమలయ్య కూతురనియు, ఆంధ్ర గీర్వాణము లందు చక్కని కవిత్వము చెప్పుననియు బ్రసిద్ధి. ఈమెను కృష్ణాజీ యని పిలచెడివారట. గౌరవార్థము పేరు చివర 'జీ' చేర్చుట కలదుకదా! అమ్మాజీ, తాతాజీ వలె. ఈమె వ్రాసిన గ్రంథము లేవియు గాన వచ్చుటలేదు.

ప్రకృతమనుసరింతము. రంగాజమ్మ విజయరాఘవ రాయల యాస్థాన కవయిత్రి మాత్రమేగాక, యారాజుగారి యాదరాభి మానములను చూరగొన్నది. తా రచించిన ఉషాపరిణయమున గ్రంథారంభమున విజయరాఘవ రాజు తనకు పతియు, గతియు, కులదైవతము నని వ్రాసికొన్నది. రాజ గురువగు తాతాచార్లుగారు తన్ను గూర్చి చెప్పిన పద్యమిట్లు పేర్కొన్నది.

కం॥ చతురాస్యుండనఁదగు నీ
పతి యిటునినుగారవించి బహుమతి దోపన్
కృతి రచియింపు మనెన్ భా
రతికిన్ బ్రతివత్తువమ్మ రంగాజమ్మా!

విజయరాఘవుడు తనకుఁ బతియని చెప్పుటచే నాతని కామె పత్నియై యుండవచ్చునని యూహింప వచ్చును.

లేక పతియనగా ప్రభువని యర్థము చేసికొన్నయెడల నీమె వేశ్యయేమో ! యని యను కొనవచ్చును. రాజు స్త్రీలోలుడు, వేశ్యాప్రియుడని ప్రసిద్ధి యగుటచే మధుర వాణివలె నీమెయు వేశ్యయని చెప్పవలయునా? రంగాజమ్మ ఉషాపరిణయ గ్రంథాంతమున గద్యనిట్లు రచించినది.

"సారస్వతీధురీణయు, విచిత్రతర పత్రికాశతలిఖిత, వాచికార్థావగాహన ప్రవీణయు, (దీనినే వ్యస్తాక్షరి యందురు కాబోలు) శృంగార రసతరంగిత, పదకవిత్వ మహనీయ మతిస్ఫూర్తియు, అతులితాష్ట భాషా సర్వంకష మనీషా విశేష విశారదయు, రాజనీతి విద్యావిశారదయు, విజయ రాఘవమహీపాల విరచిత కనకాభిషేకయు, విద్వత్కవి జనస్తవనీయ వివేకయు, ................ మహనీయ మహాభారత రామాయణ భాగవత్ కథాసంగ్రహణ విచక్షణయు, పసుపులేటి వేంకటాద్రి బహుజన్మ తపః ఫలంబును, మంగమాంబా గర్భశుక్తి ముక్తాఫలంబును," అని యీ పైగద్యమునందు తన తల్లి దండ్రుల నామధేయముల బేర్కొన్నది గదా ! భర్తయని రాజును బేర్కొన వచ్చును గాని యట్లు చేయలేదు. శ్రీనాథాదులకు గలిగిన కనకాభిషేక సభా గౌరవ మీమెకు గలిగినట్లు తెలియుచున్నది. విద్వాంసురాలు, కవయిత్రి, అభిమాన పాత్రురాలు కాబట్టి రాజుగారామెను సభలో గౌరవించిరి. భార్యకు సభలో నట్టి గౌరవము భర్త సల్పుట మృగ్యము. తల్లి దండ్రులను బట్టి జాతిని నిర్ణయించుట వలను పడదు. మొల్ల యేజాతికి చెందినదను సందర్భముననే జెప్పినది.

ఉ॥ ఏరులు సూచుచెయ్యెడల నెన్నడు పుట్టిననేమి వారిలో
సారమెఱుంగనేరని యసారులచర్చలతోడ నేమి సం
సారముదాటుదారులఁ బ్రచారముచేయు కవీశ్వరుల్ గదా
ధీరులు వారుచేయు నుపదేశ మెఱింగి చరించు టొప్పగున్॥

ఈ ప్రఖ్యాత కవయిత్రి రచించిన గ్రంథములు మూడు మాత్రమే తంజావూరు పుస్తక భాండాగారమున నున్నవి. 'మన్నారు దాస విలాసము' ఉన్నవానిలో మొదటి కావ్యము. తన ప్రభువగు విజయరాఘవ రాయలే యిందు వర్ణింపఁ బడినాడు. రాజస్థాన విశేషములు గలవు. రెండవది 'ఉషాపరిణయము' ఇది మంచిప్రౌఢ కావ్యము. ఆంధ్రమున గల గొప్ప ప్రబంధములతో దుల తూగుచున్నది. ముద్దు పళని శృంగార వర్ణన కన్న నీమె యుషా పరిణయము నందలి శృంగార వర్ణన సహృదయుల గాహ్లాదకారియై, సభ్యమై యున్నది. మన్నారు దాసవిలాస రచనకుఁబూర్వ మీ కవయిత్రి కవితారచనకు, విలాసములకు ముగ్ధుడై రాజు ఆమె యింట మసలుచుండెనట. పట్టపుదేవి యీమెను (రంగాజమ్మ) నిందించినట్లు విని రంగాజమ్మ యీ క్రింది పద్యమును రచించి పంపినదట.

ఉ॥ ఏవనితల్ మముందలపనేమిపనో శమరాడువారికా
రోవలపింపనేర్పెఱుగరో తమకౌగిటలోననుండగా
రావిడిమేమిరా ! విజయ రాఘవయంచిలుసూరి బల్మిమై
తీవరగత్తెనై పెనగి తీసుకవచ్చితినా తలోదరీ !

పట్టపుదేవి దగ్గర యీ పై పద్యమును తిలకించి రంగాజమ్మ యింటికేగి యిట్లు మందలించెనట.

"రాజనిభాననా ! సరసురాలవు జబ్బుగ నల్లినావదే
మేజడ యింతకంటె వలెనే వలెనే బిగియించి యిల్లవే
యోజవరాల ! వేరపనియున్నది దోసమె ? దోసమే మహా
రాజగునట్టి యవ్విజయరాఘవు మైచిగురాకె కోమలీ !"

అంత రంగాజమ్మ క్షమాపణవేడి. మన్నారుదాస విలాసము రాజునకు దేవికి గలిగిన వివాహము, అతని రాజాస్థాన వర్ణనలు మొదలగునవి రచించి యీ కావ్యము రాజున కంకిత మిచ్చెను. వివిధ మాంసపాకములను గూడ నీ కావ్యమునందు వర్ణించెను. ఆమె వేశ్యయగుట కీ కథ పొంది పొసగి యున్నది. హాస్య విషయమున తెనాలి రామకృష్ణునకు, దాన విషయమున కర్ణునకు, అభిమాన విషయమున దుర్యోధనునకు కట్టిపెట్టినట్లే యీ కథకూడ మన వారీమె విషయమున చెప్పినారేమో ! రంగాజమ్మ ఉషాపరిణయ మందలి యొక పద్యమును తెలిపెదను.

అంతకోపము రెట్టింప కంతకోప
మాకృతి వైష్ణవ జ్వరంబావహించి
మస్తకంబులు నిజఘోర హస్తములను
చదిమి మోదుచు మఱియు వక్షంబు నడచె॥

వేశ్యలు దేవదాసీలగుట దేవాలయమందు, నృత్యము చేయుటకై భరతనాట్య మభ్యసించు చుండెడివారు. సంగీత సాహిత్యములందు శిక్షణ బొందుచుండెడివారు. శతక్రతు శ్రీనివాసాచార్యులను నాతడీమెకు విద్యాగురువు. ఆస్థాన కవియగు చంగల్వల కాళయ్య కవి దగ్గర తెలుగు కవిత్వపు మెఱుగులు నేర్చుకొన్నది.

# మీకు తెలియునా?

1. పంచవర్ష ప్రణాళిక మొదటి రెండు సంవత్సరాల లోను దేశంలో (ఇరిగేషన్) సేద్యపు ప్రణాళికల క్రింద ఎంత భూమి కొత్తగా సాగులోకి వచ్చింది?

(ఎ) 10 లక్షల ఎకరాలు, (బి) 20 లక్షల ఎకరాలు, (సి) 40 లక్షల ఎకరాలు.

2. మేలు రకం కాయగూరల విత్తనాలను సృష్టించే సెంట్రల్ కాయ గూరల ఉత్పత్తి కేంద్రం ఎక్కడ ఉంది?

(ఎ) హిమాచల్ ప్రదేశ్ రాష్ట్రంలో మండీ
(బి) కులూ లోయలో నాగ్గర్.
(సి) సిమ్లా కొండలలో కుఫ్రి.

3. నలభై మైళ్ళ పొడవున్న నాంగల్ - హైడ్రో ఎలెక్ట్రిక్ కాలువద్వారా నీరు ఏ తేదీ నాటికి లభ్యం కాగలదు?

(ఎ) జూన్, 1954, (బి) జనవరి, 1955, (సి) ఏప్రిల్, 1956

4. 1954 లో ఇండియాలో నిర్మించబడే తొలి డి. డి. టి. ఫ్యాక్టరీ ఎక్కడ నెలకొల్ప బడగలదు?

(ఎ) పూనా. (బి) బెంగుళూరు, (సి) ఢిల్లీ

5. ముఖ్యమైన గ్రామము అనగా:

(ఎ) కమ్యూనిటీ ప్రాజెక్టులలో పని చేస్తుండే గ్రామ సేవక్ కార్యకర్త లందరు, తమ తమ అనుభవాలను గురించి పరస్పరం చర్చించుకునే నిమిత్తం ప్రతి సారి సమావేశమయ్యే గ్రామము.

(బి) మూడు సంవత్సరాల పైబడ్డ వయసు గల దాదాపు 500 గోవులుండే మూడు నాలుగు గ్రామాల సమిష్టి ప్రాంతము.

(సి) రైతులు, కౌలుదార్లు తమ తమ వివాదాలను పరిష్కరించుకోవడానికి సమావేశమయ్యే ప్రదేశము.

జవాబులు :—

1- (సి), 2- (బి), 3- (ఎ), 4- (సి), 5 (బి)-

# నర్సుల శిక్షణకు "శిక్షణనిధి"

"దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఏటేటా చాలా మంది బాలికలు నర్సింగ్ వృత్తిని స్వీకరించడానికి ముందుకు వస్తున్నారు. అయితే యిందు కోసం యింకా చాలా కృషి జరుగవలసి వున్నది. మన నర్సులకు జీతాలు తక్కువగా ఉన్నాయి. పెక్కు ఆస్పత్రులలో చాలినంత సిబ్బంది లేదు. అందుచేత నర్సులు చాలాసేపు కష్టపడి పని చేయవలసివస్తున్నది. నర్సులకు గెజెటెడ్ హోదా యింకా కల్పించవలసే వుంది. ముఖ్యంగా వారికి గృహ వసతి సౌకర్యాలను గురించి ఎక్కువశ్రద్ధ వహించవలసి వుంది.

"ఎంతటి విషమ పరిస్థితులలో అయినప్పటికి ఇండియాలో నర్సులు ఎంతో ఉల్లాసంగా తమ ధర్మాన్ని నిర్వహిస్తున్నారని చెప్పడానికి నాకు ఎంతో సంతోషంగా వుంది. అందుచేతనే నర్సులు పని చేసే కాలాన్ని సక్రమంగా నిర్ణయించి ఉత్సాహపూరితమైన వాతావరణాన్ని కల్పించి, వారు దిగులు లేకుండా విరామ కాలాన్ని సైతం సంతోషంగా గడపడానికి అనువైన పరిస్థితులను మనం కల్పించాలి. ఇది ముఖ్యం.

"గ్రామీణ బాలికలు సైతం నర్సింగ్ వృత్తిలో కొంత ప్రావీణ్యాన్ని సంపాదించడానికి అనువైన పాఠ్య ప్రణాళికను నర్సింగ్ కౌన్సిల్ తయారు చేసింది. స్వచ్ఛంద సంస్థలు కూడా ఇందుకు సాయపడుతున్నాయి. కేంద్రం లోను, వెల్లూరులోను నర్సింగ్ కళాశాలలలోను నర్సులకు శిక్షణ గరపబడుతున్నది. వీరు మన ఆస్పత్రులలో 'సిస్టర్-ట్యూటర్స్'గా కూడా పని చేయ సమర్థులు. జీతాలు కట్టుకోలేని బాలికలకు ఈ శిక్షణ పొందే అవకాశాన్ని కల్పించే నిమిత్తం నర్సుల కోసం కొంత "శిక్షణ నిధిని" కేటాయించడం మంచిదని నా అభిప్రాయం.

"ప్రపంచ ఆరోగ్య సంస్థ ఇండియాకు ఎన్నో రంగాలలో ఎన్నో విధాల సహాయపడింది. అయితే ఈ ఏడాది నర్సింగ్ వృత్తిని అభివృద్ధి చేయడానికి ప్రపంచ ఆరోగ్య సంస్థ నిర్ణయించడం ముదావహం. తమ త్యాగ నిరతికి సేవా ధర్మానికి గణుతి కెక్కిన భారతీయ మహిళలు అసంఖ్యాకంగా ముందుకు వచ్చి ఫ్లారెన్స్ నైటింగేల్ ఆదర్శంగా నర్సింగ్ వృత్తిని స్వీకరించాలని కోరుతున్నాను. మన దేశంలో ఒక ఫ్లారెన్స్ నైటింగేల్ పునరవతరించవలసి వున్నది." —అని రాజకుమారి అమృతకౌరుగారు చెప్పారు.

# ఎవరు బాధ్యులు - పిల్లల ప్రవర్తన

• శ్రీమతి చన్నఘంటమ్మ కృష్ణారావు •

వాడుకలో 'తల్లీ - పిల్లా' అంటుంటాము, 'తండ్రీ - పిల్లా' అనం. ఇక రేపటి మాట ఏమో లెండి గాని, యిప్పటి వరకూ జరుగుతూ ఉన్న పద్ధతి ఇది. పిల్లలకు కూడా 'తల్లి లేని పిల్ల' అంటే కురిసే సానుభూతి, 'తండ్రి లేని పిల్ల' అంటే లభించదు. 'తల్లి లేకపోతే తనువే లేదమ్మా' అనేవారు ఎప్పుడూ మా నాన్నగారు. మాతృత్వం సంపాదించుకున్న ప్రతి యువతికీ యిందలి సత్యం ప్రత్యక్ష ప్రమాణం కూడా. ఇంతెందుకు, ఒకనాడు మామూలుకన్నా కొంచం ఎక్కువ సుస్తీ చెయ్యనియ్యండి. ఇక ఆ తల్లి మనసులో కంగారు, మాటలతో చెప్పడానికి వీలా ! తను కొంచం ఆ కళ్ళు రెండూ మూసుకుంటే— తన బిడ్డల భవిష్యత్తును గురించి ఎన్ని అపోహలు, ఎన్ని అసందర్భాలు, ఎన్ని ప్రమాదాలు ఆవిడ కళ్లముందు ప్రత్యక్షమౌతాయో !

అందుకే– ఒక ప్రపంచ చరిత్ర కారుఁడు చమత్కారంగా ఉల్లేఖించాడు, పసివారనే పరాన్న భుక్కుల (అంటే Parasites) మూలంగా ప్రపంచ నాగరికతలో స్త్రీల యొక్క స్థానం నాలుగు గోడల మధ్య బంధింప బడినదని– పురుషుఁడు స్వేచ్ఛాసంచారియై బయట ఛత్రాధిపత్యం వహించాడనీకూడ.

ఇతర అంటు పురుగులనుండి, ఏ మందులు మాకులు మింగో, తప్పించు కోవాలని చూస్తాంకాని, యీ పసివారిని విడిపోకుండా, యింకా యింకా అంటించుకో ప్రయత్నించడం మాతృత్వ సహజ లక్షణమైంది.

మాతా శిశువులకున్న యీ సన్నిహితత్వం వల్ల పిల్లలు సాధారణంగా తల్లి శిక్షణలో ఎక్కువ భాగం పెరుగుతారని, పిల్లలయొక్క ప్రవర్తనలో ఏ లోపాలున్నా దానికంతా తల్లే బాధ్యురాలనీ లోకంలో ఒక సూత్రం అమలులో వుంది. అదే సందుగా పురుషవర్యులు చాలా మంచిది, పిల్లల పెంపకములో తమ పూచీ కించన్మాత్రమైనా ఉన్నదని గ్రహించరు సరిగదా, ఏ హెచ్చు తగ్గులు తమకు స్ఫురించినా, బాధ్యతంతా ఆడువారిదేయని చికాకుపడి నిందించడం కూడా జరుగుతూ వుంది. కొత్త కోడలి పని వైనాన్ని విమర్శిస్తూ 'ఎంత చక్కగా తర్ఫీదు చేసిందే మీ అమ్మ', అంటూ నోరు నొక్కుకుంటుంది అత్తగారు. 'ఆ తల్లి ఉత్త మూర్ఖురాలు. నేనైతేనా ఆ పెంకితనం అలా సాగనిస్తానా' అంటుంది ఒక చదువుకున్న యిల్లాలు. పక్క యింటి పసివాని అల్లరి పనులు చూచి తనకు బిడ్డలు పుట్టనంత వరకూ, 'మా ఆవిడ పల్లెటూరి మనిషిలెండి, నవీన పద్ధతులలో పిల్లలను పెంచడం దానికి బొత్తిగా తెలియదు.' అంటూ ఒక చదువుకున్న నాగరికుఁడు క్షమార్పణ పూర్వకంగా తన పిల్లల్ని స్నేహితురాలికి పరిచయం చేస్తాఁడు

> పిల్లల ప్రవర్తనకు తల్లి ఒక్కతే ఏకైక బాధ్యురాలుకాదు. కుటుంబం, సంఘం, యీ బాధ్యత హెచ్చుగా పంచుకుంటుంది. ఉత్తమ సభ్యులతో కూడిన ఉత్తమ సంఘ వ్యవస్థలో, ఉత్తమ ప్రవర్తనగల పిల్లలు పెరుగగలరు.

ఇంత మందితో యిన్ని రకాలుగా విమర్శించబడడానికి నిజంగా ఆ తల్లి బాధ్యత ఎంత వుంది అని మనం ఆలోచిద్దాం— నవ మాసాలు, రక్తం పంచుకుని, ఆహారంతో ఆహారం, గాలిలో గాలి పంచుకుని, మాతృగర్భంలో పెరిగిన శిశువు, ఆ సాన్నిహిత్యం ప్రాతిపదికగా కేవలం తల్లి పోలికతోనే ఎందుకు ఆవిర్భవించడంలేదు? మేనమామ చాయ, మేనత్త పోలిక, తండ్రి ముక్కు, తాత పళ్ళు, తామ్మ చెవులు, యింకా యింకా యిల్లాగే రక్త బంధువుల లక్షణాలేగాక, దేశకాల వాతావరణ ఫలితములైన జాతియొక్క లక్షణాలనుగూడా, తన రూపంలో ప్రతిబింబించుకుంటూ ఎందుకు ఉంటాఁడు? కేవలం శారీరకమైన వ్యవస్థలోనే, బాంధవ్య లక్షణాలనే గాక, జాతి లక్షణాలనుకూడా యీ విధంగానే పుణికి పుచ్చుకుని ప్రతిబింబింప చేసుకునే ఆ శిశువుయొక్క మనస్తత్వం మాత్రం జాతియొక్క, సమాజముయొక్క, రక్తబంధువుల యొక్క వారసత్వపు లక్షణాలను ప్రతిబింబింపజేయదూ

పరి: తండ్రియొక్క ముక్కోపి తనం, తల్లియొక్క దయార్ద్ర హృదయం, మేనమామ సోమరి తనం, సమాజము యొక్క నైతిక విలువలు, జాతియొక్క వివేకం— పసివాని లేత హృదయంలో బీజ రూపంగా ఉంటాయి. సహజమైన వాని చేష్టలలో యీ లక్షణాలన్నీ పరీక్షించే వారికి గోచరించకపోవు.

ఇందువల్ల మనం గుర్తుంచుకోవలసినదేమిటంటే— పిల్లల ప్రవర్తనకు పుట్టుకతోనే ఒక పునాది పడి ఉంటుందని.

'కాను చెల్లాయి- యీ పునాదిని సవరించడం, చెడ రాయిని తీసి మంచి రాయిని పొదగడమే నమ్మా నీ బాధ్యత' అంటాడు నా వాదానికి అడ్డు తగులుతూ మా అన్నయ్య. 'అదేనోయి బావా' అని విజయవంతంగా వీపు తట్టాడు మా బావ. 'ఆగండి ఆగండి అయ్యల్లారా! నా మాట పూర్తిగా ఆలకించండి' అంటాను నేను—

మాఅబ్బాయి నల్లవాడేనోయి — చక్కగా వళ్ళు రుద్ది, నున్నగా పౌడరువేసి కొంత మెరిసేటట్టు నేను చేస్తానను కుందాం. అయితే వజ్రపుతునకలాగా అపురూపంగా ఇనప పెట్టెలో బంధించే వస్తువయితే గదా? అటు ఎండ దెబ్బ, ఇటు వానదెబ్బ, చీమలు, మట్టి, వీని తాకుళ్ళకు గురి కావలసినవాడు కదా. నేను పెట్టిన మెరుగు అలానే చెక్కు చెదరకుండా ఎలా ఉంటుంది?

శరీరతత్వాని కన్నా అతి సున్నితమైంది మనస్తత్వం. పునాదితత్వం, మనం పెట్టిన మెరుగులు కూడా వాతావరణ జంఝూమారుతానికి సడలి వివిధ ఆకృతులలో వివిధ పరిణామాలను పొందుతాయి.

మా స్నేహితురాలి పిల్లవాడొకడున్నాడు. 5 ఏళ్ళవాడు. స్కూలుకు వెళ్ళు నాయినా అని అమ్మ నచ్చచెప్పేది. కొంచెము మారాం పెట్టినా ఎలాగో ఒప్పించేది. వెనుక నుండి 'తాతగారు, అమ్మాయి, వాడిని బలవంత పెట్టకు — మెల్లిగా వెళ్తాడులే' అంటారు. నిముషంలో గ్రహిస్తాడు యీ సంగతి పసివాడు. సందు దొరికిందిగదా అని ససేమిరా వెళ్ళనంటాడు. ఇలా కలుగ జేసుకోవద్దని గాని, ఒక వేళ యిలాంటి సలహాయిచ్చినా వాడిఎదుట చెప్పవద్దనిగాని, మామగారిని పాపం కోడలు మందలించగలదా? ఆ పిల్లల మనస్తత్వం మీద పాఠాలు ఆయనకు బోధించగలదా? లేక, పిల్ల వానిని స్కూలుకు పంపక పోవడంవల్ల అల్లరి చేస్తున్నాడనో, తన అలమారు లో సామానులతో ఏదో పని సాగించాడనో, తను తొందరలో బల్లమీద మరచి పోయి వెళ్ళిన రేజరుతో గడ్డం తెగకోసు కున్నాడనో, విసుక్కునే భర్తకు జవాబు చెప్పగలదా?

ఒకప్పుడు మా ఎదరింట్లో ఒక తాత ఉండేవాడు. ఆయనకు పనీపాటా లేక, కట్టుపుచ్చుకుని వీధిలో కూర్చునేవాడు. తోటలో కావలసినన్ని పువ్వులు కాయలు ఉండేవి. ఇంట్లో బోలెడన్ని బియ్యం, డబ్బూ ఉండేవి. అయితేనేం పిల్లికి బిచ్చం పెట్టడు సరిగదా, ఒకటికి రెండు మాట్లడిగే వారికి బడితె బాజాచేసేవాడు. ప్రక్కనే బుజ్జి మనుమడు ఒక చిన్న బడితె పుచ్చుకుని కూర్చునేవాడు — తాత దగ్గర ముద్దుగా నేర్చుకున్న విద్య బంధు వర్గంపై ముచ్చటగా ప్రయోగించేవాడు. పాపం వాడిది తప్పని ఎలా అంటాం? ఆ తాతకే ఒక మనుమరాలు ఉంది. ఏమూలనుండో దానికి దయార్ద్ర హృదయం వచ్చింది. దొంగతనంగా తాతకు తెలియకుండా ఇన్ని బియ్యం తీసుకొని కనబడ్డ బిచ్చగత్తె ఒడిలో పోసేది. ఇన్ని పువ్వులు కోసుకుని స్నేహితురాలి కిచ్చేది. తాత అడిగితే, అబద్ధం చెప్పేది - దొంగతనంగా ఇచ్చింది, అబద్ధం ఆడింది అంటే దాని ప్రవర్తన కెవరు బాధ్యులు !

నాన్న రోజుకు నాల్గు సిగరెట్టు పెట్టెలు ఊది పారవేస్తాడు. వారం వారం సినిమాకు తప్పడు. అమ్మకు తెలియకుండా కొన్ని పనులు చేస్తాడని కూడా గ్రహిస్తాడు - ఇంక అప్పుడు అలాంటి తంతులోనే వాడు దిగితే, అమ్మ ఎంత వరకు బాధ్యురాలు కాగలదు?

నాన్నమ్మ, పెద్దమ్మ — ఒకరంటే ఒకరు మండి పడ్తూ వుంటారు - పెద్దమ్మ ఎక్కడ కూర్చుందీ, ఏమి చేస్తుందీ చూచి రమ్మని మనుమరాలిని పంపిస్తుంది నాన్నమ్మ - పెద్దమ్మకు వ్యతిరేకంగా నాల్గు ముక్కలు చెప్పిన నాడు ఒక లడ్డూ రెండు ముద్దులూ పెడ్తుంది. లేనినాడు తిట్టి పోస్తుంది. నాన్నమ్మ మెప్పు పొందాలని ఉన్నవీ లేనివీ నాల్గు కల్పిస్తుంది ఆ చిన్నది - రానురాను ఇది ఒక పెద్ద వ్యాధిగా తయారౌతుంది. సాడీలకోరని పేరు పడ్తుంది. చివరకు నాన్నమీద అమ్మకు చెప్తుంది. ఈ వ్యతిరేక పరిస్థితులలో అమ్మ ఎంత బోధిస్తే ఫలిస్తుంది?

ఒకప్రక్క నౌకర యజమాని పనివాండ్ల మీద రొసరొస లాడుతూ అసహ్యాకరమైన భాష వాడుతూ ఉంటాడు. మరి ఒక వంక ఒకరింటి గ్రామ్ఫోనులో ప్రేమ గీతాలాపన

నిత్యలు శ్రవణమౌతాయి. పరమలోభి కుమారుడొక స్నేహితుడు బిచ్చగాడి మీద చమత్కారంగా, 'ఇవాళ నేనిచ్చే అర్ధణాతో తింటే రేపైనా ఏమీలేక చావవలసిందే గదా ఆ చచ్చేది ఈ రోజునే చావరాదూ' అంటాడు - మరియొక పెద్దమనిషి నాన్న దగ్గరకు వచ్చి "ఋణశేషం, శత్రుశేషం ఉండకూడ దంటారయ్యా. ఎలాగైనా వాడిని హతమార్చి తీరాలిసుమా" అని మంత్రాలోచన జరుపుతాడు. పేరంటం పిలవడానికని వచ్చిన సినిమా తార కొంతమటుకు ఇంట్లో అందఱినీ ఒక అపురూపపు మనిషిలాగా ఆకర్షిస్తుంది - అన్నయ్య చదివే సినిమా పత్రిక బహు ఆకర్షవంతంగా వుంటుంది - విభేదాలు, తంత్రాలూ, కుట్రలూ, యుద్ధాలూ— ఇవి వార్తా పత్రికలు మోసే వార్తలు.

వెన్నపూసలాంటి పసివాని మనస్సు— ఎదుటి వారిని అనుకరించాలి. తన్ను తాను రక్షించుకోవాలి అనేటటు వంటి మానవ సహజ ప్రవృత్తులు, ప్రకోపాలూను- ఇటువంటి బహువిధమునైన ప్రోత్సాహాలూ, అనుభవాలూ ప్రత్యక్షమై ఆ మెత్తని మనస్సుపైన వేసిన ముద్రల పరిణామమే పిల్లల ప్రవర్తనకు కారణమౌతుంది. వివేకవతియైన తల్లి, అవకాశమున్నంతవరకూ, వీనిలోని మంచి చెడ్డలను పిల్లలకు బహువిధాలుగా నచ్చచెప్పి, యిలాంటి వాతావరణము నుండి కూడ ఒక మాణిక్యాన్ని తయారు చేయవచ్చునుకాని, అది కత్తిమీద సామువంటి పని. అందువల్ల, పిల్లల ప్రవర్తనకు కేవలం తల్లే బాధ్యురాలనడం అపోహ. తండ్రి, ఇతర బంధువులు, సమాజం మొత్తం మీద పిల్లల ప్రవర్తనను పరిణామం చెందడానికి తోడ్పడుతున్నారు. ఉత్తమ సభ్యులతో కూడిన ఉత్తమ సంఘ వ్యవస్థలో ఉత్తమ ప్రవర్తనతో పిల్లలు పెరుగగలరు. లేకున్న మంటి నుండి మాణిక్యం తయారుచేసినంత పని ఒక ఉత్తమ ప్రవర్తనగల వ్యక్తిని తయారు చేయడం అని చెప్పి తీరాలి.

(ఆలిండియా రేడియోవారి సౌజన్యముతో)






# అమృతాంజనము

గాని,

" యథాయథా...............రాశీభవశశ్య శంకయా."

అమృతాంజనమా ! నీ కీర్తి ముల్లోకములను దెల్పుజేయు పూనికతో పెరుఁగు చున్నప్పుడెల్లను నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!

మూలం: రవీంద్రుడు.

# ఆ రాత్రి

అనువాదం: శ్రీ తాళ్లూరు సీతారామయ్య.

"డాక్టరుగారూ! డాక్టరుగారూ!"

అర్ధరాత్రి నిద్రలోంచి ఒక్కసారి త్రుళ్ళిపడి లేచాను. కళ్ళు తెరవటంతో, వచ్చిన వ్యక్తి మా భూస్వామి దక్షిణ బాబుగారని గుర్తు పట్టగల్గాను. పక్కనుంచి దిగి, దగ్గరలో వున్న ఒక కుంటి కుర్చీని లాగుతూ దానిలో వారిని కూచోబెట్టి, ముఖంలోకి ఆత్రుతతో చూసాను. రెండున్నర దాటిందని గడియారం తెలుపుతున్నది.

దక్షిణ బాబుగారి ముఖం పాలిపోయి వున్నది. "ఈవేళ రాత్రి మళ్ళా ఆ లక్షణాలు తిరిగి కనబడుతున్నాయండీ. మీరిచ్చిన మందు నాకేం పనిచేయలా" అని అంటున్నప్పుడు అతని కళ్ళు బాహాటంగానే తెరవబడ్డాయి. కొంచెం పిరికెని తెచ్చుకొని "అయితే, మీరు మళ్ళా తాగుడుకలవాటు పడివుంటారని నా సందేహం" అన్నాను. దక్షిణ బాబుగారికి కోపం కర్గింది. "అది గదిగో, అక్కడే మీరు పొరబడుతున్నారు. అది తాగుడు మూలంగా కాదండి. సహేతువును మీరు అర్థం చేసుకోదల్చుకుంటే నా కథను సాంతం వినండి. అపుడు మీకు నామీద యింత చిరాకు, అనుమానం వేయదు"

గూటిలో చిన్న కిరసిన్ లాంతరు గుడ్డిగా వెలుగుతూంది. వత్తిని కొంచెం పైకెత్తాను. కాంతి విస్తృతమైంది. దక్షిణ బాబుగారు కథను ప్రారంభించారు.

"నాలుగు సంవత్సరాల క్రితం, నన్నొక మాయదారి రోగం పట్టుకొని మహా వేదించింది; చివరకు అంత్యకాలం సమీపించిందనే వరకూ వచ్చింది, నా పరిస్థితి. కాని అదృష్టవశాత్తు ఆరోగం కొంత కాలానికి తిరుగుముఖం పట్టింది. తర్వాత ఒక నెల రోజులకు సంపూర్ణ స్వాస్థ్యంను పొందగల్గాను.

"నన్నా రోగం పట్టి పీడించిన రోజులలో, నా భార్యసలు పగలు గాని రాత్రి గాని క్షణం సేపైనా విశ్రాంతి యన్నది ఎరుగదు. ఆమె — అసలే గోగు పుల్లల్లే, సన్నగా బలహీనంగా వుండేది — తనశక్తికొలది యమధూతను మా వాకిటి నుంచి తరిమి వేయటానికి ఎన్నో ప్రయత్నాలు చేసింది. నిద్రాహారాలు రెండూ మాని అట్లానే గడిపింది. ఆ సమయంలో, నాగురించే తప్ప, ఇక ప్రపంచంలో దేన్ని గురించయినా ఆలోచన అన్నది లేనేలేదామెకు.

"కాని మేమొకటనుకొంటే, దైవమొకటి చేసింది. భక్ష్యం కోసం భంగపడ్డ బెబ్బులిలాగ, మృత్యు దేవత నన్ను తన కరాళమైన కోరల సందుల్లోంచి బయటికి నెట్టేసి, తిరిగి వెళుతూ వెళుతూ వాడియైన తన పంజాతో ప్రత్యామ్నాయంగా నా భార్యను తీవ్రంగా దెబ్బకొట్టింది.

"తరువాత కొద్దికాలానికి ఆమె ప్రసవం కావటం జరిగింది. కాని పాపం పుట్టిన పసివాడు భూమిమీద నూకలు లేనివాడైనాడు. అపుడు ఆమెకు తగిన ఓదార్పులు, సపర్యలు, సల్పటం నిజంగా నావంతేగదండీ? దానికి ఆమె ఎంతో నొచ్చుకొనేది. 'అబ్బ! ఎందుకండీ ఎప్పుడూ నా దగ్గర వుండకపోతే మీ పనులు మీరు చూచుకోరాదూ?' అనేది.

"రాత్రి పూట ఆమెకు జ్వరం వచ్చినప్పుడు ఆమె గదిలోకి వెళ్ళి తన్ను విసనకఱ్ఱతో నేను విసురుతూండటం గనక ఆమె కళ్ళ బడిందంటే, వూరుకొనేది కాదు. సపర్యలు చేయటంలో నా భోజనం మామూలుకన్నా పది నిముషాలు ఆలస్యంగా అయినా ఆమె మనస్సు నొచ్చుకొనేది. ఏ పని చెయ్య బోయినా నా కడ్డువచ్చి, ఆ పని నుంచి విరమింపజేసేది. పైగా ప్రేమను ఒలకబోస్తూ, 'అబ్బ! మంచివారెప్పుడూ ఇటువంటి పనులు చేయటానికి రాకూడదండీ!' అంటూ సుస్మితంగా మందలించేది నన్ను.

"బహుశా, మీరు మా యింటిని చూసే వుంటారనుకుంటాను. ఇంటి ముందుగా ఒక చిన్న తోట. దానికి ముందుగా గంగానది. దక్షిణంగా, నా పడక గదికి దిగువగా, నా భార్య తన చిత్త ప్రవృత్తి కనుగుణ్యంగా చక్కటి పూల మొక్కలను, చెట్లను పెంచింది. దాని చుట్టూ గోరింట చెట్లతో ఫెన్సింగ్ అమర్చింది. నిజంగా

దాన్ని చూచిన వారికి సుందరంగా, సహజంగా, నందన వనంలాగ మనో గోచరమయేది. పూల తోట్లలో వున్న వివిధ రకాల పూల మొక్కలు ఆమెచే నాటబడ్డవే. చామంతీ, మల్లె, మాలతీ, మాధవీ, గులాబీ మొదలగు పూల చెట్లు ఇక అంతులేవండీ! ఇంటి ముందు ఒక పెద్ద పొన్నచెట్టు, క్రింద నలుపలకల ఒక పాలరాయి వున్నది. బాగా ఆరోగ్యంగా వుండేటప్పుడు నా భార్య ఆ పాలరాతి మీద కూర్చుని ఆనందించేది. దానిమీద కూర్చుంటే నదీ సౌమ్యత, బాలభానుని బంగారు కిరణాలు నదీ జలం మీద ప్రసరించబడి వున్నపుడు గోచరించే రామణీకంను తిలకించ వలని, అపుడు అంతరంగంలో ఆనంద జ్యోత్స్న పుష్ప వించినట్లనిపిస్తుందని అంటుండే దామె.

"ఏప్రిల్ మాసం. వెన్నెల రాత్రి. ఒక్క నాడామె తనెప్పుడూ అనారోగ్యం చేత నాలుగు గోడల మధ్యపడి వుంటాన విసుగు జనించిందో ఏమో, కాసేపు పూల తోటలో కూర్చుంటానని అన్నది.

"కడు జాగ్రత్తతో ఆమెను సందిట పొదివి పట్టుకొని పైకిలేవ నెత్తి పొన్న చెట్టుకింద పాలరాతిమీద దించాను. ఒకటి, రెండు పొన్నపూలు ఆమె మీద రాలాయి. పైన, పొన్న చెట్టు కొమ్మల సందుల గుండా, సన్నని, తెల్లని, వెన్నెల ఆమె ముఖం మీద పడ్డది. చుట్టూ వాతావరణం ఎంతో ప్రశాంతంగా, హాయి గొల్పుతూంది. వెన్నెల పడిన చెట్టు కొమ్మల నీడల చీకటిలో ఆమెకు పక్కగా కూచుని భరింపరాని పూల సౌరభానికి లోనయి, ఆమె ముఖం లోకి చూడగా, కళ్ళు రెండూ చెమ్మగిల్లాయ్.

"మెల్లగా, దగ్గరిగా వస్తూ, సన్నని, నున్నని, చేతులను నాలోకి లాక్కున్నాను. దానికి అయిష్టం కనబరచలేదామె. కొంతసేపు కూర్చున్న మీదట ఆనంద భారం వల్ల హృదయం స్వాధీనం తప్పింది. ఆనంద పరవశంతో, 'నీ ప్రేమ నెప్పుడూ మరువలేను' అని అన్నాను.

"నాభార్య ఒక్క చిరునవ్వు నవ్వింది. ఆ చిరునవ్వులో కొంత ఆనందం, సందేహం తాలూకు జాడ, అవహాస్య వైశిత్యం, యిమిడి వున్నాయ్. జవాబు పూర్వకంగా ఏం చెప్పలేదు. నేను మట్టుకు, ఆమె ప్రేమను మరిస్తే మాత్రం, తను మాత్రం నాప్రేమను మరువలేదన్న భావన ఆ చిరు నవ్వులో వ్యక్తం అయినట్టు అర్థం చేసుకోగల్గాను.

"ఆ తియ్యని చిరునవ్వులో దాగివున్న సందేహ భీతివల్లే పూర్వం ఎన్నడూ నా భార్యకు నాప్రేమని చెప్పుకోటానికి సాహసించలేదు. ఆమె నాదగ్గర వుంటే కలిగే ఆనందం, లేనపుడు కలగమన్నా కలుగుతుందా?

"ఏం మాట్లాడకుండా మౌనం వహించాను. వెన్నెల మరింత విరాజమానం అయింది. ఎక్కడో కోయిల పిచ్చెక్కినదానికిమల్లే తెగ కూయటం సాగించింది. హాయిని గొల్పే ఆరాత్రి సమయంలో, ఆ కోయిల భార్య, భర్తను వీడి ఉదాసీనంగా ఎలా వుండ గల్గిందోనని ఆశ్చర్యం కలిగింది.

"ఎన్ని మందులు వాడినా నాభార్యకు నయమయ్యే సూచనలు కానరాలేదు. డాక్టరుగారు గాలి మార్పును సూచించారు. సరేనని ఆమెను దానికోసం ఉటకమండుకు తీసికెళ్ళాను"

అని అంతవరకూ చెప్పి, వసీం సాయిబుగారు ఒక్కసారి ఆగిపోయి మౌనం వహించారు. ముఖం మీద ప్రశ్నార్థక మైన చూపును ద్యోతకం చేస్తూ నావైపు చూశారు. ఏదో చేతుల్లో పుచ్చుకొని దీక్షగా ఆలోచించటం సాగించారు. నేను మౌనంగానే వుండిపోయాను. గూటిలో ఉంచిన లాంతరు వత్తి గాలి కటూ ఇటూ కొట్టుకుంటూ, ఆరి పోయ్యేట్టుంది. ప్రశాంతంగా వున్న ఆరాత్రి వాతా వరణంలో దోమల మోత స్పష్టంగానే వినపడ్తూంది. ఆకస్మికంగా నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ, వసీం సాయిబుగారు తిరిగి తన కథను అందుకున్నారు.

"డాక్టరు హూవర్ అనే పేరుగల డాక్టరుగారు నా భార్యకు మందు ఇవ్వ సాగారు. కొంతకాలం అలా మందు ఇచ్చిన మీదట, నా భార్య విషయంలో 'నయం' కనబడ లేదాయనకి. ఆమెమీద ఏదో మమత పెంచుకున్నారు. రోగం మానేది కాదని గూడ చెప్పివేశారు. అప్పటినుంచి రోగం తోనే తిప్పలు తీసుకుని మరణించాల్సిందట. ఈ విషయం నాతో మాత్రమే అన్నారాయన ఒకసారి.

"ఒకరోజు నాభార్య నాతో అన్నది. 'ఈ రోగం ఇక నన్ను వదలదు. త్వరగా మరణించే సూచనలుకూడా కన బడటంలేదు. ఎందుకు మీకు ఈ జీవచ్ఛవాన్ని గురించి రోజులు అసమానం చేసుకొంటారు? ఎందుకుగాని నన్నొదిలేసి మీ పనులేమిటో వాటిని చూసుకోండి'

"నాకు నవ్వొచ్చిందా మాటలు విన్నప్పుడు చెప్పొద్దూ. కాని ఆ సమయంలో నవ్వాల్సిన పనిగాదు నాది. 'ఈ బొందిలో ప్రాణమున్నదాక —' కొంచెం గంభీరతను మొఖంలోకి తెచ్చుకొని అనబోయాను.

"అర్థోక్తిలోనే ఆపేసింది నన్ను. 'ఇపుడు, ఇపుడు, మీరేం చెప్పనవసరం లేదు లెండి. మీ మాటలు వినేకన్నా, మరణిస్తేనే బాగు అనిపిస్తుందండి' అని అన్నది.

"ఆమె పట్ల నేను చూపే అచ్ఛాదితసేవ నలా వుంచి, నా అంతర్భాగంలో ప్రఫలించిన చైతన్య వైరస్యంను ఆమె చూడగలిగిందని అనుకొన్నాను. ఆ రోజుల్లో అయితే దీన్ని కానుకోలేక పోయాను. మొదటి తరగతి పుస్తకాల లోని పెద్ద అక్షరాలు చదివేసినట్టు, నన్ను గూడ చదివే శక్తి ఆమెలో వున్నదనే విషయంలో నాకు పీసం గూడ సందేహం కనబడదు.

"డాక్టరు హరన్‌గారు నా కులానికి సంబంధించినవారే. వారింట్లోకి నాకెప్పుడూ ఆహ్వానమే. నాకాతని కూతురుతో పరిచయం డాక్టరుగారి వల్లనే కలిగింది. ఆమెకు పదిహేను సంవత్సరాలు పైబడ్డాయంతే, అప్పటికి. ఎందుకో పెండ్లి కాలేదు. దానికిగల కారణాన్ని, డాక్టరుగారు ఆమెకు అదే కులానికి సంబంధించిన తగిన వరుడు త్వరగా లభించక పోవటమేనని సెలవిచ్చారు. కాని ఆమె జన్మంలో గ్రహచారం వున్నదని అందరూ అనుకొనేవారు.

"అది మినహాయించి ఆమెలో ఏలోపం లేదు. ఎంతో తెలివి గలది, సౌందర్యవతి. ఏదో పిచ్చాపాటీ ఆమెతో మాట్లాడటం నాకు క్రమంగా పరిపాటవటం వల్ల, ఒకో సారి ఇంటికి చేరుకొనే సరికి చాల పొద్దు పొయ్యేది. నా భార్యకు మందివ్వాల్సిన కాలం గూడ దాటి పోయేది. ఈ నా ఆలస్యం అధిక కాలం డాక్టరు హరన్ గారింట్లో గడ పటానే జరుగుతున్నదని ఆమెకు తెలుసు. కాని పైకి నాతో నిలదీసి అడిగి ఎరుగదు.

"ఆమె పడకగదంటే నాకు క్రమంగా దుస్సహంగా, జుగుప్సాకరంగా కనుపించసాగింది. ఆమె ఎడల మొదట్లో వున్న శ్రద్ధ, నాతో డాక్టరుగారు కూతురుకు కల్గిన పరి చయం మూలాన సడలి పోయినట్లయింది. ఒకోసారి ఆమెను అసలు మరచి పోవటం గూడ జరిగేది. సరిగా మందును గూడ ఇవ్వక పోయేవాడిని

"ఒకసారి డాక్టరుగారు నాతో అన్నారు 'నయంగాని రోగాలతో తీపులు తీసికొనే వారికి అవశ్య మరణం కన్న ఉత్తమ మయింది లేదు. ఇకవారు బ్రతికి వుండటం వల్ల వారికి వారు సంతోషం పొందలేక పోవటం అటుంచి, ప్రక్కవారిని గూడ సంతోషం పొందకుండ చేస్తారు'

"ఈ విషయం మామూలు విషయంగా చెప్తే సహించ తగ్గదే. కాని నా భార్యా విషయమై చెప్పరానిది. డాక్టర్లకు గూడ మానవ జీవిత మరణాన్ని గురించి కువాసన ఏర్ప డ్డదనే అనుకొన్నాను.

"ఒకరోజు, పక్కగదిలో కూర్చున్న నాకు, డాక్టరు గారితో నాభార్య ఎదో అనటం వినిపించింది 'డాక్టరు గారూ వుపయోగం లేని మందులివ్వటం వల్ల ప్రయోజనం ఏముందండీ? ఇక నా బ్రతుకే మానరాని రోగం అయి నపుడు, మరణించే మార్గం చూపిస్తే అదే నాకు నివృత్తి మార్గం అని మీకు తెలియదా?'.

'అమ్మా! నీ వట్లా అనగూడ' దని డాక్టరు అన్నారు.

"డాక్టరుగారు వెళ్ళిపోగానే ఆమెగదిలోకి వెళ్ళాను. ముందరగా కూర్చుని ఫాలభాగాన్ని సున్నితంగా మర్దన చేయసాగాను! 'ఈ గదెంతో వెచ్చగా వుంది, నా దగ్గ రెందు కండీ మీరు? బయట వాహ్యాళికి వెళ్ళరాదూ! సాయంత్రం వాహ్యాళికి పోకపోతే మళ్ళా భోజనం వేళకు ఆకలి వేస్తుందా?' అని అన్నది.

"నా వాహ్యాళి అంటే డాక్టరు హరన్ గారింటికి వెళ్ళటం అన్నమాట. వాహ్యాళి అన్నది మనిషి ఆరోగ్యా నికి, ఆకలికి మంచిదేనన్న సంగతి నాకు తెలుసు. అది గాదు సంగతి. నా వాహ్యాళి గురించి ఆమె ఎలా తెలుసు కొంది? మూర్ఖుడ్ని. నిజం! అంతకూ నేను చేసే అంత ర్గత మోసం ఆమె గుర్తించ లేదనే అనుకొన్నాను"

తిరిగి దక్షిణా బాబుగారు కాసేపు ఆగిపోయారు. చేతుల్లో తలను గ్రుచ్చి, మౌనం వహించారు. చివరకు "కాస్త మంచినీళ్ళివ్వండి?" అని వాటిని త్రాగి, తిరిగి మొదలెట్టారు.

"ఒక రోజున డాక్టరు గారి కూతురు — మనోరమ, నా భార్యను చూడాలన్నది. ఎందుకో చెప్పలేను గాని, ఆమె చూపటం నాకేమాత్రం ఇష్టం లేదు. కాని, ఆమెకు అడ్డు

చెప్పడం తోచలేదు. చివరకు ఒక సాయంత్రం మా యింటికి వచ్చింది.

"ఆ రోజు నా భార్యకు మామూలుకన్న బాధ వుధృత మైంది. బాధ ఎక్కువైనప్పుడల్లా, కష్టంతోనే సహించ ప్రయత్నిస్తూ, నిశ్శబ్దం వహించి, పిడికిలి బిగపడుతుంది. దాన్ని బట్టే వూహించవచ్చు, ఎంతగా బాధ పడుతుందో? గదిలో ఏ విధమైన శబ్దం రావటం లేదు. నా వాహ్యాళి సంగతి గూడ ఆమె ఎత్తలేదు. అసలు మాట్లాడటానికి ఆమెకు శక్తి లేదు. ఆమె పక్కన నేనుంటే, కొంచం పరిశాంతి చేరుతుందనే నా వూహ.

"సరిగ్గా, ఆ సమయంలోనే మనోరమ వచ్చి తలుపుకాడ నుంచొని వుంది. ఎదురుగ్గా వస్తున్న కాంతి ఆమె ముఖం మీద పడింది.

"నా భార్య కొంచం పైకి లేచి, నా చేయి పట్టుకొని 'ఎవరువారు' నడిగింది. జవాబు త్వరగా చెప్పలేదు. మళ్ళీ తిరిగి 'ఎవరువారు? ఎవరువారు?' అని అడిగింది. మొదట నాకు తెలియదన్నాను. కాని మరుక్షణంలోనే, నన్నెవరో కొరడాతో కొట్టినట్టూ, నన్ను నేనే సరిపుచ్చుకొంటూ 'ఎందుకు! ఆమె మన డాక్టరుగారి కూతురు' అని జవాబిచ్చాను.

"నాభార్య నా వంక చూసింది. ఆమె ముఖంలోకి చూడటానికి అపుడు చాలినంత ధైర్యం లేకపోయింది. కొత్తగా వచ్చిన ఆ వ్యక్తి—మనోరమ – వంక తిరిగి 'రండి' అని నా వంక తిరిగి బొంగురు గొంతుతో 'లాంతరు కొంచెం తీసుక రండి' అని అన్నది.

"మనోరమ గదిలోకి వచ్చి నా భార్యతో ఏదో మాట్లాడ సాగింది. ఆమె మాట్లాడుతుండగా, డాక్టరుగారు రోగిని చూడ వచ్చారు. డాక్టరుగారు డిస్పెన్సరీ నుండి రెండు బాటిల్స్ మందును తెచ్చారు. వాటిని చూపిస్తూ, నా భార్య నుద్దేశించి 'ఇదిగో! చూడమ్మా! ఈ నీలి రంగు బాటిల్ వున్నది చూశావు. ఇది పై పూతకు మాత్రమే. ఇక రెండోది కడుపులోకి. కాని రెండూ తారు మారు కాకూడదుసుమా! ఏమంటే నీలిరంగు బాటిల్‌లో వున్నది కటిక విషం'

"నన్ను గూడ బాటిల్స్ విషయమై హెచ్చరించి, బెడ్‌కు పక్కన టేబుల్‌పై రెండు బాటిల్స్ వుంచారు. వెళ్ళబోతూ, డాక్టరు గారు కుమార్తెను పిలచారు. దానికామె 'నాన్నా! ఇక్కడ నేనెందుకుండగూడదు? అందులో ఈమెకు తగిన సపర్యలు చేయటానికి ఎవ్వరూ లేరుగదా?'

"దానికి నా భార్య కొంచెం వుద్రిక్తురాలై, 'లేదు, లేదమ్మా! ఎందుకు మీరు, అవసరం లేదు. నాకు పని మనిషి వున్నది లెండి. ఆమె నన్ను కన్న తల్లిలాగ చూస్తుంటుంది' అంది. డాక్టరుగారు, కుమార్తెతో వెళ్లిపోతుండగా నాభార్య, 'మీరు ఇక్కడ ఎంతో సేపటి నుంచి, ఈ ఇరుకు గదిలోవున్నారు. వీరిని కాస్త బయటికి తీసికెళ్ళరాదండీ!' అంది.

"డాక్టరుగారు నావంక తిరిగి 'పదండట్లయితే. నదీ తీరానికి కలిసే వెళ్దాం' అన్నారు.

"ఆ సాయంత్రం నేను డాక్టరు గారింట్లోనే భోజనం చేసాను. తిరిగి ఇంటికి చేరుకోటంలో ఆలస్యం అయింది. నా భార్య తీవ్రవ్యథా సంభరిత మానసంతో వూగిసలాడుతున్నదని ఆమె పరిస్థితిని గమనించిన నా కవగాహనం అయింది. తీవ్రంగా కంగారు చెందుతూ 'ఏమిటి? బాధ తీవ్రంగా వుందా?' అని అడిగా నామెను.

"ఆమె జవాబు చెప్పే స్థితిలో లేదు. నా ముఖంలోకి దీనాస్యంతో చూచింది. ఘోరంగా ఉచ్ఛ్వాస నిశ్వాసాలు గొంతు నుండి నల్బు బయటున్నాయి. వెంటనే డాక్టరు గారింటికి కబురంపాను.

"మొట్ట మొదలు డాక్టరుగారి కేసంగతీ అంతు పట్టలా. చివరకు కంగారుగా 'అరే బాధ మరీ ఎక్కువైందా ఏంటి? అయితే మరి ఆ మర్దనపు ఔషధాన్ని పూయలేదా?' అంటూ డాక్టరు గారు టేబిల్‌మీద నీలి రంగు బాటిల్‌ను అందుకొన్నారు అది ఖాళీగా వుంది!

"వ్యగ్రత సూచనలు కనబరుస్తూ, డాక్టరుగారు నా భార్యను ప్రశ్నించారు. 'అరే! నీలి రంగు బాటిల్‌లో మందును పొరబాటున కడుపులోకి తీసుకోలేదు గదా! కొంపదీసి! ఏంటి?' ఆమె శిరః కంపనం చేస్తూ, 'అవున'ని మెల్లిగా అన్నది.

"డాక్టరుగారు స్టమక్ పంపును తీసికొనిరావటానికి ఇంటి వైపుకు పరుగెత్తారు. నేను స్మృతి తప్పి నా భార్య ప్రక్కమీద కొరిగాను!'

"తరువాత జబ్బుపడ్డ పిల్లవానిని శాంత పరుస్తూన్న తల్లిలాగ, నా భార్య నాతలను తన వక్షోజాల కదుముకొని, మృదుస్పర్శతో తన వూహలను నాకు తెలియ పర్చ ప్రయత్నించింది. విచారించకండి. అంతా మీ - నామంచి కోసమే. మీకు ఏ చీకూ చింతా లేకుండా హాయిగా జీవితం సాగి పోతూంటుంది. దాన్ని వూహించుకొనే నేను సంతోషంగా మరణిస్తున్నాను !' డాక్టరుగారు తిరిగి వచ్చేసరికి, నా భార్య తన గుక్కెడు ప్రాణాల్ని వదిలేసింది"

దక్షిణ బాబుగారు ఇంకొక్క గుక్కెడు మంచి నీళ్ళు తాగి "అబ్బా! ఏంతో వెచ్చగా వుందే"అంటూ వరండాలో అటూ ఇటూ పచార్లు చేసారు. కాసేపటికి తిరిగి గదిలోకి వచ్చి. కూర్చుని ప్రారంభించారు.

"మనోరమతో నాకు వివాహం జరిగిన రోజుల్లో పిమ్మట ఆమెతో మాట్లాడ ప్రయత్నిస్తే, గంభీరమైన చూపొకటి నాకేసి విసరేది. మానసంలో ఏదో అనుమానాస్పదమైన జాడ వున్నదని, తెలిసింది. అపుడే నాకు తాగుడు మీద మోజు పడ్డది.

"శరత్కాలపు ఒక సాయంత్రాన నదీ తీరానవున్న పూలతోట పరిసరాల్లో నేను, మనోరమ వాహ్యాళి జరుపు తున్నాం. మేం నడిచే మార్గంపక్క సరివీ చెట్లు బారులు తీర్చి వున్నయ్. మనోరమ అలసిపోయి పాలరాతి మీద చతికిల బడ్డది. ఆమెకు ఎదురుగా కూర్చున్నాను నేను. చీకటి మసగ్గానే వుంది. ఆకాశాన ఎక్కడో తారలు మిణుకు మిణుకు మంటున్నయ్.

"ఆ సాయంత్రం కొంచెం తాగి వున్నాను. అందు వల్ల నేమో అంతరంగం కరిగి పోతూంది. మసక చీకటిలో చెట్టు నీడల క్రింద వున్న మనోరమ, ఆమె శరీరం మీద రెపరెప లాడే వస్త్రాలు, మసగ్గా, అస్పష్టంగా అవు పిస్తున్నాయ్. అప్రయత్నంగా నా మనస్సులో అవ్యక్త మైన వాంఛ ప్రబలింది. ఆ చీకటిలో మనోరమ భ్రమ గొల్పే నీడలాగ, అందని వస్తువులాగ గోచరించింది.

"ఆకస్మికంగా సరివీ చెట్ల పైకొనలు ఎఱ్ఱగా మారినయ్. చంద్రుని చుట్టూ బంగారు రంగుగా మారి చెట్ల కొనలకు పైగా క్రమంగా వెన్నెల ప్రసరిస్తూంది, పాలరాతి మీద ఆసీనురాలై వున్న మనోరమ మీద ఆ వెన్నెల పడ్డది. ఆ క్షణంలో ఆమెను చూచి నాకు వుద్రేకం ఆగింది కాదు. దగ్గిరగా జరిగి, చేతులను నాలోకి తీసికొని 'మనోరమా! నీవు నన్ను నమ్మక పోవచ్చుగాని, నీ ప్రేమ నెన్నటికీ మరువను సుమా' అని అన్నాను. ఈ మాటలు ఇంతకు పూర్వం ఎవరి వద్దో అన్నట్లు గుర్తుకు వచ్చింది. ఆ సమ యంలో సరివీ చెట్ల కొనల మీదుగా, బంగారు అర్ధ చంద్రుని క్రిందుగా, ఒరసికొని ప్రవహిస్తున్న గంగానది అవతల తీరంకు పైగా. హాఁ , హాఁ , హాఁ హాఁ. అనే వికృతపు నవ్వు వినపడ్డది. అది హృదయాన్ని చీల్చివేసే నవ్వా. లేక ఆకాశాన్ని బ్రద్దలుచేసే శికమా అనే దాన్ని చెప్పలేను. దాన్ని వింటూనే స్మృతి తప్పి నేల కొరిగాను. తెలివి వచ్చి చూచు కొనేసరికి నేను, నాగదిలో నాపరుపు మీద వున్నానని తెలిసి వచ్చింది. ఏం జరిగిందని నా భార్య ప్రశ్నించింది. భయంతో వణికి పోయా, 'ఆకాశమంతటా నవ్వులతో మారు మ్రోగి పోవటం వినపడలేదా, నీకు? హాఁ , హాఁ హాఁ . హాఁ' అని అన్నాను. నా భార్య చిరునవ్వు నవ్వింది. 'నవ్వులా? అరె, ఏంలేదే! నేను విన్నదల్లా ఆకాశాన విసురుగా పోయే పక్షుల కూతలే, అయినా మీకు వూరకనే భయం పుట్టు కొస్తుంది'

"మర్నాడు మనోరమ చెప్పింది తెలిసికొన్నవాడ్నై యాను. కాని సాయంత్రమయేసరికి తిరిగి సందేహం వేసేది. మనోభ్రాంతిలో తిరిగి ఆకాశం మరొక్క సారి పెద్ద పెట్టున నవ్వులతో మారుమ్రోగి పోతున్నదనే గోచరం అయేది. ఈ మనో వికారం వల్ల నాకసలు పరి శ్రాంతి చేకూరేదేగాదు. అకారణంగా, అసలు ఇంటిని వదిలేసి కొంతకాలం వరకు నదిమీద ప్రయాణం సాగిద్దా మని, మనోరమను తీసికొని ప్రయాణం సాగించాను. నవంబరు వాతావరణం, నాలో భయంగూడ మొద టున్నంత లేదు. మళ్ళీ బాగానే వున్నాను.

"గంగానదిని వదలి, కోర్ నదిని దాట్తూ, చివరకు 'పద్మ'కు చేరుకొన్నాం. ఈ నది చూపులకు భయంక రంగా, భీకర సర్పం లాగు మెలికలు తిరిగి ప్రవహిస్తూంది. దానికి కొంచెం వుత్తరం దిక్కున వివిక్తంగా తెల్లని ఇసుక తీరాలు సూర్యవేడిమికి, కాంతికి ప్రకాశించెయ్. దక్షిణంగా మామిడి తోటలు చాలా వున్నయ్. పల్లెటూరు గూడ ఒకటున్నది.

"మంచి అనువైన స్థలాన్ని చూసి, అక్కడ బోటును కట్టివేశాం. ఒకరోజున బోటును అలానే వదిలేసి, ఎంతో దూరం నడిచి వెళ్ళాం. అస్తమిస్తున్న సూర్యకాంతి క్రమంగా నడలి పోయింది. కాసేపటికి ఆకాశమంతా

తెల్లని వెండిలాగ వెన్నెలతో మెరసిపోతూ, హాయిని గొల్పుతూ వుంది. సన్న, కమ్మని వెన్నెల అంతులేని తెల్లని ఇసుక మీద పడి అనంతాకాశాన్ని విరాజమానం కొల్పుచుండగ, అక్కడ మేం ఇద్దరమే వున్నామని, వుండి, నిర్మానుష్యంగా, పొలిమేరలు లేని స్వప్నసీమల్లో స్వేచ్ఛగా విహారం సల్ప వీలని భావించాను. మనోరమ ఎఱ్ఱటి వల్లెవాటు ధరించి, దాన్ని ముఖం మాత్రం కనబడే రీతిని నెత్తిమీదికి కప్పుకొని వుంది. నిశ్శబ్దం పెరిగి పోతూంది. చుట్టూ ఏకాంతం. అప్రయత్నంగా, మనోరమ తన మృదుహస్తాలతో నన్ను బంధించి వేసింది. ఆమె తన శరీరాన్ని, మనస్సును, జీవితాన్ని, యౌవనాన్ని, అంతా నాకు ఒప్పగించిందని స్ఫురించేట్టు నాకు మరీ దగ్గిరిగా వున్నది. 'ఇలాంటి అనంతాకాశం క్రింద ప్రేమించు కొన్న రెండు హృదయాలు కలుసుకొనే, నిలబడే చోటు న్నదా? అని నా హృదయంతో ప్రశ్నించు కొన్నాను. తిరిగి వెళ్లాల్సిన అవసరం లేనట్టు, అసలు ఒక నిత్య నివాసం లేనట్టు, వెన్నెల ఆవరించిన ఆ బ్రహ్మాండ వాతావరణంలో అంతంలేని మార్గం గుండా, బాధ్యతలు - ప్రతిబంధాలు, నుండి విడుదలయి, చేయికి చేయి కల్పుకొని విహారం సల్పుదామని అనుకొన్నాను - భ్రమించాను. "చివరకు, అలా నడచివెళ్తూ, ఇసుక దిబ్బలు చుట్టూ వుండి మధ్య నున్న ఒక కొలను చేరుకొన్నాం.

"నిశ్చలమైన నీటి మధ్య భాగంలో వెన్నెల పొడుగాటి కిరణం, మెరిసే ఖడ్గం లాగ చొచ్చు కొని వుంది. కొలను అంచున చేరి, మెల్లిగా చతికిలబడ్డాం. మనోరమ నా ముఖం లోకి చూచింది. వల్లెవాటు కాస్త తలమీద నుండి క్రిందకు జారిపడ్డది. నేను ముందుకు వంగి, ఆమెను ముద్దు పెట్టుకొన్నాను. ఆ సమయంలో ఏకాంతంగా, నిశ్శబ్దంగా, వున్న ఇసుక ప్రదేశంలో ఏ మూలనుండో 'ఎవరువారు? ఎవరు వారు? ఎవరువారు ' అని అంటున్నట్టు ధ్వని విన వచ్చింది.

వెనక్కి తిరిగాను. నా భార్య కొంచం కంపించింది. కాని మరుక్షణంలోనే ఆ ధ్వని మానవునిదీకాదు, మానవాతీతునిదీకాదు. బహుశా దగ్గరగా వున్న నీటి తోళ్ళ అరుపు లని వూహించుకొని, మనస్సులను స్థిమితం చేసుకొన్నాం.

భయం వీడి ఇద్దరం బోటు దగ్గరకు వచ్చాం. 'ఇప్పటికే ఆలస్యం అయింది. ఇక నిద్ర పోదాం' అని అన్నాను. మనోరమకు త్వరగానే నిద్ర వచ్చింది. నాకు నిద్ర అసలు పట్టింది కాదు. కాసేపటికి చీకట్లో ఎవరో మనోరమ పరుపుకాడ నుంచొని నిద్రిస్తున్న ఆమెకేసి సన్నని పొడుగాటి వేలును చూపిస్తూ, మెల్లిగా 'ఎవరువారు? ఎవరువారు? ఎవరువారు?' అని అంటున్నట్టు నాకుతోచింది.

"త్రుళ్ళిపడి లేచి, నిప్పుపెట్టెనందు కొని, లాంతరును వెలిగించాను. వెలిగించగానే, దోమ తెర గాలికి రెప రెప లాడ సాగింది. నాకాల్లో రక్తం గడ్డ కట్టుకు పోయింది. ముఖాన చిరు చమటలు పుట్టుకొస్తున్నాయి. హా, హా, హా, హా, అనే నవ్వు చీకట్లో ఇంకెక్కడో ప్రతిధ్వనించ సాగింది. ఆ నవ్వు ఇసుక తీరాలు పైగా, పల్లెలు, పట్నాలు, దేశాలు దాటి, ఇతర ప్రపంచాలు మీదుగా ప్రయాణం చేసి, చివరకు అనంతంలో కలిసిపోయి, సూచీముఖమై పోయింది. గాఢంగా చొచ్చుకుపోయే ఆ ధ్వని నెన్నడూ వినియుండలేను. చూసుండలేదుకూడా.

"చివరకు పరిస్థితి దుస్సహమై, లాంతరు నార్పేస్తే నిద్ర పట్టదనుకొని, ఆర్పేశాను. ఆ క్షణంలోనే నా దోమతెర దగ్గిరగా, చీకటిలో 'ఎవరువారు? ఎవరువారు? ఎవరు వారు?' అనే ధ్వని రావటం విన్నాను. హృదయంలో గూడ అవే మాటలు ప్రతిధ్వనించాయ్. బోటులోవున్న గడియారం గూడ, గంటలముల్లును మనోరమకేసి చూపుతూ 'ఎవరువారు? ఎవరువారు? ఎవరువారు?' అనే, గంటలు కొట్టినట్టు కనబడ్డది."

అని ముగించిన దక్షిణ బాబుగారి వంక నేను చూస్తే ముఖమంతా తెగ పాలిపోయి వున్నది. గొంతులో ఏదో అడ్డం పడ్డట్టు మాటలు రావటం లేదు. భుజాన్ని తాకుతూ, "కాసిని మంచి నీళ్ళు త్రాగు" అన్నాను. కిరిసిన్ లాంతరు మిణుకు మిణుకు మంటున్నదల్లా ఒక్కసారి ఆరి పోయింది. బయట వెలుతురుగా వుంది. ఒక కాకి కావు మంది. ఎక్కడో పక్షి కుహూ మంది. యింటి ముందు రోడ్డు మీద ఏదో ఎడ్ల బండి పస్తున్నట్టు మోత వినబడ్డది. దక్షిణ బాబుగారి ముఖం మీద యిందాకున్న విలక్షణాలు యిపుడు అకస్మికంగా మారిపోయాయి. దానిలో భయం తాలూకు జాడలేమి కనబడలేదు. అతని ముఖం మీద విలక్షణాలకు కారణం, అతను పొందిన భ్రాంతిపూర్వక భీతి భారం వల్లనేనని, రాత్రిపూట కనబడే దెయ్యాల మంత్ర విద్యకు అతను భయపడి పున్నందు వల్లనేనని, తెలిసికొన్నాను. వీడ్కోలులాంటిదేమి తెలుపకనే ఒక్కసారి లేచి నిలబడి వడిగా వెళ్ళిపోయారు.

మర్నాటి రాత్రి తిరిగి "డాక్టరుగారూ! డాక్టరుగారూ!" అనే పిలుపు వల్ల నాకు నిద్రాభంగ మయింది.

# చిన్న మొత్తములలో నిల్వ సేకరణ-

## ఆంధ్ర మహిళా సభలో కార్యాలయము.

చిన్న మొత్తముల నిల్వలు ప్రోత్సాహించి, ప్రభుత్వమువారి పంచవర్ష ప్రణాళికకు తోడ్పడు స్త్రీల ఉద్యమములో ఆంధ్రమహిళాసభ సభ్యురాండ్రు ఎక్కువగా తోడ్పడవలెనని నిశ్చయింపబడినది. ఇందు కొరకై, ఆంధ్రమహిళా సభ ఆవరణలో ఒక ప్రత్యేకమైన కార్యాలయము ఏర్పరుపబడును. ఇందు దైనిక కార్యక్రమాన్ని నిర్ణయించి, స్త్రీ సామాన్యములో యీ ఉద్యమాన్ని గూర్చి ప్రచారం చేయుటకు, నిల్వచేయదలచినవారికి తగు సలహానిచ్చుటకు, సభ తరపున కొందఱు యువతులు నియమింపబడుదురు. ఈ ఉద్యమంలో ఒక ప్రత్యేక ప్రతినిధిగా వ్యవహరించి, ధనము వసూలు చేయుటకు భారత ప్రభుత్వమువారు, ఆంధ్ర మహిళాసభకు అధికారమిచ్చియున్నారు. సభకు వచ్చిగాని, పోస్టు ద్వారాగాని అన్ని వివరములు తెలిసికొనవచ్చును,

ఇంకొక విషయము— మీరు కొనదలచిన సేవింగ్సు సర్టిఫికెట్లు సభ ద్వారా కొన్నయెడల సభకు 1¼% కమీషను వచ్చును. ఈ కమీషను సభయొక్క కార్యకలాపాలకై వినియోగించుకోవచ్చును. అందువల్ల మీరు నిల్వ చేయదలచిన మొత్తమునకు సభద్వారా సర్టిఫికెట్లు కొన్నచో, సభకు కూడా సహాయము చేసినవారగుదురు.

ఉత్సాహ వంతులైన సోదరీమణులు, యింత వరకూ సభద్వారా నిల్వ సర్టిఫికెట్లు తీసుకున్న మొత్తము రమారమి రూ. 22000/- ఇందు మూలముగా సభకు వచ్చిన కమీషను రూ. 275/- ఇంకా పెక్కుమంది సోదరీమణులు యీవిధముగా సభద్వారా సర్టిఫికెట్లుకొని సహాయ పడవలెనని కోరుచున్నాను.

అ. చన్నఘంటమ్మ,
కార్యదర్శిని.

# పలుకుబాట - తులసీదాసు

శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ

పరులకీర్తి మాపి ప్రాభవమునఁదన
పేరు పెంపుసేయ గోరు నెడల
మొదలి కీర్తిమాయు నదియుగాక భవము
మాసినను చెఱగని మచ్చయొదవు॥

అదిమి పట్టకున్న ఆకాశమెగసెడు
గాలి పడగబోలె ఖలుల ప్రకృతి
కష్టమైన నిలనె దుష్టు నిల్పవలయు
చనువునీయ తులసి సాహసమగు॥

మనసు క్లేశముడిపి మాయించి దురితము
రక్షయిడెడు వాడు రాముడొకడె
కాక పెరల వేడ నీకు శాన్తి గలదెః
వినవె తులసి పలుకు వెఱ్ఱి మనస॥

సజ్జనుండు మొనసి సత్కర్మ నేసేయు
దుష్టజనుడు సేయు దుష్ట కృతినె
అమృతమునకు వాసి ప్రాణరక్షణమందె
గరళయశము ప్రాణ హరణ మందె॥

చూచు విషముపోల్కి సుజనుడమృతమును
ఋతము నెంచు విషము రీతి ఖలుడు
అతి పవిత్రుడైన యగ్నిగాంచి రసము
దూరమేగు గాదె తులసి వినుము॥

పూవు నెడక తేటి పూవు రసము గ్రోలు
ఫలమునె తినివైచు పక్షికోలు
సుజనకుజనరీతి సుంత తెలియనింత
తులసి పలుకుబాట దెలిసి చనుము॥

చెడ్డపనులె మొనసి సేయు వాడెప్పుడు
తనదు పనిని దప్పు దలప లేడు
పాచి కూడె దినెడు వాడు దుర్గంధమున్
దెలియ జాలడనుచు దులసి పలుకు॥

ఎల్ల యంగకముల, నేకరీతిని దన్ను
జిహ్వయటుల నింటఁ జిన్నపెద్ద
నరయవలయు సమత యజమాని యనియెడు
తులసి పలుకు బాట దెలిసి చనుము॥

సలలితగుణ దోష సంకులమౌ సృష్టి
సేగి విడచి గుణము సేకొనదగు
వారి విడిచి యంచ పాలనె గైకొను
తులసి పలుకు నుడి దెలిసి కొనుము॥

ప్రల్లదనముఁ బోసి బవరమునను బంటు
శూరవిధిని నెదిరి గ్రుక్కజేయు
నిటికి రిపులుదాయ దీనము లేపల్క
తులసి పలుకు బాట దెలిసి చనుము॥

జలదమఖిలతాప శమనాప్తి వర్షించు
ఒక్క జొన్న పండకున్ననేమి?
స్వామి సకలసృష్టి సత్కృపమునుచును
కొలువకున్న నేమి ఖలుడొకండు॥

పరుల వచ్చుటాచి భగ్గున మండును
నిప్పులేకయుండు నీచజనుడు
పరపరోపకార భాగ్యహీనునిగాగ
దలపవలదె వానిఁ దులసి దెలియు॥

ఎవరి కనుల హర్షమొలయదో నినుజూడ
ఎచట గౌరవమ్ము నెసగదచటు
కాలిడ జనదు కనకమ్ము గురియుగాక
తులసి పలుకు బాట దెలిసి చనుము॥

తనకు హితము కలుగ దగు కర్మమొనరించి
తనకుదాగుబీయని తలప జనునె
పరులమేలు సేయఁ బన తెలిసి యొసలు
సుజను దనగజెల్లు చూపె దులసి॥

మనసు వికృతి మునిగి మాయల బన్నగ
విరసు ముండనమ్ము సేయనేల?
అతుల సుఖము గోరి యతివి రాగొరెదేఁ
దలపు తెగగఁగోసి మెలగవలయు॥



# హాస్యానందం

## ములగ - రామ ములగ

* శ్రీ జమలాపురపు శేషగిరి రావు *

అపరబ్రహ్మ విశ్వామిత్ర రాజర్షిగారు నాకు సృష్టికర్త. ఆ మహనీయుని వరప్రసాదిని, కాబట్టే మహత్తర మైన దానినని మహదాశీయులు మెచ్చుకుంటారు. "రా" యని నోరు తెరుచుటవలన దేహ కల్మషాలు నోటిద్వారా బయటికి పోతాయి. "మ" యనేసరికి పెదిమలు రెండు కలుసుకొని నోటిద్వారం బంధించ బడటంవల్ల బయటి కల్మష్మాలు లోపలికిరావు. తరువాత "ములగ" యంటం వల్ల 'లాలాజలరసాలు' వూరుటకు నాలిక, దవడలు కదులుతాయి. అందుకని స్వచ్ఛ జీవనం కావాలనుకొనే వాళ్ళు నన్ను వాడుతూ వుంటారు. నా పేరింతకీ తమకు తెలిసినా, నా వంశాచారానికి వెరచి, చప్పున చెపుతున్నా "రామములగ" అంటారు. నా ప్రతిభ బ్రహ్మాండంగా విదేశాలలోకూడా వైభవంతో వెలుగుతున్నదని నాకేమీ గొప్పదనం లేదు. ఎందుకనంటే "ఇంటగెల్చి రచ్చగెలవాలన్న" సూత్రం. నాపని అల్లావుందో లేదో అనుమానంగా వుంది. యూరోపులు బాగా నన్ను ప్రేమిస్తారు, చూడటమే తడవుగా అమాంతంగా అట్టే తీసుకుంటారు. కానీ, మనదేశంలో వారు అంత ప్రేమగా చేరదీయరు. ఎందుకని చేరదీయరండీ యని అడిగిన ప్రశ్నకు సమాధానమిస్తూ "యూరోపియనులకు, పొరు గింటి పుల్లకూర రుచి" యన్నారు. ఇది మెట్ట వేదాంతం. 'ఏదారీ దొరక్కపోతే గోదారి', 'ఏవంకా లేక పోతే నెలవంక' లాగా వుంది వీళ్ళపని.

యదార్థం ఎవ్వరూ వినిపించుకోరు. నిజం ఒక్క ముక్కలో చెపితే నమ్మరాయె. అబద్ధం బాగా నచ్చజేసి చెపుతే చప్పున నమ్మేస్తుంది లోకం. సత్యాన్ని మరుగు పరచి, యెదుటివారి ప్రభావం రూపుమాపి, తమ ప్రఖ్యాతి కోసం నాలుక బుజాలన వేసుకొని బయలుదేరుతారు ప్రగ ల్భాలతో. ఈ రకం ఎందుకో అర్థంకాదు. ప్రేమ - ద్వేషం, రాత్రి - పగలు, కోపం - తాపం, యిల్లా ఒకదాని వెంట మరోదాన్ని కల్పించటం బ్రహ్మ ప్రతిభో, లేక అపర బ్రహ్మ సాజమో అర్థం కావటం లేదు. చూడబోగా నా పుట్టుక లాగేవుంది. 'గుడ్డువచ్చి పిల్లని ఎక్కిరించినట్లున్న' దంటారేమో నన్ను. ఈ జంటపోలికలను వెక్కిరిస్తున్నం దులకు. ఏమంటే 'ములగ' నా పేరులో నుంచి వచ్చిందే, నూతన కవిత్వం పుట్టవిస్తునట్లు. అంటే నవకవిత్వం వ్రాసే నవకవులు భావకవులు, ఐడియామీద ఐడియాచేసి పూర్వకాలంనాటి తాతముత్తాల కాలాల్లో మూరు మూలన వున్న పద్యాలను, కథలను, వ్యాసాలను తస్కరించి మొదలు చివర వీలయితే మధ్యమధ్య, మార్పులు జేసి వ్రాసి తమ ప్రతిభ చూడమంటారు. సంపాదనకు - రచనకు తేడా లేమిటో తెలియ కుండా, పాపం శ్రమపడి క్రింద చక్కగా నగిషీ చెక్కడాలతో, ముడిముడి అక్షరాలతో బ్రహ్మవ్రాత సంతకం లాగానో, విడివిడి అక్షరాలతో విష్ణు చేవ్రాతగానో, గొలుసుకట్టు అక్షరాలతో మహేశ్వరుని సంతకంగానో పెడతారు, ముద్రయితే తమ ప్రతిభే

కారణం అంటారు. కాకపోతే ఆ పత్రికలో ఏదో ఒకని మారుపేరు చూసి అదే కలం 'Pen Name' (పెన్ నేమ్) అంటారు సహజంగా. అమూర్తాన్ని యీ నిజం బయట పెడితే, ఎవరికే బుద్ధులలవాట్లో, వాళ్ళకే పుట్టాలి యీ వుద్దేశ్యాలు అంటారు ఘరానాగా.

"వ్రాసినవ్రాతయే మరల వచ్చిన భావమె వచ్చుచుండమే
కాసర కూసుమైన శతకమ్ముల నోమతిలేని గీతికా
వ్యాసమునో సృజించి కవినంచును చెల్వగ...."

అని యిటీవల భారతిలో ఒక మేధావి వ్రాసిచ్చినట్లు, నూతనత్వంకై పాటుపడని యీకళాసారస్వతము యిలా వుంటే, సారస్వత సేవకులు సాగదీస్తే మాత్రం సమకూరుతుందాయని సందేహం. ఇంతకీ నాలోనుంచి పుట్టిన ములగ అయినా పోనీ ముక్తసరిగా వుందా అంటే అదెక్కడా కనపడదు. సరిగదా నాకే ఎసరు పెడుతోంది. చూడండి న్యాయం. పోనీ అని వూరుకోదామె పాడుబుద్ధి. కల్పించు కుందామా కాపురుషలక్షణం అంటారు. అయినా సత్యానికి యెదురు లేదని,

'ధీరుల్ విఘ్ననిహన్య మాన్యులగుచున్ ధృత్యున్న
తోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమ ప్రజ్ఞానిధుల్ గావునన్'

అన్న భర్తృహరి వారి భావనాయూహంతో మావూరి ఎలక్షన్ అభ్యర్థిలాగా బయలుదేరాలని వచ్చింది. ఏమంటే ఎలక్షన్‌లో ఒక గొప్ప రహస్యం వుంది. ఒకరు ఎదుటి అభ్యర్థిని గురించి లంచగొండి అనో, [illegible] నో చెప్పేసరికి ప్రత్యర్థి తను కానో కానోనని బజార్లలో పదేపదే చెప్పుకుంటూ వుంటం తటస్థించటం వల్ల వోటింగ్ క్యాన్‌వాస్ చాలా తగ్గిపోతుంది. కాన వానిలాగ కాక మెలకువతో ప్రవర్తించే నన్ను, నాజ్ఞాతి ములగను విచారించి మా బడాయిలు విని లడాయిలు తీర్చండి.

'ములగ కాడ' లంటే మూలనున్న పిల్లలు కూడా మీది కెగబడతారు. ప్రేమగా మధుర రసాన్ని మదింప చేస్తారు నిజానికి. కాని యీ చెట్టు మహా ద్రోహం చేస్తుందంటాను. ఎఱపెట్టి హింసకు పూనుకునే వేటగాళ్ళ మాదిరి, ములగకాడల కోసం చెట్టుమీద కెక్కితే దాని మోసం చూడండి. యింత అణుసూ పెణుసూ వున్నవాళ్ళ వుపయోగం ఎంత వుత్తమమో తమకే తెలుసు.

ముష్టులకు నీడగా వున్న 'ములగ' చెట్టును నమ్మటం యెంత ముప్పుకు దారి తీస్తుందో వేరే చెప్పనక్కరలేదు. గొంగళీ పురుగులు ములగను ఆధారంగా చేసుకునే విషయం, అవి మన దేహాలపై ప్రాకటం వల్ల బొబ్బలు, దద్దులుగా బయలుదేరటం మనకు తెలియని క్రొత్తేమి కాదు. దాన్ని యిళ్ళల్లో వుంచని పెద్ద మనుష్యుల నడగండి. వివరంగా విమర్శిస్తారు. ఏమో పోనీ చూద్దాం ఒక్కసారి. నిజం నిలకడమీద, స్వానుభవం మీద బాగా ఋజువవుతుందని మొన్ననే దాన్ని పరిశీలించి ములగ కాడను రుచి చూచిన బుద్ధిమంతుడిలా అన్నారు. "ములగ ముప్పులను పుట్టిస్తుందన్నమాట కొంత నిజం కావచ్చు. ములగ కాడను సాంతం తినలేము. [illegible] గూడాను. దాని ఒక వైపు కండ మాత్రమే మనము వుపయోగించ వీలవుతుంది. తతిమా కాడ వృధా. రామములగ అన్ని విధాల అపురూపమైన వస్తువు. చౌకగా వచ్చింది గదా! యని ములగను కొనటం మంచిపని గాదు. "చౌక" వస్తువు సులభంగానే వున్నా విలువ చౌకగానే వుంటుందని అందరికి తెలిసిన విషయమే."

సైన్సు శాస్త్రజ్ఞాన పరిశోధక మహాశయులు నాలో 'ఎ' విటమిను వుంటంవల్ల రేచీకటి లాంటి నేత్ర రోగములు నాశనమౌతాయని, 'సి' విటమిను వుంటంవల్ల స్కర్వీ వ్యాధి నివారణమై, కండపుష్టి, దేహ దార్ఢ్యము [illegible] కలుగుతాయని చెప్పారు.

కాబట్టి మా మా గొప్పదనాలు మీ ముందు మేమే ప్రకటించటం అవివేకి లక్షణ మౌతుందని భావించటం వల్ల, నా వుపయోగం మీరు బాగా పరిశీలించి తప్పక నన్ను వుపయోగించి భాగ్యవిధాతలై భావి పౌరులను ఆదర్శ భారత భాగ్యమూర్తులు గావలసినదిగా కోరుతూ, మళ్ళీ పునర్దర్శనంలో తమ సముక్షం మా పక్షంగా వుండాలని ఆశిస్తూ వినయంగా విమర్శిస్తూ విరమిస్తున్నాను.

మీ శ్రేయోభిలాషి
'రామ ములగ'

# గురువుగారికోసం!

శ్రీ పిళ్లా సుబ్బారావ్ శాస్త్రి

అదొక చిన్న గ్రామం. ఆ గ్రామంలో సమస్త విద్యలూ వచ్చినవారు స్వామిజీ. అతని ప్రియ శిష్యుడు సుబుద్ధి వుండేవారు. సుబుద్ధి పేరుకు తగినట్టూ మంచి బుద్ధిమంతుడూ, తెలివిగలవాడూ, దూరాలోచనపరుడున్నూ.

స్వామీజీగారు ఒక నాడు ఒక చిత్రాన్ని చిత్రిస్తున్నారు. అతనికి ప్రియ శిష్యుడయిన సుబుద్ధి సహాయం చేస్తున్నాడు.

"గురూ! ఆ కొలనులో ఒక్క హంస అయితే బాగుండదు. జంట హంసలయితే బాగుంటుంది—ఇక్కడ ఎరుపు రంగు వుపయోగిస్తే బాగుంటుంది." అని చిత్రాన్ని గురించి స్వామీజీగార్కి తన అభిప్రాయాల్ని మధ్య మధ్య తెలియ బరుస్తూండేవాడు శిష్యుడు.

సాయంకాలం రావటం మూలాన, యింట్లో వెలుగు లేకపోవటం మూలాన చిత్ర పటాన్ని తీసుకు గురు శిష్యులు డాబాపైకి ఎక్కారు.

స్వామీజీగారు చిత్రాన్ని పూర్తి చేశారు.—సాధారణంగా పెద్ద పెద్ద చిత్రకారులు చిత్రం పూర్తికానిచ్చి, దూర దూరంగా పోయి చూస్తూ వుంటారు. అలానే స్వామీజీగారు చిత్రాన్ని దూర దూరముగా పోయి చూస్తున్నారు—డాబాకి పిట్టగోడలేదు. స్వామీజీగారు చిత్రకళా తన్మయత్వంలో ఆ సంగతి మరిచారు!— దూరదూరము పోతున్న కొలది చిత్రము మరింత ఆకర్షనీయముగానూ, అందముగానూ కన్పిస్తుంది!— స్వామీజీ తన పని తాను చేసుకుంటున్నారు!

ఇక మూడు అడుగులు కాని వేసినట్లయితే, గురువుగారు డాబా మీదనుండి క్రింద పడతారు! క్రింద పడినట్లయితే బ్రతకడం కల్ల!!

చిత్రం దగ్గరవున్న సుబుద్ధి యిది చూశాడు. గట్టిగా అరుద్దామనుకున్నాడు. కాని అరవలేదు!? ఎంచేతనంటారేమో. అరిచినట్లయితే గాభరాపడి గురువుగారు వెనక్కు వెళిపోతారేమో!— సుబుద్ధి దూరాలోచన గలవాడు కాబట్టి అరవలేదు. సుబుద్ధి కేమీ పాలు పోలేదు.

గబ గబా రెండు అడుగులు వేసినట్లయితే క్రింద పడి మరణించే గురువుగారిని రక్షించుటకై అక్కడే వున్న రంగుడబ్బా తీసి చిత్ర పటమునిండా చల్లేశాడు సుబుద్ధి.

ఇది చూసి గురువుగారికి వళ్ళు మండిపోయింది. అవును మరి- తాను అంతగా కష్టపడి వేసిన చిత్రం అలా పాడుచేస్తే వళ్ళు మండదూ!—

స్వామీజీ గబ గబా ఆవేశంతో వచ్చి సుబుద్ధిని వళ్ళు తెలీకుండా కొట్టేశాడు!

సుబుద్ధికి తర్వాత జబ్బు చేసింది!— ఎన్ని మందులిప్పించినా జబ్బు నయం కాలేదు!! సరికదా మరింత యెక్కువైయింది!!!

స్వామీజీ ఆ తల్లి దండ్రులులేని సుబుద్ధికి పరిచర్యలు చేశారు!- వైద్యులు లాభం లేదంటూ చెప్పేశారు!!! సుబుద్ధి "స్వామీజీ! మీరు నన్ను చిన్నప్పట్నుండీ పెంచి పెద్దవాణ్ని చేశారు! మీరు ఆ రోజు రెండడుగులు వెనక్కు వేసినట్లయితే మరణించి వుండేవారు! మిమ్మల్ని బ్రతికించేందుకుగాను నే నలా చేశాను!! మీరు ఆవేశంలో తొందరపడి నన్ను కొట్టేరు!!! అంతే!" అంటూ ప్రాణాలు విడిచాడు సుబుద్ధి.

స్వామీజీ కళ్ళవెంట జల జల కన్నీళ్ళు కారేయి. "ఇన్ని విద్యలు నేర్చి, యిన్ని గ్రంథాలు చదివిన నేను ఆనాడు పెద్దలు తొందరపడి ఏ కార్యము చేయరాదు అని చెప్పిన మాట మర్చిపోయాను. పెద్దలు చెప్పిన ప్రతీ అక్షరంలోనూ సత్యం వుంది!! తొందరపడి చేసిన పనివల్లనే కదా. సుబుద్ధి! ప్రియ శిష్యుడు!! నన్ను బ్రతికించినవాడు!!! మరణించాడు!" అంటూ దుఃఖించేడు స్వామీజీ.

స్వామీజీ సుబుద్ధిమీద వుండే మమకారం కొద్దీ అతని ప్రతిమ ఒకటి చేసి దాన్ని దగ్గర పెట్టుకొని ప్రతీ పనీ చేస్తూ వుండేవాడు.



# శాస్త్రిగారి తెలివి.

శ్రీ. అడవి కనకరాజు.

శారదయ్య శాస్త్రిగారు
శాస్త్రాలను చదివారు.
పెద్ద పెద్ద వాదములకు
పెండేరము లందేరు.

పొరుగూరిలో పండితులకు
భూరి వాదముందంటే
శారదయ్య శాస్త్రిగారు
శాలువాను కప్పుకొని.
నామ మొకటి తగిలించుక
నడకను సాగించారు.

పొరుగూరగపడగానే
పొలిమేరకు దగ్గరగా
పిల్లనగ్రోవిని వూదుతు
పిల్ల గొల్ల డొకడుండగ
వానిచేర జీరి శాస్త్రి
వరసగ నిట్లడిగాడు.
"వాడలోన ఎక్కడోయి
వాదముంట పండితులకు?"
"అయ్యా తమరేమైనా
అంతగొప్ప పండితులా?"
అని గొల్లడు శాస్త్రి నడుగ
"ఔ" నన్నాడాశాస్త్రీ.

"మావూళ్ళో గొప్పగొప్ప
మహా పండితులున్నారు
వారిని గెలవట మంటే
వారధి కట్టుటె వార్ధికి"

"చాలు చాలు లేవయ్యా.
సరిపోయిన పండితుణ్ణా"
"శాస్త్రిగారు మీరేమే
శాస్త్రాలను చదివారు?"

"ప్రతిశాస్త్రాన్ని నేను
పట్టిపట్టి చదివాను."
"అయితే నేనొక్క ప్రశ్న
అడుగుతాను శెలవీండి!"

గొల్లవాడు తనచేత్తో
గుప్పెడు ఇసకను చూపుతు
"అయ్యా ఇదిఎంతయుండు?"
ననగానే శాస్త్రిగారు.
సమాధాన మియ్యలేక
సరిగా తలగోకికొంటు,

"లోపలి ఇసకను ఎవరు
లెక్కవేసి చెప్పగలరు?"
విని యీమాటలు గొల్లడు
విరగబడుతు నవ్వేడు
"శాస్త్రాలను చదివారే!
సమాధాన మియ్యలేర?

ఇది గుప్పెడు ఇసకండీ!
ఇప్పుడైనా తెలిసికొండి!"
ఇది వింటున్నట్టి శాస్త్రి
ఇంటిముఖం పట్టాడు
"బుల్లివాడికింతైతే
బుధులెట్లా?" గనుకుంటూ.

—:o:—

# గోపి - శ్యామ

"శ్రీ శిల్పి"

శ్యామ కూనిరాగాలు తీస్తూ కొత్త మొక్క పెట్టటానికి పాదు తీస్తూంది. గోపీ వచ్చి వెనుక నుల్చున్నది కూడా గమనించనేలేదు. "చూడు యిందాకట్నుండీ తవ్వుతున్నావు. ఒక్క రెండంగుళాలన్నా పైకి రాలా. ఉండు నేను తవ్వి చూపిస్తాను ఒక్కక్షణంలో" అంటూ శ్యామల చేతిలో నుండి తవ్వగాల తీసుకున్నాడు గోపీ.

"అబ్బా నీవు మహా తవ్వేశావులే. గోపీ! యిదో దొంతరి మల్లి. మా సుగుణ యిచ్చింది. ఇక్కడ్నుండీ చూడు. యెన్ని మల్లెపూలు పూయిస్తానో!" అంటూ మురుసుకుంది శ్యామల.

"అబ్బబ్బ! మీ ఆడపిల్లలకి ఎప్పుడూ పూల గొడవే. నేను పెద్దవాడ్నయితే చూడు జపాను వరి పంట యెంత బాగా పండిస్తానో!"

"ఆడవాళ్ళేమిటి? నీకు తెలుసో లేదో స్విట్జర్లాండులో నట మగవాళ్ళు అల్లికలు నేర్చుకునే క్లబ్బొకటుందిట"

"వుష్! వాళ్ళొట్టి దద్దమ్మలై వుండాలి. అయితే"

"నీకు చేతకాకపోయినా అందర్నీ దద్దమ్మలంటావు నీవు"

"అలాంటి పనులు అసలు మనం చేయంగా" అంటూ చంకలు కొట్టుకుంటూ లేచేడు. శ్యామల మాట్లాడకుండా దొంతరమల్లి పాదులో పెట్టి చుట్టూ గట్టు కట్టింది. "శ్యామా" అంటూ పిలిచిన వాళ్ళమ్మ పిలుపు విని యింట్లోకి పరుగెత్తింది.

* * *

"యేం! శ్యామా, యివేళ నీవూ ఆలస్యంగా వస్తున్నావేం మీ స్కూల్లో ఆటలా?"

"లేదు గోపీ, మరేం..."

"ఊఁ చెప్పు. ఆగిపోయావేం?"

"నీవు అన్నిటికీ హాస్యం చేస్తావు. అందుకని"

"లేదులే. యీసారి చెయ్యనుగా"

"యేమీ లేదు. ఈసారి జరుగబోయే ముగ్గుల పోటీలకి మా స్కూలునుండి కొందర్ని పంపిస్తారట. ఈ రోజు ముగ్గులు వచ్చిన వారందరితో వేయించి అందులో బాగా వేసిన వాళ్ళని పంపిస్తున్నారు పోటీకి"

"నీవు పంపించే వాళ్ళ లిస్టులోకయినా వచ్చినట్లేనా?"

"ఇంతవరకు వచ్చినట్లే. ఆరుగురం వెళుతున్నాం మా స్కూల్లోనుండి. మా ఆరుగురిలోనే నాకన్నా బాగా వేసే వాళ్ళున్నారు. ఇంకా చాలామంది వస్తారుగా యీ పోటీకి"

"ఇవ్వన్నీ పనిలేని పనులు. లేకపోతే ముగ్గులేమిటి?"

"నీ పసలు యేపనీ పట్టుదలతో చేయలేవు. అసలు మొదలుపెట్టినా అది పూర్తి కానేకాదు. వెక్కిరించమంటే మాత్రం బాగా వెక్కిరిస్తావు. అందుకే అసలు నీకు చెప్ప నన్నది. ముగ్గులూ ఒక కళే తెలుసా?"

"అవునవును. వెక్కిరించనన్నాను కదూ? మరిచి పోయానులే. శ్యామా! మా యింటికి పోదాం రారాదూ?"

"ఇప్పుడు కాదు గోపీ, యిప్పటికే యీ రోజు ఆలస్య మైంది. మా అమ్మ పని చేసుకునే వేళ. తమ్ముడు యేడుస్తూంటాడు"

"ఉష్, నీకు తెగ ఓపిక బాబు. నాకు పిల్లలంటే చిరాకు"

"నీ వొక్కడివేగా మరి. చిరాకయినా నీకు సరి పోతుంది. అయినా మా చెల్లెళ్ళూ, తమ్ముళ్ళూ అంటే నాకెంతో యిష్టం. వాళ్ళు నాకొరకు యెప్పుడో యెదురు చూస్తుంటారు" అంటూ శ్యామ వాళ్ళింటి దగ్గర సందు వస్తే అటు దారి పట్టింది.

* * *

శ్యామల, గోపాలరావు దూరపు బంధువులు. గోపీ తండ్రి ఫిజిక్స్ ప్రొఫెసర్ గా చేస్తూ చనిపోయారు. చిన్నతనం నుండీ గోపిని వాళ్ళమ్మ రామాయమ్మ గారే యే లోటూ లేకుండా పెంచుకొస్తూంది. వాళ్ళకి సొంత వూళ్ళో ఆస్తి వుండటం వల్ల, గోపి ఒక్కడే కావటం వల్ల వాళ్ళ కుటుంబానికి యే లోటూ లేదు. గోపిని అల్లారు ముద్దుగా

పెంచటం వల్ల అంతగా యెవరి భయం లేకపోవటం చేత అల్లరిగా తయారవుతాడేమోనని వాళ్లమ్మకి కొంచం భయం. నిజానికి గోపి తెలివిగలవాడే. కొంచం తొందర మనిషి, అదీ కాక తనకేలోటూ లేకపోవటం వల్ల, ఒక్కడే కావడం వల్ల, యెదటి వాళ్ళ బాధలు అంతగా అర్ధంకావు. శ్యామల తెలివైన పిల్ల, నెమ్మది, ఆలోచనా వుంది. శ్యామల స్నేహం వల్ల గోపి తొందర పాటూ, కొంటెతనం తగ్గుతుందని రామాయమ్మగారు వాళ్ళిద్దరి స్నేహం ప్రోత్సాహిస్తుంటుంది. శ్యామలా వాళ్ళది సామాన్యమైన కుటుంబం. పొదుపుగా వున్నా అయిదుగురు పిల్లలవటం వల్ల అప్పుడప్పుడు కొంచం కష్టంగానే వుంటుంది. శ్యామలే పెద్ద పిల్ల. తతిమా వాళ్ళు యింకా చిన్నవాళ్ళే. ఇంట్లోవున్న సమయంలో తల్లికి సాయం చేస్తుంటుంది శ్యామల. జాలి, ఓరిమి శ్యామల సొమ్ములు. తల్లి తొందర పనిలో విసుక్కున్నా యెదురు చెప్పకుండా తనపని తాను చేసుకుపోతుంది.

* * *

ఒక ఆదివారం మధ్యాహ్నం అందరూ టీ తాగేక శ్యామల వాళ్ళమ్మతో అంది "అమ్మా! గోపీ వాళ్ళింటికి వెళ్ళొస్తానే"

"అవును, అన్నట్టు రామాయమ్మ గారింటికి నేనూ వెళ్ళి శాన్నాళ్ళయింది. ఈ మాయ పనుల్లో నాకు తీరదాయె. కొంచంసేపాగు నేనూ వస్తాను" అని పని మనిషిని పిల్లలకి సాయంగా వుండమని చంటి వాడిని తీసుకుని శ్యామలతో బయలు దేరింది. గుమ్మంలోనే గోపీ వాళ్ళ కుక్క యెదురై తోకాడిస్తూ స్వాగతమిచ్చింది. మిషను కుట్టుకుంటున్న రామాయమ్మగారు తలెత్తి చూచి నవ్వుతూ "రండి—రండి" అంది లేస్తూ. "ఏదో పనిమీదున్నట్లున్నారు?" అంది శ్యామల తల్లి. "ఏమీలేదండీ, మాగోపీ పుట్టిన రోజు వస్తుంది కదండీ, చిన్నవాళ్ళు సరదా కదా, పిల్లల్ని పిలుద్దామనుకుంటున్నా ఆ రోజు. వాడికి కొత్త బట్టలు కుడుతున్నాను." "నయమేనండీ, మగపిల్లల బట్టలు కూడా బాగా కుడతారు మీరు. నాకు ఆడ పిల్లలవేగాని మగ పిల్లల షర్టులూ అవీ కత్తిరింపు చేతకాదు. పైగా చేతికుట్టు, నా యింట్లో పనుల మీద యేది నేర్చుకుందామన్నా తీరదు."

"ఆ! యివి మాత్రం యేమంత కష్టం లెండి. అయినా నాకు బోలెడంత తీరిక. మీకు అయిదుగురు పిల్లల మీద తీరదు మరి. యెప్పుడైనా తీరిక చేసుకుని మా మిషన్ మీద కుట్టుకుని వెళ్ళండి. చేతికుట్టు మరీ ఆలస్యం మీకు. యేం! శ్యామా! ముగ్గుల పోటీకి వెళుతున్నావట కదూ? మావాడు అంటున్నాడు మొన్న. మీ శ్యామలయెలాగయినా బుద్ధిమంతురాలండీ, నెమ్మది కూడాను!"

"తన తరువాత నల్గురు పిల్లలున్నప్పుడు నెమ్మది కాక పోతే యెలా చెప్పండి. అయినా అది పుట్టక పుట్టక పడితే గట్టి పట్టే పడుతుంది లెండి!"

ఈ చివరిమాట వస్తున్న గోపీ చెవిన పడింది. "అది కాదే అమ్మా, మీరంతా శ్యామ నెమ్మది, నెమ్మది అంటారు. కానీ నాతో ప్రతి దానికి వాదిస్తుందే. మీ దగ్గరే నెమ్మదిగా పిల్లిలా వుంటుంది" రామాయమ్మగారు నవ్వుతూ "అవును నీలాంటి పెంకి వెధవ దగ్గర మెత్తగా వుంటే యెలాగు? శ్యామ తెలివైంది" అంది. దాంతో "ఊఁ ఊఁ" అనుకుంటూ గోపీ అక్కడ్నుండి వెళ్ళిపోయాడు. శ్యామ గోపి వెనకే వెళ్ళింది. రామాయమ్మగారు, శ్యామ తల్లి వాళ్ళ సంసార గొడవల్లో పడ్డారు.

* * *

శ్యామ వాళ్ళ చెల్లి చిట్టితో [illegible] నవ్వుతూంది. గోపి శ్యామని వెతుక్కుంటూ అక్కడికే వచ్చాడు. ఈ గోపీ శ్యామని బాగా యేడిపించాలన్న సరదాతో వస్తున్నాడు గోపి. శ్యామ ముఖంలోకి చూస్తూ "అమ్మాయిగారి మొహం ఈవేళ అమావాస్య చంద్రుడులా ప్రకాశిస్తుందేం? నాకు తెలిసిందిలే మా కమలం చెప్పింది. మీ ముగ్గుల పోటీలు..."

"అవ్వన్నీ నిన్నెవ్వరూ యెత్తి పొడవమన్లే. ఆనాడే చెప్పేగా, నా కంటే బాగా వేసేవాళ్ళున్నారని. నేనే మొదటి దానిగా వస్తానని నే నేమీ గొప్పలు చెప్పుకోలేదు. నీవే యిలాంటి పోటీల్లో పాల్గొంటే చివరి నుండీ మొదటి వాడుగా వస్తావు"

"ఓ, మనం వెళ్ళితేగా?..."

"నీవసలు మొదలూ పెట్టవు, పెట్టినా పూర్తి చేసే పట్టుదలా లేదు" అందే కాని నిజంగా గోపి యేదయినా చేయా

లనుకుంటే తెలివి తేటలూ సమర్థతా వుందనీ, గోపీకి అన్నీ మంచి వూహలు తడతాయనీ శ్యామకీ తెలుసు. గోపీ అనుకున్నాడు. 'శ్యామ నన్నొట్టి పనికిరాని వాడ్ననుకుంటుంది. నిజంగానే శ్యామకన్నా నాకు పట్టుదల తక్కువే. ఇంకనుండీ యే పనైనా పట్టుదలగా చివరి వరకూ చేయటం నేర్చుకోవాలి' మనస్సులో నిశ్చయించుకున్నాడు. కానీ శ్యామని యింకా యేడిపించాలన్న బుద్ధిమాత్రం పోలా. తనకి నచ్చిన పనులైనా సరే శ్యామల చేస్తూంటే వెక్కిరించటం గోపీ కొక సరదా. "పోనీగాని శ్యామ యింత చిన్న దానికే" "ఛవ్, నేనేం చిన్నబోలేదు. నీకాదూ చెప్పేదీ" శ్యామకి తను వోడిపోయినందుకు అసలు విచారంగా లేకపోయినా గోపీ చేస్తున్న గొడవకి కొంచం కోపం వచ్చింది. అసలు యీ సంగతి గోపీకి చెప్పటం తనదే తప్పనుకుంది. ఈ సారి ఏ పోటీకి కూర్చున్నా గోపీకి ఒక్క పిసరైనా చెప్పకూడదనుకుంది. శ్యామ ఆలోచిస్తూంటే గోపీ తెగ వాగేస్తున్నాడు. ఇంత సేపూ తానే మాట్లాడేస్తున్నట్లు గుర్తొచ్చి "శ్యామా... శ్యామా...... మూగనోం పట్టేవులా వుందే? పైగా చిన్నపోలేదంటావేం?" దాంతో శ్యామకి అభిమానం ముంచుకొచ్చి మామూలు ధోరణిలో మాట్లాడ్డం మొదలు పెట్టింది. గోపీ, "శ్యామా రేపు మనం సినిమాకు వెళదామా?" అని అన్నాడు.

"అమ్మని కనుక్కుంటా. కాని వీళ్ళు ఎన్నాళ్ళనుంచో పిల్లలకి వేరే సినిమాలు తీస్తే బాగుంటుందంటారు కాని ఆ పని యెంతకీ చేయరు. మనకి సరిపోయే సినిమాలయితే బాగుంటుంది కదూ?"

"నిజమే మరి. యెప్పుడో తీస్తారు. చెప్పగానే చేస్తే యెలాగు?" ఈలోగా శ్యామ తమ్ముడు యేడుపు మొదలు పెట్టాడు. రేపు తప్పక వెళదాం అంటూ గోపీ యింటికి వెళ్లిపోయాడు.

* * *

కమలం, గోపీ పినతల్లి కూతురు. శ్యామతోనే ఫస్టు ఫారం చదువుతూంది. కమలంకి శ్యామ అంటే అంతగా పట్టదు, దానికి కారణాలూ వున్నాయి. తన అన్న అయిన గోపీ శ్యామ అంటేనే యెక్కువ యిష్టంగా వుంటాడు. శ్యామ స్కూల్లో అందరితోనూ మంచిగా వుంటుంది. యెవరికే సహాయం చేయాలన్నా ముందు వుంటుంది. అందువల్ల స్కూల్లో అందరికీ శ్యామంటే యిష్టంగా వుండుట కమలకి అంతగా గిట్టేదికాదు. అదీకాక తను శ్యామ కన్నా తెల్లగా వున్నా అంతా శ్యామనే కళగా వుంటుందనటం ఓర్వలేకపోయేది. రామాయ్ పెద్ది కూడా అదేమాట ! స్కూల్లో కూడ అసలు కమలకి ఓర్వలేని తనం అంటారు. రామాయమ్మగారు గోపీ పుట్టినరోజుకు పిలుపు కని చెల్లెలి గారి అమ్మాయి అవటంవల్ల కమలానికి కబురంపించింది. తప్పని సరిగా శ్యామలా వాళ్ళింటికూడా పిలుపుకు వెళ్ళవలసి వచ్చింది కమల. దానికి తగ్గట్లు, శ్యామ యింట్లోలేదు. వాళ్ళమ్మ వచ్చి చెప్పింది. "గోపీ సినీమాకు వెడదామన్నాడట. మా శ్యామ 'జ్యూ' కివెళ్ళాలని, యిద్దరూ వుదయం వాదించుకుంటున్నారు. చివరికి 'జ్యూ'కి వెళ్ళి చాన్నాళ్ళయిందని అక్కడికే వెళ్ళారు. అడక్క అడక్క అడిగితే వాళ్ల నాన్నగారు కాదనరు. వచ్చే వేళయింది కూర్చోమ్మా. నీ మెళ్ళో పతకం బాగుంది, యెక్కడ చేయించారో?" అందావిడ. దానికి కమల గొప్పగా "మా నాన్నగారు ఢిల్లీనుండి తెచ్చేరు. చాలా అయింది. నాకు తెలీదు" అని బింకంగా అంటూండగా శ్యామా, గోపీ రానే వచ్చేశారు. గోపీ అందుకుని "అదేమిటే చెల్లాయ్ పిన్ని క్రిందటి నెలలో యిక్కడేగా కొంది" అనేశాడు. దాంతో కమల ముఖం యెర్రబడిపోయింది. గోపీని మనస్సులో తెగ తిట్టుకుంది. శ్యామ ముందు అంత పరాభవం జరగటం భరించలేక పిలవటంకూడా మరిచిపోయి అక్కణ్ణుండే పరుగు తీసింది. గోపీకి తన పుట్టినరోజు పిలుపుకి కమలం వచ్చిందని గుర్తొచ్చి రేపు తప్పక రావాలని శ్యామకి చెప్పి వెళ్లిపోయాడు.

గోపీ పుట్టినరోజు, శ్యామలకి యెంతో సరదాగావుంది. గోపీకని మధ్యలో గులాబీపువ్వు పెట్టి చుట్టూ దొంతర మల్లి చేర్చి అందంగా ఒక గుత్తి తయారు చేసింది చేతిలో పట్టుకునేది. తాను యిదివరకే టేబుల్ బట్ట ఒకటి కుట్టి వుంచింది. అది కనిపించక పోవటంవల్ల వెతికి తీసికెళ్ళేసరికి కొంచం ఆలస్యమైంది. రావలసిన వాళ్ళంతా వచ్చేసి వున్నారు. గోపీ స్నేహితులు కూడా వచ్చారు. ఇంకా

శ్యామ రాలేదని యెదురుచూస్తున్న గోపీ యిప్పటికయినా వచ్చినందుకు సంతోషించాడు. కాని పైకి మాత్రం "ఇంత ఆలస్యంగా వచ్చేకన్నా మానీ లేకపోయావూ!" అన్నాడు. "ఈరోజుకూడ వాదమేమిటిరా!" అని వాళ్లమ్మ సర్ది చెప్పింది. శ్యామల తాను తెచ్చిన పూలగుత్తి గోపీ చేతి కిచ్చి, టేబుల్ బట్ట బల్లమీద పెట్టి వచ్చి కూర్చుంది. రామాయమ్మగారు రుచిగా తయారుచేసిన ఫలహారాలు అందరూ కబుర్లు చెప్పుకుంటూ తినటం మొదలుపెట్టారు. గోపీ స్నేహితులు యెన్నో నవ్వించే సంగతులు చెపుతూ అందరినీ నవ్విస్తున్నారు. అందులో ఒకడికి అందరూ చేరి తెనాలి రామలింగడని సార్థక నామం పెట్టారు. అతడు మాట్లాడే ప్రతీమాటా అందరికీ నవ్వు పుట్టిస్తుంది. అంతా తినటం పూర్తయ్యాక గోపీ స్నేహితుల్లో ఒకడు మురళీ వాయించాడు. సినీమా పాటలు, భావ గీతాలు చక్కగా మురళీ మీద వాయించాడు. ప్రక్కయింటి అమ్మాయి కర్ణాటక సంగీతం నేర్చుకుంటోందట. కంఠమంత బాగుండ లేకపోయినా లయ తాళం తప్పకుండా త్యాగరాజు కీర్తన పాడింది. కమలం స్కూల్లో డ్యాన్సు నేర్చుకుంటూంది. బాగానే చేస్తుంది కూడాను. గోపి చెయ్యమన గానే లేచి భరతనాట్యం చేసింది. పెద్దజరీ పరికిణీ కట్టుకుని పాపిడి బిందలు, చక్కని నగలు పెట్టుకుని కమల నృత్యం చేస్తూంటే శ్యామ చాలా బాగుందనుకుంది. కమలానికి నిన్న జరిగిన పరాభవం ఫలితంగా శ్యామతో యింత వరకూ మాట్లాడలేదు. అయినా శ్యామ అలాంటి వాటిని పాటించదు. నృత్యం అయిపోగానే కమల దగ్గరకు వెళ్లి "ఈమధ్య నీ నృత్యం చూడలేదు కమలం. బాగాచేశావు" అని మెచ్చుకుంది. గోపీ యింతలో "శ్యామా, నీవు తప్పించుకుందామను కుంటున్నావులావుంది, అదేమీ కుదరదు. నీవూ పాడాలి" అన్నాడు. శ్యామలకి యిందరిలో పాడాలంటే సిగ్గుగావుంది. అయినా తప్పలేదు. చివరికి నెమ్మదిగా తనకి చిన్నప్పుడు అమ్మ నేర్పిన పాట యెత్తి,

"మురళీ కృష్ణుడు పుట్టినప్పుడు,
విరుల వానలే కురిసినవీ,
మురళీ కృష్ణుడు నవ్వినప్పుడు,
తరపి వెన్నెలలు కురిసినవీ..."

అంటూ పాడింది. "గాత్రం బాగుందమ్మా, భయపడేవనికి? గాత్రం యింకా విప్పి పాడితే బాగుంటుంది" అని రామాయమ్మగారు అంది. [illegible] ప్రోగ్రాం వేసుకున్నారు, అప్పటికి అంతా సినిమాకి వెళ్లాలని లేచారు. అంతా అను కున్నట్లు సంతోషంగా గడిచిపోయింది. [illegible] ముందే యెవరి యింట్లకు వాళ్లు చేరుకున్నారు. [illegible] రాగానే చెల్లెళ్ళనీ, తమ్ముళ్ళనీ చేర్చుకొని [illegible] పూసగుచ్చినట్లు చెప్పింది. తన భాగం [illegible] కొరకు పట్టుకొచ్చినవి వాళ్ళందరికీ పంచిపెట్టింది. దాంతో వాళ్ళూ గోపీ పుట్టిన దినం [illegible] పోయారు.

* * *

ఈ మధ్య పరీక్షలవటం [illegible] చూడ్డంపడలేదు. పరీక్షలయ్యాక [illegible] యింటికి బయలుదేరింది. గోపి తన గదిలో లేడు. [illegible] గార్ని వెళ్ళి అడిగితే "వాడొక్కడే [illegible] పోతున్నాడమ్మా. వాణ్ణి యేమీ అనక, [illegible] పాడు చేసింది. ఆయన పోయిన దగ్గర నుండీ ఆయన [illegible] తీయకుండా ఆయన గదిలోనే వుంచేశాను. వాడు ఆ [illegible] తాళాలు [illegible]! అందులో [illegible] బెడుతున్నాడు. ఆయన "[illegible]" [illegible]. ఇలాగయితే లాభం లేదని [illegible] చెప్పాను. దాంతో సాయంత్రం [illegible] లేడు. దొడ్లో వున్నాడేమో చూడమ్మా" అని [illegible] చెప్పింది. తోటలో గోపీ [illegible] బాగా తెలుసు. తోటలో [illegible] కనిపించాడు అనుకున్నట్లుగానే. [illegible] అంత శ్యామల "యేమండీ! [illegible] ను పరిశోధిస్తున్నారటగా!" [illegible] చిట్లించి కోపంగా చూశాడు. "[illegible] గోపీ, [illegible] గారి గదిలో అంత పనేం వచ్చింది నీకసలు? [illegible] యేదో ఒకటి [illegible] నీ పని"

"ఉష్, నిశ్శబ్దంగా యిక్కడ [illegible] నలా" అని గర్జించాడు. శ్యామల అనుకుంది యిలాంటి సమ

యంలో ఆవిషయం మళ్ళా యెత్తటం మంచిదికాదని, తరువాత కనుక్కోవచ్చు, ముందు పాపం ఆకలి వేస్తుందిలా వుంది అని ఆలోచించింది. ఇంకా యేవేవో సంగతులు చెప్పి ఆ విషయం మరిపించివేసింది. "మా యింటికి పోదాం గోపీ" అంది. కొంత సేపటి వరకూ అమ్మ, కళ్ళకి దూరంగానే వుంటే మంచిదని గోపీ కూడా వెంటనే సరే అన్నాడు. శ్యామ తల్లి నైవేద్యానికి చేసిన పాయసం తెచ్చి గోపీకి పెట్టింది. "నాకాకలి లేదు శ్యామా" అని తప్పించుకోబోయాడు. కాని శ్యామ తల్లి వచ్చి "తప్పు నాయినా, దేవుడి ప్రసాదం వద్దన కూడదు" అనటంతో అసలే ఆకలిగా కూడా వుండటం వల్ల యింక వద్దన కుండా తినేశాడు. శ్యామ వాళ్ళమ్మ వచ్చి అందుకున్నందుకు లోలోపల సంతోషించింది.

* * *

పరీక్షలయినా కాదు, యెందువల్లో శ్యామ అసలు కనిపించటం లేదనుకున్నాడు గోపీ. తానేమో సాయింత్రం స్కూల్లో ఆటలవల్ల చాలా ఆలస్యంగా వస్తున్నాడింటికి. శ్యామ యింటికి వెళ్ళటమే పడటం లేదు. ఆటలని వుండకుండా నయినా సరే యీ రోజు శ్యామ యింటికి వెళ్ళాలనుకున్నాడు. శ్యామ యింట్లో పాపం అంతా దిగులుగా వున్నారు. వాళ్ళ చిన్న చెల్లి చిట్టికి జ్వరం, విరోచనాలట. శ్యామకి చెల్లెళ్ళు తమ్ముళ్ళు అంటే యెంతో ప్రాణం. దీంతో దిగాలుపడి కూచుంది. చాల నీరసంగా వుంది చిట్టి, మూసిన కన్ను తెరువకుండా పడివుంది. "మీ డాక్టరు మంచివాడేనా?" అన్నాడు గోపీ శ్యామతో. "మంచివాడే నయ్యా, కానీ డాక్టర్లు చెయ్యగలిగినంత చేస్తారు, ఆపైన దేవుడే వుండాలి" అంది శ్యామ తల్లి దిగులుగా చిట్టి వైపు చూస్తూ. గోపీకి యేమీ తోచలేదు. "పోనీ మా డాక్టరు గార్ని కూడా కబురు పంపమని అమ్మతో చెబుతానండీ" అన్నాడు. "యెందుకులే నాయనా" అంది ఆవిడ. ఇంతలో శ్యామ నాన్నగారు డాక్టరుతో సహా అక్కడికి వచ్చారు. డాక్టరుగారు చిట్టిని పరీక్ష చేసి "రేపు గడవాలండీ" అంటూ మందిచ్చి వెళ్ళిపోయారు. శ్యామ వాళ్ళమ్మకి కళ్ళల్లో నీళ్ళు తిరిగినై. అది చూచి శ్యామ మరీ ఆశ్చర్యపడిపోయింది. గోపీ వెళ్ళేక వాళ్ళమ్మతో చెబితే "అయ్యో! మనకి తెలియనే లేదు. ఈరోజు యెలానూ చీకటిపడింది. రేపు వెళదాం" అంది. రెండో రోజు రామాయమ్మగారు, గోపీ కలసి శ్యామ యింటికి వెళ్ళే సరికి అంతా అయిపోయిందని తెలిసింది. ఇల్లంతా బోసిపోయినట్లుంది. యెక్కడివాళ్ళక్కడే కూర్చుండి పోయి వున్నారు. శ్యామ యేడ్చి యేడ్చి నీరసంగావుంది. చిట్టి మాటలూ, ఆటలూ గుర్తుకు వచ్చి శ్యామ వెక్కి వెక్కి యేడుస్తూంది. రామాయమ్మగారు, గోపీ వాళ్ళని యెంతో ఓదార్చారు. గోపీకి పిల్లలంటే యెప్పుడూ పట్టనిది చిట్టి చనిపోయాక చిట్టంటే తనకీ ప్రేమేనని తెలుసుకున్నాడు. "గోపీ! లా" అంటూ వచ్చీరాని చిట్టి ముద్దు మాటలు గుర్తుకు వచ్చి మనస్సులో కలచినట్లయింది గోపీకి. శ్యామ ఆ తరువాత చాలకాలం వరకు కుదుటపడలేదు. చిట్టిని గుర్తుకు తెచ్చుకొని దిగులు పడుతూ వుండేది. శ్యామకి కొంచం స్థలం మార్చితేగాని యీ దిగులు కొంచం తగ్గదనుకుంది వాళ్ళమ్మ. పండుక్కి రమ్మని శ్యామ తాతయ్య వాళ్ళూరునుండి జాబు వ్రాశారు. శ్యామ పెద్ద పిల్లల్ని యిద్దర్నీ పంపాలనుకుంది. గోపీకూడా సెలవలేకదా అని గోపీని కూడా పంపించమని వాళ్ళమ్మ నడిగి ముగ్గురినీ కలిపి గుమాస్తాతో తాతయ్య గారూరు పంపించింది. శ్యామా వాళ్లు వచ్చేరని వాళ్ల బంధువుల పిల్లలూ వాళ్ళూ అంతా తాతయ్యగారింటికి చేరటం మొదలుపెట్టారు. వాళ్ళందరి మధ్యా శ్యామ కొంచం కొంచంగా దిగులు మరిచిపోతూ వుంది. సంక్రాంతి పండుక్కి బొమ్మల కొలువులూ, పేరంటాళ్ళూ, చిన్న పిల్లలకి పండ్లు పోయటం అంతా సరదాగా గడిచిపోతూంది. గోపీ క్కూడా పల్లెటూరు మార్పు బాగుంది. తాతయ్యగారి చిన్న బ్బాయిలతో కలసి ప్రక్కనున్న అడవికి వెళ్ళుతూండటం గోపీకి చాలా వుత్సాహంగా వుంది. ఒక రోజు గోపీ తన 'యెయిర్ గన్' సరిచేసుకుంటుంటే ప్రక్క యింటి కుఱ్ఱవాడు "అది యిల్లా తేవోయ్, చూచి యిస్తా" అన్నాడు. గోపీ బిరగ్గా "వుండవోయ్, మురికి చేతులూ నీవున్నూ" అనేశాడు. దగ్గరే నిలుచున్న శ్యామ సూటిగా గోపీ వైపు చూచింది. ఆ కుఱ్ఱవాడు చిన్న బుచ్చుకుని వెళ్ళిపోయాడు. శ్యామ "యేమిటి గోపీ, నీవెప్పుడూ యింతే. నీలా అందరూ గొప్పవాళ్ళుగా వుండాలంటే యెలావుంటారు? నీలా మంచి బట్టలూ దర్జాలూ రావుమరి. ఆ అబ్బాయి పాపం చూస్తానంటే నీ 'గన్' యేం అరిగి పోతుంది?" అంది

కోపంగా. "సుభ్రంగా వుంటానికి గొప్పయేమిటి? నీవు మరీ 'సిస్టర్ నివేదిత'లా మాట్లాడుతావు. చూపించే వాడినేగా వాడు పారిపోకపోతే! నామీదే ఎప్పుడూ నేరం వేస్తుంటావు" అన్నాడు తన్ను తాను సముద్ధరించుకోవాలని. "నీకసలు గర్వంలే"అని విసురుగా యింట్లోకి వెళ్ళిపోయింది శ్యామ. ఇలాంటి చిన్న తగాదాలు వచ్చినా మొత్తం మీద సెలవలు బాగానే గడిచిపోయాయి. తాతయ్య అందరికీ మంచి బట్టలు కుట్టించారు. స్కూళ్ళు తెరిచే సరికి అంతా యిళ్ళు చేరుకున్నారు.

*   *   *

మామూలుగా స్కూళ్ళు, చదువుల్లో పడ్డారు మళ్ళా. శ్యామకి స్కూల్లో చెప్పే పుస్తకాలే కాకుండా చిన్న చిన్న పత్రికలూ, పుస్తకాలు చదవట మంటే చాల ఆశక్తి. వాళ్ళ నాన్నగారు అందువల్ల 'బాల' మొదలైన పత్రికలు తెప్పిం స్తుంటారు. బాల పుట్టిన దిన సంచికకు 'బాలవ్యాసాల పోటీ' అని చూచి దాని వివరాలన్నీ ఆత్రుతగా చదివింది. నెమ్మదిగా ఒక గట్టి నిర్ణయానికి వచ్చింది. కాని యీ సారి యీ విషయం యెవ్వరితోనూ అసదలచుకోలేదు. శ్యామకి యింగ్లీషు నేర్చుకోవాలన్న ఆశక్తి వున్నా తెలుగంటే యెంతో అభిమానం. ఇంగ్లీషులో 'లిటిల్ వుమెన్' మొదలైన చిన్న చిన్న పుస్తకాలు చదివి యెంతో సంతోషిస్తుంది. కాని తెలుగు సొంత భాష అవటం వల్ల చాలా పత్రికలూ చిన్న చిన్న పుస్తకాలూ చదవటానికి వీలుగా వుంటుంది. ఆశక్తికి తోడు, చదవటం వల్ల తన వయస్సుకు సరళమైన తెలుగు వ్రాయగలదు. ఈసారి బాగా ప్రయత్నించ దలచు కుంది. గోపీ కూడ యీ మధ్య యేదో ఆలోచిస్తున్నట్లు గమనించింది శ్యామ. అనుకోకుండా దానికి కారణం కూడా దొరికింది. ఒక రోజు గోపీ వాళ్ళింటికి వెళ్ళి నప్పుడు గోపీ కనిపించక తోటలోకి వెళుతూంటే పందిరి దొడ్లో, ఒక చక్కని విశాలమైన కుంపటి, దాని ప్రక్కనే వింత వింత రాళ్ళు, మట్టి, యిసుక యింకా యేవేవో పెట్టి వుండటం చూచింది. రామాయమ్మగారు "ఈ మధ్య వాడు రాళ్లూ రప్పలూ అవీ యిక్కడ చేర్చి పెడుతున్నాడమ్మా. వాడి పన్లకు అర్థం వుండదు!" అంది. శ్యామ కొంచం ఆలోచించి చూచింది. తన ఆలోచనల్ని తనలోనే పెట్టు కుంది. గోపీతో తాను చూచిన సంగతి కూడా అనలేదు.

*   *   *

"శ్యామా !" అంటూ సంతోషం పొంగిపోతూ కేక వేశాడు గోపీ. శ్యామ కూడ యెందుకో ఆ రోజు సంతోషంగానే కనిపిస్తూంది. "శ్యామా! యీ రోజు నీవు ఒకచోటికి రావాలి నాతో. యెక్కడికని అడక్కూడదు" "అడగొద్దంటే అడగటాన్కి. నాకేం పని? కానీ నీవెక్కడికి రమ్మంటే అక్కడికి రావటమేనంటున్నావా నా పని?" అంది. నిజంగా శ్యామ రానంటుందేమోనని గోపీ నిరుత్సాహ పడిపోయాడు. శ్యామ తల్లి దగ్గరికి వెళ్లి "ఇవేళ తోటలో ప్రదర్శనం జరుగుతుందండీ! శ్యామ రానంటూంది. వెళ్ళమని మీరు చెప్పండీ" అని అడిగాడు. "శ్యామా! వెళ్లిరావే" అని కేక వేసింది వాళ్లమ్మ. గోపి రహస్యం యిదివరకే కొంత నరకపు పని గట్టిన శ్యామకు పూర్తిగా దాని అంతు కనుక్కోవాలని కుతూహలంగానే వుండటం వల్ల కొంచెం బెట్టుసరి చేసినా, చివరికి రావటానికి సిద్ధపడింది. అక్కడ ఒకాయన చెట్లు చేమలు, పండ్లు, పూలు మొదలైన వాటిని గురించి వుపన్యసిస్తున్నారు. అలంకృత చేసుకునే విధానాలు వాటిలో వుండే అందం, వుపయోగం విశదంగా చెబుతున్నారు. ఈ రెండు రోజులూ జరిగిన యీ ప్రదర్శనకు తోడ్పడిన వారిని అభినందించి ప్రదర్శన జయప్రదంగా జరిగిందని చెప్పారు. చివరికి యీ ప్రదర్శనలో అన్నిటిలోనూ మొదటి బహుమతులు పొందిన వారిని అభినందించారు. ఇందులో పిల్లలు కూడ ప్రదర్శనంలో పాల్గొన్నందుకు సంతోషిస్తున్నామనీ, పిల్లల ప్రదర్శనలో మిక్కిలి నిపుణతగా ఒక కుంపటిలో చిన్న అడవిని అతి సహజంగా నిర్మించి అందులో చక్కని భావం కలిగే 'ఆండ్రోక్లిస అండ్ ది లైన్'ని పొందు పరచిన చిరంజీవి గోపాలరావుకు మొదటి బహుమానం యిస్తున్నామని ప్రకటించారు. తరువాత బహుమానాలు యిచ్చారు. శ్యామని తీసుకెళ్ళి తన 'అడవి'ని చూపించాడు గోపి. నిజంగా చాలా సహజంగా అది అమర్చి వుంది. ఒకమూల చిన్న గుహా, అచ్చు గుహలా తయారై వుంది. అడవి అంతా అడవిలో వుండే చెట్లవంటి చెట్లతోనూ, పుట్టలతోనూ, పొదల

తోనూ నిండి వుంది. అక్కడక్కడ అడవి పూలతో యెంతో ముచ్చటగా వుంది. గుహకు ఒక ప్రక్కగా చిన్న సింహం బొమ్మ దాని కాలు పట్టుకున్నట్లు ఆంద్రోక్లెసు ముల్లు తీస్తున్నట్లు అమర్చి వుంది. చెట్ల కొమ్మల మధ్య నుండి కనిపించీ కనిపించ నట్లుంది యీ దృశ్యం. శ్యామ కనురెప్ప వేయకుండా చూచింది. నిజంగా గోపి తెలివి వుపయోగించి ఓర్పుగా తయారు చేశాడనుకుంది. "చాలా బాగుంది గోపీ!" అని మెచ్చుకుంది. కాని నాకు తెలీకుండా యెప్పుడు తయారు చేసేవని అడగలేదేమా, ఆశ్చర్యపోయినట్లు లేదేమా అని విస్తుపోయాడు గోపి. ఆ రెండవ రోజు ఒక ఉత్తరం వచ్చింది గోపికి. యెక్కడ నుండి అయివుంటుందా అని ఆలోచిస్తూ విప్పి చదివాడు. "ఈరోజు మధ్యాహ్నం ఆట విడుపు రేడియోలో వింటావు కదూ?" 'శ్యామ' అని వుంది. ఆశ్చర్యపోయాడు. 2_15 ఎప్పుడవుతుందా అని యెదురు చూస్తూ కూర్చుని ఆతృతగా వినటం మొదలు పెట్టాడు. మామూలుగా ప్రోగ్రాం నడుస్తూంది. కొంత సేపటికి, రేడియో అక్కయ్య చెప్పింది "బాల పుట్టిన గిన సంచికకు పంపిన వ్యాసాలలో మొదటి బహుమానం కుమారి శ్యామలకు వచ్చింది. వ్యాసం చక్కని భాషలో ముచ్చటగా వుంది. శ్యామలే మీకు చదివి వినిపిస్తుంది. యేదమ్మా శ్యామలా, యిలారా" అంది అక్కయ్య. శ్యామల గొంతుక రేడియోలో నుండి సూటిగా వచ్చి గోపి చెవుల్లో పడు తోంది. "శ్యామల యెంత తెలివిగా వ్రాసింది!" అని ఆశ్చర్యపోయాడు. ప్రోగ్రాం అయిపోయింది. అంతా కలలా వుంది గోపీకి. తనకి చెప్పకుండానే వ్రాసిందను కున్నాడు. శ్యామల అనుకున్నట్లుగానే సాయంత్రం తన యింటికి హాజరయినాడు గోపీ. ప్రశ్నల వర్షం కురుస్తూంది. "నీ వ్యాసం కాజేస్తా ననుకున్నావా?" అన్నాడు. "ఆహా, కాదుగోపీ, నీకుంపటి చూచికూడా నేను కాజేయలేదు. నీవు కాజేస్తావని ఎందు కనుకుంటాను?" అంది నవ్వుతూ. "ఆ! నా కుంపటి ముందే నీవు చూసేసావన్నమాట! నాతో చెప్పలేదేం మరి?"

"నీవు నాకు దాని సంగతి చెబితేగదూ అసలు. పైగా నా వ్యాసం ముగ్గుల్లాగ మూడోది కూడ రాకుండా పోగూడదూ? అలాగైతే నీ వెక్కిరింపులన్నీ వింటూ కిమ్మన కుండా కూచోవాలి!"

"శ్యామలా చాలా గట్టి దానివి. నాకు మొదటే బహుమానం వచ్చినా నీవు నన్ను ఓడించేసావులే. నేను చెప్ప కూడదని కాదు శ్యామా, నీవు యెప్పుడూ నన్ను ఒక్క పనీ పట్టుదలగా పూర్తి చేయనని అంటూంటావు కదూ! అందువల్ల పూర్తి చేసేక చెబుదామనుకున్నా" అంటూ యిద్దరూ తమ తమ పోటీలకు యేవిధంగా పంపిందీ పూసగ్రుచ్చినట్లు చెప్పుకున్నారు. ఇంక ఆ పోటీలూ అవీ అనుకున్నట్లు జరిగి పోయాయి. వాళ్ల తల్లి దండ్రులు యెంతగానో మెచ్చుకున్నారు. శ్యామా, గోపీ యింక పరీక్షలకు బాగా చదివి మంచి మార్కులు తెచ్చుకోవాలని నిశ్చయించు కున్నారు. 



# పదచ్యుతులు



"రమేష్"

శివపురం జమీందారీ పోయేటప్పటికి యేం మిగిలినా మిగలక పోయినా యెస్టేటు పేరు చెప్పుకొంటూ నేనూ మా చెల్లీ మాత్రం మిగిలాం.

అసలు మాసంగతి మాకే తెలియదు. కాని మా పినతల్లి చెప్పిన దాన్ని బట్టి చూస్తే మా అమ్మని మా అమ్మమ్మని ప్రస్తుతం యెస్టేటు అధికారం కోలుపోయిన మధుసూధన రావుగారు తీసికొని వచ్చినట్టు తెలుస్తోంది. నాకు బాగా జ్ఞప్తిలేదు గాని, మా చెల్లి పుట్టిన కొద్ది రోజులకే మా అమ్మ చనిపోయిందనీ, అప్పటినుండీ మా పినతల్లే మమ్మల్ని సాకుతూ వచ్చిందని స్పష్టమౌతోంది.

కొద్ది రోజులక్రితం ఎస్టేటు పోతున్న చివరి రోజులలో ఎవరో మధుసూధనరావుగారి స్నేహితులు వచ్చి చాలా బలవంతం మీద వారి ప్రాపకంతో బ్రదుకుతున్న మా పిన తల్లిని వేరుచేసి తమ ప్రాపకంలోకి తీసికొన్నారు.

పినతల్లి వెళ్ళిపోయాక నేనూ మా చెల్లీ నిజంగా తల్లి లేని పిల్లలై పోయాము. చిన్న వాళ్ళమైన మా మీద మధుసూధనరావుగారికున్న అభిమానం ఎంత ఆత్మబంధువులకైనా వుండదంటే అతిశయోక్తి కాదు.

వారు భోంచేస్తున్నా, కచేరి చావిడిలో వున్నా, పడక గదిలో వున్నా మే మాతనితో వుండవలసిందే. ఎవ్వరూ మమ్మల్ని ఏమీ అనటానికి హక్కులేదు. మా కేది కావల సినా, ఎక్కడికి వెళ్ళాలన్నా ఏ ఆటంకమూ వుండేదికాదు. ముఖ్యంగా నా కన్నా, మా చెల్లెలంటే మధుసూధనరావు గారికి వున్న అభిమానం, ప్రేమ చెప్పశఖ్యంకాదు. మా చెల్లి రోజు రోజుకూ పెద్దదౌతూంటే చూడ ముచ్చట వేసేది.

ఎస్టేటులో పెద్ద ఉద్యోగుల దగ్గరనుంచి కంబారీవాని వరకూ మమ్మల్ని పలుకరించి గౌరవించని వాళ్ళంటూ లేరు. అయితే యీ గౌరవం నాకంటే మా చెల్లెలే ఎక్కువ పొందేది. ఏమైనా మా చెల్లెల్లో వున్న సున్ని తత్వమూ, ఆకర్షణా నాకెక్కడ వస్తాయి? ఎస్టేటు డాక్టరు మాకేమీ జబ్బులు రాకుండా జాగ్రత్త తీసుకోవలసిందే. చెబితే నమ్మండి చీకూ చింతా లేని జీవితాలై పోయాయి మావి. ఒక్కొక్కప్పుడు యేం చెయ్యటానికీ తోచక సుఖ జీవితమంటేనే విసుగెత్తిన రోజులున్నాయి.

మా స్నాన భోజన సమయాలకు లోటుంటుందని ఎవరనుకోగలరు? మేము మధుసూధనరావుగారి పంక్తిని భోజనం చెయ్యాల్సిందే. ఒకనాడు మా చెల్లి భోజన సమయానికి రాకుండా అలిగి పడుకుంది. నేను మాత్రం బుద్ధిమంతుడిలా వచ్చి కూర్చున్నాను. మధుసూధనరావు గారు స్వయంగాపోయి మా చెల్లెలిని బుజ్జగించి తీసుకు వస్తూంటే నాకు ఆశ్చర్యమేసింది, అభిమానం కూడ వేసింది. దాని అదృష్ట రేఖకు ఆరోజు అంతేలేదు.

సాయంత్ర మయ్యేసరికి ఆస్తిలో సగం ఖరీదు చేసే కారులో, సన్నగా, మెత్తగా ముఖమల్ దిండ్ల మీద షికారు పోయే వాళ్ళం బీచికి.

ఆహా! ఆ రోజులు తలుచుకొంటేనే గుండె నీరయి పోతుంది.

ఇక యిప్పటి పరిస్థితి అంటారా! వినండి. ఎస్టేటు పోయాక మధుసూధనరావుగారు ఎస్టేటు ఫిర్యాదు పెట్టు కుంటూ జబ్బుపడి మద్రాసు హాస్పటలుకు వెళ్ళిపోయారు. క్రమంగా సంపత్తి క్షీణించి పోయింది. యీ గొడవలో మేం అడుగున పడిపోయాం. క్రమంగా ఒక్కొక్కరే మమ్మల్ని విస్మరించారు. చివరకు గజ్జి, చిడుము పట్టుకొని రోగంతో కృశించిపోయే స్థితి వచ్చింది. ఒంటినిండా కురుపులు లేచాయి. ఆ దిక్కులేని స్థితిలో మా చెల్లెలే నాకు పరిచర్య చేసేది. చివరకు అనుకున్నంత పనీ అయింది. మా చెల్లెలికి జబ్బుచేసి చచ్చిపోయే స్థితికి వచ్చింది. ఒంటినిండా కురుపులు లేచాయి. బలమైన ఆహారం లేక యెముకలు బయటపడినై. చివరకు విసుగు, అసహ్యము పుట్టి ఎస్టేటు లోగిలిలోనుండి ఆవరణలోనికి, ఆవరణలోనుండి వీధిలోనికి గెంటి వేశారు. ఇప్పుడు మే మటువేపు తిరిగితే మా వీపు బ్రద్దలౌతుంది.

మాలాగే దిక్కులేక దీనదశలో వీధుల్లో తిరిగే స్నేహితులు మమ్మల్ని కసిరేవారు. ఇదిగో చూశారా! మీతో యీగొడవ చెప్పుతూ కూర్చుంటే అసలికి మోసం

## ప ద చ్యు తు లు

వస్తుంది. కడుపు లోపలికి పోయింది. చెడ్డ ఆకలేస్తోంది. అన్నట్టు చెప్పటం మరచాను— ఓట్ల ప్రచారార్థం మావూరు వేంచేసిన ఓ ప్రముఖ నాయకుడు కారులో జోరుగాపోతూ మాంసరపోతమై బక్కచిక్కిన మా చెల్లెలిని మట్టించుకొని పోయాడు. నాలో నేను ఏడవటం తప్ప ఇంకేమీ చేయలేక పోయాను.

సరే! ఏం చేస్తాం? అదిగో నాతోటి వారంతా అటు పరిగెత్తుతున్నారు. ఏ ఇల్లాలైనా పుల్లాకులు డబ్బాలో వేసి వుంటుంది. నేనూ పోతున్నాను.

ఒక్కమాట! మేం ఒకప్పుడు శ్రేష్ఠమైన వేటకుక్కల జాతికి చెందిన వాళ్ళం. యీనాడు ఊరి కుక్కలకన్నా అర్థాన్నం అయిపోయాం!

నా పేరు టామ్ — మా చెల్లి పేరు లిల్లీ — యిక శలవ్.

---

## ఆంధ్రమహిళా సమితి

జంషెడ్పురం.

ఆంధ్ర మహిళా సమితివారు మార్చి 16 వ తారీఖున మంగళవారం శ్రీ పొట్టి శ్రీరాములుగారి జన్మదినోత్సవము జరిపిరి. శ్రీ పొట్టి శ్రీరాములుగారి పటమునకు పూల-మాలలువేసి పూజించి, ఆయన చేసిన త్యాగములను గురించి సమితి అధ్యక్షురాలు శ్రీమతి. శ్యామలామూర్తి మాట్లాడినారు. ఆ దినమే సమితి యొక్క కొత్త కార్య నిర్వాహకవర్గము ఎన్ను కోవడము జరిగినది. సమితి కార్యదర్శిని శ్రీమతి కృష్ణవేణీరావు 1953. వ. సం॥ రిపోర్టు చదివిరి. తదుపరి ఎన్నికలు ప్రారంభించిరి. ఎన్ను కొనబడిన కార్యనిర్వాహక వర్గము.

అధ్యక్షురాలు శ్రీమతి. శ్యామలామూర్తి, ఉపాధ్యక్షు రాలు శ్రీమతి. సుభద్రామూర్తి, కార్యదర్శిని శ్రీమతి. కృష్ణవేణీరావు. సహాయకార్యదర్శిని శ్రీమతి. డి. నాగుబాయి. కోశాధికారిణి కుమారి కె. సావిత్రి. తరువాత కమిటీ మెంబర్ల ఎన్నికలు అయినవి. కొత్త కార్య నిర్వాహక వర్గము వారు అల్పాహార విందు జరిపిరి. ఆఖరున కార్యదర్శిని అభివందనలతో ఆనాటి సభ ముగిసినది.

శ్రీమతి కృష్ణవేణీరావు.
కార్యదర్శిని.

# చేనేత పరిశ్రమ ★

శ్రీ ఎల్. ఎస్. శర్మ.

చేనేత పరిశ్రమ అనాదిగా ప్రజాదరణను పొంది అసంఖ్యాకులకు జీవనోపాధిక కల్గించుటయే గాక, విదేశములను గూడా ఎగుమతియై, విశేష ఖ్యాతి గాంచినది. ఢక్కా-మజ్లినులు ప్రపంచ ఖ్యాతిని పొందినవి.

అట్టి పరిశ్రమ బ్రిటీషు పాలనాధికారము దేశములో పాదు కొనుటతో సన్నగిల్లి, నామమాత్రావశిష్టమై యున్నది. ఈస్టు ఇండియా కంపెనీ పరిపాలన దేశమున యున్నప్పుడు అతి నిపుణులైన డక్కా- చేనేతగాళ్ళ బొటన వ్రేళ్ళు నరుకుట గూడా తటస్థించెనని ప్రతీతి గలదు. ఈ విధముగా చేనేత పరిశ్రమ నానాటికి తీసికట్టు కడకు వచ్చినది.

బ్రిటీషు పాలన దేశమున యున్నంత కాలము దేశీయ పరిశ్రమాభివృద్ధికి తగిన ప్రోత్సాహము గాని, సహాయము గాని జరుగలేదు. లాంకషైర్, మాంచెస్టర్ మొదలైన ప్రదేశములనుండి విదేశ వస్త్రములు దిగుమతి యగుట, ధరల విషయములో దేశములో తయారైన వస్త్రములు వాటితో పోటీ చేయలేకపోవుటతో దేశీయ పరిశ్రమకు మరింత ఆర్థిక మాంద్యము, నిరుత్సాహము కల్గినది.

ఈ పరిస్థితిని సాకల్యముగా పరీక్షించి గాంధీ మహాత్ముడు విదేశ వస్త్ర బహిష్కారమును, ఖద్దరు ఉత్పత్తికి ప్రోత్సాహమును దేశమంతటను చాలా కాలము క్రిందనే వ్యాపింప జేసిరి- విదేశ వస్త్ర బహిష్కారముతో లాంకషైరు మిల్లులకు 1930-33 సంవత్సరములలో విపరీతమైన ఆర్థిక దుస్థితి ఏర్పడినది.

ఈ విధముగా కాంగ్రెసు మొదటి నుండియు కుటీర పరిశ్రమలు, తదితర దేశీయ పరిశ్రమలు దేశ సౌభాగ్యమునకు అత్యవసరమని చెప్పుచునే యున్నది. దేశములో గల కుటీర పరిశ్రమలలో అత్యంత ప్రాముఖ్యము గలది చేనేత పరిశ్రమ- దీనిపై ఆధారపడిన అసంఖ్యాకులు దక్షిణ భారత మందునే ఎక్కువగా నున్నారు.

ఇతర రాష్ట్రములలో ఈ పరిశ్రమ అంత వ్యాప్తిలో లేదనియే చెప్ప వచ్చును- అందువలన మద్రాసు, ఆంధ్ర, హైద్రాబాదు ప్రభుత్వములు ఈ విషయమున ప్రత్యేక శ్రద్ధ చూపవలసి యున్నది.

చేనేత పారిశ్రామికులు యుద్ధ కాలములో నూలు కోటా దొరకక పోవుటచే చెప్పరాని ఇబ్బంది పడిరి. యుద్ధానంతరము Advisory Government చేత తయారు చేయబడిన ప్రణాళికలలో మిల్లు పరిశ్రమను అభివృద్ధి పరచు నిమిత్తము కదుర్లను దిగుమతి చేయుటకు జరిగిన ఏర్పాటును శ్రీ ప్రకాశం పంతులు గారు ఖద్దరు ఉత్పత్తికి, చేనేత పరిశ్రమకు చేయూత నిచ్చే నిమిత్తము రద్దుచేయ బూనుకొనగా, అప్పట్లో కేంద్రమున పారిశ్రామిక మంత్రిగా యున్న శ్రీ రాజగోపాలాచారిగారు అడ్డు తగిలిరి. ప్రకాశంగారు ఏర్పాటు చేసిన ఉత్పత్తి- కొనుగోలుదారుల పరస్పర సంఘములు గూడా వారు పదవిని వీడిన వెంటనే రద్దు కాబడినవి- ఈ విధముగా చేనేత పారిశ్రామికులకు జరగబోవు ఉపకారము ఒక పార్టీకి చెందిన నాయకులకు గల అంతఃకలహములచే అప్పట్లో ఆగి పోయినది.

తిరిగి చేనేత పరిశ్రమకు అధ్వాన స్థితి ఏర్పడినది. శ్రీ రాజగోపాలాచారిగారు మద్రాసు ముఖ్యమంత్రి యగుటయు, పిదప యూనియన్ పారిశ్రామిక మంత్రి యగుటయు శ్రీ టి. టి. కృష్ణమాచారిగారితో కొంత ఘర్షణ పడి ఎట్టకేలకు చేనేత పరిశ్రమకు కొంత ఆర్థిక స్తోమతను కల్గించునట్లు యూనియన్ ప్రభుత్వమును ఒప్పించ గల్గిరి. చేనేత గాండ్రలో గల నిర్వ్యాపారత్వమును తగ్గించుటకు వారు ధోవతులు, చీరలు, మొదలైన కొన్ని రకముల వస్త్రములు, మిల్లులు తయారు చేయకూడదని ఆంక్ష విధించి వాటిని ఉత్పత్తి చేనేత మగ్గములకే కేటాయింపు చేయవలెనని ఆందోళన లేవదీసిరి. ఈ ఆందోళన కొంత సంచలనము గల్గించినది- మిల్లు గుడ్డలపై యూనియన్ ప్రభుత్వముచే వేయబడిన సెస్సు నుండి వచ్చిన ఆదాయము నుండి నాల్గు కోట్ల రూపాయలు ప్రత్యేకముగా చేనేత పరిశ్రమాభివృద్ధికి వినియోగించు నిమిత్తము కేటాయించిరి. ఆ మొత్తములో 2½ కోట్ల రూపాయలు యిప్పటికి వివిధ రాష్ట్రములకు చేనేత

# చేనేత పరిశ్రమ

పరిశ్రమను పెంపొందించు నిమిత్తమై పంచబడినది. ఆంధ్ర రాష్ట్రమునకు ఈ మొత్తములో 47 లక్షలు, చెన్న రాష్ట్రమునకు 88 లక్షలు యివ్వబడినది.

ఈ మొత్తము చేనేత పారిశ్రామికుల కొరకేర్పడిన సహకార సంఘములకు మూల ధనము సమకూర్చుటకును, చేనేత కలంకారీ వ్యాపారము, తత్సంబంధమైన విషయములలో పరిశోధనలకును, వినియోగింప బడునని తెలియుచున్నది.

కుటీర పరిశ్రమల నభివృద్ధి పరచు నిమిత్తము "అఖిల భారత చేనేత పరిశ్రమల బోర్డు"ను యూనియన్ ప్రభుత్వము వారు స్థాపించిరి. కుటీర పరిశ్రమలను, గృహ పరిశ్రమలను వ్యాప్తిని గల్గించి వాటిని పునరుద్ధరింప జేయుటే ఈ బోర్డు ఆశయము.

చేనేత పరిశ్రమకు తగిన ప్రోత్సాహము యిచ్చు నిమిత్తము పరిశిష్ట మద్రాసు ప్రభుత్వము యిప్పటికి గల అమ్మకపు పన్ను గాక అదనముగా రూపాయకు 0_1_9 చొప్పున మిల్లు గుడ్డలపై పన్నును ఒక్క పర్యాయము మాత్రమే చెల్లించునట్లు 1954_55 బడ్జెట్టులో విధించిరి. ఇది ముతక గుడ్డలకు చెల్లదు. ఈ పన్ను ముఖ్యోద్దేశ్యము చేనేత పరిశ్రమకు దోహదమిచ్చుటయే. ఈ పన్ను అమలునకు వచ్చిన వెంటనే ప్రస్తుతము చేనేత వస్త్రములపై విధింపబడియున్న రూపాయకి 0_1_6 చొప్పున గల అమ్మకము పన్ను రద్దు కాగలదు. యూనియన్ ప్రభుత్వము తమ 1954_55 బడ్జెటులో మేలు రకపు మిల్లు గుడ్డలపైన 1 గజమునకు 6 పైసల చొప్పున, ముతక పైసల చొప్పున తదితర మిల్లు గుడ్డలపైనను Excise పన్ను విధించిరి. ఈ పన్నులు చేనేత పరిశ్రమకు ఆర్థిక సహాయము చేయునిమిత్తమే విధింపబడినది.

ఆర్థిక దుస్థితికి లోనై తగిన వ్యాపార సదుపాయములు లేకున్న చేనేత పరిశ్రమకు సహకారోద్యమము ఉత్కృష్ట తరుణోపాయము. మొట్ట మొదట చేనేత గాంధ్రకు 1905లో కాంచీ పురములో సహకార సంఘము ఏర్పర్చ బడినది. క్రమముగా వారి కొరకు అనేక సంఘములు ఏర్పాటు చేయ బడినవి. ఇవి సక్రమముగా పని చేయకపోవుటకు గల కారణములు నూలు ధరలలో విశేష మార్పులు, మాష్టర్ వీవర్ల స్వలాభాపేక్ష, తయారైన వస్త్రములు అమ్ముడు కాకపోవుట మొదలయినవి. చేనేత పారిశ్రామికులు సమిష్టి మీద తమకు లాభము కల్గిననే గాని వ్యక్తిగతముగా లాభకరము గాదని గ్రహించి, సహకార సంఘములు పటిష్ట వంతములుగా చేసిననే గాని వారి ఆర్థిక స్థితి చక్కబడదు. ప్రభుత్వము తమకు చేతనయినంత వరకు ఆర్థిక సదుపాయములు చేనేత పారిశ్రామికులకు కల్గించుచున్నారనుటలో సందేహము లేదు. దీనిని సద్వినియోగము చేసికొనుట, తమ సమస్యలను చక్క దిద్దుకొనుట పారిశ్రామికుల పైనగూడా కొంతవరకు గలదు. ఏమయినను ప్రభుత్వమువారు యింక యింతకన్నా హెచ్చు సహాయము చేయవలెను.

ఆంధ్ర ప్రభుత్వము గూడా చేనేత పరిశ్రమను ప్రోత్సాహించుటకు తగిన చర్యలు తీసుకొనుచున్నారు. ఆంధ్ర చేనేత గాంధ్ర సహకార సంఘమునకు 20 లక్షల రూపాయలు 5¼% వడ్డీకి అప్పు మంజూరు చేసినారు. ఈ ఋణము మంజూరు చేయుట వివిధ సహకార సంఘములలో నిల్వయున్న వస్త్రముల కొనుటకుద్దేశించియే. ఆంధ్ర ప్రభుత్వము కొన్ని రకముల చీరెలు, అంచులుగల ధోవతుల ఉత్పత్తి చేనేత పరిశ్రమకు కేటాయించవలసినదిగా యూనియన్ ప్రభుత్వమును కోరినట్లు తెలియుచున్నది. ప్రభుత్వము తమకు Cess fund నుంచి రావలసిన మొత్తమంతయు వచ్చిన పిదప చిన్న చిన్న మిల్లులను స్థాపించి, చేనేత మగ్గములకు కావలసిన నూలును సరఫరా చేయుటకు ఏర్పాట్లు చేయుదురని తెలియుచున్నది.

దేశపు ఆర్థిక సౌభాగ్యము కవ్వము—కదురు ప్రతి యింటను ఆడుటతో చేకూరును - చేనేత వస్త్రములనే గాక, చేతితో వడికిన నూలుతో తయారయిన వస్త్రములను ఎవరికి కావలసినన్ని వారు తయారు చేసుకొనిననేగాని ప్రతి గృహము, ప్రతి గ్రామము స్వయంపోషకము కానేరదు. ఇట్టి స్థితిని పొందుట అదర్శప్రాయము మాత్రమే యగుటచే ఏ గ్రామమునకు కావలసిన వస్త్రము ఆ గ్రామపు చేనేత పారిశ్రామికులచే తయారగుటు, అవిధముగా ప్రతి గ్రామము స్వయంపోషకముగా నుండుట సమంజసము—





## శంకర గ్రంథ - రత్నావళి

అనువాదకులు - శ్రీ నిర్వికల్పానందస్వామి.

సాధన గ్రంథ మండలి తెనాలి – వెల 3–0–0 రూ

అద్వైతానందులు "శ్రీ జగద్గురు శంకరాచార్యులు" ఉపనిషత్సారములు గీర్వాణభాషలో నన్వయ క్రమంగా గ్రంథస్తము చేసిన ఉపదేశములను చక్కని తేట తెనుగున అనువదించిన 'శ్రీ నిర్వికల్పానందస్వామి' ప్రశంశనీయులు. తత్వోపదేశం, ఆత్మబోధ, జీవన్ముక్తి, సదాచారం మొదలైన అన్ని శీర్షికలయొక్క ఉపదేశములు వేదాంతోపాసకులకు రసానుభూతిని విజ్ఞులకు ఆకర్షణీయము కల్గించును "శ్రీ జగద్గురు" రచనలెన్ని వెలువడినను లోకానికి ప్రజకు, శ్రేయస్కరమే.

## నాటికలసంపుటి

రచయిత– తామరపల్లి జోగారావుగారు

ప్రతులు దొరకుచోటు. వెల - 1-0-0.

లిబర్టీలాడ్జ్ - గరల్సుస్కూలు

రీవారాణీపేట, విజయనగరం, విశాఖ జిల్లా.

అనేకరకములైన మనోతత్వాలను వ్యక్తీకరించి సామెతలతో హాస్యరస ప్రధానమైన ఐదునాటికల సంపుటిని పఠితల కందజేసిన శ్రీ తామరపల్లి జోగారావుగారు అభివందనీయులు.

రసభరిత మయిన నాటికలు చదువరులకు ఆనందాన్ని చేకూర్చగలవు. నాటికలైనా కథలైనా రసానుభూతిని కలిగించేటట్లు వ్రాయుటే వీరి ఆశయమని తోస్తుంది.

## జమీన్ రైతు

(రజితోత్సవ సంచిక.)

'జమీన్‌రైతు' రజితోత్సవ సంచిక పెక్కురు ప్రఖ్యాత రచయితల రచనలతో, ప్రముఖుల శుభాసీస్సులతో వెలువడింది. '25' సంవత్సరములు జయప్రదంగా గడుపుకుంది. చదువుట కింపుగా వుంది.

వెల — రూ 1-0-0 దొరకుచోటు

జమీన్‌రైతు, నెల్లూరు.

## కుమ్మరి మొల్ల

రచయిత ఇంటూరి వెంకటేశ్వరరావు.

ఆంధ్ర సెంట్రల్ పబ్లికేషన్స్

62. సర్ మహమ్మద్ ఉస్మాన్ రోడ్.

మద్రాస్ 17. మూల్యం 1–8–0

'కుమ్మరి మొల్ల' రామాయణ గ్రంథాన్ని రచించిన ప్రథమాంధ్ర కవయిత్రి. అప్పటి సంఘంలో వున్న అవినీతిని, అధర్మాన్ని సహించక యెదురొగ్గిన ధీరురాలు. ఆమె తండ్రి 'ఆతుకూరి కేసన' శివ భక్తుడు, తత్వవేత్త.

గోపవరాగ్రహారమునకు పెద్దలైన అవారి. అందరూ వైష్ణవ మతస్థులు. కేసన శైవ మతప్రచారం చేస్తుంటూ, మత వైషమ్యాలను రోసు చేసి కన్న కూతురును పాటించాలంటూ అనేక సంఘర్షణలతో వివాదాలు పెంచి కేసనను మొల్లను అవమానించి వారిని ఆ వూరినుండి వెళ్ళగొట్ట ప్రయత్నిస్తారు. ఆ సమస్యల నన్నిటిని మొల్ల ధైర్యంతో, ఆత్మ శక్తితో ఎదుర్కొంటూ గర్వాంధులైన అవారి, అపభాష్లకు తన జ్ఞాన శక్తితో చురుకు కన్ను విప్పచేస్తుంది. తుదకు ఆవారి పశ్చాత్తప్తులై తన సహాయంతో నీడ పాదలకు వంచిపెట్టారు.

కథా వస్తువు చిన్నదైనా సహజత్వానికి లోపం లేకుండా అనేక సన్నివేశాలతో తగిన సంఘటనలు కల్పించి మొల్ల జీవితాన్ని అదర్శ ప్రాయంగా చిత్రించిన వెంకటేశ్వరరావు గారి రచనా నైపుణ్యం ప్రశంశనీయం.

శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మ.

# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ మద్రాసు

**మహిళా విద్యాలయము** : హిందీ, కాశీ విశ్వవిద్యాలయపు ఎడ్మిషన్, ఇంటర్‌మీడియెట్, ఇ.యస్.ఎల్.సి., పరీక్షలు.

**పారిశ్రామిక విద్యాలయము** (గవర్నమెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది) : కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు, అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చు కూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. బీద విద్యార్థినులకు ఉచితము.

**వస్త్రములపై అద్దకపుపని మిషనుకుట్టు, మిషను అల్లిక, చేనేత-** : భారత ప్రభుత్వ పునరావాసశాఖవారిచే ఆంధ్రమహిళా సభలో నడుపబడుచున్నది.

**టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్** : స్త్రీలకు టైపు,—గవర్నమెంట్ పరీక్షలకు శిక్షణ.

**మహిళా మందిరము** : స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము.

**ఆంధ్ర మహిళ** : స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాసపత్రిక.

**నిర్మలాదేవి గ్రంథాలయము** : సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంథ సముదాయము.

**నర్సింగ్ హోమ్** : స్త్రీ, శిశువుల, సంరక్షణశాల, ప్రసూతిశాల, ఉచిత వైద్యశాలం— అడయారులో నిర్మించబడినది. భారత ప్రభుత్వ ఆరోగ్యశాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్సుఎయిడ్— మంత్రసాని పనులలో శిక్షణ యివ్వబడుచున్నది.

**ముద్రణశాల** : ఆంధ్ర మహిళా సభవారిచే స్వంతంగా స్థాపించబడినది. విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగు, ప్రూఫ్ రీడింగు, మొదలైనవి ఉచితంగా నేర్పబడును.

క్రీడా, క్లబ్బుశాఖలు.

సభ్యురాండ్రుగా జేరి, యీ జాతీయ సంస్థను పోషించండి.

Edited, Printed & Published for the Andhra Mahila Sabha, Luz, Madras 4
by Mrs. A. C. Krishna Rao, M.A., L.T., at the Andhra Mahila Press, 24-A, Luz Church Rd., Madras 4

# విజయము

డిశంబరు 1953 లో గవర్నమెంటు టెక్నికల్ పరీక్షలకు వెళ్ళిన పారిశ్రామిక విద్యాలయపు విద్యార్థినుల పరీక్షా ఫలితాలు ప్రకటితమైనవి. విజయము పొందిన వారి పేర్లు సూచిస్తూ యిందు ప్రకటించు చున్నాము.

## కుట్టుపని హయ్యర్ గ్రేడ్

పరీక్ష వ్రాసిన 12 గురిలో 8 గురు ద్వితీయశ్రేణిలో ఉత్తీర్ణులైరి.

| | | |
|---|---|---|
| ఆర్. పద్మ, | వి. ఎన్. కల్పగమ్, | కె. వి. సరస్వతి, |
| వి. కుప్పమ్మాళ్, | వి. విశాలాక్షి, | టి. రాజ్యలక్ష్మి. |

## కుట్టుపని లోయర్ గ్రేడ్

పరీక్ష వ్రాసిన 13 గ్గురిలో 8 గురు ద్వితీయశ్రేణిలో ఉత్తీర్ణులైరి.

| | | |
|---|---|---|
| ఎ. రుక్మిణి, | వి. ఎస్. సంపూర్ణమ్, | ఆర్. సరస్వతి, |
| ఆర్. మీనాక్షి, | పి. ఆర్. సౌందర్య, | జి. ఆర్. రాధ, |
| ఎస్. మీన, | ఎ. కమల. | |

## ఆంధ్ర మహిళా సభలో

### 1954 మార్చి ఆంధ్ర విశ్వవిద్యాలయపు మెట్రిక్ పరీక్ష ఫలితాలు

1954 మార్చిలో ఆంధ్ర విశ్వవిద్యాలయపు మెట్రిక్ పరీక్షలకు, ఆంధ్ర మహిళా సభవారు ప్రప్రథమంగా యిద్దరికి తరిఫీదునిచ్చి పరీక్షలకు పంపిరి. వారిద్దరు ఉత్తీర్ణులైరి. వారి పేర్లు ఈదిగువ నుదహరించబడినవి.

ఎమ్. కమలకుమారి, కె. స్వరాజ్యలక్ష్మి.

కృతార్థులైన విద్యార్థినులకు మా అభినందనములు. వీరికి తోడ్పడ్డ ఉపాధ్యాయ వర్గమునకు మా కృతజ్ఞతాభివందనములు.

ఆంధ్ర మహిళా సభ.

# ఆంధ్ర మహిళ

వ్యవస్థాపకురాలు :

శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్

యెం.యే., బి.యెల్.,

సంపాదకురాలు :

శ్రీమతి చన్నఘంటమ్మ

యెం.యే., యెల్.టి.,

సంవత్సర చందా ఆరు రూపాయిలు

ఆంధ్ర మహిళా సభవారిచే స్థాపించబడిన ముద్రణాలయములో
ముద్రితము.

# ఆంధ్ర మహిళా సభ

## సంగీతపు తరగతులు

కర్ణాటక సంగీతము వీణ, గ్రాత్రములలో లోయర్ గ్రేడ్ పరీక్షలకు శిక్షణ, ఆంధ్ర మహిళా సభ లజ్‌చర్చిరోడ్డు భవనములలో, ప్రారంభింప బడినది.

శిక్షణ మాసరుసుము : రూ. 5-0-0.

ప్రవేశ రుసుము : రూ. 3-0-0.

సభ్యత్వ రుసుము మాసమునకు : రూ. 1-0-0.

మిగతా వివరములు సభకు మధ్యాహ్నం 3 గం॥ పైన వచ్చి తెలిసికొనవచ్చును.



## ఖాదీ విక్రయము.

మద్రాసు గౌర్నమెంటు రూరల్ వెల్‌ఫేరు శాఖలో తయారయిన ఖద్దరు వస్త్రములు, ఆంధ్ర మహిళాసభ లజ్ చర్చి రోడ్డు కార్యాలయంలో విక్రయింప బడుతున్నవి.

చీరలు, ధోవతులు, దుప్పట్లు, చొక్కా, రవికె గుడ్డలు, ఇంకా అనేక రకములైనవి యిక్కడ దొరకును. రూపాయ విలువకు 3 అణాలు తగ్గించి విక్రయించవలసినదిగా వెల్‌ఫేరు శాఖవారు అనుమతి యిచ్చియున్నారు.

ఉదయం 10 గం॥ నుండి సాయంకాలం 6 గం॥ వరకు ఈ విక్రయశాఖలో మీకు కావల సిన వస్తువులు దొరకును.

అ. చన్నఘంటమ్మ.

# ఆంధ్ర మహిళా సభ

## సర్వసభ్య సమావేశము.

## నోటీసు

ఆంధ్ర మహిళాసభ సర్వసభ్య సమావేశము సభాభవనములో ది 8-6-54 మంగళవారమునాడు సరిగా 4 గం॥లకు జరుగును. సభ్యురాండ్రందరు తప్పక హాజరు కావలెను.

విషయములు

1. గత సర్వసభ్య సమావేశపు వివరములు.
2. వివిధ శాఖల కార్యక్రమ నివేదికలు. 1953-54
3. వివిధశాఖల జమాఖర్చుల నివేదికలు. { 1952-53, 1953-54
4. తీర్మానములు.
5. ఇతరవిషయములు.
6. నూతన కార్యవర్గ సభ్యురాండ్ర ఎన్నిక.

దుర్గాబాయి దేశ్‌ముఖ్,
వ్యవస్థాపక కార్యదర్శిని.

అ. చన్నమంటమ్మ,
ఆర్. కమలాబాయి,
సంయుక్త కార్యదర్శినులు.

# ఆంధ్రమహిళ

సంపుటి 11 :: జూన్ '54 :: సంచిక 2



సంవత్సర చందా :: ఆరు రూపాయలు.



సంపుటి 11 :: జూన్ '54 :: సంచిక 2

# "గుడు గుడు గుంచం-"

"చదువని వాఁడజ్ఞుండగుఁ, జదివిన సదసద్వివేక చతురత గలుగుం
జదువఁగ వలయును జనులకుఁ........................"

చదువుయొక్క అవసరం, ఆశయం ఇంతకంటే మనోజ్ఞంగాను, ముక్తసరిగాను చెప్పడం కష్టమే. ఐతే ఆ చదువులు ఏలాగున్నాయి, ఎట్లాగుండాలి అన్న హంశాన్ని గురించి వ్రాయవలసివస్తే ఎం-తై-నా ఉంది. మన విద్యా విధానం పాశ్చాత్త ప్రభుత్వానికి గుమాస్తాల్ని తర్ఫీదు జేయడాన్కి మహా అనుగుణ్యంగా ఉందని ఏనాడో వివేకానందుడు విశదీకరించేడు. గాంధీజీ మొదలైన వారంతా దీన్ని గర్హించేరు. మన కళ్ళెదుటనే చూచేం : జక్కీర్ హుస్సేన్ కమిటీ, సార్జెంటు కమిటీ, ఎలిమెంటరీ విద్యావిమర్శన కమిటీ, ప్రయిమరీ-సెకండరీ-కలిజియేట్ విద్యా విమర్శన కమిటీలు, ఇంకా ఈరోజున రాజాజీ-నూతన-విద్యా-విధాన-విమర్శన కమిటీ, (మళ్ళా మరో ఎక్సపర్టు కమిటీ నియామకానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి). ఇలా ఎన్నెన్నో కమిటీలను నియమించడం, అవి విచారణలు సాగించి, రిపోర్టుల్ని ప్రకటించడం ; ఫలితం అంతా ఎరిగిందే- గుడుగుడు గుంచం - గుండారాగం !

ఇప్పటి చదువులు వట్టి పుస్తకం చదువులేగాని యదార్థ జీవితానికి సంబంధించి యుండలేదనీ, మన బిడ్డల చేయి-బుర్ర-హృదయాల పూర్తి వికాసాలకు తోడ్పడ్డం లేదనీ అంతా ఎరిగీకూడా, గత్యంతరం లేక, పిల్లల్ని ఉన్న బడులకే, కళాశాలలకే పంపించవలసి వస్తూవుంది. ఈ స్కూళ్ళూ కాలేజీలే ఊరూర తెరుస్తున్నారు. ఇవి కర్మాగారాల్లాగ, పందలాది విద్యార్థుల్ని తయారుచేసి, ప్రజలమీదపడి పరభాగ్యోపజీవుల్లాగ జీవించండని విడిచిపెడుతున్నాయి. తాము చదివిన చదువులు పొట్టకూటికైనా ఉపకరించక తమకు, తమ కుటుంబాలకు గ్రామాలకు, దేశానికీ, నిరర్థకాలనీ, ఉన్న నిరుద్యోగ సమస్య పెంచడాన్కి మాత్రం పనికొస్తున్నాయని పిల్లలు పెద్దవాళ్ళయ్యే కొలదీ గ్రహించవలసి వస్తూవుంది. మన పెద్ద పెద్ద లంతా "విద్య" అంటే (శరీరానికి) భుక్తి, (మనస్సుకు) శక్తి, (ఊహకు) యుక్తి, (జీవితానికి) రక్తి, (ఆఖరుకు) ముక్తి సమకూర్చగలిగిందే నన్నారు. "చదువుకున్నవారు" అంటే తమకాళ్ళపై తాము నిలబడి సంఘానికి తోడ్పడగలవారే నన్నారు. "విద్యకు ఫలితం" నిరాడంబర జీవనం- ఉన్నతాశయం, వినయం- విధేయత వగైరా సుగుణాలు అలవడ్డం అన్నారు. అలాంటప్పుడు ఇప్పటి విద్యావిధానం వీటి కన్నిటికీ స-రి-గ్గా విపరీత లక్షణాలు గల వార్ని తయారు చేయడం ప్రత్యక్షంగా అంతా చూస్తూనే ఉన్నాం, ఇంటింటా అనుభవిస్తూనే

ఉన్నాం. భారత ప్రధాని నెహ్రూ దగ్గరనుంచి, రాష్ట్రపతి, ఉప రాష్ట్రపతి, రాష్ట్ర గవర్నర్లు, ముఖ్యమంత్రులు, ప్రజాప్రతినిధులు, తల్లిదండ్రులు, విద్యార్థులవరకు- ఇది మనదేశ కాలపరిస్థితులకు సరిపడియుండపవేస్తున్నారే గాని బాగున్నదన్నవారు లేరుగదా. ఐనా యీ తప్పు తర్పీమను తగు రీతిని సవరించి, సమ్మైనది సమగ్రమైనదియైన చక్కటి విద్యావిధానాన్ని నిర్ణయించుకోలేక పోవడంకంటే శోచనీయాంశం మరొకటి కానరాదు. సుమం- మన చదువులు అప్పటి పాశ్చాత్త్య ప్రభుత్వంవల్ల నైతేనేమి, నవ-నాగరికతా - వ్యామోహానా - వివశత్వవల్ల నైతేనేమి ఏదో అలా తయారయ్యేం అనుకుందాం: స్వరాజ్యం వచ్చేకనైనా ఈ దృక్పథం మారి, ఇదిగో మా సాంప్రదాయాలకు, మా జాత్యౌన్నత్య వికాసాలకు తోడ్పడే "జాతీయ విద్యావిధానం" అని చూపించగల దింత వరకూ సాకారం దాల్చలేదు. ఇదేమీ చుల్కనగా చూడదగ్గ విషయంకాదు. 'భావి' భారతం, భారత పౌరులు ఎలాగుండాలి? అన్నదాని కంటేమంతా 'ప్రస్తుత' విద్యావిధానం ఎలాగుంది? అన్నదానిమీద ఆధారపడియుంటుందన్న సత్యం గమనిస్తే దీని ప్రాధాన్యం తెల్లమౌతుంది. ఇది ప్రజలు, ప్రభుత్వం ఎంతవరకు అవగాహన చేసుకుంటే అంతవరకు సాగేమన్నమాట- భావిభారత సౌభాగ్యానికి కొంత పడగలెత్తే మన్నమాట. అంటే (మళ్ళీ మన స్త్రీల భాషలో చెప్పాలంటే)- **"పాములపట్టం - పడగా రాగం"** వరకు వచ్చేసున్నమాట!

ఇక **"కత్తెయ్యనా - బద్దెయ్యనా, వేస్నిళ్ళా-చన్నిళ్ళా!"** అని నిర్ణయించే బాధ్యత అందరిమీద ఉంది. ఎలాగంటే బిడ్డల ప్రవృత్తి తల్లి కడుపులో పడ్డప్పుడే ప్రారంభమౌతుంది. అప్పుడూ గర్భవతిగా నున్నప్పుడూ తల్లికుండే మానసిక ప్రవృత్తినిబట్టి, బిడ్డ జీవితం ఉంటుందనడాన్కి అనేక ఋజువులున్నాయి. భావి జీవితపథకానికి ముద్ర అంతా, బిడ్డ (తల్లిదండ్రుల చుట్టూ తిరుగుతూ వారిని అనుకరిస్తూ గడిపే) మొదటి ఐదేళ్ళ ప్రాయం నాటికే నిర్ణయమైపోతుందని మానసిక శాస్త్రం తేల్చింది. గనుక తల్లిదండ్రులు తమ జీవితాన్ని ముందుగా సంస్కరించుకోవాలి. బిడ్డలికి సరియైన వాతావరణంలో, విద్యాబుద్ధులు గరపుతూ, బడిలో వేసేనాటికే చక్కటి భావాలు నాటి పోయడం జరగాలి. ఇక బడులంటే ఇంట్లో అల్లరిచేసే పిల్లల్ని పడేసేవిగాను, బడి పంతుళ్ళంటే (ఏ వృత్తి లేకపోతే బడి పంతుల వృత్తేనని) బకులు పెట్టే వారుగాను, అవి గ్రాంటులకోసరం నామమాత్రంగా నడిపేవిగాను ఉండరాదు. ఉపాధ్యాయులు ఆదర్శకులైయుండాలి. వీరి జీతాలు, గౌరవ జీవితానికి సరిపడియుండాలి. చదువు అంటే పిల్లలకు సరదాగా వుండటానికి బడులు హడలు, పంతులుగారి బెత్తాల వాతావరణంమూలాన్ని! అలాగాక ప్రేమ వాతావరణంలో సహజ మాతృశిక్షణ రీతిని విద్యాబుద్ధులు గరపడాన్కి, ఎలిమెంటరీ స్కూళ్ళలోనైనా స్త్రీలనే ఉపాధ్యాయినులుగా నియమించడం జరగాలి. చదువులు వట్టి పుస్తకాల చదువులుగాక నిత్యజీవితానికి సంబంధించినవై యుండాలి. నిరర్ధక పాఠాలుగాక, సంఘానికుపకరించే వృత్తులకు సంబంధించినవి చదవడంతోపాటు - చేయడంకూడా నేర్పాలి. బడిలో చేరేసరికల్లా కాయకష్టానికి దూరమై పోవడం, పనుల వృత్తిని ఏవగించుకోవడం, అలా కాయకష్ట పడవలసింది కూలీ-నాలీ గాని తాము ఉద్యోగాలకే మెప్పుగ పైపై బ్రతుకులు సాగించవచ్చుననుకునే దృక్పథం నశించాలి. కాయకష్టంలో ఉండే ఘనత, ఆనందం, వృత్తిలోనుండే ప్రాధాన్యత వంటబట్టాలి. పిల్లల బడి జీతాలు అందరికీ అందుబాటులో ఉండాలి. మగపిల్లల చదువులకంటె ఆడపిల్లల చదువుల్లోనున్న అవస్థలు తల్లిదండ్రులందరికీ స్వానుభవమే. అక్కడక్కడ కొన్ని స్త్రీల సంస్థలు స్త్రీలకుపకరించే చదువులు, చేతిపనులు, కళలు నేర్పించడం కొంత గ్రుడ్డిలో మెల్ల. మానవుల పూర్తి వికాసానికి విద్య ముఖ్యావసరం అని గమనించిన వెనుక బాలబాలికలందర్నీ బడిలో వేసితీరాలని ఎందుకు శాసించరాదు? బడి జీతాలిచ్చుకోలేమని, చదువుకొన్న పిల్లలు ఉభయభ్రష్టులుగా తయారవుతున్నారని, తల్లిదండ్రులు తమ పిల్లల్ని బడిలో

వేయడంలేదు. గనుక జీతాలు తీసివేసి, తగ్గించి, సరియైన విద్యావిధానం యేర్పరిస్తే అందరూ చదువుకుందుకు అవకాశం యేర్పడుతుంది. చదువులు శరీర మానసిక శక్తుల విజృంభణకు దోహదమేర్పరచేవిగాను, సంఘీభావం కళాభిరుచి, దైవభక్తి, దేశభక్తి మొదలైన భావాల్ని రేకెత్తించేవిగాను ఉండాలి. నయాగరా జలపాతాన్ని వినియోగించడం నేర్చుకున్నమనిషి, తన హృదయకోశంలోనున్న ప్రచండశక్తిని సక్రమవిధానంలో నడిపేటందుకు వలసిన శిక్షణ విధానాన్నేర్పరచుకున్నాడు గాదు, అందుకే యీ యుద్ధాలు, కష్టాలు, నన్నాడు మహాత్మాగాంధీ ఒకప్పుడు. ఇక ఇప్పుడైనా గుడుగుడు గుంచాలు మాని, పెద్ద పెద్దలు, తల్లిదండ్రులు, బడిపంతుళ్ళు, ప్రజలు, ప్రభుత్వం చక్కటి విద్యావిధానం ఒకటి అందరికీ ఆదర్శప్రాయం కాగలిగింది నిర్మిస్తారనీ, మళ్ళీ భావి భారతానికి మహోన్నత దశ ఉందనీ ఆశిద్దాం.



# జాతీయాభివృద్ధి ప్రణాళికకు బంగారం, నగకట్టు రూపంలో ఋణసహాయం.

—— :o: ——

జాతీయ ప్రణాళిక ఋణానికి బంగారం, నగల రూపేణా కూడా చందాలు చెల్లించడానికి వీలుగా ఇండియా ప్రభుత్వం ఏర్పాట్లు చేస్తున్నది. ఈ రూపేణా విరాళాలు చెల్లించదలచేవారు బంగారాన్నిగాని, నగలని గాని కొన్ని బ్యాంకులకు ఇస్తే ఆ బ్యాంకులు ఈ నగలని విక్రయించి డబ్బుగా మార్చి ప్రభుత్వ ఋణంలో నగదుగా జమగట్టురాయి. ఏ ఏ బ్యాంకులకు ఈ నగలు అప్పగించాలో ప్రభుత్వమే నిర్ణయిస్తుంది.

ఇటీవల బంగారాలూ, నగలూ ఈ ఋణానికివ్వడానికి ప్రజలలో చాలా మంది ఉద్యుక్తులైనట్లు కనపడినందువల్ల, ప్రభుత్వం నగలరూపంలో ఋణాలు తీసుకోడానికి వీలులేనందువల్లా బ్యాంకులద్వారా ఈ ఏర్పాట్లు చేయడానికి నిర్ణయించింది. ఈ విధమైన విరాళాలు చెల్లించడానికి ప్రభుత్వం ఈ క్రింది షరతులు నిర్ణయించింది.

1. బంగారం, నగలూ విరాళంగా ఇవ్వదలచేవారు ప్రభుత్వం నిర్ణయించే బ్యాంకులకుగాని, వాటి శాఖలకు గాని ఆ నగలు ఒప్పగించాలి.

2. ఈ విషయం జిల్లా కలెక్టరుకిగాని లేదా, కలెక్టరుచే ఇందునిమిత్తమే నియమించబడే స్థానిక అనధికార సంఘ అధిపతికిగాని తెలియపరచాలి.

3. ఋణప్రదాత, తను ఇచ్చిన బంగారాన్ని, నగలనూ బ్యాంకు అమ్మగా వచ్చే మొత్తాన్ని పేచీ లేకుండా ఆమోదించాలి. పోతే నగలు అమ్మగా వచ్చిన సొమ్ము ఋణంగా జమకట్టాక, దీనిపై వచ్చే వడ్డీని తను ఏ ఖజానానించి తీసుకుంటారో ముందుగా తెలియచేయాలి.

4. జిల్లా కలెక్టరుతోగాని, అతనిచే నియమితుడైన (పైన చెప్పబడిన విధంగా) ప్రతినిధితోగాని సంప్రతించి ఈ నగలను వీలైనంత ఎక్కువ ధరకే విక్రయించడానికి బ్యాంకు ప్రయత్నిస్తుంది. అమ్మగా వచ్చిన సొమ్ములో వీలైనంత ఎక్కువ సొమ్ముని ఋణానికి జమకట్టి, మిగతా సొమ్ముని (విక్రయవ్యవహారాలలో అయిన చిల్లరఖర్చులు మినహాయించి) ఋణప్రదాతకి తిరిగి యిచ్చివేస్తుంది.

---

## విజ్ఞప్తి

గృహలక్ష్మి పత్రిక వ్యవస్థాపకులు కీ. శే. కె. యన్. కేసరిగారి మృత వార్షికం సందర్భమున 'గృహలక్ష్మి'ని ప్రత్యేక సంచికగా జూన్ నెలలో ప్రచురించ దలచాము.

శ్రీ కేసరిగారి ఆప్తులు, మిత్రులు, వారి జీవితముతో అత్యంత సన్నిహిత/ సంబంధము కలిగి యుండినవారు రచించి పంపే అమూల్యమైన వ్యాసములను అందులో ప్రచురించెదము. ఈ రచనలు అచ్చులో రెండు పుటలకు మించ కుండా యుండడం మంచిది.

సి. పున్నయ్య.

సంపాదకుడు.

---

## ఆంధ్ర మహిళా సభ

## హిందీ తరగతులు

—— :o: ——

ఎప్పటివలె ఆంధ్ర మహిళాసభలో హిందీ తరగతులు ప్రారంభించబడినవి. ప్రాథమిక, మధ్యమ, రాష్ట్రభాష పరీక్షలకు శిక్షణ జరుగుచున్నది.

మే 11-వ తేదీనుండి ఆంధ్ర మహిళాసభ నర్సింగ్ హోమ్, [illegible], కుట్లు తరగతులు ప్రారంభించబడినవి.



# రాజకీయాలు

• శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు •

1954 ఏప్రిల్ నాలుగోవారం మొదలుకుని మే నెల మూడోవారం వరకూ అంతర్జాతీయ రాజకీయ రంగంలో నడిచిన సంఘటనలు మూడు అంశాలను కనపరిచినవి— (1) ప్రస్తుత పరిస్థితుల్లో అంతర్జాతీయ వివాదాల పరిష్కారానికి తటస్థ రాజ్యాలు తప్పనిసరి. ఇండియా, ఇండోనీషియా బర్మాలే ఆవిధంగా పిలవబడేందుకు అర్హతను సంపాదించినవి. (2) ఆసియా, యూరప్‌లలోనేకాక అమెరికా ఖండంలో కూడా అమెరికా విధానం అపజయం పొందుతున్నది. దానిలో మతిపోతున్న అమెరికా తనకు ఉన్న కొద్ది మిత్రుల్నీ చెడనాడుకుంటున్నది. (3) ఆడలేని ఆటగత్తె మద్దెలమీద పడి ఏడ్చినట్లుగా, సొంత సమస్యలను పరిష్కరించుకోలేని ప్రభుత్వాలన్నీ కమ్యూనిస్టులమీద పడి ఏడుస్తూ ఉంటవి.

జాతీయ వ్యవహారాల్లో చెప్పుకో తగ్గ విషయాలు కాశ్మీరుకు భారతరాజ్యాంగపర్తింపు, ప్రత్యేక వివాహాల బిల్లు స్టేట్స్ కౌన్సిల్ ఆమోదించటం.

* * *

పరస్పర అనుమానాలు, భయాలు ప్రబలిన ఈరోజుల్లో అంతర్జాతీయ వివాదాలు పరిష్కారం కావాలంటే, తటస్థదేశాలు ఉండి ఒప్పందాలను అమలు పరిచేందుకు హామీ ఇవ్వవలసి వుంటుందని కొరియా యుద్ధంలోనే తేలిపోయింది. ఆ తరవాత జరిగిన బెర్లిన్ సమావేశం, మే నెల మొదట్లో ముగిసిన కొలంబో సమావేశం, ప్రస్తుతం జరుగుతున్న జెనీవా సమావేశమూ కూడా ఈ అంశాన్ని బలపరిచినవి. ఈ తటస్థరాజ్యాల అవసరాన్ని రష్యా, బ్రిటన్, ఫ్రాన్స్ మొదలైన ప్రముఖ దేశాలన్నీ గుర్తించినవికాని, అమెరికా మాత్రం గుర్తించలేదు. గుర్తించ దలచటం లేదు.

ఈ ఏడాది మొదట్లో నాలుగు అగ్ర రాజ్యాల విదేశాంగ మంత్రులు జర్మనీ ఏకీకరణ విషయమై ఎంతో చర్చ జరిపారు కాని, పరిష్కారం కాకుండానే విరమించారు. జర్మనీని ఏకంచేయాలని అంతా అంగీకరించారు. అది ఎన్నికల ద్వారా జరగాలని అంగీకరించారు. ఆ ఎన్నికలు స్వేచ్ఛగా ఉండాలని కూడా ఒప్పుకున్నారు. కాని వాటిని ఎవరు జరిపించాలో మాత్రం ఒప్పుదల కుదరలేదు. కమ్యూనిస్టు జర్మన్లు, కమ్యూనిస్టు వ్యతిరేక జర్మన్లు ఒకరినొకరు మింగివేయాలని చూడకుండా సహకరించే మార్గం వారందరికీ సమ్మతం కాలేదు. ఎన్నికలు ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యాన జరగాలని పశ్చిమరాజ్యాలు వాదించారు. కాని చైనా, మంగోలియాలకూ, తూర్పు యూరప్ దేశాలు కొన్నిటికీ ప్రాతినిధ్యంలేని ఐక్యరాజ్యసమితి నిష్పక్షపాతికారాదని కమ్యూనిస్టులు అభిప్రాయపడ్డారు. వ్యవహారాన్ని పూర్తిగా జర్మన్లకే వదలరాదా అని కమ్యూనిస్టులు అడగ్గా, వీరికి ఒప్పందం కుదరకపోతేనో అని పశ్చిమరాజ్యాలు ప్రశ్నించారు.

ఈసమయంలో ఫ్రాన్స్ విదేశాంగ మంత్రి బీడోల్ట్ ఒక సూచన చేశారు. జర్మనీ ఎన్నికల పర్యవేక్షణకూ, ఏకీకరణ సమస్యల సంప్రదింపులకూ తటస్థ ప్రతినిధి ఒకరు పెత్తనం వహించాలనీ, వారికి ఒప్పందం కుదరని అంశాలపై ఆయన తీర్పు చెప్పాలనీ బీడోల్ట్ ప్రతిపాదించారు. ఆ పరిస్థితుల్లో అంతకుమించిమరొక తరుణోపాయం లేదు. కాని మిగిలిన అగ్ర రాజ్యాలెవరూ, ఏ కారణం వల్లనో దానిని లక్ష్యపెట్టలేదు.

* * *

సింహళ ప్రధాని సూచనమీద ఏప్రిల్ చివర్లో ఇండియా, బర్మా, ఇండోనీషియా, సింహళం, పాకిస్థాన్‌ల

ప్రధానులు కొలంబోలో సమావేశమై ఆగ్నేయాసియాకు సంబంధించిన సమస్యలను చర్చించారు. మొదట్లో అంతా సవ్యంగా గడిచిన సమావేశం చివరకు పాకిస్థాన్ ప్రధాని "పశ్చిమరాజ్యాభిమానం" వల్ల భగ్నమయేట్లు కనిపించి చివరకు పెద్ద పెద్ద మునసబులంతా జేరి తీర్మానాలను కొంత సర్దుబాటు చేసి రాజీపడిర్చారు. ఆ సమావేశం మే 2 వ తేదీన ఒక ఉమ్మడి ప్రకటన చేసింది. అందులో ముఖ్యాంశాలివి :

(1) ఇండోచైనా యుద్ధంలో ప్రత్యక్ష సంబంధం గల పక్షాలన్నీ తక్షణం యుద్ధవిరమణను గురించి చర్చించాలి. తిరిగీ యుద్ధం చెలరేగకుండా చూస్తామని అన్ని అగ్ర రాజ్యాలూ హామీ ఇవ్వాలి. ఇండోచైనాకు స్వాతంత్ర్యం ఇస్తానని ఫ్రాన్స్ ప్రకటించాలి. (2) చైనాకు సమితిలో ప్రాతినిధ్యం ఇవ్వాలి. (3) వలస సామ్రాజ్యవాదం ప్రపంచ శాంతికీ, ప్రజల ప్రాథమిక హక్కులకూ భంగకరం (4) విదేశీయ కమ్యూనిస్టులుకానీ, కమ్యూనిస్టు వ్యతిరేకులు కానీ, తదితరులు కానీ తమ అంతరంగిక వ్యవహారాల్లో జోక్యం కలిగించుకుంటే ఆసియా దేశాలు సహించవు. (5) ఒకరి వ్యవహారాల్లో మరొకరు జోక్యం కలిగించుకోరు.

ఇండోచైనాలో యుద్ధంలో సంబంధం ఉన్న వాళ్ళు తప్ప ఇతరులు జోక్యం కలిగించుకోరాదన్న సూచనను పాకిస్థాన్ ప్రతిఘటించగా, యుద్ధవిరమణ సంప్రదింపుల్లో ప్రత్యర్థులకు సమ్మతమయిన ఇతరులను కూడా పిలవవచ్చునని చెప్పబడ్డది. ప్రస్తుతం శాంతికి, ముఖ్యంగా ఆసియా, ఆఫ్రికాలలో శాంతికి ప్రధానాటంకం వలస వాదమేననీ, కమ్యూనిజం అంతర్జాతీయ స్థాయిలో ప్రమాద కారిగా లేదనీ నెహ్రూ, ఇండోనీషియా ప్రధాని శస్త్రో అమిజయో, బర్మా ప్రధానినూ అభిప్రాయ పడ్డారు. కాని పాకిస్థాన్ మాత్రం ప్రపంచ శాంతికి ముఖ్య ప్రమాదాల్లో కమ్యూనిజం ఒకటని వాదించింది. వలసవాదంతోపాటు కమ్యూనిజాన్ని కూడా నిరసించాలని కోరగా, పై తీర్మానాలు చేయబడ్డవి.

కమ్యూనిస్టు ప్రమాదం అంతరంగిక పరిస్థితులను పట్టే వుంటుందని బర్మా, ఇండోనీషియా, ఇండియాలు అనుభవాన్ని పట్టి గ్రహించినవి. ఈనాటికీ బర్మాలో కమ్యూనిస్టులు తిరుగుబాట్లు జరుపుతున్నా, అవి స్వదేశీయుల వల్లనే జరుగుతున్నవని బర్మా ప్రభుత్వానికి తెలుసు. విదేశీయ జోక్యం ఉన్నదీ అంటే అది కమ్యూనిస్టు వ్యతిరేకులయిన కోమింటాంగ్ వల్లనే వచ్చిందని తెలుసు. అట్లాగే ఇండోనీషియాలో కూడా మాజీ ప్రధాని షరీఫుద్దీన్ నాయకత్వాన తిరగబడి ఓడిపోయిన కమ్యూనిస్టులు కూడా స్వదేశీయులేనని ఆ ప్రభుత్వం గుర్తించింది. అక్కడ విదేశీ జోక్యం ఏదయినా ఉన్నదీ అంటే, అది ఇండోనీషియాను "రక్షణ" ఒప్పందంలోకి ఇరికించాలని అమెరికా చేసిన ప్రయత్నాల్లోనూ, ఇండోనీషియా అంతర్భాగమయిన ఇరియాన్ (పశ్చిమ న్యూగినీ)ని ఆక్రమించుకున్న డచ్చివారి వల్లనూ, వారిని సమర్థించిన ఆస్ట్రేలియా వల్లనూ మాత్రమేనని గుర్తించింది.

తెలంగాణాలో కమ్యూనిస్టు సమస్యను అక్కడి జాగీర్దారీ, రజాకార్ల పాలనలేననీ, స్థానిక ప్రజలే వారి బలానికి కారణమనీ గత ఎన్నికలు నిరూపించినవి. ఇండియాలో విదేశీయ జోక్యం అన్నది కాశ్మీర్‌లోను, విదేశీ మిషనరీల చర్యల్లోనూ ఉన్నదని స్పష్టమవుతున్నది. పాకిస్థాన్, సింహళాలకు చెప్పుకోదగ్గ కమ్యూనిస్టు సమస్యలే లేవు. కాని అవి కమ్యూనిజాన్ని నిరసించాలని కోరటం వల్ల, వాటి శాంతి సందేహానికి గురి అయింది. అంతేకాక అమెరికా దగ్గర సైనిక సహాయం తీసుకున్న పాకిస్థాన్ తటస్థంగా ఉండటం అసంభవం.

తటస్థ సిద్ధాంత ప్రతిపాదకుడయిన నెహ్రూ ఈ సభలో పార్లమెంటులో అనేక సందర్భాల్లో నొక్కిచెపుతూ అంశాలను ఉద్ఘాటించారు. కొలంబో సభ తీర్మానాలు ఆయన సూచన ప్రకారమే జరిగినవి.

* * *

జెనీవా సమావేశంలో ఇండోచైనా సమస్యపై చర్చ కొలంబో సూచన ప్రకారమే జరుగుచున్నది. వీట్మిన్ సేనలు విజయాల మీద విజయాలు సాధిస్తూకూడా, ఎంతో సౌహార్ద్యాన్ని నిగ్రహాన్ని ప్రదర్శిస్తున్నారు. దీనిని నెహ్రూ కూడా ప్రశంసించారు. ఇండోచైనా పరిష్కారానికి లావోస్, కాంబోడియాల సంబంధం లేకుండా చేసి, వాటిని 'సహచార' రాజ్యాల హోదాలో ఉంచాలని పశ్చిమ

పశ్చిమ రాజ్యాల్లో బ్రిటిష్ విదేశాంగ మంత్రి ఈడెన్ మాత్రం ఈ ఎన్నికల పర్యవేక్షణకు తటస్థ రాజ్యాలు రావాలని ప్రతిపాదించారు. సమితి కానీ, సమ్మతమయిన ఇతరులు కానీ పర్యవేక్షణ జరపాలన్నారు.

ప్రధాని నెహ్రూ పార్లమెంటులో కొరియా, ఇండో చైనా సమస్యల పరిష్కారంపై మాట్లాడుతూ ఉత్తర కొరియన్ మార్గాన్ని సమర్థించారు. తక్షణ ఏకీకరణ కుదరకపోతే ఉభయ ప్రాంతాలనూ విడివిడిగానే ఉండనిచ్చి, ఉన్న తాధికారులలో ఉమ్మడి సంఘాన్ని ఏర్పాటు చేయాలనీ, వేడి చల్లారిన తరవాత ఇది ఏకీకరణ సాధించగలరనీ అన్నారు. ఇండో చైనాకు కూడా ఇదే పద్ధతి పనికివస్తుందన్నారు.

*　　*　　*

పై విషయాలన్నిటినీ పట్టి తేలే అంశాలు రెండు— (1) బయటివాళ్ళు తల దూర్చకుండా ఉన్నప్పుడే సమస్యల పరిష్కారం సాధ్యం. (2) ఆ సంప్రదింపులను సానుకూల పరచటానికీ, అమలుజరపటానికీ తటస్థ రాజ్యాలు అవసరం. (3) ప్రస్తుతం ఇండియా, బర్మా, ఇండోనీషియాలే ఆ గౌరవానికి తగిఉన్నవి.

అయితే కొరియాలో ఖైదీల సరటా తటస్థ సంఘకార్య క్రమాన్ని అమెరికా, దక్షిణ కొరియాలు ఏ విధంగా భగ్న పరిచినవో చూసిన మీదట, ఈ ప్రతిపాదనలు అమెరికాకు ఎందువల్ల గిట్టటం లేదో తెలుస్తున్నది. కొరియాలో తటస్థ రాజ్యాల జోక్యం 'విఫలం' అయింది కనుక, దానివల్ల లాభం ఉండదని అమెరికా ప్రచారం మొదలు పెట్టిందని వార్తలు వచ్చినవి.

ఇండో చైనాలో ఎన్నికలు పెడితే వీట్మిన్‌లే గెలుస్తారనీ, అందువల్ల అవి జరక్కుండా చేసేందుకే అమెరికా ప్రయత్నిస్తున్నదనీ ఫ్రెంచి పౌరులు, బ్రిటిష్ పార్లమెంటు సభ్యులు ఆరోపిస్తున్నారు. అమెరికాతో చేయి కలిపి ఇండో చైనా పరిష్కారం కుదరకుండా చేస్తున్న ఫ్రెంచి ప్రధాని లానియల్ ప్రభుత్వాల పక్షంలో నయినా కూలి పోయేట్లున్నది.

బల ప్రయోగ సిద్ధాంతాన్నే నమ్ముకున్న అమెరికా ఈ నెల 19 వ తేదీన పాకిస్థాన్‌తో సైనిక సహాయ ఒప్పందం చేసుకున్నది. ఆగ్నేయాసియాలో సైనిక ఒప్పందం చేసుకునేందుకు బ్రిటన్ తటపటాయిస్తున్నందుకు కంటగించుకుంటున్నది. బ్రిటన్ లేకుండానే ఒప్పందం ఏర్పాటు చేయగలమని ప్రెసిడెంటు ఐసన్‌హోవర్ ప్రకటించారు. ఇది నరకే అంజూస్ ఒప్పందంలో (ఆస్ట్రేలియా, న్యూజిలాండు యు.ఎస్.ఎ.) బ్రిటన్‌ను అమెరికాలో సిరా ఉన్నది.

*　　*　　*

ఆసియా, యూరప్‌లలోనే కాక దక్షిణ అమెరికాలో కూడ అమెరికా విధానానికి అపజయం కలిగింది. దక్షిణ అమెరికా రాజ్యాలకు కమ్యూనిస్టు బెదురు చూపి, తన దోపిడి విధానాన్ని సాగించుకోవాలని చూసిందికాని, చాలా దేశాలు తమ వ్యవహారాల్లో జోక్యము కలిగించుకోవద్దని హెచ్చరించినవి. అయితే కమ్యూనిజాన్ని అవి నిరసించినవికాని, గ్వాటెమాలా మాత్రం నిరాకరించింది.

అందుకని అమెరికా, బ్రిటన్‌లు సాగించిన గ్వాటెమాలా వ్యతిరేక ప్రచారం ఇప్పుడు ముదిరిపోయింది. కమ్యూనిస్టు దేశాలనుంచి గ్వాటెమాలాకు ఆయుధాలు వస్తున్నట్లు అమెరికా ఆరోపించింది. కమ్యూనిస్టుకాని స్వీడన్‌ను కూడ ఆయుధాలు అమ్మరాదని అడ్డగించింది. బ్రిటన్ గ్వాటెమాలాపై తన వలసరాజ్యం హోండ్యురాస్‌తో జోక్యం కలిగించుకుంటున్నట్లు ఆరోపించి ఉన్నది.

ఈ దుష్ప్రచారపు మొదటి ఫలితం గ్వాటెమాలాతో మరొక దక్షిణ అమెరికన్ రాజ్యమయిన నికరాగువా తెగ తెంపులు చేసుకోనటం. మన్రో సిద్ధాంతం పేరుతో అమెరికా దురాక్రమణ చేసినా ఆశ్చర్యం ఉండక్కర్లేదు.

*　　*　　*

ఏప్రిల్ చివర ఆస్ట్రేలియా, రష్యా తెగ తెంపులు చేసుకున్నవి. ఆస్ట్రేలియాలో రష్యా రాయబారి కార్యాలయోద్యోగి పెట్రోవ్ గూఢచారిగా పనిచేస్తూ, ఆస్ట్రేలియా ఆశ్రయంకోరినట్లూ అందువల్ల తమ ఆధీనంలో ఉంచుకున్నట్లూ ఆస్ట్రేలియా ప్రకటించింది. అతర్గో ఆస్ట్రేలియా అధికారాలు అపహరించారని రష్యా ఆరోపించి సంబంధాలు తెంచివేసింది. పెట్రోవ్ సంఘటన రాబోయే ఎన్నికముందు లేబర్‌పార్టీ వాళ్ళమీద దెబ్బతీసేందుకు సృష్టించబడ్డట్లు

భావించబడుతున్నదని 'హిందూ' పత్రిక విలేఖరి డేవిడ్ మార్టిన్ వ్రాశాడు. దాని తరువాత ఆస్ట్రేలియా ప్రభుత్వ విచారణలో కూడా రష్యా విదేశాల్లో గూఢ చారులకు డబ్బు, దస్కం ఇవ్వదనీ, కమ్యూనిస్టు అభిమానులు తమ అభిమానం కొద్దీ గూఢచారులుగా పనిచేస్తారనీ చెప్పిన అంశం కూడా ఈ అనుమానాలను బలపరుస్తున్నది. కమ్యూనిస్టు అభిమానులన్న పేరుతో అతివాద సోషలిస్టులందరినీ దెబ్బ తీసే వీలు ఉన్నది.

ఇట్లాగే పాకిస్థాన్ కూడా కమ్యూనిస్టు నెపంతో ప్రత్యర్థుల్ని అణచివేయ చూస్తున్నది. ఢక్కా నార మిల్లులో బెంగాలీలూ, బెంగాలీలు కానివాళ్ళూ బాహాటీపల కొట్టుకోగా కొన్ని వందలమంది చనిపోయినారు. దీనికి కమ్యూనిస్టులు కారకులనీ, వారిని నిషేధించాలనీ పాక్ ప్రధాని తెలియజేశారు. తూర్పు బెంగాల్ ప్రధాని ఫజ్లుల్ హక్ దీనికి సమ్మతించలేదని తెలుస్తున్నది.

ముస్లింలీగ్‌ను ఓడించిన బెంగాలీ ముస్లింలమీద, లీగ్ అభిమానులయిన పశ్చిమ పాకిస్తాన్ ముస్లింలు ఆగ్రహావేశంలో ఉన్నారన్న సంగతి గమనిస్తే, తూర్పు బెంగాల్‌కూ కమ్యూనిస్టులకూ ముడిపెట్టి, హక్ ప్రభుత్వాన్ని కూలదోయటానికి జరుగుతున్న ప్రయత్నాలే ఇవి అని చెప్ప వలసి ఉంటుంది.

* * *

ఫ్రెంచి ఇండియా భవిష్యత్తుపై ఫ్రాన్సూ, ఇండియాకూ పారిస్‌లో మే 15 నుంచీ సంప్రదింపులు జరుగుతున్నవి. వెంటనే పరిష్కారం కుదరకపోతే స్థానిక ప్రజోద్యమాలు పెడదార్లు తొక్కగలవని నెహ్రూ వివరించారు. ఇప్పటికి ఫ్రెంచి ఇండియాలో మూడింట రెండువంతుల్ని ప్రజలు ఫ్రెంచి పాలననుంచి విడిపించారు.

పోర్చుగీస్, ఫ్రెంచి స్థావరాలనుసరించి ప్రధాని నెహ్రూ పార్లమెంటులో మాట్లాడుతూ, అట్లాంటిక్ ఒప్పందం వంటి విదేశ ఏర్పాట్లేవీ వీటికి వర్తించవని ఉద్ఘాటించారు.

ఇండియా, చైనాలు టిబెట్‌పై చేసుకున్న ఒప్పందాన్ని నెహ్రూ సమర్థిస్తూ, గత 7 సం॥లనుంచీ ఇంత కన్నా ఉత్తమ కార్యాన్ని, ఇంతకన్నా న్యాయికమైన విషయాన్ని ఇండియా సాధించలేకపోయిందన్నారు. ప్రపంచానికంతటికీ ఆదర్శప్రాయమైన ఒప్పందం ఇది అన్నారు.

కాశ్మీరుపై ఢిల్లీ ఒప్పందం ప్రకారం భారత రాజ్యాంగాన్ని సవరింపచేస్తూ రాష్ట్రపతి మే నెలలో ఉత్తర్వు చేశారు. ఇది జన వాక్యం హామీనికానీ, ఇతర వాగ్దానాలను కానీ భంగ పరచదని నెహ్రూ హామీ ఇచ్చారు.

భారత సేట్స్ కౌన్సిల్ ప్రత్యేక వివాహాల చట్ట సవరణ బిల్లును ఆమోదించింది. ఇది మతాంతర, వర్ణాంతర వివాహాలను రిజిస్ట్రేషన్‌తో గుర్తిస్తుంది. ఈ వివాహాల కనీస వయస్సును 21 సం॥లుగా నిర్ణయించింది. పరస్పర సమ్మతిపై విడాకులివ్వటానికి అంగీకరించింది. పార్లమెంటు దిగువ సభ వచ్చే సమావేశంలో దీనిపై చర్చిస్తుంది. దీనితోపాటు స్త్రీల ఆస్తి వారసత్వపు హక్కు బిల్లు కూడా రానున్నదని తెలుస్తున్నది.



* (10వ పేజీ తరువాయి.)

రాజ్యాలు తంటాలు పడుతున్నవి. వీట్నాంలో తమను మోస్తారే వీటిల్లో కూడా ప్రతిఘటనోద్యమాలను గుర్తించాలని వీట్మిన్‌లు వాదిస్తున్నారు. ఈ సమస్య అంతట్లోనూ బ్రిటరాజీ మార్గాన నడుద్దామని ప్రయత్నించటం, అమెరికా ప్రాల్పులు పడగొట్టటం జరుగుతున్నది. ఆ విషయమై సన్నాహాలు కూడా జరుగు తున్నవి. ఇండోచైనా పరిష్కారానికి ఆసియా రాజ్యాల సహకారాన్ని సాధించాలని కూడా బ్రిటన్ ప్రయత్నిస్తున్నది.

జెనీవాలో కొరియా ఏకీకరణపై చర్చలుకూడా సాగుతున్నవి. ఇందులోకూడా పశ్చిమ రాజ్యాలకు ఏకాభిప్రాయం కుదరలేదు. ఉత్తర కొరియా ప్రతినిధి ప్రతిపాదన ప్రకారం ఎన్నికలు, ఏకీకరణ అన్నవి ఉత్తర,దక్షిణ కొరియాలు సమిష్టిగా నిర్వహించ వలసి వుంటుంది పశ్చిమ.

(11వ పేజీలో చదవండి)

# స్త్రీలు : సంసారం : ఉద్యోగాలు

రచన :
"ఒక గృహిణి"

సమర్పణ :
బుద్ధవరపు సత్యనారాయణ

మీరు గృహిణిగా ఉంటూ ఏదైనా ఉద్యోగం చేస్తున్నా రనుకోండి. మీ సంపాదన నెలకు ఎనభై రూపాయ లయినా, లేక ఎనిమిది వందల రూపాయలయినా మీ ఉద్యోగాన్ని గురించి మీ భర్త సాధారణంగా పరిపరి విధాలుగా ఆలోచిస్తూ ఉంటారు. ఒక్కొక్కసారి మీ మీద నీచభావం జనించి ఆయన తెగతెంపులు చేసుకొందామా అన్నంత తీవ్రంగాకూడా అనుకోవచ్చు. మరో సందర్భంలో - ఇటు సంసారాన్ని చక్క దిద్దుకుంటూ అటు ఉద్యోగాన్ని కూడా సక్రమంగా చేసుకొంటున్న మీ సామర్థ్యాన్ని ఆయన తన మనస్సులో మెచ్చుకోనూ వచ్చు.

ఆయన ఆలోచనలు నిర్ణయాలు ఆయన పుట్టి పెరిగిన వాతావరణాన్ని బట్టీ, సంస్కారాన్ని బట్టీ ఉంటాయి. మీరు ఏమే వేళల్లో పని చేసేదీ, మీరు చేసే పని స్వభావం కూడా ఆయన నిర్ణయాలకు కారణాలవుతాయి.

ఇంట్లో పసిపిల్లలు వుంటే వాళ్ళని వదలి మీరు ఉద్యోగం చేస్తూవుంటే ఆయనకు సుఖం ఉండకపోవచ్చు. పిల్లలెవరూ లేనప్పుడు మీరు ఉద్యోగం చేయడం ఆయనకు ఇష్టమూకావచ్చు. ఆయన స్నేహితుల భార్య లెవళ్లూ ఉద్యోగాలు చేయకుండా ఉండగా ఒక్క మీరు మాత్రమే ఆ పని చేస్తూ ఉండడం జరిగినా ఆయన మదన పడడానికి ఎక్కువ అవకాశం ఉంటుంది.

మీరు డబ్బు సంపాదన దృష్టితో ఉద్యోగం చేస్తున్నా, లేక అందువల్లవుండే ఆనంద మేమిటో తెలుసుకుందామనే ఉద్దేశ్యంతో పనిచేస్తున్నా, మీరు ఆయనయందు కనబరచే శ్రద్ధా భక్తులమీద ఆయన దృక్పథం ఆధారపడివుంటుంది.

తెలిసో తెలియకో, మిమ్మల్ని ఉద్యోగం చేయడానికి అనుమతించే విషయంలో 'అవునా-కాదా' అన్న వ్యాకుల పాటును ఆయనలో కలిగించడానికి మీరు కారణం కావచ్చు అజాగ్రత్తగావుంటే !

ఉదాహరణకు లలిత విషయమే తీసుకోండి. ఆమె, ఆమె భర్తకూడా మధ్య తరగతి కుటుంబాలనుంచి వచ్చిన వాళ్ళే. వాళ్ల జీవితాలు హాయిగా గడిచిపోతూ వుండేవి.

మోహన్, ఆమె భర్త, ఒక వ్యాపార సంస్థలో గౌరవ ప్రతిపత్తులు కలిగిన ఉద్యోగాన్నే చేసేవాడు. కాని ఎందు చేతో ఆయనకు ఆ ఉద్యోగంలో సుఖం కనిపించలేదు. ఏదో నరకకూపంలో ఉన్నట్టు బాధపడేవాడు. అందుకు తగినట్టుగానే ఆ ఉద్యోగంలో అభివృద్ధిగాని ఏ ఇతర సౌకర్యంగాని లేకుండా పోయింది. ఇంక ఆ ఉద్యోగంతో లాభం లేదని నిర్ణయించుకుని దీన్ని వదులుకుని మరేదో చిన్న వ్యాపారం పెట్టుకుందామని నిశ్చయించుకున్నాడు.

అంతవరకూ తనుకూడ బెట్టిన కొద్ది మొత్తంతోటి ఒక చిన్న వ్యాపారం ప్రారంభించాడు. పరిస్థితులు గుర్తించి లలిత కూడా రేషనింగ్ ఆఫీసులో ఖాళీ వుంటే అందులో చేరింది.

పరిస్థితులు గడ్డుగా వుండడం వల్ల ఇద్దరూకూడా అవిశ్రామంగా పని చేసుకొనేవారు. దాని ఫలితంగా ఇద్దరూ కూర్చొని కనీసం కాసేపు కష్టసుఖాలు చెప్పు కుందుకైనా సరిగ్గా సమయం దొరికేదికాదు. ఇద్దరికీ కూడా ఏమిటో ఏదో పోగొట్టుకున్నట్లుండేది. జీవిత మాధుర్యానికి దూరమౌతున్నట్టు బాధపడేవారు.

లలిత కూడా ఏదో పని చేసి కొద్దోగొప్పో సంపాదిస్తూ వున్నా ఒక్కొక్కసారి ఇంట్లో గడవడమే కష్టమనిపించేది వాళ్ళకి. మోహన్ మాత్రం ఎంత నిరుత్సాహకరంగా ఉన్నా తన వ్యాపారాన్ని మానలేదు.

ఇల్లాగే కష్టంగా రెండేళ్ళు గడచేసరికి మోహన్‌కి వ్యాపారంలో సుస్థిరత ఏర్పడి పెద్దలాభాలు లేకపోయినా నష్టం మాత్రం కలిగించని స్థితి వచ్చింది. ఈ అభివృద్ధిని అంతగా నమ్మడానికి లేకపోయినా అతనికి బాగా ధైర్యం

# స్త్రీలు - సంసారం - ఉద్యోగాలు

వచ్చింది. అటువంటప్పుడు లలిత తన ఉద్యోగం మానేస్తేనే మంచిదికదా అనిపిస్తుంది మనకి!

కాని ముందు వెనకలు ఆలోచించుకొని లలిత ఉద్యోగం మానలేదు. చన్నీళ్ళకు వేడినీళ్ళ సాయ మన్నట్లు కుటుంబం యిబ్బందులు లేకుండా సాగిపోతూ వుండేది. దానికి అనుగుణంగా వాళ్ళ కోరికలుకూడా విస్తృత రూపం దాల్చాయి పది రూపాయలు మిగిలేసరికి!

వాళ్ళు నివసించే పట్టణానికి దగ్గరలోనే ఒక ఇల్లు కట్టుకోవాలని వాళ్ళ వాంఛ. ఇంకా....రోజులు బాగుంటే ఇద్దరు పిల్లలు....ఒక కుట్టు మిషను....అందరికీ చక్కటి బట్టలు....ఇవి కలలు. కొద్ది కాలంలోనే ఆమె కోరికలు ఫలిస్తున్నాయి.

ఆమె ఉద్యోగం మానకుండా ఉండడం వల్ల వచ్చే ఆదాయం వాళ్ళ కుటుంబానికి ఎంతగానో తోడ్పడుతూంది. తన ఆదాయంలో చాలా భాగం బ్యాంక్‌కి పంపుతోంది మన లలిత ఇప్పుడు! ఆమె కన్న కలలు నిజం చేసుకోడానికి.

వివేకంతో ఆమె తన భర్త కష్టసుఖాలను పంచుకొంది. అతనికి అవసరమైనప్పుడు చేయూత నిచ్చింది. త్వరలో పరిస్థితులు అదుపులోనికి రాగానే పూర్తిగా ఉద్యోగం మానేసి తన భర్తతో హాయిగా ఎప్పుడూ కాలం గడపాలనుకుంటోంది లలిత!

ఈ విషయాన్ని చూచిన తరువాత మనం నేర్చుకోవలసిందేమిటి?—లలిత చాలా తెలివైనది. ఆమె ఇటు ఏలోటూ రాకుండా భర్తను భక్తి శ్రద్ధలతో చూచుకొంది. అటు పల్లెత్తు మాట పడకుండా ఉద్యోగం చేసింది. ఈ రెండు పనులకూ లలిత యొక్క నేర్పరితనం వల్లనే సామరస్యం ఏర్పడి ఆమె జీవితంలో కలతలు కలుగలేదు. పైగా ఆమెకు ఈ పని ఒక సాహస కృత్యం చేస్తున్నట్టుగాను, ఎంతో హాయిగాను కూడా కనిపించింది. ఇందులో రహస్యమంతా ఆమె భర్తయందూ, ఉద్యోగంయందూ చూపిన సక్రమదృక్పథంలోనే వుంది.

అందుచేత, ఏదో ఇతర కారణం వుంటే తప్ప 'నా భార్య కూడా సంపాదిస్తోందే' అన్న విషయం భర్తను అంతగా కలవరపెట్టదు. తను సంపాదిస్తున్నానే అన్న విషయాన్ని కొందరు స్త్రీలు చెడుగా ప్రదర్శించడం జరుగుతూ వుంటుంది కూడా. అటువంటప్పుడు భర్తకంత చెందక ఏమవుతాడు మరి?

అంత ఎందుకు? ఫ్రేని సంగతి చూడండి. మీకే తెలుస్తుంది. ఈమె కూడా ఇబ్బందిగావుంటే డబ్బు కోసమే పని చేస్తోంది. పిల్లల చదువులు, జీతనాతాలు కట్టడానికి ఉపయోగిస్తుందనో, డబ్బు విషయంలో ఇబ్బంది సమపండా కుటుంబం యొక్క జీవన ప్రమాణం పడిపోకుండా చూసుకొనేందుకనో మొత్తంమీద సంసారం కోసమే పనిలో ప్రవేశించింది. ఆమె చేస్తున్న ఉద్యోగం మీద వచ్చే ఆదాయం కుటుంబానికి ఎక్కువగా తోడ్పడుతున్న సంగతి ఎవ్వరూ కాదనలేరు. ఆమెకు మాత్రం ఈ పరిస్థితి చాలా క్లిష్టంగానూ, మహాత్కార్యాన్ని నెరవేరుస్తున్నట్టుగాను ఉంది. తన భర్తకు తోడ్పడుతున్నాననే సంగతే ఆమె మరిచిపోయింది. జ్ఞానం వల్లనో అజ్ఞానం వల్లనో గాని ఆమె తన భర్త అపజయం పొందాడని అభిప్రాయం ఏర్పరచుకొంది.

ఓ సందర్భంలో విసుక్కుంది కూడా భర్తని. 'మీ జీతాన్ని ఎక్కువ చెయ్యమని అడగండి. మీరు ఇంకా చాలా కష్టపడి పని చెయ్యాలి. ఏదోవిధంగా ఎక్కువ సంపాదించడానికి ప్రయత్నం చెయ్యాలి' అని ఆయన ముందు తరచు అనేది.

ఎప్పుడూ ఏదో శక్తికిమించి ఎంతగానో శ్రమపడి అలసి పోయినట్టు ఉండేది. ఏ ఇతర విషయాన్ని పట్టించుకొనేదికాదు. తనేదో 'ఘనకార్యం సాధిస్తూ లోకానికి మహోపకారం చేస్తున్న' దానిలా కనిపించేది. దీనివలతా భర్త ముందు ఏదో విధంగా ఎప్పుడూ ప్రదర్శనం చేస్తూ ఉండడం ఆమెకు అలవాటయిపోయింది. ఎప్పుడేనా ఆమె భర్త ఏదన్నా వస్తువు కొనడానికి వెనుదీసి — సందేహిస్తూంటే, 'నా' జీతంలోనించి దాన్ని కొంటాను.... అని అంటూవుండేది. అటువంటి సమయంలో భర్త ఏమనుకుంటాడో మీరే ఊహించండి!

ఫ్రేని ఉద్యోగం చేయవలసిన అవసరం లేకపోయినా మరేదో కారణంతో భర్తమీద పెత్తనం చలాయించి వుండేదేనేమో. ఆమె తీరే అంత. ఆమె గాని అటువంటి స్వభావం గల స్త్రీలు గాని జీవితంలో సుఖపడడం కలలోని మాట!

ఆంధ్ర మహిళ

# స్త్రీలు - సంసారం - ఉద్యోగాలు

నిజంగా ఎంత కష్టాల్లో వున్నా ఎంతగా జీవితంలో అపజయం పొందినా, 'మీరు పూర్తిగా అసమర్థులు. కుటుంబాన్నే పోషించ లేకపోతున్నారు' అనే అభిప్రాయాన్ని భార్య వ్యక్తం చేస్తే ఏ భర్త అయినా భరించగలడా మరి !

లోకంలో ఉద్యోగం చేసే స్త్రీలు అందరూ లలిత లాగానూ ఉండలేరు. శ్రేణి లాగానూ ప్రవర్తించరు. మధ్యస్థంగా పోతూ ఉంటారనుకోండి. కొన్నాళ్ళు మీరు చేసే ఉద్యోగం మీకు ఎంతో హాయిగా ఉంటుంది. ఒక్కొక్కసారి భరించలేనంత భారంగా కూడా పరిణమించడం జరుగుతుంది.

మీరు సంపాదించే డబ్బు మీ కుటుంబ పోషణకు అత్యవసరమైతే ప్రత్యేకమైన శ్రద్ధవహించి ఓర్పుతో నెట్టుకు రావాలి ఉద్యోగాన్ని. ఏదో విలాసాలకైనా ఉపయోగిస్తుందిలే అనే భావంతో పని చెయ్యడం మరో విషయం.

మీరు ఉద్యోగం చేస్తున్నా మీ కుటుంబంలో శాంతి సౌఖ్యాలు ఉండాలంటే, మీ కుటుంబం అంతా కళకళ్లాడుతూ ఉండాలంటే మీరు కొన్ని సంగతులను ముందుగా గ్రహించుకొని అందుకు అనుగుణంగా నడచుకోవలసి ఉంది. మీకు సహాయకారిగా ఉండడానికి కొన్ని సూచనలు ఇక్కడ ఇస్తాను :

మీరు, ఏదో విమోచనం కోసం పోరాడుతున్నామనే భావాన్ని వదలిపెట్టాలి. కొన్ని కుటుంబాలలో స్త్రీలు పురుషులయందు, ముఖ్యంగా కట్టుకున్నవారియందు వీర వనితలులా ప్రవర్తించడం కద్దు. ఇది క్షేమకరం కాదు. పురుషుడు స్త్రీలను అణగద్రొక్కుతున్నాడని, తమని కీలుబొమ్మలా ఉపయోగించుకుంటున్నాడని అనుకోవడం వల్ల, దాని ఫలితంగా తిరుగుబాటు స్వభావాన్ని ఏర్పరచుకోవడం వల్ల సాధించగలిగేది ఏమీ లేదు. అందుచేత మీ భర్తయందు ప్రేమను పెంపొందించుకొందుకు ఎక్కువగా ప్రయత్నించాలి.

'ఇది నా డబ్బు' అనే అభిప్రాయం వదలి మొత్తం ఇద్దరి ఆదాయంతోనూ కుటుంబ అవసరాలు సులభంగా గడచేటట్టు చూసుకోవాలి.

మిమ్మల్ని మీరు ప్రశ్నించుకోండి. "నేను ఉద్యోగం చెయ్యడం వల్ల నాకు ఎంతవరకు తోడ్పడింది ? పిల్లల విషయంలో ఆర్థికంగా తోడ్పడగలుగుతున్నానా ? నేను ఉద్యోగం చేయడం వల్ల మొత్తంమీద కుటుంబంలో స్థితిగతులు ఏవిధంగా ఉన్నాయి ?"

పిల్లల్ని మీరు అశ్రద్ధ చేశారా కుటుంబం కూలిపోతుంది. తరవాత పశ్చాత్తాపడి ప్రయోజనం వుండదు. మొదట్నుంచీ మీరు వద్దని పెడుతూన్న పోరే ఇంతా చేసింది, అని భర్తను అనుకున్నా ఉపయోగం ఉండదు.

ప్రతి పనీ మీరు చెయ్యడానికి అవకాశం ఉండదు. మామూలుగా ఖాళీగా ఉన్నప్పుడు చేసినట్టుగా. ఇటువంటప్పుడు మీ ఆయనా మీరూ కూర్చొని ఒక కార్యక్రమాన్ని ఏర్పాటు చేసుకోవడం చాలా మంచిది. మీ ఇంటి పనుల్లో సహాయం చేయడానికి ఎవరినైనా అవసరమైతే తక్కువ ఖర్చుతో కుదుర్చుకోవడానికి వెనుదీసి రెండువిధాలా బాధపడడం మంచిదికాదు.

ఇటు ఇంటి పనులన్నీ మీరే చూసుకుంటూ, అటు ఉద్యోగం రోజంతా చెయ్యాలంటే అసాధ్యం. అఁ, అదేమిటిలే అని రెండూ మీరే చెయ్యబోతారు. అందని సముద్రంలో ఈత ప్రారంభించినట్టవుతుంది. తరువాత మీకే తెలిసివస్తుంది !

ఎవరినైనా పనిమనిషిని పెట్టుకున్నా మీరు 'మీరు'గా చేయవలసిన పనులేమిటో గుర్తు పెట్టుకోవాలి. వాటిని అశ్రద్ధచేసి నిర్లక్ష్యాన్ని ప్రదర్శించారా ఫలితాలు సక్రమంగా ఉండవు.

ఉదాహరణకు చూడండి. వంటఇల్లు భోజనాల గది శుభ్రంగా ఉండేటట్టు ప్రత్యేకం మీరు శ్రద్ధతీసుకోవలసి వస్తుంది. లేక పిల్లల బట్టలు చినిగితే సూది దారంతో మీరు సరిచెయ్య వచ్చు, అవసరమైతే కొన్ని సుఖాలు వదులుకునైనా మీరు ఈ పనులు చెయ్య వలసి వస్తుంది.

మీ భర్త ఏదైనా అసంతృప్తిగా ఉన్నారనుకోండి. వెంటనే ప్రశ్నించుకోండి. 'ఆయన నాయందు ఏర్పడ్డ ఈ అసంతృప్తి సబబైనదేనా, అని సబబే అయితే మీరు దానిని తొలగించాలి.

భోజనం చేసేటప్పుడు మీరు దగ్గర ఉంటే ఆయన ఎక్కువ సంతోషిస్తారు. వీలైనంత వరకూ ఉండేందుకే మీరు ప్రయత్నం చెయ్యాలి. ప్రతి భర్త భార్య నుంచి ఆశించేవి కొన్ని సంగతులు ప్రత్యేకంగా ఉంటాయి.

## స్త్రీలు - సంసారం - ఉద్యోగాలు

వాటిలో ముఖ్యమైనది తనభార్య తనయందు నిజమైన శ్రద్ధా భక్తులు చూపాలి అన్నది. ఇటువంటి ప్రధాన విషయాల్లో అశ్రద్ధ తగదు.

మీరు ఉద్యోగం చేస్తున్నా, ఎంత పెద్దగా సంపాదిస్తున్నా ఆధిక్యతను మీరు కైవశం చేసుకుంటున్నారనే భయం ఆయనకు కలుగకుండా చూసుకోవాలి మీరు.

అన్నిటికంటె ఎక్కువగా మీరు సౌహార్ద్ర భావాన్ని వృద్ధి చేసుకోవాలి. పరిస్థితులకు అనుగుణంగా నడచుకోవడం నేర్చుకోవాలి అవసరమైతే, ఏదైనా చిన్న అసౌకర్యం కలిగినా—ఎక్కువ పట్టించుకో కూడదు. మీరు చేసే ఉద్యోగం మీ జీవితాన్ని —ఎక్కువ సుఖవంతం చెయ్యాలి. మీ ఇద్దరిమధ్యా సామరస్యం ఏర్పడినప్పుడు — మీ ప్రయత్నం విజయ వంతమయినట్టే. అతి జాగ్రత్తతో ప్రవర్తించి 'ఇతరులకు ఆదర్శంగా ఉండాలి' అనే ఆశయంతో ముందుకు పోతే జయంమీదే.

(సన్ డే స్టాండర్డునుండి)

---

## మొగలి పొట్లము

ఆకర్షణీయమైన వ్యాససంపుటి.

రచన: శ్రీమతి. కె. లక్ష్మీరఘురామ్

క్రౌనుసైజు — 100 పేజీలు.

వెల — రూ 1-0-0

ఆంధ్రమహిళా ముద్రణాలయములో ముద్రింపబడుచున్నది.

వివరములకు:

ఆంధ్ర మహిళాప్రెస్సు, మదరాసు-4.

అని వ్రాయవలెను.

## మీకు తెలియునా?

1. ప్రపంచంలో బహుళ ప్రయోజన కరములైన నదీ లోయ ప్రాజెక్టులలో అన్నింటి కంటె పొడవైన ఆనకట్ట ఏది?

(ఎ) హూవర్ ఆనకట్ట (యునైటెడు స్టేట్స్ ఆఫ్ అమెరికా)
(బి) హీరాకుడ్ ఆనకట్ట (ఇండియా)
(సి) హూణనది ఆనకట్ట (చైనా)

2. ఇండియా ప్రభుత్వ నల్లమందు ఫ్యాక్టరీ. ఈ క్రింద పేర్కొన బడినచోట వున్నది:

(ఎ) ఘజియాబాద్.
(బి) ఘాజీపూర్
(సి) గాజులపల్లి

3. 1948 నుంచీ ఇండియాలో బి. సి. జి. టీకాల మందును వాడడం మొదలు పెట్టినప్పటి నుంచీ క్షయవ్యాధి పరీక్ష పరీక్షలు జరుపబడినవారు.

(ఎ) ప్రతి 20 మందిలో 1 రికి
(బి) ప్రతి 15 మందిలో 1 రికి
(సి) ప్రతి 30 మందిలో 1 రికి

4. ప్రథమ పంచవర్ష ప్రణాళిక మొదటి రెండు సంవత్సరాలు (1951-52 ; 1952-53) లోను కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాలకు అప్పుగా ఇచ్చిన మొత్తం.

(ఎ) సుమారు 90 కోట్లు
(బి) సుమారు 184 కోట్లు
(సి) సుమారు 121 కోట్లు

5. కమ్యూనిటీ ప్రాజెక్టుల కార్యక్రమం ఇండియాలో ఈ తేదీన ప్రారంభించ బడింది.

(ఎ) ఆగస్టు 15, 1951
(బి) అక్టోబరు 2, 1952
(సి) జనవరి 26, 1953

### జవాబులు.

1 — (బి) ; 2 — (బి) ; 3 (బి) ; 4 — (బి) ; — 5 (బి).



# ఆవు బేరం

శ్రీ ఆయపిళ్ళ సత్యనారాయణమూర్తి.

[సమయం : మధ్యాహ్నం పన్నెండు గంటలు.

స్థలం : పంతులుగారి గృహం.

పాత్రలు : పంతులు. కమలం : పంతులు భార్య.]

పం: అయితే ఇంతకూ ఆవు ఉండాల్నంటావు ?

క : ఇంత సంసారం అంటూ వున్నతరువాత పాలగొడ్డు ఉండాల్లెండీ! ఏ అవసరానికది చూచుకోనక పోతే ఎట్లా చెప్పండీ ?

పం: సంసారానికి ఇట్టాంటివి ఎన్నో అవుసరాలు గడుపుకుంటూ వచ్చాను. ఎప్పటికప్పుడు అదే అవుసరం ! అవుసరం కానిదంటూ ఒకప్పుడుందా?

క : ఎన్ని అవుసరాలు గడుపుకుంటూ వచ్చారబ్బా ! పాపం ! చెప్పండి చూతాం మీరు గడుపుకుంటూ వచ్చిన అవుసరాలు ?

పం: చెప్పనా ?...నాను పెళ్ళికాకపూర్వం మా తాత ఎన్నో చీవాట్లేసేవాడు "ఒరేవ్ ! అట్లా బడుద్దాయి బేవార్సులాగ తిరగబోకురా ! చక్కని దాన్ని చూసుకుని వేగం పెళ్ళాడు - ఇల్లాలులేని ఇల్లెందుకురా" అని—

క : ఒహ్హో ! మహాఘనమయిన అవుసరం తీర్చుకున్నారే !

పం: ఆఁ - మరేమిటి !- ఆ తరువాత్-

క : హమ్మయ్యా ! ఎంత ఘనకార్యం చేసేశారు ! గట్టిగా అనబోకండి - నలుగురూ మీరు చేసిన ఘనకార్యాన్ని విని - హఁ...హ్హా...హ్హా...(నవ్వుతుంది)

పం: చెప్పూ ! చెప్పూ ! విని?—

క : కానీండి గాని ఇంకా ఏ వేం ఘనకార్యాలు సంసారం గడుపుకుందికి చేసేరో చెపుదురూ విన ముచ్చటగా వున్నది.

పం: అడుగులో నే హంసపాదంటివి. ఇహ నేం చెప్పేది ?

క : మరిహా అనన్లెండి- చెప్పండి—

పం: ఏముంది ? అర్ధాంగిగారు వచ్చారు! ఆ వచ్చినావిడ వొచ్చినట్టుగ ఊరుకుందా ? ఆమెకు పిల్లలు కావలసి వచ్చారు—

క : చాలు ! చాలు ! ఊరుకోండి—

పం: అట్లా నేను ఊరుకోను. నేను చేసినవి ఘనకార్యాలు అయినా కాకపోయినా, నేను అవుసరాలను ఎట్లా గడుపుకుంటూ వస్తూవున్నానో చెప్పుకోనియ్ మరి ! ఆవిడగారికి పిల్లలు కావలసొచ్చారా ? ఒక్కటే గోల పెట్టేది !

క : ఉవ్వ ! దొంగ ! ఏమ్మాటలవి ?—

పం: తప్పుతుందా ? పిల్లలూ వచ్చారు. మొదటి ఇద్దరు పిల్లలూ మగ పిల్లలయిపోయారు - కమలం - అంటే నా అర్ధాంగి ఒక్కటే పలవరింతలు ! "ఈ ఇద్దరు వెధవల్లోను ఒక్కడు ఆడ పిల్ల అవకూడదా ?" అని—

క : అమ్మ దొంగా ? నేనట్లా అన్నానా ?

పం: లేదూ ?

క : ఇద్దరూ మగపిల్లలయిపోయారుగాని-అందులో ఒకరయినా ఆడపిల్ల అయితే నాచేతికెంత ఆసరా అవును కదా అన్నాను గాని—

పం: అన్నావా ? వాళ్ళిద్దర్లోను ఒకడు ఆడపిల్లగా ఎందుకవాలె ?—నీకు కావలసినది ఆడ పిల్లకద ! అందుకు ప్రయత్నాలు చెయ్యకూడదా?

క : మన చేతుల్లో ఏమున్నదండీ ?

పం: ఉన్నది !! ఉన్నది కనుకనే !!

(చిన్న చిన్న నవ్వులు ఇద్దరూ నవ్వుకుంటారు)

క : బాగున్నయ్ మీ మాటలు గాని—సంతకు వేళకా

# ఆవు బేరం

బోతున్నట్టున్నది. చూడండి - పాలక్రింద బోలెడంత డబ్బు పోసుకోవటం, తృప్తి లేకపోవటం జరుగుతుంది—

పం: నిజమే! నాకూ తెలుసును - ఈ పట్టణాల్లో డబ్బిచ్చి పాలుకొనుక్కుంటూ వున్నాము అనేకన్నా డబ్బిచ్చి నీళ్ళు కొనుక్కుంటున్నాం అంటే బావుంటుంది. సామెత ఉండనేవున్నది. 'నల్లనివన్నీ నీళ్ళూ - తెల్లనివన్నీ పాలూ' అని - ఇక్కడ వన్నీ తెల్లని నీళ్ళు!- సరి గాని గేదె కావాలంటావా? ఆవు కావాలంటావా! పట్టణాల్లో గేదెగొడ్డును భరించడం కష్టం! అయినా పాలు సమృద్ధిగా కావలెనంటే గేదె చాలా మంచిది.

క: నల్లగా నీలికొండలల్లె ఏం గేదెలండీ? పాలిస్తయ్! ఎందుకూ? పథ్యాలకూ, పానాలకూ పనికిరావు. పైగా జబ్బులు చేస్తయ్. పిల్లలకు ఉపయోగించవు - ఇంటికి ఆవుగొడ్డే అందమండీ! పాలకు పాలూ ఇస్తుంది. చూపుకు, చూపూ బావుంటుంది. పాలు పథ్యాహారం. పిల్లలకు జబ్బులు చెయ్యవు. పైగా బలమయిన ఆహారం!

పం: నాకూ తెలుసును పాలల్లోగల తేడాలు. ఇంతకూ నీకు ఆవుగొడ్డు కావాల్నె కదూ!

క: చక్కని చిన్న ఆవు చూడండి. మేపుకు అంతకష్టం వుండదు. పగటివేళ ఆవుఎట్లాగూ మేతకు పోతుంది. ఇంటికి చేరుకొనేసరికి రెండు గడ్డిపరకలు పారవేస్తాం. పాలు మనమే పిండుకొనవచ్చును. తన్నే గొడ్డును మట్టుక్కొని తేబోకండి.

పం: సరిలే! తన్నే గొడ్డును మట్టుక్కొనను.

క: మీరిక్కడ మాటలే. అవతలకు వెళ్లబోతే ఏమీ చేతకాదు! జాగ్రత్తగా పరికించి మరీ కొనండి ఆవును. గొల్లగురవులుకు కబురు చేశారు గావును!

పం: అవును - గొల్లగురవులు అనుదినము ఎన్నో ఆవులకు పాలు పిండుతూ వుంటాడుకదూ! వాడికి వాటి ఛాయలు, అంచనాలు, అనికలు, పోలికలు బాగా తెలుస్తాయ్. అందుకనే కబురెట్టాను.

క: అదిగో! గురవులు మాటలోనే వచ్చాడు!

గు: బాబూ! పంన్నెండు దాటవచ్చింది బయలెల్లుదామా?

పం: పదనయ్యా! నీసరించే చూస్తున్నాను.

(ఒక్క ప్రక్కనుండి నిష్క్రమిస్తూ వుంటారు)

క: చూడండి! ఆవు చక్కని తెలుపురంగు కలిగినది చూడండి. అట్లాంటిది లభ్యంకాకపోతే ఏదన్నా గులాబి రంగునగాని - బూడిద రంగుదిగాని ఏదో ఒక్కటే రంగున్నది కొనండి. మచ్చల గొడ్డును మట్టుక్కొని తేబోకండి.

పం: సరలే! మచ్చల గొడ్డు మట్టుక్కొనను -

(పంతులు, గురువులు వెళ్ళిపోతూ వుంటారు)

క: ఏమండీ! ... ఏమండీ!!—

పం: (కొంతదూరం నుండి) ఏం?

క: మాట! ఇట్లారండి —

(తిరిగి రంగముపై అల్పకాలం నిశ్శబ్దం)

(తిరిగి ప్రవేశించి)

పం: ఇస్! అబ్బ! ఇంకా ఏం కసీసప్ప కోర్కెలుండి పోయినవ్ యేమో - నీ ఆవును గురించి -

క: అబ్బ! అట్లా విసుక్కుంటే ఎట్లా చెప్పండి. కొనేది ఆవుగొడ్డాయెను. పదికాలాలపాటు మనింట్లో వుండబోతుంది. మంచి - చెడ్డా అనుకోవద్దుటండీ?

పం: నే కాదన్నానా! కాని ఆ చెప్పేవిలవేవున్న వేవో ఒక్కతూరిగ చెప్పరాదా? ఎంతసేపు అంతదూరం పోయి తిరిగి వస్తిని.

క: మీరు నాలుగు సంగతులూ తెలిసిన మనుషులయితే నే చెప్పేది ఎందుకండీ? నేను నాలుగా ఇట్లా మీతో ఘోష పెట్టకపోతే అక్కడికెళ్ళి పప్పులోకి కాలు జారుస్తారు!

పం: సరి! నేనొట్టి వాజమ్మను! కాని చెప్పు - ఇంకా ఆవు ఎట్లా వుండాల్నో? —

క: చూడండి! చక్కని కొమ్ములుగల ఆవును చూడండి!

పం: కొమ్ములుగల ఆవా? ఏం? -

క: కొమ్ములున్న ఆవు చూపుకు బావుంటుందండీ! ముఖ్యంగా కొమ్ములున్న ఆవు పొడవదండీ!

పం: సరి ! సరి ! ! కొమ్ములు లేని ఆవును కొనను_ ఇంక వెళ్ళనా?

క : ఊఁ...వెళ్ళండి ! ... సొమ్ము జాగర్త !_ ఆవును బాగా చూసి కొనండి......డబ్బు......పదిలం...

(స్వగతం) (దారిమధ్య)

పం: హుం ... (చిన్న నవ్వు) కొమ్ములున్న గొడ్డు పొడ వదు కాబోలు! నిందుకుండ తొణకదు అన్న సామెతలోగల అర్థాన్ని ఉపయోగించుకుని ఉంటుంది కమలం !.

(నాకు పెళ్ళికిముందు మీసాన్ని, నూగు నూగు మీస మయినా పూర్తిగా తీసివేసేవాడను. కమలం వొచ్చిన దగ్గర్నుండి అట్లా చెయ్య నివ్వటంలేదు.)

"మీసం మగమనిషికి అందమండీ! అట్లు ఆడదానల్లె మీరు మీసం తీసెయటం బాగోటంలేదు. మీసం ఉంచండీ" అని.

మీసం తిరిగి పెంచ వలసి వచ్చింది. ఇప్పుడు కమలం ఉద్దేశ్యం బయటపడ్డది. బోడికొమ్ములు ఆవుమల్లె మీసం లేకపోతే విరగబడి తంతానని _ పొడుస్తానని ఆమెకు భయం కలిగి వుండవచ్చును.

మీసం పెంచితే సాధువుగ ఆమె చెప్పు చేతల్లో ఉంట బోతానసే విశ్వాసం ఆమెకు కలిగి ఉండాలె ! నిజం ఎంత మట్టుకొ్కగాని పెళ్ళి కాకముందు _ అంటే నాకు మీసం లేని రోజుల్లో మహ అల్లరి చేసేవాడనట !

కమలం వొచ్చిన దగ్గరనుండీ అంటే నాకు మీసం పెం పొందిన దగ్గరనుండి ఒక్తి చవట వాజమ్మ నయిపోయాను. ఆమే అంటూంటుంది "మీరు ఎందుకూ పనికిరారా"ని

కమలం కాలేజీలో చదవలేదుగాని, చదివేవుంటే మహా గొప్ప శారీరక తత్వ వేత్తిని అయ్యేది !

(సంత సీను)

గురు: బాబూ ! పంతులుగారూ ! మీరిట్లా ఏమో ఆలో చిస్తోవుంటే కార్యం సాగదు. చప్పున బేరానికి ఆదు కోవాల !

పం : అట్టాగనే కానీహోయ్ !

గు : చెప్పండి మీకే 'ఒడుపు'లోగల ఆవు కావాలనేం?

పం : నాకు ఆవెందుకయ్యా !

గు : సరి ! సరి ! బాగావుంది ! !

పం: అది కాదు ! నాకు ఆవెందుకు? మీ అమ్మగారికే ఆవు అవసరం వస్తె ! అమ్మగారు చెప్తోంటే వినటంలేదూ ఎట్టాంటి ఆవు కావాలనో?

గు : ఆడోరి కోరికకు లెక్కేటి బాబూ ! చప్పున మీరో ఆలోచనకొచ్చి ఫలానా 'యావు' అంటే 'ఫటీల్' చేద్దాం !

పం : మీ అమ్మగారి కోర్కెలు చెల్లించి తీరాలె ! అవి చెల్లించకపోతే పొయ్యేదేమీ నీకు కాదు నాకు ! అందు చేత నేను ఆమెకు నచ్చే ఆవు జాడలు పరిశీలించుకుం టాను. కాని నా కనీసపు కోర్కెలు నువ్వు పరికించి చూడాలె ! ఆవు కనీసం పూటకు శేరు పాలయినా ఇచ్చేదయి ఉండాలి. ఖరీదంటావా? అది వంద రూపా యలకు మించకూడదు.

గు : నికరంగా శేరు పాలిచ్చే ఆవుగొడ్డు వంద రూపాయి లకు వస్తదండీ? అట్టాపోతే నే నీపాటికి పదావుల్ని పెరట్లో కట్టి ఉందును.

పం : మాట కన్నానయ్యా ! ఓ పదో పరకో అటో ఇటో అవుతుందనుకో !

గు : అద్దిగదీమాట ! అట్టాగనండి ! ఇక రండి ! ఇది చూశారా ఆవు మేరుపరువతం !_ అయిదు శేర్లు ఇస్త దనటంలో సందేహం లేదు _

పం : రెండు కుంచాలిస్తే మట్టుక్కు ఎవరికి కావాలయ్యా ! అంత పెద్ద ఆవు కూడదు !_

గు : సరిలెండి ! ఇది చూశారా చిన్న ఆవు. ఈనబోతది! అంతా పది పది హేను దినాలు లోపు_

పం : ఆవు కొలతకు సరిపోతుంది గాని వద్దయ్యా !

గు : ఏమండి !

పం : రంగు బాగోటం లేదు_

గు : రంగెట్టాగ్గుంటే నేమండి ?

# ఆ వు బే ర ం

పం : వద్దు! వద్దు!! మచ్చల మచ్చల గొడ్డు మట్టుక్కొనేది లేదు_

గు : పోనివ్వండి గాని...ఇదిగో ఇది చూశారా? మచ్చలు కూడ లేవు. చిన్నది! ఆవంతా ఒక్కటే రంగు. ఎట్టిని ఎరుపు. శేరున్నర పాలకు అంచనా వెయ్య వచ్చును.

పం : దానికి కొమ్ములు లేవయ్యా గురువులూ !

గు : కొమ్ములు లేకపోవడమే మంచిదండి! పాల గొడ్డుకు కొమ్ములుంటే ఏముండి_ లేకపోతే నేముండి?

పం : నీకు తెలియదులే! నా ఆవుకు కొమ్ములెట్లావుండ వలెనంటే_ పందెపు గొఱ్ఱెపోతుకు మల్లే కొమ్ములు తిరిగి తిరిగి వుండాలె !

గు : సరి ! సరి !! ఇది చూడండి_

పం : ఇది బాగానే ఉన్నట్టున్నది. ఆవు పొట్టిగా చక్కగా ఉంది. కొమ్ములు కూడ వంపులు తిరిగి వున్నయ్. ఆవంతా చక్కటి తెలుపు! అనుకున్నట్టు గానే ఉంది.

గు : సరి లెండి ! పదండి అడుగుదాం !...............
ఏమయ్యా ! చెట్టుకిందోడా ! బేరం ఏం చెప్తావు?

ఆవుగల ఆసామి : పందన్నర కడుగుతున్నారయా !

గు : ఇయ్యావునా? చెప్పాస్సి ! అడిగేమాట మాకెందుకు? నీ బేరం చెప్పవయ్యా?

ఆ : మీరడగండి ! పందన్నర పైమాట.

గు : ఎవరయ్యా పందన్నర కడిగింది?

ఆ : అరుగోండి ఇటే వస్తున్నారు.

పం : ఇదేమిటోయ్ గురువులూ! వీళ్ళు పోటీ బేరగాళ్ళల్లె వున్నట్టు ఉంది.

గు : ఆరేమి తగుల్తారు బాబయ్యా పోటీ! మనమే పోటీకి లంకించుకుంటే_ హుఁ ! పల్లెటూరి నాయాళ్ళు !

పం : పందా ఏ భైకన్న ఎక్కువ చేస్తుందంటావా?

గు : ఏమయ్యా చెట్టుకిందోడా? పాలమాటేం చెప్తావు? పొదుగులో చెయ్య వెయ్యొచ్చా !

ఆ : ఏసి చూడండి. అట్టాంటి ఆవు కాదు. వొత్తి మేక_ [illegible]మ్మండి. ఇంటికాడ జరక్కపోబట్టిగాని ఇది అమ్ముకోవడమేం కర్మం ! ఇయ్యావు పాలుందే_ మా ఆడంగులే కదూ తీస్త !

గు : ఏమండీ బాబుగారూ ఏమంటారు?

పం : నే నేమనేది? మీ అమ్మగారు ఇట్టాంటి ఆవునే కావాల్నన్నది. అడిగి చూడు పాలజాడ !

గు : ఏం మాఁవాఁ ! శేరు చుక్కలిస్తదంటవా?

ఆ : బలేగా అడిగినావు అల్లుడూ! శేరు చుక్కలిచ్చే ఆవుకు పందన్నర ఇచ్చి పొయ్యావటయ్యా !

గు : ఆసిరి ! ఇయ్యావు ఆపైన ఇస్తదంటావా?

ఆ : పందెం కట్టు ! మాటమీద నిలబడు_ శేరు పాలకు వంద రూపాయలు ఇస్తావా? అంతే పందెం ! సవాల్

గు : శేరున్నర పాలు ఇస్తదంటవా?

ఆ : అనుకోడాలు వద్దేయి. మాట కరాదు అంతే! శేరు పాలకు వంద రూపాయిలు ఖరీదు ! పెట్టండి మీపందెం సవాల్_ జమ్ములనాయుడూ సవాల్ ! జబర్దస్తీ సవాల్ !

గు : ఏమండీ పంతులుగారూ ఏమంటారు?

పం : అట్టాంటి పందేలు మన కెందుకయ్యా గురువులూ ! వొద్దు_ పాతికో పరకో_ అటో ఇటో పడనియ్యి_ ఎంతకో అంతకు తెగసంప్రులు చేసుకోవాలె గాని ఇప్పుడే పందేల్లో ఎట్టాపడమన్నావయ్యా !

గు : ఎబ్బే ! మాటకంటున్నాడు పంతులుగారు! అంతే గాని పందాలు వేస్తామా? తమ మాట సెలవివ్వండి ! చూడండి వాడు అట్టా పందాలు వేస్తూ వున్నాడంటే_ ఆవు అంత ఖచ్చితమయిన గ్యారంటీగా పాలు ఇస్తాం దన్నమాట !

పం : పందా యే భైకి అడిగి చూడూ !

పోటీదారులు : ఏమయ్యా ! పందా యే భైకి తటపటాయిస్తు న్నావు_ ఇచ్చేదా లేదా?

పం : (మెల్లిగా) సరి ! సరి! పోటీ బాగానే పడేట్టుంది గురువులూ !

గు : పంతులుగారూ ఇట్టా రాండి మాట.

(అగలిప్త కాలం నిశ్శబ్దం)

# ఆ వు బే ర ం

గు : (పంతులు చెవిలో) మీకు ఆవు కావలెనా చప్పున మేలుకోనండి.

పం : ఎంచెయ్యమన్నావ్. వందా యేభైకి అడుగుతున్నారయ్యో ! వీళ్ళెక్కడ దాపురించారయ్యా మనమీదకు.

గు : ఇస్ ! నెమ్మది ! ఆపోటీదారు లిటే వస్తున్నారు.

పో : బాబూ ! పంతులుగారూ నమస్కారం.

పం : నమస్కారమండీ నాయుడుగారూ.

పో : తమకు ఆవు గావాల్నండి ?

పం : అవునండి నాయుడుగారూ !

పో : చూడండి మనలో మనం పోటీలు పడకూడదు. ఇలా మనం పోటీలు పడి ఆవు ధరను పెంచేస్తున్నాము.

పం : అదేనండి నేనూ అనేది !

పో : ఇయ్యావును నేను నూటఏభైకి చేజిక్కించుకుందామని చూస్తున్నాను. మీరు మరొక ఆవును చూసుకోండి !___

గు : చాల్లేవయ్యా ? మహా గొప్ప సాయం చేయొచ్చావు? ఇంతకూ ఆవు కొనవద్దని-అయ్యావును నీకు వొగ్గేయమని చెప్పొచ్చావు ? ఇట్టా చూడు ! అగ్గిమీదగుగ్గిలం పడేది ఆవును వదలం - వెళ్ళండి___

పో : చరిలెండి !___

పం : ఎందుకయ్యా గురువులూ మనకీ లేనిపోని తగవులు. ఆ నాయుళ్ళెవరో పాపం - మనలాగునె ఆవును కొనటానికి వచ్చారు. వారినే తీసుకుని పోనియ్. ఇంతకూ ఆ గొడ్డు వారింట్లో పడాలని రాసుంది ! వెళ్తుంది !___

గు : ఎత్తి ఏదాంతం మాటాడకండి పంతులుగారూ ! నాకు మట్టుకు ఆడు అన్న ముక్కలకు ప్రాణం మహా సాలొస్తోంది. ఆవును ఒగ్గుకోమంటాడేం ? ఈడు గురువులని తెలదు కాబోలం. ఆడికే తెలుసు మహా గొప్ప బేరాలు___

పం : పోనియ్యవయ్యా గురువులూ !-

గు : ఆ నాయుళ్ళెవరనుకున్నావు ? ఆవు బేరగాళ్ళు ! వాళ్ళకిదే గాదంటండీ వృత్తి ! ఇట్టా బాగా పాలిచ్చే మంచి జాతి గొడ్లను కొని మరుచటి వారంనాడు ఇంకా రెట్టింపు ధరలకు అమ్ముకుని అధికనాభాలు దోచుకుంటారు. ఇది నల్ల మార్కెట్టు అని ఎవుడూ అనడు కద !

పం : నిజమయిన మాటన్నావయ్యా గురువులూ !

గు : చూడండి కావలిస్తే - మరుచుట్టు వారంనాడు రాండి ! వీళ్ళే అయ్యావును రెండొందలకమ్ముతారు.

పం : అయితే వందా ఏభైకి అడుగూ !

గు : ఊఁ - ఊఁ... నాకు నమ్మిక లేదు. అయినా చూద్దురుగాని -

ఏమయ్యా ఆఖరితూరి అడుగుతున్నాను. వందాఏభై !-

ఆవుగల ఆసామీ : రాదెల్లవయ్యా ! వందన్నరపై మాట చెప్పూ.

గు : ఏమండీ ! ఏమిటి చెప్పండి - మహా జాతి అయిన గొడ్డు. పాల జాడ జర్రిపో తల్లె కనబడుతూవుంది. మీ ఇష్టం !-

పం : మరింక లేదయ్యా గురువులూ !

గు : సరిలెండి ! మీరిక్కడ వుండండి. నేను మాటాడి వస్తాను.

పం : వెళ్ళి చూడు !-

గు : ఏమయ్యా ఆవునిట్లా అప్ప జెప్పూ !

ఆ.ఆ: మహా కొనేవాడల్లె అడుగుతున్నావులె !-

గు : ఏరా ! గురువులు కాకపోతె మరెవ్వడ్రా కొనేదీ ఆవును. ఇట్టా ఇవ్వు !

ఆ.ఆ: ఏందోరె గురవులూ, ఇట్టాంటి బలవంతబ్బేరం ఎన్నాళ్ళ నుండీ ?

గు : ఓరి నాయుళ్ళూ ! ఇందవోయి నీ డబ్బు -

ఆ.ఆ: ఎంత ?

గు : నూట ఏభై !

ఆ.ఆ: అద్దిగది ! రెడ్డొచ్చి మొదలాడమన్నాడట - అదిగో- మీపక్కను నిలచుండో వోరిని చూశారా నూట ఏభైకె అడిగేవున్నారు. ఆరిదే ఈయావు.

గు : ఏంది ? ఆరికెట్టా ఇత్తావు. నేను బేరం చేస్తావుంటె.

ఆ : ఎల్లయ్యా ! నేను సంతలోకి రాక మునుపు దగ్గర

ర్నండి ఆరు నూట ఏభైకి అడుగుతున్నారు. నీకెట్టా ఇచ్చేది.

గు : నాకియ్యవూ ? ఎట్టాగియ్యవో చూస్తాను.

ఆ.ఆః ఇదిగోండి బాబూ నాయుళ్ళగారూ. ఆవును మీ చేత బెడుతున్నాను.

గు : ఇట్టాగియ్యవయ్యా నాయుడుగారూ ఆవు కన్నెత్రాడు.

పో : ఏందయ్యా ఆజబర్దస్తీ! పట్నం వోడివనా ? శక్తి వుంటే పై బేరం ఆడి ఆవును ఇడిపించుకో - ఎందు కొచ్చిన మాటలు - నేల ఇడిసిన సాములు !

గు : మాటలు మిగలా యిచ్చుకుంటున్నారు! జాగరత! ఇట్టా ఇవ్వండి ఆవును.

పో : ఇవ్వం- ఇందవయ్యా ఆవుగల వోడా నీ'యడ్వాన్సు'

గు : అట్టా ఆగండి- ఇదవయ్యా ఆవు గల వోడా నా అడ్వాన్సు.

ఆ.ఆ: మీ ఎడ్వాన్సు ఎట్టా పుచ్చుకొనేది ? ఆరికి బేరం అయిపోయింది.

గు : ఏందిట్టా మాయతనం. చూస్తానుగద ఈ యావును ఎట్టా తోలుకెడతారో !

పో : ఎల్లవయ్యా మేమూ చూశాము.

గు : మాటలు మిగలా యిచ్చుకుంటున్నారు. జాగరత !

పో : ఏమిటయ్యా నివు జేసేదీ ?

గు : ఆ కన్నెత్రాడు ఇట్టా ఇవ్వండి.

పో : ఇవ్వం-

గు : ఇవ్వండి-

పో : ఇవ్వం.

గు : ఇవ్వండి.

పో : ఇవ్వం- ఇవ్వం !

పం : ఏమయ్యోయి గురువులూ ! ఎందుకేమిటి ఆ దెబ్బలాటలు. వారు ఇవ్వమని అంటున్నారు- పోనియ్. మనం మరొక గొడ్డును చూసుకుందాం-

గు : నేనా ? దీన్ని ఇడిసిపెడతానా ? రొక్కం యిచ్చుకునయినా ఇంటి కాడ కడతాను గాని-

పో : అంత పవురుసం ఉన్న వోడివి నూరో పది ఇచ్చి ఇడిపించుకోవయ్యా.

గు : దమ్మిడీ ఇచ్చేది లేదు. ఒగ్గండి ఆవును.

పం : గురువులూ ! పదవయ్యా - మళ్ళీ వారితో ఎందుకు తగవులాటలు. మనం ఆవు అవుసరం వుండివచ్చాం. వారూ ఆవు అవసరం వుండి వచ్చారు. అవుసరాలు అందరకూ ఒక్కటే! ఆవును వారినే తీసుక వెళ్ళనియ్!

పో : ఏమండి పంతులుగారూ ! తమకు ఆవు అంత అవ్సరమా ?

పం : కాగట్టండి- అయినా మీరు కొనుక్కున్నారు. తీసుకెళ్ళండి. నేను వేరె ఆవును చూసుకుంటాను.

పో : పోనివ్వండి. మీకంత అవసరం కలిగివుంటె మేమీ ఆవును తమకు వదిలివేస్తాం.

పం : చాలాసంతోషం !-

పో : ఏదో ఈవరకూ మేము ఆవునుగురించి తిరిగాం- కడాపటకు లభ్యమయిన ఆవును తమకు పోటీ లేకుండా అదే బేరానికి ఇడిచిపెడుతున్నాం. మా శ్రమకు ఫలితంగ పది రూపాయిలు మాత్రం అదనంగ ఇవ్వాలి

గు : ఊరుకోండి - నాయుళ్ళూ ! పది రూపాయిలు పుచ్చుకుంటారా పంతులుగారి దగ్గ. ఐదు రూపాయిలు ఇస్తారు.

పం : గురువులూ ! అట్టాంటివి వద్దయ్యా-

గు మీకు తెలవదండీ-ఏమయ్యా నాయుడుగారూ, అయిదు రూపాయిలు !- సంయూ ! చెప్పండి-

పో : సరిలె ! లేండి !-

పం : వద్దయ్యా గురువులు !

గు : ఉండండి ! ఈ అయిదు రూపాయిలు నా జేబీలో విచ్చుకుంటాను. ఇందవయ్యా సొమ్ము. అయిదు రూపాయిలు.

పో : కడకు గురువులు మాట నెగ్గించుకున్నార్రా.

ఆ.ఆ: ఏమన్నా గురువులు మా గడుసోడు-

పో : నూట ఏభైకే దక్కించుకున్నాడు-

(ఇంకావుంది)

# శ్రీ త్యాగగురుస్తుతి కీర్తనలు

శ్రీమతి కె. యమ్. సౌందర్యవల్లి

## కీర్తన-21

రాగం వలజి — ఆదితాళం.

ఆ. స గ ప ద ని స, అ, స ని ద ప గ స

ప॥ అతడే ధన్యుడురా, సతతము రాముని స్మరణచేసిన ॥అ॥

అ॥ యతివలె రాగదుర్విషయమ మతలను
హతముగజేసి సద్గురువని నుతిగన్న ॥యతడే॥

చ॥ ధరలో తిరువాలూరను స్తలమున
ధరణీ సురవరుడై జన్మించిన
వరగానామృత రతుడై మించిన
సరస త్యాగ రాజని నుతిగాంచిన ॥యతడే॥

| | 0-2 | 1-4 | 1-4 |
|---|---|---|---|
| | ; సా గా సా ; స గ స ని ద ని | సా ; ; ; | ; ; ; ; |
| | అ త దే ధ . . న్యు డు. | రా | |
| | ; సా గా సా ; స గ స ని ద ని | సా ; ; ; | ; ; ; ; |
| | అ త దే ధ . . న్యు డు, | రా | |
| | ; స స గా గా గ స గ ప గ పా గ | సా ; స గా స | ప స ని ద పా గ ప |
| | స త త ము రా - - - - - ము | ని స్మ ర ణ | చే - - - సి న . |
| | ద ని సా గా సా | | |
| | , . అ త దే॥ | | |
| అ॥ప॥ | ; గా పా ద నీ సా ; స సా | సా సా గా గా | గ స గ ప గా సా |
| | య తి వ లె రా గ దు | ర్వి ష య మ | మ . త , ల ను |
| | ; సా గా సా సా స స ని ద ప ద | నీ సా సా ని ద | గా పా ద ని సా |
| | హ త ము గ చే - - - సి స | . ద్గు రు వ ని | ను తి గ . న్న |
| | సా గా సా॥ | | |
| | అ త దే॥ | | |
| చ॥ | ; ద ని సా ; స నీ దా ; | దా ; నీ దా | పా పా పా ద ద |
| | ధ ర లో తి రు వా | లూ ర ను | స్థ ల ము న , |
| | ప గ ని ద పా ; గా పా గా సా | గా ; పా ; | దా ; నీ, ద |
| | . . ధ ర ణీ సు ర వ రు | డై జ | న్మిం చి న |
| | ; | | |

ఆ. ప. వలె
వరగానామృత రతుడై మించిన
సరస త్యాగరాజని నుతిగాంచిన ॥య॥

# శ్రీ త్యాగగురుస్తుతి కీర్తనలు

## కీర్తన—22

రాగం: మలయమారుతం. ఆదితాళం.

ఆ. సరిగపదనిసా — అ. సనిదపగరిసా

ప॥ పలువిధకీర్తన, ప్రతతి రచించిన
పరమ జ్ఞాని గనరే : మనసా ॥పలు॥

అ॥ సలలితనామ సుధారసమానుచు
ఇలభోగముల, నశ్వరమని మానుచు ॥ప॥

చ॥ రాముని గుణముల రంజిల బాడుచు
ప్రేమతో సుమముల పూజల సేయుచు
తామరసాక్షుని దయకై వేడుచు
పామరహితుడైన పావనత్యాగరాజు ॥పలు॥

| | 1-4 | 0-2 | 0-2 |
|---|---|---|---|
| ప॥ | ; గా పా ద నీ సా ఠి గ ఠి సా | : సా నీ ద ప | పా గ ప గ రీ ; |
| | ప లు వి ధ కీ ర్త - న. | ప్ర త తి ర | చి ం చి - న. |
| | ; గా పా గా రీ స సా స రి స | రీ ; ; గా | పా దా ని ని ద ప |
| | ప ర మ జ్ఞా - - ని గ న | వే ; ; చు | స - స . . . |
| | గ రి ॥గా పా॥ | | |
| | . . ॥ప లు॥ | | |
| అ॥ప॥ | ; గా పా ద నీ సా, రీ సా | సా ; రీ సా | సా ని ఠి స నీ ద |
| | స ల లి త నా మ సు | ధా ర స | మా . ను . చు . |
| | ; ద ద నీ సా, స నీ దా పా | గా గా పా దా | ని ని ద ప గ ప గ రి |
| | ఇ ల భో . గ ము ల న | శ్వ ర మ ని | మా . . . ను . చు . |
| | స రి ॥గా పా॥ | | |
| | . . ॥ప లు॥ | | |
| చ॥ | ; దా ని దా దా దా స ని ని ద ద | దా దా నీ దా | పా ప ద ద ప ప గ |
| | రా ము ని గు ణ ము . ల - - | రం . జి ల | పా డు - చు - - - |
| | ; గా ప దా ని ని ద ప గ ప గ రీ | ; గా పా పా | దా దా నీ దా |
| | ; ప్రే మ తో సు - మ , ము - ల - | . పూ జ ల | సే . యు చు |

అ. ప. వలె

తామరసాక్షుని దయకై వేడుచు
పామరహితుడైన పావన త్యాగరాజు॥



# సామాజిక శ్రేయో సంఘాలు

## త్వరలో రాష్ట్రాలలో ఏర్పాటు

ఆర్థికమంత్రి జీవరాజ్ మెహతా అధ్యక్షతన జరిగిన సంఘ సేవకుల సభలో శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ గారు ప్రసంగిస్తూ పంచవర్ష ప్రణాళిక గడువు ముగిసే నాటికి 'ఎ' తరగతి రాష్ట్రాలలో చాలా మట్టుకు త్వరలోనే రాష్ట్రీయ సమాజ శ్రేయోసంఘాలు నెలకొల్పడం జరుగుతుందని, జూన్ రెండవవారం నాటికి అన్ని 'ఎ' తరగతి రాష్ట్రాలకూ విడివిడిగా సమాజ శ్రేయో సంఘాలు ఏర్పడుతవనీ దేశవ్యాప్తంగా 40 వేల సాంఘిక సంక్షేమ కేంద్రాలు నెలకొల్ప గలమని ఆశిస్తున్నామన్నారు.

మార్చి 31 తో అంతమయే ఈ ఆర్థిక సంవత్సరంలో సంక్షేమ సంఘాలకోసం ప్రత్యేకించిన నిధినుంచి, కేంద్ర శ్రేయోసంఘం ఇప్పటికి 24 లక్షల రూపాయిలు ఖర్చు చేసిందని, దీనితో 158 శిశుసంరక్షణ కేంద్రాలకు 4 లక్షల 91 వేల రూ॥ లు మంజూరు చేశామనీ. అదేవిధంగా, 239 స్త్రీ శ్రేయో సంఘాలకు 8 లక్షలు, బాల నేరస్థులను బాగుపరచే 597 సంస్థలకు 3 లక్షల 33 వేలూ సాధారణ శ్రేయో సంఘాలకు 7 లక్షల 72 వేలు మంజూరు చేస్తామని వివరించారు. త్వరలోనే కేంద్రసమాజ శ్రేయో సంఘంవారు 300 గ్రామ శ్రేయోభి వృద్ధి ప్రాజెక్టులు ప్రారంభిస్తారనీ, ఒక్కొక ప్రాజెక్టు క్రింద 20 గ్రామాల వరకూ ఉంటాయనీ, ఈ ప్రకారం 60 లక్షల జనాభాగల 60 వేల గ్రామాలలో శ్రేయోభివృద్ధి కార్యక్రమాలు అమలు చేయాలనీ కేంద్రసంఘం ఆశిస్తున్నదని. ఇదివరకే గ్రామాలలో ఏర్పడి పని చేస్తున్న స్వచ్ఛంద సేవాసంఘాల ద్వారానే ఈ కార్యక్రమాలు అమలు జరుపబడుతాయని, సంఘ సేవకులూ శ్రేయోభిలాషులూ కృషిచేసి జాతీయ ప్రణాళిక ఋణాన్ని విజయవంతం చేయాలని నగదు రూపంలోనే కాకుండా నగల రూపంలోకూడా ఈ విరాళాలు ఇవ్వటానికి ప్రభుత్వం ఏర్పాటు చేస్తున్నదనీ ఆమె చెప్పారు.



# విజయం

ఫిబ్రవరి 1954 లో ఆంధ్ర మహిళాసభ నుండి హిందీ పరీక్షలకు వెళ్ళి విజయము పొందిన విద్యార్థినులు.

ప్రాథమిక్

| | |
|---|---|
| కుమారి కె. ప్రమీల | ప్రథమ శ్రేణి. |
| కుమారి ఎమ్. ఉష | ద్వితీయ శ్రేణి. |

మధ్యమ

| | |
|---|---|
| శ్రీమతి కమలకుమారి | ద్వితీయ శ్రేణి. |

# సరోజినీదేవి

ఫిబ్రవరి 13, 1879, వనితా లోకం జ్ఞాపకం ఉంచుకోవలసిన దినాలలో ఒకటి. ఆనాడే, హైదరాబాదులో అఘోరనాథ చటోపాధ్యాయకి, వరదాసుందరీదేవికి— సరోజిని జన్మించింది. సరోజిని కుటుంబం సంస్కృత విద్వాంసులకి పేరు కాంచినది. "తర తరాల నావంశీయులు ఐహిక విషయాలలో కంటే అడవులలో కొండలలో జ్ఞాన సముపార్జనలో తాత్త్వక విమర్శలో ఎక్కువ ఆశక్తిని చూపిన మహాపురుషులు," అని తన వంశీయులను గురించి సరోజిని వ్రాసింది. అఘోరనాథ్ చటోపాధ్యాయకూడా వీరికి అన్నివిధాల అనుంగు సుతుడు. అందుకే అతడు మరణించినపుడు "దయార్ద్ర హృదయుడు, ధైర్యస్థుడు అయిన ఋషి" అని సరోజిని వ్రాసింది. యూరప్‌లో వైద్యశాస్త్రం అభ్యసించిన అఘోరనాథ్ నైజామ్ కాలేజీ స్థాపకులలో ఒకడు. జీవితంలో అతనికి ఎక్కువ ఆనందాన్ని యిచ్చినవి— విద్యాభ్యాసం శాస్త్రీయపరిశోధనా. సరోజిని తల్లి వరదాసుందరి కూడా విద్యావంతురాలు. చిన్నతనంలో బెంగాలీలో చక్కని పాటలు వ్రాసిన కవయిత్రి. చదువుయందు ఆశక్తీ, ఉపయోగకరమైన పనులయందు లక్ష్యాన్ని కల్పించుకోవడమూ తండ్రి నుంచీ, దయార్ద్ర హృదయమూ, కవితా హృదయమూ తల్లినుండీ, సేకరించింది సరోజిని.

ఉన్నత విద్యాభ్యాసం కోసం ఇంగ్లండుకి వెళ్ళేముందే సరోజిని, సుప్రసిద్ధవైద్యుడైన డాక్టరు ముత్యాల గోవింద రాజులునాయుడుని ప్రేమించి, వివాహమాడ కోరింది. కాని అప్పట్లో అది వీలుపడలేదు. సరోజినిది సంప్రదాయ సిద్ధమైన కుటుంబం. సనాతనాచారాలకి పుట్టినిల్లు. అలాంటిది బ్రాహ్మణేతరుడైన నాయుడుని వివాహం చేసుకోవడం కష్టమే. అందుకే సరోజిని ఉన్నత విద్యాభ్యాసం కోసం ఇంగ్లండు వెళ్ళిపోయింది. అక్కడ King's College లోనూ, కేంబ్రిడ్జిలోని Girton College లోనూ చదువుకొంది. 1818 లో ఇంగ్లండు నుండి తిరిగి వచ్చి సంఘపు కట్టుబాట్లనీ, పెద్దల వాదస్తాలనీ కాదని డాక్టరు నాయుడుని వివాహం చేసుకొంది. వీరిది చక్కని సంసారం. నైజామ్ ఛీఫ్ మెడికల్ ఆఫీసరుగా ప్రఖ్యాతి గాంచిన డాక్టరు నాయుడు వేదాంతి లాగ కనిపించే ఒక జ్ఞాన నిధి. వీరికి కలిగిన సంతానం- నల్గురూ. నాల్గు ఆణి ముత్యాలు— జయసూర్య, పద్మజ, రణధీర, లీలామణి—ఆ గృహంలో అందరికీ సరోజిని ఆరాధ్యదైవం.

హైదరాబాదులో సరోజిని గృహం ఒక అంతర్జాతీయ వసతి గృహం లాంటిది. పేరుగాంచిన జ్ఞానులూ, వినోదార్థం దేశంలో సంచరించే వ్యక్తులూ అందరూ ఆమె ఆతిథ్యాన్ని అందుకొని, ఈమె ద్వారా యీ దేశాన్ని పూర్తిగా అర్థం చేసుకొనేందుకు ప్రయత్నించినవారే.

కొన్ని సంవత్సరాల తరువాత సరోజిని హైదరాబాదు వదిలింది. దీనితోపాటే ఆమె కవయిత్రిగావుండే రోజులు కూడా ముగిసాయనే చెప్పవచ్చు. రాజకీయాలలో తలమున్కలుగా పనిచేయడానికి హైదరాబాదు వదిలిన సరోజిని, అప్పుడప్పుడు మాత్రమే కవిత్వం వ్రాసేది.

విఖ్యాత రచయిత లందరూ సరోజిని కవిత్వాన్ని కొనియాడేరు. "పక్షుల కిలకిలా రావాల లాగే నా హృదయంలో స్పందించే గీతికల జీవిత ప్రమాణం కూడా బుద్బుద ప్రాయం. నాకు నిండైన కోరికలూ, కవితాదృష్టీ వున్నాయి, కాని స్వరం లేదు. నేను నిజంగా కవిని గాను" అని తన కవిత్వాన్ని గూర్చి సరోజిని చెప్పుకొంది. కాని ఒకటి మటుకు నిజం. ఆమె గీతాలు హృదయరంజకంగా వుండి స్వేచ్ఛా జీవులైన పక్షుల పాటలలాగే వుంటాయి. **The Golden Threshold, The Bird of Time; The Broken Wind** అనే మూడు పద్య సంపుటాల లోనూ— చక్కని సంగీతంతో కూడుకొన్న పదజాలం,

శ్రీమతి కె. రామలక్ష్మి

మానవాతీత సౌందర్యాన్ని మాటలలో పొదిగిన చాతుర్యం మన కళ్ళకి కడుతుంది.

ఈ కవితాలోకంలో ఊహలతో కాలక్షేపం చేయడం సరోజిని అభిమతంకాదు. దేశ రాజకీయాలలోనూ సాంఘిక సంరక్షణలలోనూ పాలు పంచుకోవాలనే కోరిక ఆమెలో దిన దినం అభివృద్ధి కాంచింది.

హిందూ ముస్లిముల నైక్య పరచి, దేశదేశాల అదే ఐక్యతని పెంపొందించాలని సరోజిని కోరింది. ఆమె



స్త్రీ జనానికి ధ్రువతార

# సరోజినీ దేవి

పుట్టి పెరిగిన వాతావరణం యిందుకు ఎంతైనా తోడ్పడింది. బ్రాహ్మణ కుటుంబంలో పుట్టి, మహమ్మదీయుల మధ్య మహమ్మదీయ నగరంలో పెరిగి పెద్దయైన తరువాత సరోజిని ఆ పట్టణ జీవితంలోనే ఒక ప్రముఖ భాగమైపోయింది. రాజకీయాలు చర్చిస్తూ ఒకనాడు ఆమె గోఖలే వద్ద "ఇక ఐదు సంవత్సరాలలో హిందూ ముస్లిం మైత్రి నే చేకూరుస్తాను" అన్నదట. అప్పటి నుండి సర్వదా దాని కోసమే పాటు పడింది. 1913 లో లక్నోలో జరిగిన ముస్లింలీగు సభలోనూ, 1916 లో అక్కడే జరిగిన హిందూ ముస్లిం సభలోనూ ఆమె చేసిన ఉపన్యాసాలు మహమ్మదీయులపై అధిక ప్రభావం చూపాయి. 1921 లో మతకలహాలతో ఉన్మత్తులై వున్న బొంబాయి గుంపుల మధ్య నిర్భయంగా సంచరించి వారిని సుముఖులను చేయ ప్రయత్నించింది. 1922 లో కారాగృహం ప్రవేశిస్తూ మహాత్ముడు "భారత ఐక్యతను నీ చేతులలో పెట్టి వెడుతున్నాను'' అన్నాడు. ఆయన మాటలు శిరసావహించి రాత్రింబవళ్ళు హిందూ ముస్లిం ఐక్యత కోసం సరోజిని ప్రయత్నాలు సాగించింది.

"ఎచట స్త్రీలు పూజింప బడుదురో అచట దేవతలు క్రీడింతురు. ఎచట పూజింపబడరో అచట అన్ని క్రియలు ఫలశూన్యములగును'' అన్న మనువాక్యం, "విశ్వాసము సౌజన్యము రెండవ కంటివాడెరుగని బాధ ననుభవించుట, వారియందు (స్త్రీలయందు) మూర్తీభవించెను" అన్న గాంధీ సూక్తి, రెండూ యథార్థాలే. దేశంలో స్త్రీలు సంతుష్టులు కాకుంటే పురుషుల అన్ని ప్రయత్నాలూ ఫలశూన్యాలే అవుతాయి. వేదకాలం నాడు భారత స్త్రీలు అనుభవించిన స్వాతంత్ర్యం నాగరికతాభివృద్ధితోపాటు దిగనాసిల్లిపోయింది. కొంతకాలం క్రితం దాకా స్త్రీ పురుషునికి బానిస అన్నట్లుగా తయారయింది. ఆమె అంటే సంఘానికీ అందులోని ప్రముఖులకీ కూడా న్యూనత భావమే. సంఘంలో ఆమె కష్టసుఖాలను ఆలోచించి తీర్చేవారే లేరు. రాజకీయాలలో ఆమెకు భాగం యిచ్చేవారూ లేరు. ఎన్నాళ్ళు స్త్రీలిలాగ యిటువంటి అవస్థని భరిస్తారు? సరోజిని వంటి వనితలు ముందుకి వచ్చి స్త్రీల స్థితిగతులను సరిదిద్దడానికి నడుము కట్టారు.

సరోజిని తన వివాహాన్నే సనాతన సంప్రదాయానికి వ్యతిరేకంగా చేసుకొని స్త్రీలూ వ్యక్తులేననీ, వారికీ వ్యక్తిత్వం, స్వేచ్ఛా వుండాలనీ చాటింది. అతి బాల్య వివాహాలూ పరదా పద్ధతీ వుండకూడదని అధిక ప్రచారం చేసింది. నవనాగరికత వనితా లోకంలోనే కాక, సనాతన సంప్రదాయానుగుణంగా వుండే స్త్రీలతో కూడా స్నేహం కలిపి అందరినీ ఒకే అంతస్తులో నుంచి నడిపే యత్నాలు చేసింది.

ఈ ఉద్యమంలో ప్రప్రథమంగా సరోజిని, ఫిజీ మహిళల తరపున వైస్రాయి వద్దకు రాయబారిగా వెళ్ళింది. 1919 లో మాంటెగు ఇండియా వచ్చినప్పుడు ఓటు హక్కులకు వెళ్ళిన స్త్రీల రాయబారానికి నాయకురాలుగా సరోజిని నిల్చింది. స్త్రీల ఓటు హక్కు విషయాన్ని చర్చించేందుకు యేర్పరుపబడిన కమిటీ ముందు సరోజిని యిచ్చిన వాఙ్మూలం అతి శక్తివంతమైనది. ఇదే సందర్భంలో యీమె అనేక పర్యాయాలు ఇంగ్లాండు దర్శించింది. ఇంగ్లాండులో బహిరంగ సభలో మాట్లాడుతూ ఆంగ్ల ప్రభుత్వాధికారుల అధికార మదాంధతని తీవ్రంగా విమర్శించిన ధీమంతురాలు. 1920 లో జెనీవాలో జరిగిన అంతర్జాతీయ మహాసభకు భారత నారీప్రతినిధిగా వెళ్ళి, అంతర్జాతీయ కీర్తిని మన మహిళలకి సమకూర్చింది. 1930 లో బొంబాయిలో జరిగిన మహిళాసభ చతుర్థ సమావేశానికి అధ్యక్షత వహించి అందరి మన్ననలను అందుకొన్నది. 1931 లో చెరసాలనుండి విడిపించి, ప్రభుత్వం ఇంగ్లాండులో జరుగు రౌండు టేబుల్ కాన్ఫరెన్సుకు భారత మహిళా ప్రతినిధిగా సరోజినిని నియమించారు.

సరోజినికి కాంగ్రెసు సంస్థతోటి సంబంధం కూడా పాతది. 1905 లోనే ఆమె కాంగ్రెసు సభలో ఉపన్యసించింది. ఈ సంస్థలో ఎన్ని మార్పులు వచ్చినా, ఎన్ని లోపాలు కన్పించినా సరోజిని మట్టుకు దానిని వీడలేదు. కాంగ్రెసు తరపున ప్రతినిధిగా పని చేయడమే కాక, 1925 లో కాన్పూరు కాంగ్రెసునకు అధ్యక్షురాలుగా ఎన్నుకోబడింది. ఇంతటి అఖండ గౌరవం యింకే భారత స్త్రీకీ సమకూరలేదు. 1937 లో దేశసంచారం చేసి కాంగ్రెసు విజయం కోసం పాటు పడింది. కాంగ్రెసులో అంతర్జాతీయ శాఖకు అధ్యక్షురాలిగా వుండి అంతర్జాతీయ ఐక్యత కోసం పాటు పడింది.

గాంధీజీ పరిచిన వ్యక్తులలో సరోజిని ప్రముఖురాలు. బాబూజీ ఆదర్శాలను మనసారా నమ్మి వాటిని ఆచరణ రూపంలో పెట్టిన స్త్రీ రత్నం. ఆయన ప్రారంభించిన

(తరువాయి 31-వ పేజీలో)

# చిన్న మొత్తములలో నిల్వ సేకరణ-

## ఆంధ్ర మహిళా సభలో కార్యాలయము.

చిన్న మొత్తముల నిల్వలు ప్రోత్సాహించి, ప్రభుత్వమువారి పంచవర్ష ప్రణాళికకు తోడ్పడు స్త్రీల ఉద్యమములో ఆంధ్రమహిళాసభ సభ్యురాండ్రు ఎక్కువగా తోడ్పడవలెనని నిశ్చయింపబడినది. ఇందు కొరకై, ఆంధ్రమహిళా సభ ఆవరణలో ఒక ప్రత్యేకమైన కార్యాలయము ఏర్పరుపబడును. ఇందు దైనిక కార్యక్రమాన్ని నిర్ణయించి, స్త్రీ సామాన్యములో యీ ఉద్యమాన్ని గూర్చి ప్రచారం చేయుటకు, నిల్వచేయదలచినవారికి తగు సలహానిచ్చుటకు, సభ తరపున కొందఱు యువతులు నియమింపబడుదురు. ఈ ఉద్యమంలో ఒక ప్రత్యేక ప్రతినిధిగా వ్యవహరించి, ధనము వసూలు చేయుటకు భారత ప్రభుత్వమువారు, ఆంధ్ర మహిళాసభకు అధికారమిచ్చియున్నారు. సభకు వచ్చిగాని, పోస్టు ద్వారాగాని అన్ని వివరములు తెలిసికొనవచ్చును,

ఇంకొక విషయము— మీరు కొనదలచిన సేవింగ్సు సర్టిఫికెట్లు సభ ద్వారా కొన్నయెడల సభకు 1¼% కమీషను వచ్చును. ఈ కమీషను సభయొక్క కార్యకలాపాలకై వినియోగించుకోవచ్చును. అందువల్ల మీరు నిల్వ చేయదలచిన మొత్తమునకు సభద్వారా సర్టిఫికెట్లు కొన్నచో, సభకు కూడా సహాయము చేసినవారగుదురు.

ఉత్సాహ వంతులైన సోదరీమణులు, యింత వరకూ సభద్వారా నిల్వ సర్టిఫికెట్లు తీసుకున్న మొత్తము రమారమి రూ. 24000/- ఇందు మూలముగా సభకు వచ్చిన కమీషను రూ. 300/- ఇంకా పెక్కుమంది సోదరీమణులు యీవిధముగా సభద్వారా సర్టిఫికెట్లుకొని సహాయ పడవలెనని కోరుచున్నాను.

అ. చన్నఘంటమ్మ,
కార్యదర్శిని.

---

## మానవ మాత్రులను మంత్ర ముగ్ధులను చేసిన

# "ముక్కెర"

పూర్వకాలపు నగలలో అందమైనదీ, నాజూకైనదీ యీ ముక్కెర తప్ప యింకో నగలేదు. ఎటువంటి శరీర చ్ఛాయకేనా సరే వన్నె తెచ్చేది యీ ముక్కెర. మానవులని యింతగా ముగ్ధులని చేసే ఆభరణం యింకోటిలేదు.

ఏదేశంలో కాని, ఏకాలంలో కాని, పురుషులే స్త్రీల కంటె డాంబికులు అనిపిస్తుంది. కారణం : ఇంకో పేరులో నైతేనేం, యింకో ఆకృతిలో నైతేనేం. ఏదో విధంగా స్త్రీ ధరించిన అన్ని ఆభరణాలూ యీ పురుషులూ ధరించడమే. స్త్రీ అలంకరణలుగా గాజులూ, కంకణాలూ, పట్టీలూ, జుంకాలూ, ధరిస్తే వాటినే మార్చి పురుషులు ధరించారు. వాటికి ప్రత్యేకమైన విలువా ప్రతిష్ఠా యేర్పరచారు. రాజాధి రాజునీ, కవి చక్రవర్తినీ యుద్ధ వీరుడినీ గుర్తింప చేసేవిగా వీటిని వాడేరు. స్త్రీ ధరిస్తే జుంకాలయినవే పురుషులు ధరిస్తే "మకరకుండలాలు" అయాయి. తర్క శాస్త్రవేత్తలు, వేద వేదాంగ పారంగతులు, మంత్ర తంత్ర వేత్తలూ, తమ మకర కుండలాల ప్రమాణాన్ని పట్టి తమ ప్రతిభ వెల్లడి చేసేలా చూసేవారు. కొన్ని సమయాల్లో మకర కుండలాల బరువే వారి పాండితా గరిమకు నిదర్శనంగా పరిగణింప బడేది.

అందరు స్త్రీలూ ధరించే గాజులే పురుష సింహాలు ధరిస్తే 'కంకణాలు' అయాయి. యుద్ధవీరులు ధరిస్తే 'వీర కంకణాలు' అయాయి. నాట్యకత్తె చిహ్నామైన పట్టాలు కృష్ణరాయిల ఆస్థాన కవికి చిహ్నాలయాయి. కవి సింహాల కది 'గండ పెండేర' మన్నమాట. ఇదంతా చూస్తే ఒకటి తోస్తుంది. తనకి సరిపడేటట్టు అలంకరణల పోకడలని పురుషుడు వుపయోగించు కొందుకు వెనుకంజ వెయ్య లేదని !

పూర్తిగా స్త్రీల స్వంతం అయిన యీ ఆభరణం నవీనపు అలంకరణల పోకడలలో లేకుండా పోడం విషాద కరమే. అందమైన ముక్కుకి యింకా వన్నె తెచ్చే యీ ముక్కెర లేక పోవడం మూలాన్ని; ఆశ్చర్యార్థకానికి(!) కింద చుక్క లేకుంటే ఎంత చిన్నబోతుందో ముగ్ధ ముక్కు కూడా అలాగే చిన్న బోతూంది.

ఈ ముగ్ధాభరణమైన ముక్కెర గురించి సంస్కృత కవుల వూహాలు యిన్నీ అన్నీ కావు. "ప్రియురాలి ముఖం చంద్ర బింబం అయితే, చంద్రుని సాన్నిధ్యంలో వుండే రోహిణి యే యీ ముక్కెర అయింది" అంటాడు ఒక కవి. "స్వర్గద్వారాల్లాంటి కళ్ళా ? అమృతోపమానమైన ప్రియురాలి అధరమా ? ఏదికావాలో తేల్చుకో లేని నా ప్రేమ రెండింటికీ సన్నిహితం అయిన ముక్కెర రూపు దాల్చింది" అంటాడు యింకోకవి. విచిత్ర సమస్యని సృష్టిస్తూ సమాధాన మిస్తాడు యింకో కవి - నల్ల కలువల్లాంటి కళ్ళూ రక్తారుణ అధరాలూ కలిగిన సుందరి దొంగల చే జిక్కినప్పుడు అన్ని ఆభరణాలూ దోచుకొన్న చోరులు ముక్కెర మాత్రం ఎందుకు వదిలారు ? అంటే, కళ్ళ కాటుక కాంతులని పై భాగంలోనూ పెదవుల రక్త వర్ణాన్ని క్రింది భాగంలోనూ నింపుకొన్న యీ ఆభరణం దొంగల కంటికి సాధారణమైన గురివింద గింజలాగ కనిపించిందట ! సర్వ సాధారణమైన గురివింద గింజకి అదృష్టం పట్టి బంగారం తూచేందుకు ఉపయుక్తమైనట్లే, సుందరాంగికి ముక్కెర అయిందేమో అన్నట్లు ఉత్ప్రేక్షించాడు కవి.

ముక్త అంటే ఆణిముత్యం (సాధారణంగా యీ ముక్కెరకి స్వచ్ఛమైన పెద్ద ముత్యాన్ని వాడుతారు) 'ముక్తా' అంటే ముక్తిని పొందే ఆత్మలని సంస్కృతంలో యింకో అర్థం కూడా వుంది. ఈ ద్వంద్వార్థాలని పురస్కరించుకొని కవి తన ప్రతిభ చూపుతూ యిలా అంటాడు. "స్త్రీల అధరామృతమే నిజమైన స్వర్గలోకపు అమృతం. అదే స్వేచ్ఛా జీవులైన ఆత్మలు తమ లక్ష్యంగా పెట్టుకొంటారు" అంటే, స్త్రీ అధరామృతమే, ప్రియునికి ముక్తి దాయికం అని భావం.

"యుగ యుగాలుగా సముద్రపు అగాధాలలో తపస్సు చేసి, తరిమిడి పట్టేవాని చేతిలో అష్ట కష్టాలూ పడిన ఆణిముత్యం తన తపః ఫలితంగా, ముగ్ధురాలి ముక్కెరగా రూపొందింద"ని యింకో కవి అంటాడు.

భారంగా సాగే కాలానికీ నిశ్శబ్దంగా అనుభవించే తీరని కోరికల వ్యధకీ యీ ముక్కెర చక్కని నిదర్శనం. కోర్కెల సఫలత కోసం అత్యాదశలో ఎదురు జూచే భావి లాంటిది యీ ముత్యం. అందుకే కవులకి విశ్రాంతి లేకుండా చేసిందన్నా, మన చిత్రకారుల దృష్టిని ఆకర్షిస్తోందన్నా ఆశ్చర్యం లేదు. ఇది స్త్రీ త్వానికే శాశ్వత నిదర్శన. ("హిందూ" నుండి అనుకరణ)

# ఉపసంహారం

భోజుని రాజధానిలో ప్రతిదినము ఉదయాన దేవాలయంలో పాట పాడుతుండే అమ్మాయి ఎక్కడో దొరికిన పిల్ల.

దేవాలయాచార్యుడు ఆ పిల్ల దొరికిన వివరం ఈ విధంగా చెప్పేవాడు-"ఒకనాడు తెల్లవారుఝామున ఎవరో పాడుతున్నట్టు వినబడ్డది. కొంత సేపైన పిమ్మట మామూలు ప్రకారం సజ్జపట్టుకొని పూలు కోద్దామని చెట్టు దగ్గిరికి వెళ్లేసరికి ఈ అమ్మాయి ఆ చెట్టుకింద దొరికింది"

అప్పటినుంచి ఆచార్యుడు తన తంబూరాను ఒళ్ళో పెట్టుకొని బహు శ్రద్ధగా పట్టుకొన్నట్టుగా అమ్మాయిని ఒళ్ళో కూర్చోపెట్టుకొని అతి ముద్దుగా పెంచి పెద్దదానిని చేశాడు. ఆ అమ్మాయి నోటి వెంట మాటలు రాక పూర్వమే కంఠంలో నుండి సంగీతం రావడం ప్రారంభించింది.

ఆచార్యుని కంఠం ఇప్పుడు క్షీణం అయిపోయింది. కళ్ళు కనపడవు. ఆ బాలిక అతన్ని ఇప్పుడు పసి బిడ్డణ్ణి పెంచినట్టుగా పెంచుతున్నది.

ఆ అమ్మాయి పాట వినడానికి దేశ దేశాలనుండి యువకులెందరో వస్తున్నారు. ఇది చూచి ఆచార్యుని గుండెలో అప్పుడప్పుడు వణుకు పుట్టి, "పువ్వు బలం తగ్గిపోయిన కాడను అంటిపెట్టుకొని ఆట్టే రోజులు ఉండ" దని అంటూ ఉండేవాడు.

"నిన్ను విడిచిపెట్టి ఒక్క నిమిషం బ్రతికి ఉండలేను నేను" అని ఆ బాలిక జవాబు చెప్పేది.

"నేడు నా కంఠంలోంచి బయటికి వచ్చేసిన పాట నీలో రూపం ధరించింది ; నీవు నన్ను విడిచి వెళ్ళిపోయి నావంటే యావజ్జీవము నేను చేస్తున్న సాధనం అంతా పోగొట్టుకొన్న వాడనౌతా" నని ఆచార్యుడన్నాడు.

## ౨

వసంత పౌర్ణమినాడు ఆచార్యుని ప్రధాన శిష్యుడు కుమార సేనుడు గురువుగారి దగ్గిరికి వచ్చి పాదాల పైని ఆమ్రమంజరి ఉంచి ప్రణామం చేసి "నాకు మాధవికి పరస్పరానురాగం కలిగింది. మీరు సమ్మతించిన యెడల మే మిద్దరమూ కలిసి మీ పాదసేవ చేస్తాము" అని అన్నాడు.

ఆచార్యుని కళ్ళ వెంబడి నీళ్ళు కారడం మొదలు పెట్టాయి. "నా తంబూరా తెచ్చి నా చేతికిచ్చి, మీరిద్దరు రాజు, రాణి అయి నా ఎదుటకు వచ్చి కూర్చోండి" అని అన్నాడు.

తంబూరా పట్టుకొని శహనా రాగంమీద బహు ఇంపైన జోలపాట ప్రారంభించి, "నా జీవితంలో ఇదే ఆఖరి పాట" అన్నాడు.

ఒక్క చరణం పాడాడు, పాట మరి నడవలేదు. చినుకులు పడి పడి నీళ్ళతో నిండి అల్లలాడి అల్లలాడి రాలి పడిన జాజి పువ్వు మాదిరి కనబడ్డాడు. చివరకు తంబూరాను కుమార్‌సేన్ చేతిలో పెట్టి, "ఇదిగో తీసుకో నాయనా నా యంత్రాన్ని" అని అన్నాడు.

తరువాత మాధవి చెయ్యిని తీసి, అతని చేతిలో పెట్టి "ఇదిగో నాయనా, నా ప్రాణాన్ని అందుకో అని అన్నాడు.

"మీరిద్దరు కలిసి నా పాట పూర్తి చెయ్యండి, నేను వింటాను" అని తరువాత అన్నాడు. మాధవి, కుమారుడు కలిసి పాట పూర్తి చేశారు— అది ఆకాశము నిండు చంద్రుడు కలిసి పాడిన పాట అని అనిపించింది.

## ౩

ఆ సమయంలో రాజదూత ఒకడు వచ్చి ద్వారం దగ్గిర నిలుచున్నాడు. పాట నిలిచిపోయింది.

ఆచార్యుడు వణుకుతూ వణుకుతూ ఆసనంమీదనుండి లేచి, "రాజావారి ఆజ్ఞ ఏమిటి ?" అని అడిగాడు.

"మీ అమ్మాయి అదృష్టం బాగుంది, ఆమెను తీసుక రమ్మని మహారాజా వారి ఆజ్ఞ అయింది" అని దూత అన్నాడు.

"మహారాజా వారి ఉద్దేశమేమి?" టని ఆచార్యుడడిగాడు.

మూలం : రవీంద్ర        అనువాదం : కె. వైకుంఠరావు

## ఉ ప సం హా రం

"రేపు ఉదయాన రాజావారి కొమార్తె కాంభోజదేశానికి వెళ్ళిపోతుంది. అత్తవారి ఇంటికి. మీ అమ్మాయి, మాధవి చెలికత్తెగా ఆమెతో వెళ్ళవలెనట" అని దూత చెప్పాడు.

౪

తెల్లవారింది. రాచ కన్య పతి గృహానికి బయలు దేరింది. రాణి మాధవిని పిలిచి "మా అమ్మాయి విదేశంలో ఉండబోతున్నది. ఆమె సదా ఆనందంగా ఉండే భారం నీదే" అని అన్నది.

మాధవి కళ్ళనుండి నీళ్ళు కారలేదు. అనావృష్టి సమయంలో ఆకాశం నుండి పడుతున్న సూర్య కిరణాలు పడ్డవి.

మయూరపంఖి అనే రాచకన్య పల్లకి ముందు వెళ్ళు తున్నది. దాని వెంబడే వస్తున్నది మాధవి పల్లకి— లతలు కుట్టిన ముఖమలు బురఖా కప్పి ఉన్నది. రెండువైపులా సిపాయిలు పారా ఇస్తున్నారు.

గాలికి విరిగి పడిన రావికొమ్మలాగు దారి ప్రక్కను పడి ఉన్నాడు. ఆచార్యుడు, ఆ ప్రక్కనే నిశ్చలంగా నిలుచొని ఉన్నాడు కుమార్ సేన్.

పలాశశాఖలపైని కూర్చొని పక్షి పాడుతున్నది. మామిడిపువ్వు వాసనతో నిండి ఉన్న గాలి విహ్వల మైనట్లు ఉన్నది. వసంత సంధ్యను రాజకుమారి మనస్సు చంచలమై బాధపడుతుంటూ ఉంటుందేమో అనుకొని పురజనుల హృదయాలు తత్తరపడుతున్నవి.



## స రో జి నీ దే వి

(27-వ పేజీ తరువాయి)

సత్యాగ్రహ సమరంలో త్రికరణ శుద్ధిగా పనిచేసిన వీర వనిత. స్వాతంత్ర్య సమరంలో అధికంగా పాల్గొని యితోధి కంగా దేశసేవ చేసింది. ఉప్పు సత్యాగ్రహంలోనే కాక అగస్టు విప్లవంలో కూడా కారాగార వాసాన్ని చవి చూసింది. 1943 లో అనారోగ్యం కారణంగా ఆమెను విడుదల చేశారు.

స్వాతంత్ర్య సమరంలోనే కాక పదవీ నిర్వహణలో కూడా స్త్రీలు పురుషుల కేమాత్రం తీసిపోరని సరోజిని నిరూపించింది. స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత, డాక్టరు బి.సి. రాయ్ విదేశాలలో నుండగా ఆయనస్థానే సంయుక్త రాష్ట్రాలకు గవర్నరుగా సరోజినిని నియమించారు. అధికారం అంటే అయిష్టం అయినా యీ పదవిని అనేక కారణాలవల్ల స్వీకరించక తప్పలేదు. గవర్నరుగా పని చేస్తూనే సరోజిని మహిళల ఉన్నతికి శరణార్థులకు వసతి సౌకర్యాలు కల్పించడానికి పాటుపడింది.

జీవిత సర్వస్వాన్ని దేశసేవకై ధారపోసి, అలసట అనేదే యెరుగని సరోజిని ఆ శరీరం 1945 జనవరిలో అస్వస్థత చెందింది. 1945 మార్చి 2 వ తేదీన సునా యాసంగా, శాశ్వతంగా ఆమె యీ లోకాన్నే విడిచింది.

గతకాలపు వీరవనితలనీ, రాబోయే మేధావంతులయిన నారీమణులనీ కలిపే శక్తి సరోజిని. భారత వర్షంలో సావిత్రీ, అనసూయా, దమయంతీ, పద్మినీ, మీరాబాయీ మొదలైన వారి సుగుణాల కథలు అభూత కల్పనలు కావని సరోజిని జీవితం నిరూపిస్తుంది. ఈమె మనో నిశ్చయం, ధైర్యం, త్యాగం వ్యక్తిత్వం పురాణ స్త్రీల అద్భుతగాథలని యేమాత్రం తీసిపోదు. కాలంలో మార్పు వుంది కనక ఆ తేడా కన్పిస్తుంది. సరోజిని జీవితం భావి భారత వనితాలోకానికి ధృవతార. ధైర్య స్థైర్యాలూ విశ్వాసమూ, సరోజినిని చూసి అనేకులు నేర్చుకొంటారు. ఇదే ఆమె సాధించిన ఘన విజయం. ఇదే ఆమె జీవితం వేసిన రాజబాట. సరోజిని తన కళ్ళతో తనే మహిళల మహోజ్వల భవిష్యత్తు చూడలేకపోవచ్చు. దానివల్ల నష్టం ఏమిటి? ఈనాటి మహిళల కనుల మెరిసే జ్ఞానం వారి మనస్సులలో నిలచిన ధైర్యం, వారి వ్యక్తిత్వానికి యేర్పడిన హోదా— అన్నిటిలోనూ కూడా సరోజిని పాలు పంచుకోదా? ఆమెదే కదా యీ చలవంతా? అందుకే అప్పుడూ ఇప్పుడూ ఎప్పుడూ కూడా స్త్రీజనానికి సరోజిని ధృవతార అంటే అతిశయోక్తి కాదు.



# దారిద్ర్య నిర్మూలనకు సంతాన నిరోధం మాత్రం మార్గమా ?

* శ్రీమతి లక్ష్మీపున్నయ్య *

పశ్చిమ గోదావరిజిల్లా మహిళాసభ "అధిక జనాభా వల్ల దారిద్ర్యంతో అలమటిస్తున్న భారత దేశాన్ని ఉద్ధరించ గలగాలంటే నూతనంగా కని పెట్టబడిన సంతాన నిరోధ మార్గాలను సాధ్యమైనంత త్వరలో ప్రజలలో విరివిగా ప్రచారం చేయడం అవసరమని తీర్మానించింది.

దేశ విస్తీర్ణం, అందులోని సహజ సంపద పరిమితమయి సంతానోత్పత్తి హెచ్చు పెరిగిపోతున్న సందర్భమున దేశంలోని దారిద్ర్యాన్ని నిర్మూలించుటకు సంతాన నిరోధము ప్రధానావసరముగా నెంచవచ్చును. కాని మన దేశంయొక్క విస్తీర్ణం, అందులోని సహజ సంపదలు, జీవనోపాధికిగల అవకాశాలు ప్రజలకు ఎంతవరకు వినియోగపడుతున్నవి ? దానిని నూటికి నూరుపాళ్ళు తమ జీవిత పురోభివృద్ధికి ప్రజలు వినియోగించుకో కలిగిననాడు యీనాటి దారిద్ర్య దురవస్థలకు గల అవకాశములు ఏమిటి? అనే విషయాలను ప్రజలు, ముఖ్యంగా మహిళా సంఘాలు గుర్తించాలి. ఈ విషయాలను తర్కించుకొని మన దేశంలో సంతాన నిరోధావశ్యకతను గురించి ఆలోచించినా, తీర్మానాలు చేసినా, సంతాన నిరోధ సూత్రాల నమలు పరచినా బాగుంటుంది.

సంతానోత్పత్తిని పరిమితం చెయ్యడం అవసరమే కావచ్చు. దినదినానికి బలహీన మగుచున్న ప్రజాబాహుళ్యాన్ని, క్షీణిస్తున్న ప్రజల ఆరోగ్యస్థాయిని, ఆర్థికదుస్థితిని దృష్టిలో నుంచుకొని వీనినిచక్కదిద్దు కోడానికి ఏకైక మార్గము సంతాన నిరోధము మార్గమనే వాదం బలహీన మయిందేమో ! అదీను - కృత్రిమ మార్గాలు, మందుల ద్వారా సంతాన నిరోధాన్ని అమలు పరచాలని చేసే వాదన అవాంఛనీయము.

ప్రజల ఆరోగ్యస్థాయిని పెంపొంద జేయడానికి కావలసిన కనీసావసరాలు - ఆడ పిల్లల పెండ్లి వయస్సు పెంచడం, యువకులకు కుటుంబ పోషణ కవసరమయిన ఉద్యోగ సంపాదనను వివాహ యోగ్యతగా నిర్ణయించడం, సామర్థ్యము, అవకాశములను బట్టి కుటుంబ ఆదాయం పెరిగి దైనికావసరములు గడచి పోవుట కనువైన వ్యవస్థ నిర్మాణానికి కుటుంబములోని ప్రతియొక్కరు కృషి చేయడం అత్యవసరము. దీనితోపాటు దేశంలోని సహజ సంపదని, పరిశ్రమలు, వ్యవసాయోత్పత్తి ప్రజాశ్రేయస్సుకుగా వినియోగ పడటం పట్ల ప్రభుత్వము ఆసక్తితో తోడ్పడాలి. ఇవి సమకూరిన నాడు ప్రజలకు దారిద్ర్య దురవస్థలు తొలిగి ఆరోగ్య సౌభాగ్యములు సమకూరగలవు.

పెండ్లి వయస్సు స్త్రీలకు, పురుషులకు పెంచే సందర్భమున వారికి వివాహానికి ముందు క్రమశిక్షణతో కూడిన జీవిత పురోభివృద్ధికి అనువైన విద్యాసౌకర్యాలు అమరాలి; ఉద్రేక పరచే వాతావరణానికి - వాఙ్మయానికి, దృశ్యాలకు వారిని దూరంచేయ్యాలి. దానివలన యుక్త వయస్కులై వైవాహిక జీవయాత్ర కుపక్రమించినచో సంతానము పుష్టికరంగా నుంటుంది. తల్లిదండ్రులు, సంతానము ఆరోగ్య వంతులుగా నుంటారు. జీవితావసరాలు గడచి పోతూ ఆరోగ్య సౌభాగ్యాలతో వర్ధిల్లే కుటుంబ జీవితం దేశపురోభివృద్ధికే కాక ప్రపంచ పురోభివృద్ధికి నయితం అత్యవసరం. దీనిని సాధించడమే ప్రతి సంఘసేవకునకు, సేవకురాలికి పరమావధి.

విశాలమైన భారతదేశంలో, దాని అభివృద్ధికి విశేషమైన మానవ కృషి, శక్తి అవసరమై యుండి కూడ సంతాన నిరోధానికి విశేష ప్రచారంపై కార్యక్రమ నిర్వహణకంటె సత్ఫలితాలను సమకూరుస్తుందని నారీలోకం నయితం ఎలాగ భావిస్తుందో అర్థం కావడంలేదు.



# వింత జంట

శ్రీ యం. సోమ్.

ఉషఃకాలం - భానుడు తన అరుణారుణ కిరణాలను వెదజల్లుతూ, నీలి మబ్బులోంచి తొంగి చూస్తూ "మరల రేపు వస్తాను సెలవు" అంటూ అస్తమిస్తున్నాడు. చిత్రకారుని బొమ్మలకు అవసరమైన రంగులన్నీ ఆ ఆకాశంలో మిళితమై కనిపిస్తున్నాయి. కవి వర్ణనకు పుట్టిల్లయిన పకృతి ప్రశాంతాన్నందిస్తూంది. ఆ సాయంత్రపు సూర్య కిరణాల్లో మెరసిపోతూన్న సముద్రపుటొడ్డున పిల్లవాయువులకు అల్లల్లాడే ముంగురులను చక్కబెట్టుకుంటూ అందం, ఆనందం అంతా తమదే అనుకుంటూ మురిసిపోయే యువతులు, స్వేచ్ఛ అంటే యింకెక్కడుందంటూ చేయి చేయి కలిపి తిరిగే యువకులు, కుక్కలతో ఆడుకునే పిల్లలు, పిల్లలతో ఆడుకునే తల్లులు, తల్లులతో బాధపడే కూతుళ్లు, కూతుళ్ళతో విసుగుచెందే తండ్రులు, 'ఆమె నన్ను చూడలేదే!' అని అలమటించే అమాయకులూ, అల్లరిచేసి ఆనందించే అంగనలు, మమత మాల మనసు మెరపుల మురిసిపోతూ తొంచి చూచే పూబోండ్లు, వీరి చర్యలను చూస్తూ ఆనందించేవారు కొందరు - విసుగు చెందే వారు మరికొందరు, ఒకవైపు 'వేరుగళ్' కుర్రవాని కేకలు, మరొక వైపు ఐస్‌క్రీమ్ అమ్మేవాని అరుపులు, కాకుల కోలాహలం, కుక్కల అరుపులు వీటన్నిటికీ స్మృతి పోస్తూన్నట్లు సముద్రపు ఘోష. ఇసుకలో కూరుకుపోతూన్న కాళ్ళను ఈడ్చుకుంటూ ఆ రమణీయాన్ని గురించి పొగడుతూ నా ప్రక్కనే నడుస్తూ వస్తూన్న స్నేహితునివైపు తిరిగాను. అంతవరకూ నా వెంట వస్తూ అంత అకస్మాత్తుగా ఎక్కడ ఆగిపోయాడా అని వెనక్కి తిరిగి చూశాను. మన వాడు కొన్ని గజాల దూరంలో ఎవరితోనో మాట్లాడుతూ నవ్వుతూ నన్ను రమ్మని పిలిచాడు. తరువాత వారికి నన్ను, నన్ను వారికి పరిచయంచేసి వారితో యింకా ఏమో మాట్లాడుతూనే వున్నాడు. మన వాడితో మాట్లాడుతూన్న యువకుని మాటల్లోని ఆప్యాయత, ఆ చూపుల్లోని శాంతం నన్ను మరీ ఆకర్షించాయి. అతని ప్రక్కనే కూర్చొని పొంగిపోరలే ఆనందంతో తన చిన్న బిడ్డను ఆడిస్తూ మాతృహృదయాన్ని వెల్లడిస్తూంది అంగ సౌష్టవంతో కూడుకున్న షుమారు పదునెనిమిది సంవత్సరాల అందాల భరిణి. బంగారు ఛాయలాంటి ఆమె శరీర చ్ఛాయ, నల్లని దీర్ఘమైన రెండు జడలు, మెరసిపోయే నేత్రాలు, చిలుక పలుకల్లాంటి ఆ మాటల్లోని పొదుపు అంతా ఆమె ఎవరో చిత్రకారుని చిత్తరువో, కవుల ఊహా స్వరూపమో అన్నట్లుంది. వారిరువురి మధ్య చిన్న చిన్న అడుగులతో అల్లి బిల్లి తిరిగే చిన్న పాప - చూడటాని కెంతో ముచ్చటగా ఉంది.

అలా చూస్తూన్న నన్ను మన వాడు నా చెయ్యి పట్టుకొని "చెప్తాన్నడు" అంటూ బయలుదేరాడు. మరేం చెయ్యను. "సరే" నని నడక సాగించాను. అలా నడుస్తూనే మనవాడు ఆ జంటను గురించి చాలా వింత వింత విషయాలు చెప్పటం ప్రారంభించాడు. అలా చెప్పుకుంటూ మెల్లగా రూము చేరాము. ఏ నిమిషాన్ని చూసినా ఆ ఆదర్శమైన జంటే గుర్తుకు వస్తూంది. ఒక్కొక్కరి మనస్తత్వాన్ని గురించి-అందులో స్త్రీలను గురించి ఎన్నో రకాలుగా ఆలోచించాను. కాని స్త్రీ హృదయాన్ని అర్థం చేసుకోవటం అంత సులభమైనది కాదేమో! ఒకప్పుడు ఆనందాన్ని చేకూర్చిన స్త్రీయే మరొకప్పుడు అశాంతినిస్తుంది. అమృతాన్ని వెదజల్లే అబలే విషాన్ని కురిపించే కర్కసిగా మారుతుంది. ఒక క్షణంలో తన ప్రేమ హృదయాలయ సింహద్వారాన్ని తెరచి పూజారి నాహ్వానిస్తుంది. మరుక్షణంలోనే కవాటాలను బంధించి పిశాచాల

కాలయమైన శ్మశానంగా మారుస్తుంది. తన సంతోషానికై మరికొందర్ని బాధలకు గురి చేస్తుంది. మరొకరి ఆనందం కొరకు తాను కష్టాల నెదుర్కొంటుంది, వెన్నపూసలాంటి మనసు కఠినశిలగా మారుతుంది. చలనంలేని హృదయాన్ని పూరికే చలింప జేస్తుంది. ఏమిటీ మార్పు! ఇలా ఏమో ఆలోచిస్తున్నానే కాని అసలా జంట కథ ఎక్కడ ప్రారంభించి వ్రాసి మన వాడి కోర్కె తీర్చాలో బోధ పడింది కాదు. పోనీ శుభమస్తూ అని పెండ్లితో ప్రారంభిద్దా మనిపించింది. సరే అనుకున్నాను.

ఈ పెండ్లిండ్ల విషయాలు చూశారూ మహ వింతగా ఉంటాయి. అది మానవ సృష్టిలోని కీలకమే అనుకోండి, మరేమైనా అనుకోండి. కాకపోతే ఎక్కడో పెరిగిన అబ్బాయికి, మరెక్కడో పుట్టిన అమ్మాయికి పెండ్లి, పెండ్లంటే చిన్న దగ్గర నుండి పెద్ద వరకు సంతోషమే. ముఖ్యంగా చావటానికి సిద్ధంగా ఉన్న వృద్ధులకు మరీను. ఈ వృద్ధుల తాలూకు పెండ్లీడు పిల్లలు ఎవరైనా ఉంటే వీళ్ళ పోరు పడటం మాత్రం చాలా కష్టం. ఆ పిల్లల పెండ్లయితే చూసి మరీ ప్రాణాలు వదుల్దామని. వీళ్ళ పెండ్లికి వాళ్ళ చావుకు ఏమిటో సంబంధం!

రమణ కుటుంబంలో అలా పెండ్లికని పోరు పెట్టే వాళ్ళు చాలామంది ఉన్నా రమణ మాత్రం వారి మాటలు చెవినిపెట్టకుండా కాలేజీ చదువు సాగిస్తున్నాడు పట్టణంలో. కుమారుని పట్టుదలకు విసిగి విరక్తి చెందిన నాన్నగార్కి అకస్మాత్తుగా ఒక జాబు వచ్చింది. దాన్ని చదివేటప్పటికి తనకే కాకుండా ఆ యింట్లో వున్న అందరికీ గుండె ఆగి పోయినంతయింది ఆనందంతో. తలవని తలంపుగా తన ముద్దు బిడ్డలో అంత మార్పు ఎందు కొచ్చిందో తెలియని వెర్రి తండ్రి ఆ ఉత్తరాన్ని మరల మరల చదువుకున్నాడు. తన ఏకైక పుత్రుని పెండ్లి విషయంలో తాను ఏసంబంధం తెచ్చినా ఒప్పుకుంటానని వ్రాయటం వల్ల పొంగి అప్పుడే పెండ్లయినంత ఆర్భాటం చేశారు. రోజూ నాలుగు సంబంధాలు చూస్తున్నారు. రమణంటే అన్నివిధాలా మంచివాడు. అందులో కాస్తో కూస్తో స్థితిమంతుడు. మరేం కావాలి! చివరకు ఏదో ఒక దూరపు సంబంధాన్ని నిర్ణయించటం, వెంటనే రమణని పెండ్లి చూపులకని కబురుచేయటం. అతను రాగానే అందరూ కలిసి వారి సాంప్రదాయ ప్రకారంగా వధువును చూడటానికని వరుడు వధువు ఇంటికి కాకుండా వారికి వీరికి బంధువులైన మరొక రింటికి వెళ్ళారు. ఇటునుండి వీళ్ల చేరుకునే టప్పటికే రాత్రి చాలా ప్రొద్దు పోవడం వల్ల ఆ రాత్రి కేదో లోకాభిరామాయణం మాట్లాడుకొని పుణ్యకాలం కాస్తా గడిపారు. ఆ యిల్లు వధువు పిన తండ్రిగారి యిల్లు. ఆ యిల్లు, దాని వెనుక దొడ్డి, దానిలో బావి, ఆ ప్రక్కనే వున్న పూల మొక్కలు, ఆ యింటి స్థితి సాధారణమైందని తెలుపుతూంది.

ఆ మరునాటి ఉదయాన్నే స్నానం ముగించుకొని ఒళ్లు తుడుచుకుంటూ ఆ బావి దగ్గరే ఏదో ఆలోచిస్తూ నుంచున్నాడు రమణ. అతనిలో ఉత్సాహం ఏమూలా కనిపించటంలేదు. మనసు లేని మరలాగ ప్రక్కన వారు చెప్పిన దల్లా చేస్తున్నాడు. ఎలాగైనా సరే, ఏమైనా సరే తల్లిదండ్రుల కోర్కె తీర్చటానికనే ఆ పెండ్లి కొప్పు కున్నాడు — అంతే. ఆ కోర్కెతోనే పిల్లను విధాయికంగా చూడాలన్నట్లు వచ్చాడు. తన అమూల్యమైన ఆశయాలన్నీ ఏనాడో అడుగంటి పోయాయి. అతనిలోని ప్రేమజ్యోతి ఆరి సన్నని పొగ మాత్రం వస్తూంది. అతని హృదయం ప్రస్తుతం అద్దెకొంపలాంటిది - అంతే. వేలుకట్నాలిచ్చి తన హృదయాన్నాక్రమించు కోవటానికి ముక్కు, మొగము తెలియని యువతి వస్తోంది, ఆ వచ్చే ఆవిడ తన జీవితపు తోటలో విష బీజాల్ని నాటుతుందో! ప్రేమ మొక్కల్ని పెంచుతుందో! ఎలా తెలుస్తుంది?

ఏమైనా సరే ఆ పెండ్లికి ఒప్పుకున్నాడు. తాననుకున్నది తనకు కానప్పుడు మరొకటైతేనేం? అందుకే ఆకాబోయే భార్య ఎవరో? ఏమిటోగూడా తెలుసుకోవటానికి ప్రయత్నించలేదు. ఏదో ఆలోచనతో అలాగే సూన్యంగా అచ్చటి పూలమొక్కల్ని చూస్తూ కూర్చున్న అతని కండ్లు వున్నట్టుండి ఒక్కసారిగా మెరిశాయి. ఆ పూలచెట్లమధ్య మెరపుతీవలాంటి యువతి చిన్న పిల్లని వెంటబెట్టుకొని చెట్ల పాదులను బాగుచేస్తూంది. ఆ యువతి ఇతన్ని చూడ కుండగనే తన పని తాను చేసుకుంటోంది. ఆ యువతి ముఖం మాత్రం అతనికి కనిపించటంలేదు గాని - ఆమె నడకని - ఆ వాలుజడని చూడగానే ఇతని గుండె దడ ఆరంభమయింది. ఆవిడే పెండ్లికూతురేమో అనుకున్నాడు- మరలా పెండ్లికూతురైతే అలా చెట్ల పాదుల్ని బాగుచేస్తూ వుంటుందా - హాయిగా ముస్తాబై ఏ గదిలోనో కూర్చో వాలిగాని. అయినా ఏమో - అనే అనుమానం. ఆమె ముఖాన్ని చూడగానే తీరిపోయింది. ఏదో గుర్తుకు

వచ్చింది – తన్ను చూడగానే రాతిబొమ్మలాగ నిర్ఘపోయిన ఆమెను మరల చూడలేకపోయాడు. పెదవులు వణుకుతున్నాయి. అవమానంతో తలవంచుకొనిపోయింది అపరాధమన్నట్లు శరీరం కంపించింది. భయంతో కళ్ళు మూసుకొనిపోతున్నాయి. సిగ్గుతో కాళ్ళు పరుగెత్తుతున్నాయి. ఎందుకో? అలా గబగబా తనకని నిర్ణయించబడిన రూములోకి వెళ్ళాడు. నాన్నగారి ద్వారా పెండ్లికూతురు ఆవిడేనని తెలుసుకొని విలపించటం మొదలు పెట్టాడు. ఆరోజు తన ఆశలన్నీ అడుగంటినరోజు - తన ప్రశాంత జీవితంలో పెనుతుపాను రేగిన రోజు గుర్తుకు వచ్చింది. ఏదో చెప్పలేని బాధ తన హృదయాన్ని దహించివేస్తోంది. "ఆమెతో పెండ్లి వద్దంటే వద్దని" నాన్నగారితో చెప్పాడు. ఇంకేముంది? అంతవరకూ ఆనందంలో మునిగి తేలుతున్న నాన్నగారికి చాలా అన్యాయం జరిగింది. రమణకు పిచ్చేమైనా పట్టిందేమో! అనే అనుమానం ఆవరించింది. కాకపోతే అంతవరకూ వచ్చిన తరువాత అలా అంటాడా? పోనీ పిల్లేమైనా నచ్చలేదనుకోవటానికి అలాగేం లేదు. మరయితే అంత అకస్మాత్తుగా ఏమిటా మార్పు? పైపెచ్చు తానేదో అపరాధం చేసినట్లు భయపడుతున్నాడు. అంతా అయోమయంగా వుంది. ఈ విషయమంతా ఒక్క క్షణంలో ఆ యిల్లే కాకుండా ఆ వీధి అంతా ప్రాకిపోయింది. నలుగురూ నాలుగు విధాలా అనుకోవటం ప్రారంభించారు.

ఈ విషయాలన్నీ వింటున్న రాధ తన పెండ్లి పచ్చడి మెతుకులుగా మారినా, పాయసాన్నం తింటున్నట్లే ఆనందిస్తూంది. తన కన్నివిధాలా తగిన వరుడు తన్ను పెండ్లాడటానికి నిరాకరిస్తుంటే అవగింజంతైనా విచారించదు సరిగదా ముందెన్నడూలేని సంతోషంతో వికసిస్తూ, పరిమళాన్ని వెదజల్లుతూంది. ఏమిటీ వింత ప్రవర్తన? అతనికి బాధ — ఈమెకు సంతోషం—

ఆమెకు తెలుసు- అతనెవరో? ఎందుకలా బాధపడుతూ పెండ్లి వద్దంటున్నాడో? వారి వింత ప్రవర్తనలకి అందరూ తికమక అవుతున్నారనీ తెలుసు — ఎవరెలా పోతేనేం?- ఏదెలా జరిగితేనేం? తన సంతోషానికి అతనే కారణం - అతని విచారానికి తనే కారణం- ఆ హృదయ పరిచయం....! బావిదగ్గర చూసినప్పుడే అతని వింత ప్రవర్తన గ్రహించుకుంది. అతనెంతగా ఖిన్నుడై వుంటాడో గ్రహించుకుంది. అప్పుడే మాట్లాడదామనుకున్నా అవకాశం లేకపోయింది- అంతా ఒక్క క్షణంలో జరిగిపోయింది-

ఏ సుందరమూర్తిని దర్శించి- తన తప్పును క్షమించమని ప్రాధేయ పడటానికి పడరాని పాట్లు పడిందో- ఏ శాంతమూర్తికి తోడుగా నిలచి కళామతల్లికి వన్నెలు దిద్దుదామనుకుందో- ఆ కళా పిపాసినే- దైవం, తన భర్తగా చేకూరుస్తున్నాడంటే ఆనందం గాక మరేముంటుంది? ఆ ఆనందంతోనే రమణ వద్దకు నడుస్తూంది—— కాని- ఆనాటి సాయంత్రం - ఆ నవ్వులు - అవమానంతో క్రుంగిపోతున్న యువకుడుకి అన్నీ గుర్తుకు వచ్చాయి. శరీరమంతా ఒక్కసారిగా వణికింది. తన చేతిని ఒక్కసారి చూచుకుంది. అదే చెయ్యి ఆరోజు- అబ్బా! ఆ చేతిని రెండు ముక్కలుగా నరికి ఆ రక్తాన్ని అతని కాళ్ళ ముందు ధారపోసి క్షమాపణ కోరుకుందామనుకుంది. అలా ఆలోచిస్తూనే అతని రూములోకి ప్రవేశించింది. అంతవరకు ఏదో ఆలోచిస్తూ మరో లోకంలో వున్న రమణ ఈమె రాకతో యధాలోకంలోకి వచ్చాడు. ఆలోచిస్తున్న అతని కాళ్ళవద్ద అలాగే కూర్చొని జాలిగా అతని ముఖంలోకి చూసింది. తప్పు క్షమించమన్నట్లు. అతనిలో అంతవరకూ అలమటిస్తున్న ఆవేదన ఆనందంగా మారింది. పడిపోయిన ప్రేమసౌధాన్ని మరల గట్టిగా కట్టుకోవటానికి చేయి చేయి కలుపుకున్నారు. ఒకరి కన్నీరు మరొకరు తుడుచుకున్నారు. అలా ఒక్క క్షణకాలంలో స్వర్గాన్ని నిర్మించుకున్నారు.

ఇదంతా చూస్తున్న అచ్చటి బంధుకోటికి నిజంగా పిచ్చపట్టినంతై "కలయో వైష్ణవ మాయయో" అన్నట్లు ఆపిచ్చలోనే పెండ్లి చేశారు. వాళ్ళ పెండ్లయితే మహా వైభవంగా జరిగింది గాని- వీళ్ళకి పిచ్చమాత్రం యింకా వదలక చెవులు కొరుక్కుంటున్నారు. నిజమే, రమణా-రాధల విషయం వీళ్ళకేం తెలుసు? తెలిసిన స్నేహితులు కొందరు మాత్రం చాలా సంతోషించారు.

అలా సంతోషంతోనే కొన్నాళ్ళు గడిపారు. ఇప్పుడు రమణ వుద్యోగంచేస్తూ హాయిగా పట్టణంలో కాపురం చేస్తూ వీలున్నప్పుడల్లా తన లలిత కళలకు వన్నెలు దిద్దుతూ కాలం గడుపుతున్నాడు. ఆ దంపతుల ప్రేమ ఫలితంగా పుట్టిన ముద్దుబిడ్డ పుట్టిన రోజు పండుగకు తమ స్నేహితుల నందర్నీ పిలిచారు. వచ్చిన అందరూ

పొగడటం - దీవించటం అంతా జరిగిపోయింది. రాధ స్నేహితురాండ్రు ఆమె ముద్దు బిడ్డని ఎత్తుకొని ఆడిస్తున్నారు, కాని బిడ్డ మాత్రం తల్లి కొరకని ఏడుస్తూ, వారి చేతుల్లో నిలువకుండా ప్రళయ తాండవం చేస్తున్నాడు. దానితో పాపం రాధ తాను తన స్నేహితురాండ్ర కిచ్చిన ఆనందం, తన చంటిపాప యీయటంలేదే! అన్న కోపంతో స్నేహితురాలి చేతిలోని బిడ్డను తీసుకుంటూ "చెంప పగులకొడితే సరి" అన్నది తల్లి ప్రేమతో. ఆమాట వినగానే వారికి కొంత దూరంలో స్నేహితులతో కూర్చొని కాఫీ తీసుకుంటున్న రమణచేయి తన చెంప మీదకు పోయింది ఏదో గుర్తుకువచ్చి. అది గమనిస్తున్న అచ్చటి వారికి ఈ సంఘటన చిత్రంగా తోచింది. ఏమిటి ఈమె మాటలకి- అతని చేతలకి సంబంధం? అదే ప్రశ్న అందర్నీ ఎదుర్కొంది. ఉండబట్టలేని తెలిసీ తెలియని ఒకావిడ ఆ సంబంధాని గురించి రాధని ఏకాంతంగా? పిలిచి అడిగింది. తాను గూడా ఎవరికో కాబోయే భార్య గనుక, ఆమర్మ మేదో తెలుసుకుంటే, అవసరమైతే వుపయోగించుకుందామనే ఆశతో—— రాధకి చెప్పటం తప్పనిసరై దీర్ఘంగా నిశ్వాశించి చెప్పడం మొదలుపెట్టింది.

"అవి నేను మద్రాసులో చదువుకునే రోజులు. ప్రతీ రోజూ సాయంత్రం మా నాన్నగారు, అమ్మగారు, నేనూ బీచికి వెళ్ళే వాళ్ళం. ఎన్ని పనులున్నా బీచికి పోవటం తప్పనిసరయింది. మేము బీచికి వెళ్ళినప్పుడల్లా మాకు సమీపంలో ఎవ్వరో కూర్చొని వుండేవారు ఏకాంతంగా. ఆ వ్యక్తి ప్రతిరోజూ అదే స్థలంలో కూర్చోవటం జరుగుతూండేది. ఇలా కొన్ని రోజులు గడిచాయి——కాని మా నివాస స్థలంలో మాత్రం ఏమీ మార్పుండేది కాదు. ఆ వ్యక్తి మా కొరకు అక్కడ కూర్చుంటున్నాడో, ఆ వ్యక్తి కొరకు మేమక్కడ కూర్చుంటున్నామో బోధ పడేదికాదు. ఆ వ్యక్తిని చూస్తున్న కొద్దీ నాకు వింత వింత ఆలోచనలు వస్తూండేవి. ఆ ఏకాగ్రత, ఆ ఆలోచన, ఆ వాలకం చూస్తూంటే అతనెవరో పకృతినారాధించే చిత్ర కారుడో, లేక కవియో అయివుంటాడనుకునేదాన్ని. ఎందరో ఆ బీచిలో కనుపించేవారు. కాని నా దృష్టిమాత్రం వారందర్నీ తప్పుకొనే ఆ వ్యక్తి మీదకే పోయేది. అమ్మ, నాన్న ఏవో పిచ్చా పాటీ మాట్లాడుకుంటూంటే, నేనూ మాట్లాడుతూ, రోజూ వున్న అలవాటు ప్రకారంగా వీలు జూచుకొని అతని వైపు చూశాను- ఇంకేముంది! దొంగ ఎంతసేపటినుండి నన్ను అలా తొంగి చూస్తున్నాడోకాని, నేను చూచేటప్పటికి దృష్టి మార్చాడు పెద్ద మనిషిలాగ. ఏం? నేను మాత్రం తక్కువ తిన్నానా? నేను చూస్తూంది గూడా అతన్ని కాదన్నట్లు దృష్టి మార్చాను సీరియస్‌గా.

"అలా చూపు మార్పులతో కాలచక్రం మరి కొంచెం తిరిగింది. నాకెప్పుడూ అతన్ని చూడాలనిపిస్తుండేది. అతని చర్యల్ని బట్టి చూస్తే అతనికి నన్ను చూడాలని వున్నట్లు అర్థమయ్యేది. ఆ కోర్కె నాలో ఎందుకు తలెత్తిందో నా కర్థమయ్యేదికాదు. ఎంతోమంది యువకుల హృదయాల్ని ఆరాటపెట్టిన నా హృదయం అతన్ని గురించి ఎందు కారాట పడాలి? ఏమో! నా పట్ల అతనూ అలాగే బాధపడుతున్నట్లు గ్రహిస్తుండేదాన్ని- ఎప్పటి కప్పుడు అతనెవరో, ఏంచేస్తుంటారో? ఎక్కడున్నారో? తెలుసుకోవాలనే కోర్కె కలగటం- అవకాశంలేక ఆరాట పడటం జరుగుతూండేది. అతను నన్ను ఎంతో ఆప్యాయంగా చూస్తూండగా చాలా సార్లు చూశాను. ఏ రోజైనా అతను బీచికి రావటం ఆలస్యమైందంటే మానాన్న, అమ్మ చెప్పే మాటలేవీ బుర్రకెక్కేవి కావు. ఏదో ఆశతో ప్రతి రక్త నాళం అతని కొరకు తహ తహ లాడేది. నా పరధ్యాహ్నానికి నాన్న, అమ్మ అప్పుడప్పుడు కారణం అడగడం నేను ఏదో సమాధానం చెప్పడం అలవాటయి పోయింది. నా వింత ప్రవర్తన కొందరు స్నేహితురాళ్లు కనిపెడుతున్నా- పాపం ఎందుకో అందరూ మౌనంగానే వుండేవారు. అతని నిర్మలమైన చల్లని చూపులు- ఆ చిరునవ్వులే, అలా అందర్నీ మార్చివుంటాయనుకున్నాను. రోజు రోజుకు- అతన్ని గురించి ఆలోచించుకునేదాన్ని. ఆ ఆలోచనలోని ఊహలు తారాపథాన్ని అందుకునేవి- ఆ వూహల్లోనే ఒకటి నాబుర్రలో మెరసింది. వెంటనే అతనికొక వుత్తరం వ్రాద్దామని- దాన్ని రహస్యంగా అతనికి ఇవ్వాలనే కోర్కె కొద్దీ వుత్తరం వ్రాయటం ప్రారంభించేనేగాని, ఎలా వ్రాయాలో, ఏమని వ్రాయాలో తోచిందికాదు. అలాంటి వుత్తరం వ్రాయటం అదే మొదటి సారి అవటం వల్ల కాబోలు- పట్టుదలతో చెయ్యి వ్రాద్దామన్నా, మనస్సు వెనక్కి లాగుతోంది సిగ్గుతో- ఎలా గైతేనేం చివరకి వ్రాయటం ప్రారంభించాను.

"శ్రీ..........

మీరెవరు? ఎక్కడున్నారు? ఏం చేస్తున్నారు? మీరు రోజూ నన్ను చూడటం.... అసలు మీకు వివాహం....

ఇంతలోనే, సిగ్గు నా హృదయంలో ఎక్కువ భాగం ఆక్రమించుకోవటం వల్ల నడక ఆగిపోయింది పాపం- సిగ్గుని ప్రతిఘటించి కలం నా పేరును మాత్రం వ్రాయ గలిగింది. ఆ ఉత్తరాన్ని అతి జాగ్రత్తగా అతని ముందు పడవైచి, ఏమీ తెలియనట్లుగా మా అమ్మ, నాన్నగారి ప్రక్కన వచ్చి కూర్చున్నానేగాని నామనస్సు మాత్రం ఏమేమో ఆలోచిస్తోంది. అలా వుత్తరం వ్రాయటం వల్ల చులకనై పోతానేమో ననే అనుమానం, వెంటనే అత నెప్పుడూ అలా చూడడనే ధైర్యం- అమ్మా, నాన్నకు తెలుస్తుందేమోననే భయం- అయినా నచ్చజెప్పవచ్చుననే విశ్వాసం. ఇలాలలోచన పరంపరల్లో నుంచి తేలు కొంటున్నానో లేదో, యింతలోనే నా రెండు కండ్లు అతని వైపు తొంగి చూచాయి. ఎంతో ఆప్యాయంగా అతను వుత్తరాన్ని ఇసుకలోనుండి తీసుకున్నాడు. వుత్త రాన్ని చదివి ఏం గ్రహించాడో గాని, తిన్నగా నవ్వు కున్నాడు. మా నాన్నగారి మాటలు నాదృష్టిని మరల్చాయి. తరువాత ఇంటికి వెళ్లేటప్పుడు వెనుకగా నడుస్తున్న నాముందుకి ఇసుకతోసహా కాగితం ముక్క పడింది. వెంటనే దాన్ని మరొకరి కంట పడకుండా నా పరుసులో భద్ర పరచాను. రూములో కూర్చొని సావకాశంగా చదువు కుందామనే ఆత్రుత నాకు మా యింటిని చాలా దూరం చేసింది. ప్రతి నిముషమూ లెక్కపెట్టుకుంటూ ఇల్లు చేరాను. రూములో ఎంతో ఆత్రుతతో ఆ కాగితాన్ని విప్పి చూచాను- అంతా అయోమయం - అది నేనిచ్చిన కాగితమే- అన్నీ ఆ అక్షరాలే- నేను వ్రాసిన దస్తూరే - ఇదేమిటి నా ఉత్తరాన్ని మరలా నాకే యివ్వట మేమిటి? అనుకున్నంతా అయింది. ఈ మగవాళ్ళంతా ఇంతే. మనంగా కోరితే తాడిచెట్టెక్కి కూర్చుంటారు. అయితే బీచిలో రోజూ నేను చూచేది మేడి పండన్న మాట? కాకపోతే ఇంతగా కోరి వ్రాస్తే........ ముందుగా హృద యావేదనని వెలిబుచ్చినంత మాత్రాన యింత చులక నయ్యేనా? పైపెచ్చు ఆ చిరునవ్వులెందుకు? అనవసరంగా ఎదటివార్ని మోసం చేయటానికి కాకపోతే- ఇలా ఏమేమో ఆలోచిస్తున్నాను. ఆ క్షణంలో అనుభ వించిన బాధ, ద్వేషం, కోపం, నా జీవితంలో ఎప్పుడూ పొంద లేదు. ఇదంతా ఒక లిప్తకాలం. ఆరోజే నా జీవితగ్రంథం లోని సువర్ణాక్షర పూరితమైన పుట- ఆ వుత్తరమే నాకు మొదటిది- చివరిది గూడా నేమో అనుకున్నాను. ద్వేష పూరిత హృదయంతో ఆ వుత్తరాన్ని మరలా చదివాను ఈసారి ఏదో మార్పు నా కన్నీటి తెరల్లోనుండి కనిపించి ఆశ మరల తలెత్తింది. నా కళ్ళను నేనే నమ్మ లేక పోయాను. వుత్తరాన్ని మరీ మరీ చదివాను- వుత్తరం క్రింద నా పేరుప్రక్కన- ర-మ-ణ అనే మూడుఅక్షరాలు క్రొత్తగా వున్నాయి. ఎన్నిసార్లు చదివినా యింకా చద వాలనిపించేది 'రాధ, రమణ' చాలా బాగుంది. రమణ కూడా, నేనడిగిన ప్రశ్నల్నే నన్నూ అడుగు తున్నట్లు రూమంతా ప్రతిధ్వనించింది. అతనికి ఎప్పుడు, ఎలా సమా ధానం ఇవ్వటమా అనే ఆలోచన ఆ ఆనందాన్ని అణచి పెట్టింది. ఆ రాత్రంతా ఆలోచనతోనే గడిపాను. ఆరోజు సాయంత్రం కొరకు ఎదురుచూస్తున్న నా వింత ప్రవర్త నకు, అమ్మ, నాన్న ఒకరి ముఖం ఒకరు చూచుకున్నారు. బీచికని ముస్తాబై, ముందుగానే వెళ్ళి కార్లో కూర్చున్నాను. తరువాత నాన్న, అమ్మగార్లతో కారు బయలుదేరింది. కారు వేగంగా వెళుతూంది. అంత కంటే వేగంగా నా మనస్సు బీచిలోని రమణ వద్దకు పరుగెత్తు తున్నది. అతనితో ఎప్పుడు మాట్లాడదామా? అసలు మాట్లాడట మెలాగా? ప్రక్కనున్న తలిదండ్రులు! ఏంచేయాలి? ఈ ఆలోచనల్లో తలవంచుకొని పోయింది. ఈ ఆలోచనలే కారు చక్రాలు గాలికంటే వేగంగా అల్లిబిల్లి తిరుగు తున్నాయి అలా కారు చక్రాలు ఎంత దూరం దొర్లాయో గాని, నా ఆలోచనలకీ, కారు వేగానికీ ఒకే బ్రేక్‌లాగా డ్రైవరు కారు నాపాడు. దానితో నావూహా ప్రపంచంలో నుండి వూడి పడ్డాను. ఇంకే ముంది! బీచీలేదు! రమణ లేడు ఒక సినిమా థియేటరు- అప్పుడర్థమయింది, మేము సినిమా చూడటానికి వెళుతున్నామని. ఎన్నడూ లేనిది ఆరోజున సినిమాకి వద్దనటం- చాలా ప్రశ్నలకి జవాబియ్య వలసి వస్తుందని, తప్పనిసరిగా హాల్లోకి ప్రవేశించాను. పాపం- రమణ బీచిలో నాకొరకని ఎదురు చూస్తూంటా డనే బాధతో సినిమా ఏం చూశానో అర్థం కాలేదు. ఆరోజు ఎలా గడిచిందో కన్నీటితోతడిసి పోయిన నా దిండుకే తెలుసు. ఆమర్నాడు సాయంత్రం నాన్నగారికేదో పనుండి బీచి ప్రయాణం ఆపుకున్నారు. అది విన్న నాకు, ఏడుపు, కోపం, ఈర్ష్య యింకా ఏమేమో ముప్పిరి కొన్నాయి—— ఏమిటీ తికమకలు? ప్రేమా ప్రేమికుల మధ్య యిలాంటి అవాంతరాలెందుకు వస్తాయి? ఇలా మేం బాధ పడుతూంటే చూసి సంతోషించటమేనా యీ భగవంతుడనే వాడికి ప్రీతి! కాకపోతే ఎన్నడూ లేని పరిస్థితుల్ని యిప్పుడే ఎందుకు కల్పించాలి- రమణని నిన్న కల్సుకోక పోయి నందుకే ఎంతో బాధపడి వుంటాడు-

మళ్ళీ యీరోజు గూడా—: వచ్చే ఏడ్పునంతా దిగమింగి ఎలాగో ధైర్యంచేసి అమ్మను పురిగొల్పాను యిరువురమూ, బీచికి వెళదామని. ఆమె రావటానికి ఒప్పుకోలేదు. నా పోరుకి విసిగిపోయింది కాబోలు. నన్ను ఒక్కదాన్నే వెళ్ళి త్వరగా రమ్మన్నది. ఇక అప్పటి నా ఆనందాన్ని చెప్పాలంటే మా అమ్మని ఎన్నిసార్లు ముద్దుపెట్టుకున్నానో లెక్క చూస్తేగాని తేలదు. అంతవరకు నిందించబడుతున్న భగవంతునికి నా రెండు చేతులే కాకుండా, యింకా అవకాశం వుంటే ఎక్కడయినా మరి పది చేతులు అప్పుతెచ్చుకుని ఒక్కసారిగా నమస్కారం చేద్దామనుకొని, లాభం లేక నా రెండు చేతులతోనే యిరవైసార్లు నమస్కారం చేశాను.

"కారు దిగిన తరువాత నా కాళ్ళు ఆ ఇసుకలో అంత త్వరగా ఎలానడిచాయో గాని, అతి సల్పకాలంలోనే మా నియమిత స్థానాన్ని చేరాను. చిరునవ్వుతో వికశిస్తున్న రమణ ముఖమే తానంతవరకు మీరాక కొరకని ఎదురు చూస్తున్నట్లు తెలిపింది. నేను కూర్చున్నానో లేదో ; నాకు తెలియకుండానే చిరునవ్వొకటి నా పెదవులపైన చిందులు త్రొక్కింది. దానికి వంతగా రమణ రెండుకండ్లు మెరశాయి. ఆనందంతో నా వంటరితనం, అతని ప్రేమ కొలను గట్లను పగులగొట్టింది కాబోలు - ఎన్నో రోజుల నుండి ఆకొలనులో అంచలంచలుగా చేరిన, అనురాగం, ఆనందం - ఆ గట్లనుదాటి ప్రవహించాయి - ఆ ప్రవాహం లోనే అతను తేలిపోయి, నాకు రెండు అడుగుల దూరంగా కొట్టుకొచ్చాడు. నన్ను సమీపించటంతోనే, ఏవో రెండు మాటలు అతని పెదవుల్ని పగుల గొట్టుకొని వచ్చాయి. 'ఏమిటీ' అర్థం కాలేదన్నట్లు అతనివైపు మరొసారి చూశాను - అతను నా ప్రక్క కూర్చుంటూనే 'మీరు ఒక్కరే వచ్చారు ....? నిన్నమీరు' - అనే మాటలు తడబడుతూ వినిపించాయి అస్పష్టస్వరంతో - దానికి సమాధానం ఏమో చెప్పాలనుకున్నాను కాని ఒక్కమాటైనా పెగలి రాలేదు బైటకు-అలానే ఒక క్షణకాలం మాయిరువురి మధ్య నిశబ్దం పాదుకొన్నది. యింతలోనే, అతని రెండు కండ్లు నా చేతిమీద పడ్డాయి. అది గమనించిన నేను - ఎలాగో 'ఈ వుంగరం - బాగుందా?' అన్నాను - అంత వరకూ నా మాటకొరకని వేచివున్న అతను - పట్టలేని ఆనందంతో — 'ఆవుంగరంకన్నా ఆచేయి - ఆ వ్రేలు ఎంతో బాగుంది' అంటూ అతనిచేయి నాచేతి మీదకు వచ్చింది - అ స్పర్శతో నాలో ఏదో అనిర్వచనీయమైన మార్పు వచ్చింది. నాచేతి నాలుగు వ్రేళ్ళని ఏంతో ఆప్యాయంగా పట్టుకొని, తన పెదవులవైపు .... వెంటనే ప్రక్కనవున్న కొన్నికాకులు పక్కున నవ్వాయి - మానవ స్వరంతో - దానితో ఏదో తెలియని ఆవేశం - క్రోధం - ఒక్కసారిగా ఆవరించినై - ఏదో పైశాచికశక్తి నాలో ప్రవేశించింది. నేనెక్కడున్నానో ; ఏంచేస్తున్నానో, ఏం జరిగిందో గూడా తెలియలేదు. కాని 'చళ్' - అనే శబ్దం మాత్రం నాచెవుల్లో మారుమ్రోగింది. రమణచేయి - అవమానంతో చెంప పట్టుకుంది. అతని చెంపతో పాటు, నా చేయిగూడ ఎర్రబడింది. ఇరువురం అలాగే కొంత వరకు స్థంబించి పోయాం. యింక అక్కడుండలేక ఇంటికివచ్చాను- అదే ఆఖరిఘడియ. ఆ మరునాటి నుండి బీచికి వెళ్ళటం మానుకున్నాను. ప్రతిరోజు సాయత్రం ఆ ఘడియ వచ్చినప్పుడల్లా ఆ బీచికోలాహలం - ఆ నవ్వులు - అవమానంతో కృంగిపోతున్న అతని ముఖం గుర్తుకు వస్తూండేవి - ఏదో అర్థంకాని బాధ ఆవురించి అలమటింపజేసేది. అతనెంతో ప్రేమతో - అప్యాయంగా చేతి వ్రేళ్ళను పట్టుకొని - అంతమాత్రాన - ఏమో తెలియకుండా అతని హృదయాన్ని గాయపర్చాను - అంతవరకు అతనికి నా సర్వస్వాన్ని అర్పించ తలచుకుంటున్న నాలో ఆ పైశాచిక శక్తి ఎందుకు ప్రవేశించింది—? పాపం అతనెంతగా బాధపడ్డాడో ; అతన్ని కల్సుకొని తప్పుక్షమించమని ప్రాధేయ పడదామని, రెండుసార్లు బీచికివెళ్ళి అంతా కలయజూచాను. కాని - నిరాశ. ముఖ్యస్నేహితులద్వారా, అతను, బీచినే కాకుండా, ఆ వూరునే విడచి వెళ్ళాడని తెలుసుకొన్న తరువాత నాకు లోకమంతా చీకటైపోయింది. ఆనాటినుండి ఎలా కాలం గడుపుతున్నానో వాడిపోయిన నా తీవెలకే తెలుసు. నా దీనావస్థను బుజ్జగిస్తూ అడిగే తల్లిదండ్రుల ప్రశ్నలకు ఏదో సమాధానం చెప్తూండేదాన్ని. ప్రతిరోజూ నా పాటలువిని ఆనందించే తల్లిదండ్రులు యిప్పుడా ఆనందాన్ని పొందలేక పోతున్నారు. నా స్పర్శ లేక బూజు పట్టిపోతున్న వీణని చూస్తున్నప్పుడల్లా నాన్న, అమ్మ కంటి నిండా నీరు నింపుకొనేవారు - ఆ సమయం లోనే నా పెండ్లి - సంబంధం వచ్చింది - దానికి నాన్న, అమ్మగార్లు చాలా సంతోషించారు. నిజానికి నాకు పెండ్లి ఆశ పూర్తిగా పోయింది- కాని నాన్న, అమ్మగార్లను యీ రూపానైనా సంతోషింప చేసినదాన్ని అవుతానేమోననే ఆశతో పెండ్లికి ఒప్పుకున్నాను. పరిచయంలేని మరొక వ్యక్తికి అర్పించబోతున్న నా శరీరాన్ని గురించి —








# అమృతాంజనము

గాని,

" యథాయథా..................కాళీధవళత్వ శంకయా."

అమృతాంజనమా ! నీ కీర్తి ముల్లోకములను దెల్పుజేయు పూనికతో పెరుఁగు
చున్నప్పుడెల్లను నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే
నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!

చిస్తూ మా చిన్న నాన్న గారింట్లో పూల పెళ్లి పొదుల్ని వాగుచేస్తున్న నాకు నా మధురమూర్తి - "అలా అంటూనే చేతిలో వున్న పాపవైపు చూస్తూ- యింకా ఏమో చెప్ప బోతున్న ఆమెకు చిన్నపాప ఏడ్పు అడ్డొచ్చింది. అంత లోనే రమణ పిల్ల వాణ్ణి తీసుకుంటూ "చెంప పగిలి పోతుందిరోయ్" అన్నాడు, రాధ ముఖంలోకిచూస్తు. రాధ సిగ్గుతో "చాల్లెండి!" అంటూ పిల్లవాణ్ణి అందించి స్నేహితురాండ్రతో గదిలోకి వెళ్ళింది.

ఆ జంటను గురించి అనుకున్నప్పుడల్లా నవ్వుకుంటుం టాం - అలాంటి జంటజీవితం క్షణమైనా..........



రూపకం

# గొడుగు - గొళ్ళెం



శ్రీ కవికొండల వెంకటరావు.



[రామచంద్రరావు వీధివైపు తన యింటి గుమ్మం గొళ్ళెంలో గొడుగుకామ దూర్చి అలా నిలబడి పోయాడు. ఆవీధే వెడుతూ వీరజనకులు అన్న ఆయన రామచంద్రరావును పలుకరిస్తాడు. అప్పుడిలా సంభాషణ వారిమధ్య నడుస్తుంది]

వీర : ఏమండీ ! రామచంద్రరావుగారూ ! అలా నిలబడి పోయారే! గొళ్ళెంలో గొడుగెట్టుకు పిలవకూడదూ!

రామ : ఎవర్ని పిలిచేది !

వీర : ఏం ! ఇంట్లో ఎవరూ లేరు ?

రామ : ఇంట్లో చాలామందే వున్నారు. మీరెప్పుడూ చూడలేదా ఏమిటి మాయిల్లు?

వీర : ఎప్పుడూ లోపలకు రాలేదండీ! ఎంత సేపూ వీధిలో మిమ్మల్ని పలకరించడమే గా!

రామ : అయితే ఒక్కమాటు మాయిల్లు పావనంచేసి వెళ్ళండీ.

వీర : ఏమిటి నేను అరుగెక్కినా మీరింకా గొళ్ళెము లోనే గొడుగెట్టుకు నిలుచున్నారు ?

రామ : ఈ గొళ్ళెం ముందుకులాగి, వెనక్కినెట్టి అందులో ఇలా ఏదో బిగింపుగా వుంచితేనే గాని లోపల నల్ళిచ్చి గెడరాదు. (లోపల శబ్దంగలుగును)

వీర : గెడరాక పోవడంకన్న తలుపు బరుకుతూన్న శబ్దం వినవస్తూవుంది.

రామ : అలా బరికి బరికి పైకిఎగిరి, గెడ గభాల్ని తన్ని! ద్వారం యొక్క రెండు రెక్కలూ విడదీసి పారేస్తుంది.

వీర : అంటే కుక్కా ?

రామ : అదే! "పెట్రోల్ డాగ్ !"

వీర : ఆంధ్ర రాష్ట్రం వచ్చాకైనా తెనుగు అభూరిస్తురూ ! అయితే ఒక ఆచోకి కుక్కను పెంచుతున్నారన్నమాట ?

రామ : తెనుగంటూ పెద్ద దెబ్బతీశామని తమరనుకుంటూ వున్నారు ! ఆడవాళ్ళకికూడా "పెట్రోల్ డాగ్" అంటే అర్థమై పోతూన్నప్పుడు ఆమాటాడితే తప్పేంఉంది?– ఇంతకూ నే చూపించ బోయేది పెద్దన మనుచరిత్రకాదు, శ్రీనాధుని నైషధంకాదు. ఏదో సర్వసాధారణపు జాగిలాన్ని చూపించేను–

వీర : మీరింకా గొళ్ళెంలో గొడుగెట్టుకునే నిలబడి వున్నారు ! ఇకనాకు చూపించేదేమిటి కుక్కను?

రామ : అహా! ఆశబ్దం చూశారా? ఎంత శ్రావ్యంగా వుందో ! ఆ ఎగిరే ఆయాసం విన్నారా? ఎంత సునాయాసంగా వుందో! మీకు కుక్కంటే ఇష్టమేనా అసలు? ముందాసంగతి చెప్పండి !

వీర : ఇదేదో మీడంతా వేళా కోళంగా వుంది. "పెట్రోల్ డాగ్" అంటే ఇష్టంలేని వాళ్ళెవరుంటారు?

రామ : అయితే తియ్యవే తలుపు !

వీర : ఏమిటి? కుక్కకాదూ అవల తలుపు బరుకుతూ వున్నది? మీ ఆవిడేనా?

రామ : ఆవిడకు, బరకడానికి అంతంతగోళ్ళుంటాయయ్యా? ఉన్నా అంత చప్పుడు చేస్తుందయ్యా! మిమ్మల్ని లోపలకు రానిస్తే మా ఆవిడకు "ఇన్సల్టు" అయ్యేటట్టుంది.

(లోపలనుంచి చిలుక : "తలుపు తియ్యి! తలుపు తియ్యి! తలుపు తియ్యి !" )

వీర : ఆగొంతు మీ ఆవిడదా?

రామ : మా ఆవిడది అయితే అంతతియ్యగా. అంత తేటగా మువ్మూర్లు "తలుపు తియ్యి, తలుపు తియ్యి, తలుపు తియ్యి" అంటుంటుందయ్యా! అది, నే పెంచుకూ వున్న రామచిలుక. ఆ చిలుక ఆజ్ఞయిస్తేనే గాని యీ కుక్క తలుపు తీయదు.

వీర : ఇందాకా ఏమన్నా, మీరు గొళ్ళెంలో గొడుగు పెడితేనే చాలన్నారు. ఇప్పుడు వేరే ఆజ్ఞకూడా కావాలా?

రామ : ఆజ్ఞ లేనిదే మా యిల్లు శివుడైనా చొఅడానికి. వీలేదు. (లోపల శబ్దం)

వీర : కాని యింట్లో కీచులాట ఏదో జరుగుతూ వున్నట్టుంది.

రామ : అది వానరుని కీచులాట! నరునిది కాదు.

వీర : అయితే మీరో వానరాన్ని కూడా పెంచుతున్నా రన్నమాట!

రామ : మరి ఈ వానరంవెళ్ళి, "తలుపు తీసేస్తూ వుంది కుక్క చిలుక చేత ప్రేరేపింపబడి" అని మా ఆవిడ చెవిలో మొఅబెట్టవలె!

వీర : అప్పుడావిడ వచ్చి తలుపు తీస్తేకద్దు!

రామ : అక్కర్లేదోయి! కోతి అల్లావెళ్ళగా చూచి, కుక్క ఇల్లా గెడ సడల్చే?! విను శబ్దం! ఇనుప గెడ ఇనుపగెడ ధనాధన్!

వీర : అనడమేగా? రాలేదు తలుపు!

రామ : మఱచిపోయాను ఈవల గొళ్ళెంలో పెట్టిన గొడుగు కామనే తోసి వేయడం!

వీర : తీసేటప్పుడు తెలుసుకు మఱీ తియ్యి మీ కుక్కో మా అక్కో?

రామ : మా కుక్కైతే మాటాడ నేరదు. మీ అక్కైతే తలుపు తోయదు.

వీర : అయితే నీమానాన్ని నీవు ఆలాగే నిలబడి వుండు. నే వెడతా!

రామ : వెళ్ళిపోకు వెళ్ళిపోక! వీరచనకులూ! వచ్చేసిం, గెడ! తీసేసేను గొడుగు! (చప్పట్లు) (ఇరువురు ఇంటిలో ప్రవేశించారు)

వీర : బలే! కుక్కను పెంచేవోయి! నీవు.

రామ : కుక్క కంటే ఎక్కువది రామచిలుక.

వీర : అన్నిటి కంటే ఎక్కువదనుకుంటాను నీవు పెం కోతి?

రామ : ఆఁ! చూడు! అప్పుడే నా చేతిలో గొడుగట్టె కెళ్ళి, వంటింటి యీవల గొళ్ళెంలోకి చొప్పించి మిడుతూ మిడుతూ ఏలా చూస్తూవుందో!

వీర : వంటింట్లో ఏముంది?

రామ : ఉన్నదంతా వంటింట్లోనే!

వీర : మీ ఆవిడ అక్కడేనా వుండడం!

రామ : ఆఁ! అమేషా!

వీర : మఱి, నీకు, వీధి తలుపు తెరచినంత పనీ జరిగాలి అన్నమాటే ఆ వంటింటి తలుపు వద్ద.

రామ : వంటింట్లో కుక్కలుంటాయనా నీ తాత్పర్యము?

వీర : కాకుంటే, ఇదంతా ఇంత "జూ"లా వుండివుండదు.

రామ : మనకు కుక్క కాబట్టి తలుపు తీసింది చిలుకమాట విని. లోపలవ్యక్తి ఎవరి మాటా వినదు!

వీర : పిలిచినా పలుకదు?

రామ : మా ఆవిడకు పలకాలని వున్నా ఈ కోతి పలకనివ్వదు.

వీర : అటువంటప్పుడు పెరటి వెంపు వెళ్ళి పిలిచి చూదాం!

రామ : అదే! నేను ఆలోచించేది!

(ఇరువురు పెరటి సైపుకు వెళ్ళుతారు)

వీర : అయితే ఇక్కడ తలుపు గొళ్ళెంకు ఈవల తాటాకు గొడుగు కామ మూర్చివుందే?

రామ : మా ఆవిడ పెరటిదార్ని, సదీస్నానానకు వెళ్ళు చోటు.

వీర : ఈ తాటాకు గొడుగు ఆమె తిరిగి వచ్చేలో ఎవరైనా ఎత్తుకు పోతే?

రామ : వీధిలో కుక్కకు లోబడి, పెరట్లో ఆ దొంగల్ని కరుస్తుంది.

(రామచంద్రరావు భార్య మంచినీళ్ళ బిండె బోళుకు బోళుకు మనిపించు కుంటూ వస్తుంది)

(మాటలో మాటగా)

రా_భార్య : వీధిలో కుక్క వచ్చి పెరట్లో దొంగల మీద బొంయ్యమనదు._ వంటింట్లోనే వున్నాయి ఒక త్రాచుపాము, ఒక ముంగిస! అదిగో వినండి! మువ్వల చప్పుడు _ మఱిబుట్ట మాత్ర తీశావూ కస్సు బుస్సు! అందుకే ఈ తాటాకు గొడుగు కానా అడ్డెట్టి వెళ్ళడం!

రామ : నేనెప్పుడూ అంత లోతుగా ఆలోచించ లేను సుమండీ! వీరజనకులు గారూ.

వీర : కాని యికమీద నైనా "డీప్"గా ఆలోచించి గాని ఏపనీ చేయకండి!

రామ : ఏం? కుక్కను పెంచడం తప్పంటారా?

రా_భా: ఏం? పామునిని పెంచడం తప్పంటారా?

రామ : ఏం? చిలకను పెంచడం తప్పంటారా?

రా_భా: ఏం? ముంగిసను పెంచడం తప్పంటారా?

వీర : ఇఖ ఎవరికీ కానీకుండా ఈ కోతి ముండవుంది!

రా_భా: కోతిముండకు జవాబుగా నేనున్నాగా.

వీర : చూశారూ! ఇంత చేటు జంతుప్రేమ మీయిరు వురకు వుంటే సంసారం నెగ్గడమనేది కష్టమే.

రా_భా: కష్టమేమీలేదు. దేని సంసారం అదే చూచు కుంటుంది. మా నుయ్యి చూశారా? నూతిలో ఒక తాంబేలు వుంది. అది దానంతటదే బయలు దేరింది. మేం పడేసింది కాదు. నుయ్యి తవ్వించి నప్పు డాది కూర్మంలా బయలు పడింది. నూతి పక్క మా కొబ్బరి చెట్టు చూశారా? ఎంత ఏపుగా వుందో! దానిమువ్వలో వాలుతుంది. వాలాయం ఒక భరద్వాజ పిట్ట! మిమ్మల్నెప్పుడూ వీధిలో చూడ్డమేగాని మాయింట్లో చూచిందిలేదు. నేడు మా గృహం కలుషహరమైంది. కూర్చోండి కాస్సేపు! మా వారితో కలిసి కాఫీ పుచ్చుకుని మఱీ వెళుదురుగాని. (అని బిందె దింపుకు, కాఫీ యిచ్చును)

వీర : కాఫీ మీరు చేసింది బహుబాగా వుంది. మాబోటి మనుష్యుల కేనా మీ జంతువులకు కూడాపోశారా?

రామ : అదే మరువరాదు! అవీ మనలాంటివే!

రా_భా: ఇందులో కొన్ని మన కంటే పూర్వానివి కూడాను. అయినా వాటికీకూడాకాఫీ అలవాటు అయిపోయింది. కోతి, చిలుక, కుక్క ఇవి నిరాఘాటంగా తాగేస్తాయి ఏలాంటికాఫీ అయినా సరె. _ కోతి మా అత్తింటి పూర్వోత్రపు తర తరాల నుంచి వస్తోవున్న సంతతి సంతానం. మఱి చిలుక మా పుట్టింటివారు నేనీ యింటికి వచ్చే ముందు అరణం ఇచ్చింది. కుక్క ఏమన్నా ముంద లేదు. బెంగుళూరు వెళ్ళినప్పుడు అక్కడ ఏవరివో "బిచ్చి" ఆరు పిల్లలు పెడితే అందులో ఒక పిల్లను అయిదువందలు పెట్టికొన్నాము. కొని వచ్చే దారిలో మరో రెండు వందలు ఖర్చుపెట్టి తరిఫీ దిప్పించాం! ఇప్పుడు చూశారా ఎలావుందో సింగంలాగు. మఱి త్రాచు పాము సంగతి చెప్తా వింటారా?

రామ : అది చెప్పేదేమిటి పోనిస్తూ!

వీర : చెప్పనివ్వండి! ఈ కాఫీ తాగేశాదాక!

(ఉఫ్ చల్లార్చును)

రామ : కాఫీ వాసన కొట్టి, బుట్టత్తేను పాము. అందుకూ అంటూ వున్నది!

రా_భా : కాఫీ కోసమని కాదులెండి! బుట్టెత్తి చూడ్డం అది! కొత్త గొంతుకేదో వినిపిస్తూందని.

రామ : అది మా ఆవిడకు వరద తీసిపోయిన నెలాపదిహేను రోజులు ఆ అటకమీద చింతపండు చుట్ట బెట్టుకు దొరికిందట!

రా_భా: దొరకడమేమిటిని దానిమానాన్న అది ఎలకల్ని తిని పడివుంది. నేను తాడేమో అని చెయ్యి

వేసి నిగడా జగ్రమంది. కొంపచిలపని విడకిస్తే బుస్సుమంది, పడగ పాటిం అన్నీ వుండి, సైద్ధ నల్లత్రాచు! వెంటనే చేత్తో పడగ అదిమి గళ్లం అంతా ఓడేట్టుచేసి, కింపకు గిరాటేశాను. కింద ముంగిస వుంది. ముంగిసను జడిసి, పాము పక్క నున్న బిందె కింటకు దూరింది. బిందెనుండి క్రమ క్రమంగా తాటాకు బుట్టలోకెక్కించాను. అందు లోంచి వెదురుపేళ్ళ బుట్టలోకెక్కించాను. తుద కిప్పుడది పాములపెట్టెలో వాసం చేస్తూవుంది మీ దయవల్ల!

వీర : అవితే పాము కంటె ముందుదే ముంగిస ?

రా_భా : ఆఁ ! అది వరదకు ముందే ప్రవేశించింది మా యింట్లో రోడ్డుమీది గారడివాని మాయల్ని తట్టుకోలేక. నేను తక్షణం దానికో ముప్పాకట్టి మాదేనన్నాను. అది వరదకెక్కడున్నా మళ్ళీ మమ్మల్నే చేరుకుంది. ఈ తరువాత !

వీర : వీటికన్నింటికి మొత్తంమీద కాఫీ అలవాటు చేశారు?

రా_భా : ఒక్క తాబేలుకు తప్ప! దానికీ పోయ జూచాను కాని కాఫీ అన్నది నీటిమీద పడీ పడ్డంలో చల్లారిపోయి దానికలవాటు కాలే !

రామ : భరద్వాజపిట్ట మాటకూడా చెప్పేసెయ్యి !

రా_భా : దాన్ని గురించి చెప్పేదేముంది? _ దాని విందు నుంచు నున కాఫీ ఖండరక్కర ఏంత నేను? అక్కడకూ పుట్టలో పాలోసినట్టు చెట్టు మొదట రెండు చుక్కలు పోసి చూచాను. కాని అవి ఎక్కలే! దానికి సొక్కలే! _ మీరో యిల్లు కట్టారా ఈ వూళ్ళో ?

వీర : కట్లాను గాని, దాని సింహద్వారానికి లోపల గడ లేదు. వెలుపల గొళ్ళెంలేదు.

రామ : మరి జాగ్రత్త?

వీర : అంటే తలుపు వేసి వుండడమనా మీ ప్రశ్న?

రామ : మరే !

వీర : లోపలి నుండి పంది కొక్కులు తలుపును దన్‌గా వుంటే ఇవల నుండి ఊరపంది దాని పిల్లలూ నెంటుతూ వుంటాయి. ఆ సింహద్వారం యొక్క శాక్తేయపుఁదుల అనగా Balance of power ఎల్ల కాలం నిలిచేలా !

రా_భా : వేటే గొడుగు గొళ్ళెం అక్కఱ లేదుండా?

రామ : వాటివి పారిపోయే జంతువులు కావే !

రా_భా : నేనే పారిపోతాను.

వీర : అవితే మీ గొడుగు ఎప్పుడూ గొళ్ళెంలోనే వుంటుందా?

రా_భా : అలాగే వూహిస్తాను నేను !

రామ : అని ఆమె అపోహ !





18 వ శతాబ్దపు భారతీయ వస్త్రం నామూనా, న్యూయార్కులోని కూపర్ యూనియన్ మ్యూజియమ్‌లో నుంచబడినది. అనేక రంగుల దారాలతో, చక్కటి సున్నితమైన నూలు వస్త్రముపై, రమణీయముగా కుట్టిన కుట్టు.




# బుద్ధిశాలి

• శ్రీ చేబ్రోలు సూర్యారావు •

పూర్వం ఒక గ్రామంలో ఓ బాపడుండేవాడు. అతని పేరు నారాయణ. నారాణయ చాలా తెలివైనవాడూ మంచి బుద్ధిశాలి. రామాయణ భారతాది గ్రంథాల్లో ఏ పద్య మడిగినా యిట్టే చెప్పేస్తాడు. అతని కున్న తెలివి తేటలు ఆ వూళ్ళో వాళ్ళెవరికీ లేవనడం అతిశయోక్తి గాదేమో! అతనికి ఏలోటూ లేకుండా జీవితం గడిచేందుకు వీలుగా ముప్పై ఎకరాల మాగాణి వుంది, దానికి తోడు మూడావులు మూడు గేదెలు ఒక గృహం కూడా వుంది.

అతనికి రామయ్య, రంగయ్య, లక్ష్మయ్య, అనే ముగ్గురు కొడుకులుండేవారు. భార్య మాత్రం లేదు.

కాల క్రమంలో నారాయణ వయోవృద్ధు డయ్యాడు. తన కున్న ఆస్తిని ముగ్గురు కుమారులకీ సమ భాగాలుగా పంచడమా లేక ఆస్తి అంతా పెద్ద కుమారునకే యిచ్చి తక్కిన వాళ్ళందర్నీ పెద్దవాడి అధికారంలో వుంచడమా అనే యోచన వచ్చిందతనికి.

ఒకనాడు ముగ్గురు కొడుకుల్నీ దగ్గరకు పిల్చి "నాయనలారా! నేను ముసలి వాణ్ణయ్యాను, నాకున్న ఆస్తంతా మీదే! కాని ఒక్క విషయం, మీ ముగ్గుర్నీ ఓ చిన్న పరీక్ష చేస్తాను. ఆ పరీక్షలో ఎవరు నెగ్గుతే వారికి ఆస్తి అంతా యిస్తాను, యిక మిగిలిన యిద్దరు వాడి అండను పడి వుండండి" అన్నాడు.

ఆదివిని అతని కొడుకులు అంగీకరించారు. అప్పుడు నారాయణ వార్ని ముగ్గుర్నీ ఓ గదిలోకి తీసుకెళ్ళి "అబ్బాయిలూ! ఓ అరగంటలో యీ గదిని మీ యిష్ట మొచ్చిన దానితో అసలు ఖాళీలేకుండా నింపాలి. అలా నింపినవారే పరీక్ష గెల్చినట్టు" అన్నాడు.

ఆ మాటలు విన్న పెద్ద కొడుకు తను గదిని నింపే ఆశతో, గది తలుపులన్నీ మూయించి గది కప్పులో చిన్న రంధ్రం చేయించి దాని ద్వారా గదిలో చొళ్ళు పోయసాగాడు. రెండు గంటలైనా నింపలేక పోయాడు. అంచేత పెద్దవాడు పరీక్షలో వోడినట్టు రుజువైంది.

రెండవ కుమారుడేంచేశాడో తెలుసా తను నింపలేనని ఒప్పు కున్నాడు.

ఇక మూడవవాడు తను గదిని నింపుతానని తండ్రిని లోనికి తీసుకు వెళ్ళి గది తలుపులు మూసి గదిలో ఓ కొవ్వొత్తిని వెలిగించి "నాయనా! నీ పరీక్ష ప్రకారం నేను గదిని వెలుగుతో నింపా." అన్నాడు.

ఆ మాటలు విని నారాయణ కొడుకు తెలివికి మెచ్చుకొని షరతు ప్రకారం ఆస్తి అంతా చిన్న కొడుక్కిచ్చేశాడు.

కాని మూడోకొడుకు లక్ష్మయ్య చాలా మంచివాడవడంచే ఆస్తి తన యిద్దరు అన్నలకీ న్యాయంగా పంచి యిచ్చాడు. చూశారా అన్నదమ్ములంటే అంత కలిసీ మెలిసీ బుద్ధిగా వుండాలి.

★

# దైవ భక్తి

* శ్రీ సందిపాడ కామేశ్వరరావు *

పూర్వం శ్యామలాపురం అను గ్రామంలో వెంకయ్య శెట్టి అనే కోమటి వుండేవాడు. అతను చాలా దైవభక్తి కలవాడు. అతని భార్య జారిణి. అందుచేత కట్టుకున్న పెళ్ళాన్ని విడిచిపెట్టలేక ఆమె మనస్సు మార్చి సత్ప్రవర్తన కలిగి వుండేటట్లుగా చేయమని ప్రతిరోజూ భగవంతుని ప్రార్థిస్తూ వుండేవాడు. ఇలాగ వుండగా ఒకనాడు వ్యాపారరీత్యా అతను పొరుగూరు వెళ్ళవలసి వచ్చింది. యింటిదగ్గర తన భార్యను జాగరూకతతో కాపాడుచుండుమని దేవుని మనసారా ప్రార్థించి, భార్యతో కూడా జాగ్రత్తగా వుండమని చెప్పి అతను గ్రామాంతరం వెళ్ళిపోయేడు. ఇదే సమయం కదా అని ఆ వైశ్యకాంత ఆ నాటి రాత్రి తన విటుని రమ్మని యిష్టాలాపములు ఆడుకుంటూవుంది. తన భక్తులను కష్టములనుండి తొలగించుటయే భగవంతుని ధర్మము కనుక, తన కత్యంత ప్రియ భక్తుడైన వెంకయ్య శెట్టి భార్య నీచగుణములు సహించలేక ఈశ్వరుడు మాయ భర్తవేషముతో కొన్ని బండ్ల ధాన్యమును తోలుకొని వెంకయ్య శెట్టి యింటికి వచ్చేడు. పొరుగూరు వెళ్ళిన తన భర్త వెంటనే తిరిగి వచ్చుటచే ఆశ్చర్యముతో భయపడుతూ ఆ జారిణి తన విటుని ధాన్యపు గాదెలో దాగోమని చెప్పి తాను వెళ్ళి వీధి తలుపు తెరచింది. మాయ వేషధారి అయిన ఈశ్వరుడు తన వెంటనున్న ధాన్యపు బస్తాలను గాదెలో పొయ్యమని నౌకర్లకు చెప్పేడు. వాళ్ళు ఒక్కొక్క బస్తా గాదెలో వెలుపుతూ వుంటే అందులో దాగున్న దొంగకి ఒక్కొక్క ప్రాణమే పోతూంది. ఆఖరికి ఆ బాధ భరించలేక యింకా అందులో కూర్చుంటే తన ప్రాణాలు దక్కవని గాదెనుండి పైకి ఒక్క వురుకు వురికేడు. ఇట్లు పలాయనం చిత్తగిస్తూ వున్న ఆ మోసకారిని మాయ భర్త పట్టుకొని బాగా వీపు సమను చేసి యిక ముందు యిటువంటి పనులు చేస్తే ప్రాణాలు దక్కవని చెప్పి పంపించేడు. తన భక్తుని భార్యను చూచి : ఓ సిమాయలాడీ ! యింతకాలము నేను చెప్తే విన్నావుకాదు. మహా పతివ్రతవలె నటిస్తూ నన్నే దూషిస్తూ వుండేదానివి. ఈ రోజు నువ్వు నీ విటుడు పట్టుపడ్డారు చూచేవా ! నిజము నిలకడమీదకాని తెలియదు. భగవంతుని నమ్మిన వానికి మోసము యెన్నటికి వుండదు. తను పెళ్ళియాడిన భర్త గ్రుడ్డివాడైనా, సొట్టవాడైనా సరే పాతివ్రత్యం గల స్త్రీ అతన్నే భగవంతునిగా పూజిస్తుంది. పతినే దైవముగా భావించే స్త్రీ పతివ్రత అనిపించు కుంటుంది. కాబట్టి యిక ముందైనా నువ్వు నీ భర్తతో కలిసి సుఖములు అనుభవిస్తూ ఈశ్వర భక్తి కలిగి వుంటే పరమందు నీకు మోక్షము కలుగ గలదు అని చెప్పి మాయ వేషధారి అయిన ఈశ్వరుడు మాయమైపోయినాడు.

ఇట్లు మాయమైన తన భర్తను గురించి ఆశ్చర్యముతో చూస్తూ అయ్యో ! యింతవరకూ తనకు వుపదేశము చేసింది తన భర్త గాదని, ఈశ్వరుడే తనకావిధముగా బుద్ధి చెప్పేడని గ్రహించి, ప్రత్యక్షమైన భగవంతుని ప్రార్థించుకోలేని పాపాత్మురాలను 'వగలాడిని నేను వగువ నేల వగచిన వచ్చునే ఈశ్వరుడు' అని చింతిస్తూ ఆ రోజునుంచి దైవభక్తి, పతిభక్తి కలిగి మెలుగుతూ వుంది.



# అంతా మన మంచి కొరకే!

* శ్రీ మోహన్ *

పూర్వమొకప్పుడు వంగ దేశమున మేదినీ నగరంలో గుణశీలుడను నొక ధనికుడుండెను. అతనొక పిల్లజమీందారుడై సుందరుడను తనయుని బడసి సుఖముగా విరాజిల్లుచుండెను. సుబుద్ధి యను మంచి లోకజ్ఞానము గల మంత్రి సహాయమున గుణశీలుడు తన పనులను చక్కగా నెరవేర్చుకొనుచుండెను. కష్ట సుఖములయందు మంత్రి "అంతా మన మంచికొరకే" అని గుణశీలునకు చెప్పుచుండెడివాడు. తండ్రికి ఇష్టముగానున్నను, సుందరునకు మాత్రము యీ పలుకులు చాలా కష్టముగా నుండెను.

ఇట్లుండగా కొంతకాలమునకు గుణశీలుడు కాలగతి పొందెను. సుందరుడు స్వయముగా తన వ్యవహారములను చక్కబెట్టుకొనుచుండెను. సుందరుడు ఒకనాడు కత్తిసాము అభ్యాసము చేయుచుండగా ప్రమాద వశమున వేలు తెగిపోయినది. మంత్రి "ఇది మన మంచికొరకే"

అనెను. సుందరుడు కోపము తెచ్చుకొని మంత్రిని కారాగారమున నుంచెను.

కొన్ని దినముల పిమ్మట సుందరుడు వేటకై సమీపమున నున్న అరణ్యమునకు వెళ్ళెను. వేటయందు అలసి ఒక చెట్టు నీడను పరుండగా సింహమొకటి కడు నాకలితో యాతనిని సమీపించెను. చచ్చిన పిల్లివలె పరుండిన సుందరుని పరీక్షించి వాసన చూచి చివరకు వేలుపోయిన చేయిని గాంచి అసహ్యించుకొని వెళ్లిపోయెను. చచ్చిన వాని వలె నటించిన సుందరుడు జరిగిన దంతయు కనిపెట్టుచుండెను. సింహము తనను వదలి వెళ్ళిపోగానే చటాలునలేచి తన వ్రేలుపోయిన చేతిని చూచుకొని యెంతయో సంతసించెను. వేలు తెగినపుడు "అంతయు మన మంచి కొరకే" యను మంత్రి వాక్కు జ్ఞప్తికి వచ్చెను. మంత్రి వాక్కులను తెలుసుకొని, పురమునకేగి తక్షణము మంత్రిని విడుదల చేసి జరిగిన వృత్తాంతమంతయు వారికి తెల్పి క్షమాపణ వేడుకొనెను.



# అమ్మ

* శ్రీ సోమంచి సుబ్బారావు *

అదిగదిగో మా యమ్మ
మహామంచి అమ్మ
అమ్మ నన్నెపుడూను
ప్రొద్దున్నే లేపు
వేడి బొబ్బను పెట్టి
వెచ్చగా పోయు,
మెత్తనీ చేతితో వళ్ళంతారుద్దు
మా యమ్మ నా కెంతో
వేడియన్నము పెట్టి,
మంచి బట్టలు కట్టి,
తల దువ్వి పంపించు
బడికి నన్నెపుడు ;
బడి నుంచి రాగానె
పాపాయితో నన్ను
ఆడుకొమ్మని చెప్పి
తాయలం బెట్టు
అమ్మ నెపుడూ కూడ
దూషించరాదు.

నాకెపుడైననూ
రోగమొచ్చినయడల
రాత్రిపగలనకుండాను
నా కడనె కనిపెట్టుకొనియుండు
మంచిమందుల నెన్నొ
నాన్నచే దెప్పించు
నా నోట పట్టించు
తన చేతితోనె.
మరుచటిరోజునకె
అది యేమి రోగమో
హడలి పరుగెత్తూ.

అమ్మ తిట్టిన తిట్లు-
లోని పొగడతలూ-
మంచి దీవెనలూ
అమ్మ పెట్టిన ముద్దు
తీయనీ ముద్దు
పండగకు ఎంతోను
పరమాన్నమొండి
నాన్నకంటే ముందు
నాకేను బెట్టు
అమ్మకెపుడూ హాని
తలపెట్టరాదు.



# జిలిబిలి జాబిలి

* శ్రీ బులుసు జీ. ప్రకాష్ *

చందమామ అడుగోటి!
అందంగా వున్నాడు—
రాత్రివేళ నీతోటి
మైత్రిగాను వుంటాడు,

చందమామ అడుగోటి!
చందంగా వస్తాడు—
రాత్రుల్లో నీతోటి
మిత్రుల్లో కలుస్తాడు.

చందమామ అడుగోటి!
అందంగా వున్నాడు—
శార్వరిలో నీతోటి
సర్వం విహరిస్తాడు.

చందమామ అడుగోటి!
అందర కవుపిస్తాడు—
జిలుగుల కిరణాలతోటి
వెలుగులు ప్రసరిస్తాడు.

చందమామ అడుగోటి!
చందంగా చూస్తాడు—
చల్లని వెన్నెళ్ళతోటి
ఉల్లసిల్ల జేస్తాడు.

చందమామ అడుగోనే!
అందర కవుబిస్తాడు—
కౌముది ప్రసరిస్తూనే
నీమది కరిగిస్తాడు.

చందమామ అడుగోటి!
అందరునూ చూడండి—
చుక్కల విధు వడుగోటి
చక్కగ నున్నాడండి.

చందమామ అడుగోటి!
అందరున్ను చూశారు ?—
జిలిబిలి జాబిలిగారు
తెలితెలిగా నుంటారు :



# ....పంతం....

* శ్రీ డి. నాగేశ్వర్ *

నవనవలాడే లేబుగ్గలతో
కలకలలాడే చిలిపి చూపులతో
అందరి మనసుల కదలించే

దుండే దొకపాప;
చిన్నారి చిట్టిపాప;

పొరిగింటి పాపకోసం
వారింటికి వెళ్ళింది
వారింట్లో చూచింది
ఒక గులాబి పుష్పాన్ని....

మనకొక గులాబీ
కావాలంటూ
పంతం పట్టింది
అన్నం తిన్నంది ...

పాప అమ్మ గ్రహించింది
అంటు మొక్క సంగ్రహించింది....

మాసం రోజులు గడిచేసరికే
మెత్తని రేకుల పెత్తనాలతో
వికసించిందొక పువ్వు
పాప నవ్విందొక నవ్వు....



# సీత అగ్ని ప్రవేశము

• శ్రీ పేకమళ్ల కామేశ్వరరావు •

(సీత అగ్ని ప్రవేశము అను పేరున ఒకపాట ముద్రితమై ఉంది. అది దీనికంటె పెద్దపాట. ఏవో అక్కడక్కడ సమాన చరణా లుండవచ్చు కాని ఇది స్వతంత్రంగా బయలు దేరినదే! ఇది విజయనగర ప్రాంతాలలో నున్నపాట కాబట్టి ఆ కవి ఆవైపు వాడే అని చెప్పవచ్చు. పాటలో అతని పేరు లేదు 'సురతాణి, బొబ్బిలికాయలు' అను మాటలను బట్టి ఇది పద్దెనిమిదో శతాబ్దపు రచన కావచ్చు ఈ పాట అముద్రితం. ఇది మాత్రాగణాలతో రచించ బడ్డపాట.

సీత చెర విడిపింప సేతు బంధించి
లంక సాధించియు, రావణుని జంపి,
రాజ్యము విభీషణుడికి పట్టము గట్టి,
సకలమైన దేవతల చెరలు విడిపించి,
"జానకి తెమ్మ"నె సర్వేశ్వరులు.
"ఇప్పటి రూపాన తెస్తుమా దేవ !
తొలియున్న రూపాన తోడి తెస్తుమ?
ఇప్పటి రూపమ్ము చెప్పెదము దేవ !
కారినవి కన్నీరు, కట్టినజడలు,
మాసినవి వస్త్రాలు, మలినంపు జడలు.
హృదయాన మొలిచింది వెదురు పొద ఒకటి,
ఆసతి పరపురుషుడెదుటి కేరాదు."
అందుకు శ్రీరాము అత్యంత అడలి
శృంగారం చేసుక సీతదెమ్మ"నెను.

ఒప్పైన నేత్రాన ఒల్లియ గట్టి,
విరజాజి తైలాన శిరసొప్పనంటి,
మల్లియ తైలాన మరినలుగు బెట్టి,
సుగంధి గంధాన అటకళ్ళు గాచి,
ముత్యాల ముంతయు, నేత్రానపట్టు,
గాజున రాణించు కనకంపుగద్దె,
సింహాసనం వలెనున్న రత్నాలగద్దె,
పణతికి పోయరే పనసల నీడ.
ముత్యాల గొడుగును ముదితబట్టగను
మురహారుల సీత తా మజ్జన మాడె.
పగడాల గొడుగులు పడతిబట్టగను
భరతుల వదినె తామజ్జన మాడె

మజ్జన పీటమీద మగువ గూర్చుండి
కోడిన కొట్టు పసుపు సుఖమొప్పనాడె.
వెండియ వేయికాగుల వేణ్ణీళ్ళు తోడి
పమిడియ పదికాగుల చన్నీళ్ళు తోడి
చన్నీళ్ళు వేణ్ణీళ్ళు సమముగా తొలిపి
జలకమ్ము లాడెను జానకీదేవి.
పట్టుచీరెలొప్ప కట్ట బెడుదురు
పట్టు దివ్యాంబరముల దేవి తాగట్టె.
దేవికి దేవుడు తా బంపినాడు
"ఆభరణమ్ములు అతివ కివ్వండి."
బండార మేలేటి పతిని బిలిపించి
తాళముల చేత నే పెట్టె దీయించి
"హారములు తారములు బ్రన్న † స్వరములు
ఏ తొడవు లిష్టమో ఎంచుకో దేవి !"
ముంజేతుల, మునివ్రేళ్ళ ముద్రికలు బెట్టె
మగువ తనపాదాల మట్టెలు బెట్టె
పిళ్ళేల్లు, సొంపైన బొబ్బిలి కాయజోళ్ళు
ఆపైన చిటినిబొద్దులు అవితాను బెట్టె
సురతాణి ముత్యాల పతకంపు దండ
వజ్రాల రత్నాల పమిడి యాకులు.
"దేవి కాభరణాలు ఏల ఇచ్చితిర !
దేవరన మ్మించి వచ్చునో రాదో ?
అరిభోగి ఆవరణాన విడిపించరాదు."
"అట్లని శ్రీరామ అనంగరాదు !
అట్టిది కాదయ్యా మా దేవి సీత !
విడిపించవచ్చు"నని విభీషణుడు పలికె.

† బన్న = ప్రన్న, సొగసైన.

# సీత అగ్ని ప్రవేశం

దివ్యరథ మెుప్పుగా శ్రీదేవి ఎక్కె
కనకాశ్వముల గొట్ట కదలెనచ్చోటుం
అల్లంత తనదేవి రాగాను చూసి
తమ్ముడి దిక్కేజూచె తా రాఘవుండు
పరమసతి ఆ దివ్యపాదముల బడెను.
పాదముల పైనున్న పరమసతిదీసి
కడు ఉగ్రముగ బల్కె కర్ణశూలాలు
"క్షేమమా, కుశలమా ఇందీవరాక్షి !
ఇరవై చేతులవాడు ఎందుగలడనెను ?
పదితలల రావణుడు ఎందుగలడనెను ?
ఇంతకాలములంక నెందుంటి వనెను ?
లంకేశుడు కాడే, రావణుడుకాడే,
అతనిని కళ్ళారజూచి వచ్చితివా !
నీతిలేని వాణ్ణి పాతక పువాణ్ణి
అపరనాకమనియెడి ఆలంకలోను
అందు శుభరాజ్యమ్ము చేసెడి వాణ్ణి ! "

(అందుకు తాసీత అనియె నిట్టులను)
"ఆనందరాజ్యము అయోధ్యయగును ;
దిగవిడిచి నిను గూడి వచ్చిన నాడు
పాపకర్ముడు తనను పట్టుకొనిపోయె.
అశోక వృక్షము క్రిందనే ఉంచె.
ఆ సీత ఇదిమొదలు పదినెలలదాక
అన్నములు, నిద్రలు అవి తలపలేవు.
అన్న పానాదులు అంటనుమి దేవ !
అటనుండి వాడిరూపు చూడనెన్నటికి !
అంగుష్ట మొక్కటి ఎరుగుదును కాని
మరియేమి అన్యాయం తనవల్లలేదు"
మోకాళ్ళమీదనె శిరస్సును అని
నేలచూస్తూ దేవి అడలంగ దొడగె !
మిన్నులు అడలగా మేదిని అడలె !
మేదిమిపైనున్న వృక్షాలు అడలె !
వృక్షాలపైనున్న పక్షులు అడలె !
అంతరిక్ష సూర్యులు అడల దొడగిరి !
మనసులో విచారిస్తు దివ్య జ్ఞానమున
"పోకు, పోకుమా రామా ! పోకు శ్రీరామ !
పోయిన మీ తల్లి కౌసల్య ఆన !
భక్తపరులైన భరతులఆన !
మిముగూడిన తమ్ముల సౌమిత్రులాన !
మీయనుగు తమ్ముల శత్రుఘ్నులాన !"
"ఇందరి ఆనలకు నిలపక రథము
ఊరికి పొమ్మ"నె ఉగ్రము తోను.
పరమ పతివ్రత సీతపై ఆనలుపెడితె
పారక నిల్చెనె పసిడి పుష్పకము.
సంబరము చేయుచుతా సీతాదేవి
తావచ్చి పరమాత్మ ముందగ నిలిచె
ముందర నిలచిన ముద్దియను జూచి
తూరుపు మొగమాయెను సూర్య వంశజాలు
తూరుపు మొగమైన తాసీతాదేవి
తా వెళ్ళి పరమాత్మ ముందర నిలిచె
ముందర నిలిచిన ముద్దియను జూచి
పడమటి మొగమాయెను బాలభాస్కరులు.
పడమటి మొగమైన తాసీతాదేవి
తా వెళ్ళి పరమాత్మ ముందర నిలిచె.
ముందర నిలిచిన ముద్దియను జూచి
ఉత్తరపు మొగమాయెను ఉగ్రముతోను.
ఉత్తరపు మొగమైన తాసీతాదేవి
తా వెళ్ళి పరమాత్మని చేయిబట్టె.

"ఈ ఒట్టుకోరు, సత్యం కోరు ఉత్తమపురుష !
చిచ్చయిన కావించు శ్రీరామచంద్ర !"
"ఒట్టయిన నినుబల్ల ఉవిదరో వినవె !
సత్యమైన నినుబల్ల జనకసుత వినవె !
ఈ మూడులోకాల వారలు జూడ
లక్ష్మణునకు సత్యము చేయవే పోయి ! "
"ఇదియేమి సత్యమో ఉత్తమ పురుష !
మరుదులకు సత్యము చేసువారు కలరా?
విల్లువిరిచి కల్యాణమందిన నాడు
మా తండ్రి జనకుడు ఆడినమాట
మరిస్తివా మహారాజ మనసందు లేదా?
'జానకి నమ్మయిన త్రైలోక్య నాథ !
బాలకి నమ్మయిన పనులు నేర్వదు.

# సీత అగ్ని ప్రవేశం

సర్వాంగసుందరి జానకీదేవి
ఒప్పులగంధి మీ కప్పగిస్తిమి.'
వైదేహి సీతా మీ తోడునీడలది
పరమసతి ప్రవాదము ఎరుగుదును కాని
తెల్లము కావలెను దేవతలారా!
సేనలోఉన్న వానరముల బిలిచి
హనుమంతు బిలిచి ఇట్లని బలికె.
"పది యోజనముల పొడుగు, వెడల్పు
పాటిక హస్తముల నిలువునెత్తోడి
హింతాళ వృక్షములు, చింత వృక్షములు
చందనపు మానులే దాపులుగా దెచ్చి
అగ్నిగుండానికి అనువ్వుపడక్కడ!
రఘువంశ నందనుల, రాఘవులసీత!
అగ్నిగుండానికే వేంచేయునమ్మ!
అయ్యెడ వచ్చెనె హంసయు వలెను
విరచికట్టి నట్టి మడుగుచెంగావి
కాలికి యందియలను ఎగచనదోసె,
సందిటి దండలె ఎగచన దోసె,
తావచ్చె లక్షణ ఉన్నచోటుకును
లక్షణ! నినుబల్కి నరబుద్ధినైతి
నీతిగలవాడవై వదిలక వస్తివి.
కొలకుల కన్నీరు కమ్మె సౌమిత్రికి
"ఆహాహా! శ్రీరామ అయోధ్య రామ!
పరాక్రమముగలరామ! బలరామచంద్ర!
నాదొక విన్నపము ఆలకించండి!
అంగుష్టము నేను ఎరుగుదును కాని
మరియేమి అన్యాయం నావల్ల లేదు.
అగ్నిహోత్రుడ! తనకు ఆనతి ఇమ్ము.
రాముడే పతిగాను తానతిగాను
కూడుండ వలెననియు పూతాగ్నిజొచ్చె.
భగభగమండెను త్రేతాగ్ని వలెను.

"జయిస్తి శ్రీరామ! జయిస్తి చూడు!
అగ్నిజొచ్చినేను జయిస్తి చూడు
చేకొనక పోరాదు శ్రీరాఘువేశ!"
"చూస్తివా రాఘువా! చోద్యంపు పనులు
మంటలో మనసీత మాటలాడింది!"
"ఊరకుండు లక్ష్మణ! ఉగ్రసేనుత!
అహవాకికిగలవు అగ్ని మంత్రాలు!
అలికేరు, పూసేరు, ముగ్గు పెట్టేరు.
చిత్రములు వ్రాసేరు, చిగురు జల్లేరు?
కాగేటి ఎసర్ను చేరగలిపేరు!
ఉడికేటి అన్నములు పట్టిచూసేరు!
వేడి కడవనంట నేరరు మగవారు"

"శ్రీరాములు ఈ సీతను చేకొనక పోతే
ధరణిమీద రాజనాలు పండవికననిరి.
శ్రీరాములు ఈ సీతను చేకొనకపోతే
ఈఏడు వర్షాలు కురియవికననిరి."
అంతట వచ్చెనే దశరథ మహారాజు
అరుదెంచి అంతరిక్షమ్మున నిలిచె!
తమ తండ్రియని గ్రహించి సర్వేశ్వరులు
సాష్టాంగ నమస్కారములు జేసె.
తన మామయని గ్రహించి తాసీతాదేవి
సాష్టాంగపడి నమస్కారములు జేసె
"అలివేణి నీవు బాగనిసితివి
మనములో అవమాన. ముంచబోకమ్మ!
పసిడి రథముమీద ఈసీతనుంచి
తొడలపై నుంచుకో శ్రీదేవివలెను."
"అల్లదిగో! అకళంక!" అనుచుచూపిస్తు
ఆసీత దోడుకు అయోధ్య వెళ్ళె.
సీత అగ్ని ప్రవేశమ్ము పాడిన, విన్న
బాయును పాపములు, పొందుపుణ్యములు.

---

(ముద్రితం కాని పాతస్త్రీల పాటలున్నవారు ఈ కింది చిరునామాకు పంపిన యెడల వాటిని పత్రికలలో ముద్రించుటకు ప్రయత్నం చేస్తాను - టేకుమళ్ళ కామేశ్వరరావు, 52, వాద్యారు సుబ్బరాయ మొదలి వీధి. సైదాపేట, మదరాసు 15)



# తెలుగు ఉత్తమ రచనలకు బహుమతులు

మదరాసు (ప్రస్తుతం ఆంధ్ర). ప్రభుత్వము వారిచే తెలుగు భాషా సమితి ద్వారా, ఈ క్రింది విషయములపై తెలుగులో ఉత్తమ గ్రంథములకు 1954-55వ సంవత్సరానికి బహుమతులు ఇవ్వబడునని తెలుగు భాషా సమితి తెలియ జేయుచున్నది.

నాటక కళ:— నాటక రచన భారత దేశములోను, ఇతర దేశములందును ఎట్లు పుట్టి పెరిగినది? తెలుగు భాషలో ఎట్లు, ఎప్పుడు పుట్టి వర్ధిల్లుచున్నది? దశవిధ రూపకములు ఎట్లు ఏర్పడినవి? ఇప్పుడు తెలుగు నాటకముల రచన ఎట్లున్నది?

(ప్రదర్శనములు: ప్రదర్శనములకు సంబంధించిన సమాజములు, నాటకశాలలు, పరికరములు మొదలైనవి ఏ విధముగ పరిణమిస్తూ ఉన్నవి? నటీ నటుల సంస్కృతి, నటనా కౌశలము మొదలైన విషయములకు సంబంధించిన విశేషములు).

ఆంధ్ర వచన రచనా పరిణామము:— కావ్యమందలి వచన రచన, కేవల వచన రచన లయిన గ్రంథము లందలి రచన నన్నయనాటి నుండి నేటి వరకున్ను ఎట్లు పరిణమిస్తూ వచ్చినది?.

కుటీర పరిశ్రమలు, వాటి కళ, ప్రయోజనములు:— కుటీరములందు — అందు ప్రధానముగ తెలుగు దేశమందు- జరుగుతున్న పరిశ్రమల వివరణములు. శాస్త్ర లక్షణములు, చరిత్ర, అందుగల కళా కౌశలము, వివిధ పరిశ్రమల వల్లను కలిగే ప్రయోజనములు, లాభ నష్టములు మొదలైనవి.

2,400 చరణములకు తక్కువ కాని ఆంధ్ర కావ్యము:— కథా ప్రాధాన్యము గలదియైనా లేనిదైనా కావచ్చును. రసభరితమైనది, సభ్యమైనది, తెలుగు తనపు సొంపులు గలది కావలెను. స్వతంత్ర రచనయై యుండవలెనే కాని అనువాదము కాకూడదు.

భూగర్భ శాస్త్రము:- కేవల శాస్త్ర దృష్టితో రచితము కావలెను. అందు భారత దేశమునకున్ను, అందులోను తెలుగు దేశమునకున్ను సాధ్యమైనంతవరకు సంబంధించిన విషయ వివరణము కూడా ఉండవలెను.

ధర్మ శాస్త్రము— జూరిస్ ప్రూడెన్స్. భారత దేశాది ప్రాచ్య దేశములందున్ను, రోమక దేశాది పాశ్చాత్య దేశములందున్ను ధర్మ శాస్త్రము— జ్యూరిస్‌ప్రూడెన్స్— ఎట్లుదయించి పరిణమిస్తూ వచ్చిందో నిరూపించవలెను.

బహుమతుల పోటీలో పాల్గొనువారు క్రింది అంశములను గుర్తించవలెను.

౧. పోటీకి పంపబడు పుస్తకములు $\frac{1}{16}$ డబుల్ క్రౌన్ సైజులో 250 పుటలకు తక్కువ ఉండరాదు— అచ్చులో.

౨. సం 1947 రమునకు పూర్వము ప్రకటింపబడిన గ్రంథములు ఈ పోటీకి పనికిరావు.

3. అచ్చు పుస్తకాలయితే ఆరు కాపీలు; వ్రాత ప్రతులయితే రెండేసి కాపీలు పంపించవలసిఉంటుంది.

४. గ్రంథాలు 1955 జనవరి ఒకటవ తేదికి తెలుగు భాషా సమితి కార్యదర్శి, 27 యూనివర్సిటీ భవనములు, మదరాసు 5, కు అందజేయాలి.

౫. ప్రతి ఒక్క విషయములోని ఉత్తమ గ్రంథమునకును రు. 500లు బహూకరింపబడును.

౬. శాస్త్రీయ విషయములకు సంబంధించిన గ్రంథాలలో శైలి సరళముగను, సామాన్య ప్రజానీకానికి సుబోధకముగను, తెలుగు నుడికారమున కనుగుణముగను ఉండవలెను. సాంకేతిక పదముల వాడుక విషయములో— ఈ వరకే వాడుకలోనికి వచ్చిన తెలుగు పర్యాయ పదములను గాని, అంతర్జాతీయ పారిభాషిక పదములను గాని వాడవచ్చును. తెలుగు పదములను వాడినచో మొదటి సారి ఇంగ్లీషు మూలమును ప్రక్కన చూపవలెను. అట్టి పదముల పట్టికను, ఆంగ్ల మూలములతో సహా అనుబంధములో చేర్చవలెను.

౭. లిఖిత ప్రతులు విస్పష్టముగ భోధపడు దస్తూరిలో సులభముగ చదువుటకు వీలగునట్లు వ్రాయవలెను. కొట్టివేతలు గాని, హంసపాదులు ఉండరాదు. పుస్తకమును బైండు చేయించి పంపించవలయును.

౮. పోటీకి పంపు అచ్చు పుస్తకములు తిరిగి రచయితలకు పంపబడవనిన్ని, లిఖిత ప్రతులలో నొకటి మాత్రము బహుమతులు నిర్ణయింపబడిన తరువాత తిరిగి పంపివేయబడగలవనిన్ని పోటీలో పాల్గొను రచయితలు గమనింపవలెను.

తెలుగు భాషా సమితి,
27 యూనివర్సిటీ భవనములు, మద్రాసు-5.



# అల్లికలు — ఐలెట్ జంపర్

కావలసిన పరికరాలు: 6 ఔన్సులు 3 ప్లై క్రేపు వూలు. నెం. 11 సూదులు 2.

కొలతలు: ఛాతీ 32 అంగుళములు వెడల్పు. పొడవు $19\frac{1}{2}$ అంగుళములు.

(ఎనిమిది కుట్లు ఒక అంగుళానికి సరిసమానం)

## జంపర్ వెనుక భాగం

నెం. 11 సూది మీద 112 కుట్లు వేయాలి. తరువాత 2 ని. 2 ప. చొప్పున $3\frac{1}{2}$ అం॥ అయేవరకూ అల్లాలి. దీనినే అంచులేక రిబ్బు అంటారు. తరువాత స్టా. స్టిచ్‌గా మార్చి ప్రతి 8 వ. వరుస రెండుచివర్ల ఒక్కొక్క వైపు ఒక్కొక్క కుట్టు హెచ్చు చేయుచు సూదిమీద 136 కుట్లగువరకు అల్లవలెను. ఇదేమాదిరిగా వెనుక భాగం $11\frac{1}{2}$ అం॥ పొడుగు అగువరకూ అల్లాలి. తరువాత ప్రతి 8, వ. వరుస ఒక్కొక్క చివర ఒక్కొ క్క కుట్టు చొప్పున 14 కుట్లు హెచ్చు అగువరకూ అల్లవలెను. అప్పుడు సూదిపై 184 కుట్లుండును. ఆవిధంగా వెనుక భాగం $18\frac{1}{4}$ అం॥ అగువరకు అల్లవలెను. భుజం ఆకారం ఏర్పరచుటకు, తరువాతి 16 వరుసల మొట్టమొదటలో 8 కుట్లు చొప్పున ఒదులుగా కాస్టాఫ్ చేయవలెను. అప్పుడు సూదిమీద 56 కుట్లుండును. వాటిని గట్టిగా కాస్టాఫ్ చేయగా మెడ వెనుక భాగం ఏర్పడును.

## ముందు భాగం

వెనక భాగం అల్లినట్లే సూదిపై 126 కుట్లు అగువరకు ముందు భాగం అల్లాలి. తరువాత,

1. వ. వరుస. (తిరుగువైపు) ని 1. పర్ల్ చివర కుట్టువరకు అల్లి తరువాత 1. ని. అల్లవలెను.

2. వ. వరుస. ని. 62. ని.టు.టుగెదర్. మే. 1. ని. 62.

3. వ. వరుస. మొదటి వరుసవలె.

4. వ. వరుస. ని, పూర్తిగా.

5. వ. వరుస. మూడవ వరుసవలె.

6. వ. వరుస. ని. 53, (ని. టు. టుగెదర్, మే 1, ని. 4) అవిధంగా మూడు సార్లు అల్లి తరువాత ని. టు. టుగెదర్, మే 1. ని. 53. అల్లవలెను.

7. వ. వరుస. మూడవ వరుసవలె.

8. వ. వరుస. మొదటి కుట్టులో 1 ని. హెచ్చు చేసి చివర కుట్టువరకు, ని. అల్లి తరువాత చివర కుట్టులో, 1. ని. హెచ్చు అల్లవలెను.

9. వ. వరుస. 3. వ. వరుసవలె.

10. వ. వరుస. ని. 45 (ని.టు.టుగెదర్, మే 1, ని. 4) 6 సార్లు అవిధంగా అల్లి తరువాత ని.టు.టుగెదర్, మే 1. ని. 45. అల్లవలెను.

11, 12, 13. వ. వరుసలు, వరుసగా, 3, 4, 5, వ. వరుసలవలె.

14. వ. వరుస. ని. 36 (ని.టు.టుగెదర్, మే 1, ని. 4) 9 సార్లు అల్లి తరువాత ని.టు.టుగెదర్, మే 1, ని. 36. అల్లవలెను.

15. వ. వరుస. మూడవ వరుసవలె.

16. వ. వరుస. 8. వ. వరుసవలె.

17. వ. వరుస. 3, వ. వరుసవలె.

18. వ. వరుస. ని. 28, (ని.టు.టుగెదర్, మే 1, ని. 4) 12 సార్లు అల్లి తరువాత ని.టు.టుగెదర్, మే 1, ని. 28. అల్లవలెను.

19, 20, 21, వ. వరుసలు, వరుసగా 3, 4, 5, వ. వరుసలవలె.

22. ని. 19 (ని. టు. టుగెదర్, మే 1. ని. 4) 15 సార్లు అల్లి తరువాత ని.టు.టుగెదర్, మే. 1, ని. 19. అల్లవలెను.

23. వ. వరుస. 3. వ. వరుసవలె.

## అల్లికలు — ఐలెట్ జంపర్

24. వ. వరుస. 8. వ. వరుసవలె.

25. వ. వరుస. 9. వ. వరుసవలె.

పైవిధంగా 3 నమూనాలు వచ్చేవరకు అల్లి ప్రతి నమూనా 8. వ. వరుస ఒక్కొక్క చివర ఒక్కొక్క కుట్టు హెచ్చు వేయుచు సూదిపై 136 కుట్లు వచ్చువరకు అల్లవలెను. ఆవిధంగా నమూనాలతో ముందు భాగం 11½ అం॥ అగువరకు అల్లాలి. తరువాత నమూనా (చెడకుండా వుండడానికి) పూర్తి అగుటకు నమూనా ఒక్కొక్క చివర 14 కుట్లు హెచ్చు చేసి, తరువాత పై చెప్పిన విధంగా ప్రతి 8. వ. వరుస ఒక్కొక్క కుట్టు హెచ్చు చేస్తూ 12½ అం॥ అగువరకూ అల్లాలి. తరువాత మెడ ఓపినింగుకు కుట్లన్నీ రెండు భాగాలుగా భాగించుకోవాలి.

తరువాత మొదటి భాగం కుట్లతో నమూనా మొదలు పెట్టి అల్లి, మెడ చివర, అదే వరుసలో చంక ఆకార మేర్పడుటకు ఒక్కొక్క కుట్టు రెండు చివర్లా ఎక్కువ చేస్తూ 10 కుట్లు ఎక్కువ అగువరకు అల్లి తరువాత 14 కుట్లు హెచ్చు అల్లాలి. ఈవిధంగా వెనుక భాగం అల్లిన కొలతకు సమంగా ముందు భాగం కూడా అల్లాలి.

మెడ నిక్కబొడుచుకుని వుండుటకు, భుజముల ఆకారం ఏర్పడుటకు 8 కుట్లు తేలికగా 8 సార్లు చంక చివర భాగం నుంచి కాస్టాఫ్ చేయవలెను. తరువాత తక్కిన కుట్లు కాస్టాఫ్ చేసి పూలు రెండవ భాగమునకు అతికి, మొదటి భాగమువలె అల్లవలెను.

మెడ బైండిగ్ లేక మెడకు అతుకు భాగం :— 8 స్టి. కాస్టాఫ్ చేసి తరువాత స్టా. స్టిచ్‌తో ప్రతి వరుస చివర కుట్టువరకు అల్లవలెను. మెడకు వెనుక ప్రక్క త్రిప్పుటకు సరిపడునంత పొడవు అల్లి కాస్టాఫ్ చేయవలెను.

చంక బైండిగ్ లేక చంకకు అతుకు భాగం :— 8 స్టి. కాస్టాఫ్ చేసి తరువాత మెడ బైండింగువలె 12 అంగుళాలు అల్లి కాస్టాఫ్ చేయవలెను, ఆవిధంగా రెండు ముక్కలు అల్లాలి.

మేకప్ : లేక పూర్తి చేయుట :— భుజములు, ప్రక్కలు కలిపి కుట్టాలి. మెడకు అల్లిన ముక్కను మెడ చుట్టూ కుట్టి, రెండు చేతులకు అల్లిన ముక్కలను చంకలకు అతికి తరువాత పూర్తి అయిన జంపరుని జాగ్రత్తగా యిస్త్రీ చేయవలెను.



మూలం : మొపాసాం

# అవ్వ

—"శ్రీ శిల్పి"

కొన్ని కొన్ని సంఘటనలు మన హృదయానికి గట్టిగా హత్తుకు పోతాయి. మరిచిపోదామన్నా మరుపుకు రానంతగా అవి మన్ని వెంటాడుతుంటాయి.

ఈ సంఘటన జరిగి యెంతో కాలమైంది. అయినా నిన్న జరిగిన సంగతలా నా మనస్సులో మెదులుతూంది. అది జరిగిన తరువాత యెన్నో విచిత్ర విషయాలు కాల చక్రంలో తిరిగి పోతున్నాయి. అయితేనేం, అప్పటికి నాకు పన్నెండో యేడే అయినా ఆ అవ్వ మాత్రం నా స్మృతి పథంనుండి తొలిగిపోలేదు.

ఆ అవ్వ ప్రతి గురువారం నార వేయడానికి మా యింటికి వస్తూండేది. మా పల్లెలో పురాతనం యిల్లు వుంది. దానికి అంటుకుని మూడు నాల్గు చావళ్ళు కూడా వుండేవి. అవ్వ ఉదయం ఆరు ఏడు గంటలమధ్య వచ్చీ రాగానే నార గదిలోకి పోయి పని మొదలు పెట్టేది. సన్నగా, పొడవుగా వుండేది. కాని, ముఖమంతా వెంట్రుకల మయం. ముక్కుమీద, ముక్కు క్రింద, చెక్కిళ్ళ మీద, గడ్డం మీద, అంతా వెంట్రుకలే. తెల్లబడ్డ కనుబొమలు వత్తుగా పొడుగ్గా దుబ్బుల్లా వుండేవి.

అవ్వ కుంటుతూ నడిచేది. కాని అది సామాన్యంగా కుంటివాళ్ళు నడిచినట్టు కాక సముద్రపు అలల్లో ప్రయాణం చేసే ఓడలా వుండేది.

అవ్వంటే నాకు ప్రాణం. నేను లేచీ లేవటంతోటే అవ్వుండే నార గదిలోకి పరుగెత్తే వాడిని. ఆ చలిలో నాకు జలుబు చేస్తుందేమోనని అవ్వ యెంతో జాగ్రత్త తీసుకునేది. ఆ వంకర టింకర వేళ్ళతో నార నేస్తూ నాకెన్నో కథలు చెప్పేది. ఆ పెద్ద కళ్ళజోళ్ళ అద్దాల్లో నుండి కండ్లు విచిత్రంగా రెట్టింపుగా కనిపించేవి. ఆ పల్లెలో జరిగిన వింతలు యెన్నెన్నో చెప్పేది. ఆ చెప్పే విధంలో యేం మహత్తు వుందోకాని ఆ చిన్నకథలే మరుపుకురాని గాథల్లా తోచేవి నాకు. మా అమ్మ సాయంత్రం చెప్పే మహాకవుల కథల్లో అవ్వ చెప్పిన కథలో వున్న వింత దనం గానీ జీవం గానీ నాకు కనిపించేదికాదు.

ఓ గురువారం ఉదయమంతా అవ్వ చెప్పిన కథలు విన్నా, తరువాత తోటలోకి పండ్లు యేరుకోటానికి వెళ్లాను. కాని యెందువల్లనో మళ్ళా అవ్వని చూడాలనిపించింది. అప్పుడు జరిగినదంతా యిప్పటికీ నాకు కండ్లకు కట్టినట్లుంది.

గది తలుపులు తెరువగానే అవ్వ బల్లప్రక్క పడిపోయి వున్నట్లు కనిపించింది. తల క్రిందికి త్రిప్పి వుంది. చేతులు చాచి వున్నాయి. కాని ఓ చేతిలో సూది, యింకో చేతిలో నా షర్టు ఆ విధంగానే వున్నాయి. పొడుగ్గా వున్న కాలు బల్లకిందకు చాచి వుంది. కండ్ల జోడు గోడ దగ్గర పడి వుంది. పొలి కేకలు పెడుతూ పరువెత్తాను. అందరూ పరుగెత్తుకుంటూ వచ్చేరు. అవ్వ చనిపోయిందన్నారు.

అప్పుడు నా చిన్ని హృదయం పొందిన ఆవేదన యింతా అంతా అని చెప్పలేను. నెమ్మదిగా వసారాలోకి వెళ్ళి ఓ చీకటి మూలలో చేరి యెంతగానో యేడ్చేను. చాలాసేపు ఆ విధంగానే కూర్చుని వున్నాను. చీకటి కూడా పడింది. హఠాత్తుగా ఓ లాంతరు తీసుకుని, మా అమ్మా, నాన్నా, మా వూరు డాక్టరుతో సహా అక్కడికి వచ్చేరు. కాని నన్ను వాళ్ళు చూడలేదు. డాక్టరు ఆ ప్రమాదం ఏవిధంగా జరిగిందీ చెబుతున్నాడు. అందులో చాలా భాగం నాకు అర్థం కాలేదు.

డాక్టరు చెప్పుకు పోతున్నాడు. ఆ మాటలు నా హృదయంలో చెక్కినట్లుగా మిగిలాయి. నిజానికి డాక్టరు చెప్పిన ప్రతి మాటా తిరిగి వల్లించ గల ననుకుంటా.

డాక్టరు అంటున్నాడు : "పాపం ! అభాగ్యురాలు, నే నీ వూరు వచ్చిన రోజే కాలు విరగకొట్టుకుంది. నేను వచ్చీ రావటంతోటే యీవిడ్ని చూడటానికి వెళ్ళవలసె

వచ్చింది. యెందువల్ల నంటే. ఆ దెబ్బ గట్టి దెబ్బ, ప్రమాదకరమైంది కూడాను.

"అప్పటికి యీమెకు పదిహేడేళ్ళుంటాయి. అందమైన పిల్ల. ఆమాటకి వస్తే గొప్ప అందగత్తెనే చెప్పాలి. ఆమాట యిప్పు డెవ్వరూ నమ్మరు. ఇంతవరకూ నే నీకథని యెవ్వరికీ చెప్పలేదు. ఆ సంగతి నాకూ, ఇంకో వ్యక్తికీ తప్ప మరింకెవ్వరికీ తెలీదు. ఆ వ్యక్తి ఇప్పుడీ ప్రాంతాల్లో లేడు. ఈమె మరణించింది. ఇప్పుడు మీకీ విషయం చెప్పడం నాకు సబబుగా తోస్తుంది.

"ఒక బడి పంతులు అప్పుడీ వూళ్ళోకి వచ్చేడు. వయస్సులో వున్నవాడు, మంచి అందగాడున్నూ. సిపాయిలలో వుండే ఠీవి అతగాడిలో గోచరించేది. అతడి అందాన్ని మెచ్చుకునే ఆడవాళ్ళు చాలామంది వున్నా అతడంతగా పట్టించుకునేవాడు కాదు. అతడికి స్కూల్లో పెద్దపంతులంటే భయం ఒకటి. కాని చివరికి అతడికి యీ అందాల చిన్నదానిమీద మనస్సు పోయింది. ఎవ్వరికీ అందనివాడు తన్ని కోరుతున్నాడన్న భ్రమలో మురిసిపోయింది. కుట్టుపని పూర్తిచేసుకుని, ఒక గడ్డి మోపు దగ్గిర కలుసుకొమ్మని ఒప్పించేడు.

"తన పని పూర్తి చేసుకుని, యింటికి వెళుతున్నట్లు నటించి, పై గదిలో వున్న గడ్డిమోపుదగ్గిర తన ప్రియుని కొరకు ఎదురు చూసేది. అతడూ అక్కడకు చేరి చల్లని కబుర్లు మొదలు పెట్టాడో లేదో తలుపు తీసుకుని పెద్ద పంతులు ప్రత్యక్షమై 'ఇక్కడేం చేస్తున్నా'వని వురిమేడు. పట్టుబడిపోతానన్న భయంతో చిన్నవాడికి మతిపోయినట్లయింది. 'కొంచెం విశ్రాంతి తీసుకుందామని వచ్చేనండీ' అని నసిగేడు.

"ఆగది చాలా పెద్దది, దాదాపు అంతా చీకటి మయంగా వుంది. ఆ చిన్నవాడు, భయంతో వణికి పోతున్న ఆ పిల్లని మరో చివరికి తోస్తూ, 'అక్కడికి పోయి దాక్కో- నా వుద్యోగం కాస్తా వూడుతుంది. పోయి దాక్కో- ముందు' అని వూదేశాడు. పెద్ద పంతులు ఈ గుసగుసలు విని. 'అదెవరు ?' అన్నాడు.

'నే నొక్కడినేనండీ'

'కానేకాదు, నీవు మాట్లాడుతూండగా నే వినలేదూ ?'

'ఒట్టండీ, నే నొక్కడనే'

'అది నే కనుక్కుంటాగా' అంటూ గది తాళం వేసి దీపం కొరకు క్రిందికు దిగేడు.

"అసలే పిరికి పందేమో ఆ చిన్నవాడికి మతి అసలే పోయింది. దానితో ఒక్కసారిగా చేతగానితనంతో కోపం పుట్టుకొచ్చింది. పదే పదే అనటం మొదలు పెట్టాడు. 'అతడికి కనబడకుండా పోయి దాక్కోని చావు. నా జీవితం పొడుగునా నా నోట దగ్గర కూడు తీసివేస్తావు. నా బ్రతుకంతా బండలు చేస్తావు' అని.

"తాళం తీస్తున్న శబ్దం వినిపించింది. ఆ పిల్ల రోడ్డు వైపుగా వున్న కిటికీ పటుగున తీసి రెక్కలు తెరిచింది నెమ్మదిగా 'అతడు వెళ్ళిపోయేక నన్ను లేవతీస్తావు కదూ !' అంటూ బయటకు దూకింది.

"ముసలి పంతులుకు యెవ్వరూ కనిపించలేదు. ఆశ్చర్యపోతూ క్రిందికి దిగిపోయేడు. ఓ పావుగంట పోయేక ఆ చిన్నవాడు తాను చేసిన పని చెప్పాడు. ఆ పిల్ల రెండో అంతస్థు నుండి దూకటం వల్ల లేవలేక అక్కడే పడుంది. నేను అతడితో వెళ్ళాను. వర్షం జోరుగా కురుస్తోంది. పాపం ఆ పిల్లని మా యింటికి చేర్చేను. కుడికాలు మూడు చోట్ల విరిగి బొమికలు బయట పడ్డాయి. బాధంతా ఓర్పుతో భరించింది. 'ఇది నాకు శిక్ష. తగిన శిక్షే అయింది' అని మాత్రం అంది.

"నా యింటి ముందు బండిక్రింద పడిందని ఒక కథ అల్లి చెప్పాను. నామాట అంతా నమ్మేరు. ఇదీ జరిగిన సంగతి. ఆమె ప్రేమగాథ ఇదొక్కటే. కన్యగానే మరణించింది. తన్ను తాను బలి చేసుకుంది. మరుగు పడిపోయిన వున్నత వ్యక్తి. ఈమె మీదవుండే గౌరవం వల్లే యిప్పుడీ సంగతి మీకూ చెబుతున్నాను."

డాక్టరు ముగించేడు. అమ్మకి ఏడుపు ఆగలేదు. నాన్న నెమ్మదిగా ఏదో అన్నారు. ఆతరువాత వాళ్ళంతా వెళ్ళి పోయారు. నేను మాత్రం ఆ శూన్యంలో అలాగే కూలి పోయాను. కొంత సేపటికి బరువుగా పాదాల చప్పుడు యేదో మోసుకెడుతూన్న చప్పుడూ వినిపించింది.

వాళ్ళు అవ్వ శవాన్ని మోసుకెళ్ళి పోతున్నారు !



Edited, Printed & Published for the Andhra Mahila Sabha, Luz, Madras 4
by Mrs. A. C. Krishna Rao, M.A., L.T., at the Andhra Mahila Press, 24-A, Luz Church Rd., Madras 4

# విజయం



ఆంధ్ర మహిళా సభలో

1954 మార్చిలో జరిగిన కాశీ ఇంటర్‌మీడియట్ పరీక్షలకు ఆంధ్ర మహిళా సభ విద్యాలయపు బాలికలు 4 గురు వెళ్ళిరి. ఇందు 3 గ్గురు విజయముగాంచిరి. వారిలో ఒకరు ప్రథమశ్రేణిలోను, యిద్దరు ద్వితీయశ్రేణిలోను కృతార్థులైరి.

ప్రథమశ్రేణి :

కుమారి ఎమ్. సి. నిర్మల.

ద్వితీయశ్రేణి :

కుమారి ఎన్. రమణి, శ్రీమతి కె. భారతి.

కృతార్థులైన విద్యార్థినులకు మా అభివందనములు.

ఆంధ్ర మహిళా సభ.

# గమనిక

'ఆంధ్ర మహిళ' స్త్రీల సచిత్ర మాస పత్రిక. ఆంధ్ర లోకంతో సన్నిహితానుబంధం ఏర్పరచుకొని, మహిళా సంఘంలో నూతన ప్రబోధం కలిగించే ఆశయంతో ఆంధ్ర మహిళా సభ తరపున "ఆంధ్ర మహిళ" పత్రిక 11 సం॥రములనుండి ప్రకాశితమగుచున్నది.

దీనియందు స్త్రీల మనోవికాసానికి తోడ్పడే వ్యాసములు, కథలు, నాటికలు, పిల్లలకు బాలానందం మొదలగు గద్య పద్యాత్మకములైన పలురకముల రచనలున్నవి. సాంఘిక రాజకీయ విషయములు, ప్రభుత్వము వారు దేశాభివృద్ధికై జరుపుచున్న సంక్షేమ కార్యక్రమాలు, స్త్రీలకుపయుక్తమైన గృహ పరిశ్రమలు మున్నగు వానిని గూర్చి మాసామాసము యిందు ప్రకటింపబడును.

వార్షిక సంచిక, తపాలా ఖర్చులతోసహా

## సంవత్సర చందా 6-0-0

సేవాసంస్థలకు, గ్రంథాలయములకు, కళాశాల, పాఠశాలలకు,

సంవత్సర చందా రూ. 4-8-0 మాత్రమే.

వివరములకు :

మేనేజరు
'ఆంధ్ర మహిళ'

ఆంధ్ర మహిళా సభ,
24-ఎ. లజ్ చర్చిరోడ్డు, మైలాపూర్, మద్రాసు 4.

# ఆంధ్ర మహిళ

వ్యవస్థాపకురాలు :

శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్

యెం.యే., బి.యెల్.,

సంపాదకురాలు :

శ్రీమతి చన్నఘంటమ్మ

యెం.యే., యెల్.టి.,

సంవత్సర చందా ఆరు రూపాయిలు

ఆంధ్ర మహిళా సభవారిచే స్థాపించబడిన ముద్రణాలయములో
ముద్రితము.

# సేవానికి ఆహ్వానం

మూడేళ్లక్రిందట. 1951 మార్చినెలలో భారతప్రజలు జీవితాభ్యున్నతికై స్వయంకృషి ప్రారంభించారు. మన మొదటి పంచవర్షప్రణాళిక అధికాహారోత్పత్తి, అధిక వస్తూత్పత్తి, సంఘసేవాకార్యకలాపాల అభివృద్ధి, అధికంగా ఉద్యోగావకాశాలకల్పన నిమిత్తమే తలపెట్టబడినది.

ఇంతవరకు కనిపించిన అభివృద్ధి ప్రోత్సాహకరంగా ఉన్నది. నవభారతనిర్మాణమనేది ఘనతరప్రయత్నానికై ఇప్పటికే మనం దాదాపు వెయ్యికోట్ల రూపాయలు వ్యయపరచియున్నాము. ఆహారవిషయమై ఇక మనం బైటిసహాయంపై ఆధారపడనవసరంలేదు. మనం తిలైయావంటి బ్రహ్మాండమైన ఆనకట్టలను నిర్మించుకున్నాము; బొకారోవంటి థర్మల్ పవర్‌స్టేషన్లను నెలకొల్పియున్నాము; సింద్రీవంటి ఫ్యాక్టరీలను స్థాపించియున్నాము. చండిగార్‌వంటి నగరాలను నిర్మించియున్నాము. మన రైలుఇంజినులను మనమే తయారుచేసుకుంటున్నాము. మన మోటారుకార్లను, విమానాలను విడిభాగాలుకూర్చి స్వయంగా చేసుకుంటున్నాము. కమ్యూనిటీ ప్రాజెక్టులు, గ్రామీణ విస్తరణ సేవలద్వారా గ్రామైశ్వర్యానికి మనం పునాదులు వేశాము.

సర్వతోముఖకృషి ఆవశ్యకత, అభివృద్ధి ఈవిధంగా ఉన్నప్పటికీ, మనం తలపెట్టిన లక్ష్యాలను సాధించుటకై ఇంకా మిగిలిన రెండుసంవత్సరాలలో సర్వతోముఖకృషి అవసరమైయున్నది. ఈ కృషికి వ్యయంనిమిత్తం ఇండియాకు ఇంకా దాదాపు పదమూడువందల కోట్ల రూపాయలు కావలసియున్నవి.

జాతీయ ప్రణాళికఋణం ఇప్పుడు ఎల్లరూ సమయోచితంగా సహాయపడవలెనని దేశప్రజలను హెచ్చరిస్తున్నది. పంచవర్ష ప్రణాళిక ప్రజల ప్రణాళిక కనుక ఈ ఉద్యమసాఫల్యానికై తమ వాటాను చెల్లించుట ప్రజల విద్యుక్తధర్మం. ఈ విధిని మీరూ నేనూకూడా తప్పక నిర్వహించాలి.

నేషనల్ ప్లాన్‌లోనుకు ధారాళంగా

చందా వేయండి

(సాలీనా 3-5% వడ్డీ ప్రతి అర్ధ సంవత్సరంలో చెల్లింపు)

ఇతరవివరాలకు వ్రాయండి: రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా, ఇంపీరియల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, ది హైదరాబాద్ స్టేట్ బ్యాంక్, ది బ్యాంక్ ఆఫ్ మైసూర్ లిమిటెడ్, వీటికి చెందిన ఏశాఖకైనా లేక ప్రభుత్వ ట్రెజరీ, సబ్ ట్రెజరీలలో దేనికైనా

నేషనల్ ప్లాన్

సర్టిఫికేట్లను కొనండి

(పరిపక్వ మైనప్పటికి సాలీనా 4.5% వడ్డీ)

ఇతర వివరాలు సేవింగ్స్ బ్యాంక్ పనులు గమనించు పోస్టు ఆఫీసులలో కూడా దొరకును

## ప్రణాళిక కనపరుస్తున్న అభివృద్ధులు

| | | లక్ష్యాలు 1951—56 ప్రణాళిక కాలానికి | సాధించినది 1953—54 వరకు |
|---|---|---|---|
| ఆహారం | | 76·0 లక్షలటన్నులు | 60_70 లక్షలటన్నులు |
| | | (ప్రతి సంవత్సరం అదనపు ఉత్పత్తి) | |
| ఇరిగేషన్ (మేజర్ ప్రాజెక్టుల ద్వారా) | | 8,533,000 ఎకరాలు | 3,556,000 ఎకరాలు |
| విద్యుచ్ఛక్తి | | 10,87,000 కిలోవాట్లు | 7,24,000 కిలోవాట్లు |
| కొత్త రోడ్లు | | 870 మైళ్లు | 447 మైళ్లు |
| నూలుబట్టలు | | 932 మిలియన్ గజాలు | 1,163 మిలియన్ గజాలు |
| | | (ప్రతి సంవత్సరం అదనపు ఉత్పత్తి) | |
| కమ్యూనిటీ ప్రాజెక్టులు గ్రామీణవిస్తరణస్కీము | | 1,20,000 (గ్రామాలు) | 48,750 (గ్రామాలు) |
| కొత్త పాఠశాలలు | | 49,695 | 29,723 |
| కొత్త ఆసుపత్రులు | | 996 | 609 |

AC-566 TG

**ఇండియా భవిష్యత్తు నిమిత్తం పెట్టుబడి పెట్టండి.**

# ఆంధ్రమహిళ

సంపుటి 11 :: జూలై '54 :: సంచిక 3

ముఖచిత్రం : "పెళ్ళి చూపులు"
చిత్రకారుడు : శ్రీ ఆర్. వేంకటరావు.



ఇంకా బాలానందం, కథలు, కబుర్లు, వ్యాసాలు, గ్రంథసమీక్ష, మొదలైనవి.

సంవత్సర చందా :: ఆరు రూపాయలు.




సంపుటి 11 :: జూలై '54 :: సంచిక 3

# సంఘ సంక్షేమం

మానవులు సంఘజీవులు. సాంఘిక జీవనం నాగరికతకు ఒక విధమైన కొలతబద్ద. వ్యక్తి మరో వ్యక్తికి, కుటుంబంలో మరో కుటుంబానికి, ఊరు మరో ఊరికి, దేశం మరో దేశానికి తోడ్పడుతూ, పరస్పర సహకారంతో పురోభివృద్ధి నందడంలోనే మానవుల నాగరికత యొక్క ప్రత్యేకత ఉంది. అందుకే సంఘసేవకు అంత ప్రాముఖ్యత యిచ్చేరు—అన్ని దేశాల్లోనూ కూడా.

ఒక వ్యక్తి యొక్క ఘనత అతని శరీరమానసిక శక్తులు, విద్య- ధనం వగైరాలు ఎంతమందికి సహాయమూ సేవా చేయడాన్కి తోడ్పడ్డాయి అన్నదాన్ని బట్టి నిర్ణయమౌతూఉంటుంది. కేవలం అతనికి ఎంత ఆస్తి విద్య వగైరాలున్నాయి అన్నదాన్ని బట్టి గాక, అవి ఎంతమందికి ఉపకరించి—సద్వినియోగం చేయబడి—సార్థక్యమయ్యేయి అన్నదాన్ని బట్టి ఆ వ్యక్తి యొక్క 'నిజమైన గొప్పతనం' లోకం నిర్ణయిస్తుంటుంది. లోకమన్ననంద గలిగిన పెద్ద పెద్దల జీవితాలన్నీ యిందుకు తార్కాణాలే.

ఒకరికి సహాయం చేయడం అంటే— తనకు భగవంతుడిచ్చిన ధన ధాన్యాదులు, వస్త్రం, గోవు, విద్య, గృహం, భూమి, జ్ఞానం వగైరాలు పదిమందికి పంచి యివ్వడమే గాదు, ఆఖరుకు నెమ్మదైన మాట, ప్రేమపూరితమైన సలహా యిచ్చి ఒక వ్యక్తిని గాని దేశాన్ని గాని, తన తోడివారికి ఉపకరించే రీతిని చరించేటట్లు నడప గలిగితే, అదీ సంఘానికి గొప్ప సహాయమే ఔతుంది. ప్రజల కోసరం అన్న సత్రాలు నెలకొల్పడం, రోడ్లు వేయించడం, పాఠశాలలు పెట్టించడం, వాపీ—కూప తటాక నిర్మాణాలు గావించడం, కుంటీ—గుడ్డీ —కురూపి- అనాదలకు తగు సహాయం జేయడం, వీటన్నిటి యొక్క ఆశయం ప్రజాసేవ, సంఘ సంక్షేమమే. వీటిల్లో పుణ్యం— పురుషార్థం యిమిడి ఉన్నాయి. ఒక మహాత్ముని ప్రవచనం వినండి. "సేవగావించే మహదవకాశం నీకు కల్పించడానికి ప్రత్యక్షమైన పరమేస్వర స్వరూపులే నీతోడి వారూ దీనులూ వికలాంగులూనని తెలుసుకో; ధన్యుడయ్యేది దాతగాని ప్రతిగ్రహీత కాదు. 'సేవ' అంతటి మహత్తరమైంది— మానవ సేవయే మాధవసేవ."

మానవసృష్టి- మానవ సేవా స్త్రీ లోకానికి ప్రత్యేక వరప్రసాదాలు. స్త్రీ జీవితమనగానే సేవమయం—ప్రేమమయం— త్యాగమయం. భర్తకు బిడ్డలకు, అతిథి అభ్యాగతులకు సేవ జేయడంలో నిమగ్నురాలై, స్త్రీ తన జీవితాన్ని సేవకు అంకితమిచ్చేస్తుంది. ఆమె విద్యా వివేకాలు పెంపొందే కొద్దీ ఈ సేవాభావం కుటుంబాన్నుంచి గ్రామానికీ, గ్రామాన్నుంచి దేశానికీ. దేశాన్నుంచి యావత్ప్రపంచానికీ పాకుతుంది. విశాల ప్రపంచమంతా కూడా ఆమె సంతానమే. వారి క్షేమమే తన క్షేమం. ఈ తన సంతానానికి సేవ జేయడం కంటె, వారి కొరకై తన ప్రాణాన్నైనా త్యాగం జేయడం కంటె, వాంఛనీయమైంది మరొకటి ఆమెకు లేనేలేదు. ఈ రోజుల్లో ఇలాంటి సేవ గావించడానికి మహదవకాశాలున్నాయి. ప్రపంచం శాంతి కోసరం తల్లడిస్తూఉంది. మనకు స్వరాజ్యం వచ్చిందేగాని, దేశంలో

దరిద్ర దేవత ఇంకా తాండవిస్తూనే ఉంది. ప్రజానీకానికి ఆహారం—వస్త్రం—వసతి - విద్య— వైద్యం వగైరా సౌకర్యా లన్నీ లోటుగానే ఉన్నాయి. వీటన్నిటినీ కల్పించడమే— రామరాజ్యస్థాపనే-తద్వారా దేశపిత గాంధీజీ ఆత్మకు శాంతి సాధించడమే యిప్పుడు అందరి యొక్క విధీ ఆశయమూ ఐయుంది.

ఈ సత్యాన్ని గమనించే సమగ్ర దేశాభ్యుదయానికి పంచవర్ష ప్రణాళిక తయారు గావించిన ప్లానింగు కమిషన్ వారు మొత్తం అన్ని స్కీములకు వెచ్చించ నెంచిన సుమారు 2069 కోట్ల రూపాయల్లోనూ దాదాపు నాల్గో వంతు సంఘ సంక్షేమకార్యక్రమాలకై ప్రత్యేకించేరు. సంఘసంక్షేమ కార్యాలు మన దేశస్థులకు కొత్తగాదని యిది వరకే విన్నాం. ఇందుకెన్నో సంస్థలు కృషి చేస్తున్నాయి. కేంద్రసోషల్ వెల్ ఫేర్ బోర్డూ, స్త్రీ జనాభ్యుదయ సంస్థలూ, శ్రీరామకృష్ణ మిషన్ వారూ గావిస్తున్న సేవ కూడా అంతా యెరిగిందే.

ఐతే ఒకటి—— సోషల్ వెల్ ఫేర్ సంస్థలన్నీ పట్టణాల్లో ఉండిపోతున్నాయి. ఈ విషయం కూడ కేంద్ర సోషల్ వెల్ ఫేర్ బోర్డువారు గమనించి, గ్రామ ప్రాంతాల్లో 300 వెల్ ఫేర్ ప్రాజెక్టులు నెలకొల్పాలని ప్లాను వేయడం ఎంతైనా ముదావహం. వీటొక్కటొక్కటికీ కేంద్ర ప్రభుత్వం 25 వేలు రూ. లు గ్రాంటు యిస్తుంది. మరొక 25 వేల రూ. లు ప్రజలు విరాళాలివ్వాలి. లేదా రాష్ట్ర ప్రభుత్వమన్నా యివ్వాలి. సంఘసంక్షేమం వాంఛించే ప్రజా హితాభిలాషులు ఈ సందర్భంలో ఉదారంగా తోడ్పడి విరాళా లిస్తారనీ, ఈ ప్రాజెక్టుల నిర్వహణలో ఎల్లరు తమ పూర్తి సహకార సానుభూతుల నిచ్చి దిగ్విజయంగా నెరవేరుస్తారనీ, ఇలా అందరి కృషి ఫలితంగా మళ్ళీ గ్రామ సీమలు శాంతి- భద్రతలతో, సిరి- సంపదలతో, ఆయురారోగ్య సౌభాగ్యాలతో తులతూగుతాయనీ ఆంధ్ర మహిళలూ, మహిళా లోకమూ ఆశిస్తూయుంది. ఇదే అన్ని సంస్థలకూ, స్త్రీలకూ, ఆంధ్ర లోకానికీ, అన్ని రాష్ట్రాలవారికీ (ఆంధ్ర మహిళా సభ వ్యవస్థాపకులూ, ఇప్పుడు సెంట్రల్ సోషల్ వెల్ ఫేర్ బోర్డు చైర్మనూయైన) శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్‌గారి విన్నపం—— సందేశంగూడా.







రాజస్తాన్‌లో దంగరపూర్ గ్రామవాసి నిర్మల అనే భిల్లుజాతి యువతి, 1954 రిపబ్లిక్‌డే ఉత్సవాల్లో పాల్గొన డానికి ఢిల్లీ వెళ్ళింది. అప్పటినుండి ఆమెలో గొప్ప మార్పు వచ్చింది. తమ గ్రామం కూడా మంచి శుచిగాను, సుభ్రంగాను వుండాలని నిశ్చయించుకుంది.

ఇప్పుడు తమ గ్రామంలోని కొంతమంది స్త్రీలను కూడగట్టుకుని గ్రామం అంతాతిరిగి వీధులు, ఇళ్ళు శుభ్రం చేస్తుంది. అంతేకాదు. వాళ్ళ గ్రామానికి సంబంధించిన విద్య, పారిశుధ్యం, మొదలైన సమస్యల్ని పరిష్కరించ డంలోకూడా సలహాలిస్తుంది. నిర్మల భర్త 'గ్రామసేవక్' గా పని చేస్తున్నాడు. అనింభంగానే అమెకూడా గ్రామస్థుల వల్ల "అనుంగునేస్తం - గురువు — మార్గదర్శిగా" చూడ బడుతూంది.



# ఆంధ్ర మహిళా సభ

## సర్వసభ్యసమావేశము

ది 8-6-'54 మంగళవారం సాయంత్రం 4-30 గం॥లకు సభా భవనములో శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ గారి ఆధ్వర్యమున సర్వసభ్యసమావేశము జరిగినది. 1953-54 వివిధ శాఖల కార్యనివేదిక, 1952-53, 1953-54 జమా ఖర్చుల నివేదికలు చదివి ఆమోదించడమైనది.

అటుపైన జరిగిన వివిధ కమిటీల ఎన్నికల వివరములు యీ దిగువ ప్రకటించుచున్నాము.

### ఎన్నికలు.

శ్రీమతి జె. జమునాబాయిగారు, సభ్యురాండ్ర ప్రతినిధిగా ట్రస్టుబోర్డునకు ఎన్నుకొనబడిరి.

సంయుక్త కార్యదర్శినులు :

శ్రీమతి బెన్నూరి తిమ్మాబాయి, శ్రీమతి కస్తూరి రంగనాయకమ్మ.

### నూతన పాలకవర్గము

శ్రీమతి పి. సంపూర్ణాదేవి
,, కమలాబాయి
శ్రీమతి లక్ష్మీరఘురామ్
,, బెన్నూరి కృష్ణవేణమ్మ
శ్రీమతి చన్నఘంటమ్మ కృష్ణారావు

### సబ్ కమిటీ

శ్రీమతి గౌరి సుబ్బయ్య నాయుడు
,, పి. శకుంతలమ్మ
,, జి. లక్ష్మీకాంతమ్మ
,, ఎ. అనసూయ
,, కె. పద్మావతమ్మ
,, కమలా కేశవరావు
శ్రీమతి డి. స్వర్ణమ్మ
,, టి. అహల్య
,, ఎ. రాజేశ్వరమ్మ
,, వి. పుష్పాచౌదరి
,, జి. లీల
,, కె. అనసూయ

### నర్సింగుహోమ్ కమిటీ

శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్
,, టి. కె. అడ్రన్‌వాలా
డాక్టరు శ్రీ అవధాని
శ్రీమతి వాసిరెడ్డి రాజ్యలక్ష్మి
మిసెస్. ఎ. సి. కృష్ణారావు
డాక్టరు శ్రీ దొరస్వామి
మిసెస్. హనుమంతరావు నాయుడు
శ్రీమతి పురం అన్నపూర్ణమ్మ

సోషల్ వెల్‌ఫేర్ బోర్డు ఆధ్వర్యాన్న జరుగనున్న ప్రాజెక్టు నిర్వహణకై ఒక కమిటీని నియమించుటకు సభ్యురాండ్రు అంగీకరించి, శ్రీమతి టి. జి. హైమవతిగారు కార్యదర్శినిగాను, శ్రీమతులు సి. రత్నావళి, క. రుక్మిణమ్మ, కె. సుగుణమణి, ఎన్. కామేశ్వరమ్మ, జి. లీలగార్లను సభ్యురాండ్రుగను ఎన్నుకొనిరి.

## ఆంధ్ర మహిళా సభ

శ్రీమతి కె. సుగుణమణి ఆంధ్ర మహిళ సంయుక్త సంపాదకురాలుగాను.

కుమారి ఆర్. లక్ష్మి ఆంధ్ర మహిళ మేనేజరుగాను.

మిస్ పావనాబాయి నర్సింగుహోమ్ కన్వీనరు, కరెస్పాన్‌డెంటుగాను.

కుమారి పి. విమల నర్సింగుహోమ్ సూపరెంటెంటుగాను, నియమింపబడిరి.

సంయుక్త కార్యదర్శినులైన శ్రీమతి బి. తిమ్మాబాయిగారు హాస్టలు, పారిశ్రామిక శాఖలు, శ్రీమతి రంగనాయకమ్మగారు ప్రెస్ శాఖను చూచునట్లును, శ్రీమతి కమలాబాయిగారు విద్యాశాఖ చూచునట్లును, నిర్ణయించడమైనది. కుమారి టి. సుశీలాదేవి హెడ్‌మిస్ట్రెస్‌గాను;- శ్రీమతి ఆర్. అనూరాధ అసిస్టెంటు హెడ్‌మిస్ట్రెగాను నియమితులైరి.

శ్రీమతి జమునాబాయిగారు ఆంధ్రా స్టేటు వుమెన్సు వెల్‌ఫేర్ ఆఫీసరుగాను, శ్రీమతి చన్నఘంటమ్మగారు ఆంధ్రా స్టేటు వెల్‌ఫేర్ బోర్డు చైర్‌మేన్‌గాను, నియమితులైనందుకు సభవారు అభివందన తీర్మానములు చేసిరి.



## ఆంధ్ర మహిళా సభ

### సంగీతపు తరగతులు

కర్ణాటక సంగీతము వీణ, గాత్రములలో లోయర్ గ్రేడ్ పరీక్షలకు శిక్షణ, ఆంధ్ర మహిళా సభ లజ్‌చర్చిరోడ్డు భవనములలో, ప్రారంభింపబడినది.

శిక్షణ మాసరుసుము: రూ. 5-0-0.

ప్రవేశ రుసుము: రూ. 3-0-0.

సభ్యత్వ రుసుము మాసమునకు: రూ. 1-0-0.

మిగతా వివరములు సభకు మధ్యాహ్నం 3 గం॥ పైన వచ్చి తెలిసికొనవచ్చును.

### ఖాదీ విక్రయము.

మద్రాసు గౌర్నమెంటు రూరల్ వెల్‌ఫేరు శాఖలో తయారయిన ఖద్దరు వస్త్రములు, ఆంధ్ర మహిళాసభ లజ్ చర్చి రోడ్డు కార్యాలయంలో విక్రయింప బడుతున్నవి.

చీరలు, ధోవతులు, దుప్పట్లు, చొక్కా, రవికె గుడ్డలు, ఇంకా అనేక రకములైనవి యిక్కడ దొరకును. రూపాయ విలువకు 3 అణాలు తగ్గించి విక్రయించవలసినదిగా వెల్‌ఫేరు, శాఖవారు అనుమతి యిచ్చియున్నారు.

ఉదయం 10 గం॥ నుండి సాయంకాలం 6 గం॥ వరకు ఈ విక్రయశాఖలో మీకు కావలసిన వస్తువులు దొరకును.





# రాజకీయాలు

• శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు •

1954 మే నెల నాలుగో వారం మొదలుకుని జూన్ మూడో వారం వరకూ అంతర్జాతీయ, భారత రాజకీయ రంగాల్లో నడిచిన ప్రధాన సంఘటనలు ఇవి— మధ్య అమెరికా రాజ్యమయిన గ్వాటెమాలాపై అమెరికా తన తాబేదార్ల చేత దండయాత్ర జరిపించటం, దూరప్రాచ్య సమస్యలమీద ప్రధాని నెహ్రూ దృక్పథం సరయినదని జెనీవాసభ నిరూపించటం, తూర్పుపాకిస్థాన్‌లో గవర్నరు పరిపాలన, నేపాల్‌లో అభివృద్ధి నిరోధకులకు అమెరికా మద్దత్ ఉన్న సూచనలు కనిపించటం, ఫ్రెంచి ఇండియా భవిష్యత్తుపై ఉభయ దేశాలకూ జరిగిన సంప్రదింపులు విఫలం కావటం, భారత రాజ్యాంగానికి కాంగ్రెసు కొన్ని సవరణలను ప్రతిపాదించటం.

ఆంధ్రరాష్ట్ర వ్యవహారాల్లో చెప్పుకోదగ్గ అంశాలు మూడు— బంజరు భూములను పేదలకు పంచిపెట్టటానికి ఆంధ్ర ప్రభుత్వం సన్నాహాలు చేయటం, ప్రాథమిక పాఠశాలల ఉపాధ్యాయులకు జీతాలు పెంచాలని నిశ్చయించటం, విశాలాంధ్ర స్థాపనకు తెలంగాణా కాంగ్రెసు ప్రతిఘటించటం, మద్యనిషేధ సమస్యపై తర్జన భర్జనలు.

* * *

కమ్యూనిజం బెదురు చూపించి దక్షిణ అమెరికా దేశాలను దోచుకుంటున్న అమెరికా విధానానికి ఆదేశాల్లో ప్రతిఘటన ఏర్పడ్డది. అందులోనూ అమెరికా విధానాన్ని కచ్చితంగా ప్రతిఘటించిన గ్వాటెమాలా మీద అమెరికా దెబ్బతీయ ప్రయత్నించగలదని కిందటి నెలలో కనిపించిన సూచనలు ఈనెల నిజమయినవి. జూన్ నెల 18_వ తేదీని హాండ్యూరాస్, నికరాగ్వా దేశాలనుంచి గ్వాటెమాలాపై దండయాత్ర ప్రారంభమయింది.

గ్వాటెమాలా దేశం మెక్సికోదేశానికి దిగువగా ఉన్న ఒక చిన్నరాజ్యం. జనాభా 30 లక్షలు. అందులో ముప్పాతికవంతు అమెరికన్ ఆదిమవాసులయిన అమెరిండియన్లు. ప్రధానవృత్తి అరటితోటల పెంపకం, పళ్ళ పరిశ్రమ. ఈ పళ్ళతోటలు యావత్తూ దేశంలో ప్రధానమైన రేవు పట్టణాలు కూడా, రైలుమార్గాలూ, నౌకల సర్వీసూ— ఇవన్నీ యునైటెడ్ ఫ్రూట్ కంపెనీ అనే అమెరకన్ కంపెనీకి చెందినవే. గ్వాటెమాలా జనాభా అంతా ఈ కంపెనీకి చాకిరీ చేసి బతుకుతారు. 1951 లో సేన్యార్ ఆర్బెంజ్ నాయకత్వాన ఏర్పడ్డ ప్రభుత్వం అభ్యుదయ మార్గంలో నడుస్తూ, ప్రజల దారిద్ర్యాన్ని పోగొట్టేందుకని ఈ ఫ్రూట్ కంపెనీ తోటలను జాతీయం చేసింది. దీని పరిహారం రొక్క రూపంలో చెల్లించాలని కంపెనీ పేచీ పెట్టింది. ఈ కంపెనీలో అమెరికా విదేశాంగమంత్రి డలెస్, ప్రెసిడెంటు ఐసెన్‌హోవర్, కమ్యూనిస్టు విద్వేషి సెనెటర్ మెకార్థీ ప్రభృతులు వాటాదార్లని తెలుస్తున్నది.

పరిహారం చెల్లించే విషయంలో ఒకవేళ ఒప్పందం కుదురుతుందేమోనని అమెరికా అధికార్లు భయపడ్డారు. పరిహారం సమస్య పరిష్కారమయినా, అసలు సమస్య మరొకటి ఉన్నదనీ, గ్వాటెమాలాలో అంతర్జాతీయ కమ్యూనిస్టు పన్నాగాలను అరికట్టుట యన్నది జరగవలసి వున్నదనీ డలెస్ నిర్మొహమాటంగా బయట పెట్టాడు.

తనమాట వినని వాళ్ళనీ, తన దోపిడీకి లొంగనివాళ్ళనీ, _వాళ్ళెవరైనా సరే_ కమ్యూనిస్టులని నిందారోపణ చేయటమే అలవాటుగా ఉన్న అమెరికా 1953 నుంచీ గ్వాటెమాలా మీద పనికట్టుకుని దుష్ప్రచారం ప్రారంభించింది. అఖిల అమెరికన్ సమావేశమని ఒక కీలుబొమ్మల ముఠాను

జేర్చి కరాకాస్ అనే చోట సమావేశం జరిపి నాటక మాడింది. కమ్యూనిజం వ్యాప్తిని నిరసిస్తూ తీర్మానించాలని కోరగా, చాలా దేశాలు అన్నిదేశాల ఐక్యమూ పోవాలని కోరినవి. అయితే గట్టిగా నిలబడి వ్యతిరేకంగా వోటు చేసినదల్లా గ్వాటెమాలా ఒక్కటే.

బ్రిటిష్ హాండ్యురాస్ అనే వలస రాజ్యం న్యాయతః తమకు చెందాలని గ్వాటెమాలా చాలాకాలంనుంచి కోరుతున్నది. అందువల్ల గ్వాటెమాలా కమ్యూనిస్టు దేశమని బ్రిటన్‌కూడా దుష్ప్రచారం సాగిస్తున్నది.

* * *

బ్రిటన్, అమెరికాలు గ్వాటెమాలాతో ఐక్యం కలిగించుకునేందుకు చేస్తున్న దుష్ప్రయత్నాలన్నింటినీ వివరిస్తూ వాటిని ప్రచురించవలసిందని కోరుతూ 1953 ఏప్రిల్‌లోనే గ్వాటెమాలా ప్రభుత్వం ఐక్యరాజ్య సమితికి ఒక జాబితా పంపుకున్నది. అయితే ఏకారణం వల్లనో అది బయటికి రాలేదు. ఆ తరవాత గ్వాటెమాలా కమ్యూనిస్టు దేశాలనుంచి ఆయుధాలను తెప్పించుకున్నట్లు అమెరికా ఆరోపించింది. ఎక్కడో 700 మైళ్ళదూరాన ఉన్న పెనామా కాలవకు గ్వాటెమాలావల్ల ప్రమాదం కలుగుతుందని ఆర్భాటం చేసింది. గ్వాటెమాలా తన సరిహద్దు దేశాలయిన హాండ్యురాస్‌ని కరాశ్యాలమీద దాడిచేసే ప్రమాదం ఉన్నదని చెప్పి, అక్కడికి విమానాల మీద ఆయుధాలు చేర్పించింది. ఇది జరిగిన వెంటనే కమ్యూనిస్టు వ్యతిరేకోద్యమం పేరుతో విమానాలు, నౌకలతో హాండ్యురాస్‌నుంచి దండయాత్ర సాగింది.

* * *

గ్వాటెమాలా ప్రభుత్వం తక్షణం భద్రతామండలికి ఫిర్యాదు చేసింది. ఈ వ్యవహారాన్ని అఖిల అమెరికన్ సంస్థద్వారానే పరిష్కారం చేయించాలని అమెరికా తాబేదార్లు రెండు—బ్రాజిల్, కొలంబియా ఒకతీర్మానాన్ని ప్రతిపాదించినవి. కాని కరాకాస్ సమావేశ వైఖరీ, గ్వాటిమాలాపై జరుగుతున్న దుష్ప్రచారమూ చూస్తే, ఆ సంస్థవల్ల గ్వాటెమాల నామరూపాలు లేకుండా పోతుందని చెప్పటానికి సందేహించనక్కరలేదు. అందువల్ల రష్యా దానిని వీటుచేసింది. తరవాత ఫ్రెంచి ప్రతినిధి తక్షణం యుద్ధచర్యలు విరమించాలనీ, సమితి సభ్యులెవరూ వాటికి మద్దతు చేయకూడదనీ ఒక తీర్మానం ప్రతిపాదించగా ఆమోదించబడ్డది. దండయాత్ర మాత్రం సాగుతునేఉన్నది.

* * *

గ్వాటెమాలా వ్యవహారం అమెరికా పతనానికి నాందిగా కనిపిస్తున్నది. ఇంచుమించు ఫాసిస్టు ప్రభుత్వాలు, పురాతన వ్యవస్థలు గల ఆ దేశాలను దోచుకొనటం వల్లనే, అక్కడి ముడి పదార్థాల వల్లనే అమెరికా పరిశ్రమలు అంత పైకి రాగలిగినవి. భారతదేశంలోని సంస్థానాల మాదిరిగా ఉన్న ఈ రాజ్యాల వోట్లన్నిటినీ చేతిలో పెట్టుకుని అమెరికా ఐక్య రాజ్య సమితిని అదుపులో ఉంచుకోగలుగుతున్నది. దీనిని అర్జెంటీనా మొదలైన దేశాలు నిరసిస్తున్నవికాని బహిరంగ ప్రతిఘటన మాత్రం గ్వాటెమాలానుంచే వచ్చింది. ఈ సంఘటనతో మిగిలిన దేశాలుకూడా ధైర్యం తెచ్చుకుని ఎదురు తిరగవచ్చు. అప్పుడు అమెరికా కోరలుతీసిన పాము కాకతప్పదు. ఇప్పుడు కమ్యూనిస్టు దేశాలను సమితిలోకి రాకుండా చూస్తున్న అమెరికా తనమాటే అందులో చెల్లక నానాజాతి సమితికి ఎడంగా ఉన్నట్లే ఐక్యరాజ్య సమితినుంచే తప్పుకోవచ్చు.

* * *

అమెరికా హాండ్యురాస్‌ని కారాగారాలకు సప్లయి చేసిన ఆయుధాలు ఎంత 'సద్వినియోగం' అయినవో, ఇండోచైనాలో ఫ్రెంచి వాళ్ళకు చేస్తున్న సహాయం అంత 'సద్వినియోగం' అవుతున్నది. ఫ్రెంచి ఇండియా భవిష్యత్తుపై సమాధానం కుదుర్చుకోలేని ఫ్రెంచి అధికారులు జూన్ రెండవ వారంలో ఇండోచైనా నుంచి కొందరు యూరపియన్ సైనికులనూ, ఆయుధసామగ్రినీ దించారు. ఇట్లా ఫ్రెంచి ఇండియా ప్రాంతాలకు సైనిక సామగ్రిని దించటం 1814 లో బ్రిటిష్ ప్రభుత్వానికీ, ఫ్రాన్సుకూ జరిగిన ఒప్పందానికి విరుద్ధం. ఈవిషయం అటుండగా, ఫ్రాన్స్ తెచ్చిన ఆయుధాల పెట్టెలమీద "ఇండోచైనా పోరాటం కోసం ఫ్రాన్సుకు అమెరికా సప్లయిచేసిన ఆయుధాలు" అని వ్రాసి ఉన్నట్లు తెలుస్తున్నది. ఈ

విషయమై భారత ప్రభుత్వం తగు దర్యాప్తులు జరిపించి, అవసరమయితే అమెరికాకే ఆక్షేపణ తెలియజేయాలని ఆలోచిస్తున్నది.

ఫ్రెంచి ఇండియా అధికారాన్ని తమకు అప్పగించాలన్న ఇండియా కోరికమీద పారిస్‌లో మే 15 నుంచీ జరిగిన సంప్రదింపులు విఫలమయినవి. ఆ ప్రాంతాలమీద అధికారాన్ని ఇండియాకు అప్పగింత పెట్టటానికి ఫ్రాన్స్ సూత్ర ప్రాయంగా అంగీకరించింది. పోలీసు, జనాభా, న్యాయశాఖల మీద అధికారాన్ని తక్షణమే అప్పగించాలని ఇండియా కోరగా, దీనినిగురించి చర్చించటానికే ఫ్రాన్స్ నిరాకరించింది. అప్రధాన శాఖల్లో కింది ఉద్యోగాలు కొన్నిటికి భారతీయుల్ని నియమించాలని ఇండియా ప్రతిపాదించింది. ఫ్రాన్స్ అంగీకరించలేదు. సంప్రదింపుల సందర్భంలో తన సద్భావాన్ని చూపటానికి ఇండియా కొన్ని ప్రయాణ నియమాలను సడలించగా ఫ్రాన్స్ సడలించలేదు. గూండాల దురాగతాలు సాగుతూనే ఉన్నవి. ఆయుధాలు, సేనలు దిగుతున్నవి. పుదుచ్చేరిలో కందకాలు తవ్వటం మొదలైన యుద్ధ సన్నాహాలుకూడా జరుగుతున్నవి. గూండాల దౌర్జన్యం భరించలేక యానాం ప్రజలు ఎదురు తిరిగి స్వపరిపాలన నెలకొల్పుకున్నారు.

సంప్రదింపులను తిరిగి ప్రారంభించేందుకు ఫ్రెంచి ప్రతినిధులు రాబోతున్నట్లు కొన్ని వార్తలు వచ్చినవి.

*　　*　　*

తనకు తంత్రాలను సమర్థించేందుకు ప్రతిదేశంలోనూ అభివృద్ధినిరోధకుల్ని చేరదీయటంలో ఆరితేరిన అమెరికా నేపాల్‌లో కూడా తన ఇనప గజ్జెల పాదం పెట్ట ప్రయత్నిస్తున్నది. నేపాల్‌ను ఎంతో కాలం దోచుకుని అథోగతిలో ఉంచిన రాణాలను (జాగీర్దార్లు) ఉపయోగించుకునేందుకు ప్రయత్నించింది. రాణాల సంస్థ అయిన గూర్ఖా పరిషత్ నాయకుడు మృగేంద్ర షంషేర్ జంగ్‌కు 4 అమెరికన్ వైర్లెస్ యంత్రాలు దొంగతనంగా రాగా, ఆయన అరెస్టు చేయబడ్డారు. విదేశీయులు, ముఖ్యంగా అంతర్జాతీయ సంస్థల ప్రతినిధులు నేపాల్‌లో కుట్రలు పన్నుతున్నట్లు ప్రధానీ కోయిరాలా చాలారోజుల్నుంచీ హెచ్చరిస్తూనే ఉన్నారు.

గూర్ఖా పరిషత్ ఇండియా విద్వేష ప్రచారం చేయిస్తున్నది.

*　　*　　*

కాశ్మీరుమీద దెబ్బతీయటానికి సులభంగా ఆయుధాలు సంపాదించేందుకు అమెరికాను ఆశ్రయించిన పాకీస్థానుకు, అమెరికా ఒక దించరాని బండ అయి కూర్చున్నది. పాకీస్థాన్ ఆంతరంగిక వ్యవహారాల్లో కూడా తన 'మెకార్థీ' విధానాలను అమలు జరిపించి, పాకీస్థాన్ ఐక్యతకే ముప్పు తెప్పిస్తున్నది. మే నెల 30 వ తేదీన పాకీస్థాన్ గవర్నర్ జనరల్ తూర్పు పాకీస్థాన్‌లో ముస్లింలీగును ఓడించి ప్రభుత్వం నెలకొల్పిన ఫజ్లుల్‌హక్ ప్రభుత్వాన్ని రద్దుచేసి రక్షణ మంత్రి జనరల్ ఇస్కందర్ మీర్జా క్రింద గవర్నరు పాలన ఏర్పాటు చేశారు. దీనికి కరాచీలోని అమెరికన్ రాయబారి ముఖ్యకారకుడని సర్వత్రా ఆరోపించబడ్డది. అప్పటినుంచీ వెయ్యికి పైగా అరెస్టులు జరిగినవి. ఇది విద్వేషానికీ, అనైక్యతకూ దారితీస్తుందని ఖాన్ అబ్దుల్‌గఫార్ వంటి నాయకులు హెచ్చరిస్తున్నారు.

*　　*　　*

దూరప్రాచ్య సమస్యలమీద జెనీవాలో జరిగిన సమావేశాల్లో కొరియా మీద జరిగింది భగ్నమయింది. ఇండోచైనామీద కూడా అట్లాగే జరిగేదేకాని, ఫ్రెంచి ప్రజల యుద్ధ వ్యతిరేకత, కమ్యూనిస్టుల సహకార భావాలవల్ల కొంత ఒప్పందం కుదిరి, సమావేశం ఏర్పడ్డది. ఒక్క నెల రోజుల్లో సగౌరవంగా యుద్ధాన్ని ముగిస్తానని నడుం కట్టిన వామపక్ష నాయకుడు మెండీస్ ఫ్రాన్స్‌ను ఫ్రెంచి పార్లమెంటు కొత్త ప్రధానిగా ఎన్నుకున్నది. జెనీవా సభలో కమ్యూనిస్టు ప్రతినిధులు లావోస్, కాంబోడియాలనుంచి వీట్మిన్లను ఉపసంహరించటానికి అంగీకరించిదానిపై సమాలోచనలు జరిగే ఏర్పాట్లు చేయించారు. యుద్ధవిరమణపై పర్యవేక్షణ జరపటానికి ఏర్పడే సంఘంలో ఇండియా, ఇండోనేసియా, పాకీస్థాన్‌లు ఉండే విషయమై ఒప్పందం కుదరవచ్చుననిపిస్తున్నది.

కొరియా సమావేశం విఫలం కావటానికి ఒకే ఒక కారణం ఉన్నది. ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యాన్నే,

# రా జ కీ యా లు

కొలంబో సభదేశాల ఆధ్వర్యాన్నే అంగీకరించాలన్న అమెరికన్ పట్టుదలే దానికి కారణం. అయితే ఇండో చైనా సమస్యలో ఫ్రెంచి ప్రజలవలె, సమస్యా పరిష్కారానికి పట్టుబట్టేవాళ్ళు కొరియా సమస్యలో లేకపోవటం వల్లనూ, దక్షిణ కొరియా సంప్రదింపులను ఎట్లా భిన్నపరుద్దామా అని కాచుకుని కూర్చున్నందువల్లనూ సమావేశం విఫలం కాక తప్పలేదు. కొరియా ఏకీకరణకు ఉభయ ప్రాంతాలూ సంయుక్త కృషి జరపాలని ఉత్తర కొరియా చేసిన ప్రతిపాదనను సమావేశం పూర్తిగా చర్చించనులేదు.

ఈ సభలు పండిత నెహ్రూ మొదటినుంచీ చెపుతూన్న మూడు అంశాలను నిరూపించినవి—1. వివాదగ్రస్త దేశాలే అచ్చంగా కూర్చుని చర్చించినప్పుడే పరిష్కార సాధ్యం. 2. ప్రత్యర్థి పక్షాలకు పరస్పర నమ్మకం ఉండదు గనుక ఒప్పందాలను అమలు పరిచేందుకు తటస్థ రాజ్యాలు అవసరం. 3. ఈ తటస్థ రాజ్యాలు నిజంగా తటస్థదేశాలని ఉభయులకూ నమ్మకం కలగాలి.

* * *

"పరిపాలన సక్రమంగా ఉండేందుకూ, పంచవర్ష ప్రణాళిక నిరాఘాటంగా సాగేందుకూ" అనే కారణాలు చెప్పి కాంగ్రెస్ అధిష్టాన వర్గం భారత రాజ్యాంగానికి కొన్ని సవరణలు ప్రతిపాదించారు. ఇవి మే నెల చివరివారంలో వెల్లడి అయినవి. ఈ సవరణలలో ముఖ్యమైనవి రెండు—1. ప్రభుత్వం వ్యక్తుల ఆస్తులు వశపరుచుకున్నప్పుడు ఇచ్చే పరిహారం మొత్తాన్ని గురించి కోర్టులకు విచారించే హక్కు ఉండకూడదు. 2. ప్రభుత్వ చర్యలను తాత్కాలికంగా నిలిపివేస్తూ 'రిట్'లు జారీచెయ్యటానికి హైకోర్టులకు ఉన్న అధికారాలను తగ్గించాలి. ప్రభుత్వోద్యోగులను పనిలోనుంచి తొలగిస్తే ఆవిషయమై కోర్టులకు వెళ్ళే అవకాశం ఉండకూడదు.

ఈ ప్రతిపాదనలను పండిత హృదయనాథ కుంజ్రూ వంటి ప్రముఖులు తీవ్రంగా విమర్శించారు. ప్రభుత్వోద్యోగులకు పరువు నష్టంగా ఎవరయినా ప్రవర్తిస్తే, ప్రభుత్వమే వారిపై చర్య జరిపించేందుకు వీలుగా కాంగ్రెస్ హోం మంత్రి కట్జూ ప్రతిపాదించిన బిల్లును కూడా కుంజ్రూ తీవ్రంగా నిరసించి, దీనివల్ల అవినీతి పెరిగిపోతుందని హెచ్చరించారు. పరిహారం మొత్తం విషయంలో కోర్టులకు వెళ్ళనివ్వకపోతే, ఆస్తి హక్కులకు సంబధించిన అంశాలనే రాజ్యాంగంనుంచి తొలగించవచ్చునన్నారు.

అయితే అసలు సంగతి ఒకటున్నది. పంచవర్ష ప్రణాలిక సరిగ్గా అమలు జరక్క పోవటానికి కారణం కేంద్ర ఆర్థిక శాఖకూ, ఇతర శాఖలకూ గల విబేధాలే. ఆవిషయమై ఆర్థిక మంత్రి దేశ్‌ముఖ్ రాజీనామా యిచ్చి, చివరకు అంతా సద్దుబాటుచేస్తే, ఉపసంహరించటం కూడా జరిగింది. ఇంత వ్యవహారం కాంగ్రెస్‌పార్టీ సమావేశంలోనే జరిగి ఉండగా, ప్రణాళిక అమలును హైకోర్టులు 'రిట్'లను జారీచేయటం వంటివే కారణాలని కాంగ్రెస్ భావించటం, పైపెచ్చు రాజ్యాంగానికే సవరణలు ప్రతిపాదించటం చాలా విడ్డూరంగా ఉన్నది.

* * *

ఆంధ్ర ప్రభుత్వం రాష్ట్రంలో ఉన్న 13½ లక్షల ఎకరాల బంజరుభూములను భూమిలేని పేదలకు పంచిపెట్టాలని నిశ్చయించింది. మొదట గుంటూరు జిల్లాలోని గ్రాం పేరు కింద వున్న భూములు పంచబడతవి. మెట్ట అయితే 5 ఎకరాలు, మాగాణి అయితే 2½ ఎకరాలు, కేవలం అనుభవించే హక్కుతో ఇవ్వబడతవి. కేవలం అనుభవించే హక్కును ఇవ్వటమేకాక, నామమాత్రపు దరఖాస్తుదార్లను పెట్టి పెద్దరైతులు భూమిని సంపాదించకుండా కూడా జాగ్రత్త తీసుకోటం అవసరం. అంతేకాక సహకార సాగుబడి పద్ధతినికూడా ప్రవేశపెట్టటం జరిగితే, తర్వాత పట్టాదారీ భూములలో సంస్కరణలు ప్రవేశపెట్టటానికి ఎక్కువ వీలు కలుగుతుంది.

జూన్ నెలలోనే ఆంధ్ర ప్రభుత్వం ప్రాథమిక ఉపాధ్యాయుల జీతాలను పెంచటానికి నిశ్చయించింది. ఇది కుప్పుస్వామి కమిటీ విచారణ ననుసరించి జరుగుతున్నది.

మొత్తానికి ఈ రెండూ ముందడుగు వేస్తున్న చర్యలేనని చెప్పక తప్పదు.

ఆంధ్ర శాసనసభ కిందటి నెలలో మద్యపాన నిషేధంపై రామమూర్తి కమిటీ నివేదిక చర్చించి తగిన చర్యలు తీసు

(తరువాయి 28-వ పేజీలో)

# ఏనీ బెసెంట్

"పితారక్షతి కౌమార్యే భర్తా రక్షతియౌవనే
పుత్రశ్చ స్థవిరేభావే నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి"

అన్నారు పెద్దలు. కాని దీనిలోని నిజానిజాలు మహిళలు నిరూపించుకుంటూ వచ్చారు. ముఖ్యంగా ఏనీ బెసెంట్ జీవితం యీ శ్లోకపు నిరర్థకతను నిరూపించింది. ఏనీకి చిన్ననాడే తండ్రి పోయాడు. తల్లి చాటున పెరిగి పెద్ద దయింది. యౌవనంలోనే భర్త విడిచాడు. పెద్దదయాక కన్న బిడ్డలే దూరం అయారు. వయోవృద్ధురాలయినా స్వేఛ్ఛా పథాన విహరిస్తూ ప్రపంచపు దృష్టినే ఆకర్షించింది ఏనీ బెసెంట్.

మహిళాలోకంలో ఆనాడు చెప్పుకోదగిన ముగ్గురు ఉత్తమోత్తమ మహిళలలోనూ ఏనీ బెసెంట్ ఒకతె అని ఒక మహానుభావుడు అన్నాడు. సాంఘిక సంస్కరణల కోసం పోరాడి తాము నమ్మిన వాటికై పోరిన మహిళలు వీరు. ఏనీ బెసెంట్ వారిలో స్త్రీ పురుషుల కోసం సమానంగా పోరిన వ్యక్తి. ప్రాక్‌దిశా భూభాగంలో కూడ ఆమె గౌరవింపబడి ఆరాధింపబడింది. కాని యీ గౌరవం ఆదరణా సులభంగా వచ్చాయా? అందులోనూ విదేశస్తురాలికి ?— యీ గౌరవ ప్రతిపత్తులకోసం కష్టాలను అనుభవించి కష్టించి పని చేసి వివిధ రంగాలలో మన స్ఫూర్తిగా పని చేసింది; మతం, రాజకీయాలు, సాంఘిక సమస్యలు, స్త్రీల హక్కులు, కూలీనాలీల బాగోగులు — అన్నీ ఆవిడ సమాదరణతో చూసి వాటిలో అభ్యుదయం సాధించడం కోసం పాటు పడింది. అనేక ఉద్యమాలకి నాయకురాలై కోరి కోరి కష్టాలకి స్వాగతం పల్కింది. కాని యీ కష్టాలకి ఆమె ఎప్పుడూ లొంగిపోలేదు. ఈ ప్రపంచంలో ఆమెకి మహా సంతోషాన్ని యిచ్చినది మానవాళి సేవయే.

ఏనీ ఉడ్ (వివాహానికి ముందు ఏనీ బెసెంట్ కన్యానామం) ఒక మధ్య తరగతి కుటుంబంలో, అక్టోబరు 1, 1847 లో జన్మించింది. ముగ్గురు సంతానంలో రెండవది ఏనీ. పసి పాపగా చాలా నీరసస్తురాలయినా చాలా చలాకీ అయినది. ఆనందదాయకం అయిన కుటుంబంలో పెరిగింది. ఈమె వంశవృక్షం పరిశీలించి చూస్తే అసాధారణ వ్యక్తిత్వం గలవారు పెక్కురు లేరు. ఏనీ తండ్రి ఐర్లండు నివాసి. డాక్టరు డిగ్రీ సంపాదించీ ప్రాక్టీసు చేయక వ్యాపారంలో దిగాడు. ఎమిలీ మారిస్ ఏనీ తల్లి. చాలా అందకత్తె. తల్లి తండ్రుల మంచి లక్షణాలన్నీ ఏనీలో మూర్తీభవించాయి. తండ్రి పరిశీలనా జిజ్ఞాసా, వేదాంత ధోరణీ, తల్లియొక్క నవనీత హృదయం గాంభీర్యం ఏనీకి సంక్రమించాయి.

ఈ ఆనందమయ జీవితానికి త్వరలోనే ముగింపు వచ్చేసింది. హఠాత్తుగా తండ్రి రోగపీడితుడయి మరణించాడు. యీ కష్టం తల్లిని చాలా కదిల్చింది. ఒక్క రాత్రిలోనే ఆమె ముసలి దయిపోయిందా అనిపించింది.

మిష్టర్ ఉడ్, ఏనీ తండ్రి మరణం కుటుంబాన్ని ఆర్థిక యిబ్బందులలో వదలింది. అయినా కూడా తల్లి ధైర్యం చేసి హేరో ఇంగ్లీషు పాఠశాలలో తన కుమారుణ్ణి చదివింప నిశ్చయించి, హేరోలో నివాసం ఏర్పరచింది.

ఏనీ చిన్ననాటి నుండీ ఒక కలల కడలి. ఎప్పుడూ ఎక్కడో ఆలోచిస్తూ వింతగా పగటి కలలు కంటూ కాలక్షేపం చేసేది. కనిపించని దేవకన్నెలూ, తన ఆట బొమ్మలూ ఎంతో ప్రాణపదంగా ఎంచుకొనేది.

ఇలాంటి సమయంలోనే ఆమె జీవితంలో మిస్ మార్యట్ ప్రవేశించింది. మిస్ మార్యట్, సుప్రసిద్ధ నవలాకారుడు కాప్టెన్ మార్యట్ సోదరి. ఈమె, ఏనీ తల్లిని కలుసు కొని, ఏనీని తనతో తీసుకు వెళ్ళడానికి

శ్రీమతి కె. రామలక్ష్మి

అనుమతి పొందింది. మిస్ మార్యట్ ఐశ్వర్యవంతురాలు, దయార్ద్రహృదయ.

ఏనీ విద్యాభ్యాసం ఆ కాలపు విద్యాభ్యాసనా పద్ధతులలో జరగలేదు. మిస్ మార్యట్ తన శిష్యురాలికి ప్రత్యేక పద్ధతులలో విద్య గరిపింది. ఏనీ దరిదాపు ఏడు సంవత్సరాలు మిస్ మార్యట్‌తోనే వుండి, కొంతకాలం యూరపులో కూడా వుంది. తరువాత ఏనీ తన తల్లి దగ్గరకి హేరో వచ్చేసింది. పుస్తకాలు - కవిత్వం, వేదాంతం, నవలలు అన్నీకూడా ఎంతో ఏకాగ్రతతో చదివేది. చదివిన కంటే కూడా ఎక్కువగా ఆలోచించేది.

మతంలో ఏనీకి అపరిమితమయిన నమ్మకం కల్గింది. చర్చికోసం తన సర్వస్వాన్నీ ధార పోయాలని కలలు కనేది. అదే దృష్టితో బైబిలు జాగ్రత్తగా చదువ మొదలిడిన ఏనీ వూహలు కృంగిపోయాయి. ఏనీ బైబిలు నిజానిజాలని శంకింప జొచ్చింది. ఇది ఆమెలో అశాంతీ, ఆందోళనా రేకెత్తించింది. కాని ప్రాయశ్చిత్తంగా వుపవశించీ, ప్రార్థించీ కొద్ది రోజులలోనే ఆమె పూర్వపు నమ్మకాన్ని పొందకల్గింది. ఇప్పుడే ఏనీ ఫ్రాంక్ బెసెంటును కలుసుకోడం తటస్థించింది. ఇతను చదువు ముగించి క్రైస్తవ బోధకుడయాడు. ఏనీ ఇతన్ని వివాహం చేసుకో నిశ్చయించింది. దీనికి కారణం ప్రేమా సంసారాభిలాష కాదు. మత బోధకుని వివాహం చేసుకుంటే చర్చికి సేవచేసే అవకాశాలు ఎక్కువ లభించుతాయని ఏనీ నమ్మకం. కాని యీ వివాహానికి ప్రప్రథమం నుంచీ అశుభ సూచనలే కన్పించాయి.



1867 లో ఏనీ, బెసెంటీని వివాహం చేసుకుంది. మొదటి నుండీ యీ వివాహం విజయవంతం కాజాలదని తోస్తూనేవుంది. యిద్దరివీ విభిన్న దృక్పథాలు. ఎవరి ఆలోచనలు వారివి; ఎవరి ఉద్దేశాలు వారివి. ఎవరి నమ్మకాలు వారివి. అలాంటప్పుడు యిద్దరూ కలిసి సంసార రథాన్ని ఎలా నడుపుతారు? అందుకే ఏనీ బెసెంటీ, గ్రంథ పఠనంలోనూ, రచనలోనూ తన విషాద వివాహం సంగతి మరిచిపో యత్నించేది. జీవిత చరిత్రలూ, చిన్న చిన్న కథలూ, ఒక నవలా, ఏనీ యీ కాలంలోనే రచించింది. ఆమె తన రచనలకి ప్రతిఫలం అందుకున్నప్పుడు అపరిమితంగా గర్వించింది.

ఆమెకి పుత్రోదయం కల్గింది. దానితోపాటు ఆమె ఆరోగ్యం చెడింది. మళ్ళీ యింకో పద్ధెనిమిది మాసాల్లో యింకో కాన్పు. ఈ పిల్లలని చూసుకుంటూ ఆమె కాలక్షేపం చేసేది. కాని, ఆమె మనస్సుని బాధించే విషయాలు చాలా ఉన్నాయి. డబ్బు లేక తన తల్లి పడే కష్టాలూ, తన బిడ్డ అనారోగ్యం ఆమెని కలత పెట్టాయి. అలాంటి సమయాల్లో ఆత్మహత్య చేసుకుందామన్నంత ఉద్వేగం కల్గేది. కాలవశాత్తూ ఏనీ బెసెంటుకి చర్చిమీద నమ్మకం సడలి చర్చినీ, క్రైస్తవ మత నమ్మకాలనీ శంకిస్తూ ఆమె ఒక గ్రంథం వ్రాసింది. అటువంటి భార్యతో ఉంటే చర్చిలో నీ స్థానానికే ముప్పు వస్తుందని స్నేహితులు సలహాలు యివ్వడం చేత, మొదట వెనకాడినా చివరకు తన భార్యనుంచి వేరు పడడానికే నిశ్చయించు కొన్నాడు ఫ్రాంక్ బెసెంట్. భర్తనుండి విడి వడి, ఏనీ బెసెంట్, తనకుమార్తెతో కూడా లండన్ వెళ్ళింది. డబ్బు యిబ్బందులు పడలేక, తన కుమార్తెని కాన్వె కుటుంబంతో వుండనీయమని కోరగానే, వారితో వుంచింది.

ఇంతటిలో ఏనీ బెసెంట్ జీవితంలో ఒక అధ్యాయం ముగిసింది. ఇక ఆమెకి కుటుంబ జీవితం అనేది లేదు. స్వాతంత్ర్య జీవితానికి నాంది పలికింది అందుకే. తల్లి కూడా యీ సమయంలో కన్నుమూసింది. ఇలా ఏకాకిగా వుంటున్నప్పుడే చార్లెస్ బ్రాడ్‌లాని కలుసు కొంది. ఏనీ లాగే చార్లెస్‌కి గూడా, క్రిష్టియను మతంలో నమ్మకం లేదు. అందుకే వీరిద్దరికీ స్నేహం కలిసింది. అతనితో చేరి **The Natioal Reformer** అనే పత్రికలో చాలా వ్యాసాలు వ్రాసేది.

జీవితంలో అనేక కష్ట సుఖాలని, నష్టాలనీ ఎదుర్కొన్న ఏనీ బెసెంట్‌కి గుండె ధైర్యం, స్వశక్తిలో నమ్మకం వెన్నతో పెట్టిన విద్య. దేశంలో బీద జనానీకానికి చేదోడు వాదోడుగా వుంటూ, మంచి వక్తగా కూడా పేరు గాంచింది. సోషలిస్టు సిద్ధాంతాలలో నమ్మకం కలిగి తాను ఆ సిద్ధాంతాలు స్వీకరించింది. ఇదే సమయంలో ఆమె స్నేహితుడు W. T. Stead పంపిన ఒకగ్రంథం మేడం బ్లావస్కీ రచించినది చదవడం తటస్థించింది. మేడం బ్లావస్కీ థియొసాఫికల్ సొసైటీ ప్రెసిడెంటు. ఏనీ బెసెంట్ ఆమెని కలుసుకొని మాట్లాడింది. తత్ఫలితంగా ఏనీ బెసెంట్ థియోసఫిస్ట్‌గా మారి పోయింది. 1890 లో ఏనీ బెసెంట్ పిల్లలు కూడా సొసైటీలో చేరారు.

1891 లో న్యూయార్కులో జరిగిన థియొసాఫికల్ సొసైటీ సమావేశంలో పాల్గొనడానికి ఏనీ బెసెంట్ అమెరికా వెళ్ళింది. చాలా ఉపన్యాసాలు యిచ్చింది. ఆమె ఇంగ్లాండులో లేని సమయంలోనే సొసైటీ అధ్యక్షురాలు మేడం బ్లావస్కీ మరణించింది. అప్పట్లో ఏనీ బెసెంట్ తూర్పు దేశాలలోని థియొసాఫికల్ సొసైటీలకి అధిపతిగా నియమించారు.

అమెరికా యూరపు దేశాలు పర్యటించి, అనేక చోట్ల ఉపన్యాసాలిచ్చి, తుదకు Colonel Oleott మరణానంతరం ఏనీ బెసెంట్ థియొసోఫికల్ సొసైటీ ప్రెసిడెంటు అయింది. 1893 లో ప్రప్రథమంగా హిందూ దేశం విచ్చేసింది. హిందూ దేశం "పవిత్ర స్థానం" అని ఏనీ బెసెంట్ నమ్మకం. హిందువులు ఆమె అవతార స్వరూపి అన్నారు. స్త్రీలు ఆమెని 'అన్నాబాయ్' అనేవారు. కొంత కాలంపాటు దేశం అంతా చూసి, కాశీలో నివాసం ఏర్పరచుకొంది. హిందూమత తత్వాన్ని గురించి తెలుసుకోతలచిన ఏనీ బెసెంట్‌కి యింతకంటె మంచి స్థలం యింకోటేముంది ?

ఈ దేశంలో తొలుత మతైకంగానూ, తరువాత, విద్యారంగంలో, సాంఘిక విషయాలలో, చివరకు రాజకీయాలలో కూడా ఆమె కృషి చేసింది. 1898 లో కాశీలో Central Hindu College ని స్థాపించింది. దీనిని యూనివర్శిటీగా రూపొందించాలని ఆమె ఉద్దేశ్యం. ఆమె చేయలేకపోయింది. కాని తరువాత అదే 'Benares Hindu University' గా రూపొందింది. 1904 లో Central Hindu Girls School ప్రారంభించింది. బెనారెస్ యూనివర్శిటీవారు, యీమెకు గౌరవ చిహ్నంగా Doctor of Letters బిరుదాన్ని యిచ్చింది.

అస్పృశ్యతా నివారణకై మనదేశంలో అపారంగా పాటు పడిన వ్యక్తులలో ఏనీ బెసెంట్ ఒకతె. హరిజన బాల బాలికల కొరకు అనేక బడులు స్థాపించింది.

తను తలపెట్టిన కార్యాలు జయప్రదంగా కొనసాగాలంటే రాజకీయంగా కొన్ని హక్కులు అవసరం అని తెలుసుకొని స్వరాజ్య పోరాటానికి చేయూత నీయ నిశ్చయించింది. Home Rule Legue ని స్థాపించి, పత్రికలద్వారా, ఉపన్యాసాలద్వారా, స్వరాజ్య నినాదాలని ప్రజలలోకి పాకించింది. ఈమె స్థాపించిన The New India అనే పత్రిక స్వరాజ్య నినాదాలకి ఆటపట్టు' ప్రభుత్వం ముందు యీమెని నిర్బంధంలో ఉంచి చూశారు' కాని స్వరాజ్య నినాదం అప్పటికే ఎల్ల ఎడలా వ్యాపించడం మూలాన్ని ఆమెకి స్వేచ్ఛ నిచ్చింది. కలకత్తా ఇండియన్ నేషనల్ కాంగ్రెసుకి యీమె అధ్యక్షురాలుగా ఎన్నుకోబడింది. ఎలాగైతేనేం దేశానికి స్వరాజ్యం వచ్చింది, మాంటెగూ సంస్కరణలు వచ్చాయి. ఎంతచేసినా యీమె కాంగ్రెసు నాయకుల భావాలతో ఏకీభవింప లేక పోయింది.

తన ఎనభయి ఏడవ సంవత్సరందాకా దేశం కోసం, సామాన్యుని సౌఖ్యం కోసం, తా నమ్మిన లక్ష్యాల సిద్ధి కోసం, థియొసాఫికల్ సంస్థ విజయం కోసం పాటు పడ్డ యీమె 1933 లో మద్రాసులోని అడయారులో శాశ్వతంగా కన్ను మూసింది. ఆమె జీవితం ఎంత తుఫాను మయంగా గడిచిందో, తుది ఘడియలు అంత ప్రశాంతగా గడిచిపోయాయి.

సామాన్య కుటుంబంలో పుట్టి, ధైర్యంగా జీవితపు కష్టసుఖాలని ఎదుర్కొని వన్నెకెక్కిన ఏ కొద్దిమంది మానవులలోనో, ఏనీ బెసెంట్ ఒకతే. నారీ అబల అంటారు కొందరు. అది శుద్ధ బూటకం అని నిరూపించింది ఏనీ బెసెంట్. 'నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి' ఏమిటి ? స్వాతంత్ర్యం జన్మహక్కు. అది ఎవరూ యిచ్చేది కాదు. దాన్ని నీవు సరియైన పంథాలో ఉపయోగించుకుని రాణించు : అన్నదే ఏనీ బెసెంట్ జీవితం నేర్పే పాఠం. వెనుకాడే స్త్రీ జనానికి యీమె జీవితం ఆదర్శం లక్ష్యం కావాలి.



రూపకం

# చుట్టాలు-పక్కాలు

శ్రీ కవికొండల వేంకటరావు.

## ఇందు వచ్చు పాత్రలు

| | | | |
|---|---|---|---|
| శాంతమ్మ | — అట్లనోము నోచుకొను స్త్రీ. | శివనారాయణ | — కుముద్వతి భర్త. |
| ఇల్లాలు | — సింహాద్రిరావు భార్య. | మిస్ కర్ణికార మహాలక్ష్మిశ్ | విందుకు వచ్చినవారు |
| సింహాద్రిరావు | — ఒక గృహస్థు. | కంజర్ | విందుకు వచ్చినవారు |
| కుముద్వతి | — గృహస్థు బంధువురాలు. | మిసెస్ మంజర్ | విందుకు వచ్చినవారు |
| సంగమయ్య | — శాంతమ్మ భర్త. | పిల్లలు | — సింహాద్రిరావు పిల్లలు. |

---

## మొదటి రంగం

[సింహాద్రిరావు ఇల్లు - ఇంటి సావడిలో దీపాలవేళ - పిల్లలు ఆడవాళ్ళు గందరగోళముగా వుంటారు. లోపల ఇల్లాలు పూరోత్రపు ముసిలిముత్తైదువు వండుతూ వుంటుంది. ఆ సందట్లో "శాంతమ్మ" అనే 40 ఏళ్ళ ఆవిడ బొట్టు పెట్టి పిలవడానికి వస్తుంది.

శాంతమ్మ : మీ అమ్మగారెక్కడున్నారేమిటి?

కూతురు : అమ్మా! పిలుస్తున్నారే శాంతమ్మ పిన్నిగారు. బొట్టెట్టించుకు వెళ్ళు!

ఇల్లాలు : (వస్తూ) అక్కయ్యగారు ఇలా వచ్చారు! ఏమిటి విశేషం?- కూర్చుంటాగు పీటవెయ్యవే అమ్మాయి!

శాం : కూర్చోడానికి సావకాశం లేదు తల్లీ! వెళ్ళాలి! ఇంకా మూడిళ్ళు పిలిచేవి ఉన్నాయి. [అంటూనే కూర్చుంటుంది]

ఇ : కూర్చోండి కాస్సేపు. ఇంతకూ విశేషం చెప్పారు కాదు.

శాం : విశేషాలేమున్నాయి? రేపు అట్ల నోము మాయింట్లో! మీరు మీ పిల్లలు అందఱూ కూడా వచ్చి చెల్లించాలి! మీ కోడలెక్కడున్నారు?

ఇ : అదిగో! దిగి వస్తూవుంది మేడ!

శాం : అమ్మాయీ! నీవుకూడా తప్పకుండా రావాలి!

(కోడలు మౌనంగా తలూపుతుంది)

బొట్టుంచుకో! [బొట్టుంచును]

ఇ : ఆవిడ వెడుతూన్నట్టున్నారు. బొట్టుంచారాలేదా ఆవిడకు? నాది మడిబట్ట తడిచేయాని.

కూ : ఉండండి! పిన్నిగారు! బొట్టుంచుకు మఱీ వెళ్ళండి.

శాం : మావన్నీ పూర్వకాలపు మర్యాదలు పూర్వకాలపు పిలుపులూను.

ఇ : మర్యాదలకన్న పూర్వకాలం మమకారాలు హెచ్చు.

కూ : అయినా ఆ కాలంలో నోములకూ వ్రతాలకు అందఱూ రావాలని, అందఱూ తినాలని, అందఱూ ఒక చోట కలవాలని కోరుకునేవారు. ఇప్పుడేముంది? ఎంతసేపు ఏకోనారాయణా లింగూలిటుకూ!

శాం : ఏమండోయి! మీ అమ్మాయి చిన్న పిల్లయినా అన్నీ ఎఱిగిన పిల్ల!- అదిగో గుమ్మంలో ఎవరిదో కారు బంయిమంది. మీ యింటికే వచ్చారు కాబోలు- నే వెడుతున్నాను.

ఇ : వారొస్తే మీరుండకూడదా?

శాం : ఉండడానికేం? ఎవరు వచ్చినా మనం వుండొచ్చు. వండొచ్చు, మనకు వంట్లో జవసత్తువలుండి వంట పొయ్యి విడిచి పెట్టకుండా పడివున్నన్నాళ్ళూ ఎవ్వరూ పొమ్మనరు— ఏవరో - వారు మీ చుట్టాలులాగున్నారు: చాలా స్వేచ్ఛగా జోళ్ళతో కూడా లోపలకు వచ్చేస్తున్నారు - నేనుంటాను.

(నిష్క్రమించును)

ఇ : వారు శాంతమ్మగారని ఆ వీధిని మేం వున్నప్పుడు స్నేహం కలిసిన ఆవిడ— [కొత్తగా వచ్చిన "కుముద్వతి"తో అంటుంది]

కుముద్వతి : ఆలాగా! వదినెగారూ! రేపు మాయింట్లో మా చంటివానికి అన్నప్రాశనం చేసుకుంటున్నాం! దానికి మీ యింట్లో పిల్లల్ని పంపించాలి!

ఇ : పిల్లలన్నమాటేం? పెద్దలమే వస్తాం! ఏం రా కూడదా?

కు : మఱి 'టైము' లేదు జవాబు చెప్పడానికి. ఏమో అదేతీరున పిలవాలనుకున్నాం! ఆలాగే పిలుస్తున్నాం! ఆ పిలుపైనా కొంతమంది బంధువులకు మాత్రమే అందిస్తున్నాం! అసలు ఆ పిల్లకాయే పిలవవలసిందికాని, వానికి మాట లింకా రాక పోవడం వల్ల తల్లినైన నేను వాని తరపున పిలుస్తున్నాను. ఇప్పటికే రెండు నిమిషాల టైము "వేస్ట్" అయింది.— చాపదులపలేదు. ఆపె ఎవరో బాడి చేసి వెళ్ళినట్టున్నారు. కడిగించి వేయండి. జోడూ గీడూ లేకుండా ఏలా నడుస్తారో ఈ ఆడవాళ్ళు! మళ్ళీ వాళ్ళ పాదాలు అతిమెత్తనా మహామృదువూ అంటారు!

ఇ : జోళ్ళు తొడుక్కున్న వాళ్ళ జోళ్ళకు కాళ్ళకూ కూడా బాడంటుకు పేడ అవుతుంది ఈ వూళ్ళో!- ఇంతకూ కూర్చోరు, అన్నమాట తమరు! చెప్పుల్లో కాళ్ళెట్టుకు ఆలాగే నిలుచుంటారన్నమాట!

కు : కూర్చోడానికి - అబ్బా - సావకాశం లేదండి వదినెగారూ! క్షమించాలి! రేపు "టీ" కూడా సాయంత్రం "ఫ్రెండ్సు"కు నేను మావారు ఏర్పాటు చేసుకున్నాం! ఈ పిల్లల గందరగోళం పొద్దున్న పెట్టుకున్నాం!

ఇ : ఇంతకూ అన్నం పెద్దవాళ్ళు ముట్టిస్తారా? పిల్లవాళ్ళు ముట్టిస్తారా? ఆశీర్వదించడం పెద్దవాళ్ళా పిన్నవాళ్ళా?

కు : అవన్నీ నాకు తెలియవు. 'కారు' బయిలుదేరుతుంది వెళ్ళొస్తా!

కూ : బొట్టుంచుకెళ్ళండి. ఎంతకైనా అత్తయ్యాలు మాకు!.

కు : నేనుంచానా బొట్టు?

కూ : మీరు పిల్లల్ని పిలచేరుకాబట్టి ఎవరికి వుంచుతారు?

కు : అంటే మీ పిల్లలకుంచమనా?

కూ : పిల్లలకుంచితే మాత్రం వుంచుకుంటారా? పేరంటానికీ "టీ"కి ప్రత్యేకించి వాళ్ళు రాగలరా? వస్తారా? మూడేళ్ళ పిల్లలు అయిదేళ్ళ పిల్లలు— ఉచ్చోస్తారు - నిద్దరంటారు - నీళ్ళంటారు - ఏడుస్తారు. సముదాయించడానికి కూడా మఱో ఆయా రావాలి. మఱో బండి కావాలి. రాలేమని పిల్లలు చెప్పాలేరు. రానూలేరు. ఏదో బంధురూపేణా ఒక పర్యాయం ఇలా రావాలని వచ్చారు: అదే పదివేలుమాకు. ఈ చిన్న బొట్టుంచుకు వెళ్ళండి. ఎంతైనా మనం మనం చుట్టాలం, పక్కాలం— [అప్పటికప్పుడే కుముద్వతి నిష్క్రమించును]

ఇ : ఆమె అప్పుడే కాఱెక్కి వెళ్ళనే వెళ్ళింది. ఇంకా ఎవరికే ఇయ్యడం నీ 'పెక్చరు'?- మర్యాద అంటే శాంతమ్మగారిదే మర్యాద! ఆర్యాసత్యమంటే ఆమె వున్నదే ఆర్యావర్తము!- నాన్నగారింటికి రావడంతోటే శాంతమ్మగారింట్లో అట్లనోము అని చెప్పండర్రా పిల్లలు!

పిల్లలు : అమ్మా! మేం నీతోటి అట్లనోముకే వస్తాం! అట్లే తింటాం!

ఇ : ఏమో! నాకు తెలియదు. నన్ను మాత్రం ముట్టుకుని మడితగలబెట్టకండి. నాన్నగారొచ్చాక పంపు

పిలుపుల సంగతి చెప్పి, ఆయన మిమ్మల్ని ఎక్కడికి పంపిస్తే అక్కడకు వెళ్ళండి._ రేపు మధ్యాహ్నం 'టీపార్టీ' పిలుపు ఆయనకు వుండేవుంటుంది._ అరుగో వచ్చేరు ఆయనాను ఏదో కార్డు చేత పుచ్చుకుని _

సింహాద్రిరావు : (ప్రవేశిస్తూ) ఏమేవ్ ! మేలైన యిల్లాలా! రేపు సాయంత్రం మావాళ్ళ యింట్లో 'టీపార్టీ!' నన్నొక్కణ్ణే పిల్చినట్టు తోస్తుంది, కార్డు మీది ఎడ్రెస్సునుబట్టి. అవితే మీ మఱదలు పిల్ల ఇలా వచ్చినట్టువుంది కారుమీద ! నిన్ను ఏమైనా సన్న సన్నంగా ఆహ్వానించిందా ఏమి ?

ఇ : నన్నెవ్వరూ అలాంటివాటికి పిలవరు. నాకు అలాంటి కషాయపు 'పార్టీ'లు పడనూపడవు. ఆ అమ్మాయినసలు కాస్సేపు కూర్చోమంటేనే కూర్చో లేకపోయింది. అదేంనిక్కో ?

సిం : పోనీ మనకు పోయింది ఏమిటి ?

ఇ : మీకెప్పుడూ ఏమీ పోదు. ఏం పాలిపోకపోయినా నాకే! ఇప్పుడీ పిల్లల్ని పిలిచి వెళ్ళింది. పిల్లల్తో వెళ్ళేవాళ్ళు మీరా నేనా ? పోనీ అని 'టీపార్టీ' కార్డులో పిల్లల్నికూడా చేర్చారా ?

సిం : నీవు వేదకాలపునాటి మనిషివని వీళ్ళ ఊహ.

ఇ : మీరు ?

సిం : నేను 'అప్ టు డేట్ అమెరికన్ యువాన్''ను అని.

ఇ : ఆ పద్ధతినైతే మీరు నాకంటె చిన్నలు అన్నమాట.

సిం : చిన్న వేమిటి ? పదహారేళ్ళ బాలా కుమారుణ్ణి !__ ఇంతకూ పిలుపులన్నవి నేటికాలంలో లాంఛనాలై పోయినాయి. అందులోను బంధువులు బంధువుల్ని పిలిచేటప్పుడుండా, ఎంత తక్కువ మంది వెడితే అంతమంచిది. వాళ్ళకూ మంచిదే వీళ్ళకూ మంచిదే !

ఇ : అందఱకూ మంచిదే ఏమీ చేసుకోకపోతే !_ అది కాదండీ! పిల్లల్ని మాత్రమే కొందఱు కొందఱు పిలుస్తూంటారు, పిల్లలు వెళ్ళి ఏం చేస్తారండీ! దీవిస్తారా ? దీపం తిప్పుతారా ?_ ఏదో పిల్చాం వారిని పిల్చాం, వీరిని పిల్చాం ఈ ఇరవై యిళ్ళు లెక్క చెప్పుకోవడానికి పనికి వస్తుంది. అంతే.

సిం : అదికాదు. నీవు కొంచం తమాయించి మాట్లాడ్డం నేర్చుకోవాలి ! ఇప్పుడు ప్రతీ నిత్యం కాఫీ తాగుతూ, ప్రతీ కాఫీ హోటల్లోనూ టిఫిన్ కొట్టే ఈ రోజుల్లో టీపార్టీలకు పిలవడమన్నా వెళ్ళడమన్నా అదో ఎటికెట్టు !

ఇ : అటువంటప్పుడు టికెట్లు కొనుక్కోమంటే మెఱుగు. నిజంగా శాంతమ్మగారున్నప్పుడు మీరే వుండివుంటే మిమ్మల్నికూడా అట్లు చెల్లించడానికి పిల్చి వుండే వారు. ఆవిడంత మంచివారు !

సిం : నన్ను పిలిస్తే ఒకట్లనోము చాలదని పిలవలేదు.

ఇ : పిలవకపోయినా వెళ్ళొచ్చుండీ పూర్వకాలం నోములకు వ్రతాలకు, పూర్వకాలం పెళ్ళిళ్ళకు కార్యాలకు._ మా అమ్మగారెలనోము, అట్లనోము, అప్పాలనోము చేసి అందుకుతగ్గ పచ్చడో, తిమ్మనమో, బెల్లమో పుల్లని పెరుగో వేస్తూవుంటే, ఆరిళ్ళ అవలివాళ్లకు నోరూరి వారంతట వారొచ్చి అసురసంధ్యకాకుండా చెల్లించేసేవారు. ఆ రోజుల్లో కార్యాలన్నా కమామీషులన్నా కాకిచేత కబురంపితే ఎంతమంది ఆ కబురువింటే అంతమందీ రావలసిందే.

సిం : అవితే నన్నుకూడా కుముద్వతి దంపతులు ఇచ్చే ''టీపార్టీ''కి వెళ్లడం మానేసి, శాంతమ్మగారి అట్ల నోమే చెల్లించ మంటావు ?

ఇ : నేననేదేమిటి ? అరుగో ! శాంతమ్మగారి పెనిమిటి సంగమయ్యగారే వచ్చేరు. [సంగమయ్య ప్రవేశించును]

సిం : ఏమిటోయి సంగమయ్యా ! ఇలావచ్చావు?

సం : రేపు మా ఆవిడ అట్లనోము తలపెట్టింది. నీవు వచ్చి చెల్లించాలి.

సం : తప్పకుండా !

సం : మఱి సాయంకాలం నాలుగు గంటలకి సరిగ్గా రావాలి

సిం : ఏమిటా వేళావిశేషం ?

సిం : అబ్బే ! అప్పటికి తెలుస్తుంది మనపాల ఎన్ని అట్లు పడగలవో ! చీకటి పడింది ! సెలవు. (నిష్క్రమించును)

సిం : అయితే ఒకటి చేస్తాను. ఇక్కడ ఒక అట్టే అయితే అక్కడ 'టీపార్టీ' 'సప్లిమెంటరీ' వ్యవహారంగా నడుపుతా ! ఇక్కడ దొంతర దొంతరలుగా అట్లు పడితే అక్కడకు వెళ్ళనే వెళ్ళను !

ఇ : వెళ్ళకపోతే మీ వాళ్ళు మిమ్మల్ని ఈ వూళ్ళో నిలవ నిస్తారా?

సిం : వాళ్లు మనల్ని నిలవ నిచ్చేదేమిటి ? వాళ్ళంత వాళ్లు వాళ్లు, మనంతవాళ్ళం మనం. ఇంతకూ ఊళ్ళో వాళ్లంతా మనవాళ్ళే అని అనిపిస్తుంది ఒక్కొక్కప్పుడు నాకు !

ఇ : శాంతమ్మగారి నోములులాంటి నోములు చూచినపుడు.

సిం : ఆఁ ఆఁ— అందియ్యి అంగోస్త్రం పట్టు పంచె. పాద్యం నైద్యం ముందు పెట్టు – పిల్లలూ రాండర్రా ! అమ్మాయి ! నీవు మాతో వస్తావా ? అమ్మతో తింటావా ? కోడల్ని కనుక్కో ; పెద్దబ్బాయి వచ్చే సరికి ఈ వేళ రేత్రి తొమ్మిదిన్నర అయ్యేటట్టుంది : ఏదో సినిమాకు వెళ్తానన్నాడు.

## రెండవ రంగము

(కుముద్వతి గారింట 'టీపార్టీ' అనంతరం)

[ప్రవేశము సింహాద్రిరావు, శివన్నారాయణ]

శివ : ఇప్పుడు వచ్చావేమిటి ? అంతా అయిపోయాక బావా !

సిం : కేవలం బంధు దర్శనంచేసి పోవడానికి వచ్చాను. ఈవేళ బహు ఉదాత్తమైన ఫలహారం మరోచోట తీసికోవలసి వచ్చింది. అది తెమిలి ఇవలపడేసరికి ఈవేళ అయింది.

శివ : అయినా ఎప్పుడో వొకప్పుడు వచ్చావు : అందుకోసం సంతోషిస్తూ వున్నాను.

సిం : అలా ఎప్పుడో వొకప్పుడు సంతోషించడమనేదే మన స్తత్వం అయివుంటే మా ఆవిణ్ణికూడా వెంటేసుకువచ్చేదే ? ఆమెతో 'టీపార్టీ' ఈపాటికి అయిపోయివుంటుంది, మనం వెళ్ళొచ్చు అన్నా వినదాయె.

శివ : అవును మఱచిపోయాను ! అక్కయ్యను తీసుకు వచ్చావుకాదేమిటి ?

సిం : 'కార్డు'లో ఆమె పేరు వ్రాయలేదట !

శివ : వ్రాసేదేమిటి ? మనమూ మనమూ బంధుకోటిలోని వారం. ఎప్పుడు వస్తే ఎవరు వద్దనేవారు ?

సిం : అయితే పిల్లకాయలు ?

శివ : వాళ్ళాను ! ఉదయం వాళ్లూ రాలేదు.

సిం : వాళ్లకు బంధువులెవరో, కాని వాళ్లెవ్వరో తెలిస్తేగా రావడానికి ?

శివ : కొద్దిగా 'టీ' తీసికో !

సిం : చూడు ! పీకమొయ్యా అట్లు, తెప్పానాం తేలానాం, పొట్టలో తేనె మీద తేలి ఆడుతున్నాయి ! శాంతమ్మగారని ఒక ఆవిడ మా అవతల వీథిని ఈ వేళ నోము చేసుకుని నన్ను మా ఆవిణ్ణి మా పిల్లల్ని మా కోడల్ని ఇంకా చెప్పాలంటే ఆ పేటలో వున్న అయిదువేల మందీనీ పిల్చారు. అందఱూ నిజంగా వచ్చివుంటే అయిదు పందల నోములైనా చాలక పోయేది. అదేం పెట్టిపిలుపో ఒకటే పిలవడం పిలిచేసింది.

శివ : అయితే నోము చెల్లిపోయింది అంటే ఎవరింటికి వారు వెనక్కు వెళ్లిపోతారనుకుంటాను.

సిం : టీపార్టీలకు అంతేగా ! ఆలస్యంగా వచ్చాగంటే పరాయివాళ్లు నెత్తిని గుద్దేసుకు పోవలసిందేగా !

శివ : అయితే బంధువునని ఉండిపోదలచుకున్నావా రాత్రి భోజనానికి ?

సిం : అందాకావుంటే ఆలోచించొచ్చుగాని — అదేవో మద్దెలమీద ధ్వని అవుతోంది !

శివ : అదా ? టీపార్టీ అనంతరం పైమేడమీద ఒక 'డ్యాన్సు', ఒక 'డ్రామా', మనోరంజకమైన ఒక

కార్యకలాపం ఏర్పాటు చేశాం! దాని ఉపోద్ఘాతధ్వని అది!

సిం : ఈపైదంతా స్నేహితుల పార్టీ కాబోసు!

శివ : ఆలాగే చెప్పొచ్చు నిన్నొక్కణ్ణి తప్పిస్తే.

సిం : అవితే సాయంకాలానికి పిలవబడ్డవాళ్లల్లో బంధువుణ్ణి నేనొక్కణ్ణే అన్నమాట.

శివ : నీవే అన్నమాటేమిటిలే! - కర్ణికారమహాలక్ష్మమ్మాళ్ గారొకరున్నారు : మిసెస్ గోవిందమాధురి, విడో ఒకామె ఉన్నారు. అబ్దుల్ హుస్సేన్ దంపతులు వచ్చారు. మావేలువిడిచిన పెదమామగారి వియ్యపురాలు 'మార్నింగు గ్లోరిణీ' గారున్నారు.

సిం : వీరందఱూ మనబంధువులే? ఎప్పుడూ వినలేదు ఈ పేళ్ళు. వీరంతా ఈవూరివాళ్లే? ముందుగా నీవు వుత్తరాలు వ్రాస్తే వచ్చారా? అందఱూ కూడబలుక్కు ఒకే రోజు కిటతారసిల్లారా? పేర్లు వినవస్తే నవ్యాతినవ్యతమంగా వున్నాయి. అందఱూ ఆడ బంధువులేనా మగ బందువులు కూడా పైనున్నారా?

శివ : వారినీ కొందర్ని పిలిచారు. అసలు కంపెనీగా మనకు అసరా అయ్యేవాళ్లు కమీషను ఏజెంట్లు, కంజర్ మంజర్ అండ్ కో ప్రొప్రయిటర్సు: వారిని మీకందఱకూ ఎఱుక పరుద్దామని నాకు కుతూహలం!

సిం : అంటే వాళ్ళు 'కల్చరల్ పీడిలా'? 'కమెర్షియల్ పీడిలా'?

శివ : 'బోత్'. రెండూను! వర్తకంలో సంస్కృతీ సంస్కృతిలో వర్తకం చూపించగలరు.

సిం : ఆఁ! (పైని గజ్జెల చప్పుడగును)

శివ : గజ్జెల చప్పుడౌతూన్నట్టుంది. 'డ్యాన్సు' 'బిగి'నయివుంటుంది. వస్తావా నీవు?

సిం : నడువు! ఎదో కార్యక్రమంలో లేని కార్యక్రమం లాగుంది ఇదంతా!

## మూడవ రంగము

[మేడమీద గ్రామోఫోను ప్లేట్లు - డ్యాన్సు - మద్దెల చప్పుడు ఎదర అవుతూంటే ప్రేక్షక లోకం చూచిన ఈ వెనుక సంభాషణ - మెట్లవద్ద.]

శివ : మిస్ కర్ణికార మహాలక్ష్మమ్మాళ్ గారీమె! వీరు సింహాద్రిరావుగారు అని మా బావవుతారు.

మిస్ కర్ణికార : మీకు బావగారవితే మాకు అన్నగారన్నమాట. ఏదండీ! షేక్ హేండ్!

సిం : నమస్తే [అని కరచాలడానికి బదులు అంజలి పట్టును] (మిస్ కర్ణి-నిష్క్రమణ)

శివ : ఏమిటి బావా! ఆలా వెనక్కు తీసేసుకున్నావు చేయిని.

సిం : ఆమెను ఇదివఱలో ఎఱుగుదునోయి! మా పెద్దన్నయ్యగారి పెద్దబ్బాయిని వరించిన జెకోస్లావికయన్ లేడీ అప్పటికీ ఇప్పటికీ పెళ్లికాక ఈ దేశంలో మిస్ కర్ణికారమహాలక్ష్మమ్మాళ్ గారని చెలామణీ అవుతోంది. మా ఆవిడతో తనకూ మనకూ వున్న చుట్టరికం రోజూ వెళ్లబోసుకుంటూనేం వుంటుంది.

శివ : ఆలాంటప్పుడు అక్కయ్యను కూడా నేటి వినోదానికి పిలిచియుండవలసినది - అవితే ఆమె ఈవిణ్ణి ఏటికెగివున్నదన్నమాటే! ఈవిదేశపుటాడవాళ్లూ ఆలాగవితే 'హైసర్కిల్సు'లోనూ 'లోసర్కిల్సు' లోనూ కూడా 'మూవ్' అవుతూవుంటారన్నమాటే!

సిం : 'హైసర్కి' లెవరు? 'లోసర్కి' లెవరు?

శివ : క్షమించాలి! అన్ని 'సర్కిల్సూ' ఒకటే అని యిప్పుడు నాకు తోస్తూవుంది - ఆ 'డ్యాన్సు' చేసిన అమ్మాయి ఎవరో తెలుసునా?

సిం : తెలియకేం? అట్లనోము నేడు చేసిన శాంతమ్మగారి ఆడబిడ్డకు పినమామగారి ఆఖరు కూతురు. పాపం 'విడో' కాకముందు అస్తమానం నాముందే వుండేది! ఆమె పేరేకాదు అన్నావు? మిసెస్ గోవిందమాధురి అని.

శివ : మరేం మిసెస్ గోవిందమాధురి. ఆ అమ్మాయిని పెళ్ళాడింది మా వసతి తప్పగారి మేనల్లుడు గోవింద దాసు అనే అతను. వాళ్ళిద్దరూ స్నేహం పంజాబ్ లో 'వార్ సర్వీసు' చేస్తుండగా అయి ప్రాణస్నేహితులై ఒకరినుండి ఒకర్ని ఎడబాయలేనంతగా ఒకే ప్రాణం విధాన నడిచారట !

సిం : ఆc! — శివా లా 'డ్యాన్సు' చేయలేదే !

శివ : అదే ఆమెలోనున్న కళాకౌశల్యం. — గుడ్ నైట్ బావగారూ !

సిం : వారంతా ఇంకా వున్నారే ?

శివ : అందులో కొందరుండిపోతారు మాతోపాటు 'డిన్నర్'లో పాల్గొనడానికి ; మిగతా కొందరు సినిమాలకు వెళతారులాగుంది.

సిం : గుడ్ నైట్ ! —అవితే "మార్నింగ గ్లోరిణీ" అన్న ఆవిడ మన కేసాతుందో చెప్పావు కాదు.

శివ : ఆమె మనకు 'నెక్స్టుకసిన్' దరిదాపుదాయ.

సిం : అంటే చెప్పరాని ఆవిడన్నమాట ?

శివ : చూడు బావా ! మఱి మిగతా మన సంభాషణ, వేళా కోళం రేపు ! గుడ్ నైట్ !— వెడుతున్నారా కంజర్ గారూ !

కంజర్ : ఇందాకట్నుంచి ఇక్కడనే వున్నారా. సింహాద్రిరావు గారూ ! మిమ్మల్ని చూసింది లేదు! ఇంటికి వెడుతున్నారా ? మా 'కార్లో' రండి. అప్పుడే మిసెస్ మంజర్ చూస్తుంది అందులో— ఆమె మీ ఆవిణ్ణి చూడాలో అంటూవుంది. మనకూ మనకూ మధ్యలేకం లేకపోయినా అనేకంటే పెద్ద పెట్టు గా ఆవిడా మా ఆవిడా వేసికొనే పెట్టా పట్టు. అసలు ఆమె ఇక్కడకు వస్తానే ఈమె కూడా ఇక్కడకు వచ్చింది.

సిం : గుడ్ నైట్ ! శివనారాయణ్ !— ఆమె ఈ సాయంత్రం శాంతమ్మగారి అట్ల నోముకు వెళ్ళింది.

కం : ఏమిటి? అట్లనోము అంటే ?

సిం : అది అందరూ పాల్గొనే ఉపహారపు విందు. దానికి పిలుపక్కర్లేదు.

కం : ఒలేగా వుంటాయే మీ స్నేహాలు మీ బంధుత్వాలూను. గుడ్ నైట్ శివనారాయణ్ !

మిసెస్ మంజర్ : [కార్లోంచే] గుడ్ నైట్.

శివ : గుడ్ నైట్.

సిం : [కార్లోంచి] గుడ్ నైట్ ! [కారు బయలు దేరుతుంది]




# అమృతాంజనము

గాని,

" యధాయధా................కాళీధవళత్వ శంకయా."

అమృతాంజనమా ! నీ కీర్తి ముల్లోకములను దెల్పుజేయు పూనికతో పెరుఁగు చున్నప్పుడెల్లను నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!

# ఆంధ్ర రక్తం

సీ॥ పరమ పతివ్రత, పడతి మల్లమదేవి
ఏతల్లి గర్భాన నిమిడియుండె
రణరంగధీరయౌ, ఆ రాణిసంయుక్త
ఏయమ్మ పౌత్త్రిళ్ళ. నెదిగెనాడు
కావ్యరసాస్వాది, కాంత మొల్లాదేవి
ఏయంబస్తన్యంబు, నింపుగ్రోలె
భారతావనికెల్ల, మాత్రైన కస్తూరి
ఏతల్లి కౌగిట ఎగిరెనాడు.

గీ॥ రుద్రమాంబయుదాది సుబుద్ధిలక్ష్మి
వీరనాగమ మాంచాల ధీరవిమల
సుప్రసిద్ధిత నొందిన సుదతు లెల్ల
పుట్టి పెరిగిన ధీపుణ్యభూమియందె.

సీ॥ ఈ యాంధ్రలక్ష్మికే, చిందించిరక్తంబు
ఖడ్గతిక్కనవోయె, స్వర్గపురము
ఈ రాష్ట్రజ్యోతికే నీరాంజనము లిచ్చి
అమరజీవుండయ్యె ఆంధ్ర రత్నం
ఈ తల్లిగడ్డకే మేని కండల నూడ్చి
బాలచంద్రుడుబాసె ప్రాణములను
ఈ మాతృభూమికే, వీరగంధము జిల్కి
మరణంబు నొందె, మారాములన్న

గీ॥ అట్టిమాతల్లి, రతనాలకల్పవల్లి
మేటిధీరులగన్నట్టి మేలుబంతి
చాటుచున్నది దేశాల, మేటిననుచు
దీటు ఏరోయి ఆంధ్రుడా, సాటి నీకు.

సీ॥ రాజులంతా ఓడి, గాజులే తొడుగంగ
రౌద్రంబు జూపదే రుద్రమాంబ
దత్తువలదనెడి తొత్తులాంగ్లేయుల
రక్తంబు బిండదే రాణిఝాన్సి
వెలలేని ధీరయై— పలనాటికంతయు
నాయికై బరగదే— నాగమాంబ
శత్రుమూకలనొంప— క్షాత్రంబు చూపించి
ఖడ్గమెత్తదె— గండి కోట రాణి

గీ॥ ఏటికింకను కన్నీరు ఏటికమ్మ
మాటబోకుండ గాంతురు మగువలైన
నేటిదన్కను చాటు నీమేటి శోభ
రాటుదేలది కర్నూలు, రాజ్యలక్ష్మి.

—శ్రీమతి గు. రాజేశ్వరీ దేవి.

# సోషల్ వెల్ఫేర్ బోర్డులు

———:o:———

అఖిలభారత కేంద్ర సోషల్ వెల్ఫేర్ బోర్డు చైర్మన్ శ్రీమతి దుర్గాబాయి దేశముఖ్‌గారు ఇటీవల దక్షిణ ఇండియా రాష్ట్రాల్లో పర్యటన గావించేరు. ఇందువల్ల ఆయారాష్ట్రాల ముఖ్య మంత్రులు, తదితర మంత్రులు, పురపాలక సంఘాలు, ప్రముఖ స్త్రీ జనాభ్యుదయ సంఘ స్థాపకులు మొదలైన వారంతా వీర్ని సందర్శించి అనేక సమస్యలు ముఖతా చర్చించడానికి గొప్ప అవకాశం లభించింది.

ఆంధ్ర రాష్ట్ర ముఖ్యమంత్రులు శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారు వీరితో సంప్రదించి, కేంద్రసోషల్ వెల్ఫేరు బోర్డును ఆదర్శంగా ఉంచుకొని, ప్రజా ప్రయత్నాలకు సహాయం చేయడానికీ, వారి వాలంటరీ కార్యక్రమాల్ని బలపరచి ఇంకా పెంచడంలో తోడ్పడడానికీ, ఆంధ్ర రాష్ట్ర సోషల్ వెల్ఫేర్ ఎడ్వయిజరీ బోర్డును ఏర్పాటు చేసేరు. కేంద్రబోర్డు మాదిరినే ఇదీ ముఖ్యంగా అధికారేతర్లు మెంబర్లు కలదిగా యుంటుంది. స్వచ్ఛంద ప్రజాభ్యుదయ సంఘాలవారు విరివిగా జేరడాన్కి అవకాశాలిస్తుంది. స్త్రీ జనాభ్యుదయ శాఖ బాలాభ్యుదయ శాఖ, తప్పు పనులు చేసే పిల్లన్నీ స్త్రీలను సముద్ధరించే శాఖ, అంగలోపాలున్నవారి అభ్యుదయశాఖ, లన్నిటికీకూడా సంఘాభ్యుదయ కార్యక్రమాల్లో గొప్ప ప్రాముఖ్యత ఉందిగనుక ఇందు ప్రముఖపాత్ర నిర్వహిస్తున్నాయి గనుక - ఈ బోర్డులో స్త్ర జనాభ్యుదయానికి పాటుపడుతున్న స్త్రీలకే ఎక్కువ స్థానాలివ్వాలని నిశ్చయించేరు.

శ్రీమతి దుర్గాబాయిదేశముఖ్‌గారు ఆయా రాష్ట్రాల పర్యటనల్లో అనేక హంశాలు విశదీకరించేరు. కేంద్ర సోషల్ వెల్ఫేర్‌బోర్డు ఎలానియమింప బడిందీ తెలియజేప్పేరు. దేశంలో సంఘాభ్యుదయానికి కృషి చేస్తున్న స్వచ్ఛంద సంస్థలకు ఈ బోర్డు ఆర్థిక సహాయం చేయడాన్కి 4 కోట్లరూపాయలు గ్రాంటు యిస్తుందన్నారు, కేంద్రసంస్థ సభ్యులు ఈ కొద్దికాలంలోనే 5 సార్లు సమావేశమై అనేక విషయాలు నిర్ణయించేరు. దేశం మొత్తంమీదనున్న పదివేల సంస్థల్లోను 1216 సంస్థలు పేరి గ్రాంటులకై అర్జీలు పెట్టేయి. వీటిల్లో 762 సంస్థలకు మొత్తంమీద 24 లక్షల 21 వెయ్యి 300 రూ. లు గ్రాంటు యివ్వబడింది. వీటిల్లో మద్రాసు రాష్ట్రంలో 82 సంస్థలకు 2,73,800 రూ. లు యిచ్చేరు, ఆంధ్రరాష్ట్రంలో 62 సోషల్ వెల్ఫేర్ సంస్థలకు 2.13.300 రూ. లు యిచ్చేరు. ఇలా 27 రాష్ట్రాల్లోను 25 రాష్ట్రాలకు గ్రాంటులు ముట్టేయి. ఆంధ్ర రాష్ట్రంలోని అన్ని సంస్థలూ ఏమిటంటే - మామూలు జనరల్ వెల్ఫేర్ సంస్థలు 21, డిలిక్వెంట్సు 1, స్త్రీ జనాభ్యుదయసంస్థలు 30 బాలాభ్యుదయ శాఖలు 10.

సెంట్రల్ వెల్ఫేర్ బోర్డువారు మూడు ప్రత్యేక శాఖల్ని నియోగించేరు. ఇవిదేశంలో 550 సంస్థల్ని చూచి పరిస్థితులు విచారించి సలహాలిచ్చాయి. పని విస్తారంగా పెరిగిపోతూంది. తరుచుగా వచ్చి చూడ్డానికి, పరీక్షించడానికి, సలహాలిచ్చి నడిపించడానికి, కలిసి కట్టుగా కృషి సల్పేటట్టు చూడ్డానికి పై మూడుశాఖలకు దుస్సాధ్యమౌతూంది. అంచేత రాష్ట్ర బోర్డుల్ని ఏర్పాటుచేస్తే అవే యీపని చూచుకుంటాయి. జూన్ నెలాఖరుకు యీ రాష్ట్ర వెల్ఫేర్ బోర్డులు నియామకం పూర్తి అవుతుంది.

కేంద్రబోర్డు మళ్ళా జూలై 3 తేదీని కలుసుకుంటుంది. అప్పుడు రాష్ట్రాల్లోజరిగే సోషల్ వెల్ఫేర్ ప్రాజెక్టుల్ని చూచే సంస్థల నియామకాన్ని నిర్ణయిస్తుంది. జూలై 15 నాటికి అలా ఎన్నుకోబడ్డ ఏజన్సీలకు తగు నిర్ణయాన్ని తెలుపుతూ - ఒక ప్రశ్నావళి జారీ చేస్తుంది. గ్రామాలను సర్వేచేసి (ఆ భోగట్టాలు సేకరించడానికి ఈ ఏజన్సీలకు గ్రాంటు లిచ్చి) సమాధానాలు పంపించ మంటుంది. ఆగస్టు 15 నాటికల్లా ప్రాజక్టులన్నీ నిర్ణయమైపోగా పని ప్రారంభమౌతూంది.

ప్రాజెక్టు అంటే సుమారు 60 లక్షల జనాభాగల 20 గ్రామాలు కలిసి ఉంటుంది. ఈ వివిధ ప్రాజెక్టుల్లో కార్యక్రమం నడిపే బాధ్యత, ఆ ప్రాంతంలో చక్కగా నడుస్తున్న సంస్థకు వప్పజెప్ప బడుతుంది. ప్రతీ ప్రాజెక్టుకూ 50 వేల రూ. లు వ్యయమౌతుంది. దాంట్లో సగం సెంట్రల్ వెల్ఫేర్ బోర్డు గ్రాంటు యిస్తుంది.

రాష్ట్ర వెల్ఫేర్‌బోర్డు విశదంగా రాష్ట్ర పరిస్థితులన్నీ పరీక్షించుకుని, ప్రతి జిల్లాకూడా ఒక ప్రాజెక్టు పొందె

# సోషల్ వెల్‌ఫేర్ బోర్డులు

లాగ యేర్పాటు చేస్తుంది. వీటిల్లో 5 ప్రాజెక్టులు "ప్రయిజ్ ప్రాజెక్టు"లుగా ఉంటాయి. వీటిల్లో ఏది ఎక్కువ ద్విగిజయంగా పనిజేసి ఫలితాలు చూపిస్తే దానికి బహుమతిగా మరో ప్రాజెక్టు సాంక్షను యిస్తారు. ఇలా ఈ బోర్డులు సంఘాభ్యుదయ కార్యక్రమాన్ని సాగించడమేగాక తమ ప్రాంతాల్లో నున్న ప్రకృతి సంపదల్ని, సద్వినియోగంలోకి తెస్తాయి. దీంట్లో స్త్రీలు సాధించ వలసిందెంతో ఉంది.

*　　　*　　　*

స్త్రీలు ఇంట్లోనేవుండి ధనమార్జించే మార్గాల్ని కూడా అన్వేషిస్తున్నామని మరో సందర్భంలో ప్రసంగిస్తూ శ్రీమతి దుర్గాబాయి దేశముఖ్‌గారిలా ప్రకటించేరు : మధ్యతరగతి స్త్రీలు గృహంలోనే వుండి సంసారం చక్కదిద్దుకుంటూనే తీరిక సమయంలో ఆర్థికంగా కలిసివచ్చే గృహ పరిశ్రమలు చేసుకోడానికి వీలైన సదుపాయాలు చేయాలని ప్లానింగు కమీషనువారు కార్య క్రమాన్ని ఏర్పాటు చేస్తున్నారు.

మనస్త్రీలలో చాలామంది విద్యను ముగించిన తర్వాత వివాహం చేసుకుని, మధ్య తరగతి కుటుంబాలకు వెళ్తారు. ఆ భర్త తెచ్చే కొద్దిపాటి జీతం కుటుంబ నిర్వహణకు సరిపడక అవస్త పడుతుంటారు. ఆర్థికంగా భర్తకు సహాయపడటానికి ఇల్లు, సంసారం విడిచిపెట్టి బైటకు పోయి ఆర్జించడానికి వారికి సాధ్యపడదు. అందుచేత గవర్నమెంటే వాళ్ళకు ఇంటిలోనే వుండి చేసుకోగల చిన్నచిన్న గృహ పరిశ్రమలను ప్రవేశ పెట్టినట్లయితే ఆ కొద్దిపాటి ధనముకూడా వారికి చాల సహాయకారిగా వుంటుంది. కాబట్టి పురుషులకంటే స్త్రీలే ముఖ్యంగా చిన్నచిన్న పరిశ్రమలకు సంబంధించిన సాంకేంతిక జ్ఞానాన్ని పొంది వుండాలి. ఈ విధానాన్ని సాధ్యమైనంత త్వరలో అమలు పర్చాలని ఆశిస్తున్నాము. ప్రస్తుతం ఢిల్లీలో పారిశ్రామిక శాఖవారి సహాయంతో అగ్గిపుల్లల తయారుచేసే పరిశ్రమ ప్రారంభింప బడింది. ఇంకా నూలు వడకడం వగైరా ఖాదీకి సంబంధించిన వృత్తులు చేయిస్తున్నారు. ఈ సందర్భంలో ఫోర్డు ఫౌండేషన్‌వారు స్త్రీలు చేయగల గృహ పరిశ్రమల నివేదిక ఒకటి సమర్పించేరు. అందులో కొన్నైనా మనదేశంలో ప్రవేశపెట్టి మధ్యతరగతి కుటుంబాలకు తోడ్పడాలని అనుకుంటున్నాం. ఈ పద్ధతే గనుక జయప్రదంగా కొనసాగినట్లయితే క్రమంగా పెద్ద పరిశ్రమలన్నింటినీ వికేంద్రీకరణ చేయవచ్చు. ఇటువంటి పరిశ్రమల్లో తర్ఫీదుపొందిన బాలిక పెండ్లయిన తర్వాత తండ్రి ఆమెను అత్తవారింటికి పంపేటప్పుడు ఆమె నేర్చుకున్న పరిశ్రమకు పనికివచ్చే చిన్న మిషీన్ అరణం యిచ్చి పంపిస్తే ఆమె భర్తకు కొంత కలిసివచ్చే పని జేసి అతడి ఆర్జనకు కొంత కలిసివచ్చేటట్టు కృషి సల్పడానికి వీలవుతుంది.

**బాలమందిరాలు :** దినమంతా ఫ్యాక్టరీల్లోను ఆఫీసుల్లోను పనులు చేసే స్త్రీలయొక్క బిడ్డల్ని విడిచి పెట్టడానికి కొన్ని బాలమందిరాలు నిర్మించాలని కూడా అనుకుంటున్నాం. చైనాలో నడపబడుతున్న మాదిరిగానే ఇక్కడ కూడా నడపాలని ఉద్దేశ్యం అని శ్రీమతి దుర్గాబాయిదేశముఖ్‌గారు వివరించేరు. ★

---

## విజయం

1954 ఏప్రిల్‌లో ఇ. యస్. యల్. సి. పరీక్షకు ఆంధ్ర మహిళాసభ విద్యాలయపు బాలికలు 15 మంది వెళ్ళిరి. ఇందు 7 గురు విజయముగాంచిరి.

| | | |
|---|---|---|
| వి. విమల | ఎ. సీతాదేవి | ఎమ్. వి. కళ్యాణి |
| ఆర్. సరస్వతి | కె. వి. సరస్వతి | సి. ఇ. నాగలక్ష్మి |
| | కె. భాగీరథి | |

1954 ఏప్రెల్‌లో ఆంధ్ర మహిళా సభ పారిశ్రామిక శాఖ టీపింగు హైయర్ గ్రేడ్ పరీక్షకు వెళ్ళిన శ్రీమతి జి. తిమ్మాయమ్మగారు ద్వితీయశ్రేణిలో ఉత్తీర్ణులైరి.

కృతార్థులైనా విద్యార్థినులకు మా అభివందనములు.

ఆంధ్ర మహిళాసభ.

# ఆంధ్రరాష్ట్ర వెల్ ఫేర్ బోర్డులు

రాష్ట్రాల్లో కృషిచేస్తున్న స్వచ్ఛంద సంస్థలకు కేంద్ర వెల్ఫేర్ బోర్డుకు మధ్య సంబంధం కల్పించడానికై కేంద్ర సోషల్ వెల్ఫేర్ బోర్డు రాష్ట్ర ప్రభుత్వాల్ని కోరింది — రాష్ట్ర వెల్ఫేర్ బోర్డుల్ని యేర్పాటుచేయమని. రాష్ట్ర ప్రభుత్వాలు యీ సలహాయొక్క ప్రాధాన్యత గమనించి, కేంద్ర వెల్ఫేర్ బోర్డు చైర్మన్గారైన శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ గారితో సంప్రదించి, తమ రాష్ట్ర బోర్డుల్ని నియామికం చేసుకున్నాయి. ఈ రాష్ట్ర వెల్ఫేర్ బోర్డులు స్వచ్ఛంద సంస్థలు సమర్పించే దరఖాస్తులు పరీక్షించి, గ్రాంటులు తగు రీతిని యివ్వడానికని కేంద్ర బోర్డుకు సిఫార్సు చేస్తాయి. ఆపైన ఈ సంస్థల కృషి కూడా పరీక్షిస్తూ గ్రాంటు లెందుకిచ్చారో అందుకవి వినియోగ మయ్యేటట్టుకూడా చూస్తూంటాయి. ఈ బోర్డులు రాష్ట్ర ప్రభుత్వాలవారు రాష్ట్రంలో సోషల్ వెల్ఫేర్‌కు సంబంధించిన హంశాలు పంపించి సలహాలడిగితే అవీ యిస్తాయి.

సంఘసేవకు స్వచ్ఛంద సంస్థల్ని నిర్మించడంలో అపూర్వసామర్థ్యాలు చూపించి, ప్రజాసేవలో ఆరితేరిన పెద్దల్ని యీ రాష్ట్ర వెల్ఫేర్ బోర్డులకు చైర్మన్లుగాను, మెంబర్లుగాను నియమించడం ముదావహం. మచ్చుకు కొందర్ని చెప్పాలంటే — మద్రాసు బోర్డుకు చైర్మన్‌గా నియమింపబడ్డ శ్రీమతి డా॥ ముత్తులక్ష్మీ రెడ్డిగారు, ఆంధ్ర రాష్ట్ర వెల్ఫేర్ బోర్డుకు (ఆంధ్ర మహిళాసభకు కార్యదర్శినిగా చాలాకాలం సేవ గాంచిన) శ్రీమతి చన్నఘంటమ్మా కృష్ణారావుగారు, బొంబాయిరాష్ట్ర బోర్డుకు మిసెస్ జాన్‌మత్తాయిగార్ని చెప్పొచ్చు.

ఈ క్రిందివారు ఆంధ్రరాష్ట్ర బోర్డుకు మెంబర్లుగా నియమింపబడ్డారు :—

1. ప్రభుత్వం తరపున ఆంధ్ర రాష్ట్ర స్త్రీ జనాభ్యుదయ శాఖ ఆఫీసరు కుమారి జె. జమునాబాయిగారు.

2. ప్రభుత్వ ఎకనామిక్ ఎడ్వయిజరు శ్రీ బి. నటరాజన్‌గారు.

సంఘసేవ గావిస్తున్న సంస్థల తరపున :—

3. సేవాసదనంస్థాపకులు లేడీ వెంకటసుబ్బారావుగారు.

4. మాజీ కడప జిల్లాబోర్డు అధ్యక్షురాలు శ్రీమతి కడప రామసుబ్బమ్మగారు.

5. తిరువూర్ బేసిక్ విద్యాసంస్థ వ్యవస్థాపకురాలు కుమారి వే. దమయంతి దేవిగారు.

6. ప్రజాహితాభిలాషి శ్రీమతి కోటమ్మా రెడ్డిగారు.

7. సీతానగరం కస్తూర్బా శిక్షణ కేంద్రం ప్రిన్సిపాల్ శ్రీమతి డి. బుచ్చికృష్ణమ్మగారు.

8. బాలసంఘస్థాపకులు శ్రీ యన్. రాఘవరావుగారు.

వీరికి ఆంధ్రులు అన్నివిధాలగానూ తోడ్పడి సంఘ సంక్షేమ కార్య క్రమంలో దిగ్విజయంగా కృషిసాగి, రాష్ట్రం అభ్యున్నతినంది ఆంధ్రులు అన్ని విషయాల్లోనూ ఆదర్శకులని నిరూపిస్తారని ఆశిస్తున్నాం.



# రా జ కీ యా లు

(12-వ పేజీ తరువాయి)

కోవాలని తీర్మానించింది. అయితే ఇది అనధికార తీర్మానమని చెప్పి, దానిని అమలు జరపటానికి ప్రభుత్వం నిరాకరిస్తున్నది. కాంగ్రెసు నాయకులు దగ్గిరాల ఉప ఎన్నిక ప్రచారంలో చెప్పినట్లు కల్లుగీత పనివాళ్లందర్కీ వేరే పనులు చూపించి, మద్యనిషేధాన్ని అమలు జరిపితే నైతికంగా తమను సమర్థించుకోగలరుకాని, పార్లమెంటరీ సాంప్రదాయాలను మాత్రం బుట్టదాఖలు చేసినవాళ్ళవుతారు.

* * *

హైద్రాబాద్ రాష్ట్ర కాంగ్రెస్ హైద్రాబాదును విభజించాలని తీర్మానించటం వల్ల తెలంగాణాలోని స్వప్రయోజన పరులకు కొంత ఇబ్బంది కలిగింది. అందువల్ల వారు తెలంగాణాను ప్రత్యేక రాష్ట్రం చేయాలని కోరారు. అయితే ఆ ప్రాంతీయుల్లోనే మరికొందరు విశాలాంధ్రని కోరారు. రాయలసీమ, సర్కార్ల పేచీవంటిదే మళ్ళీ అక్కడకూడా ఏర్పడుతున్నది.

అయితే అన్నిటికన్నా వింతసంగతి మరొకటున్నది. రాష్ట్ర పునర్నిర్మాణ సంఘానికి ఆంధ్రప్రభుత్వం సమర్పించిన నివేదికలో విశాలాంధ్రను హైద్రాబాదు రాజధానిగా నిర్మించి, దానికి నిజాంను గవర్నరుగా నియమించాలని కోరబడ్డది. నిజాంను అధిపతిగా ఆంధ్రప్రభుత్వం వరించటంలో కిటుకు ఏమిటి? తెలంగాణా ముస్లింలను విశాలాంధ్రకు సుముఖులుగా చేయటానికా? లేక పదవుల పంపిణీకి సంబంధించిన పితలాటకం ఏమయిన ఉన్నదా?



# అశ్రుతర్పణ

## కీ॥ శే॥ శ్రీమతి అయ్యగారి రాఘవమ్మగారు.

1950 లో భాషాప్రవీణ పరీక్షయందుత్తీర్ణతను పొంది తెలుగు పండితురాలుగా తణుకు S. M. L. బోర్డు ఉన్నత బాలికా పాఠశాలలో పనిచేసి యున్నారు.

ఈమె రచయిత. గొప్పసారస్వత సేవాభిమానియు వాక్పటిమగలవారై యుండిరి. ఆంధ్ర మహిళకు అనేక వ్యాసములు వ్రాసిరి. సమాజ శాస్త్రం, మనో విజ్ఞానం, చరిత్ర, భాషా శాస్త్రం యిత్యాదులు బాగుగా పఠించి తెలిసిన వారు. కవి సార్వభౌముల నుద్దేశించి— మానవ మనస్సు యెప్పుడు ఒకే వస్తువులో రమించదనియు, రచయితలు అది గమనించి విభిన్న రీతుల సృష్టించాలనెడివారు.



తెలుగులోకములో తెలుగుభాషకు సరియైన నిఘంటు వింతవరకు పుట్టలేదంటూ తనకు గల భాషా పరిచయముతో తెలుగు భాషాలోకమున కర్పించుటకు సరికొత్త పాత పదములతో నిఘంటువును వ్రాయప్రారంభించిరి.

అది ముగియక ముందే వీరు యమపురమునకు నేటి 18—5—54 తేదిని అసువులు బాసిరి. ఈమె మరణము వలన ఆంధ్రులకు ఓ నిధిలోటు యేర్పడినది. పవిత్రబ్రహ్మచారిణిగా జీవనం గడుపుచూ ఆధ్యాత్మిక చింతనము గలిగి శాస్త్రార్థములు గ్రహించుకొని, జీవాత్మ పరమాత్మలో ఐక్యమగునటుల జన్మ రాహిత్యమునకై కృషి చేయుచుండెడి వారు. వీరు సుప్రసిద్ధ అయవేల నియోగి బ్రాహ్మణకుటుంబమునకు చెందిన కీ॥ శే॥ అయ్యగారి నారాయణరావు గారి కుమార్తె. ఈమె ఆత్మకు భగవంతుడు శాంతి నిచ్చుగాక! హరి ః ఓం ః శాంతి ః శాంతిః

# ఇండియాలో మలేరియా వ్యాధి నివారణ పద్ధతులు

• లెఫ్టినెంట్ కర్నల్ జస్వంత్‌సింగ్ •

మలేరియా వ్యాధి ఒక్క ఇండియాలోనే గాక ఉష్ణ మండలంలోని ఇతర ప్రాంతాలలో కూడ ప్రబలంగా ఉన్నది. అనేక నాగరీక జాతులు మలేరియావల్ల నాశన మైపోయినాయి.

ఇండియాలో ప్రతి సంవత్సరం 7,50,00,000 మంది ప్రజలు మలేరియా వ్యాధికి గురి అవుతున్నారు. షుమారు 7,50,000 మంది మలేరియావల్ల మరణిస్తున్నారు. మలేరియావల్ల ప్రజారోగ్యం క్షీణించడమే గాక జాతియొక్క రాజకీయ మానసిక పురోభి వృద్ధికి తీవ్ర అవరోధంగా పరిణమించింది. అభివృద్ధి ప్రణాళికలు, పరిశ్రమలు అభివృద్ధి చెందడానికి వీలులేకుండా చేస్తున్నది. గ్రామీణ ప్రాంతాలలో ఈ వ్యాధి ఎక్కువగా వున్నది. 1951 జనాభా లెక్కలను బట్టి ఇండియాలో గ్రామప్రాంతాలలో నివసిస్తున్న ప్రజలు 29,50,00,000 వారిలో 24,90,00,000 మంది వ్యవసాయదారులు. మలేరియా వచ్చినపుడల్లా కనీసం మూడేసి రోజులు చొప్పున అతి నీరస పెట్టేస్తుంది. మలేరియా వున్నవారికి సంవత్సరానికొకసారి అయినా ఆ వ్యాధి వస్తుంది. భారతదేశంలోని 36,00,00,000 మంది లోను షుమారు 7,50,00,000 మందికి మలేరియా వస్తున్నది. వారిలో రైతులు షుమారు 6,00,00,000 మంది వుంటారు. అందువల్ల సుమారు 18,00,00,000 పని రోజులు నష్టమూతున్నాయి. ఈ అంచనాలు చాల తక్కువని భావించవచ్చును. ఎందువల్లనంటే వ్యక్తికి సంవత్సరానికి ఒక్కసారి వస్తున్నదని అంచనా వేయబడింది. సంవత్సరం మధ్యలో వ్యాధి ఎన్నిసార్లు తిరుగబెడుతున్నదో ఈ అంచనాలలో చేర్చబడలేదు. అనేక ప్రాంతాలలో పైరులు వేసే కాలం లోను, కోతల కాలంలోను మలేరియా ఎక్కువగా వస్తున్నందున నష్టం ఎంత కలుగుతున్నదో మనం ఊహించవచ్చును. సాలీనా 10,00,00,000 రూపాయలు నష్టమూతున్నాయి.

మానవ శరీరంలో జీవిస్తూ అభివృద్ధి చెందుతూన్న విష క్రిములవల్లనే మలేరియా కలుగుతున్నది. మానవుడి రక్తంలో ఆ క్రిములు ఎక్కువగా వున్నప్పుడు జ్వరము, నొప్పులు, వణుకు, చెమటలు, రక్తహీనత మొదలైన లక్షణాలన్నీ వస్తాయి. మలేరియా వ్యాధి వున్న ఒక వ్యక్తిని కుట్టినదోమ మంచి మనిషిని కుడితే మలేరియా వస్తుంది. మలేరియావున్న వ్యక్తిని కుట్టిన పదిరోజుల తర్వాత ఆ దోమ ఇతరులను కుడితే మలేరియా వస్తుంది. అంటే ఆ వ్యక్తిని కుట్టిన పది రోజుల తర్వాత గాని వ్యాధిని వ్యాపింపచేసే శక్తి దానికి రాదన్నమాట. తర్వాత ఆదోమ బ్రతికివుండే కొలది వారాలు దానికి ఆ శక్తి ఉంటుంది. మలేరియా ప్రబలంగా ఉండే రోజులలో ఒకే ఒక దోమ కుడితే ఇంటిల్లిపాదీ మలేరియాతో మంచమెక్కిన సందర్భాలు అనేకం ఉన్నాయి.

దోమలు మామూలుగా మురికి గుంటలలోను, చెరువుల లోను, నిల్వవున్న నీటిలోను గుడ్లు పెడతాయి. నీటి పైభాగానవుండే నాచు మొదలైన వాటిమీద అవి గుడ్లను పెడతాయి. గ్రుడ్లు పెట్టినది 4 గంటలలోగా పిల్లలు బయటికి వచ్చి నీటిలో ఈదుతూ నాచు మొదలైన వాటిని తింటూ ఒక వారం తర్వాత అవి పెద్దదోమలవుతాయి. మలేరియావ్యాధి వున్న వ్యక్తులు ఎక్కువగా వున్న ప్రాంతం లోను, మలేరియావ్యాధి క్రిములను వ్యాపింపచేసే దోమలు వృద్ధిపొందడానికి తగిన అవకాశం వున్నచోట్ల మలేరియా వుంటుంది. వీటిని గనక జాగ్రత్తగా అరికడితే వ్యాధి తగ్గిపోతుంది. అందువల్ల డబ్బు ఎక్కువ దూబారా చేయకుండా సక్రమమైన పద్ధతులలో వాటిని అరికట్టకలిగితే ఈ వ్యాధిని అదుపులోకి తీసుకురావచ్చును.

మలేరియాను అదుపులోకి తీసుకురావడానికి ముఖ్యంగా ఈ క్రింది పద్ధతులను అమలు పరచాలి. దోమ తెరలు మొదలైన వాటిని ఉపయోగించడం వల్ల దోమల కాటును తప్పించుకోవచ్చును. దోమలు నివసించే ప్రాంతాలలో క్రిమి సంహార ఔషధాలను చల్లడం, గోతులను, గుంటలను పూడ్చివేస్తే అందులో దోమలు చేరకుండావుంటాయి. చెరువులు, నూతులు, వాగులు, మురుగుకాల్వలు, మురుగు గుంటలలో క్రిమి సంహారకౌషధాలను చల్లడం, నూతులలో ఎండుక్రిములను తినడానికి చేపలను పెంచాలి. క్వినైన్,

పాలుడ్రిన్, కామోక్విన్, రెసోచిన్ మొదలైన మలేరియా నివారణ ఔషధాలను ఉపయోగించాలి.

గ్రామీణ ప్రాంతాలలో అతి తక్కువ ఖర్చుతో మలేరియాను అదుపులో పెట్టే పద్ధతి గృహాలన్నింటిలోను డి.డి.టి, బి.హెచ్.సి, డీల్డ్రిన్ మొదలైన క్రిమిసంహార ఔషధాలను చల్లడం. ఈ మందులు ఒకసారి చల్లితే వాటి శక్తి కొన్ని వారాల వరకూ వుంటుంది.

ఇండియాలో మలేరియా నివారణ కార్యక్రమం భారీ ఎత్తున అమలు జరుపబడుతున్నది. అన్ని రాష్ట్రాలు ఈ కార్యక్రమంతో సహకరిస్తున్నాయి. మలేరియా వ్యాధి వున్న ప్రాంతాలలోకి 20,00,00,000 మంది ప్రజలలోను 12,50,00,000 మందికి ఈ కార్యక్రమంక్రింద రక్షణ కలిగించబడుతున్నది. ప్రతి పది లక్షలమంది ప్రజలకు ఒక యూనిటు చొప్పున 35 యూనిట్లు ఈ కార్యక్రమాన్ని అమలు జరపడానికి ఇప్పటికి ఏర్పాటు చేయబడ్డాయి. మొదటి మూడు సంవత్సరాలకు ఈ కార్యక్రమంక్రింద 15,50,00,000 రూపాయలు వ్యయమౌతాయని అంచనా వేయబడినది. ఇందులో 2,25,00,000 రూపాయలను అమెరికా విదేశ సహాయశాఖ వారు ఇస్తున్నారు. ఇండియా ప్రభుత్వం 5,25,00,000 రూపాయలు, ప్రపంచ శిశు సంక్షేమ నిధి 15,00,000 రూపాయలు, రాష్ట్రప్రభుత్వాలు 5,25,00,000 రూపాయలు భరిస్తున్నాయి. విదేశ సహాయం తోడ్పాటుతో ఇండియా ప్రభుత్వం 18,000 టన్నుల క్రిమి సంహార ఔషధాలు, 125 విద్యుచ్ఛక్తితో మందుచల్లే సాధనాలు, 3750 మామూలు సాధనాలు, 7500 స్టిరప్ పంపులు, 75 సూక్ష్మదర్శిని యంత్రాలు, 497 మోటారు ట్రక్కులు, 128 జీపులు, 17 పెద్దమోటార్లు ఇస్తున్నాయి. రాష్ట్ర ప్రభుత్వాలు చిన్న చిన్న ఖర్చులను భరిస్తున్నాయి.

కేంద్ర ఆరోగ్య సంఘం సిఫారసుపై ఇండియా ప్రభుత్వం ప్రత్యేక మినహాయింపుగా అమెరికానుంచి వచ్చే సప్లయిలపై విధించబడే దిగుమతి సుంకాలకు సమానమైన మొత్తాలు రాష్ట్ర ప్రభుత్వాలకు గ్రాంటుగా ఇవ్వడానికి అంగీకరించింది. ఈ చర్య మలేరియా నివారణకార్యక్రమాలను అమలు జరపడానికి రాష్ట్ర ప్రభుత్వాలకు అవగతమైన ప్రోత్సాహాన్ని కలిగించాయి.

మలేరియా నివారణ కార్యక్రమాన్ని సాగిస్తున్న ప్రతి యూనిట్టుకు మొదటి సంవత్సరానికి 5,22,000 రూపాయలు ఖర్చు అవుతాయని అంచనా వేయబడింది. ప్రతి దళానికి ఒక మెడికల్ ఆఫీసరు, నలుగురు సీనియరు మలేరియా ఇన్స్పెక్టర్లు, నలుగురు ఇన్స్పెక్టర్లు మరికొంతమంది సిబ్బందీ వుంటుంది.

1953-54 సంవత్సరానికి మొత్తం 90 దళాలు కేటాయించబడ్డాయి. పశ్చిమ బెంగాలుకు 16, బొంబాయికి 15, మధ్యప్రదేశ్‌కు 8, బీహారుకు 7, ఉత్తరప్రదేశ్, మైసూరు, అస్సాంలకు ఐదేసి, పంజాబ్, హైదరాబాద్‌లకు నాలుగేసి, ఒరిస్సా, మధ్యభారత్, పెప్సూ, ఢిల్లీ, వింధ్యప్రదేశ్, ఆంధ్ర, మద్రాస్‌లకు రెండేసి, సౌరాష్ట్ర, తిరువాన్కూర్-కొచ్చిన్, జమ్మూ-కాశ్మీర్‌లకు ఒక్కొక్కటి కేటాయించబడ్డాయి. మిగతా ఎనిమిది పార్ట్ సి రాష్ట్రాలకు చిన్న దళాలు కేటాయించబడ్డాయి.

1953-54 సంవత్సరంలో 90 దళాలకు వచ్చిన డి.డి.టి సరఫరా, యంత్ర పరికరాలు ఇదివరకే పంపబడ్డాయి.

1947 వ సంవత్సరంలో మలేరియా నివారణ చర్యవల్ల 2,50,00,000 మంది ప్రజలకు ప్రయోజనం కలిగింది. ఆ సంవత్సరానికి 1,50,00.000 రూపాయలు ఖర్చుచేయబడ్డాయి. ఈనాడు ఒక సంవత్సరం తర్వాత సుమారు 7.50,00,000 మంది ప్రజలకు వాటి వల్ల ప్రయోజనం కలుగుతున్నది.

## మలేరియా నిర్మూలనోద్యమంలో ప్రధాన ఘట్టాలు

1640 సింకోనా చెట్టు బెరడు దక్షిణ అమెరికా నుంచి యూరప్‌లోకి తీసుకురాబడింది.

1820 పెల్లిషియర్, కేవంటో అనే వ్యక్తులు సింకోనా నుంచి క్వినైన్ తయారుచేశారు.

1845 ప్లీహ వృద్ధిని గమనించడం ద్వారా మలేరియావ్యాధి తీవ్రతను కనుగొనడం ఇండియాలో మొదలుపెట్టారు.

1847 ఇండియాలో హేర్ అనే ఆయన క్వినైన్ సల్ఫేటు చికిత్సను ప్రారంభించారు. వ్యాధి పీడితుల

## ఇండియాలో మలేరియా వ్యాధి నివారణ పద్ధతులు

మెదడులో రంగుతో కూడివున్నట్లు మెకెల్ కనిపెట్టారు.

1852-60 ఇండియా, జావా, సింహళాలలో సిక్కోనా పెంపకం ప్రారంభమైనది.

1874 డి. డి. టి. రసాయనిక మిశ్రమమని జైడ్లర్ కనుగొన్నారు.

1880 లేవరిన్ అనే ఆయన మానవ రక్తంలో మలేరియా క్రిమిని గురించి వివరించారు.

1883 కింగ్ అనే ఆయన దోమకాటు వల్ల వ్యాధికలుగుతున్నదనే సిద్ధాంతాన్ని వెల్లడించారు.

1891 మలేరియా క్రిమి ఉనికిని కనుగొనడానికి రోమనోస్కీ రసాయినిక పదార్థాన్ని కనుగొన్నారు.

1897 రాస్ అనే ఆయన దోమలలో మలేరియా క్రిములున్నాయని కనుగొన్నారు.

1898 మలేరియా క్రిమి పూర్వోత్తరాలన్నింటినీ గ్రాసీ, బిగ్నామీ, మిస్టయిసెల్లీ తెలుసుకొని దోమకాటు వల్ల మానవులకు వ్యాధి ఎల్లా వస్తుందో ప్రయోగాలు జరిపారు.

1900 లో, శాంబన్, టెర్జో, మేన్సన్ పై సిద్ధాంతాన్ని ధృవ పర్చారు.

1925 మలేరియా నివారణకు తొలి ఔషధం 'ప్లాస్మోక్వైన్' కనుగొన బడింది.

1936 మలేరియా నివారణకు పైర్ ధూర్మ్‌ను జిమెల్లాన్, దక్షిణాఫ్రికాలలోను, కోలెల్, రస్సెల్‌లు ఇండియాలోను ఉపయోగించారు.

1938 మలేరియా నిర్మూలనోద్యమం తొలిసారిగా బ్రాజల్‌లో విజయవంతంగా అమలు జరుప బడింది.

1944 ఇటలీపై యుద్ధసమయంలో మిత్ర మండలివారు మలేరియా నివారణకు డి.డి.టి.ని భారీ ఎత్తున ఉపయోగించారు.

1953 మలేరియా నివారణ ప్రపంచంలో కల్లా పెద్ద కార్యక్రమాన్ని ఇండియా ప్రారంభించింది.

(ఇండియా ప్రభుత్వ సమాచారశాఖ)



## చిన్న మొత్తములలో నిల్వ సేకరణ-
### ఆంధ్ర మహిళా సభలో కార్యాలయము.

చిన్న మొత్తముల నిల్వలు ప్రోత్సాహించి, ప్రభుత్వమువారి పంచవర్ష ప్రణాళికకు తోడ్పడు స్త్రీల ఉద్యమములో ఆంధ్రమహిళాసభ సభ్యురాండ్రు ఎక్కువగా తోడ్పడవలెనని నిశ్చయింపబడినది. ఇందు కొరకై, ఆంధ్రమహిళా సభ ఆవరణలో ఒక ప్రత్యేకమైన కార్యాలయము ఏర్పరుపబడును. ఇందు దైనిక కార్యక్రమాన్ని నిర్ణయించి, స్త్రీ సామాన్యములో యీ ఉద్యమాన్ని గూర్చి ప్రచారం చేయుటకు, నిల్వచేయదలచినవారికి తగు సలహానిచ్చుటకు, సభ తరపున కొందఱు యువతులు నియమింపబడుదురు. ఈ ఉద్యమంలో ఒక ప్రత్యేక ప్రతినిధిగా వ్యవహరించి, ధనము వసూలు చేయుటకు భారత ప్రభుత్వమువారు, ఆంధ్ర మహిళాసభకు అధికారమిచ్చియున్నారు. సభకు వచ్చిగాని, పోస్టు ద్వారాగాని అన్ని వివరములు తెలిసికొనవచ్చును,

ఇంకొక విషయము— మీరు కొనదలచిన సేవింగ్సు సర్టిఫికెట్లు సభ ద్వారా కొన్నయడల సభకు 1¼% కమీషను వచ్చును. ఈ కమీషను సభయొక్క కార్యకలాపాలకై వినియోగించుకోవచ్చును. అందువల్ల మీరు నిల్వ చేయదలచిన మొత్తమునకు సభద్వారా సర్టిఫికెట్లు కొన్నచో, సభకు కూడా సహాయము చేసినవారగుదురు.

ఉత్సాహ వంతులైన సోదరీమణులు, యింత వరకూ సభద్వారా నిల్వ సర్టిఫికెట్లు తీసుకున్న మొత్తము రమారమి రూ. 25520/- ఇందు మూలముగా సభకు వచ్చిన కమీషను రూ. 320/- ఇంకా పెక్కుమంది సోదరీమణులు యీవిధముగా సభద్వారా సర్టిఫికెట్లుకొని సహాయ పడవలెనని కోరుచున్నాను.

టి. జి. హైమవతి,
ఆర్. లక్ష్మి.

# ప్రభుత్వ ఋణానికి స్త్రీల సహాయం

## బాండులు కొనాలని

### శ్రీమతి భారతిరంగా సలహా.

స్త్రీలు సంపాదించుకొనగల్గు ఆదాయం, ఆస్తుల పొదుపు చేసుకొనుట అత్యవసర సాంఘిక ధర్మం. తమ కుటుంబ రక్షణకై, బిడ్డల పోషణకై తమ వృద్ధాప్య మందు, అనారోగ్య సమయములలో కలుగు అవసరాల దీర్చుకొనుటకై కొంతగానైనా నిల్వజేసుకొనుట అవసరం, మంచిదికూడా. బీదలైనవారికి, శ్రమజీవులందరికి మరింత అవసరం.

పొదుపు చేసుకొన్న చిన్ని చిన్ని మొత్తాలను వివిధ మార్గాల ద్వారా భద్రపరచుకొనడం, వడ్డీ సంపాదించు కొనడం, తద్వారా సంఘ సేవ చేయడం సాధ్యమె. వ్యవసాయకులకు, చేతి వృత్తులవారికి వ్యక్తిపరంగా గాని, వారి సహకార పరపతి సంఘాల ద్వారా గాని అప్పుల కివ్వవచ్చు, వారినటుల ప్రోత్సహించవచ్చు.

అట్టి మార్గాలలో సుకరమైనది, నమ్మకమైనది, లాభ సాటిగా ఉన్నది, పంచవర్షప్రణాళిక యందలి జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమాలకొరకై ప్రభుత్వము కోరు చున్న ఋణాలు, 12 సం॥ వాయిదాగల అప్పుల పత్రాలను ప్రభుత్వం అమ్ముచున్నది. నూటికి నాల్గు రూపాయల వడ్డీ యిస్తానంటున్నది. 12 సం॥ పిమ్మట, నూటికి గాను, నూటయాభై యిస్తానంటున్నది. ఈలోపల అవసరమైనచో దామాయిషీన వడ్డీ యివ్వగలనంటున్నది. ఈబాండులను కొనడం ద్వారా కూడా మన స్త్రీలు తమ పొదుపు ఉద్యమాన్ని పెంచుకొనవచ్చు. పైగా జాతీయ నిర్మాణానికి భద్రమగు రీతి తోడ్పడ వచ్చునుగూడ.

ఈవిధమగు పొదుపరితనం, వడ్డీ ఆదాయం పొందు సౌకర్యం మన స్త్రీలకు కల్గించుటకై, అన్ని జిల్లాలలోగల మహిళా సంఘాలకు అధికారమిచ్చుటకు ప్రభుత్వం పూను కొన్నది. వారి ఖర్చులుకొరకై వందకు ఒకటింబాతిక కమీషన్ యిస్తామన్నారు. బాధ్యత గల్గినవారి ప్రతినిధులనే యీ బాండులను అమ్ముటకై నిర్ణయించుచున్నారు. ఇప్పటికి విశాఖపట్టణం, ఏలూరు, నెల్లూరు బస్తీలలో ఆయా జిల్లా మహిళా సంఘాలు, తమ కార్యకర్తల సహాయంతో "ఆథరైజుడు ఏజెంట్లు"గా వ్యవహరిస్తూ యీ వుద్యమాన్ని బలపరుస్తున్నారు. మిగతా జిల్లా మహిళా సంఘాలు కూడా యీ వుద్యమ మందు చేరవలె నని నా ప్రార్థన.

కొంచెం కొంచెంగా పొదుపుజేయ గల్గుచున్న స్త్రీలు తమ జిల్లాలలో గల మహిళా సంఘ ఆథరైజుడు ఏజెంటుల ద్వారా, సేవింగ్సు ఆఫీసర్ల ద్వారా ప్రభుత్వపు బాండులను కొన ప్రయత్నించ కోరెదను.

---

## మీకు తెలియునా ?

1. 1954 ఏప్రిల్ 19 వ తేదీని ప్రారంభింప బడిన జాతీయ ప్రణాళిక ఋణానికి ఇంతవరకు సమ కూరిన సొమ్ము. (ఎ) దాదాపు 35 కోట్ల రూపాయలు. (బి) దాదాపు 45 కోట్ల రూపాయిలు. (సి) దాదాపు 60 కోట్ల రూపాయలు.

2. ఇప్పుడు నిర్మించ బడుతున్న చంబల్ ప్రాజెక్టు వల్ల క్రింది ప్రాంతాలకు మేలు చేకూరగలదు. (ఎ) ఉత్తర ప్రదేశ్, మధ్య ప్రదేశ్. (బి) రాజస్థాన్, మధ్య భారత్. (సి) పంజాబ్, భోపాల్.

3. 1953 లో ఇండియాలో బట్టల మిల్లులో ఉత్పత్తి (ఎ) దాదాపు 359 కోట్ల గజాలు. (బి) దాదాపు 450 కోట్ల గజాలు. (సి) దాదాపు 500 కోట్ల గజాలు.

4. అఖిలభారత ఖాదీ, గ్రామ పరిశ్రమల బోర్డు విధులు: (ఎ) చేనేత పరిశ్రమ అభివృద్ధి (బి) చేతిపనులలో ఉత్పత్తిని, నాణ్యాన్ని పెంచి, వాటి అమ్మకానికి తగు ఏర్పాట్లు చేయడం, (సి) ఖద్దరు, గ్రామపరిశ్రమల అభి వృద్ధికి ప్రణాళికలు తయారు చేసి వాటిని అమలుపరచడం.

5. ఇండియా ప్రభుత్వం తలపెట్టిన వివిధ ప్రణాళికల క్రింద 1951 సంవత్సరంలో తవ్వబడిన గొట్టపు బావుల సంఖ్య (ఎ) దాదాపు 1,000 (బి) దాదాపు 1,300 (సి) దాదాపు 1,700.

జవాబులు :

1.—(సి). 2—(బి). 3—(సి). 4—(సి). 5— (సి).

నా టి క :

# ఆవు బేరం

శ్రీ ఆయపిళ్ళ సత్యనారాయణమూర్తి.

(గత సంచిక తరువాయి)

పాత్రలు :

పంతులు. కమలం

చిట్టి : (పై దంపతుల కుమారుడు.)

కమలం : నూటఏభై రూపాయిలె! అయినా ఆవు బాగున్నాదిలెండి. చక్కని ఆవు. అంత పొడుగు పొట్టి లేకుండ సమానమయిన ఏపులో వుంది. ఆవు చక్కని తెలుపు. ఐరావతంలా వుంది రంగు!

పంతులు : కొమ్ములెట్లా వున్నై యేం?

క : బాగున్నయ్యండీ. కొమ్ములు అంచక్కా అర్ధచంద్రాకారంగా వొంపులు తిరిగి వున్నయి. కొన్ని ఆవులకు ఆ వొంపులు ప్రక్కలకు తిరిగి వుంటయి. కాని మన ఆవుకు ఆ వొంపులు వెనక్కు బాణాకరమల్లె తిరిగి మొనలు ముందుకు తేరినయి! కొమ్ముల చివర చిన్న చిరు మువ్వలు కట్టాలెనండీ___

పం : అట్లాగనె కానియ్.

: మెడలో ఓ చిన్న గంట కట్టాలె.

పం : అదీ కానియ్. నేను వద్దన్నానా.

క : చూడండి! మీ నాన్నగారి దేవతార్చన గంట వున్నది కద-అది కట్టేయనా?

పం : ఆవు మెడలోనా?

క : అవునండీ___ గోవేకద! గంట బూజుపట్టి భోషాణ పెట్టెలో పడివున్నది. మీకు ఏ దేవతార్చన లేదుకద. (మెల్లిగా నవ్వుతూ) కాఫీ దేవతార్చన తప్పించి___ఆ గంట ఉపయోగించనా?

పం : కానియ్!___

క : ఆవుపెయ్య కూడ బాగానె వున్నది. కాని దూడ అయిపోయింది. ఆడ గొడ్డయితె మరీ బాగుండేది!

పం : అదే వద్దన్నది కమలం! అది 'కోడె' అయి పుట్టింది. అది ఎందుకు ఆడపిల్లగా అవాలె?___ నీకు మీ ఆడ పిల్లలంటె సరదా తీరనట్టుంది.

క : ఇస్! ఊరుకోండి___మరీనూ!___

పం : పాలెట్లా ఇస్తోందంటావు?

క : గురువులు పాలు శేరున్నర తీశాడు. పూటకు శేరున్నర పాలు ఇచ్చింది మహామంచి గొడ్డండి___

పం : సామాన్యంగా వచ్చిందంటావా ఆవు! రమారమి వందన్నర ఆవులు తణికీలు చెయ్యగా చెయ్యగా ఇది దొరికింది. దీనికోసం తగువులు కూడ పడి, దెబ్బలాడుకుని ఆఖరకు విడిపించుకుని వచ్చాం. ప్రతి ఆవుకు పోటీలు తగులుకున్నై. ఇదన్న మన ఇంట్లో సంగతి విచారించి, నాకు ఆవుయందుగల అభిలాష పరికించి, ఆవును కొన్న వాళ్ళే అసలు ఖరీదుకు మనకు ఇచ్చివేశారు.

క : పాపం వారు కుటుంబీకులయి వుండాలి! చూడండి_ గురువులు పాలిప్పటం దేనికండి___మరో నాలుగయిదు రూపాయీలు దండక్కగాని ఆవు కామధేనువల్లెవుంది. పిల్లలు, నేనూ అంత దగ్గరగ వెళ్ళినప్పటికి ఏమీ చెయ్యలేదు. దగ్గరకు వెళ్ళబోతే మెడ అందిస్తోంది___ఆవు మన ఇంటికి వచ్చి రెండు మూడు గంటలయిందో లేదో ఎంత మచ్చిక అయిపోయిదండి. ఎంత మంచి ఆవండి!

పం : వాళ్ళ యింటబుట్టిన ఆవు మరీ___

క : గురువులు పాలు తీయ నవసరం లేదండీ___పాలు మనమే తీసుకుందాం. ఏముంది___ ఆమాత్రం ధారలు నేనె లాగేస్తాను.

పం : సరిలె అట్లాగనె చెయ్యి. గురువులు శ్రమకు ఓ అయిదు రూపాయీలు పారవేద్దాం.

## ఆ వు బే రం

క : మళ్ళా ఎందుకండి. ఇవ్వాళ సాయంత్రం ఆవును తీసుకు వచ్చిన వెంటనె అయిదు రూపాయీలు మీరు ఇవ్వటంలేదూ ?

పం : అది వేరేకథలె! గురువులు తన చేతి సొమ్ము, ఆవును మనకిచ్చిన వారికి బహుమానంగ ముట్టచెప్పాడు ఆ అయిదూ గురువులు తన కివ్వవద్దనే అన్నాడు. అయినా బాగుంటుందా చెప్పు- అందుకని ఇచ్చేశాను.

క : బాగానే వుంది. అయితే ఆవు నూట అరవై అయిందన్నమాట!___

పం : అలాటివన్నీ లెక్కలు చూస్తే ఇంకా ఎక్కువ అవుతుంది. మరి- కాఫీ ఖర్చుకు గురువులుకు నేనే రెండు రూపాయలు ఇచ్చాను. నేను రెండు రూపాయిలకు పైగా ఆవు బేరం సాగించినంతకాలం లైముజ్యూసులని సోడాలని తాగి వుంటాను.

క : ఉవ్వ!. ఈ అయిదూ కాకుండా మరో రెండు రూపాయిలు వాడి కాఫీఖర్చా! మంచి తెలివయిన వారె! అయ్యో!!___

పం : కష్టపడి కొన్నందుకు ఆదరం సాదరం లేకపొయ్యింది. ఒకప్పుడయినా నన్ను తెలివిగలవాడనని అన్నావు కనకనా? ఇంతకూ ఆవు బాగున్న దంటావా లేదంటావా?

క : ఆవు బాగున్నది లెండి___

పం : అయితే ఈ రాత్రప్పుడు నా మీద ఈ దీవెనలేమిటే కమలం! పగటివేళ ఎండలో ఆవుగొడ్డుకని తిరిగి తిరిగి వచ్చాను — ఇప్పుడో పిసరు కాస్త చల్లగా వున్నది కద-...

త : పొరపాటు ... పడుకుందాం లెండి! -

(ఆమరునాడు)

క : ఏమండీ! ఈ రోజు రెండుపూటలూ ఆవు అర్ధశేరసి పాలనె ఇచ్చింది.

పం : బాగా తియ్యడంలేదేమో?

క : బాగానె తీశానండి. అసలు పొదుగున పాలులేనిదీ ఏంతీశేదండీ ?

పం : మరి గురువులు శేరున్నర పాలు ఎట్టా పిండినాడంటావ్?

క : ఏమోనండి. వాళ్ళు ఆవును అమ్మబోయిన రోజున బాగా పూనబెట్టి వుంచుతారట! వాడు అవ్వే చిక్కేసి వుంటాడు.

పం : అందుకనె వాడిచేతనె మరొక రెండు రోజులు తీయిస్తే తేలి పొయ్యేదా-

క : ఎవరి చేతుల్లో ఏమున్నదండి దాని పొదుగులో పాలుండాలె గాని.

పం : ఏమయినా మగవాడు కాదు! అందులోనూ బాగా నలిగిన చెయ్యి!

క : మీరు కబుర్లు చెబుతున్నారు కద! మగవారాయెను! ఆమాత్రం రెండు పూటలూ ఓపిక పూని తీశేయిరాదండీ, వాడికి నెలకు పాలు తీసేందుకు మరో నాల్రూపాయిలు దండగ!

పం : అఁ హఁ ఎందుక్కాదూ! ఓపిక బాగానె వున్నది. కాని దీనికి ప్రాక్టీసు వుండాలె కమలం!

క : ప్రాక్టీసు కేమున్నదండీ! మగవారు కదండి___

పం : నిజమే-అందుకభ్యంతరం ఏమిటి- కాని ఇదే మొక లాటి రెండు సిరాల గొడ్డయితె నా ప్రాక్టీసు చూపేదును!

క : చాల్లెండి మీ ప్రాక్టీసు! రేపట్నుండి ఆ సగమన్నే ఇప్పేమనండి

* * *

(ఆ మరుచటినాడు)

పం : అమ్మ ఏదిరా చిట్టీ!

చిట్టి : గదిలో వున్నదినాన్నా. మొంటె అమ్మ మంచం మీద పడుక్కున్నది.

పం : కమలం! కమలం! ఏమిటిది? సాయంత్రం ఆరు గంటలప్పుడు పడక ఏమిటే?

చిట్టి : అది కాదు నాన్నా! అమ్మ ఏడుస్తోంది నాన్నా!

పం : ఏం కమలం? ఏడుస్తున్నావట వొంట్లో ఇబ్బందేమీ లేదుకద!

# ఆవు బేరం

క : ఏమీ లేదండి_

పం : లేకపోవడమేమిటి ? కంటినుండి కారిన నీటి మరకలు కనబడుతూ వుంటే_

చి : అది కాదు నాన్నా—మరంటే—మరంటే—

క : నోరు ముయ్యరా చిట్టి !

పం : వాడి నోరెందుకు ముయ్యటం_ చెప్పరా చిట్టీ !_

క : ఏమిటి చెప్పేది వాడి మొహం !_ అట్లాంటి దొంగ గొడ్డును కొనుక్కొని వచ్చారు.

పం : ఏం ? గొడ్డేం చేసిందేం ?_

క : అది దొంగ గొడ్డండీ. మనుషుల్ని తన్నుతోంది.

పం : అది కామధేను వంటి ఆవండీ అని నువ్వే అన్నావే_ ఇప్పుడేమిటి ఇలాగు ?_

చి : మరంటే మరంటే అమ్మను తన్నింది నాన్నా !

క : నోరు ముయ్యరా చిట్టీ !

పం : అదీ సంగతి. ఆవు తన్నింది ! ఎక్కడ తన్నింది చెప్మా ! ఎట్లా తన్నింది ?

క : ఎక్కడ తన్నింది ? ఎట్లా తన్నింది ? బాగా వున్నది మీ అడగటం. ఆవు గొడ్డు తన్నిందని నేను ఏడుస్తూ వుంటే.

చి : అమ్మను తన్నితే— అమ్మ—

క : చిట్టీ ! దొంగకానా ! ఉండు నీ పని చెప్తాను.

పం : చెప్పమ్మా చిట్టీ !

చి : చెప్పవద్దని అమ్మ దెబ్బలాడింది నాన్నా.

పం : భయం లేదులే చెప్పు.

చి : మరంటే అమ్మను తన్నింది ఆవూ ! అమ్మ వెనక్కు పడిపోయింది. అమ్మ లేచి కఱ్ఱపట్టుకుని వెళ్ళి ఆవును కొట్టింది. ఆవు—

క : వెధవాయ్ ! నిన్ను— చెప్తా నుండూ—

పం : అసలు ఆవు వెనకాళ్ళ దగ్గరకు ఎందుకు వెళ్ళాల్నేం నువ్వు ?

చి : మరంటే నాన్నా ! ఆవు—

క : చిట్టి ! వెధవ ! ! దొంగ అబద్ధాలు నువ్వూను. ఆ తండ్రి నోట్లోంచి ఊడి పడ్డావు అబద్ధాలకు.

పం : వాడు చెప్పేవన్నీ అబద్ధాలుగాని నువ్వు చెప్పరాదూ ?

క : చూడండి ! ఆవు పూటకు శేరు చుక్కలకన్న ఎక్కువ ఇవ్వటంలేదు. వందన్నర రూపాయిల గొడ్డు శేరున్నర చుక్కలు ఇవ్వవద్దటండీ ?

పం : పూటకు శేరు పాలకన్న మనం ఎక్కువ కోరటంలేదు కూడానూ. అది శేరు పాలనిస్తే అదే పది వేలని మనం అనుకోటంలా ?

క : అనుకున్నాం కాని అది దొంగ గొడ్డండీ !

పం : ఎట్లా అయ్యింది చెప్పూ ?

క : అట్లాంటి కొమ్ములున్న గొడ్డును కొంటారండి ?

పం : బాగుంది ! ఆ కొమ్ములు తిరిగిన ఆవు కోసం ఎంత తిరిగానని_ కొమ్ములు బాగా తిరిగి తిరిగి ఉండాలెనని నువ్వు కోరటంలేదూ ?

క : కోరినాననుకోండి. ఇట్లాంటి పొట్టేలు కొమ్ముల్లాగ ముందుకు మొనలు తిరిగిన కొమ్ములున్న ఆవును తెమ్మనమన్నానా ?

పం : సరి ! సరి ! ! కొమ్ములు ఎంచక్కా ఉన్నాయండీ అని సంతోషించి దాని కొమ్ములకు మువ్వలు కూడ తెప్పించి కట్టించితివి. ఇప్పుడేమయిందేం ?

చి : అమ్మను తన్నింది నాన్నా ఆవు ! అమ్మ వెల్లకిలా పడ్డది ! అమ్మ లేచి పెద్ద కఱ్ఱ పట్టుకుని ఆవును కొట్టేందుకు వెళ్ళింది. ఆవు కట్టు తెంచుకుని అమ్మను పొడిచింది.

పం : హాఁ_హాఁ_హ్హా ! ఎంత చక్కగా చెప్పావురా చిట్టీ ! ఏదీ ముద్దు !

క : ఎలక్కి ప్రాణ పోకట పిల్లికి చెలగాటంట !

పం : అమ్మను పొడిచింది ఆవు ! అమ్మ వెల్లకిలా పడ్డది ! అందుకే దాని కొమ్ములు మొనలు తిరిగాయి ఇప్పుడు.

క : ఏమయినా ఆవు మన యింట వద్దండీ !

పం : మానేయి. నాకోసం కొన్నానా యేమిటి ? ఆవు అవసరం ఉన్నదీ అంటే కొన్నాను. అసలు సంగతి అదీ. ఆవు తన్నటం, పొడవటం కూడ చేసింది. అందు

కనె అని దొంగ గొడ్డయింది. దాని కొమ్ములు మొనలు తిరిగినయ్ ఇప్పుడు. అవునా ?

క : ఇట్టాంటి పొదుపుల గొడ్డు తెచ్చుకుంటారండీ ?

పం : కమలం! ఒక అరఘంట ఆవును పరికించి దాన్ని ఖరీదు చేసి తీసుక వచ్చాను. నాలుగు రోజు లయి యింట్లో కట్టిన ఆవును నిన్నటి వరకూ అది కామధేను వంటూనే చెప్తూ వస్తివి. నీవు నాలుగు రోజుల్లో కని పెట్టలేకపోంది ఒక అరఘంటలో ఏం కనిపెట్టేది కమలం. ఇంతకూ ఆవు ఎందుకు తన్నాలె నిన్ను ?–

క : తెగులు! దానికి గడ్డి వేయబోతూవుంటె వెనక్కు తిరిగి మరీ తన్నింది—

చి : కాదునాన్నా! మరంటె అమ్మ పాలు తియ్యటానికి ఆవు దగ్గరకు వెళ్ళి పాలు పితుకుతూవుంటె– తన్నింది ?

పం : ఉ–ఉం. సరి! గొల్లవాడు రెండు పూటలూ ఇప్పు తున్నాడు కద! నువ్వెందుకు ఇప్ప వలసి వచ్చింది ?

క : అది దొంగ గొడ్డండీ—

పం : మేం దొంగమనుషులం— అది దొంగ గొడ్డు. నువ్వు ఒక్కర్తివి మట్టుకు మహా నిజాయితీ మనిషివి—

క : అది పాలు ఎగచేపేస్తోందండీ — గురువులు కేం పట్టిందేం– అట్టా ఇట్టా రెండు ధారలు లాగేసి చక్కా పోతున్నాడు. అందుకని—పోనీ— మధ్యాహ్నం కూడ మరో చేపు తియ్యవచ్చునను కున్నాను.

పం : దొంగతనంగా—! మరేం ? అందుకే తన్నింది.

క : పాలు ఇప్పబోతె తన్నుతుందేం ఆవు ? మహాగొప్ప బేరం చేసి తీసుక వచ్చారు ఆవును !–

పం : నా ఆవు బేరం అయిపోయింది. ఇది పాతిక్కో– పదికో తక్కువకు అమ్మివేసి– కావలిస్తే– శ్రీశ్రీశ్రీ కమలా దేవిగారు స్వయంగా మార్కెట్టుకు వెళ్ళి ఇంకో ఆవును బేరం ఆడి తీసుకోవచ్చును—

గురువులు: (ప్రవేశించి) అలా చెయ్యండమ్మగోరూ. పంతులు గారితో అప్పుడే చెప్పాను ఇయ్యావు వొద్దయ్యా అని– ఇనుకుంటేనా! ఇయ్యావును ఏదో కాడికి ఇచ్చే యాండి అమ్మగారూ! మరుచుట్టు వారం నాడు మీరు నా ఎనకాల రాండి. పంతులుగారేం కొన్నారు ఆవును.

(సమాప్తి)

# లలనానందం

## ఆవకాయ

• శ్రీ నందివాడ కామేశ్వరరావు •

అబ్బా! ఆ పేరు తలచుకుంటేనే నోరు వూరిపోతుందీ కాలంలో. మామిడికాయలు తరుగుతూ తరుగుతూ సగం ముక్కలు తినేస్తుంది మా వెంకమ్మత్త. అవునుమరి! యేం వచ్చినా యీ నాలుగు నెలలేకదా మామిడికాయల సందడి. ఆ తరువాత మనం కావాలన్నా అవిరావు. అందుకే చూడండి! యేపండ్లకీ లేని ప్రాముఖ్యత ఒక్క మామిడిపండ్లకే వుంది. వైశాఖమాసం రాగానే ముత్తయిదువులు మామిడిపండ్లు, పసుపు, కుంకుమ యిరుగు పొరుగు అమ్మలక్కలకి పంచిపెడతారు. మగవాళ్ళు బ్రాహ్మల్ని పిలచి మామిడిపండ్లు, విసనకర్రలు, గొడుగులు యిస్తారు. వైశాఖమాసం అల్లా సుభదినములేకదా! పెండ్లిండ్లు మొదలైన సుభకార్యములుకూడా యీ మాసములలోనే యెక్కువగా చేస్తారు.

అమ్మమ్మ ఆవకాయ పెడుతూవుంటే అటు వచ్చి యిటు వచ్చి ఒక్కొక్క ముక్కే యెత్తుకుపోతూవుంటారు మనుమలు. మామిడికాయ ముక్కలు ఉప్పూ, కారంలో అద్దుకు తిండం అంటే వాళ్ళకి చాలా సరదా! ఒక ప్రక్కనుంచి నాన్న తిడుతూనే వుంటాడు. "అదేమిటర్రా! మొన్నటివరకూ దగ్గుతో బాధపడుతున్నారుకదా! మామిడికాయి ముక్కలు ఆంబం చేస్తాయి" అని, ఒక మూలనుంచి కసురుతూవున్నా యింకోమూలనుంచి వాళ్ళ పని మానరు.

చైత్రమాసంలో మామిడిచెట్లు చిన్న చిన్న పిందెలు పెట్టగానే యిళ్ళల్లో నాయనమ్మలు అప్పుడే పచ్చడి బద్దలు పడేస్తారు. "అదేమిట్రా అబ్బీ! మామిడి పిందెలు బజార్లోకి తెగ వస్తున్నాయి. అందరూ కొనుక్కొని పట్టుకు పోతున్నారాయె! పిల్లలు చద్ది అన్నాల్లోకి యేమీ లేదని యేడుస్తారు. ఓ అణాడబ్బులిచ్చి పాతిక పిందెలు పట్రాకూడదూ!" అంటుంది మా బామ్మ. నాకు ఆవకాయ అంటే మహా యిష్టం కాని, వెధవది! పసరు పిందెలంటే అసహ్యం.

వైశాఖమాసం వస్తేనే గాని కాయముదరదు. కాయలు టెంక కట్టినదగ్గరనుంచి పాతికా పదీ కొనుక్కొని కొంచెం కొంచెము ఆవకాయ ప్రతీవాళ్ళ యిళ్ళలోను పెట్టుకుంటూనె వుంటారు. మా యింట్లో ప్రతీ వారం ఆవపిండి దంపే. ఆవకాయముక్కలుంటే అన్నంలోనికి మరేమీ అక్కర్లేదు. అందుకే మనవాళ్ళు యీ సుళువు కనిపెట్టేరు. పోనీ! నాలుగు నెలలైనా ఆడవాళ్ళకి వంటపొయ్యి దగ్గర కాస్త సుళువుగా వుంటుందేమోనని ఓ యిన్ని ఆవకాయ ముక్కలు చిన్న జాడీలో పడేస్తారు.

పప్పూ అన్నంలోకి ఆవకాయ చాలా రుచిగా వుంటుంది. పప్పూ అన్నం కలుపుకున్న తరువాత పిడచలు కట్టుకొని ఆవకాయ వూటలో ముంచుకు తింటే యెంతో రుచిగా వుంటుంది. ఆ వూట వేడిఅన్నంతో కలుపుకొని

## ఆ వ కా య

రెండు గరిటెలు నూనె వేసుకతింటే మరీ రుచిగా వుంటుంది. ఆవపిండి పూటతో అర్ధశేరు బియ్యపు అన్న మేనా తినివేయ వచ్చు ఒకపూటకి. యేదో మాటవరుసకి అన్నానుగాని అర్ధశేరు బియ్యపు అన్నం యీ రోజులలో యెవరు తినగలరు చెప్పండి? వుత్తి ఆబకాని? అంతా కాఫీ గతప్రాణులేకదా! యీ మామిడికాయల్నే మన వాళ్ళు చాలా రకాలుగా పెడతారు. కత్తెరముక్కలు, ఎండు ఆవకాయ, మాగాయ, ముక్కలు పచ్చడి, మామిడి తురుము పచ్చడి మొదలైనవి యీ రకాల్లోకొన్ని. వీటన్నింటి లోకీ మామిడి తురుము పచ్చడి, మాగాయ చాలాబాగుంటాయి. యెండిపోయిన మాగాయటెంక మజ్జిగలో నాన వేసుకుని పప్పూ అన్నంలో ఆ టెంక కొరుకుతూ పూట పీలుస్తూవుంటే యెంతరుచిగా వుంటుందో నేను చెప్పలేను. ఈ ఎండాకాలంలో కూరలు దొరకవు కాబట్టి మామిడి కాయ పచ్చడే, పూటావకాయ వుంటే అన్నంలోకి మరేమి అక్కర్లేదు. నాలుగుకూరల ఫలితం ఒక్క ఆవకాయ ముక్క అని మా దొడ్డమ్మ ఒకసారి అన్నది.

సంవత్సర మల్లా నిలవుండే వూరగాయల్లోకి అల్లా ఆవకాయ చాలా ముఖ్యమైంది. యేమాత్రం తడి తగిలినా వూరగాయంతా చెడి పోతుంది. ఒక్కచుక్క నీళ్ళు పడితేచాలు ఆవకాయంతా బూజుపట్టేస్తుంది. మా లచ్చి తెచ్చిపెట్టిన ఆవకాయ యెప్పుడూ బూజుకంపే. నాలుగు యెండలు తగలగానే తీసేస్తుందిటమరి! ఆవకాయకియెన్ని ఎండలు తగిల్తే అంతమంచిది. అందుచేత ఆవకాయ పెట్టే ఆడవాళ్ళు చాలా జాగ్రత్తతో పెడితే మగవాళ్ళు చక్కగా లొట్టలు వేసుకుంటూ తింటారని -యీ వ్యాసం వూహించి వ్రాసేను. అంతేగాని నాకు ఆవకాయ పెట్టడం యెలాగో తెలీదు. ఆవకాయ తిండం అంటే మాత్రం చాలా యిష్టం. యీ కాలంలో ఆవకాయపూట లేకపోతే భోజనమేమిటి చెప్పండి!

వూరగాయ పెట్టడంలో కూడా చాలా రకాలున్నాయి. ఒకొక్కొక్క ప్రాంతంవాళ్ళు ఒకొక్కొక్క మోస్తరుగా పెడతారు. పడమటివాళ్ళు పెట్టిన ఆవకాయ తూర్పువాళ్ళకి అట్టే యిష్టముండదు. ఎందుచేతనంటే పడమటి వాళ్ళు ఆవకాయలో యెక్కువ వుప్పు, నూనె వేస్తారు. అంత వుప్పు తూర్పువాళ్ళు తినరు. వుప్పు ఎక్కువగా వేస్తే వూరగాయ చెడి పోకుండా చాలాకాలం వుంటుందని ఆ ప్రాంతీయుల అభిప్రాయం. దక్షిణాది వాళ్ళు మరో మోస్తరుగా పెడతారు. ఆవకాయయొక్క ప్రాముఖ్యత ఒక్క ఆంధ్రులకే తప్ప యితర తెగలవారికి అంతగా తెలియదు. అరవ్వాళ్ళు కూడా ఆవకాయ పెట్టుకుంటారు, కాని మన తెలుగువాళ్ళు పెట్టినంత రుచిగా వుండదు. యెందుచేతనంటే వుప్పు, పులుపు, కారం యెక్కువగా తినేవాళ్ళు ఒక్క ఆంధ్రులే. తక్కిన ప్రాంతీయులు మనం తిన్నంత కారం, పులుపు తినరు. వుత్తరాదికి వెళ్ళే కొద్దీ మనం తీపేగాని కారం చూడం. వుత్తర హిందూస్థానం వాళ్ళకి తీపి వస్తువులంటే చాలాయిష్టం. కారపు వస్తువుల కన్నా తీపి వస్తువులు శరీరానికి చాలా బలాన్ని కలిగిస్తాయి. కారం, పులుపు, రక్తం విరిచేస్తాయన్న సంగతి అందరికి తెలిసిందే. అందుకే వుత్తరహిందూస్థానం వాళ్ళు వున్నంత దృఢకాయులుగా దక్షిణ హిందూస్థానీయులుండరు. కలకత్తా దాటిన దగ్గరనుంచి మనకు యెక్కడ చూచినా తీపి వస్తువులే చాలా కనిపిస్తాయి. కలకత్తాలో మనం యే హోటలుకి వెళ్ళినా తీపి పదార్థాలే యెక్కువగా వుంటాయి. వాళ్ళు అనేక రకాల మిఠాయిలు ఆకుదొప్పలలో పొట్లాలు కట్టి రైలుస్టేషనుల దగ్గర, బస్సుస్టాండుల దగ్గరా అమ్ముతారు. మనం ఆవకాయ తీసుకువెళ్ళి హిందూస్థానీయులకిస్తే వాళ్ళు యెంతో అపురూపంగా తింటారు.

అందుకే ఆవకాయ ఆరగించిన వాళ్ళకేగాని అమ్మ తల్లి కేంతెలుసును అన్నది మా అమ్మమ్మ.



# ముచ్చట తీరింది!

* శ్రీ నిష్ఫల బ్రహ్మాజీ *

పెనుగొండను పురములో
పేరుగలా సామీ
పేరయ్య కొడుకు
భీమయ్యున్నాడు.
డబ్బూ, దారం—
మేడలు మిద్దెలు—
భూములు పుట్టలు—
బోలెడు ఆస్తుంది.
పాపపు సొమ్మంటూ
అన్యాయమ్మంటూ
తండ్రి యార్జించినదంతా
వ్యర్థంగా తగలేస్తాడు.

భీమయ్యొకనాడు
ఓంటరిగా పోతూనెటకో
గుఱ్ఱము నొకదానిని
దారిలొ చూచాడు.
నల్లని మచ్చ, తెల్లని గుఱ్ఱం
తేటుగ వుందని తలచాడు
స్వారీ చేయాలని
మురిసాడు.
గుఱ్ఱపు వానిని
కూర్మితొ పిలిచి అడిగాడు :
"ఖరీదెంతొ ఖరారుగాచెప్పు
కొందును నేనీ గుఱ్ఱాన్ని"

గుఱ్ఱపు వాడప్పుడు
గుడ్లుమిటకరిస్తూ చెప్పాడు :
"మేలురకపు
జూలు గుఱ్ఱం బాబూ యిది!
మూడు వందలా
ముప్పాతికండీ!
అంతకంటే పైసా తక్కువ లేదు
పంచకల్యాణీ యిది
పరుగెత్తిందంటే
రౌతుకుదారే కానరాదు"
గుఱ్ఱపువాని మాటలు విన్న
భీమయ్యపుడు
నోరుఁ విప్పక
మారాడక
తక్కువ కిమ్మని
తరిచి యడుగక
మిక్కుటమని
మదిలో నెంచక
చప్పున పైకం
చక్కగ చెల్లించి

గుఱ్ఱముపై కురికాడు
కంచీపుచ్చుకు ఝుళిపించాడు
ధాం ధూం అని బెదిరించాడు
కాని ఫలితం సున్న :
గుఱ్ఱం ముందుకు
అడుగిడ లేదు.
ఆశ్చర్యం పొంది
అన్యాయమ్మని తలచి
ఆగ్రహాముతొ
అడిగాడప్పుడు భీమయ్య :
"కుంటిదా ? గుడ్డిదా ?
ఇదేమి ఖర్మమయ్యా

ఇంతటి శిఖండిముండ
బెదిరిస్తే బెదరదు
వెరపిస్తే వెరవదు
చస్తే ముందుకు నడవదు"
గుఱ్ఱపు వాడప్పుడు
గుసగుస లాడుతూ
భీమయ్య చెవిలో వూదాడు :
"ఛల్ ఛల్ యంటే దౌడుతీయును

# ముచ్చట తీరింది!

హోహోహై యంటే టక్కున నిలిచు
చక్కని తర్ఫీదును పొందిన
చుక్కలాంటి గుఱ్ఱమండీయిది"
"సరిసరి చక్కగ చెప్పావయ్యా!
చూస్తానిప్పుడె దీనిమజా" యంటూ
ఛల్ ఛల్ యని గుఱ్ఱమును
ఛప్పున చరిచెను భీమయ్య.
గప్పునధూళి లేచింది
గగనమ్మున కెగసింది
దౌడ్లేసుకు గుఱ్ఱం
దౌడెత్తింది.
గాలిని చీల్చుకు
ముందుకు వురుకుతు
వీధులు దాటి
పురమును విడిచి
తోటలలోనుండి
పరుగెడుతోంది.
తూరుపు మేఘం—
దూరపు కొండలు—
ప్రక్కకు నిటునటు చూచి
తలపైకెత్తెను భీమయ్య.
కొమ్మలు కొమ్మలు
రెమ్మలు రెమ్మలు
గుత్తులు గుత్తులు
నిగనిగ లాడే
నేరేడు పళ్ళు.
పళ్ళు తినాలని
మనసయిందాతనికి
గుఱ్ఱము నాపాలని
"హోహోహై" యని అరచాడు.
టక్కున గుఱ్ఱం
చక్కగ నిల్చింది.
నిలచిన గుఱ్ఱంపై
నిలుచుని చూచాడు.
చేతికిచిక్కిన పళ్ళు
చెట్టునుండి త్రెంపి
గుత్తికి గెత్తి
గుటుక్కు మనిపించాడు.
పళ్ళు కోస్తూ
ప్రక్కకు తిరుగగనె
టక్కున తోచిందాతనికొక
తుంటరి తలంపు.
'మంచి గుఱ్ఱమనె
యెంచి కొన్నాను
ఆడిన మాటకు
అర్థం తెలుసుకు వర్తిస్తుంది.
కానీ దీనిలో
మంచీ చెడూ
రెండూ వున్నాయ్.
బ్రతుకంటే
బితుకు లేక
నిక్కానేనిటు నిలుచుండగను
వెనుకనుంచి యెవరైనా
ఛల్ ఛల్ యంటే ?—'
తలపిట్లే తలపుగనుండి
తప్పిజారి నోటివెంట
వచ్చినట్టి మాటవిన్న
చలాకీ గుఱ్ఱం
చప్పున దౌడెత్తింది.
తల క్రిందకు
కాళ్ళు మీదకు
జారి క్రిందకు
వారి తుప్పలలో
వెల్లకింతలా
పడిపోయెను భీమయ్య.
చలాకీ గుఱ్ఱమును
చడామడా తిట్టి
చేసిన తప్పుకు
చెంప వాయించుకుని
కుయ్యో మొర్రో అంటూ
కుంటికాలు సవరించుకుని
ఇంటిదారి పట్టాడు.
తుప్పల్లో పడగానే
ముచ్చట తీరిందాతనికి
నాటినుంచి గుఱ్ఱమంటే
గుండెల్లోదడ పుట్టింది.

చిన్న కథ

# "అలక తీరింది!"

శ్రీ వి. యస్. జోగిపంతులు, బి. ఏ.,

"నా కేమిటో అక్కడికి వెళ్ళడానికి మనస్కరించడం లేదమ్మా!" అన్నాడు శంకరం. తల్లి మనస్సు చివుక్కుమంది. అయినా అతని అభిప్రాయం అతనిదే. రామచంద్రం గారి కంటె తను ఏమంత కాకపోయాడూ? ఆయన ఎక్కువేమి, తన తక్కువేమి? ఆయనా తనూ ఒకంతటివాళ్ళే నాయె! ఆయన పేరు వేయడమేమి- తనను పూర్తిగా విడవడమేమి? ఇది చిక్కు! తనంతటి మనిషికి అంతకంటె అవమానమేముంది? అసలు సుబ్బారాయుడుగారు తెలిసే చేశారా?- లేక ఆయనకు తెలీకుండా ఎవరేనా అచ్చు వేయించేశారా? అయినా ఇది రాంబాబుకి ఇష్టమయిందా? వాడి పెళ్ళిలో ఎంతో ఉత్సాహంగా, సరదాగా గడుపుదామనుకొని ఉవ్విళ్ళూరిన తనకి ఈ గొడవ దాపురించిందేమిటి- మధ్య? వెళ్ళి పెళ్ళిలో పాల్గోడానికి అంతగా మనస్కరించటం లేదాయె! అసలు వాళ్ళు 'బంధుమిత్రుల అభివందనములతో' అని జనరల్‌గా కొట్టిపారేస్తే ఏ గొడవా లేకపోను! అసలు అప్పుడు తన పేరు వేయలేదని తాను అభిమాన పడవలసిన అవసరమే ఉండేది కాదు. కాని రాంబాబుకి తనో మేనత్త కొడుకూ, రామచంద్రంగారింకో మేనత్త కొడుకూ గద- అలాంటప్పుడు ఒకరిని స్మరించి మరొకరిని పూర్తిగా విస్మరించడం- అదేమిటో- తన హోదా మీద, తన గౌరవం మీద, తన అంతస్థుమీద వాళ్ళేదో, కుట్రపన్ని, చిన్న చూపు చూస్తున్నారని అతను మహా మథన పడ్డాడు, పాపం! ఇహ పెళ్ళిమాట తలపెట్ట కూడదనుకున్నాడు.

తల్లి కంటతడి పెట్టి- "నేను చచ్చాక మీరెలా వున్నా నాకే చింతా లేదు. నేను బ్రతికి వుండగా తోడ బుట్టిన వాడి కొడుకు పెళ్ళికి వెళ్ళకుండా ఉండలేను" అన్నది. శంకరం సహజంగా చాలా మెత్తని మనిషి. అయినా యీ విషయంలో మాత్రం అతను ఎందుకో అంత పట్టుదల చూపిస్తున్నాడు. అతని మానుషం అతని పట్టును విడదీయకుండా వుంది. తల్లి యీ విషయం గురించి అంత బాధ పడుతుందని తనకి తెలుసు- అయినా అదే అధిగమిద్దామనుకున్నాడు. కాని సమక్షంలో తల్లి కంటనీరు చూసి అతనూ కరిగిపోయాడు. "ఛా! ఈపాటి దానికి అంతలేసి మాటలెందుకమ్మా, కళ్ళు తుడుచుకో! అలాగే వెడదాం. ఒక రోజు ముందుగానే వెడదాం, సరేనా?" అన్నాడు- అక్కడకు పోయి వేరే విధాల వాళ్ళకి తన ప్రతాపం ప్రదర్శిద్దామని! తల్లికి మాత్రం తన కొడుకుని మించిన బుద్ధిమంతుడూ, తెలివైనవాడూ ఈ ప్రపంచం మొత్తం మీదనే ఎవరూ లేరనిపించింది.

రాంబాబు ఎందుకో ఏమోగాని ఈ మధ్య ఎవరితోనూ అంతగా మాట్లాడ్డం లేదు. స్నానానికీ, భోజనానికీ తప్ప గది విడిచే రావడం లేదు. రామచంద్రం వచ్చినా, అతను వేరే పెళ్ళి పనులు చూస్తున్నాడు గాని రాంబాబుతో మాట్లాడ్డమే లేదు. ఈ మార్పును అంతా గమనించారు. సుబ్బారాయుడుగారు చిరునవ్వు నవ్వుతున్నారు. పార్వతమ్మగారు ఏమిటో పాపం వుండి వుండి చాటుకి పోయి కళ్ళ నీరు పెట్టుకుంటోంది. శుభమల్లే ఇదేమిటని నలుగురూ అంటారని అక్కడి కక్కడే గట్టిగా ఒత్తుకొని మరీ పైకి వస్తోంది. మరెందుకూ గాదు- పెళ్ళి దగ్గర పడేసరికి ఎప్పుడూ ఎంతో ఉత్సాహంగా వుండే వాడు అలా మూతి ముడుచుకొని కూర్చుంటున్నాడు. ఎందుకో, ఏమో? అయితే ఒకటయి వుండాలి. పెళ్ళి కూతుర్ని ఎన్నుకోవడంలో రాంబాబు పాత్ర అతన్ని నిర్వహించుకోనీయలేదు. కనీసం రాంబాబు పిల్లని చూడనైనా లేదు. చదువుకున్నదో లేదో- కాస్త రూపవతి అవునో కాదో- తనలాంటి అభిరుచులు కల్గిన యువకుడికి ఆమె తగునో తగదో- తనకు ఏమీ తెలీదు. తన సుఖం ఆమాత్రం గమనించకుండా

నాన్నగారు యీ సంబంధం ఒప్పుకుంటారా? అయితే నాన్నగారు తన మేనత్తకు చేసిన సంబంధం విషయమై అతనింకా మరచిపోలేదు పాపం. 'శెలైన్తే వంటి పొయ్యడం చస్తే ముండ మొయ్యడం' అన్నట్టే అయింది గాని సంసారిక జీవితం, ఆ సుఖం ఏమిటో ఆమెకు తెలీనే తెలీదు గదా! మరి తన విషయం అంతకన్నా భిన్నంగా చేస్తారని ఎక్కడ? అయినా జీవిత సర్వస్వానికి సంబంధించిన ఇంత పెద్ద విషయం నిర్ణయించడంలో తనకు స్వేచ్ఛ ఎందుకు లేకపోవాలి? ఆమాటకు వస్తే, తనకు నాన్నగారు స్వేచ్ఛ ఇచ్చిందెప్పుడు కనక! పట్నంలో అద్దెకు గది తీసుకోవడం వరకు అన్నీ నాన్నగారి ఆదేశాలే! 'నాకు కోటు అంత అవసరంలేదు నాన్నగారూ!' అంటే 'ఛా! అంత చదువుతున్నవాడికి కోటు లేకపోతే ఎలాగ? మా కాలంలో మెట్రిక్లేషన్......' అని ఏదో అనేవారు. అదివరకు ఏ విషయంలోనూ లేని స్వేచ్ఛ తనకు ఈ విషయంలో లేకపోయిందని విచారించడం దేనికి? అయినా మానవ మాత్రుడు మథన పడుతున్నాడు. ధిక్కరించడానికైనా, చిన్న విషయాలలోనే ధైర్యం లేనివాడు. ఇలాటి పెద్ద వ్యవహారాల్లో సాహసిస్తాడా? ఉహూఁ!

పెళ్ళి ఏర్పాట్లన్నీ పెళ పెళ లాడుతూ జరిగిపోతున్నాయ్. ఆ ఎత్తంతా చూస్తే 'వీరే ఆడ పెళ్ళివారా?' అనేలా వున్నయ్. అంతా హడావిడిగా అటూ ఇటూ తిరుగుతున్నారు. ఎవర్ని చూసినా ఎంతో సందడి. "గుమ్మాల్లో నుంచో వద్దని మీకు ఎన్నిసార్లు చెప్పాల్రా!" అని సుబ్బారాయుడిగారి గొంతు మాత్రం అంత గొడవలోనూ అడపా తడపా స్పష్టంగా వినబడుతోంది.

శంకరం వచ్చింది లగాయతు రాంబాబు గదిలోనే తిష్ట. ప్రొద్దుటినుంచీ ఏమిటేమిటో నూరి పోసేస్తున్నాడు. రాంబాబు అలాగే 'ఊఁ' కొడుతున్నాడు.

"ఇంత పెద్ద విషయంలో నీకు స్వేచ్ఛ లేకపోవడం..." మాట తపీమని ఆగిపోయింది. పార్వతమ్మగారు అలా వెడుతూ గదిలోకి తొంగి చూసింది. అంతే! రథం మళ్ళీ కదిలింది. "ఇదే నేనైతే ఆరు మూడైనా, మూడు ఆరైనా........" మళ్ళా ఎవరో వస్తున్న అలికిడయింది. శంకరానికి వళ్ళు మండింది. లేచి తలుపు గడియ వేసి వచ్చాడు. "కనీసం పిల్లనైనా చూపించక పోవడం ఎంత దారుణం. ఆలోచించు. ఇది నా లాంటి వాళ్ళు హర్షించ లేరు సుమా!"— మొదలు పెట్టి ఏమేమో చెప్పుకు పోతున్నాడు— చెప్పేవాడు! "అ సన్నివేశ లొకటి వినకు రాస్తే? బుద్ధి వుండక్కర్లేదూ? అన్నీ అచ్చు తప్పులే! నీ పేరుకు డిగ్రీ రగిలించొద్దూ. చెప్పొచ్చే. వత్తి అడివి మాలోకం అయిపోయిందనుకో..." "శంకరం అన్నయ్యా నిన్ను పిన్ని రమ్మంటోంది"— పిలుపు! శంకరం తలుపు దగ్గరసా పెట్టి అవతలకు వెళ్ళాడు. రాంబాబుకి ఎందుకో నవ్వొచ్చింది.

పెళ్ళివారంతా తరలి వెళ్ళారు. ఊరంతా అగోలా కనబడింది వారికి. ముఖ్యంగా శంకరానికి కిష్కింధా పట్టణంలా కనబడింది. తన కోపానికి ఆజ్యం పోసినట్టు అక్కడి పరిస్థితులు. సుబ్బారాయుడుగారికీ, పార్వతమ్మగారికీ తదితరులైన మగపెళ్ళి వారందరికీ ఆడపెళ్ళివారి ఆతిథ్యవిధానాలూ, ఆ ఏర్పాట్లూ అన్నీ చాలా సంతృప్తి కలిగించాయి. రాంబాబుకి కూడా కొంత ఆశ్చర్యం కలిగించింది ఆ వాతావరణం. అక్కడి వారంతా నల్లి అనాగరికులనీ, మంచీ మర్యాదా ఏమీ తెలియనివారనీ ఏమేమో చెప్పి పోశాడు. కాని అలాగా [illegible] కనబడుతున్నయ్. ఆడపెళ్ళివారి తాలూకు అంతా చదువుకొన్నవాళ్ళే. అటు సంప్రదాయాల్లోని మంచిని గ్రహించి, ఇటు అభ్యుదయంలోని మెరుగునీ కలబోసిన వారిలాగా కనబడ్డారు. ఆ పిల్లను గురించి తనకి అంతా తెలుసున్నట్టు చెప్పాడు శంకరం. అది మరింత ఆశ్చర్యం కలిగించింది రాంబాబుకి. మంగళసూత్ర ధారణ సమయంలో ముఖంలో ముఖం వుంచి చూడాలనుకున్నాడు కాని అంతమందిలో సిగ్గు విడిచి ఆమె నవ్వే సాహసం అతనికి చాలకపోయేసు. అయితే రాంబాబుకి భార్య అతిలోక సుందరిగా కనిపించింది. అతని ముఖంలో వ్యక్తమైన సంతృప్తిని సుబ్బారాయుడుగారు గమనించక పోలేదు. పెళ్ళి అయిదు రోజులూ హరికథలూ, కూచిపూడి భాగవతుల నాట్య ప్రదర్శనాలూ అవీ ఏర్పాటు చేశారు. మూడోనాటి మధ్యాహ్నం తంతు చూచి మగపెళ్ళి వారందరికీ భలే విడ్డూరమయింది—

## "అలక తీరింది!"

అది వారి ఆచారం— ఒక అరబస్తా బియ్యానికైతే వార్చి, పప్పూ, పులుసూ కాచి తోటలో– అదీ ఒక నిర్దేశ స్థలం– ఒకచోట చాపలు పరచి అన్నం అక్కడ కుప్పగా పోసి, గుంటచేసి పప్పూ, పులుసూ పోస్తారు. రెండు మూడు వందల కోతులు అక్కడ చేరుతాయి. పెద్దకోతులు పిల్లకోతి చెయ్యిపట్టి ఆ అన్నపు రాసిలో దూర్చి అటూ ఇటూ చెదిరిస్తాయి. వేడి వేడి ఆ అన్నపు రాసిలో చేతులు కాలిపోయి పిల్లకోతులు 'కుయ్యో మొర్రో' అంటున్నా తల్లి కోతులు ఏమీ లక్ష్యం చెయ్యవు. ఇలా చెదిరిపోయిన అన్నం కోతులు ఏరుకు తింటాయి. ఒక పెళ్ళిలో కనీసం ఒక కోతి పిల్లయినా చస్తూంటుంది. ఆ సాయంత్రం గోదావరి పాయదగ్గర కోతులు స్నానం చేస్తున్నాయీ అంటే కోతి పిల్ల చచ్చిందన్నమాటే! అయితే, ఏం చేస్తాయో ఏమో గాని ఆ వూళ్ళో వున్న శతవృద్ధులుకూడా ఎప్పుడూ చచ్చిన కోతిపిల్లను తమ కళ్ళతో చూడలేదట! ఈ తంతుకు ముందు– వయోవృద్ధులైన ఒక మగ కోతి, ఒక కోతి పందిట్లో కుర్చీలలో కూర్చున్న వధూవరుల దగ్గరికి వస్తాయి. వారు ఆ కోతుల్ని తల నిమిరి బొట్టు పెట్టి ఆశీర్వదించి, కాయో పండో చేతికిచ్చి సాగనంపుతారు. ఈ ఘట్టానికి కొంత ప్రాధాన్యత వుందట— సీతరాములు పట్టాభిషేకోత్సవ సమయంలో– తమకు ఎంతగానో సహాయం చేసిన వానరులకు తమ కృతజ్ఞతలు వ్యక్తం చేసుకోవడమట! వధూ వరులు సీతారాములు. ఇట్లా ఆ వృద్ధ వానర దంపతులు ఆశీఃగ్రహణం కోసం రాకపోతే ఏదో కీడు మూడుతుందని అక్కడి వారి విశ్వాసం. ఈ ఆచారంలో వుండే మంచి చెడ్డల విషయం అలావుంచి రాంబాబు మనసులో వారిని చాలా అభినందిచాడు. ఆ సందర్భంగా అర్థాంగిని బాగా చూడడానికి అవకాశం లభించింది. ఆమె ముఖంలో నమ్రత, ఓరిమి, సంస్కారం నాగరికత– ఇలాటివన్నీ ఏవేవో అతని కలల్లోని ఊహా సుందరి పుణికి పుచ్చుకొన్న గుణాలన్నీ ఆయా పాళ్ళలో అతనికి కనబడినయ్. శంకరంమీద అతనికి చాలా కోపం వచ్చింది. అతడు ఏదో విషయంలో అలక పూని వుంటాడనీ, తన అవ్యక్తమైన అయిష్టతను పూతగా జేసుకొని ఆ అలకను తీర్చుకొడానికి ప్రయత్నించి వుంటాడని అతనికి ఎందుకో అనిపించింది. అలక పాన్పుమీద కారు కోరమనీ, మోటారు సైకిలు కోరమనీ లేకపోతే మంచం మీదనుంచి లేవొద్దనీ ఏమో చెప్పాడు. తీరా మంచం మీద కూర్చోబోయేసరికి తను–

"నాకు నచ్చిన అంత అందమైన అమ్మాయిని ఇచ్చారు. నా కివ్వవలసినదీ, ఇవ్వగలిగినదీ మీ దగ్గర ఇంకేమీ వుండి వుండదు" అంటూ లేచిపోయాడు. శంకరం ఇది సహించలేకపోయాడు. రాంబాబు శంకరాన్ని సహించలేకపోయాడు.

"మరో మూడు రోజులు ఇక్కడే వుండి మనుగుడుపులూ అవీ జరిపించుకునే వెళ్ళాలి మీరు– అది మా ఆచారం, ఆ పైన మీ యిష్టం–" అన్నారు వియ్యంకుడు గారు. సుబ్బారాయుడు గారూ, పార్వతమ్మ గారూ అంగీకరించారు. సుబ్బారాయుడి గారి ప్రక్కకు చేరాడు శంకరం.

"అదికాదు మావయ్యా. మన ఇంటా వంటా ఇలాంటివిది లేదు. మనకీ........"

"ఆగరా! అది మా బోటి పెద్దవాళ్ళు చూసుకోవాల్సిన విషయం– నీకెందుకు చెప్పూ?"

శంకరంతోబాటు తల్లికూడా ఈ మాటకి ఎంతో బాధపడింది. తన కొడుకు కోప కారణాన్ని తాను బయలు పెట్టినందుకుకదా– తన అన్నగారు తనవాడిని ఇంత చులకన చేస్తున్నదీ– అనుకుంది.

"మొదటి నుంచీ అంతా పుల్లవిరుపుగానే వుంది వ్యవహారం!"— అన్నాడు శంకరం వెనక్కు తిరిగి.

తల్లి అందుకున్నది "అవున్రా! రామచంద్రం కన్నా వీడు అంత కాని వాడయాడుగా మరీ!" ఆమె కంఠం పూడుకుపోయింది. సుబ్బారాయుడు గారిలో కొంత చలనం కనపడింది.

"రత్తమ్మా! నువ్వూ............" అంటూ అటు తిరిగారు. పందిరి రాటకు అట్ట ఒకటి కనబడింది—

"శ్రీ పి. బి. శంకరరావుగారి ప్రత్యేకాభివందనములతో" అనే అక్షరాలు రాసివున్నయ్.

"అలక తీరిందా బావా?" అంటూ రాంబాబు నవ్వుతూ లోపల్నుంచి వచ్చాడు.

సుబ్బారాయుడు గారికి కూడా నవ్వు ఆగలేదు. శంకరం అలకను గుటకలుగా చేసి మింగుతున్నట్టున్నాడు!!



# తీరని కోరిక - మరువని మహలు

శ్రీమతి గాడిచర్ల సుబ్బాయమ్మ

నేను ఇతర పెద్ద పట్నాలేవీ చూడక పోవటం చేత మద్రాసుకైనా తీసుకెళ్ళి చూపించమని మా ఆయనన్నా, అడుగుతూ వుండేదాన్ని. అల్లాగే తీసుకెళతా నంటూండే వారు.

కొన్నాళ్ళకు మా ఇరుగు పొరుగు స్నేహితురాండ్రు కొందరు ఒక మొగాయన సహాయంతో కాశీ రామేశ్వరములు తీర్థ యాత్రకని బయలుదేరుతూ 'నువ్వు కూడా వస్తావా?' అని నన్నడిగేరు. నేను చాలా సంతోషపడి వాళ్ళతో వెళ్ళి దేశం అంతా చూసి, జాగ్రత్తగా వస్తానని మా వారికి నచ్చజెప్పాను. మొత్తానికి వెళ్ళడానికి వొప్పుకుని ప్రయాణపుఖర్చులకు కొంత డబ్బు చేతికిచ్చి పంపారు. మేమందరము చాలా సరదాగా బయలు దేరాం. ఆనాడు రాజమండ్రీ స్టేషన్‌లో కలకత్తా మెయిలు ఎక్కి మరునాడు ప్రొద్దుటికి జగన్నాథంలో మొదటి మజిలీలో దిగాం. అక్కడ చంద్రకేత మహానదిలో స్నానం చేశాము, ఆ నదీజలము ఆకు పచ్చగా ఉంటుంది. పూర్వము చంద్రకేత మహారాజు గోదానము చేసినప్పుడు, ధారపోసిన నీరు నదిక్రింద ప్రవహిస్తోందని, ప్రతీతి. దానిలో, లేగదూడల ముఖముల పోలిన, పెద్ద పెద్ద తాంబేళ్ళు కూడా ఉన్నాయి. తరువాత జగన్నాథస్వామి దర్శనం చేసుకుని, మళ్ళీ ప్రయాణం సాగించి కలకత్తాకు చేరుకున్నాము. ఇక్కడ నాలుగు రోజులుండి పట్నంలో ఉండే విశేషాలు చూశాము. తరువాత మహాపుణ్య క్షేత్రమైన కాశీ పట్నం చేరుకున్నాము. గంగానదిలో స్నానంచేసి.

శ్లో॥ విశ్వేశం, మాధవం, ఢుండిం
దండపాణించ. భైరవం
వంచేకాశీం. గృహం గంగాభవానీ
మణి కన్యక, మణి కన్యక

అని ధ్యానించి గంగకు గల 64 ఘట్టములు చూసి కాశీవిశ్వేశ్వరుని ఆలయంలోకి వెళ్ళి విశ్వేశ్వరుని దర్శనం చేసుకున్నాము. వారంరోజులు ఇక్కడ వుండి చూడవలసిన విశేషాలన్నీ చూసి, మళ్ళీ ప్రయాణం సాగించి, గయా, ప్రయాగ, అల్‌హాబాద్, అయోధ్య, హరిద్వారం, నాసికా త్ర్యంబకం మొదలైన పుణ్యక్షేత్రములనుసేవించి ఢిల్లీ చేరుకున్నాము. అల్‌హాబాద్‌లో శ్రీ జవహర్‌లాలు భవనం చూసి, ఢిల్లీలో నాలుగు రోజులుండి, రెడ్ ఫోర్టు, కుతుబ్‌మినార్, బిర్లామందిర్, గాంధీజీ సమాధి ప్రదేశం, మొదలైన విశేషాలు చూశాము. ఒకనాటి రాత్రి మా సంభాషణల్లో ఆగ్రా ఇక్కడకు దగ్గరనిన్నీ, ప్రపంచప్ర విచిత్రములలో ఒకటైనదై యుంటదన్నీ, గొప్పశిల్ప చాతుర్యముగలదై, చాలా అందమైన తాజ్‌మహలు ఇక్కడే దగ్గరలో వున్నదని విన్నాను. చూడాలని నా మనస్సు చాలా ఆత్రుత పడ్డది. మా జట్టులో వారు కొందరు వెళదామనీ, కొందరు చూసేదేమిటనీ, తర్కించుకున్నారు. ఆఖరుకు వెళ్ళటకే నిశ్చయించుకున్నాము. మరునాడు బయలుదేరి ఆగ్రా వెళ్ళాము. తాజ్‌మహలు ఎప్పుడు చూస్తునా అని నా మనస్సు చాలా తొందర పడ్డది, ఎందు చేతనంటే, ప్రపంచాద్భుతములు ఏడింటిల్లో తాజ్‌మహల ఒకటిగదా! దగ్గరలోకి వచ్చి చూడకుండా వుండటమేమిటా అని అనిపించింది. కాని మాతోవున్న కొంతమంది ఆ తురకగోరీ చూసేదేమిటి? పుణ్యమా పురుషార్థమా అని అనుకుంటూనే బయలుదేరారు.

ఉదయమే కొంతమంది [illegible] తాజ్‌మహలు చూడటకు బయలుదేరాం. అది ఊరికి దూరంగా [illegible] చాలా దూరం నడువవలసివచ్చింది. తాజ్‌మహలు చూస్తామనుకొనే సరదావల్లయీ నడక అంత ప్రయాస అనిపించలేదు. ఆఖరుకు దూరాన చిన్నరూపంలో తాజ్‌మహలు కనిపించింది. తాజ్‌మహలుయొక్క [illegible] దగ్గరగా నడక సాగించి తాజ్‌మహలు ముందు వున్న గోపుర సింహద్వారము వద్దకు చేరాము. ద్వారమునుండి రెండు వైపులా మామిడిచెట్లు, పూలచెట్లతోనూ ఎంతో అందంగా కనుపించింది. చెట్ల నీడలు మహలు ముందువున్న నీటి చపటాలయందు ప్రతిబింబిస్తూ చూడటకు అందంగా వున్నాయి.

'చాలా అందమైనదయినంటి ఆ ముంతాజ్ స్త్రీ గదా దీనికి కారకురాలు' అని మాలో మేము అనుకుంటూ ముందుకు రాగా క్రింద మహలుయొక్క మెట్లు, పైకెక్కాక్కి

## తీరని కోరిక_మరువని మహాలు

మేఘములలో ఒక తెల్లని మేఘములాగు కనుపించింది. కొంత దగ్గరకు రాగా ఆకాశంలోనించి గుమ్మటం వ్రేలాడుతున్నట్లున్నది. ఇంక గుమ్మటముయొక్క తెలుపు రంగులు మేఘాలతో కలిసిపోయినట్లున్నాయి. సింహద్వారపు తలుపులు చాలా పెద్దవిగాను భారముగాను ఉన్నాయి. ఒక అరగజం వెడల్పుగల తాళం కప్ప దానికి వేయబడివున్నది. గోడలనిండా ఎన్నో రకరకాల బొమ్మలు రంగులతో చిత్రించి వున్నాయి. అక్కడ పాలరాతి పలకలు ఈగ వాలిన జారిపోయేటట్లు ఉన్నాయి. ఎదుట రెండు పాలరాతి గోడలున్నాయి. దానికి అడుగు భాగంలో భార్యా భర్తల సమాధి చేయబడ్డ స్థానమని తెలుపుతూ రెండు గోరీలున్నాయి. ఆ గోరీలవద్ద ఒక దూత పూజారిత్వం చేస్తూ ఉన్నాడు. అక్కడ సంగతులన్నీ చెపుతూ మా చేత గులాబీ పూవులను గోరీలమీద వేయించాడు. క్షణకాలం "అల్లా" స్మరణ జరిగింది. ఇవతలకి వచ్చి మహాలుకి నాలుగు వైపులా వున్న పెద్ద స్థంభాలలో ఒకటి ఎక్కాము. మాతో దొరలు కూడా ఇద్దరు ఎక్కారు. బురుజుపైకి వెళ్ళుటకుగల మెట్లు ఎన్నోగలవు. పైనించి చూస్తే వూరంతా కనిపించింది. కింద నున్న యిండ్లు చిన్నచిన్న గొడుగుల్లాగ కనుపించాయి, మాతో ఎక్కిన దొరలు తాజ్‌మహాలుకు నాలుగు వైపులా ఫొటోగ్రాఫులు తీశారు. తిరిగి మేము దీపపు వెలుతురు సాయాన్ని మెట్లు దిగి కిందకు వచ్చాము. మరోమాటు మహాలంతా చూశాము, ఆ చుట్టుప్రక్కల వారి వంశీయుల సమాధి గోరీలెన్నో ఉన్నాయి. మేము వెళ్ళిపోదామని బయలు దేరాం, మహాలు కనిపించేంతవరకు వెనక్కి తిరిగి తిరిగి చూస్తూనే నడక ప్రారంభించాం. కొంత దూరం వచ్చాక మహాలు కనిపించటం మానేసింది. కాని నా హృదయంలో యిప్పటికి కనిపిస్తోనేవుంది ఆ మరపురాని మహాలు.

గీ॥ ధరను వర్ణింపలేనట్టి । తాజ్‌మహాలు
ఆగ్రయను పట్టణంబున । యవతరించె
కోర్కెలీడేరవెలసెనా । కోమలాంగి
ముద్దుగుమ్మటమై మెరసె । ముదము తోను॥

గీ॥ గర్భమందున తామేటి । కళలదాల్చి
భావనాలంకృతనవసౌ । భాగ్యగరిమ
పేర్మిగొంటివి వైభవో । పేతముగను
అవని వెలలేనిచాతురీ । మయమనంగ॥

గీ॥ పృథ్వియంతయు నెల్లెడల । పొలుపు మీర
నీదునీడ యెగురుతుగా । నిలిచియుండ
చరితకందని ప్రకృతి । చెలువుమిగుల
వెలసితివి భారతావనీ: విభవమొప్ప॥



## మీ కు తె లి యు నా ?

1. ఇండియాలో రైల్వే ప్రయాణీకుల వల్ల లభించే ఆదాయం ప్రతి నూరు రూపాయిలలోను మూడవ తరగతి ప్రయాణీకుల వాటా: (ఎ) 52 రూపాయిలు (బి) 67 రూపాయిలు (సి) 88 రూపాయిలు

2. ఎడారులను అడవులుగా మార్చడానికి కేంద్ర పరిశోధక సంస్థ ఎచ్చట కలదు?

(ఎ) ఢిల్లీ (బి) జోధపూర్ (సి) జైసల్మేర్

3. 1952_53 తో పోల్చి చూచినప్పుడు ఈ ఏడాదికి గోధుమ పంటసాగు విస్తీర్ణం ఎంత జరిగింది?

(ఎ) 75, 000 ఎకరాలు (బి) 90, 000 ఎకరాలు (సి) 1, 50, 000 ఎకరాలు

4. ఉదారంగా విరాళాలు ఇవ్వవలసిందని ప్రధాని నెహ్రూ విజ్ఞప్తి చేసిన జాతీయ ప్రణాళిక ఋణానికి వడ్డీ

(ఎ) నూటికి ఒకటిన్నర (బి) నూటికి రెండున్నర (సి) నూటికి మూడున్నర

5. ఇందులో ఏదినిజం?

(ఎ) దామోదరలోయ ప్రాజెక్టు ప్రకారం కలకత్తా నుంచి రాణీగంజి బొగ్గుగనులకు ఒక కాలువ త్రవ్వబడుతుంది.

(బి) కక్రసారా ప్రాజెక్టు ప్రకారం, సముద్రం నుంచి కక్రసారా అనకట్టకు, ఆలోపల 50 మైళ్ళ వరకు పడవల కాలవలు త్రవ్వ బడినాయి.

(సి) హీరాకుడ్ ప్రాజెక్టు వల్ల మహానదిలో ముఖద్వారం నుంచి 300 మైళ్ళ పర్యంతం పడవలు నడపడానికి వీలుకలుగుతుంది.

**జ వా బు లు:**

1_ (సి) 2_ (బి). 3_ (సి). 4_ (సి) 5_ అన్నీ నిజమే.

(ఇండియా ప్రభుత్వసమాచారశాఖ)

# యశోద - గొంగ పాట

* శ్రీ పేకుమళ్ల కామేశ్వరరావు *

ఇప్పుడు ప్రచారంలో 'యశోద - కొంగ పాట' అను పేరుగల పాట ఉంది. కాని ఇది దానికంటె భిన్నమైనది. ఇందులో యశోదాదేవి 'కొంగ'ను గురించి గాక 'గొంగ (=శత్రువు)'ను గురించి చెప్పి, శ్రీకృష్ణుని భయపెట్ట బోతుంది.

శ్రీకృష్ణ ! శ్రీపతీ ! శ్రీపురుషోత్తమా !
శ్రీఅచ్యుతా ! శ్రీకూర్మనాథా !
శ్రీధరా ! శ్రీకృష్ణ ! శ్రీవాసుదేవుని,
బాల ముద్దులపట్టి నేస్మరింతు,
కృష్ణా ! హరి ! హరీ !

కేశవ ! నిర్మలవాస ! శ్రీవాసుదేవుని,
కిరీట మకరకుండల ధారుని,
కేశవుని ఆత్మలో కీర్తించవే మనస !
క్లేశంబులన్ని నిర్మూలంబులౌను !
కృష్ణా ! హరి ! హరీ !

మద్దికాయలు గదల, మరిరావిరేకయు
ముత్యాల హారమును కదలగాను
గోపాలకుని రాక గోపిదేవి చూచి
"గోవింద ! రాకు మీ గొంగ గలడు !"
కృష్ణా ! హరి ! హరీ !

మొలనూలు మెరియగా ముద్దరాలు, తమ
పైటకొంగు జార నెలత నడువ,
గోపాలకునిరాక గోపిదేవి చూచి
"గోవింద రాకు మీ గొంగ గలడు !"
కృష్ణా ! హరి ! హరీ !

"ఏలవచ్చెదవు కృష్ణా ! పాలుతేబోయెద,
పని చెరుపరాకుమీ పరమ పురుష !
చన్నిచ్చు దాయచే నిన్నిచ్చి వచ్చేను
వెన్నుడా ! రాకుమీ వెనువెనకను."
కృష్ణా ! హరి ! హరీ !

మువ్వలు, గంటలు మొలనిండ గట్టుకొని
ధరణీశు తనతల్లి వెంటబోగా
గంటల చప్పుడు కాంతతాను విని
"అన్నన్న ! రాకుమీ, రామకృష్ణా !"
కృష్ణా ! హరి ! హరీ !

"ఏలవచ్చెదవు కృష్ణ ! మంద కడుదూరము
మందలోను గొంగ ఉన్నాడు.
నిన్న కొందరు పాపలను తీసుకొని పోయినాడు ;
నమ్మరా, మీయన్న నడిగిచూడు !"
కృష్ణా ! హరి ! హరీ !

అచ్యుతా ! మందలకు వచ్చిన పాపలను
గొంగ వచ్చి పట్టుకొని పోగా
భయపడి పోవెరుతురు : కరుణాకరా ! నీవు
నాయన్నరాకుమీ రామకృష్ణా !"
కృష్ణా ! హరి ! హరీ !

అని తల్లి పలుకగా అపుడు శ్రీకృష్ణమ్మ
"గొంగన"* ఎవ్వడే గోపిదేవి !
నాలుగు మూలల దుష్ట రాక్షసుల జంపితిని
గోపిదేవి ! నేను గొంగ నెరుగ !
కృష్ణా ! హరి ! హరీ !

మత్స్యమై జలధిలో జొచ్చి సోమకుని ద్రుంచి
తెచ్చితిని వేదములు బ్రహ్మ కీస్తి ;
బ్రాహ్మచారై పోయి ధరణి వెంగిలి గాని
గోపిదేవి ! నేను గొంగ నెరుగ !
కృష్ణా ! హరి ! హరీ !

సురులు, అసురులు గూడి అమృతమును
తరచగా స్థిరముగా ఈ భూమియేలుకొంటి :
కూర్మరూపం దాల్చి. కుదురుగా నిల్పితిని,
గోపిదేవి ! నేను గొంగ నెరుగ !
కృష్ణా ! హరి ! హరీ

*గొంగ + అన = గొంగన (= గొంగ అనగా)

## యశోద - గొంగ పాట

వరాహ రూపమ్మున వసుధనెత్తి నేను
ఈరేడు భువనములు ఏలుకొంటి ;
ఆయాయి పురపతుల అవని నిలిపితి గాని
గోపిదేవీ! నేను గొంగ నెరుగ!
కృష్ణా! హరి! హరీ!

కలదన్నవారిచే కంబ స్తంభము వెడలి
నరనారసింహుల నఖము దాల్చి
వచ్చి హిరణ్యాక్షుని వధియించితిని గాని
గోపిదేవీ! నేను గొంగ నెరుగ!
కృష్ణా! హరి! హరీ!

వడుగు రూపమ్మున బలిని మూడడుగు లడిగి
బలిరాజు భూమి నేనేలుకొంటి,
బలము చాలకున్న బలిద్రొక్కి పెరిగితిని
గోపిదేవీ! నేను గొంగ నెరుగ!
కృష్ణా! హరి! హరీ!

జమదగ్ని రాముడై క్షత్రియుల గెలువనా
పరశురాముని నేను వరుస నగుచు,
ఇరువదొక్క మార్లు పడగొట్టితిని గాని*
గోపిదేవీ! నేను గొంగ నెరుగ!
కృష్ణా! హరి! హరీ!

దశరధునకును పుట్టి తాటకిని ఖంతించి
ఖరదూషణాదుల గర్వమడచి
శిష్టపాలనచేసి దుష్టశిక్షణ జేస్తి
గోపిదేవీ! నేను గొంగ నెరుగ!
కృష్ణా! హరి! హరీ!

బలభద్ర రామునై ఇలదైత్యుల నెల్ల
నాగేలు గొనితెచ్చి నగము (?) లార్చి
భారతునకు† సారథై భారతము నిల్పితి గాని
గోపిదేవీ! నేను గొంగ నెరుగ!
కృష్ణా! హరి! హరీ!

వాలికూలగనేసి వారధియు గట్టియు
దశకంఠ కుంభకర్ణుల తలలు గూల్చి,
ఘనవిభీషణునకు పట్టము గట్టితి గాని
గోపిదేవీ! నేను గొంగ నెరుగ!
కృష్ణా! హరి! హరీ!

చుప్పనాతి ముక్కు చెక్కియు వేగమున
ఖరదూషణాదుల గర్వమణచి
దేవతల పాలించి రాక్షసుల మర్దించితి గాని
గోపిదేవీ! నేను గొంగ నెరుగ!
కృష్ణా! హరి! హరీ!

అబల ప్రాయము నాడు ఆవులు కాచియు
దేవేంద్రుడు రాళ్ళవాన కురిపించగా
కొండ నొక్కవేల గొడుగుగా బట్టితిని!
గోపిదేవీ! నేను గొంగ నెరుగ!
కృష్ణా! హరి! హరీ!

కాళింగ మడుగులో కదిసి పామునుబట్టి
విషమును గ్రక్కించి జిహ్వలార్చి
కాళింగ మడుగునే బాలించితిని గాని
గోపిదేవీ! నేను గొంగ నెరుగ!
కృష్ణా! హరి! హరీ!

ధర్మరాజులవారి రాజసూయంబున
కౌరవులు, పాండవులు నిండి యుండ
శిశుపాలుని బట్టి నురుమాడితిని గాని
గోపిదేవీ! నేను గొంగ నెరుగ!
కృష్ణా! హరి! హరీ!

బౌద్ధ, కలికేయుడ, పురపతులు ఇరుగడల!
చేడెలపది (?) వేలవారిని చేకొంటిని!
త్రిపురముల సాధించి శివుని కొసగితి గాని!
గోపిదేవీ! నేను గొంగ నెరుగ!
కృష్ణా! హరి! హరీ!

అని నోరు తెరిచియు అఖిల బ్రహ్మాండములు,
పారేటి నదులు, పర్వతంబులు, గుహలు
సాగరా లేడును, చంద్రసూర్యుల గాంచి
ఉవిద వెరచి కనులు మూసికొనెను!
కృష్ణా! హరి! హరీ!

పరమాత్మ మీ కలిమి బ్రహ్మాదులెరుగరు!
వెన్నుడా! నిన్ను నే కన్నబలిమి,
వెరపించ గొంగంటి, వెరచితిని నోరుమూయి.
మురవైరి! నీకు నే మ్రొక్కెదను!
కృష్ణా! హరి! హరీ!

---

* మూలంలో 'ఇరువదొక్క మార్లు పురిగొల్పి క్షత్రియుల పడగొట్టితిని గాని' అని ఈ చరణం చాల పొడుగుగా ఉంది. † భరత వంశమున బుట్టినవాడు 'భారతుడు'

## యశోద - గొంగ పాట

అని తల్లి మ్రొక్కగా అపుడు శ్రీ కృష్ణమ్మ
"మందకును గొనిపోవె మగువ గోపీ!"
"వలదు శ్రీ కృష్ణమ్మ! వలదు పురుషోత్తమ!
వలదు రమ్మ" ని కొడుకును పిలిచె!
కృష్ణా! హరి! హరీ!

తొడ చరిచి, యశోద, తోయజాక్షి
భమిడి గొలుసులు చేర్లు పట్టియూచ
"జోజో కేశవ! జోజో మాధవ!
జోజో శ్రీధరా! ముద్దుల అన్నా!"
కృష్ణా! హరి! హరీ!

అని పాడుచుండగా అతివయొక్కతెవచ్చి
అచ్యుతుడు చేసిన సుద్దులనుచు
తలవెంట్రుకల చిక్కు విడదీసి ప్రార్థించి
"గోవిందు మ్రుచ్చు సుమీ! గోపిదేవీ!"
కృష్ణా! హరి! హరీ!

అని చెప్పుచుండగా అతివ ఒక్కతె వచ్చి
అచ్యుతుడు చేసిన సుద్దులనుచు,
కామచిన్నెల చేతలుకడ నుండి యాచేడె
చిన్ని కృష్ణమ్మ చేసినవి చెప్పెను.
కృష్ణా! హరి! హరీ!

ఉయ్యాలలో బాలుడు ఉగ్గడగ నేరడు
ఎట్లు మీ కుండలకు ఎగిసె నమ్మా!
మీ పలుకులు నమ్మను పదరె మీ ఇళ్ళకు!
వచ్చెదను, నా కొడుకు మ్రుచ్చుగాడు!
కృష్ణా! హరి! హరీ!

పచ్చని వేపాకుపై రక్షపెట్టియు
అచ్యుతుని నుదుట వీభూది పెట్టి,
కడుమంచి దాదులను అచ్యుతుకు కాపుపెట్టి
గొల్ల పల్లెకు బోయె గోపిదేవి!
కృష్ణా! హరి! హరీ!

తన తల్లి పోకెరిగి* దామోదరుడు వారి
పలుకు బొంకు కావలెనని తలచియపుడు
వారికన్న ముందు వారి జాడుడు పోయి
నీలాటి కడవల నిలిపె పాలు!
కృష్ణా! హరి! హరీ!

ఎక్కడ జూచినా పాలును, పెరుగును,
ఎక్కడ జూచినా ఘృత కుంభముల్,
నిఖిలము జగముల నిండినట్టుండు,
తెరచినట్టుండు రేపల్లెవాడ
కృష్ణా! హరి! హరీ!

పోగానె ఒకచేడె బోరున ఏతెంచి
ముంచి తెచ్చి యిచ్చె ముగుద కాళ్ళకును
నీళ్ళు కావవి మరి జున్ను పాలైయుండ
సిగ్గుపడి ఆచేడె శివుని దలచె!
కృష్ణా! హరి! హరీ

పురివిచ్చి† పలికితిరి పుంతరీకాక్షుడిని,
ఆడనేల ఉత్తనె అబలలార!
వెన్న తిన్నయట్టి వెసలలు‡ ఏవి మరి,
పాలు త్రాగినట్టి బానలేవి?
కృష్ణా! హరి! హరీ!

గడగడ వణకుచు కాంతలందరు కూడి
కరములు ముకుళించి కట్నమిచ్చి,
కట్నమిచ్చిన వెనుక కాంతలందరు గూడి
యశోద నగరికి ఏగి వచ్చిరి!
కృష్ణా! హరి! హరీ!

వచ్చి ఉయ్యాలలోన నచ్యుతుని ఎత్తుకొని,
అరికాలి తిలకమ్ము లమరదీర్చి,
చన్నిచ్చి ముద్దాడె, నతుల చేతికిచ్చి,
"మ్రుచ్చన్న చెలులార! ముద్దాడరే!"
కృష్ణా! హరి! హరీ!

మ్రుచ్చుకావు తండ్రి! మోహైన తండ్రివి;
" " "
" " "
మరి ముద్దుల పట్టి స్వామిగాని!
కృష్ణా! హరి! హరీ!

ఈపాట నెవరైన ప్రాతఃకాలమందు
పాడిన, విన్నాను, పఠియించినా,
" " "
వారికి సంసార భయములేదు జగతి!
కృష్ణా! హరి! హరీ!

---

* పోక + ఎరిగి = పోకెరిగి. † పురి విచ్చి = వేఱుపడి (ఆంధ్రవాచస్పత్యం) ‡ వెసల = పంటకుండ (ఆంధ్రవాచస్పత్యము)





# ఎలాంటి ఆహారం ఆరోగ్యకరమయింది?

* శ్రీమతి చివుకుల లక్ష్మీపున్నయ్య *

ఆరోగ్య సౌభాగ్యములకువలసిన ప్రధానావసరములలో ఆహారము ఒకటి. కాని ఎటువంటి ఆహారము ఆరోగ్య ప్రదమయినది అనే విషయం గమనించ తగినది.

సుచిగా, రుచిగా, పక్వరూపమును చెందిన స్వయం సమృద్ధమయిన ఆహారం ఆరోగ్య చిహ్ననములైన బలము, ఉత్సాహము, అందము, శరీర సౌష్ఠవములను సమకూర్చును. మానవుని సుఖప్రదమైన జీవ యాత్రకు యివన్నీ అవసరమయినవి. కాని స్వయం సమృద్ధమైన ఆహారాన్ని సేకరించు కొనుటకు ధనవంతుల కున్నన్ని ఆర్థిక వసతులు లేకపోయినా విచక్షణారహితంగా ప్రతి మానవునికి ఆరోగ్య సౌభాగ్యాలు అవసరం. కొబట్టి సామాన్య ప్రజానీకం సయితం తమ స్థిమితాన్ని, ఆదాయాన్ని అనుసరించి తమ కున్నంతలో తమ ఆహారాన్ని సుచిగాను, రుచిగాను, స్వయం సమృద్ధంగా చేసికొని భుజించాలి.

ప్రధాన ఆహారం అన్నము అయినా మన దేశంలో గోధుమలు, జొన్నలు, రాగులు, సొజ్జలు మొదలగు ఆహార ధాన్యములు ప్రధానంగా వాడుకలో నున్నవి. వానిని పక్వరూపంలో అనేక విధాలుగా నుపయోగించు చున్నారు.

రొట్టెలుగా వాడకానికి జొన్నపిండి ఉపయోగిస్తున్నా గోధుమ, జొన్నపిండి ఉపయోగం విస్తారము. ఈ రొట్టెలకు అనుబంధంగా బంగాళ దుంపలకూర, బచ్చలి, తోటకూర, చుక్కకూర, గోంగూరలాంటి ఆకుకూరలు పప్పుకూరలు ఆరోగ్య ప్రదంగాను, రుచికరంగాను చేయును.

గంజిగా, అంబలిగా, పాయసంగా గోధుమనూక, రాగిపిండి వాడకం కలదు. రాగిపిండి అంబలిని, గోధుమ గంజిని చిక్కని మజ్జిగచేర్చి ఆకుకూరల పప్పుకూరల అనుబంధ ఆహారంగా సేవించుట శ్రేష్టము. పాలు, చక్కెరచేర్చి గోధుమనూక పాయసము భోజ్యయోగ్యము.

గోధుమలు, జొన్నలు, సొజ్జలు, రాగులు వెల స్వల్పమయినా మన ఆరోగ్యానికి అవసరమయిన పిండి పదార్థములు, మాంసకృత్తులు, విటమినులుగల పుష్టికరమైన ఆహారముగా నొప్పునవి. వీనికి అనుబంధంగా వాడనగు ఆకుకూరలు సయితం సులభంగా, చౌకగా లభించేవేకాక ఆరోగ్యరక్షణకు విశేషముగా నుపకరించు లవణములు,విటమినులు మొదలగు ప్రధాన ఆహార పదార్థము లిందుగలవు.

జొన్నలు, సొజ్జలు, రాగులను పక్వ పరచినంకటిగా కూడ భోజ్యయోగ్యములు. కాని బలిష్టమైన ఆహారమగుటచే కాయకష్టము చేయువారికే కాని యితరులకు సులభముగా జీర్ణము కానేరదు.

గ్రామీణ ప్రాంతాలలో పాడి సర్వసాధారణం కొబట్టి పాలు, పెరుగు, వెన్న నెయ్యిలను తమ ఆహారమును స్వయం సమృద్ధంగా చేసికొనుటకు ప్రజలు విశేషంగా వినియోగించు కోవాలి.

వరి అన్నమున కలవాటుపడిన వారికి ఆకుకూరలతో బాటు కాయకూరలు విశేషంగా నుపకరించ గలవు. పొట్ల సొర, బీర, వంగ, అరటి కాయ లనేకరూపాలలో అన్న సాధకము లగుచున్నవి. రామమునగపండ్ల వాడకం అత్యంత శ్రేష్టమైనది.

దోస, సొర, పొట్ల, బీర, మామిడి, రామమునగ పండ్లు, చింతచిగురు లాంటివి పప్పుకూరల రూపంలో రుచికరమే కాక ఆరోగ్యకరమైన ఆహారం.

విశేషంగా పచ్చళ్ళకు, ఊరగాయల కలవాటు పడిన తెలుగు దేశంలో పుదిన, వెలగపండ్లు, మామిడికాయలు, దోసకాయలు, చింతచిగురు, చింతకాయలు, విశేషంగా వాడుకలోనున్నవి. పచ్చళ్ళైనా తగు మాత్రంగా ఉప్పు, కారం తోటి, సువాసనతోటి చాల రుచిగా నుండును.

నిల్వగా నుండే పచ్చళ్ళల్లో గోంగూర, చింతకాయలు, ఉసిరికాయల తొక్కులు వాడకం విస్తారం. ఊరగాయలలో మామిడి, దబ్బ, చిన్న నిమ్మకాయల ముక్కలను అనేక రకాలుగా నిల్వ చేస్తారు.

ఇక వాడుకలో నున్న పులుసులలో మునగ కాయలకు ప్రాముఖ్యత జాస్తి. తర్వాత బెండకాయలు, బూడిద గుమ్మడికాయ ముక్కలు, వంకాయ ముక్కలు చక్కని అన్న సాధకములు.

(తరువాయి 52-వ పేజీలో)

స్కెచ్ :

# "నా లో నేను"

"బావ వస్తున్నాడనేంటి .... అమ్మగారి ముస్తాబంతా...." అని మాచెల్లి అనగానే తిరిగిచూశా, అప్పుడే యేమూలకో జారింది....కనబడితే దానిపని పట్టించి వుందును—ఆరేళ్ళు నిండాయో లేదో అప్పుడే పెద్ద కబుర్లు.

ఈ రోజు మెయిల్లో మాబావ బొంబాయి నుండి చదువు పూర్తిచేసుకుని వస్తున్నాడు. ఎనిమిది సంవత్సరాల క్రిందట చూశాను బావని .... యిప్పుడో? అద్దంలో చూసుకుని పొడరద్దుకుంటున్నా. వెనకాలెవరో నవ్వినట్లనిపించింది. తిరిగిచూస్తే, యెవరూలేరే! చీరలన్నీ తీసిచూశా, యేదికట్టుకోడమో అర్థంకాలే....పోనీ అమ్మనడుగుతే ; పచ్చ జార్జెట్టుచీర కట్టుకుని అద్దంలో చూసుకున్నా—చాలా బాగుంది.

గడియారం పదిగంటలు కొట్టింది. నా హృదయమెందుకో వేగంగా కొట్టుకుంటూంది. ఈపాటికి బావ రైలు దిగుతాడు. మేడమీద నిలబడి వచ్చే, పోయే కార్లను వెర్రిగా చూస్తున్నా. బావ వచ్చి, నన్నేమని పలుకరిస్తాడో? అప్పుడు నేను....యేవో ఊహలు....

గుమ్మంలో కారు ఆగింది. కళ్ళు తుడుచుకుని చూశా, నల్లగా....మ్యునిసిపాలిటీ రోలరులాగ, హేండ్‌బేగ్ పట్టుకుని దిగాడు బావ. మా నాన్నగారు యెదురుగా వెళ్ళి యింట్లోకి తీసుకెళ్ళారు.

ఛీ ; బావ యెనిమిది సంవత్సరాలలో యెలా మారిపోయాడు. "మాబావ అందంగా .... వుంటాడని ...." యేవేవో సరోజతో చెప్పాను కదా! సరోజ వచ్చి "ఈ అందాలరాజేనా మీ బావ...."అంటే యేమని సమాధానము చెప్పడం?— ఆ మ్యునిసిపాలిటీ రోలరువచ్చి.... "ఏం ? లతా?...." అని యేవేవో అంటాడు. అద్దంలో చూసుకున్నా, నా మొహంలా కనబడలేదు. మంచంమీద పడుకున్నా - ప్రక్కన ఆ నల్లగా ... రోలరువున్నట్లనిపించింది. లేచి కూర్చున్నా—

ఎన్ని సంబంధాలు వచ్చినా మానాన్న "లతను మా చెల్లెలు కొడుకు రావుకిచ్చి వివాహం చెయ్యడం నా సంకల్పం...." అంటూ త్రోసి పుచ్చారు. "ఛీ ; బావను నేను పెండ్లి చేసుకోను ; ...." అని ధంకామీద కొట్టి చెప్పేస్తా—మొన్న సుగుణకు బలవంతంగా ముసలాడికిచ్చి పెండ్లి చేసినట్లు—మానాన్న కూడనన్ను........ యేమైనాసరే ; నేను రోలరు బావను పెండ్లాడను—అది నా స్థిర నిశ్చయం.

"అత్తా ; లత కనబడదేం ; ...." అది రోలరు బావ గొంతుకే. "మేడమీద గదిలో వుందనుకుంటా...." అని మా అమ్మ నవ్వుతూ సమాధానం. అసలుదానికి నవ్వెందుకు వస్తోందో నాకర్థం కాలేదు. మేడ మెట్లు చప్పుడవుతున్నాయి. అద్దంలోకి చూస్తూ, సినీతార ఫోజులో కూర్చున్నా....

"లతా ; అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావేం ?".... అద్దంలో ప్రతిబింబంచూశా .... ఆశ్చర్యం ; ; తెల్లగా.... ఉంగరాలజుత్తు— వెనక్కి తిరిగిచూశా.... యెంత అందంగా వున్నాడు బావ. నాకు పారిపోవాలనిపించింది ; కాని బావ చెయ్యిపట్టుకుని....గట్టిగా....

నా కలలా అనిపించింది. మగాళ్ళకు సిగ్గుండదని చెప్పిన సరోజ మాటలు నిజమే .. "లతా ; నువ్వెంత అందంగా వున్నావు...." అని బావ....

"బావా ; మానాన్నగారు నిన్నెందుకో పిలుస్తున్నారు?" అని మాచిన్న తమ్ముడు రాముం మాయింటిని చూస్తూ, వెర్రి మొహం వేశాడు. మెలకువ వచ్చేసింది. అక్కడి కబుర్లిక్కడ, యిక్కడి పక్కడ....

బావ మేడ దిగాడు. నేనూ దిగి చూద్దును కదా ; నల్లగా, మ్యునిసిపాలిటీ రోలరు లాగున్న వ్యక్తిని సావిటిలో చూడగానే, భయమేసింది.

మా నాన్నగారు నాకు ... "రమేష ఇన్సూరెన్సు కంపెనీ మేనేజరు....శ్రీ రామారావుగారు...." అని పరిచయం చేస్తున్నారు.



శ్రీ ధవళ నాగేశ్వర్

# "ఆఖరికి ఆయన ఇష్టపడ్డారు"

రచన :
శ్రీమతి కె. ఎమ్. ఎల్

సమర్పణ :
బుద్ధవరపు సత్యనారాయణ

గతసంచికలో ప్రచురితమైన "స్త్రీలు : సంసారం : ఉద్యోగాలు" అనే వ్యాసంలో స్త్రీల ఉద్యోగాలు గృహ సౌభాగ్యానికి తోడ్పడాలేగాని కుటుంబ జీవనాన్ని నాశనం చెయ్యకూడదు అని ప్రబోధించారు. చదువు తున్నంత సేపూ ఆవ్యాసం చాలా అవసర సమయంలో వెలువడిం దని నా అభిప్రాయం.

నాలాగనే జీవితాన్ని సాగిస్తున్న ఇతర గృహిణులకు ఉపయోగ పడుతుందనే ఉద్దేశంతో నా స్వీయచరిత్ర కొంత వ్రాస్తున్నాను. నా భర్త సంపాదన చాలా తక్కువ. మాది పెద్ద కుటుంబం. నిజంగా మాకు ఎనమండుగురు పిల్లలు. అంతా చదువుకుంటున్నారు.

ఇటువంటి స్థితిగతుల్లో మాకు ఇంట్లో భుక్తి గడవడమే కష్టంగా కనిపించింది. పరిస్థితులు విషమించ కుండానే ఏదేనా వృత్తిలో ప్రవేశిద్దామని నిచ్చయించు కున్నాను. సంవత్సరం కిందట ఒక గౌరవ సంస్థలో నాకు ఉద్యోగం ఇస్తామన్నారు. జీతం చూస్తే తక్కువే. కాని అది మా కుటుంబానికి చాలా సహాయంగా వుంటుంది.

నా అభిప్రాయాన్ని ఆయనకుచెప్పాను. ఆయన ఎంత మాత్రం ఒప్పుకోలేదు. పైగా ఉద్యోగంలో చేర వద్దని ఆదేశించారు. తన నిర్ణయాన్ని బలపరచుకుందుకు ఆయన ఏవేవో కారణాలు వెదికి చెప్పారు. కాని, ఆయన వ్యతిరే కించడానికి ముఖ్యకారణ 'అభిమానం' అని తెల్సు కున్నాను. తొందర పడితే ఇంట్లో కలతలు ప్రారంభ మవుతాయేమో బాబూ అనుకొని అప్పటికి మాత్రం నేను ఆ వుద్యోగంలో చేరలేదు.

కొన్నిరోజులు గడిచేసరికి నేను అనుకున్నట్లుగానే పరిస్థితులు విషమించాయి. ముఖ్యంగా మాకు డబ్బు ఇబ్బంది ఎక్కువైంది. నాకేమీ తోచలేదు. ఏమయితే అయిందని అసలు ఏ సంగతీ నా భర్తకు చెప్పకుండానే ఇదివరలో నాకు ఉద్యోగం ఇస్తామన్న సంస్థ యజమాని దగ్గరకు వెళ్ళాను. ఆ ఉద్యోగమే ఇవ్వమని కోరాను. పాపం, వారు వెంటనే నాకోరిక మన్నించి ఉద్యోగం ఇచ్చారు. అప్పటినుంచీ పని చేస్తున్నాను.

నేను చేసినదానికి నా భర్త చాలాబాధ పడ్డారనుకోండి. కాని మాకుటుంబం ఆర్థికస్థితిని చక్క బరచడానికి వేరే గత్యంతరం లేక పోయింది.

ఏ పరిస్థితిల్లోనూ కూడా ఆయన్నుగాని పిల్లల్నిగాని నేను ఎంతమాత్రం నిర్లక్ష్యం చెయ్యలేదు. మామూలుగా కాఫీ ఇచ్చేసి పిల్లల్ని ప్రొద్దునే బడికి పంపేదాన్ని. ఆయనకూడా నాకు అవసరమైతే ఎక్కువ శ్రమ కలగ కుండా పనిలో సహాయం చేసేవారు.

మధ్యాహ్నం భోజనాలకి అన్ని ఏర్పాట్లు పూర్తిచేసి ఉదయం 8-30 కల్లా పనిలోకి వెళ్ళిపోతూ వుంటాను. 12 గంటలకల్లా నేను మళ్ళీ తిరిగి ఇంటికి వస్తాను. అప్పటి కప్పుడే పిల్లలు వచ్చివుంటారు. ఆయన కూడా మధ్యాహ్నం భోజనానికి 11-30 కల్లా వస్తారు.

మధ్యాహ్నం విరామకాలంలో ఇల్లు కడుగుతాను, సాయంత్రానికి అన్నం అదీ వండి పెట్టేస్తాను. తిరిగి 2-30 కి పనిలోకి పోయి 6-30 మళ్ళీ తిరిగి వచ్చేస్తాను.

పిల్లల్లో పెద్దవాళ్ళు సాయంత్రం టీ విషయం చూసు కుంటారు. ఆయన ఇంటికి వచ్చేవేళకి అంటే సాయంత్రం ఐదుగంటలకి ఆయనకి టీ కూడా సిద్ధంగా వుంటుంది. ఇదే నా దైనిక కార్యక్రమం!

నేను సంపాదించే జీతం నమ్మండి నమ్మక పోండి నిజంగా మాకు చాలా ఉపయోగించేది. మొదటి వారంలో నేను సంపాదించిన దానితో చిన్నచిన్న అప్పులు, చిల్లర బాకీలు తీర్చి వెయ్యడమేకాక పిల్లలకి కొన్ని బట్టలుకూడా కొనగలిగాను. అంతేకాకుండా ఆతరవాత నెల ఏడవతేదీన

## "ఆఖరికి ఆయన ఇష్టపడ్డారు"

మా ఆయనకు జీతం వచ్చేదాకా రోజూ ఇంట్లో ఖర్చుకు కూడా నా సంపాదన సరిపోయింది.

నెలవారీగా వచ్చే జీతం మాకు ఎంతగానో సహాయంగా వుంది.

అందుచేత నా అనుభవాన్ని పట్టి నేను చెప్పేదేమిటంటే ప్రతిగృహిణి కనీసం ఇబ్బందుల్లో ఉన్నప్పుడయినా ఉద్యోగం చెయ్యాలి. అందులో అభిమానం చెందవలసిన విషయంగాని, నీచంగానీ ఏమీలేదు. భర్తయందు చూపవలసిన భక్తిశ్రద్ధల విషయంలో అశ్రద్ధగాని, పిల్లల సంక్షేమం విషయంలో నిర్లక్ష్యంగాని ఎంత మాత్రం తగదు. దీనికి మాత్రం ప్రతి గృహిణీ కట్టుబడి వుండాలని నా సలహా.

చాలా రోజులనుంచి ఆయన నా ఉద్యోగం గురించి విమర్శ మానేశారు. పైగా ఎక్కువ ఆసక్తిని కనపరుస్తున్నారు. దీనిని బట్టి ఆయన పూర్తిగా మారారని అనుకోవాలి. మారడమేమిటి-నా ఉద్యోగ విషయంలో ఆయనకు సవ్యమైన దృక్పథం కలిగింది ఆఖరికి.

---



## ఎలాంటి ఆహారం ఆరోగ్యకరమయింది?

(49-వ పేజీ తరువాయి)

పెరుగు పచ్చడ్లు కూడ ఆరోగ్యకరమైన అన్న సాధకములు. అందులో వెలగ, రామమునగ పండ్లు, కీరకాయముక్కలు, వంకాయ, అల్లం వాడవచ్చును.

ఈ ఆహార పక్వము సందర్భమున కొబ్బరి వాడడం మంచి అవకాశమున్నవారు తమ దైనికాహారములు విశేషంగా పాలు, దానికి సంబంధించిన పెరుగు, వెన్న, నెయ్యి వాడుట చాలమంచిది. అట్టి అవకాశము లేనివారు తమ ఆహారాన్ని కాయగూరలు, ఆకుకూరలు, పుష్టికరమైన ఆహారధాన్యములతోటి, స్వయం సమృద్ధం చేసికోవాలి. వరి అన్నమున కలవాటుపడినవారు దంపుడు బియ్యం వాడుట మంచిది.

ఈ వసతులతోపాటు ఆహారమును నియమబద్ధంగా తమ అవసరాలమేరకు తయారు చేసికొని ఏపూటకాపూట భుజించుట మంచిది. నిల్వయున్న వంటకములు, అన్న సాధకములు రుచిని కోల్పోయి అనారోగ్యమునకు కారణము కావచ్చును. ముఖ్యంగా సామాన్య ప్రజానీకం తమ ఆహారమును సూక్ష్మంలో మోక్షంలాగ స్వయం సమృద్ధంగా చేసికొని భుజించి ఆరోగ్యవంతులుగా నుండుటకు ప్రయత్నించాలి. 

# శ్రీ త్యాగ గురుస్తుతి కీర్తనలు

* శ్రీమతి కె. ఎమ్. సౌందర్యవల్లి *

కీర్తన – 23.

రాగం షణ్ముఖప్రియ — జంపతాళం.

ఆ॥ సరిగమపదనిస అ॥ సనిదపమగరిస

ప॥ పంచరత్నముల పరమాత్ముని పూజించిన
పండితాగ్రగణ్యా. భక్తవరేణ్యా ।

అ॥ప॥ పంచనదంబన బగుక్షేత్ర రాజంబున
అంచితముగ వసియించిన త్యాగరాజవర ॥పంచ॥

చ॥ సర్వస్వము నాదసుధగ మదినెంచి
నిర్వికారగుణముచేత నిధిని త్యజించి
సర్వజన సన్మానితుం డనగమించి
వుర్వి గాయక ప్రియుండయి నుతిగాంచి ॥పంచ॥

---

| 1/7 | ◡ | 0 |
|---|---|---|
| ప॥ ; ప ; ప ; ద ప మ గా గా ; రీ రీ పా మా గ మ ద మా గ రి | సా ; | రి స ని ద నీ సా |
| పం చ ర . . . త్న ము ల ప ర మా . . . త్మ ని | పూ | జిం . . చి న |
| ; నీ సా రీ గా గ రి రి స రీ ; ; గా మా మా ; | ద ప మ గా | గా రీ సా రీ |
| పండి తా గ్ర గ - - - ణ్యా భ క్త వ | రే - - - | - - ణ్యా . |
| గ మ ॥పా మా॥ | | |
| - - ॥పం చ॥ | | |
| అ॥ప॥ ; సా స సా ; ని ద ని రి నీ ద ప పా ద ని ద ప మా పా ద నీ | సా ; | రీ గ రి స ని స రీ, |
| పం చ న దం - - - - బ న ప - - గు - - క్షే - త్ర | రా . | జం . . . బు న |
| గా ; ప మ గా ; రీ సా నీ సా ; రీ ; గ రి రి స ని | ద నీ ద | ప మ, గా రి గ మ |
| అం చి - త ము గ వ సి యిం - చి - న . | త్యా - గ | . . రా జ వ ర |
| పా పా॥ | | |
| పం చ॥ | | |
| చ॥ ; పా పా ; పా మా గ మ ద మా గ రీ సా సా రి ని సా | రి గ రి గ | స రీ , ; ; |
| స ర్వ స్వ ము నా , . . ద సు ధ గ మ - ది | నెం . . | చి . |
| రీ రీ గ మ పా మ గా రీ రీ సా రీ రి రి సా సా, రి రి | సా ని సా | దా నీ సా ; |
| ని . ర్వి - కా - - ర గు ణ ము చే - - త . ని | ధి ని త్య | జిం . చి |

అ. ప. వలె.

సర్వజన సన్మానితుం డనగమించి
వుర్విగాయక ప్రియుండయి నుతిగాంచి॥

# శ్రీ త్యాగ గురుస్తుతి కీర్తనలు

## కీర్తన - 24.

రాగం బిలహరి - రూపకతాళం.

ఆ. సరిగపదస — అ. సనిదపమగరిస

ప॥ రాగరత్నమాలికచే రాముని పూజించేనే ॥శతరాగ॥

అ॥ప॥ భాగవతులు పొగడునటుల, త్యాగరాజకృతులనుశత॥

చ॥ రామకోటిబ్రాసినిజ, భామచేత తులసిజూచి
ప్రేమవిరుల పూజచేసి, నామసుధారసము దెలిసి ॥రాగ॥

| 0 | /4 | 0 | /4 |
|---|---|---|---|
| ప॥ సాం ; | సం ని దా పా ద ని | దా పా | ప ప మ గ రీ రీ |
| రా | గ . ర . త్న . | మా . | లి . క . చే . |
| ; గ ప | మా గా రీ సా | సా ; | సా ని ధ సా ; |
| రా . | ము ని పూ . | జిం | . చె - నే |
| సా ; | సా ; పా ద రి | సాం ; | సం ని దా పా ద ని |
| . | . శ త . | రా | గ . ర . త్న . |
| | | | |
| అ॥ప॥ ; మా | గా పా పా దా | సాం సాం | సాం సం ని ద ప దా |
| భా | గ వ తు లు | పొ గ | డు న . టు . ల |
| పా మా | గా పా పా దా | సం రిం గం పం | మాం మం గం గం రిం సాం |
| . భా | గ వ తు లు | పొ . గ . | డు న . టు . ల |
| సం ని దం రిం | సాం సం ని దా పా | ; ద ప | మా గా పా ద రిం |
| త్యా . . - | గ రా . . జ | కృ తు | ల ను శ త . |
| సాం ; , | సం ని | | |
| రా | గ . | | |
| | | | |
| చ॥ ; నీ | దా పా ; పా | మ గ రి స | రీ గా పా పా |
| రా | మ కో టి | బ్రా - . . | సి . ని జ |
| ; గా | పా దా సాం సాం | సాం సాం | సం నిం ద సా పా ద |
| భా | మ చే - త | తు ల | సి - జూ . చి . |
| ; దా | సాం రీం గాం గాం | గం రిం గం రిం | సాం సాం ని ద ప ద |
| ప్రే | మ వి రు ల | పూ . . | జ చే . సి . . |
| ; ద రిం | సాం స రిం సం ని ద ప | ప ద ద ప | మ గ రి గ పా ద రిం |
| నా . | మ సు . ధా - - - | ర . స . | ము . దె . లి సి . |
| సా ; | సం ని॥ | | |
| రా | గ . | | |




పరిశోధన :

శ్రీ తిరుమల రామచంద్రంగారి సంపాదకత్వం క్రింద వెలువడ్డ సారస్వత ద్విమాస పత్రిక ద్వితీయ సంచిక మాకు చేరింది. ఇందు చక్కటి సాహిత్య మీమాంస, (కవిత్వ) ప్రారంభ అవస్థ, కాటమరాజు కథకు సంబంధించిన 'అగుమంచి' అను నామెకథ, ఇతిహాసం, పదాల పుట్టు పూర్వోత్తరాలు, నన్నయ పదాల విశేషాలు, చరిత్ర కెక్కని చరిత్రార్థుల విషయాలు, చందస్సు —అలంకారం, సంఘం - సాహిత్యం, రాయలనాటి కవితాజీవనం, అముద్రిత రచన లీలావతీ గణితం అని ప్రముఖ రచయితల మనోహరమైన వ్యాసాలున్నాయి. ఇవి నిజంగా గొప్ప భాషాసేవకు సాహిత్య పరిశోధనగా తోడ్పడుతున్నాయి.

పత్రికవెల : 1-0-0 ప్రాప్తిస్థానం : భాషాసేవకసమితి, 2/583 పైక్రాఫ్ట్స్ రోడ్, తిరువళ్ళిక్కేణి, మద్రాసు 5.

బాల శతకము :

బాలకవి మేడిశెట్టి సత్యనారాయణ విరచితమైన కమ్మటి కంద పద్యాల కూర్పు. బాల బాలికలకు నీతిదాయక విషయాలు, అనుదిన ఆచరణయోగ్యమైన వెన్నో బోధిస్తున్నాయి. నేటి బాలలే రేపటి పౌరులని గుర్తించి, వారి మనస్తత్వాన్ని అర్థంజేసుకొని వారిలో సదభ్యాసాల్ని నెలకొల్పాలని, ముఖ్యంగా నీతిదాయక విషయాల్ని పద్యాల్లో వ్రాస్తే, వారు కంఠస్థం చేసుకుని ఆచరిస్తారన్న కవియొక్క సంకల్పం నెరవేరుతుంది. దీన్ని పాఠశాలల్లో పాఠ్య గ్రంథంగా పెడితేను. మూల్యం నాల్గు అణాలు. వలయువారు కృతికర్త పేర పామర్రు, వయా కోటిపల్లి, తూర్పు గోదావరిజిల్లా అని వ్రాయండి.

కాశ్మీరు దేశ చరిత్ర :

విమర్శకాగ్రేసర శ్రీ కొత్త భావయ్య చౌదరిగారు చరిత్ర తరచి తరిచి, అప్పుడూ ఇప్పుడూకూడా అందర్నీ ఆకర్షిస్తున్న కాశ్మీరుదేశం యొక్క చరిత్ర చక్కగా, క్లుప్తంగా, ఆదేశాన్ని పరిపాలించిన రాజులకాలం నిర్ణయం చేస్తూ 1954 చరిత్ర వరకు వర్ణించుకొచ్చేరు. ముఖ్య స్థలాల విశేషాలు కూడా ఉన్నాయి.

వెల ఒక్క రూపాయి. వలయువారు: కొత్త భావయ్య చౌదరిగారు, సంగంజాగర్లమూడి P. O. గుంటూరుజిల్లా అన్న చిరునామాకు వ్రాయాలి. ★

## నెహ్రూ ప్రధానికి ఢిల్లీ నారీమణుల విజ్ఞప్తి

సినిమాలు తెచ్చిపెట్టే అనర్థాల్ని, అవినీతిని ప్రభుత్వం అరికట్టాలని 13 వేల తల్లులు సంతకాలు పెట్టి తమ పూర్తి చిరునామాలతోసహా భారత ప్రధాని కొక వినతి పత్రం సమర్పించేరు. ఇంకా అనేకమంది తమ పేర్లు చేర్చాలని ఆతురత పడ్డారుగాని, సంతకం చేయడం చేతరాక పోవడం వల్ల వీలయిందిగాదు. ఈ పత్రం సారాంశం: "మాబిడ్డలనైతికారోగ్యానికి ఈనాటి సినిమాలు మహా ప్రతిబంధకంగా ఉన్నాయి. అవి కసుగాయల్ని అకాల అవినీతి సంబంధాల్లోకి దిగలాగి, జారత్వం - చోరత్వం వగైరాలు నేర్పి సంఘశాంతికి భంగం తెస్తున్నాయి. చాలమంది పిల్లలు బడులెగ్గొడుతున్నారు. ఎలాగో డబ్బు దొంగిలించి సినీమాలకెళుతున్నారు. పెద్ద పట్టణాల్లో బాలబాలికలే సినీమాహాలుల్లో ఎక్కువ హాజరులిచ్చేది. విద్యాధికార్లు యీ సమస్యనెట్లా యెదుర్కోవాలో తెలియడంటున్నారు.

ప్రజాసందోహాలకు చులాగ్గా అవగాహన మయ్యేవి, వినోదం కల్పించేవి సినిమాలు గనుక ఇవి సంఘాభ్యుదయానికి దోహదం కావడానికి బదులు దానికి వ్యతిరిక్త ఫలితాల్ని కల్పిస్తున్నప్పుడు ప్రభుత్వం తప్పక జోక్యం కలిగించుకోవాలి. ఇక్కడికి ధారాళంగా యిప్పుడొస్తున్న పాశ్చాత్త ఫిల్ములు—ముఖ్యంగా అమెరికావి - ఈ సంఘ అశాంతికి, రక్తపాతానికి మరీ కారణాలవుతున్నాయి. ఇలాంటి పరిస్థితుల నరికట్టడం ప్రభుత్వం యొక్కవిధి. తగినసత్తా ప్రభుత్వానికి లేకుంటే - వలసిన రూల్సు యేర్పరచుకొని, ఫిలుం కంట్రోలుని అమల్లో పెట్టాలి. మా స్త్రీలంతా అనేక మీటింగులుపెట్టి, ప్రభుత్వాన్ని మరీమరీ కోరుతున్నాం." ప్రధానినెహ్రూ యీ విషయాలు తప్పక పరిశీలిస్తానని జవాబిచ్చేరట.

---



# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ మద్రాసు

| | |
|---|---|
| మహిళా విద్యాలయము | : హిందీ, కాశీ విశ్వవిద్యాలయపు ఎడ్మిషన్, ఇంటర్‌మీడియెట్, ఇ.యస్.ఎల్.సి., పరీక్షలు. |
| పారిశ్రామిక విద్యాలయము (గవర్నమెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది) | : కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు, అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చుకూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. బీద విద్యార్థినులకు ఉచితము. |
| వస్త్రములపై అద్దకపుపని మిషనుకుట్టు, మిషను అల్లిక, చేనేత- బుక్ బైండిగు, ఎంబ్రాయిడరీ. | : భారత ప్రభుత్వ పునరావాసశాఖవారిచే ఆంధ్రమహిళా సభ పారిశ్రామిక భవనములు, 7-ఎ రోజరీ చర్చి రోడ్డులో నడుపబడుచున్నవి. |
| టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ | : స్త్రీలకు మైపు,—గవర్నమెంట్ పరీక్షలకు శిక్షణ. |
| మహిళా మందిరము | : స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము. |
| ఆంధ్ర మహిళ | : స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాసపత్రిక. |
| నిర్మలాదేవి గ్రంథాలయము | : సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంథ సముదాయము. |
| నర్సింగ్ హోమ్ | : స్త్రీ, శిశువుల, సంరక్షణశాల, ప్రసూతిశాల, ఉచిత వైద్యశాల— అడయారులో నిర్మించబడినది. భారత ప్రభుత్వ ఆరోగ్యశాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్స్‌ఎయిడ్—మంత్రసాని పనులలో శిక్షణ యివ్వబడుచున్నది. |
| ముద్రణశాఖ | : ఆంధ్ర మహిళా సభవారిచే స్వంతంగా స్థాపిచబడినది. విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగు, ప్రూఫ్ రీడింగు, మొదలైనవి పుచితంగా నేర్పబడును. |

క్రీడా, క్లబ్బుశాఖలు.

సభ్యురాండ్రుగా జేరి, యీ జాతీయ సంస్థను పోషించండి.

Edited, Printed & Published for the Andhra Mahila Sabha, Luz, Madras 4
by Mrs. A. C. Krishna Rao, M.A., L.T., at the Andhra Mahila Press, 24-A, Luz Church Rd., Madras 4

# చిన్న మొత్తములలో నిల్వ సేకరణ-

## ఆంధ్ర మహిళా సభలో కార్యాలయము.

చిన్న మొత్తముల నిల్వలు ప్రోత్సాహించి, ప్రభుత్వమువారి పంచవర్ష ప్రణాళికకు తోడ్పడు స్త్రీల ఉద్యమములో ఆంధ్రమహిళాసభ సభ్యురాండ్రు ఎక్కువగా తోడ్పడవలెనని నిశ్చయింపబడినది. ఇందు కొరకై, ఆంధ్రమహిళా సభ ఆవరణలో ఒక ప్రత్యేకమైన కార్యాలయము ఏర్పరుపబడినది. ఇందు దైనిక కార్యక్రమాన్ని నిర్ణయించి, స్త్రీ సామాన్యములో యీ ఉద్యమాన్ని గూర్చి ప్రచారం చేయుటకు, నిల్వ చేయదలచినవారికి తగిన సలహానిచ్చుటకు, సభ తరపున కొందరు యువతులు నియమింపబడుదురు. ఈ ఉద్యమంలో ఒక ప్రత్యేక ప్రతినిధిగా వ్యవహరించి, ధనము వసూలు చేయుటకు భారత ప్రభుత్వమువారు, ఆంధ్ర మహిళాసభకు అధికారమిచ్చియున్నారు. సభకు వచ్చిగాని, పోస్టు ద్వారాగాని అన్ని వివరములు తెలిసికొనవచ్చును.

ఇంకొక విషయము— మీరు కొనదలచిన సేవింగ్సు సర్టిఫికెట్లు సభ ద్వారా కొన్నయెడల సభకు 1¼% కమీషను వచ్చును. ఈ కమీషను సభయొక్క కార్యకలాపాలకై వినియోగించుకోవచ్చును. అందువల్ల మీరు నిల్వ చేయదలచిన మొత్తమునకు సభద్వారా సర్టిఫికెట్లు కొన్నచో, సభకు కూడా సహాయము చేసినవారగుదురు.

ఉత్సాహ వంతులైన సోదరీమణులు, యింత వరకూ సభద్వారా నిల్వ సర్టిఫికెట్లు తీసుకున్న మొత్తము రమారమి రూ. 32945/- ఇందు మూలముగా సభకు వచ్చిన కమీషను రూ. 413/- ఇంకా పెక్కుమంది సోదరీమణులు యీవిధముగా సభద్వారా సర్టిఫికెట్లుకొని సహాయ పడవలెనని కోరుచున్నాను.

టి. జి. హైమవతి,
ఆర్. లక్ష్మి.

---

# గమనిక

'ఆంధ్ర మహిళ' స్త్రీల సచిత్ర మాస పత్రిక. ఆంధ్ర దేశంలో [illegible], మహిళా సంఘంలో నూతన ప్రబోధం కలిగించే ఆశయంతో ఆంధ్ర మహిళా సభ తరపున "ఆంధ్ర మహిళ" పత్రిక 11 సం॥రములనుండి ప్రకాశితమగుచున్నది.

దీనియందు స్త్రీల మనోవికాసానికి తోడ్పడే వ్యాసములు, కథలు, నాటికలు, పిల్లలకు వినోదానందం మొదలగు గద్య పద్యాత్మకములైన పలురకముల రచనలున్నవి. సాంఘిక రాజకీయ విషయములు, ప్రభుత్వము వారు దేశాభివృద్ధికై జరుపుచున్న సంక్షేమ కార్యక్రమాలు, స్త్రీలకుపయుక్తమైన గృహ పరిశ్రమలు మున్నగు వానిని గూర్చి మాసామాసము యిందు ప్రకటింపబడును.

వార్షిక సంచిక, తపాలా ఖర్చులతోసహా

**సంవత్సర చందా 6-0-0**

సేవాసంస్థలకు, గ్రంథాలయములకు, కళాశాల, పాఠశాలలకు,
సంవత్సర చందా రూ. 4-8-0 మాత్రమే.

వివరములకు :

మేనేజరు
'ఆంధ్ర మహిళ'

ఆంధ్ర మహిళా సభ,
24-ఎ, లజ్ చర్చిరోడ్డు, మైలాపూర్, మద్రాసు 4.

# ఆంధ్ర మహిళ

వ్యవస్థాపకురాలు :

శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్

యెం.యే., బి.యెల్.,

సంపాదకురాలు :

శ్రీమతి చన్నఘంటమ్మ

యెం.యే., యెల్.టి.,

సంయుక్త సంపాదకురాలు :

శ్రీమతి కె. సుగుణమణి

సంవత్సర చందా ఆరు రూపాయిలు

ఆంధ్ర మహిళా సభవారిచే స్థాపించబడిన ముద్రణాలయములో
ముద్రితము.

# ఆంధ్రమహిళ

సంపుటి 11 :: ఆగష్టు '54 :: సంచిక 4





సంవత్సర చందా :: :: ఆరు రూపాయలు.



సంపుటి 11 :: ఆగష్టు '54 :: సంచిక 4

# స్త్రీలు - పొదుపు

—— · —: o :————

"తల్లి పొట్ట తడుముతుంది, పెళ్ళాం జేబులు తడుముతుంద"ని సామెత ! ఎందుకో అందరికీ తెలుసుగా, ఆకలిగా నున్నాడేమోనని ఆవిడాను, డబ్బు దస్కం ఉంటే భద్రపరుద్దామని యీవిడాను. అంటే జాగ్రత్త చేద్దామని ; చేసి, అవసరమున్నప్పుడు మళ్ళీ కుటుంబానికే వినియోగిద్దామని. స్త్రీల కిది నైజం. సంసార ఖర్చులు పొదుపుగా ఉండేటట్లు చూచుకుంటూ, ముందు చూపుతో బిడ్డలు పెద్దలయ్యేసరికి వారి చదువు - సంధ్యలకు, కథ - కార్యాలకు, తమ వార్ధక్యానికి కావలసిన విత్తం వెనుక వేసుకోవడం గృహిణి ధర్మాల్లో ఒకటి. లేకుంటే ఎప్పటి రాబడి అప్పుడే పప్పులో వేస్తుంటే - ముందు కాలంలో తల అప్పుల వాళ్ళకు వప్పజెప్పి, తమ దూబరా తనాన్ని ఎత్తి పొడిచే వారందరికీ ఒడి వప్పజెప్పవలసివస్తుంది. చూడండి : నోరు లేని జీవి చీమకూడా "ముందుంది ముసళ్ళ పండుగని" గుర్తించినట్లు యిన్ని గింజలు నిలువవేసుకుంటుంది— ఇబ్బందిగా ఉండే కాలంలో ఉపకరిస్తాయని.

నగలకు, చీరలకు స్త్రీలు డబ్బు విలువ తెలియక దూబరా చేస్తారని పురుషులు కల్పించే సాకు : నిజంగా స్త్రీలకున్న ఒబ్బిడీ — పొదుపూ పురుషుల దగ్గర ఉండదు. "పొదుగునా అలా అయితే ఎలాగండి, ఇచ్చిన భగవంతుడు మర్చిపోతే కసు గందులు బయలుదేరుతున్నారు గదా, నాలుగు రాళ్ళు ఇప్పట్నుంచీ వెనక వేసుకోకపోతే ఎలాగ, పోనీ నాకివ్వండి నేనైనా పొదుపుచేస్తా" నని ఏవేళప్పుడో భర్తకు సలహా యివ్వని స్త్రీ ఉండదంటే లోకం నమ్మదు.

ఇందుకు పురుషులు ఏవేవో సాకులు చెప్పడం పరిపాటే— యదార్థంగా ఎంత రాబడి వస్తున్నదీ, ఎంత ఖర్చవుతున్నదీ కూడ స్త్రీలకు సరిగా తెలియనివ్వక- సిగరెట్లకని, కాఫీహోటళ్ళకని, సినిమాలకని హెచ్చిస్తూ, పైగా ఆడవాళ్ళు దూబరా అని, 'ఆడవాళ్ళ చేతి డబ్బు, మగవాళ్ళ చేతి బిడ్డ బ్రతుక' వని సాకులు చెప్పి తప్పించుకు తిరగడం పురుషుల కలవాటు. మగవారి చేతి బిడ్డ బ్రతుకదంటే అంతా ఒప్పుకుంటారు గాని, ఆడువారి చేతిలోకి వచ్చిన డబ్బు మాత్రం ఒక్క పైసా ఎక్కడికీ పోదు-ముడిపై ముడి ఏడుముళ్ళు వేసి, ఒబ్బిడి చేసుకుంటారు. పొదుపుగా వుండే ఇల్లాలికిది నైజం. అంటే ఒకటిమాత్రం ఒప్పుకోవాలి. స్త్రీలకు డబ్బు ఎలాదాచుకోవాలో తెలియక, ఒక్కొక్కప్పుడు విద్యలేని అజ్ఞానంవల్లా, వెండిబంగారాలమీద మోజువల్లా తమ వంటిమీదకో, బిడ్డల వంటి మీదకో కావలసిన వాటికంటె ఎక్కువ ఆభరణాలు పలపర్చుకుంటారు ! ఇది దొంగల భయానికి దారి తీస్తుంది. లేదా పాడు బంగారం పాపల ప్రాణానికే మోసం తెస్తుంది. ఒక్కొక్కప్పుడు డబ్బు డబ్బులాగ దాచుకున్నా ఈ దాపరికం కూడా భర్త ఖర్చులకే అతని చేజిక్కుతుంది. లేదా చాటు చాటు వడ్డీలకిస్తే పరుల చేతుల్లోనో పడి పూర్తిగా హరించిపోతుంది. అంతేకాని స్త్రీలకి డబ్బు విలువ, పొదుపు తెలియక పోవడ మేమిటి ?

ఇలాంటి అపాయాలేమి లేకుండా తమ పొదుపు దినదినం వర్ధిల్లుతూ, చక్కటి వడ్డీ తెస్తూ, తమ ఆదాయాన్ని వృద్ధి చేస్తూ, తమకు, ప్రభుత్వానికి, ప్రజలకు కూడ ఉపకరించే రీతిని దాచుకునే చక్కటి సౌకర్యాలెన్నో యిప్పటి ప్రభుత్వం కల్పించేరు. గాంధీజీ శంఖారావం విని, తమ నగలన్నీ నిలువ దోపిడీ యిచ్చిన స్త్రీలెందరెందరో వున్నారు. ఇప్పుడు మిమ్మల్ని అలా త్యాగం చెయ్యమనడం లేమ, సరిగదా పొదుపు చేసుకోండి, ఆ పొదుపు ప్రభుత్వం దాచి, పెంచిపెట్టే అవకాశం యివ్వండి; మీకు ఏ బ్యాంకు కూడా యివ్వని హెచ్చు వడ్డీతో మీరు ఎప్పుడడిగితే అప్పుడు తిరిగి చెల్లిస్తాం; మీ డబ్బు ప్రభుత్వం తల పెట్టిన ప్రజోపయోగ కార్య క్రమాలకు తోడ్పడుతుంది అని నెహ్రూ ప్రధాని, శ్రీమతి దుర్గాబాయి దేశముఖ్‌గారు, మహిళా సంస్థల ప్రత్యేక ప్రతినిధులు ఎంతో ప్రభోదం చేస్తున్నారు. అనవసరంగా ఎక్కువగానున్న ఆభరణాలు పైన చెప్పినట్లు, అపాయానికి గాక, ఉపకారానికి ఉపయోగించవచ్చు. ఇందుకూ సౌకర్యాలు కల్పించేరు. పావలా దగ్గరనుంచి వేలరూపాయలవరకూ, ఉన్నప్పుడల్లా పొదుపు చేసుకోవచ్చు. 12, 7, 5 ఏళ్ళ నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లు, 10 సం॥ రాల ట్రెజరీసేవింగ్సు డిపాజిట్లు, నేషనల్ ప్లాన్ సర్టిఫికేట్సు, నేషనల్ ప్లాన్ లోన్సు వగైరాల రూపంగా మీ పొదుపును దాచుకోవచ్చు. మీరు ఈ రోజున ఒకనూరురూపాయిల నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్ కొన్నారంటే అది 12 ఏళ్ళనాటికి 150 రూపాయలు అవుతుంది. అంటే నూటికి నాలుగుంబేడ పైచిలుకు వడ్డీ కిడుతుందన్నమాట. మీకు ఇంతవడ్డీ ఏ బ్యాంకు యివ్వదు. అలాగే 7 ఏళ్ళ సర్టిఫికెట్టు మూడున్నర పైచిలుకు, 5 ఏళ్ళ సర్టిఫికేటు మూడు రూపాయిల వడ్డీలు తెస్తాయి. 10 ఏళ్ళ నేషనల్ ప్లాన్ సర్టిఫికెట్లు మీద నూటికి 4½ రూపాయలు వడ్డీ కిడుతుంది. ఈ లోపున కూడా మీకెప్పుడు కావలిస్తే అప్పుడు తగువడ్డీతో సొమ్ము తీసుకొనవచ్చు. వీటిని గురించిన పూర్తివివరాలు మహిళా సంస్థలు, పోస్టాఫీసులు తెలియపరుస్తున్నాయి. దేశమొత్తం మీద ఇలాగ స్త్రీలపొదుపు 8 కోట్ల రూపాయలు అవ్వాలని ప్రభుత్వం అంచనా. ఇప్పటికి ఆంధ్రరాష్ట్రంలో 3 కోట్ల 30 లక్షలు పోగయింది. "ఇంటింటి కొక పువ్వు, ఈశ్వరుని కొకమాల" స్త్రీలు యిలా పొదుపు ఉద్యమానికి విరివిగా తోడ్పడి, తమకూ తమదేశానికీ ఉపకరించే రీతిని తమ పొదుపును సద్వినియోగ పరుస్తారని అంతా ఆశిస్తున్నారు.



# ఆంధ్రరాష్ట్ర సంఘసంక్షేమ బోర్డుకృషి

18-7-54 తేదీని ఆంధ్ర మహిళా సభ నర్సింగు హోమ్‌లో జిల్లా ప్రాజెక్టు నిర్వహణ కమిటీల ప్రతినిధుల సమావేశం, కేంద్ర సాంఘిక సంక్షేమబోర్డు అధ్యక్షురాలు శ్రీమతి దుర్గాబాయిదేశ్‌ముఖ్‌గారి అధ్యక్షతను జరిగింది. శ్రీమతి దుర్గాబాయిగారు సంక్షేమ విస్తరణ పథకాలను గురించి తెలియజేసేరు. ఈ క్రిందివారు సభకు హాజరయ్యేరు —

రాష్ట్రసంఘసంక్షేమ బోర్డు మెంబర్లు: — శ్రీమతి చన్నఘంటమ్మగారు (చైర్మన్) (2) కుమారి జె. జమునాబాయిగారు (3) లేడీ వెంకటసుబ్బారావ్ (4) శ్రీమతి కోటమ్మారెడ్డి (5) శ్రీమతి కడప రామసుబ్బమ్మగారు, (6) శ్రీ ఎన్. రాఘవరావుగారు.

జిల్లాకమిటీ ప్రతినిధులు: — విశాఖపట్నం శ్రీ డి. వి. రామస్వామి. తూ. గోదావరి - శ్రీ యమ్. అయ్యన్న. ప. గోదావరి-శ్రీమతి డి. లక్ష్మీబాయమ్మ, కృష్ణా-మిసెస్. అబ్దుల్‌ఖాదర్. గుంటూరు - శ్రీమతి కొండాపార్వతి. నెల్లూరు - డాక్టరు యస్. లక్ష్మి. చిత్తూరు - శ్రీమతి రత్నాబాయి. కడప - శ్రీమతి రామసుబ్బమ్మ. కర్నూలు - మిసెస్. నటరాజన్. ఆంధ్ర మహిళాసభ - శ్రీ టి. వి. హైమవతిగారు ఇంకా శ్రీమతి పారిజాతంనాయుడు, శ్రీమతి డి. శారద. శ్రీమతి లక్ష్మిరెడ్డి, మిసెస్. అజరయ్యా, శ్రీమతి కస్తూరి రుక్మిణమ్మ, శ్రీమతి వి. లీల, శ్రీమతి కె. సుగుణమణి, శ్రీమతి ఎస్. కామేశ్వరమ్మ, వగైరాలు.

వివిధజిల్లాల సమావేశకర్తలు సమర్పించిన పథకాలు, వాటి వివరాలు పరిశీలింపబడ్డాయి. ప్రతి స్కీమురయ్యేవ్యయంలో సగం కేంద్ర ప్రభుత్వం, నాల్గోవంతు రాష్ట్ర ప్రభుత్వం, భరించాలనీ, మిగిలింది విరాళాలద్వారా సేకరించాలనీ నిశ్చయింప బడింది. ఆగస్టు 15 వ తేదీకి ప్రతి జిల్లాలోను ఒక కేంద్రమైనా ప్రథమంగా, ప్రారంభించాలని నిర్ణయించేరు.

ఒక్కొక్క ప్రాజెక్టులో దాదాపు 10 కేంద్రాల వరకూ వుండొచ్చు. ఇవి మొత్తం 20 వేల జనాభాగల 20 గ్రామాలకు సేవ జేస్తాయి. ఈ కేంద్రాల్లో స్త్రీలు - శిశువుల సంక్షేమంకోసం కృషిచేస్తారు.



# ఆంధ్ర మహిళాసభ నర్సింగుహోమ్ నర్సులూ, మంత్రసానులూ శిక్షణ

—————:०:—————



18-7-54 వ తేదీ, ఆదివారం ఉదయం శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్‌గారు ఆంధ్ర మహిళాసభ నర్సింగు హోమ్‌లో ట్రైనింగు పొందే రెండవ జట్టుకు చెందిన ఆగ్జిలరీ నర్సులు, మంత్ర సానుల శిక్షణ తరగతులకు ప్రారంభోత్సవం జరిపేరు.

నర్సింగుహోమ్ డాక్టరు యం. పావనాబాయిగారు దేశ్ ముఖ్ దంపతులకు స్వాగతమిస్తూ శ్రీ సి. డి. దేశ్‌ముఖ్ గారు 1952 ఆగష్టు 16వ తేదీని ప్రారంభోత్సవం జరిపిన నర్సింగుహోమ్ ఇంత వరకు చేస్తున్న కృషిని గూర్చి విపరించేరు. ఆ తర్వాత శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ గారు నర్సింగుహోమ్ చరిత్రను తెలియ జేస్తూ "మహిళా సభ అనేక మంది స్త్రీల నిరంతర సేవా దీక్షఫలితంగానూ, కొందరి దాతల ఉదారత్వం వల్లనూ యింతటి అభివృద్ధి లోకి వచ్చిందని ఈ సభ విద్యా, పారిశ్రామిక శాఖలతో బాటు ప్రజారోగ్య సేవ చేయటానికి, నర్సింగుహోమ్ కూడా స్థాపించాలని నిశ్చయిస్తే, దీని స్థాపనకు మద్రాసు గవర్నమెంటు, కేంద్ర ప్రభుత్వం, ఇంకా కొంతమంది దాతలు తోడ్పడితే యిప్పటికి ఈ స్థితికి వచ్చిందని" అన్నారు. దేశంలో పంచవర్ష ప్రణాళిక ప్రకారం సాగు తున్న ప్రాజెక్టు స్కీములు క్రింద పనిచేయడానికి కావలసి నంత మంది శిక్షితులైన ఆరోగ్య సేవా సిబ్బంది కొరతగా ఉంది. అందుచేత ఇండియా ప్రభుత్వం ఈ సిబ్బంది తయారు చేయడానికి ప్రైవేటు నర్సింగ్‌హోముల సహా యం కోరేరు. అలాంటి శిక్షణ యిచ్చేటందుకు ఆంధ్ర మహిళాసభ నర్సింగుహోమ్ ఇప్పుడు రెండవ జట్టుగా 30 మంది ఆగ్జలరీ నర్సుల్ని తీసుకుని తర్ఫీదు ప్రారంభించిం దని చెప్పేరు.

ఆ పిమ్మట శ్రీ సి. డి. దేశ్‌ముఖ్‌గారు ప్రసంగిస్తూ రోగులకు సంరక్షణ చేసే నర్సుల వృత్తి ఉత్తమమైన దని, అటువంటి వృత్తి అవలంభింప బోతున్న వాళ్ళ అభి

# ఢిల్లీలో ఆంధ్రా పాఠశాల

* శ్రీ పతంజలి *

ఢిల్లీలోని ఆంధ్రుల బిడ్డలకు మాతృ భాషలో విద్యా బోధనావకాశాలు కలిగించే ఉద్దేశంతో ఆంధ్రా ఎడ్యుకేషన్ సొసైటీ 1948 సం. లో స్థాపింపబడింది.

శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్‌గారి అవిరళ కృషివల్ల ఢిల్లీ ఆంధ్రుల స్వాప్నిక వాంఛ నిజమయే అవకాశం లభించింది. ఢిల్లీ ప్రభుత్వం నగరమధ్యంలో, హార్డింగ్‌బ్రిడ్జ్ ... పాన ఒక ఎకరం నివేశన స్థలం దానం చేశారు. ... ప్రభుత్వం వారు ఒక లక్ష రూపాయల భూరి ...శం ఇచ్చారు. శ్రీ వి. రామకృష్ణ (ఐ. సి. యస్.) గారు సెంట్రల్ హాలు నిర్మాణం ఖర్చు రూ 40,000/-లూ తాము భరిస్తామన్నారు. శ్రీ తిరుపతి దేవస్థానం వారూ, శ్రీ జి. డి. బిర్లా గారూ చేరి పదివేల రూపాయలు విరాళంగా ఇచ్చారు. తెలుగు ఫిల్మ నిర్మాతలు సహకరించి పంపించిన తెలుగు ఫిల్ములు ప్రదర్శించగా కొంత డబ్బు చేకూరింది. ఈ వదాన్యు లందరి ఔదార్యం వల్ల ఆంధ్ర విద్యాలయ భవనం పూర్తికావడం, మొన్నను ఆషాఢ శు॥ దశమి శనివారం 10-7-1954 తేదీని ఆంధ్ర కేసరి శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారిచే ప్రారంభోత్సవం జరగడం కూడా అయింది.



ఢిల్లీ ఆంధ్ర పాఠశాల ప్రారంభోత్సవం

మహోత్సవం ఢిల్లీ ఆంధ్రులు ఏనాటికీ మరచిపోలేరు. అంతటా ఉత్సాహమే; ఆనందమే! భారత రాజధాని నగరంలో మనకూ ఒక స్వంత భవనం. అందులో మన పిల్లలు మన మాతృ భాషలో చదువుకోడానికి తగిన అవకాశం లభించిందంటే అంతకన్నా వేరే ఆనందమేముంది? ముచ్చటగా అలంకరించబడిన హాలులో కిటకిట లాడుతూ జనం. అధ్యక్ష స్థానంలో ఢిల్లీ రాష్ట్ర ముఖ్య మంత్రి శ్రీ బ్రహ్మ ప్రకాశ్. అతిథుల నాహ్వానిస్తు శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ గారు ఆంధ్రా ఎడ్యుకేషన్ సొసైటి పుట్టుపూర్వోత్తరాలు, ఏ విధంగా ప్రాథమిక దశలో క్లిష్టస్థితి గడిచి గట్టెక్కి ఆశయం సాధించుకోగలిగినదో సవివరంగా చెప్పారు.

తర్వాత కార్యదర్శి శ్రీ కె. రామగోపాలరావుగారు

# ఢిల్లీలో ఆంధ్రా పాఠశాల

తమ నివేదికలో దాతలను, చేదోడు వాదోడుగా నిల్చిన పెద్దలను అభినందించి, ముందుముందు కూడా ఇతోధికంగా సహకరించవలసిందని విజ్ఞప్తి చేశారు. ఆంధ్రకేసరి ప్రారంభోపన్యాసం దాదాపు అరగంట సేపు అఖండ వాగ్ధాటిలో వెలువడుతుంటే అతి నిశ్శబ్దంగా విన్నారు సభాసదులు.

ఈ స్కూలు స్థాపనకూ, భవన నిర్మాణానికీ మూల కారకులైన శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ గారిని అభినందించేరు. దేశంలో కల్లా వయో వృద్ధులైన ముఖ్య మంత్రి సభకు అధ్యక్ష స్థానంలో కూర్చోడం తన మహా భాగ్యమనీ, ఆంధ్రులు తమ స్వంత విద్యాలయం నిర్మించుకోవడం చాలా సంతోషం కలిగించిందనీ అన్నారు శ్రీ బ్రహ్మ ప్రకాశ్.

రాజధానియైన ఢిల్లీలోని ఎంతోమంది పెద్దలు ఈ ఉత్సవం చూడ్డానికి వచ్చారు. ఉపరాష్ట్రపతి శ్రీ రాధాకృష్ణన్, కేంద్ర ఆర్థిక మంత్రి శ్రీ సి. డి. దేశ్‌ముఖ్, దామోదర్ వాలీ కార్పొరేషన్ బోర్డు అధ్యక్షులు శ్రీ పి. యస్. రావు, ఆంధ్ర ప్రభుత్వ ఆర్థిక మంత్రి శ్రీ తెన్నేటి విశ్వనాథం మొదలగు వారు కేంద్ర ప్రభుత్వ మంత్రులు, రాష్ట్ర ప్రభుత్వాల అధినేతలు, గవర్నర్లు, పత్రికా సంపాదకులు ఒకరేమిటి? ఆంధ్రులనిపించుకొనేవారు అంతా గోపాలం వచ్చి ఆనందించేరు. అచ్చు చిన్న ఆంధ్రా సంరంభం జరిగింది.

మద్రాసులో ఆంధ్ర మహిళా సభలాగే ఢిల్లీలో ఆంధ్రుల పాఠశాల కూడ దిన దిన ప్రవర్ధమానమై వర్థిల్లుతుందని అంతా ఆశిస్తున్నారు.





# రాజకీయాలు

• శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు •

1954 జూన్ నెల నాలుగో వారం మొదలుకుని జూలై మూడో వారం వరకూ అంతర్జాతీయ రాజకీయ రంగంలో నడిచిన ప్రధాన సంఘటనలు ఇవి— ఇండో చైనాపై యుద్ధ విరమణ ఒప్పందం కుదరటం, చైనా ప్రధాని ఇండియా, బర్మా ప్రధానులను కలుసుకొనటం, చైనాకు సమితిలో స్థానం ఇచ్చే విషయమై అమెరికా అనుచరుల్లోనే అభిప్రాయ భేదాలు కలగటం.

భారత దేశానికి సంబంధించిన విషయాల్లో చెప్పుకో తగ్గవి ఫ్రెంచి, పోర్చుగీస్ ఇండియాలలో విమోచ నోద్యమం బలపడటం, భారత రాజ్యాంగాన్ని మళ్ళీ సవరించటానికి కాంగ్రెస్ సన్నాహ పడటం. ఆంధ్రదేశ వ్యవహారాల్లో ముఖ్యమైనవి హైకోర్టు స్థాపన, తిరుపతి యూనివర్సిటీకి భారత రాష్ట్రపతి ఆమోదించటం, నందికొండ ప్రాజెక్టు త్వరలోనే ప్రారంభమయే సూచనలు కనిపించటం, కేంద్ర ప్రభుత్వం బియ్యంపై కంట్రోళ్ళను తొలగించటం.

* * *

జులై నెల 21 వ తేదీ తెల్లవారు ఝామున ఇండో చైనా యుద్ధ విరమణ ఒప్పందంపై జెనీవాలో సంతకాలు జరిగినవి. ఇండో చైనాలోని మూడు రాజ్యాలకూ— లావోస్, కాంబోడియా, వీట్నాం, స్వాతంత్ర్యం-ఇస్తూ ఫ్రాన్సు ప్రకటించింది. వీట్నాంను 17 వ అక్షాంశ రేఖకు కొంచం పైగా యుద్ధ విరమణ కోసం రెండు ప్రాంతాలుగా ఏర్పాటు చేశారు. రెండు ప్రాంతాలనూ తిరిగి ఏకం చేయటం కోసం ఈ రెండు ప్రాంతాల అధికారులూ ఒక ఏడాది తరవాత సంప్రదింపులు జరపాలనీ, 1956 జులై లోపుగా ఎన్నికలు జరిపి తద్వారా ఏకం చేయాలనీ నిర్దేశింపబడ్డది. లావోస్, కాంబోడియాలు 1955 లో రహస్య బాలట్ పద్ధతిమీద వోటింగు జరిపి, అందరికీ స్వేచ్ఛగా ఉండేట్లు ఎన్నికలు జరిపించాలని నిర్ణయించ బడ్డది.

యుద్ధవిరమణ చర్యలు సరిగా అమలు జరిగేట్లు చూసేందుకు ఇండియా, పోలెండ్ కెనడాలు ఒక అజ్మాయిషీ సంఘంగా పనిచేయాలనీ, వానికి ఇండియా అధ్యక్షత వహించాలనీ, ముఖ్యాంశాలమీద ఏకగ్రీవ నిర్ణయాలు, సాధారణ విషయాలమీద మెజారిటీవోటు మీద నిర్ణయాలు జరగాలనీ నిశ్చయించ బడ్డది. ఈ బాధ్యత వహించ వలసినదిగా ఈ మూడు దేశాలకూ ఆహ్వానాలు వెడుతున్నవి.

* * *

ఈ ఒప్పందం కుదరటానికి అమెరికా మినహా తక్కిన దేశాలన్నీ పట్టుదలతో పనిచేసినవి. అమెరికా అనేకవిధాల సమావేశాన్ని - విఫలం చేద్దామని ప్రయత్నించింది. చివరికి వాళ్ళ ప్రతినిధులు ఒకళ్ళు చెప్పింది మరొకరు ఒప్పుకోకుండా వితండవాదాలు సాగించారు. ఏ విధంగానయినా అమెరికాను యుద్ధంలోకి దించి ఇండోచైనాను తమ అధీనంలో ఉంచుకోవాలని ప్రయత్నించిన బీడోల్ట్ ప్రభుత్వాన్ని ఫ్రెంచి ప్రజలు దిగలాగి, మెండీస్ ఫ్రాన్సును ఎన్నుకొనటంతో, ఫ్రెంచి ప్రతినిధులు సవ్యంగా వ్యవహరించారు.

ఒప్పందంకుదుర్చుకునేందుకే వచ్చిన ఫ్రెంచి, వీట్మిన్, చైనా రష్యా బ్రిటన్ ప్రతినిధులూ, వీళ్ళకు అనధికార మధ్యవర్తిగా భారత ప్రతినిధి కృష్ణమీననూ చేస్తున్న కృషితో అమెరికాకు స్థానం లేకపోయింది. అందువల్ల చివరకు కుదిరిన ఒప్పందాన్ని అమెరికా ఆమోదించలేదు. దీనిని చెడగొట్టేందుకు బలప్రయోగం మాత్రం చేసేది లేదని మాట ఇచ్చింది.

మొత్తానికి ఈ ఒప్పందం ఇంచుమించుగా కొలంబో సభలో ఆగ్నేయాసియా రాజ్య ప్రధానులు సూచించినట్లే జరిగింది. అంటే ప్రధాని నెహ్రూ అనుసరిస్తున్న తటస్థ విధానానికి పరోక్ష గెలుపు వచ్చిందన్నమాట. రాజకీయ పరిష్కారం కుదుర్చుకునేందుకు ఉభయ పక్షాలూ ముఖాముఖి సంప్రదింపులు జరపాలని నెహ్రూ చేసిన సూచన కూడా ఆమోదించబడ్డది. ఐక్యరాజ్య సమితి ఆధ్వర్యానే యుద్ధవిరమణ, ఎన్నికలు జరగాలన్న అమెరికన్ వాదం ఓడిపోయి తటస్థరాజ్యాల ఆధ్వర్యమే నిర్ణయమయింది.

ఫ్రెంచి ప్రధాని మెండీస్ ఫ్రాన్స్ ఒప్పందం చేసుకొనటంలో చొరవ చూపించటమేకాక ఆజ్మాయిషీసంఘంలో అమెరికాకు పొరుగుదేశమే అయిన కెనడాను చేర్చుకొనటం వల్ల, అమెరికన్ యుద్ధోన్మాదులు అమెరికన్ ప్రజలను ఇండోచైనా విషయమై మోసగించకుండా, నిరోధించే అవకాశంకూడా కలిగింది.

గ్వాటెమాలా వామ పక్షప్రభుత్వంపైకి హొండ్యురాస్ నుంచి అభివృద్ధి నిరోధకులు జరిపిన దండయాత్ర నెగ్గింది. విద్రోహుల నాయకుడు ఆర్మాజ్ ప్రభుత్వాధ్యక్షుడయినాడు - ఆర్మాజ్ ప్రభుత్వం కమ్యూనిస్టు దేశాలతో తెగతెంపులు చేసుకుని, కమ్యూనిస్టు పార్టీని నిషేధించింది. ఈ విధంగా, మొట్ట మొదటిసారిగా అమెరికా పెత్తనాన్ని కాదనటానికి సాహసించిన దక్షిణ అమెరికా ప్రభుత్వం ఒకటి కూలదోయ బడ్డది.

అమెరికా మొదట గ్వాటెమాలా ప్రభుత్వాన్ని కమ్యూనిస్టు ప్రభుత్వమన్నది. ఆ తరవాత ఆ ప్రభుత్వం కమ్యూనిస్టు దేశాలనుంచి ఆయుధాలు తెప్పించు కుంటున్నట్లు ఆరోపించి, సరిహద్దు దేశాల నిండుగా ఆయుధాలు కుమ్మరించింది. అక్కడనుంచి దురాక్రమణ బయలు దేరగా, దానిని భద్రతామండలి విచారించ నివ్వకుండా చేసి తన తాబేదారు అయిన అఖిల అమెరికన్ రాజ్యాల సంఘమే విచారించాలని పట్టు పట్టింది. చివరకు గ్వాటెమాలా ప్రభుత్వం దానికి అంగీకరించినా కూడా వెంటనేపోయి ఆర్మాజ్ గెలిచే వరకూ చూస్తూ ఊరుకున్నది. ఆర్మాజ్ గెలుపు మహత్తర విషయమని డలెస్ చంకలు గుద్దుకున్నాడు.

చైనా ప్రధాని చౌఎన్‌లే జెనీవా సమావేశం సఫలం కావటానికి ముఖ్యకారకుల్లో ఒకడు. ఇండోచైనారాజ్యాలు అగ్రరాజ్య ముఠాల్లోజేరి తిరిగి యుద్ధరంగాలు కాకుండా నిషేధించే షరతును ఒప్పందంలో చేర్పించాడు. అంతే కాకుండా ఆయన ఇండియా, బర్మా ప్రధానులను కలుసుకుని ఆగ్నేయాసియా అంతటిలోనూ శాంతి ప్రాంతాన్ని నెలకొల్పటానికి చాలాదోహదంచేశారు. టిబెట్టుమీద ఇండియా చైనాలు చేసుకున్న ఒప్పందం పద్ధతినే అనుసరిస్తే ప్రపంచశాంతి ఏర్పడుతుందని ఉద్ఘాటించారు.

ఢిల్లీలో జూన్ 25 న చౌఎన్‌లే నెహ్రూను కలుసుకోటంవల్ల ఆగ్నేయాసియా రక్షణవ్యవస్థ ఏర్పాటు వెనక పడిపోయింది. వెంటనే ఆవ్యవస్థను ఏర్పరచే ఉద్దేశంతో అమెరికా అధ్యక్షుడు బ్రిటిష్‌ప్రధానిని ఆహ్వానించాడు. ఒక పక్కన నెహ్రూ - చౌఎన్‌లే సమాలోచనలు జరుగుతుండగా, జెనీవాసభ ఫలితం తేలకుండ ఉండగా, ఆ ఏర్పాటును బ్రిటన్ పూర్తిగా బలపరచ లేకపోయింది.

* * *

జెనీవా సమావేశం ఇండోచైనాలో యుద్ధాన్ని నిలిపివేయటమే కాక, కమ్యూనిస్టు దేశాలకూ, పశ్చిమ రాజ్యాలకూ మధ్య మరింత సన్నిహిత భావాన్ని కలిగించింది. దీనివల్ల బ్రిటన్, చైనాల సంబంధాలు అభివృద్ధి చెంది, పెకింగ్‌లోని బ్రిటిష్ ప్రతినిధి అక్కడి ప్రభుత్వాధికారులకు అధికార పత్రాలను సమర్పించటం జరిగింది. పసిఫిక్ ప్రాంతంలో అమెరికాకు రెండవ సంరక్షకుడుగా ఉంటున్న న్యూజీలాండే నవచైనాకు సమితిలో సభ్యత్వం ఇవ్వాలని వాదించటం మొదలు పెట్టింది. దీనిలో అమెరికా మరింత కోపం తెచ్చుకొని, చైనా సమితిలో ప్రవేశిస్తే, [illegible] ప్రారంభించింది, బ్రిటను లేకుండానే ఆగ్నేయాసియా వ్యవస్థ ఏర్పాటు చేస్తానని బెదిరిస్తున్నది.

* * *

ఫ్రెంచి ప్రధాని, మెండీస్ ఫ్రాన్స్ ఇండోచైనాపై ఒప్పందం కుదుర్చుకున్నట్లే, ట్యునీషియా సమస్య మీద కూడా జాతీయ నాయకులతో సంప్రదింపులు జరప నిశ్చయించాడు. ఇట్లాగే ఫ్రెంచి ఇండియా సమస్యమీద కూడా ఒక ఒప్పందానికి రావాలని ప్రయత్నిస్తున్నట్లు కూడా తెలుస్తున్నది.

ఈ కారణం వల్లనో, లేక పూర్వాచార పట్టుదల వల్లనో ఫ్రెంచివారు జూలైనెల 17 వ తేదీన మలబార్ తీరంలో ఉన్న తమ వలస ప్రాంతం

మాహేను వదిలిపెట్టి, అధికారాన్ని స్థానిక ప్రజలకు అప్పగించి వెళ్ళిపోయినారు. అయితే పుదుచ్చేరి, కారైకల్‌లలో మాత్రం ఫ్రెంచి దౌర్జన్యాలేమీ తగ్గడంలేదు. అక్కడి ఉద్యమం తీవ్రతరమయింది.

ఇట్లాగే పోర్చుగీస్ ఇండియాలోకూడా విలీనోద్యమం నానాటికీ బలపడుతున్నది. ఆగష్టు 15 నుంచీ ప్రత్యక్షచర్యలకు దిగటానికి అక్కడ ఉన్న అన్ని రాజకీయపక్షాలూ అంగీకరించినవి. అంతే కాకుండా ఇండియా ప్రాంతాల మధ్య లంకలవలె ఉన్న పోర్చుగీస్ ప్రాంతాల విమోచన కూడా ప్రారంభమయింది. దాద్రా అనే 'లంక' ప్రాంతం మొదటి ప్రాంతం - జూలై 21 అర్ధరాత్రి విమోచన పొందింది.

అయితే ఈ విమోచనోద్యమ సందర్భంలో పోర్చుగీస్ ప్రభుత్వం చాలా దురుసుగా ప్రవర్తిస్తుందని, కాబట్టి వ్యవహారం చాలా దాకా ముదురుతుందనీ చెప్పవచ్చు. ఫ్రెంచి ఇండియాను అప్పగింత పెట్టటానికి ఫ్రాన్స్ సూత్రప్రాయంగా అంగీకరించగా, పోర్చుగీస్ తనస్థావరాలు తన దేశంలో అంతర్భాగాలేనని వాదిస్తున్నది.

భారత రాజ్యాంగాన్ని సవరించటానికి కాంగ్రెస్ పార్టీ తీవ్ర సన్నాహాలు చేస్తున్నది. జూలై చివరి వారంలో అజ్మీర్‌లో కాంగ్రెస్‌సభ ఈ విషయమై తుదినిర్ణయాలు చేస్తుంది. వాక్ స్వాతంత్ర్యాన్నీ, అభిప్రాయ ప్రకటనా స్వాతంత్ర్యాన్నీ ప్రజలు దుర్వినియోగ పరుస్తున్నారని దేశంలో 13 రాష్ట్రాలను ఏలుతున్న కాంగ్రెస్ నాయకులు ఏకగ్రీవంగా కాంగ్రెసు సంస్థకు ఫిర్యాదుచేసి, దానిని సవరించ వలసిందేనన్నారు. హైకోర్టులు రిట్‌లను జారీచేసే అధికారాలను తగ్గించాలని ఆంధ్ర ప్రభుత్వం సూచించింది.

జూలై 5 వ తేదీన గుంటూరులో ఆంధ్ర రాష్ట్రానికి ప్రత్యేక హైకోర్టు ముగ్గురు న్యాయాధిపతులతో ఏర్పాటయింది. హైకోర్టు మద్రాస్‌నుంచి మారటం మూలంగా మద్రాసులో ఉన్న ఆంధ్ర విచారణ సంఘాల జూరిస్‌డిక్షన్ విషయంలో ఇబ్బంది వచ్చింది. వాటిని రోడ్ ట్రాఫిక్ బోర్డు, సేల్‌టాక్స్ ట్రిబ్యునల్, హిందూ మతాదాయాలబోర్డు - గుంటూరుకు తరలించ బోతున్నామని ఉపముఖ్య మంత్రి సంజీవరెడ్డిగారు తెలియజేశారు.

తిరుపతిలో వెంకటేశ్వర యూనివర్సిటీని స్థాపించటానికి ఆంధ్రశాసనసభ మేనెలలో చేసిన నిర్ణయాన్ని భారత రాష్ట్రపతి జూలై 19 వ తేదీన ఆమోదించారు. రాయలసీమ కాలేజీలను ఆంధ్ర యూనివర్సిటీకి జేర్చే విషయమై ఇంతవరకూ తేలక, వాటి కార్యక్రమం దాదాపు స్తంభించి ఉన్నది. ఇప్పుడు ఈ ఆమోదం రావటంవల్ల అవివెంటనే ఆంధ్ర యూనివర్సిటీలో జేరటం, తిరుపతిలో యూనివర్సిటీ ఏర్పడటం వీలవుతుంది. ఈ యూనివర్సిటీ మొదటి రెండేళ్ళు గురుకుల యూనివర్సిటీగా ఉండి, ఆ తరవాత రాయలసీమ నెల్లూరు కాలేజీలమీదకూడా అధికారం స్వీకరిస్తుంది. దీనికి ఆంధ్ర హైకోర్టు ప్రధాన న్యాయాధిపతే చాన్సెలర్‌గా ఉంటారు.

నందికొండ ప్రాజక్టుపై ప్లానింగ్ కమిషన్ నిపుణుల పరిశీలన పూర్తి అయిందనీ, వారది ఉత్తమ ప్రాజక్టుగా అభిప్రాయపడ్డారనీ అక్టోబర్ ఒకటి నాటికి దానికి శంకుస్థాపన జరగ్గలదని తాము ఆశిస్తున్నామనీ ఆంధ్ర ఆర్థిక మంత్రి విశ్వనాథంగారు జూలై 19 న కర్నూలులో వెల్లడించారు.

ఈ ప్రాజక్టునూ, తదితర అంశాలను గమనించిన మీదట అయిఉంటుంది, అఖిలభారత కాంగ్రెసు కార్యదర్శి బలవంతరాయ్ మోహతాగారు జులై 8 తేదీన కర్నూలులో మాట్లాడుతూ ప్రాజక్టులు మొదలైన విషయాలు ఆంధ్ర, హైదరాబాద్ ప్రభుత్వాలు సహకరించ వలసిన అవసరం ఉన్నదని అన్నారు. విశాలాంధ్ర నిర్మాణం కావాలనిచెప్పే కారణాల్లో ఇది ఒకటి అని ఆయన అన్నారు. అయితే ప్రత్యేక తెలంగాణా రాష్ట్రం కావాలని వాదించేవాళ్ళు మాత్రం కొంతమంది ఉండనే ఉన్నారు.

జులై 10 వ తేదీనుంచి కేంద్ర ప్రభుత్వం బియ్యం కంట్రోళ్ళన్నిటినీ రద్దుచేసింది. ఆ వెంటనే ఆంధ్ర దగ్గర తాను కొంటానన్న లక్ష టన్నుల బియ్యం కాంట్రాక్టును తాను పాటించేది లేదని మద్రాసు ప్రభుత్వం ప్రకటించింది. అయితే దీనిని కేంద్ర ప్రభుత్వం రిజర్వు కింద కొంటుదని తెలియటం కొంత మేలయింది.

ఈ మధ్య ఆంధ్రప్రాంతపు వ్యవసాయోత్పత్తులన్నీ మార్కెట్లు లేక దెబ్బతింటున్నవి. ముందు పొగాకు, తరవాత వేరుశనగ, మిరపకాయలు, ఉల్లిపాయలు, ఇప్పుడు బియ్యం వీటన్నికీ సరయిన మార్కెట్లు దొరకటంలేదు. అంటే ఈ సరుకు ఎవరికీ అక్కర్లేక పోలేదు. కావలసిన వాళ్ళను కలుసుకుని మార్కెట్లు కుదుర్చుకొనటమే జరగటంలేదు. చిట్ట చివరకు కేంద్రం కొంతమేలుకుని వీటికి విదేశీ మార్కెట్లు చూపించటంలో సాయపడతానని చెప్పింది. ★

# హిందూ దేశంలో స్త్రీలు, పిల్లల యొక్క న్యాయసమ్మతమైన స్థానం

——:o:——

ఇండియన్ కాన్‌స్టిట్యూషన్ స్త్రీ పురుషులకు సమాన హక్కులున్నాయని, స్త్రీలను విభిన్నంగా చూడరాదని ప్రకటించింది. కాన్‌స్టిట్యూషన్ హామీ యిచ్చిన ప్రాథమిక హక్కులు స్త్రీ పురుషులకు సమానంగా వర్తిస్తాయి. ఇండియాలో వయోజనులందరికీ సమాన ఓటింగు హక్కు ఉంది గనుక, స్త్రీలకు ఓటు చేసే హక్కు ఉంది. ఇటీవల ఎక్కువమంది స్త్రీలు శాసన సభల్లోను, పురపాలక సంఘాల్లోను, స్థానికబోర్డుల్లోను ప్రవేశించారు. ప్రభుత్వ ఉద్యోగాల్లోకూడా స్త్రీలను ఎక్కువగా చేర్చుకున్నట్టు రుజువులున్నాయి. కేంద్రంలోను, రాష్ట్రాల్లోను మనకు స్త్రీలు మంత్రులుగానున్నారు. ఇంకా చాలామంది స్త్రీలు ప్రజాభ్యుదయ కార్యక్రమాల్లో గొప్ప కృషి గావించి మన్నన పొందిన వారున్నారు. ఫ్యాక్టరీల్లోను, గనుల్లోను, కాఫీ వగైరా తోటల్లోను, చాలా కాలం నుంచి స్త్రీలు కూలీలుగా పనిచేస్తున్నారు. ఇంటి పనుల్లో కొందరుంటున్నారు. దాదాపు అన్ని వ్యాపారాల్లోనూ స్త్రీలున్నారు.



శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్
చైర్మన్ సెంట్రల్ సోషల్ వెల్‌ఫేర్ బోర్డు

పెద్దభాగం :— ఇండియాలో హిందూ స్త్రీలే ఎక్కువ. హిందూదేశ వాసులు తమ సొంత వ్యవహారాల్లోను, సాంఘిక - మత సంబంధమైన విషయాల్లోను, ఆస్తి హక్కుల్లోను తామేర్పరచుకొన్న సొంత నిబంధనల ప్రకారం కట్టుబడి ఉంటున్నారు. ఈ నిబంధనలు దేశం లోని శాసన సభలు సవరించేవరకు, అమల్లో ఉంటుంటాయి. ఇక్కడే పురుషులు స్త్రీలను ఎలా తమకు క్రిందివారినిగా చేసేసారో వ్యక్తమౌతుంది. హిందూ చట్టం ప్రకారం గట్టిగా చూస్తే స్త్రీలకు వారసత్వపు హక్కు లేకుండా చేసేరు. కొన్ని ప్రత్యేకింపులుంటే ఉండొచ్చుగాని సామాన్యంగా జరుగుతున్నదిది, వారసత్వం వల్ల కొద్దిగా భూమి సంక్రమించినా అది ఆమె జీవిత పర్యంతం అనుభవించడానికే, జీవితాంతంలో మరొకరికిచ్చే హక్కులేదు.

హిందూ లా ప్రకారం, భార్యాభర్తలకు విడాకులన్నది లేనేలేదు. ఐనా దాంట్లోకూడా కొన్ని హైందవ జాతులు తమ ఆచారం ప్రకారం విడాకులిచ్చుకొని పునర్వివాహం చేసుకోడానికి ఒప్పుకుంటాయని జ్ఞాపకముంచుకోవాలి. భర్త జీవించి ఉండగా హైందవ స్త్రీలు మరొకర్ని వివాహం చేసుకోరాదు— కాని పురుషులు మాత్రం ఎంత మంది భార్యలనైనా చేసుకోవచ్చు. పిల్లలు ఎవరి హక్కో అని నిర్ణయించవలసి వచ్చినప్పుడు తండ్రికే ఎక్కువ హక్కు ఉన్నట్లు గమనించబడుతుంది. భర్త వల్ల అశ్రద్ధ చేయబడినా, అన్యాయం చేయబడినా, స్త్రీకి విముక్తి మార్గం లేదు. తుదిమించిన క్రూరత్వంలోను, విడిచిపెట్టి వేయబడ్డ కేసుల్లోను మాత్రం భర్తను మనువర్తి కోరడానికి ఆమెకు హక్కు ఉంది. ఈ అన్ని విషయాలవల్ల, హిందువుల సొంత నిబంధనలు, స్త్రీలను తక్కువ వారిగా చూడ్డానికిదోహదమయ్యేయి. ఇదొక్కటే చాలు కాన్‌స్టిట్యూషన్ ప్రకటించిన సమానత్వానికి వ్యతిరిక్తంగా వుందని చెప్పడానికి. అందుచేత యీ విషయాలన్నిటిలోను క్రొత్త శాసనాలు చేయాలి.

ఇటీవల శాసన సభలకృషి :— స్త్రీలు సమానత్వం లేనివారు గాను, తక్కువ వారిగాను చూడబడ్డం తగ్గించడానికి యిటీవల కొన్ని శాసనాలు జరిగేయి. 1853 సం॥లో చేయబడ్డ ఒక శాసన చట్టం హిందూ వితంతువులు పునర్వివాహం చేసుకోడానికి అనుమతించింది. 1937 లో మరో చట్టం - సంతానం లేకుండా గతించిన భర్త ఆస్తికి భార్య తన జీవితాంతం వరకు సంపూర్ణ హక్కు కలదిగాను, సంతానం ఉంటే వారితో సమానంగా ఆస్తి పంచుకునేటట్లును చేసింది. 1946 లో వేరొక చట్టం కొన్ని పరిస్థితుల్లో భార్య భర్తతో విడచి బ్రతకడానికీ, తన పోషణకు, వసతికి తగు సౌకర్యాలు భర్త యేర్పాటు చేసేటట్లు కోరడానికి స్త్రీలకు

హక్కులిచ్చింది. ఆపరిస్థితులేమిటంటే- భర్త ఏదైనా భయంకరమైన కాయిలాకు లోనవడం, భార్య యెడల క్రూరత్వం గాని, పక్షపాతంగాని చూపడం, అతడు మరో వివాహం చేసుకోవడం, మతాంతరుడవడం ఇంట్లో ఉంపుడుగత్తెను ఉంచడం వగైరాలు.

వివాహాల సందర్భంలో హిందూ లా ప్రకారం, వివాహం చేసుకొనే వారిద్దరూ ఏకకులస్థులై ఉండాలి. బాల్య వివాహాలు ఎక్కువగా ఉండేవి. 1929 సం॥లో చేయబడ్డ శారదా చట్టం, 18 ఏళ్ళ లోపు వయస్సుగల మగపిల్లలకు గాని, 15 ఏళ్ళ లోపువయస్సుగల ఆడపిల్ల లకుగాని, వివాహాలు చేయరాదని శాసించింది. ఇటీవల చేయబడ్డ శాసనాలు - వర్ణాంతర వివాహాలు - అంటే బౌద్ధులు, సిక్కులు, జైనులు— మధ్య ఆక్షేపణలు లేకుండా పెళ్ళిళ్ళు చేసుకోవచ్చునన్నాయి. ప్రత్యేక వివాహ చట్టం— స్త్రీ పురుషులు, జాతి-మత- కులాలతో ఏమి ప్రమేయం లేకుండా, నిరాక్షేపణగా వివాహం చేసుకోడానికి అంగీకరిస్తుంది.

కొన్ని రాష్ట్రాల్లో హిందువులు ఒక స్త్రీనే వివాహ మాడాలని ఇటీవల శాసనాలు చేసేయి. విడాకులిచ్చుకో డానికీ, పునర్వివాహాలు చేసుకోడానికీ వీటిలో అంగీకారం వుంది. అదే మాదిరిగా దేశమంతటికీ వర్తించేటట్లు చేసే శాసనాలు పార్లమెంటులో చర్చింపబడుతున్నాయి. దేశంలో కొన్ని ప్రాంతాల్లో హిందూ దేవాలయాలకూ, దేవుళ్ళకూ స్త్రీలను దేవ దాసీలుగా నియమించే ఆచారం ఉంది. ఇలాంటి స్త్రీలు వివాహం చేసుకోరాదు— గనుక వీరు వ్యభిచారులుగా తయారయ్యేవారు, మద్రాసు, బొంబాయి రాష్ట్రాలు — ఇలాంటి ఆచారాన్ని ఖండించి, ఈ స్త్రీలు వివాహం చేసుకొని కుటుంబ జీవనం నడపడాన్ని తోడ్పడే శాసనాలు చేసేయి.

కూలీలుగా పనిచేసే ఆడవారికి వర్తించే చట్టాలు :—

కర్మాగారాల్లోను, గనుల్లోను, కాఫీ- తేయాకు-రబ్బరు మొదలైన తోటల్లోను స్త్రీలను నియోగించడాన్ని గురించి కొన్ని శాసనాలున్నాయి. స్త్రీలచే - చేయించవగ్గ పనులు, పని చేయించే గంటలు, ఫలానా విధంగా ఉండాలని అవి నిర్ణయిస్తాయి. వీటి యజమానులు, పనిచేసే పురుషులకు, స్త్రీలకు వేర్వేరు సౌకర్యాలు కల్పించాలనికూడా యివి శాసిస్తాయి. 50 మంది కంటె ఎక్కువ స్త్రీలను నియోగించే కర్మాగారాలు వారి పసి పిల్లల్ని విడవడాన్కి తగిన విశ్రాంతి స్థానాలు (Creches) యేర్పరచాలి. పసి పిల్లలకు పాలిచ్చుకోవలసిన స్త్రీలుంటే వారికి తగు విరామ కాలం యివ్వాలి.

ఆడ కూలీలకు ప్రసూతి సౌకర్యాలు (అంటే జీతం తోటి శెలవు, యివ్వడం, మంత్రసాని సౌకర్యాలు కల్పించడం వగైరాలు) కల్పించే శాసనాలు కూడా చాలా రాష్ట్రాలు చేసేయి. ప్రసవించిన స్త్రీలచేత, మాసం దాటితే కాని, పని చేయించరాదని శాసనం ఉంది.

ఒకే పని చేస్తున్నప్పుడు— స్త్రీలకు పురుషులకు, ఒకే జీతం ఇవ్వాలన్న ఆశయం ఇంకా సాకారం దాల్చలేదు. ఈవిషయంలో అంతర్జాతీయ నియమాన్ని, హిందూ దేశం ఇంకా పూర్తిగా ఒప్పుకోకపోయినా దీని సత్యాన్ని అంగీకరించింది. కాన్‌స్టిట్యూషన్ యొక్క నిర్ణయ సూత్రాలు వీటిని కూడా తమ ఆదర్శంలో చేర్చుకున్నాయి.

పిల్లలుచేత కూలిపని చేయించడంలోగల నిషేధాలు :—

15 ఏళ్ళ లోపు వయస్సుగల పిల్లలు, ఏ ఫ్యాక్టరీ లోను, గనిలోను, మరే అపాయకరమైన పనిలోను నియోగింపరాదని శాసిస్తుంది. తల్లి దండ్రుల అనుమతి లేనిదే ఏ విద్యాసంస్థలోను మత విషయాలు బోధింప బడరాదు. పిల్లలు అశ్రద్ధ చేయబడ్డం, వాళ్ళ నియోగించి డబ్బు సంపాదించడం జరుగరాదనీ, 14 ఏళ్ళ ప్రాయం లోపు పిల్లలందరికీ తప్పని సరిగా విద్య ఉచితంగా చెప్ప బడాలనీ ఇలాంటివన్నీ కాన్‌స్టిట్యూషన్ యొక్క ఆశయాలు.

1850 వ సం॥లో చేయబడ్డ ఒక చట్టం ప్రజల దాన ధర్మాలతో పోషింపబడే అనాథలు, పేదవారైన పిల్లలు వ్యాపారం, చేతి పనులు నేర్చుకోడాన్కి వీరిని పంపవచ్చని అనుమతిస్తుంది. 1933 వ సం॥లో చేయబడిన చట్టం పిల్లల పాలేరు తనాన్ని తాకట్టు పెట్టడాన్కి అంగీకరించదు. అలాంటి కంట్రాక్టు లేమైనా వుంటే అన్నీ రద్దు పరచి, ఆ పనులు చేసేవాళ్ళు శిక్షార్హుల్ని చేసింది.

పిల్లల అమ్మకం, కొనుబడి ఇండియన్ పీనల్‌కోడ్ ప్రకారం శిక్షార్హ పనులు. అలాగే మైనారిటీ పిల్లల్ని ఉంపుడు వృత్తికై కొనడం కూడాను. ఈ రెంటికీ కూడా కఠిన శిక్షలు పడతాయి. 1938 వ సం॥లో చేయబడ్డ ఒక చట్టం ప్రకారం— ఏ రైలు స్టేషన్లోనూ 15 ఏళ్ళ వయస్సు గల పిల్లలు సరుకుల రవాణాకు సంబంధించిన ఏ పనిలోను

నియోగింపబడరాదు. బీడీలు, కంబళీలు, సిమెంటు, అగ్గిపెట్టెలు. ప్రేలుడు మందులు, అభ్రకం, లక్క, సబ్బు, డబ్బాలు, కత్రపనులు, వగైరాలు గావించే కర్మాగారాలేవీ కూడా 12 ఏళ్ళ లోపు ప్రాయం గల పిల్లలచేత పనులు చేయించరాదని శాసనం ఉంది.

ఫ్యాక్టరీల ఆక్టుప్రకారం, ఏ ఫ్యాక్టరీలోనైనా సరే పని చేస్తున్న పెద్దలూ, పిన్నలూ వైద్య పరీక్షకు లోనై ఆ పని చేయడానిక్కి తగియున్నారని సర్టిఫికేటు పొందాలి. వారు ఇన్ని గంటలు మాత్రమే పనిచేయాలని, ఫలానా పనులు మాత్రమే చేయాలనికూడ నిర్ధారణ చేయబడి యుంటుంది.

పిల్లల్ని పోషించవలసిన బాధ్యత తండ్రిది. పసిపిల్లలైతే మాత్రం తల్లి దగ్గర వుండనిస్తుందిగాని, కోర్టు, తతిమ్మావార్ని తండ్రికే వప్పజెప్తుతుంది. 12 ఏళ్ళ ప్రాయం లోపు పిల్లల్ని విడిచి పెట్టిన తల్లిదండ్రు లెవరైనా శిక్షార్హులే. న్యాయసమ్మతం కాకుండా పుట్టిన బిడ్డ పోషణ ఖర్చులకోసరం, అందుకు కారకుడైన పురుషుణ్ణి కోర డానిక్కి స్త్రీకి హక్కు వుంది. క్రిమినల్ ప్రొసీజర్‌కోడ్ క్రింద అలాంటి తండ్రులు శిక్షార్హులు,

అమల్లో పెట్టడంలో గల సమస్య :— కొన్ని రాష్ట్రాలు పిల్లల్ని గురించి శాసనాలు చేసేయిగాని అన్ని రాష్ట్రాలు వాటిని అమల్లో పెట్టలేదు. ఈ శాసనాలన్నింటిలోనూ రెండు ముఖ్య దృక్పథాలున్నాయి :— (1) లా ప్రకారం తప్పు చేసినవారిగా పరిగణింపబడే పిల్లల శిక్షణా, వార్ని తగిన పౌరులుగా మార్చడం. ఈ కేసుల్ని విచారణసాగించే కోర్టులు వేరు, తంతు వేరు. కాని, ముఖ్య విషయం ఏమిటంటే వాళ్ళ తప్పులకు దండనలు విధించేకంటే, వాళ్ళని బాగుచేయడం ఎట్లు? అన్న విషయానికి ప్రాధాన్యం యిస్తాయి.

1897 వ సం॥పు చట్టం ఒకటి ఉరిశిక్షకు, జీవితాంతం వరకు పరదేశవాసం అనుభవించే శిక్షకు లోనుగాని 15 ఏళ్ళ లోపు వయస్సుగల పిల్లల్ని బాగుచేయడానిక్కి, శిక్షణ కేంద్రాలు నెలకొల్పవచ్చుని, అనుమతిస్తుంది. ఇది తప్పు చేసిన పిల్లలందరకు వర్తించదుగాని కొందరికే యీ అవకాశం యిస్తుంది. పిల్లల్ని గురించి చేసిన చట్టం ప్రకారం ఉరిశిక్ష, అండమాను దీవులు వగైరాలకు పంపబడ్డం, యావజ్జీవ బంధిఖానా శిక్ష, పిల్లలకు విధించరాదు. తప్పుజేసేరని ఋజువైనమీదట కొన్ని సర్టిఫైడ్ స్కూళ్ళకు, పారిశ్రామిక శిక్షణాలయాలకు తర్ఫీదుకై పంపబడాలి. కొన్ని రాష్ట్రాల్లో, 16-21 సం॥ల ప్రాయంలో తప్పు పనులు చేసి దండార్హులైన పిల్లలు, బోర్‌స్టల్ సంస్థలకు, తగు శిక్షణకూ, తర్ఫీదుకూ పంపబడతారు. (2) పిల్లల చట్టంయొక్క రెండో ఆశయం ఏమిటంటే- తల్లిదండ్రులు లేని పిల్లలకు, విడువబడ్డ పిల్లలకు, దిక్కులేని పిల్లలకు పోషణా రక్షణా కల్పించడం. ఈ ఆక్టులు తల్లిదండ్రుల కర్తవ్యాల్ని నిరూపిస్తాయి. పిల్లల కోసరం నియమింపబడ్డ కోర్టులు, అనర్హులని తోచిన వారి పిల్లల్ని, తల్లిదండ్రులనుండి వేరుపరచి, తమ శిక్షణ క్రిందకు తీసుకోడానిక్కి హక్కులిస్తాయి.

ప్రభుత్వం యొక్క సంక్షేమ సంస్థలయొక్క సేవలు :—

ప్రస్తుతం స్త్రీలకోసరం, పిల్లల కోసరం కృషిచేసే పని ఐచ్ఛిక సంస్థల చేతుల్లో ఉంది. ప్రభుత్వం ఈ సేవల భారం తన మీద పెట్టుకోవడంలేదు. ఇప్పుడు ఇండియన్ కాన్‌స్టిట్యూషన్ ప్రభుత్వం మీద చాలా బాధ్యతలు పెట్టింది. ఇలాంటి సంస్థల్ని భరించడంగాని ఇలాంటి సేవలు ప్రభుత్వమే గావించడంగాని జరిగించాలనీ, ఈ పని కాల క్రమేణా హెచ్చాలని విధించింది. ఈ కార్యభారం పూర్తిగా ప్రభుత్వం వహించడానికి కొంతకాలం పడుతుందని, ప్రథమ పంచవర్ష ప్రణాళిక గమనించింది. అంతకంతకు ఎక్కువ పిల్లలకు సేవ గావించడానికని ఐచ్ఛిక సంస్థల్ని బలపర్చడం, వాటి కృషిని హెచ్చించడం- ఈ పని మాత్రమే ఇప్పుడు ప్రభుత్వం తీసుకుంది. ఇందుకని 4 కోట్ల రూపాయలు ప్రత్యేకించింది. కేంద్రప్రభుత్వం ఇలాంటి సంస్థలు నిర్మించి సేవలు గావించడంలో మంచి అనుభవం గల ఉద్యోగేతరుల్ని మెంబర్లుగాచేసి, ఒక కేంద్ర సోషల్ వెల్‌ఫేర్ బోర్డుని నియమించి, ఈ మొత్తాన్ని ఆ బోర్డుకు వప్పగించింది— ఐచ్ఛిక సంస్థల కృషిని హెచ్చించడానికని. ఈ బోర్డు సంవత్సరం లోపు నుండి పనిచేస్తూంది. అప్పుడే ఇది చాల కృషి చేసింది. అనేక సంస్థల్ని గురించి విచారించి, చాల సంస్థలకు సహాయం ఇచ్చింది. ఇది ప్రారంభ కృషి మాత్రమే. ముందు ముందు అనేక సంక్షేమ సంస్థలు బయలుదేరి, దేశమంతటా అల్లుకుంటాయనీ, సంఘంలో సేవ నాకాంక్షించే స్త్రీలు, పిల్లలు వగైరాలందరికీ యథోచిత సేవకు వలసిన యేర్పాట్లన్నీ జరుగుతాయనీ ఆశించవచ్చు.

('సంఘ సంక్షేమ' పత్రిక నుండి)





# గాంధీజీ విమర్శలు

## అసలు పని ఇప్పుడే ప్రారంభమైంది.

"మన స్త్రీల పరిపూర్ణ స్వాతంత్ర్యం నేను గాఢంగా వాంఛిస్తున్నాను. బాల్య వివాహాలు నేను ఖండిస్తున్నా. బాల వితంతువును చూస్తే నేను కంపించిపోతాను. భార్య మరణించిన అచిరకాలంలోనే వృద్ధప్రాయుడులా మరో వివాహం చేసుకున్న అతణ్ణి చూస్తే నేను కోపోద్రేకంతో కంపిస్తాను. తల్లిదండ్రులు తమ ఆడపిల్లలకు చదువులు చెప్పించక మూఢులుగా ఉంచేసి, ఏదో ఇంత ఆస్తిపరుడికి కట్టబెట్టి భారం వదుల్చుకుందాం, అన్న ఘోరమైన నిర్లక్ష్యం నేను భరించలేను.

"ఈ మహావేతన, వేడి కోపాలు, ఎలాగున్నా, నేను యీ సమస్యా పరిష్కారంలో ఉండే కష్టాల్ని గమనించలేకపోలేదు. స్త్రీలకు వోటు హక్కు, సమాన ప్రతిపత్తి ఉండాలి. ఐనా ఈ సమస్య అంతటితో అంతమయ్యేదీ కాదు. స్త్రీలు జాతీయ రాజకీయ చర్చల్లో పాల్గొనడం ప్రారంభించిన్నాడు — ఈ సమస్యా పరిష్కారం ఆరంభమౌతున్నదన్నమాట. —" అని గాంధీజీ వాక్కులు.

ఎంత అమోఘ వాక్కులు! మన జాతీయ జీవన యాత్రలో ఇప్పుడేరెండో మజిలీకో జేరుకున్నాం. ఇంకా అంధకారంగాను, క్లిష్టంగాను అగుపడే యీ మార్గంలో మనల్ని హెచ్చరించి మనచే చేయాలనిచ్చి నడిపించే పూజ్య బాపూజీ మనకింక లేడు. కాని స్త్రీల అవస్థ చూసి అతడు మరపించినట్లే మనమూ ఆ అనుభూతి పొందుతున్నాం — క్లుప్తమై చరిత్రాత్మకమైన యీ కొద్ది మాటల్లోను ప్రతిబింబించిన ఆ గాఢత్వాన్నీ, ఆ ప్రచండత్వాన్నీ కూడా. మహాత్ముని అమోఘ వాక్కులు కొంత సాఫల్యమయ్యేయి — ఈ రోజున భారతనారీమణులు పార్లమెంటులోను శాసన సభల్లోను పనిచేస్తున్నారు. స్త్రీలు — మంత్రులు — ఉపమంత్రులుగానున్నారు. భవిష్యత్తులో వారి సంఖ్య ఇంకా హెచ్చుతుంది. స్త్రీల దృక్పథం యీ పెద్ద అంతస్థుల్లో ప్రతిఫలించడంవల్ల స్త్రీజాతికి జరుగుతున్న అన్యాయాల్ని అరికట్టడాన్కి శాసన సభల్లో తగుచర్య తీసుకోబడుతుందని మనం ఆశించవచ్చు కాని ఆ శాసనాలు శాసనపట్ట పుస్తకాల్లోగాక, యథార్థంగా మన జీవిత చర్యల్లో అమలు జరిగేట్లు చూడవలసిన బాధ్యత — సంఘాభ్యుదయాన్కి కృషిచల్పే సోషల్ వర్కర్సుమీద, దేశ ప్రజానీకంమీద ఉంది.

★

## ఆంధ్ర హైకోర్టు అవతరణ

మొన్నను ఆషాడ శుద్ధ పంచమీ సోమవారం (5-7-54) నాడు గుంటూరులో ఆంధ్ర హైకోర్టు ప్రారంభించడంతో ఆంధ్రరాష్ట్రం సమగ్ర స్వరూపం దాల్చినట్లే, ఆంధ్రుల అభీష్టితాలన్నీ స్వరాజ్యం, సొంత విశ్వవిద్యాలయం, సొంత హైకోర్టులతో నెరవేరినట్లే — కాల క్రమేణా విశాలాంధ్ర కూడా సాకారం దాలుస్తుంది.

ఆంధ్రులు కార్య శూరులనడాన్కి — ఇంత అచిర కాలంలో ప్రజలు, ప్రభుత్వం పట్టుబట్టి, ప్రెసిడెంటు దగ్గర నుంచి అంగీకారం తెప్పించి, వలసిన బిల్డింగులూ ఏర్పాట్లూ పూర్తి కావించి, ప్రత్యేక హైకోర్టు రాష్ట్ర మధ్యంలో నెలకొల్పుకున్నాపన్నదే ఋజువు. దీనికి ఆంధ్రులంతా సగర్వంతో హర్షామోదాలు ప్రకటించేరు.

ఈ సందర్భంలో వెల్లువ వచ్చిన సందేశాలు, పలికిన సుభాషితాలు ఆంధ్రరాష్ట్ర పత్రికలోను, ఆంధ్రుల హృదయాల్లోనూ చిరస్థాయిగా ఉంటాయని, కోర్టులు 'సత్యమేవ జయతే' అన్న రాజముద్రలోని సత్యాన్ని ఋజువు చేస్తుంటాయని, ఆంధ్ర ప్రజానీకానికి న్యాయంత్వరలోను చవుకగాను అందుతుందని ఆశించవచ్చు.

★

# సోదరి నివేదిత

సౌశీల్యం ఘనతా నివేదిత పేరులోనే ధ్వనిస్తాయి. దేశం కాని దేశానికి వచ్చి, దైవానికీ ప్రజాసేవకీ తన జీవితాన్ని అర్పితం చేసిన నారీ రత్నం నివేదిత.

విధివశాన్న, హిందూదేశస్థులను గురించీ మత తత్వాలని గురించీ మహామహుల నోటిమాటలుగా విన్న విదేశస్థురాలు, తన సర్వస్వాన్నీ వదలి యీ దేశం వచ్చి హిందూమతాన్ని స్వీకరించి, దానికై ఆత్మార్పణ చేసిందంటే — మన మతంలోని ఆకర్షణ ఎటువంటిదో వూహించగలం. ఈనాడు సంఘంలో మత ప్రాముఖ్యం సన్నగిల్లినా, ఒకనాడు యీ మతమే అన్నిటికంటే ఘనత వహించినదని హిందువు లందరికీ తెలుసు. అందుకే మతం చేతా మతగురువులచేతా ఆకర్షింపబడిన వ్యక్తి తన సర్వాన్నీ త్యాగం చేసిందంటే, నివేదిత లక్ష్యం ఎంత పటిష్ఠమైనదో తెలుస్తుంది.

హిందూదేశం విచ్చేసి, యీ దేశ వనితలకి ఆదర్శప్రాయులైన విదేశీయ వనితలు చాలామందే వుంటారు. ఏనీబెసెంట్, కజిన్సుసతి వంటివారి వలెనే నివేదిత కూడా మనకి సన్నిహిత అయింది.

అక్టోబరు 1867 లో మిస్ నోబుల్ (తరువాత జీవితంలో నివేదిత) జన్మించింది. తల్లీ తండ్రీ ఐర్లాండు దేశస్థులు. తండ్రి పేరు గాంచినవక్తయే కాక, మతమంటే తన సర్వస్వంగా ఎంచే తత్వం అతనిది. ఈ రెండు గుణాలూ మిస్ నోబుల్‌లో కూడా ఉద్భవించాయి. మిస్ నోబుల్ యింకా చిన్న పిల్లగా వుండగానే, తండ్రి స్నేహితుడయిన హిందూదేశస్థుడొకడు వారింటికి విచ్చేశాడట. అందంగా తెలివితేటలు ఉట్టిపడే మిస్ నోబుల్ ముఖం చూసి సంతోషించి, 'పెద్దదానివయ్యాక మాదేశం తప్పకుండారావాలి' అన్నాడట.

మొదటినుండీ కూడా తండ్రికి తెలుసు తన కుమార్తెలో ఏదో ఒక ప్రత్యేకత వున్నదని. అందుకే కుమార్తె దారికి అడ్డు నిలవ వద్దని భార్యతో అంటూ వుండేవాడు. కాని దురదృష్టవశాత్తూ కుమార్తె ఘనత కళ్ళారా చూడకుండానే ఆయన మరణించాడు. అందుకే, మిస్ నోబుల్, హిందూ దేశం వెళ్ళి అక్కడ ప్రజాసేవలో నిమగ్నురాలవాలని వుందంటే, తల్లి అడ్డు చెప్పలేకపోయింది.

చదువు సంధ్యలు ముగించుకొన్నాక ఏదైనా ఉపయుక్తమైన పనిలో నిమగ్నమవాలవి మిస్ నోబుల్ కోరిక. కాని ఎక్కడ? లండన్ మహానగరంలోనే దరిద్రం విషాదం విపరీతంగా వున్నాయంటే ప్రపంచం అంతటా యింకా ఎంత ఎక్కువగా వుంటాయో అని యోచించింది. కాని ఒక వ్యక్తి ఎంత ప్రయత్నిస్తే మట్టుకు ప్రపంచం అంతా అలుముకొని వున్న దారిద్ర్యాన్ని విషాదాన్నీ రూపుమాపకలదా? లేదు. అయినా శక్తివంచన లేకుండా బాధాపీడితుల సేవ చేయటమే లక్ష్యంగా తీసుకొని లండన్‌లో ఒక స్కూలు ప్రారంభించింది మిస్ నోబుల్. ఈ స్కూల్లో పాఠాలు చెప్పడమే ముఖ్య లక్ష్యంకాదు. జీవితంలో రాణించే యువతీ యువకులను తయారు చేయడం. ప్రపంచంలో స్త్రీలుకూడా పురుషులతో పాటు అన్ని రంగాలలోనూ పాల్గొని సంఘ పునరుద్ధరణకి చేయూత నియ్యాలని మిస్ నోబుల్ నమ్మకం. ఆనాటి స్త్రీలలో యిలాంటి వుద్దేశ్యాలు తక్కువ. అందుచేతనే యీ ఉద్దేశ్యాలని వ్యాపితం చేయాలని ఆమె తాపత్రయపడింది.

ఈ స్కూలు నడిపే రోజులలోనే ఆమె జీవితంలో చారిత్రాత్మక సంఘటన ఒకటి జరిగింది. స్వామి వివేకానందుడు, అమెరికాలో జరిగిన 'Parliament of Religions' లో పాల్గొని, స్నేహితుల పట్టుదలవలన

శ్రీమతి కె. రామలక్ష్మి

ఇంగ్లాండు విచ్చేశాడు. అప్పుడే మిస్ నోబుల్ అయనను చూసింది. అయన ఉపన్యాసాలను శ్రద్ధాసక్తులతో వింది. మరుచటి సంవత్సరం తిరిగి ఇంగ్లండు విచ్చేసిన వివేకా



నందుడు, హిందూ మతాన్ని గురించి తెలుసుకోదలచిన వారికి ప్రత్యేకంగా ఉపన్యాసాలు ఏర్పాటు చేశాడు. వాటినుండే మిస్ నోబుల్ హిందూమత తత్వాన్నంతా ఆశ్వాదింప కల్గింది. ఒక స్నేహితునిద్వారా స్వామి వివేకానందుని కలుసుకుని ఆయనతో గంటలకొలదీ చర్చించింది. ఆ సందర్భంలోనే "హిందూ స్త్రీలకి సేవెంతో చేద్దామని వుంది. అందుకు నాకు చేయూత కావాలి. నీవు ఒక నిశ్చయానికి వచ్చి హిందూదేశం వస్తే బాగుంటుంది." అని వివేకానందుడు అన్నాడట. మిస్ నోబుల్‌కి యీ మాటలు నచ్చాయి. కారణం ఆమె కోరుకున్నదీ అదే. ఆమె ఒక నిశ్చయానికి వచ్చి వివేకానందునికి మాట యిచ్చింది. ఈ మాటే మనకి ఒక కూర్మి నెచ్చెలిని సమకూర్చిపెట్టింది. వివేకానందుడు ఆమెకు లేఖ వ్రాస్తూ "నా దేశంలో కానీ, మరెక్కడైనా కానీ, నాకు వేదాంతంలో నమ్మకం వుందనీ, లేకుంటనీ, నే బ్రతికున్నంత కాలం నీకు అండగా నిలుస్తాను. గజరాజుకైనా దంతాలు పూడైనాపోతాయి గాని లోపలికి పోవుగదా! అలాగే మానవ పుత్రుల మాటలు కూడా" అని వ్రాశాడు.

1898 లో శాశ్వతంగా ఇంగ్లండు వదలి మిస్‌నోబుల్ మన దేశంలో కలకత్తా సమీపాన్ని వున్న బేలూరు తన నివాసంగా చేసుకుంది. అదే రామకృష్ణ మిషన్‌వారి స్థావరం కూడా. ప్రతి ఉదయాన్నా వివేకానందుడు ఆమె నివాసానికి విచ్చేసేవాడు. తాను ఎలాంటి జీవితం సార్ధకం అని తలపోసినదీ చెప్తూంటే విని, మిస్ నోబుల్ తన జీవితాన్ని కూడా అదే మార్గానపెట్టి రక్షించాలని పునః నిశ్చయానికి వచ్చేది.

దేశం నలుమూలలా పర్యటించి తాను తల పెట్టిన పనికి సంసిద్ధురాలయింది. స్వామి, అతని శిష్య బృందంతో కలిసి ఉత్తర హిందూస్థానం అంతటా పర్యటించింది. ఈ పర్యటనా సందర్భమే మిస్ నోబుల్ హిందూ మతాన్ని స్వీకరించి 'నివేదిత' నామధేయురాలయింది.

కొద్ది రోజుల తరువాత, కలకత్తా మహానగరం ప్లేగు వ్యాధికి గురిఅయింది. ఆ రోజులలో, పట్టణాన్ని పరిశుభ్రంగా వుంచడం కోసం, రోగులకి చికిత్స చేయటం కోసం తనకి తోడుగా వుండటానికి యువకులనూ, యువతులనూ కూడదీసి మొనలేని సేవ చేసింది నివేదిత.

నిరక్షరాస్యత నిర్మూలించ బడితేనే గాని ప్రజారోగ్యం బాగుపడటం కాని, ఏ సంఘ సంస్కరణైనా రాణించటం కాని జరగదని నివేదిత గ్రహించింది. ఈ దృష్టితోనే ఉత్తర హిందూస్థానంలో స్కూళ్ళు స్థాపించింది. ఈ స్కూళ్ళకి స్వయం పోషక శక్తి లేకపోవటం వల్ల నివేదిత ఇంగ్లండు వెళ్ళి ధనం సేకరించవలసి వచ్చింది. ఇదే సమయాన స్వామి వివేకానందుని ఆరోగ్యం చెడటం వల్ల సముద్రయానం అవసరం అయింది. నివేదిత కూడా ఆయనతోపాటు బయలుదేరింది. ప్రయాణంలో వివేకానందుని అమూల్య వాక్యాలూ, సంభాషణలూ, ప్రవచనం మొదలుపెట్టింది. నివేదిత [illegible] [illegible]కి ఆమె [illegible] ఒక [illegible] అంటే అతిశయోక్తి కాదు.

వివేకానందుని, ఇంగ్లాండుని వదలి నివేదిత అమెరికా రాష్ట్రాలు పర్యటించటానికి వెళ్ళింది. ఆమె ఆ దేశా

లలో యిచ్చిన ఉపన్యాసాలు, యీమెకు హిందూ స్త్రీల పట్ల ఉండే గౌరవప్రతిపత్తులను చాటుతాయి. పతిసేవా తత్పరులయిన బెంగాలు వనితల భక్తి తత్వమూ, వీర నారీమణులయిన మహారాష్ట్ర వనితల ధీరచిత్తమూ, శౌర్య మూర్తులయిన రజపుత్ర కన్యల గాంభీర్యమూ, సంప్రదాయ సముచిత కుటుంబ భారమే జీవిత పరమావధిగా నెంచే మద్రాసు వనితలూ, ఈ అందాల రాణులు, గుజరాతు సుందరుల సౌందర్యమూ అన్నీకూడా నివేదిత దృష్టిని ఆకర్షించాయి. ఇంగ్లాండు నుండి తిరిగి వచ్చిన కొద్ది రోజులకే వివేకానందుని ఆరోగ్యం చెడింది. ఆయన త్వరలోనే పరమపదించారుకూడా. స్వామి మరణం నివేదితని కదల్చివేసినా, ఆయన తలపెట్టిన పని ఆమెకు ఊరట కల్గించింది. ఆయన తలపెట్టిన పని పూర్తి చేయడమే తన ప్రస్తుత పరమావధిగా నెంచింది. కలకత్తాలోని తన గృహమే ఒక పాఠశాలగా రూపొందించింది. వివాహితులయిన వనితలకి, కుటుంబ సాధక బాధకాలూ, ఆరోగ్య సూత్రాలూ, నిత్య జీవితంలో ఎదుర్కోవలసిన సమస్యలూ—మొదలైన వాటిని గురించి బోధనా తరగతులు యీ స్కూల్లో జరిగేవి. వితంతు శరణాలయం వంటి ఒక సంస్థని తన యింటనే నెలకొల్పింది. ఈ సంస్థ నిర్వహణకి, దేశదేశాల దాతలు ధనసహాయం చేశారు.

1906 లో కలకత్తా, దారుణమైన వరదలకీ, తరువాత కరువు కాటకాలకీ గురి అయింది. కరువు పీడిత ప్రాంతాలలో సేవా నిమగ్నురాలై నివేదిత తన ఆరోగ్యాన్ని లక్ష్య పెట్టలేదు. విషజ్వరం ఆమెలో జీర్ణించుకుపోయింది. డార్జిలింగు విశ్రాంతి కోసం వెళ్ళిన నివేదిత వ్యాధిగ్రస్తురాలై 1911 అక్టోబరులో మరణించింది.

హిందూదేశాన్ని, తత్ప్రజా జీవితాన్ని, వారి ఔన్నత్యాన్నీ సరిగా అర్థం చేసుకొన్న కొద్ది మందిలో నివేదిత ప్రముఖ స్థానం వహిస్తుంది. ఆమె హిందూ వనితలకి చేసిన సేవ, నేర్పిన గుణపాఠాలు ఆణిముత్యాలు. చిన్న పిల్లలకి సహితం అర్థం అయేలా మన మత సూత్రాలనీ, వీరగాథలనీ కథల రూపంలో పెట్టి ఆమె రచించిన "Cradle tales of Hinduism" హిందూ జీవిత సర్వస్వాన్నీ ఒక అనంత సూత్రంగా పరిగణిస్తూ వ్రాసిన "The work of Indian life" వివేకానందునికి అతి సన్నిహితంగావుండి, ఆయన జీవిత విశేషాలను వ్రాసిన "The Master As I saw him" అన్న గ్రంథాలు అమూల్యమైనవి.

నివేదిత విదేశీయురాలననే సంగతి మరిచి హిందూ జీవితంలో తనూ లీనమై జీవితం గడిపింది. వివేకానందుని "Arise, Awake, and Stop not till the goal is reached" అన్న ఉత్కృష్ట వాక్యాల నిరూపణయే నివేదిత జీవితం. తనని తను తెలుసుకొన్న నివేదిత తను చేరదలచుకొన్న పరిధిని చేరి శాశ్వత కీర్తిని గడించింది. భారతీయ నారీమణులకు మార్గదర్శి అయిన నివేదిత సార్థక నామధేయ.





మధురలో నున్న గాంధీగ్రామ్ కేంద్రంలో స్త్రీలు పొలాల్లో ఊప్పు ఊడుస్తున్నారు. ఆ పండిన పంట వారే అనుభవిస్తారు. వచ్చిన డబ్బు విద్యార్థుల నిధికి ఉపయోగిస్తారు.

దేశాభ్యుదయాన్కి తోడ్పడే పౌర శిక్షణ.

# ఆంధ్ర ప్రభుత్వ
# స్త్రీ జనాభ్యుదయ శాఖ

---:o:---

స్త్రీ వ్యక్తిత్వానికి అసాధారణమైన సహజ శక్తులు న్నాయి. స్త్రీ తలుచుకుంటే చేయలేని కార్యాలు అరుదు. మహాశక్తి అంశ అయిన 'మహిళ' మానవులను, మహా మానవులను సృజించగలదు. ఆమె మహితలాన్ని పునీతం చేయగల ఆదిలక్ష్మి. విశ్వానికి విద్యాదానం చేసే సరస్వతి.



శ్రీమతి పి. పారిజాతం నాయుడు
ఎక్స్ విమెన్ వెల్ ఫేర్ ఆఫీసరు.

ఆదర్శవంతమైన దాంపత్యంతో, ఆరోగ్యవంతమైన సంతానంతో, ఆనందకరమైన వాతావరణంతో కలకలలాడు తూండే కుటుంబాలే దేశ సౌభాగ్యానికి, విశ్వకళ్యాణానికీ ప్రతిబింబాలు. వ్యష్టి కుటుంబ సంక్షేమమే సమష్టి సమాజ సంక్షేమం అవుతుంది. సమాజం అనే మహా సౌధానికి ఆదర్శ కుటుంబం పునాది వంటిది.

సంసారంలోను, సమాజంలోను స్త్రీ సమ్మానింపబడ వలసిన అవసరం ఎంతేనా ఉంది. ఆమె చేయి మీదుగా పసిబిడ్డా ప్రపంచమూ సంస్కరింపబడవలసిన అగత్యమూ ఉంది. ఆమెలోని సహజ శక్తులను వికసింపజేసి, వాటి ఫలితాన్ని అనేక విధాలుగా ప్రపంచం అనుభవించవలసి ఉంది. స్త్రీ తగిన విధంగా సమ్మానింపబడి, ఆమెలోని సహజ శక్తులు విజృంభింప చేయాలంటే ఆమెకు సాంఘిక, సాంస్కృతిక, పౌర, ఆర్థిక రంగాలో ఒక 'స్థానం' కలుగ జెయ్యాలి. అందుకోసం మానవకోటి ఎంతేనా కృషి చేయ వలసిన అవసరం ఉంది.

గాంధీజీకి ప్రియతమమైన నిర్మాణ కార్యక్రమంలో మహిళా శిశు సంక్షేమం ఒక ప్రధానాంశం. దాన్ని ఆచర ణలో పెట్టడానికే ఆంధ్ర ప్రభుత్వం స్త్రీ జనాభ్యుదయ శాఖను నియోగించింది.

పునాది :- ఈ సంస్థకు పునాది 1941 లోనే వేయ బడింది. ఆ రోజుల్లో యుద్ధాలవల్ల విమానదాడి రక్షణ విధా నాలు స్త్రీలకు తెలియజెప్పడానికి (A.R.Pలో ఒకశాఖగాను) ఆ వెనుక స్త్రీలు పిల్లల శ్రేయస్సుకి కృషిచేస్తూ ఆహార పొదుపు వగైరాలు బోధించడానికి భారత స్త్రీల సెవిక దళం (I.W.C.C) గాను, ఆ పిమ్మట 1947 నాటికి ఇలా ఒక ప్రత్యేక స్త్రీ జనాభ్యుదయ శాఖగాను పరిణామం చెందింది.

స్త్రీ జనాభ్యుదయ శాఖ అమలులోనికి రాగానే మొట్ట మొదటి అధికారిణిగా శ్రీమతి. పి. పారిజాతం నాయుడు గారు నియమింపబడ్డారు.

ముఖ్య ఆశయాలు :- 1. కుటుంబ సంక్షేమానికి, సంఘ సంక్షేమానికీ ఉన్న సన్నిహిత సంబంధాన్ని గుర్తింపజేసి ప్రతి వ్యక్తి కుటుంబ సమిష్టి సంక్షేమం కోసం పాటు బడేటట్టు చేయడం. 2. గ్రామసీమల్ని ముఖ్యంగా దృష్టిలో పెట్టుకుని విద్యద్వారా, దుర్దశా నివారణద్వారా కుటుంబ సంక్షేమాన్ని వృద్ధి చేయడం, సంరక్షణ, సేవ ద్వారా వాటి అభ్యుదయానికి తోడ్పడడం, జీవన పరిమా ణాన్ని హెచ్చించడం. 3. సాంగత్యానికీ, అభిప్రాయ వినిమయానికీ, పౌర శిక్షణకీ, సౌకర్యాలు కల్పించడం కోసం సామాజిక సేవా కేంద్రాలను నడపడం. 4. వృత్తి, ఉద్యోగాలను చూపడం ద్వారా, పల్లె పట్టులలో చిన్న

కుటీర పరిశ్రమల ద్వారా, పట్టణ ప్రాంతాలలో ఉపయోగ కరమైన వృత్తులను నేర్పడం ద్వారా, ఆర్థిక సహాయం చేయడం. 5. ఇళ్ళలోనూ, ప్రీ-బేసిక్ తరగతులలోనూ, ప్రత్యేక సంస్థలలోని శిశు విభాగాలలో బాలల సంరక్షణ. 6. క్షేత్ర కార్య కర్తలకు మంచి శిక్షణ యిచ్చి, సంఘ సేవకు కావలసిన లక్షణాలను, సామర్థ్యాన్ని వారిలో పెంపొందించడం. ఈ అంశాలను, ఆశయాలనూ పురస్క రించుకుని అవినాభావ సంబంధం గల కుటుంబ సమాజ సంక్షేమాలను దృష్టిలో పెట్టుకుని శ్రీ జనాభ్యుదయశాఖ కార్యక్రమం విజ్ఞాన ప్రచారం, దుర్దశా నివారణ, పునరావాస కల్పన అనే పద్ధతులలో నడుస్తూంది.

కార్యక్రమం :- 1. (అ) సంఘ సేవలో ప్రత్యేక శిక్షణ పొందిన కార్య కర్తలచేత కుటుంబ పరిశీలన; ప్రతి కుటుంబాన్నీ సందర్శించి, ఆ కుటుంబానికి సంబంధించిన విషయాలను అవగాహన చేసుకుని, ఆహార విషయాలు, గృహ చికిత్సలు, రోగుల రక్షణ, పారిశుద్ధ్యం, వైద్య విజ్ఞానం, మాతా శిశు సంరక్షణ మొదలైన వాటిని గురించి సలహాలు ఇస్తారు. చంటి పిల్లలకు పాలు పంచిపెడతారు. (ఆ) ప్రవర్తనా సమస్యలు గల కుటుంబాలను గురించి ప్రత్యేక కృషి చేసి సహాయం చేస్తారు. (ఇ) ఆరి తేరిన మంత్రసానులకు కూడా సంఘ సేవలో తర్ఫీదు యిస్తారు. ఆర్గనైజరు, మంత్రసాని, యిద్దరూ కుటుంబ సంక్షేమానికి పాటు బడతారు. (ఈ) బిడ్డల సంరక్షణకు ప్రాముఖ్యం యివ్వబడుతూంది. రెండేళ్ళలోపు పిల్లల్ని ఆర్గనైజరు, మంత్రసాని గృహ సందర్శనల సందర్భంలో జాగ్రత్తగా చూస్తూంటారు. 2-6 సంవత్సరాల పిల్లల కోసం ప్రతి బ్రాంచిలోనూ "ప్రీ-బేసిక్" తరగతులున్నాయి. అచ్చట వారి పరిశుభ్రతను గురించి ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటున్నారు. మంచి అభ్యాసాలు నేర్పడానికి, సత్ప్రవర్తన తీర్చి దిద్దడానికి తరగతులను నడుపుతున్నారు.

2. (అ) మధ్యాహ్నం తీరిక సమయంలో సాంఘిక సేవా కేంద్రాలను నడుపుతున్నారు. పౌర చైతన్యం కలిగించడానికి, సాంఘిక జీవనాన్ని అలవర్చుకోడానికి కార్య క్రమాలు ఏర్పాటు చేస్తున్నారు. (ఆ) పౌర ధర్మాలను నిర్వహించడానికి శిక్షణ యివ్వబడుతూంది. ఆట పాటలకు అవకాశాలున్నాయి. వివిధ వర్గ, జాతులకు చెందిన స్త్రీ లందరూ ఒకచోట చేరి, కృత్రిమమైన విభేదాలను విస్మ రించి తమ అభిప్రాయాలను, అనుభవాలను పరస్పరం తెలియ జెప్పుకుని సౌహార్దాన్ని పెంపొందించుకుంటు న్నారు. (ఇ) వయోజన విద్య: [illegible], బొంతలు తెలుసుకోవలసిన విషయాలు. శిశు సంరక్షణ, గృహ నిర్వ హణ, పాకకళ, ఆరామ కృషి, ప్రథమ చికిత్స, రోగుల సంరక్షణ, గృహ చికిత్సలు, వ్యాయామ విష యాలు, తీరిక సమయాల్లో చేసుకోవలసిన పనులు మొద లైన వాటిని గురించి బోధిస్తున్నారు. ఉపజ్ఞ, ప్రజ్ఞ గల వారికి మంచి అవకాశాలు కల్పించి, ప్రోత్సహిస్తున్నారు. (ఈ) మాతృ భాషలో, హిందీలో వయోజనులకు అక్ష రాస్యత కలిగ జేస్తున్నారు.

(ఉ) కుటీర పరిశ్రమలకు ఎక్కువగా ప్రాధాన్యం యివ్వబడుతూంది. [illegible], నేత, దర్జీపని, చాపలనేత, [illegible] నేత, [illegible] అల్లిక, సబ్బు తయారీ మొదలైన చేతి పనులు బ్రాంచిలలో విరివిగా జరుగుతున్నాయి. బీదలు తమ ఆదాయాన్ని వృద్ధి చేసుకోటం కోసం ఈ పరిశ్రమలు ఉద్దేశింప బడ్డాయి. ఈ పరిశ్రమలను నెల కొల్పి ఎక్కువ కాలం కాలేదు. అయినా ఫలితాలు ప్రోత్సాహకరంగా ఉన్నాయి. (ఊ) వరదలు [illegible] సంక్షోభం సంభవించినపుడు ఆయా ప్రాంతాలలోని క్షేత్ర కార్యకర్తలు శక్తి వంచన లేకుండా సేవ చేశారు. (ఎ) పగలంతా వారి వారి వృత్తి [illegible] ఉండటంవల్ల [illegible] పొందటం [illegible] వయోజనుల సౌకర్యం కోసం [illegible] తరగతులు నిర్వ హించుతున్నారు. [illegible] (ఏ) బ్రాంచిలలో [illegible] త్రం చేయబడే మందులుగాక [illegible] ఆయుర్వేద మందుల్ని తయారు చేస్తూం టారు. (ఉ: కషాయం మొదలైనవి)

సర్వీసు హోమ్: దుర్దశా నివారణ, పునరావాస కల్పనల కోసం శ్రీ జనాభ్యుదయ శాఖ 'సర్వీసు హోమ్' ను నడుపుతూంది. దీనిలో భర్తలచేత విడనాడబడిన వారూ, విధవలు, నిరాశ్రయంగా జీవితంలో కొట్టుమిట్టాడే వారూ, చేర్చబడతారు. వీరికి మూడు సంవత్సరాలపాటు సాధారణ విద్య, ప్రత్యేక శిక్షణ గరుపబడతాయి. భోజనము, వసతి, పుస్తకాలు, బట్టలు వగైరాలను ప్రతి విద్యార్థినికీ వేతనము ఇయ్యబడతాయి.

# శ్రీ జనాభ్యుదయ శాఖ

1. సాధారణ విషయాలు : చదువుట, వ్రాయుట, సులభ గణితము, హిందీ, వైజ్ఞానిక. సాంఘిక, విషయాలు ; ప్రథమ చికిత్స, రోగుల సంరక్షణ, వడకుట, కుట్టుట, దర్జీపని, చిన్న చిన్న చేతి పనులు, తోటపని, సంగీతం.

2. ప్రత్యేక విషయాలు : (అ) దర్జీపని, వడకుట, నేత (ఆ) గృహనిర్వహణ, (ఇ) బాల సేవికా శిక్షణ. (ప్రీ-బేసిక్, బేసిక్ విద్యలలో తర్ఫీదుతో సహా (ఈ) మంత్రసాని ట్రెయినింగుకీ, ఉపాధ్యాయినుల ట్రెయినింగుకీ పంపడానికి సహాయం. శ్రీ జనాభ్యుదయశాఖకు కావలసిన సిబ్బందిని. అనగా ఆర్గనైజర్లు, మంత్రసానులు మొదలైనవారిని సర్వీసు హోమ్‌లలో శిక్షణ పొందిన వారిలో నుంచే ఎంచుకునేందుకు ప్రభుత్వం నిశ్చయించింది. వీరందరికీ బ్రతుకు తెరువు చూపించే పని శ్రీజనాభ్యుదయ శాఖ ఉద్యోగినులది. ప్రతి సర్వీసు హోము లోనూ ఒక శిశు విభాగం కూడా ఉంటుంది.

పారిశ్రామిక శిక్షణ కేంద్రం : ఏదైనా ఒక చేతి పని నేర్చుకుని దాని వల్ల జీవనోపాధి సంపాదించుకోవాలనే అభిలాషపడే యువతుల సంఖ్య పట్టణ ప్రాంతాలలో నానాటికి హెచ్చుతూంది. ఇలాంటి వారికి సర్వీసు హోమ్‌లో వసతి లేదు. ఆంధ్ర శాఖకు చెందిన సర్వీసు హోమ్ ఇప్పుడు సీతానగరంలో కస్తూర్బా గాంధీ జాతీయ స్మారక నిధి యాజమాన్యం క్రింద నిర్వహింపబడుతూంది. ఇందులోని శిక్షణలజాబితాలో ఇ.ఎస్.ఎల్.సి., ఆంధ్రా మెట్రిక్-లు, హిందీ (ప్రాథమిక మొదలు విశారద వరకు) కూడా చేర్చడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి.

పరిపాలన:- శ్రీ జనాభ్యుదయ శాఖ కార్యక్రమం మూడు ప్రధానాంశాల మీదుగా జరుగుతూంది. (1) నిర్వాహణ, పరిపాలన (2)క్షేత్ర కార్యక్రమం **(Field WorK)** (3) ప్రజా సంబంధం.

(1) నిర్వహణ, పరిపాలన:—ఇది పూర్తిగా మద్రాసులోని ప్రధాన కార్యాలయానికి చెందినది.

(2) క్షేత్ర కార్యక్రమం:—క్షేత్ర సిబ్బంది ప్రధానంగా (1) శ్రీ జనాభ్యుదయ శాఖ సహాయాధి కారిణులు (2)ఆర్గనైజర్లు (3) మంత్రసానులు. కుటుంబ సంక్షేమ కార్యం, సామాజిక సేవా కేంద్రాల నిర్వహణ, శిశు తరగతులను నడపడం, పరిశీలన కార్యక్రమం నిర్వహించేవారూ, ఆర్గనైజర్లు. ఆర్గనైజర్లు పూర్తిగా స్త్రీలే. ఒక్కొక్క బ్రాంచికి ఒక్కొక్క ఆర్గనైజరు ఉంటుంది. ప్రతి బ్రాంచి ఆర్గనైజరు పర్యవేక్షణ క్రిందా 3 సెంటర్లు ఉంటాయి. బ్రాంచిలలో చాలా భాగం గ్రామ సీమల్లోనే ఉన్నాయి. ప్రతి ఆర్గనైజరు పర్యవేక్షణ క్రిందా ఉండే 3 సెంటర్లలో ఒకటి ఆదర్శ కేంద్రంగా వుంటుంది. అంటే దానికి అనుబంధంగా ఒక పఠనాగారం, ఒక సమాచార శాఖ, ఒక చేతి పనుల ప్రదర్శనాలయం, ఒక అమ్మకం డిపో. ఆటలకు సదుపాయాలు, మాతా శిశు సంరక్షణ కేంద్రం, ఒక చిన్న ఔషధాలయం ఉంటాయి. సాధారణంగా (అవసరాన్ని బట్టి) ఒక బ్రాంచికి ఒక మెటర్నిటీ అసిస్టెంటు (మంత్రసాని) ఉంటుంది.

ఒక జిల్లాకు ఇలాంటి బ్రాంచీలు కొన్ని ఉంటాయి. సాధారణంగా రెండు జిల్లాలకు ఒక సహాయ శాఖాధికారిణి ఉంటుంది. జిల్లా పెద్దదయిన ఎడల ఒక జిల్లాకే ఒక సహాయాధి కారిణి ఉండవచ్చు. ఆర్గనైజర్ల పనిని పర్య వేక్షణ చేసే పని ఈ సహాయ శాఖాధి కారిణిది. ఆర్గనైజర్లు కనీసం ఎస్. ఎస్. ఎల్. సి. చదివి ఉండాలి. సహాయాధి కారిణులు పట్ట భద్రురాండ్రు కావాలి.

క్షేత్ర కార్యక్రమానికి చెందిన ఈ బ్రాంచీలు పట్టణాల్లోనూ, పల్లెలలోనూ ఉన్నాయి. అక్కడి కార్య కర్తలు చేసే పనులు 1. కుటుంబ సందర్శనం 2. ఆసుపత్రులలో రోగులను చేర్పించడం 3. సాంఘిక పరిస్థితుల పరిశీలన 4 వైద్య పరిశీలన 5. అనుబంధ పరిశ్రమలు 6. వయోజన అక్షరాస్యత, వయోజన విద్య 7. ప్రీ బేసిక్ తరగతుల నిర్వహణ 8. సర్వీసు హోమ్‌లో చేరదలచిన వారికి సంబంధించిన దర్యాప్తు 9. సర్వీసు హోమ్ నివాసినులకు పునరావాస సౌకర్యాలు.

ఇక మూడవ అంశం "ప్రజా సంబంధం." ఈ విభాగం ఎక్కువగా ప్రచారానికై మాస పత్రిక "సౌభాగ్య" ప్రచురించడం దీని ఆశయం. 1. సమాచారం 2. భోగట్టా 3. వివరాలు ప్రకటించి ప్రజల్లో ప్రబోధం కలిగించడం. "సౌభాగ్య" మాస పత్రిక వ్యాపార దృష్టితో ప్రచురింపబడే పత్రిక కాదు. పది మందికి అది అందుబాటులో వుండడమే ప్రభుత్వ వాంఛ గాబట్టి నామ మాత్రంగా సౌభాగ్య' సాలు చందా రు.2— నియమించారు.

ఆంధ్ర రాష్ట్ర విభజనానంతరం:— 1953 అక్టోబరు 1 వ తేదీన ఆంధ్ర రాష్ట్ర విభజనానంతరం స్త్రీ జనాభ్యుదయ శాఖ ఆంధ్ర ప్రాంతానికి సంబంధించినంతవరకు ఆంధ్ర ప్రభుత్వాధీనం లోనికి వచ్చింది.



కుమారి జె. జమునా బాయి
విమెన్ వెల్ ఫేర్ ఆఫీసరు.

1—3—54 తేదీని కుమారి జె. జమునా బాయిగారిని ఈ శాఖకు అధికారిణిగా ఆంధ్ర ప్రభుత్వం నియమించడంతో ఈ శాఖ తిరిగి ప్రత్యేక శాఖ అయింది.

పైని ఉదహరించిన కార్యక్రమం అంతా ఇప్పుడు ఆంధ్ర ప్రభుత్వ స్త్రీ జనాభ్యుదయ శాఖ కూడా నిర్వహిస్తూంది.

ప్రస్తుతం ఈ శాఖ క్రిందకు వచ్చినవి: — 11 తెలుగు జిల్లాల్లోను 40 బ్రాంచిలు పని చేస్తున్నాయి. ఈ 40 బ్రాంచిలూ గాక ఇంకో పది బ్రాంచిలు నెలకొల్పడానికి ఏర్పాటులు జరుగుతున్నాయి. దీంట్లో రెండు ఏజన్సీ ప్రాంతాలకు. ఈ బ్రాంచీల పర్య వేక్షణకై నియమింపబడిన సహాయాధి కారిణులు ఆరుగురున్నారు.

మొత్తంమీద ఈ శాఖ కార్యక్రమం బహు జనామోదాన్ని పొందుతూంది. తమ ప్రాంతాల్లో కొత్తబ్రాంచీలను నెల కొల్ప వలసిందిగా అనేకమంది కోరుతున్నారు. సంఘ సేవ జరగవలసిన రంగం బహూ విశాలమైంది. ఈపని చాలా కష్ట సాధ్యమైనదని చెప్పడానికి సందేహం లేదు. ప్రభుత్వం, ప్రజలు, అనధికార సంస్థలూ- అందరూ కలసి తమ పూర్తి సహకార సానుభూతుల నిచ్చి ఈ కార్యాన్ని నిర్వహించాలి. ఇంతవరకు సాధించిన ఫలితాలు భావి భాగ్యోదయానికి గొప్ప శుభ సూచనలుగా ఉన్నాయి.

నా టి క :

# వితంతువు

శ్రీ బొమ్మకంటి రామారావు, బి.ఎస్.సి.,

[కృష్ణమూర్తి గణపవరం తాసీల్దారు. లలిత ఆయన భార్య. రమేష్ తాసీల్దారుగారి కుమారుడు, బి. ఏ., చదువుతూ వుంటాడు.
మోహన్‌రావు లలిత అన్నగారు. ఆవూళ్ళోనే కలెక్టరాఫీసులో గుమాస్తా. హేమ మోహన్‌రావు భార్య. వారి కూతురు శాంత, బాల వితంతువు. (పెండ్లి అయిన నెలలోగానే భర్త పరమప దిస్తాడు.)]

—:o:—

స్థలం: మోహన్‌రావు ఇల్లు. సమయం: సాయంత్రం. మోహన్‌రావ్ ఆఫీసు కాగితాలేవో చూసుకుంటూ వుంటాడు. భార్య హేమ ప్రవేశం.

హేమ : ఇంట్లోకూడా ఆఫీసు పని చూసుకుంటే, మరి ఇంటి పన్లెప్పుడు చూస్తారూ?

మోహన్ : ఆఫీసు పని పూర్తయింతర్వాత.

హేమ : బాగా చెప్పారు. ఇట్లా అహోరాత్రాలూ వెట్టి చాకిరీ చెయ్యబట్టే మీకా అనారోగ్యం అదీను...

మోహన్ : ఇంకా నయం, ఈ ఉద్యోగంకూడా లేకపోతే మన గతేంగాను హేమా?

హేమ : ఈ వుద్యోగం కాకపోతే దీనిని తల దన్నిం దింకోటొస్తుంది. వుద్యోగాల కేమన్నా కరువయ్యా యా ఏమిటి. వుద్యోగం కోసం ఆరోగ్యం నాశనం చేసుకుంటారండీ?

మోహన్ : ఇంతకీ అసలు విషయం ఏమిటో చెప్పుదూ, త్వరగా. పని చాలావుంది రేపటికి పూర్తిచెయ్యవల సింది. కలెక్టరుకూడా క్యాంపుకి వెడుతున్నాడు.

హేమ : ఎంతసేపూ మీరూ, మీ ఆఫీసే తప్ప యింటి విషయంలో కాస్తన్నా జోక్యం కలుగజేసుకోరుగదా.

మోహన్ : (విసుగ్గా కాగితాలన్నీ ప్రక్కకి త్రోస్తూ) అబ్బ, విసిగించక సంగతేమిటో చెప్పు.

హేమ : (జాలిగా) శాంత విషయం యేమంటారు?

మోహన్ : ఏమనేదేముంది. మనతోపాటే అదీ కాలక్షేపం చేస్తూ వుంటుంది. దాని ఖర్మకి ఎవరేం చెయ్యగలరు చెప్పు?

హేమ : నిండా పదహారేళ్ళయినా లేవుగదా, దాని జీవితం అలా వెళ్ళిపోవలసిందేనా?

మోహన్ : లేకపోతే ఏం చెయ్యగలం చెప్పు హేమా?

హేమ : మనిషి తలుచుకుంటే చెయ్యగలగని దేమన్నా వుంటుందా. ఏమయినాసరే దానికింకో పెళ్ళి చేసి తీరాలి సిందే రోజు రోజు దాన్ని చూస్తూంటే నా గుండె తరుక్కుపోతున్నది.

మోహన్ : (భయంగా) మళ్ళీ పెళ్ళే?

హేమ : సందేహం లేకుండా! ఒక్కగా నొక్క కూతురు. అది వునూరు మంటూంటే మన మెట్లా జీవించగలం? తల తాకట్టు పెట్టయినాసరే దానో పెళ్ళి యింటిదాన్ని చెయ్యాలిసిందే...... మీకు చీమ కుట్టి నట్టయినా లేదాయె!

మోహన్ : నాకు మాత్రం విచారం లేదంటావా హేమా? నిజంగా దాని విషయం ఆలోచిస్తూ వుంటే పిచ్చెత్తు తుంది. అయినా మనం నిస్సహాయులం. అంతా ఆ భగవత్సంకల్పం.

హేమ : ఆ! ఆభగవంతుడు సంకల్పించబట్టే మన శాంత కీగతి పట్టింది.

మోహన్ : ఈ కాలంలో మామూలుగానే వేలు గ్రుమ్మ రించందే పిల్ల అమ్ముడు బోదుగదా, మన శాంత నెవరు వివాహం చేసుకుంటారు! అందులో వితంతువుని...

హేమ : కట్నాలూ, కానుకలూ లేకుండానే రమేష్ ఒప్పుకుంటాడు, మీ బావగారడ్డురాకుండావుంటే. కాస్త మీ చెల్లెలు యీమాత్రం సహాయం చేయలేదటండీ?

మోహన్ : ఇంకా నయం. మూర్తి కేవలం డబ్బువాడే. కాని పక్షంలో మన శాంతకే వైధవ్యమే ప్రాప్తించి వుండేదికాదు.

హేమ : ఎందుకన్నా మంచిది. వెళ్ళి సంప్రదించి చూడండి.

మోహన్ : నీ పిచ్చి నీదిగాని, మూర్తి పదివేలు కళ్ళ చూడండే, రమేష్ వివాహం కావడానికి వీల్లేదని భీష్మించుకుని కూర్చున్నాడాయె. పాపం లలిత ఎంతో చెప్పి చూసింది. మేనరికం డబ్బు కక్కుర్తి పడి, ఒదులుకోవద్దని. ఏం లాభం ? తను పట్టుకున్న కుందేలుకి మూడే కాళ్ళంటాడు మూర్తి.

హేమ : ఏమయితే నేం, ఆఖరుసారి ప్రయత్నించి చూడండి !

మోహన్ : ఇంతవరకు కాస్త ఇంట్లోకన్నా వెళ్ళి మంచి నీళ్ళు త్రాగే అస్కారమన్నా వుండి. ఇకనుంచి గడప కూడా త్రొక్కనీదు.

హేమ : (కోపంగా) మీకు మీ చెల్లెలు మీదున్న ప్రేమ, కన్న కూతురు మీదుంటే ఎంతకన్నా తెగించి వుండేవారు. అయినా వాళ్ళ గడప త్రొక్కందే బ్రతకలేమన్నమాట.

మోహన్ : మూర్తి స్వభావం పూర్తిగా తెలుసుగాబట్టి అట్లా అన్నాగాని శాంత భవిష్యత్తును గురించి ఎప్పుడూ ఈపని చేస్తున్నా ఆలోచిస్తూనేవున్నా.

హేమ : ఎంతకాలమని ఆలోచిస్తారండీ! ప్రయత్నించాలిగాని.

మోహన్ : నువ్వు నిజంగా పిచ్చిదానివే హేమా ! నువ్వు పడుతున్న వేదన పైకి కనిపిస్తుంది. అదే నీకూ నాకూ భేదం. రేపు తప్పకుండా వాళ్ళింటికి వెళ్ళి సంప్రతిస్తా.

హేమ : (సంతోషంగా) తప్పకుండా వెళ్ళిరండి. దాని సుఖమే మన సుఖం.

[స్థలం కృష్ణమూర్తిగారి యిల్లు. లలిత వంట చేసుకుంటూ రమేష్ ఎక్కడికో వెళ్ళబోతూ వుంటే పిలుస్తుంది.]

లలిత : రమేష్, త్వరగారా, నాన్నివాళెందుకో త్వరగా రిమ్మన్నారు.

రమేష్ : ఎందుకమ్మా ?

లలిత : ఏమో ! నాకేం తెలియదు... త్వరగా వస్తావుకదూ ?

రమేష్ : కారణమేమిటో నీకు తెలియకుండావుంటుందా త్వరగా చెప్పవమ్మా పోవాలి.

లలిత : (నవ్వుతూ) నీకు కాబోయే మామగారు ఉదయం మెయిలులో వస్తున్నారు.

రమేష్ : నిజంగానా అమ్మా.

లలిత : ఆ! నిజమే ...... ఏం, అలావున్నావే !

రమేష్ : నేనిప్పుడు పెళ్ళి చేసుకో దలుచు కోటం లేదమ్మా.

లలిత : అదేమిటిరా అట్లా అంటావ్. మీనాన్న చూస్తే ఏమంటారు.

రమేష్ : నీదగ్గర నిజం దాచటం యెందుకమ్మా. నేను శాంతని తప్ప మరెవ్వర్నీ వివాహం చేసుకోనమ్మా.

లలిత : పిచ్చివాడా! పూర్వాచారి మీ నాన్న అంగీకరించటమే [illegible] ?

రమేష్ : నువ్వూ అట్లా అంటావనేనమ్మా! భర్తతో మాట్లాడనన్నా మాట్లాడని భార్య, భర్త పోయినంత మాత్రాన జీవితాంతం [illegible] గా వుండిపోవలసిందే.

లలిత : (జాలిగా) [illegible] నాయనా ! పాపం భర్త ఎట్లావుంటాడో కూడా తెలియదు శాంతికి.

రమేష్ : ఏమయినా సరే! శాంతినే వివాహం చేసుకోటానికి నిశ్చయించానమ్మా.

లలిత : నామాట విను రమేష్. మీనాన్న సంగతి నీకు తెలియంది కాదు. ఎందుకు నువ్వీ సాహసం చేయటం.

రమేష్ : నువ్వుకూడా అట్లా అంటుంటే; అసలు నేను

యింట్లోనే వుండనమ్మా. ఎక్కడికో అక్కడికి వెళ్ళి నా బ్రతుకు నేను బ్రతుకుతాను.

లలిత : ఇదేమి విపరీతంరా! అయినా మీ నాన్న వచ్చాక అన్నీ ఆలోచించొచ్చులే. త్వరగారా.

[రమేష్ నిష్క్రమిస్తాడు. కొంత సేపయిన తర్వాత మూర్తి ఇంట్లోకి వస్తాడు]

లలిత : ఏమండీ! సీతాపతిగారు వచ్చే టైమయిందా!

మూర్తి : ఆ. ఇంకాసేపటికి మనింట్లోనే వుంటారు.

లలిత : పిల్ల జాతకం వెంకటప్పయ్య శాస్తుర్లు గార్కి చూపిస్తా మన్నారు చూపించారూ?

మూర్తి : అంతా మన పిచ్చిగాని, వాళ్ళకి మటుక్కు నిజం తెలుస్తుందా!

లలిత : అదేమన్నమాట. ఇంతకీ పిల్ల జాతక మెలా వుందన్నారు?

మూర్తి : నిక్షేపంలాగానే వుందిగాని......

లలిత : ఏమిటి సందేహిస్తున్నారు?

మూర్తి : ఏమీలేదు. పెళ్ళి కాగానే ఒకచిన్న గండం వుందిట. అదిదాటితే చిరంజీవేట.

లలిత : (కంగారుగా) ఆ! మనకొద్దండీ ఈ సంబంధం.

మూర్తి : ఇక చాలుగాని వూరోక్కో. మనిషి అన్న తర్వాత జీవితంలో గండాలుండకపోవు. అంతమాత్రం చేత నిక్షేపంలాంటి సంప్రదాయంగల సంబంధం వదులుకుంటామా?

లలిత : నామాట వింటురూ? చూస్తూ చూస్తూ బొందలో పడటం ఎందుకు. వాడికేమన్నా ఈడు మించిందా ఏమిటి?

మూర్తి : నువ్వు వెయ్యి చెప్పు, లక్ష చెప్పు. ఇంత దివ్యమైన సంబంధం మనకీజన్మలో ఇంకోటి దొరకటం దుర్లభం. పరిష్కారాలన్నీ పూర్తయాయి కూడా. పది వేల కట్నం పీటలమీద చదివిస్తానని వాగ్దానం చేశారు. లగ్నం విషయం నిర్ణయించటానికే వారిక్కడికి వస్తూంట. ఆయన వచ్చే టైముకూడా అయింది. త్వరగా వంట చెయ్యి!

(బయట నుంచి తలుపు చప్పుడు.)

మూర్తి : అదుగో, ఆయనే వచ్చినట్లున్నారు. (తలుపు తీస్తూ) వెయ్యేళ్ళాయుర్దాయం బావగారూ. ఇప్పుడే మీ మాటనుకుంటున్నాం.

(లలిత కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళు తెచ్చి యిస్తుంది)

మూర్తి : అంతా కులాసాగా వున్నారా?

సీతా : ఆహా! మీదయవల్ల అంతా కులాసా.

మూర్తి : ప్రయాణం సుఖంగా వుందా?

సీతా : రామ రామ! ఏం ప్రయాణమండీ. సెకండ్ క్లాసు టిక్కెట్టు కొనుక్కున్నా బెజవాడనుంచి ఏలూరు దాకా నించోవలసొచ్చింది.

మూర్తి : అంతేనండి ఈకాలంలో. ఎక్కణ్నుంచి వచ్చి పడుతున్నారో ఈ జనం అంతా! ఎన్నిరైళ్ళు వేసినా చాలడం లేదు. స్నానం చెయ్యండి. బడలిక తీర్తుంది.

(స్నానం చేసి, భోజనం చేసి అంతా వరండాలో కూర్చుంటారు)

సీతా : రమేష్ ఇంట్లో లేడా ఏమిటి, కనపడటంలేదు.

మూర్తి : పొద్దున్నే ఎక్కడికో వెళ్లాడు. వచ్చే వేళ అయింది.

సీతా : కుర్రవాడి కిష్టమే గదండీ యీ సంబంధం. వాళ్ళ యిష్టం లేందే మన మెంత జేసినా ఏం ప్రయోజనం?

మూర్తి : ఆహా. ఎంతమాటన్నారు.

సీతా : మరి... ముహూర్తం విషయం మా వూళ్ళో శాస్త్రిగార్ని కనుక్కున్నా. వచ్చే మంగళవారం కాకుండా పై వచ్చే మంగళవారం నాడు దివ్యమైన లగ్నముందిట.

మూర్తి : నిండా పదిహేను రోజులైనా లేదే వ్యవధి.

సీతా : మీకా భయం ఏమీ అక్కర్లేదు. తలచుకొంటే ఎంతసేపట్లో చెయ్యాలి ఈ పనులన్నీ.

మూర్తి : వచ్చే నెల్లో ముహూర్తం పెట్టిస్తే?

సీతా : రేపేం జరుగుతుందో చెప్పలేం బావగారూ. పెండ్లి ఎంత త్వరలో జరిగితే అంత మంచిది. అదీగాకుండా మా ఆవిడకి గుండె నీరసంగా వుంటున్నదీమధ్య. అందువల్ల మా చిట్టి పెళ్ళి త్వరగా చెయ్యాలని కుతూహల పడుతోంది.

మూర్తి : సరే, మీ యిష్టప్రకారమే కానీండి. ఇవాళనుండే పనులు ప్రారంభిద్దాం.

సీతా : అన్నట్లు, చెప్పటం మర్చిపోయా. నాకు బ్యాంకు నుంచి డబ్బు పెండ్లి రోజుకు వస్తుందిగదా అనుకొన్నా. కాని ఇంకో నెలవరకూ వచ్చే అవకాశం లేదని నిన్ననే జాబొచ్చింది. అందువల్ల డబ్బురాగానే మీకిచ్చేస్తా.

మూర్తి : (సందేహంగా) ఇంతకీ పెళ్ళిలో వుత్త చదివింపే నంటారా?

సీతా : మీకు నాయందు నమ్మకం లేకపోతే ఇప్పుడేనా ఇల్లమ్మి కట్నండబ్బు పెళ్ళిలో చదివిస్తా బావగారూ? ఇంతకీ బ్యాంకి డబ్బు సమయానికి రాకపోవడం నా దురదృష్టం.

మూర్తి : విచారించకండి బావగారూ! మీయందు నాకెప్పుడూ అపనమ్మకం లేదు. అలాగే బ్యాంకి నుంచి డబ్బొచ్చింతర్వాతనే ఇద్దురుగాని.

సీతా : రక్షించారు మూర్తిగారూ! మా చిట్టి పూర్వజన్మలో పుణ్యం చేసుకోబట్టి మీబోటివారింటికొస్తూంది.

మూర్తి : ఇది మా అదృష్టంకూడాలెండి. లేకపోతే మీబోటివారితో వియ్యమందడం సామాన్యంపనా.

సీతా : ఇక నే వెళ్ళొస్తా. రైలు టైముకూడా కావస్తూంది. ఇంకా రాలేదే రమేష్.

మూర్తి : పోనీ సాయంత్రం బండికి సావకాశంగా పోకూడదు బావగారూ?

సీతా : వద్దు మూర్తిగారూ. నేనూ చప్పున వెళ్లి పన్లన్నీ చప్పుచప్పున పూర్తి చేసుకోవాలి.

మూర్తి : ఈ బండికే వెళ్ళకతప్పదంటారా!

సీతా : మీరేం అనుకోకండి బావగారూ! ఇంతవరకు శుభలేఖలయినా అచ్చు వేయించలేదు. పనులన్నీ త్వర త్వరగా పూర్తిచేసుకోవాలి.

మూర్తి : (లలితని పిలుస్తూ) వారు వెడుతున్నారు. లలిత లోపలినుంచి వస్తూ, అప్పుడే తొందరేముంది. సాయంత్రం బండికి వెళ్ళొచ్చుగా!

సీతా : మరేం లేదమ్మా. సాయంత్రం ఎండెలో ప్రయాణం చేయటం దుర్లభం. వెళ్ళివస్తా.

* * *

మూర్తి సీతాపతిగార్ని సాగనంపి ఇంట్లో ప్రవేశిస్తాడు.

మూర్తి : రమేష్ ఇంకా రాలేదు చూశావా ఎక్కడికి వెళ్ళాడో ఏమిటో పాపం ఆయన రమేష్‌తో మాట్లాడాలని ఎంతో ఉబలాటపడ్డాడు.

లలిత : త్వరగా రమ్మని చెప్పానే. ఎంతో అవసరం పనయితే తప్ప ఆలశ్యం చేయడు.

మూర్తి : నువ్వెప్పుడూ వాడ్ని వెనకేసుకొస్తావ్. వాడికీరోజే అంత అవసరమైన పనేదొచ్చిపడ్డదీ.

లలిత : అయినా, ఆయనఇదివరకే చూచారుగదండీ రమేష్‌ని.

మూర్తి : ఒకసారేం ఖర్మం. అనేకసార్లు చూశారు పూర్వం. కాని ఇంతదూరం వచ్చినవారు వాడ్నికూడా పరామర్శించి పోదామని.

లలిత : మరి, ఆడబడుచులాంఛనాలు మాటేమన్నారు.

మూర్తి : ఏ లాంఛనాలయినా పెళ్ళిలో నామకార్థం చదివించడం మాత్రమే. డబ్బంతా బ్యాంకినుంచి రాగానే ఇస్తారు.

లలిత : (ఆశ్చర్యంగా) కట్నం డబ్బుకూడా పెళ్ళిలో ఇవ్వరన్నమాట. ఇదంతా చూస్తే ఏదో బూటకంలా కనుపిస్తుంది. ముందు వారి ఆస్తిపాస్తుల విషయం దర్యాప్తు చేయించండి.

మూర్తి : నీకెప్పుడూ పాడు అనుమానాలే. ఎవరన్నా వింటే నవ్విపోతారుగాని ఇంకెవ్వరి దగ్గర ఇలాఅనకు. వాళ్ళదీ గౌరవ మర్యాదలుగల కుటుంబమే.

# వితంతువు

(ఇంతలో రమేష్ ప్రవేశిస్తాడు.)

మూర్తి : (రోషంగా) వెళ్ళిన పని పూర్తయిందా?

రమేష్ : మాటాడడు.

లలిత : భోజనం చేశావా ?

రమేష్ : ఆ.

మూర్తి : ఎక్కడ.

రమేష్ : మామయ్యగారింట్లో.

మూర్తి : ఈరోజే వారింటికి వెళ్ళాలిసొచ్చిందా ? పాపం సీతాపతిగారు నిన్ను చూడాలని ఎంతో కొట్టుకున్నారు.

రమేష్ : నాకా సంబంధం ఇష్టం లేదు నాన్నా. అందుకనే నేనివాళ ఆయనకు కనుపించంది.

మూర్తి : అందుకనేనా మామయ్యగారింటికి తరుచుగా వెడుతున్నది ?

రమేష్ : ఇందులో తప్పేమీ లేదు. నేను శాంతని వివాహం చేసుకొని ఒక జీవితాన్ని రక్షిద్దామని నిశ్చయించుకున్నా.

మూర్తి : నిశ్చయం కూడా అయిందన్నమాట... అయినా నిన్ననవలసిన పనేముందిలే. మొదటినుంచి అన్నా చెల్లెలు కలసి కుట్ర పన్నుతూ వున్నారు.

లలిత : మీకీ ప్రపంచంలో కల్లా మేమిద్దరమే శత్రువులం.

రమేష్ : నాకూ ప్రపంచం అంటే పూర్తిగా తెలుసు. అనుభవం లేకపోయినా న్యాయాన్యాయాలు గమనించే శక్తి వుంది.

మూర్తి : అయితే నీకోసం నే పడ్డ శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరేనా ?

రమేష్ : మాట్లాడడు.

మూర్తి : ఏమంటావ్ !

రమేష్ : ఒక్క విషయం ఆలోచించండి నాన్నా, మామయ్యకే డబ్బుంటే నువ్విలా అనేవాడివా. డబ్బు కోసం అమాయకురాలు శాంత గొంతు కోయటం న్యాయమా చెప్పు ?

మూర్తి : (జాలిగా) రమేష్ ! ఇంతవరకూ కొడుకైనా కూతురైనా నీవే గదా అని ఎంతో గారాబంగా చూచా. నీకేలోటూ రానీయలేదు. ఈ నా ఒక్క మాటా చెల్లిస్తే నాకీ లోకంతో నిమిత్తమే లేదు.

రమేష్ : ఈ ఒక్క విషయంలో తప్ప ఇంతవరకు మీ మాట కెప్పుడన్నా అడ్డం వచ్చానా నాన్నా. నా భవిష్యత్తు నిర్ణయించుకోడం నా విధి. క్షమించు నాన్నా. ఈ నా ఒక్క తప్పూ క్షమించు.

మూర్తి : నీ నిర్ణయమే నిశ్చయమన్నమాట.

రమేష్ : (ఔనన్నట్లుగా తలూపుతాడు)

మూర్తి : అయితే ఈక్షణమే నే నీ యిల్లు విడిచి వెళ్ళిపోతా. నువ్వూ, మీ అమ్మా, మీ మామయ్యా అంతా హాయిగా వుండండి.

లలిత : అట్లా అనకండి. వాడి సుఖమే మన సుఖం అనుకున్న వాళ్ళం ఈ ఒక్క కోరికా నెరవేరిస్తే ఎంత బాగుంటుంది. నామాట వినండి.

మూర్తి : మీరెన్నయినా చెప్పండి. తాంబూలాలు పుచ్చుకున్న తర్వాత పద్దనటంకన్న ఘోర పాపమింకోటిలేదు.

లలిత : (జాలిగా) మీ నాన్న విషయం నీకు తెలియంది గాదు రమేష్. నువ్వు నాన్న తండ్రి మాట నెరవేర్చు. మీ నాన్న ఎక్కడికైనా వెళ్ళిపోతే మన మేం చేస్తాం చెప్పు ?

రమేష్ : నువ్వూ అట్లా అంటుంటే నేనింక బ్రతకనమ్మా. నీ నుయ్యో, గొయ్యో చూసుకొంటా.

మూర్తి : అదేదో నేనే చూసుకొంటాలే. నీ యిష్టం వచ్చినట్లే కానియ్యి. తండ్రికి తగ్గ కొడుకనిపించుకున్నావ్. (మూర్తి నిష్క్రమించబోతాడు)

లలిత : (ఏడుస్తూ) ఉండండి. చిన్నవాడు వాడేదో

అన్నాడు (రమేష్ వంక తిరిగి) రమేష్, నీ తండ్రి లేకపోతే నేనూ అనవసరమే. ఆఖరుసారి వేడుకొంటున్నా. నీ తండ్రి చెప్పినట్లు విను.

రమేష్ : (దుఃఖంతో) మీరు లేని జీవితం నాకెందుకమ్మా. మీ ఇష్టం వచ్చినట్లే కానీయండి.

మూర్తి : (రమేష్‌ని కౌగలించుకుని) నే నేది చేసినా నీ బాగు కోసే చేస్తాను రమేష్.

[పెళ్ళి యథావిధిగా జరిగిపోతుంది. మోహన్ రావ్, హేమ, శాంతలు వివాహానికి రారు. మోహన్ రావ్, హేమ, శాంతని గురించి విచారిస్తూవుంటారు.]

(రెండు నెలలయింతర్వాత)

స్థలం : కృష్ణమూర్తి గారిల్లు. కృష్ణమూర్తి భోజనం చేసి కుర్చీలో కూర్చుని పేపరు చదువుతూ వుంటాడు. లలిత తమలపాకులు చీల్చి ఇస్తూ వుంటుంది.

లలిత : వియ్యాలవారి వద్దనుంచి వుత్తరం వచ్చి చాలా కాలమైనట్టుందేమండీ ?

మూర్తి : అవును. పదిహేను రోజులు కావచ్చింది.

లలిత : పెళ్ళయిన వారం రోజుల్లోనే డబ్బొచ్చి పడుతుందన్నాడు. అటువంటి వారాలు ఎనిమిదయినా చిల్లిగవ్వ కూడా పంపలేదేమండీ ?

మూర్తి : నిజమే. తన మాట మీద నమ్మకం లేకపోతే ఇల్లు కాస్తా అమ్మి డబ్బిస్తానన్నాడు. నేనే పెద్దమనిషి బాగుండదని వద్దన్నా. అట్లా చేసినా బాగుండేదేమో.

లలిత : అసలాయనకి ఇల్లుందేంగా అమ్మటానికి ?

మూర్తి : లేకపోవడమేమిటి. అయినా నీకెట్లా తెలుసు లేదని ?

లలిత : పెళ్ళిలో ఆయన భార్యే చెప్పింది.

మూర్తి : (కంగారుగా) ఆ! నిజమేనా. అయితే ఆ విషయం పెళ్ళిలో ఎందుకు చెప్పలేదు. వారి అంతు కనుక్కునే వాడ్ని.

లలిత : మీరే చెప్పారుగా. అంత మంచి సంప్రదాయంగల సంబంధం మళ్ళీ మనకీ జన్మలో దొరకదని.

మూర్తి : అయితే పదివేలూ రాబట్టలేనంటావా ?

లలిత : పదివేలు కాదుగదా, పది రాగి కాన్లుకూడా రాబట్టలేరు. అసలాయనకి ఆస్తేలేనంట ఇవ్వటానికి. వాళ్ళ తాత ముత్తాతలు మహారాజాగా బ్రతికారట. ఆయన ఆస్తంతా తగలెట్టి వచ్చే నెల జీతంతో అద్దె కొంపలో కాలక్షేపం చేస్తున్నారట.

మూర్తి : (విచారంగా) ఇట్లా మోసగిస్తాడని నా కల్లో నైనా అనుకోలేదు లలితా! నమ్మించి గొంతుకోసే కాడు. ద్రోహి.

లలిత : నే ముందే వాళ్ళ విషయం అంతా కనుక్కొమంటే మీ కెక్కడలేని కోపమొచ్చింది. చేతులు కాలేక ఆకులు పట్టుకుని ఏం ప్రయోజనం ?

మూర్తి : ఆ మనిషిని చూస్తే ద్రోహబుద్ధి గలవాడని అనుకోలేం లలితా ?

లలిత : అయ్యోరామ! దొంగ మాత్రం పైకి మనిషిలా గుండక దొంగలా ఎలా వుంటాడు? ఇంతకీ ఒకరన్నన వలసిన పనేం లేదు. మీ మెత్తదనాన్ని చూసి మోసగించాడు.

మూర్తి : (నిరాశగా) ఇంతకీ కర్తవ్యం...

లలిత : ఏముంది, దెబ్బకి [illegible] మన పిల్లని మనింటికి తెచ్చుకోవడమే.

(ఇంతలో పోస్టు మేన్ టెలిగ్రాం పట్టుకొచ్చిస్తాడు)

లలిత : (ఆదుర్దాగా) ఎక్కడ్నుంచి వచ్చింది ?

మూర్తి : (చదివి నిరాశతో) అక్కడ్నుంచే. పిల్లకి "సెరిబ్రల్ మలేరియా" వచ్చి ఉదయం చనిపోయిందట.

లలిత : (ఏడుస్తూ) వద్దు మొర్రో అని మొత్తుకున్నా గ్రహ గండం వున్నా ఖరారు చేశారు.

మూర్తి : (కంపిత స్వరంతో) క్షమించు లలితా. నేను కొంత కాలం నుంచి అంధకారంలో వున్నాను. అందువల్ల మీ మాటలు పాటించలేకపోయాను. భగవంతుడు తగిన శాస్తి చేశాడు. ఇంతవరకు జరిగిందేదో జరిగిపోయింది. ఇక ముందు కర్తవ్యం ఆలోచింపుదాం. ఏమంటావ్ ?

లలిత : ఇప్పుడైనా నా మాట విని వాడి ముచ్చట చెల్లించండి. శాంత కూడా రమేష్ అంటే ప్రాణం ఇస్తుంది.

మూర్తి : (సందేహిస్తూ) వితంతువు నిచ్చి వివాహం చేస్తే లోకం ఏమనుకుంటుంది లలితా ?

లలిత : సంతోషిస్తుంది. కారణ మేమంటారా, శాంతకి పెళ్ళికాగానే భర్త పోయాడు. రమేష్‌కి పెళ్ళికాగానే భార్య పోయింది. కాబట్టి ప్రస్తుతం ఇద్దరూ ఒకే స్థితిలో వున్నారు. అటువంటప్పుడు రమేష్‌కి పెళ్ళి చేసుకుందుకున్న హక్కు పాపం శాంతకి మాత్రం ఎందుకు వుండదూ ?

మూర్తి : నిజం చెప్పావ్ లలితా! ధనాన్నాశించి ఘోరపాపం చేశా. లేకపోతే వాళ్ళిద్దరికీ వైధవ్యాలు ప్రాప్తించుండేవికావు.

లలిత : అయినదాని కనుకునేం ప్రయోజనం. ఇప్పటికైనా శాంతని కోడలుగా చేసుకొంటే మనకొచ్చే లోటేమీ వుండదు.

మూర్తి : ఈ పాపం చాలక ఇంకా మూటకట్టుకుంటా ననుకున్నావా. ఇప్పుడే మీ అన్నయ్య యింటికెళ్లి లగ్నం పెట్టించుకురా !

లలిత : ఇది మరీ బాగుంది. ఆక దాన్ని నేను వెడితే ఏం బాగుంటుంది. మీరే వెళ్ళి సంగతి సందర్భాలు మాట్లాడి రండి.

మూర్తి : మీ అన్నయ్య వాళ్లింటికి రానిస్తాడంటావా ?

లలిత : ఇంతకాలం అయినా మా అన్నయ్యని అర్థం చేసుకోలేక పోయారు. వాడి హృదయం నవనీతం.

మూర్తి : నిజం లలితా. పాపం నా వల్ల నిద్రాహారాలు లేక చింతిస్తున్నాడు. పోయి క్షమించమని వేడుకుంటా.

[మోహన్ రావుయిల్లు. సాయంత్రం సమయం. మూర్తి లోపలికి రాగానే కుర్చీలో కూర్చున్న వాడల్లా మోహన్ రావ్ ఆశ్చర్యంతో లేచి బావగార్ని కూర్చోమన్నాడు.]

మూర్తి : నన్ను క్షమించు బావా. ఇంతవరకు మీ విచారానికి కారణం నేనే నని ఇప్పటికి తెలిసివచ్చింది.

మోహన్ : (ఆశ్చర్యంగా) ఇదేమిటి బావగారూ ఇట్లా మాట్లాడుతున్నారు.

మూర్తి : ఇప్పుడు నినొక విషయాన్నర్థించడానికి వచ్చా.

మోహన్ : అదేమిటో త్వరగా చెప్పండి.

మూర్తి : రమేష్ భార్య నిన్ననే చనిపోయింది. నాకు తగిన శాస్తి అయింది. కాబట్టి శాంతని రమేష్‌కిచ్చి వివాహం చెయ్యటానికి నీ వంగీకరించాలి.

మోహన్ : ఇదంతా చూస్తే భగవంతుడే మనచేత ఒక చిన్న నాటకం ఆడించినట్లనిపిస్తోంది బావగారూ !

మూర్తి : లగ్నం పెట్టించు బావా. రమేష్ శాంతల ప్రేమ నిష్కల్మషమైంది కాబట్టే ఇలా సంభవించింది.

మోహన్ : ముమ్మాటికీ అంతే బావగారూ. ఇప్పటికైనా భగవంతుడనుగ్రహించినందుకు సంతోషించాలి.



## కృతజ్ఞత

శ్రీమతి పురం అన్నపూర్ణమ్మగారు, శ్రీ వేమరాజు భానుమూర్తిగారు ఆంధ్రమహిళాసభ నిర్మలాదేవి గ్రంథాలయమునకు కొన్ని పుస్తకములు విరాళముగా నిచ్చిరి. వారికి మా కృతజ్ఞత.

కార్యదర్శినులు.




# మేలు చేసిన దైవం

* శ్రీ యస్. సుందరరావు *

పూర్వం జాన్ అనే ఒక ధనవంతుడుండేవాడు. అతడు పేరుకు క్రైస్తవుడైనా, ఒక్కనాడైనా చర్చికి వెళ్ళి ఎరుగడు. అసలు దైవం లేదని, అందరితో పోట్లాడేవాడు. అతని భార్య మేరి. చాలా సుగుణవంతురాలు. దైవం అంటే భయభక్తులు చూపేది. ప్రతి వారం చర్చికి వెళ్ళి, తన భర్త యొక్క మనసు మార్చమని దైవమును ప్రార్థించేది.

ఒకరోజు గుడికి వెళ్తూ, భర్తను కూడా రమ్మని పోట్లాడింది. లేకపోతే నేను పుట్టింటికి పోతాను. "చర్చికివచ్చి, వెర్రివాడిలాగ నటించకుండా, ఫాదిరిగారు చెప్పిందంతా, శ్రద్ధతో విని, నేర్చుకోండి" అని చెప్పింది. ఇక ఎట్లాగు చర్చికి వెళ్ళక తప్పలేదు. చర్చికి వెళ్ళి అందరితోపాటు కూర్చున్నాడు, జాన్,

ఇంతలో ఫాదిరిగారు వచ్చారు. వారు రాగానే అయన గౌరవార్థం అందరు లేచి నిలుచున్నారు. ఫాదిరిగారు అందరినీ పరికించి చూచి "అంతా వచ్చినారా" అని అన్నారు. జాన్ ఎపుడూ రానివాడు కాబట్టి అది కూడా దైవ ప్రార్థనే అని తలచి, అది వల్లె వేసుకున్నాడు. ఆ తరువాత అంతా కూర్చున్నారు, మరల ఫాదిరిగారు అందరినీ చూచి "అంతా కూర్చున్నారా ?" అని అడిగారు. అదికూడా ప్రార్థనే కామోసు అని తలచి ఆమాట కూడా వల్లెవేసుకున్నాడు జాన్. తరువాత ప్రార్థన, ప్రసంగం అయిపోయాయి. చర్చి వదిలేశారు. అంతా ఇళ్ళకు వస్తూయున్నారు. మరల ఫాదిరిగారు "అంతా వెళ్తూయున్నారా?" అని అన్నారు. ఆమాట కూడా జాన్ మనసులో అనుకుంటూ ఇంటికి వచ్చాడు.

ఆరోజు తన భర్త చర్చికి వచ్చినందుకు మేరీ భగవంతుణ్ణి ప్రార్థించింది. ఆ సంతోషంలో పొద్దుగూకింది. ఇద్దరూ పెందలాడే భోంచేసి తలుపులు వెయ్యడం మరచి నిద్రపోయారు. జాన్ పాపం పాదిరిగారు పలికిన మూడు మాటలు మనసులో అనుకుంటూ పండుకోవటంచేత కలవరిస్తూ యున్నాడు. ఆ సమయానికి నలుగురు దొంగలు అటుపోతూ తలుపులు తెరచి యుండటం చూచి దోచుకుపోవచ్చుననే ఉద్దేశంతో పిల్లిలా అడుగులు వేసుకుంటూ ఇంట్లోకి ప్రవేశించారు.

ఆ సమయానికి జాన్ నిద్రలో ఫాదిరిగారు చెప్పిన మొదటి మాట "అంతా వచ్చినారా ?" అని అన్నాడు. ఈ మాట దొంగలు విన్నారు. యజమాని మేలుకొని ఉన్నాడని తలచి చప్పుడు చెయ్యకుండా కూర్చున్నారు. మరల జాన్ రెండోమాట "అంతా కూర్చున్నారా ?" అని అన్నాడు. ఈమాట విని దొంగలకి హడలెత్తి లేచి నిలుచుని మెల్లగా దారి పట్టారు. ఇంతలో జాన్ ఫాదిరిగారి మూడవమాట "అంతా వెళ్తున్నారా ?" అని అన్నాడు. ఆ మాటలు విని దొంగలు మరీ హడలెత్తి పరుగుతీశారు. ఆ చప్పుడుకు భార్య మేరి లేచి దొంగలు పారిపోవటం చూసి, భర్తను లేపి సంగతంతా చెప్పింది. నిద్రలో మీరు కలవరిస్తూ యుండటంచేత దొంగలు ఏమీ తీసికోకుండా పారిపొయ్యారు. మీరు ఒక్క రోజుకి చర్చికి వచ్చేసరికి యింత మేలు జరిగింది. ప్రతిరోజూ చర్చికి వస్తే ఇంకా మేలు జరుగుతుందని చెప్పింది. ఆనాటి నుంచి జాన్ దైవం లేదనే మాట మరచి ప్రతి రోజూ భక్తితో దైవాన్ని పూజించ సాగాడు. చూశారా! దేవుణ్ణి స్తుతించకపోయినా ఒక్క రోజు చర్చికి వెళ్తే ఎంత మేలు జరిగిందో ? కనుక దైవాన్ని మనం అనుదినం స్తుతిస్తూవుండాలి. ★

# నేను - మా అక్కాను

కుమారి జి. సౌజన్యవతి

ఎనమండుగురు (ముగ్గురు మగపిల్లలూ, ఐదుగురు ఆడపిల్లలూ) తర్వాత పుట్టేను నేను. చిన్నదాన్ని గనుక నేనంటే ఎంతో మక్కువ మావాళ్ళందరికీను. నా పేరుకు ఒక కారణముంది: నేను పుట్టబోయేముందు మా పెద్దక్క పెళ్ళి ఆగి కూచుంది - ఇంట్లో పురుడోస్తుందేమోనని సుమండీ - (అప్పటిలాగ కట్నాలపట్టింపు దగ్గరగాదు. కట్నాలిచ్చే సంబంధాలు వద్దేపద్దని మా సంబంధం చేసు కున్నారట బావగారు). మా బావగారి ఆరాటం ఎక్కువగా ఉంది, పెళ్ళి చేసుకుని .... మరీ ఢిల్లీ వెళ్ళాలని : నేను ముహూర్తానికి అడ్డురాకుండా ముందుగానే సకాలానికి తయారయ్యేను కనుక నాకు 'సౌజన్యవతి' అని నామ కరణం చేసేరు - మా నాన్నగారు. నోట్లోవేలుతో, కాళ్ళు చేతులు కిలకిల తన్నుతూ నేను బావగార్కి స్వాగతం చేప్పేను. " 'సౌ'అంటే నూరు, నూరేళ్ళాయుస్సు, 'శత మానంభవతి' " అని బావగారు దీవిస్తుంటే, నేను మీద మీదకు ఉరకబోతే, నాకోపదిరూపాయలనోటుముట్టిందట! నా పేరు పూర్తిగా పిలవలేని స్నేహితురాండ్రు "సౌజన్యా" అంటారు, ఇంట్లో అంతా నన్ను ముద్దుపేరుతో వట్టి "సౌ" అనే పిలుస్తారు. ఎవరు ఎలాపిలిచినా నేను "ఓయ్" అంటాను - అందరికీ తలలో నాలికలాగ. మా బావగారికి అక్కకు కూడా నేనంటే చాల యిష్టం, నేను పుట్టి వారి పెళ్ళి చేయించేనుగా మరి, అందుకు !

ఇక మా చిన్నక్క సంగతి చెప్తా. శ్రీ రాజారామ మోహన్‌రాయ్‌ను గురించి అంతా విసే ఉంటారు. ఇంగ్లీషు ప్రభుత్వం మొదటి రోజుల్లో, అప్పటి మన హిందూ సాంప్రదాయం ప్రకారం, భర్త మరణిస్తే, భార్య కూడ అతనితో సహగమనం చేయాలి. ఇది చాల అన్యాయం అని ఖడించి, ఆ ఆచారాన్ని మాన్పించి, మహిళా లోకానికి మహోపకారం చేసిన మహనీయు డాయన. ఆయన తల్లి పేరు తారణీదేవి. మా చిన్నక్క పేరు అదే. నేను మాత్రం (ఆమెకు కోపంవస్తే, కొంచెం వీపు జాగ్రత్తగా చూసుకుంటూ) "అమ్మా, భవతారణీ ! శాంతించు, మా తల్లి" అనుకుంటా; " 'సౌ'కు పెళ్ళి కావాలేమిటి? " అంటే "ముందు నీకు కావాలిగా ! " అను కుంటా — అంతా (నేపథ్యమున) లోలోపలే సుమండీ ! పైకి అన్నానంటే అప్పుడే ఐపోతుంది - గట్టిపెళ్ళి !

ఈ ఉపోద్ఘాతం చాలు; ఇక అసలు కథలోకి వస్తా. నా కిప్పుడు 15 ఏళ్ళున్నూ, మా చిన్నక్కకు 17 ఏళ్ళున్నూ. మా తమ్ముడొకడున్నాడు - అతణ్ణి "నీ కెన్నే ళ్ళురా? " అని ఎవరన్నా అంటే ఎప్పుడూ "ఇరవయ్యే" (చేతులకు పదీను, కాళ్ళకు పదీను), అంతేగాని ఇలా 15, 17 వంటి తప్పులెక్కలు అతడికి కుదరవు ! చదువు అంటే వాగానే చదువుకున్నాంగాని - మా వంటి ఆడ పిల్లల ముఖ్య సమస్య ఒకటి ఉంది; అందరి తరఫునా (నేనే వకాల్తానామా పుచ్చుకొని) సవినయంగా లోకానికి మనవి చేస్తున్నాను.

ప్రజల్లో ఒక్కొక్క దురాచారం ప్రబలి నప్పుడు, ఒక్కొక్క మహాపురుషుడు బయలుదేరి, దాన్ని చక్క దిద్ది వెడుతుంటాడు. శ్రీ రాజారామమోహన్‌రాయ్ తెచ్చిన సంస్కరణం విన్నాం. ఆ వెనుక ఆంధ్రదేశంలో శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు స్త్రీలకు విద్య కావాలనీ, పునర్వివాహం తప్పులేదనీ, ధైర్యంతో మరి కొన్ని సంస్కరణలు తెచ్చి, స్త్రీజాత్యభివృద్ధికి ఎంతో కారకులయ్యేరు. స్త్రీలకు జరిగే అన్యాయాన్ని గుర్తించి, పెద్దపెద్దలంతా తమ సహకార సానుభూతుల నిచ్చి తోడయ్యేరు. మహర్షి సర్ ఆర్. వెంకటరత్నం నాయుడు గారు, దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావుగారు వగైరా ప్రముఖులెందరో ఎంతెంతో కృషిచేశారు. ఇక గాంధీజీ మాట: జగమెరిగిన బ్రాహ్మణుడికి జంధ్యమేల : దేశమూ స్త్రీయూ దాస్యశృంఖలాలలో మగ్గిపోతూ ఉంటే, "యదా యదాహి ధర్మస్య...." అన్న గీతావాక్యం ప్రకారం, పుత్లీబాయి కడుపుపచ్చగా, జన్మించెను, లోకనాథ నిహా రించింది. "అపర గుణకరపుణ్యగ, దాని ఘనమైన దాని నొసగూర్పగ" ఈ మహాపురుషుణ్ణి ప్రసాదించింది తల్లి. దేశం, ప్రజలు, హరిజనులు, స్త్రీలు అందరూ ఈ రోజున ఇలా ఉన్నారు అంటే, అంతా ఆ మహాపురుషుడి కృషి అని జేజేలు చెప్పవలసిందే. ఇలా ఎంతో మంది కృషిచేసినా, ఇంకా స్త్రీలోకాన్ని కలవర పెడుతున్న సమస్య, గడ్డు సమస్య ఒకటి ఉండిపోయిందని మనవి. అదే కట్నాల సమస్య.

కొత్తగా కాపురం ప్రారంభించే నూతన దంపతుల కేదోయింత ముట్టచెపితే చేదోడౌతుందని పెద్దలు సంతో

షపూర్వకంగా, ఐచ్ఛికంగా, ఏదో కలిగినదాంట్లో కొంచెం యివ్వడం, అనే పద్ధతి సదుద్దేశంతోనే పెట్టి ఉండవచ్చు. కాని ఇది క్రమంగా యదార్థమైన వర'విక్రయం' లోకి దిగి పోయింది. అబ్బాయి చదువుకు వెచ్చించిన మొత్తం అసలీ ఫాయిదాలతోటీ, అత్త - ఆడబడుచుల లాంఛనాల తోటీ, వచ్చినంత మట్టుకు గుంజుకోవాలని, చదువును బట్టి కట్నం హెచ్చిస్తూ నిజంగా వరుణ్ణి పెళ్ళిళ్ళ మార్కెట్‌లో పెట్టి అమ్ముతున్నారు - వరుడి తండ్రిగారు. ఎవరు ఎక్కువ ధరపెడితే వారు కొనుక్కు పోవచ్చు - ఇది పశువుల బేరానికేమి తీసిపోతుందో తెలియడంలేదు !

ఆడ పిల్లవారు ఈ కట్నాలు ఇచ్చుకోలేకను, ఇంట్లో ఈడు వచ్చిన పిల్లనుంచుకోలేకను పడే యిక్కట్లు ప్రతి కుటుంబంలోను, ప్రతివారికి స్వానుభవమే. ఏ తలో తాకట్టు పెట్టి, ఒక అబ్బాయిని 'కొని' అమ్మాయికి ఆ మూడు ముళ్ళూ పడ్డాయి అనిపించు కొందుకు తల్లి దండ్రులు ఎంతో వ్యయప్రయాసలకు లోనవుతున్నారు.

ఇలా లోక కంటకంగాను, ఆడపిల్ల పెళ్ళి తలపెట్టే సరికి భీతావహంగాను ఉన్న ఈ పాడు కట్నాల పిశాచాన్ని అరికట్టే విధానాన్ని పెద్దపెద్దలంతా గట్టిగా ఆలోచించాలి. ఏదో శాసనంచేసేం - చేస్తాం అంటేచాలదు; అది సరిగా అమల్లోకి వచ్చి బాధితుల విముక్తికి తోడ్పడితేనే దాని ఫలితం. పోనీ చదువుకున్న మగపిల్లలైనా, అమ్మాయి వంశ సాంప్రదాయాలు, గుణగణాలు గమనించి (భగవంతుడు తమ కివ్వాలిగాని) పరుల్ని పీడించి పుచ్చుకునే కట్నాలతో ప్రమేయం లేదని, ధైర్యంగా ముందుకొచ్చి సంస్కరణ తెస్తారేమోనంటే అదీ కానరాదు. ఇంకా విదేశచదువు ఖర్చుల మాటేమిటి అని నిలేయడం జరుగుతూఉంది !

ఈ పరిస్థితులన్నీ చూస్తుంటే నాకొక్కటే తోస్తుంది. నేనే నెహ్రూప్రధానినో, భారత ప్రెసిడెంటునో ఐయుంటే ఒక్క దెబ్బతో కట్నాల పిశాచాన్ని పారదోలేదాన్ని ! స్వయంవరం పద్ధతి పునరుద్ధరించేదాన్ని ! (ఉద్యోగాలు కావాలన్న వాళ్ళి ఇంటర్‌వ్యూ చేయడాన్కి సర్వీస్ కమిషన్ ఉన్నట్లు) మహిళా సంస్థలచేత వివాహ కమిషన్లు ఏర్పాటు చేయిద్దును ! మగ పిల్లలు ఫోటో, వంశం, విద్య వగైరా వివరాలతో ఈ కమిషన్‌కు అప్లికేషన్లు పంపించాలి. ఇంటర్‌వ్యూలో మెంబర్లూ, అమ్మాయీ, ఆమె తాలూకువారూ, వచ్చిన అబ్బాయిల్ని ప్రశ్నించి, పరీక్షించి, పెళ్ళిళ్ళ ఏర్పాటు చేసేటట్లు చేద్దును ! పూర్వపు స్వయంవరం పద్ధతిమీద నేను చేసిన ఇంప్రూవ్‌మెంటు ఏమిటంటే అమ్మాయికి సలహాయివ్వడాన్కి పెద్దలూ, మెంబర్లూ ఒక డాక్టరూ కూడ దగ్గరఉండి అమూల్యంగా తోడ్పడతారు. ఏమంటారు? అలా చేద్దునుగాని, నేను ప్రధానీనిగానూ, ప్రెసిడెంటునూ గాను ! ఇంకా విద్యార్థినిగానే ఉన్నా !

కేంద్ర సోషల్ వెల్‌ఫేర్ బోర్డు చైర్మనూ, లాయరు గారూనైన ఏ దుర్గాబాయ్ దేశ్‌ముఖ్‌గారో, తదితరపెద్దలో, పుణ్యం కట్టుకొని, తము గావిస్తున్న బ్రహ్మాండమైన ఏర్పాట్లలో ఇలాంటి ఏర్పాట్లేమైన చేసి ఈ పాడుకట్నాల దురాచారానికి స్వస్థి చెప్పిస్తే, వారు దేశానికీ, స్త్రీలోకానికీ గావిస్తున్న అనన్యసేవ సమగ్రమైన దవుతుంది.

నాకు ఒక్కొక్కప్పుడు ఇక మిగిలిపోయిన మార్గాంతరం ఒకటి తోస్తుంది. "ఇలాంటి పాడు కట్నాల అచారాన్ని మాన్పించాలంటే మరో రాజారామ్‌మోహన్‌రాయ్ లాంటివాడు కావాలేమిటి - భగవంతుడా?" అనిపిస్తుంది. అవసరమైతే, ఇక మార్గాంతరం లేదనితోస్తే, రాజారామ్ మోహన్‌రాయ్ - ది - గ్రే ని రప్పించడాన్కి చూస్తా ! తల్లి తారణి ఉండనేవుంది .... ఇక .... (ఇక ఇప్పుడు ఇంతకంటే మాట్లాడేనంటే ముందు నా పెళ్ళి అవుతుం దని మొదటనే చెప్పా ! )

ఈ దారుణ కట్నాల సమస్యాపరిష్కారానికి - (వీటి వల్ల ఇల్లూవొల్లూ గుల్లలైనవారు, వీటిబాధల ననుభవిస్తున్న వారు, బహుజనోప యోగమైన సంస్కరణ తేవాలని అభిలషించే సేవాపరాయణులు, ఇంకా ఇంకాపెద్దలు, నాబోటి పిన్నలూ 'ఆంధ్రమహిళ' ద్వారా) మార్గాంతరాలు సూచిస్తే, భావి తల్లులు కాబోయే స్త్రీలోకానికీ, దేశానికీ మహోపకారం చేసిన వారవుతారని మనవిచేస్తూ ముగిస్తున్నా.



స్త్రీలు : ఉద్యోగాలు

# "ఉద్యోగంతో నా వ్యక్తిత్వం బైటకు వచ్చింది"

రచన : ఒక ఉపాధ్యాయురాలు.

అనువాదం : శ్రీ. బుద్ధవరపు సత్యనారాయణ.

మాది పంజాబు ప్రాంతం. 1947 లో జరిగిన దేశ విభజన మా కుటుంబాన్ని చిన్నాభిన్నం చేసింది. మా గృహాన్ని కూకటివేళ్ళతో పెల్లగించివేసింది. అక్కడ నుంచి బొంబాయి నగరానికి వలసవచ్చేశాము. నా భర్త పనిచేసే కంపెనీ కూడా బొంబాయికి మార్చబడడం వల్ల ఆయన ఆ కంపెనీలోనే ఉద్యోగం చేసేవారు. అప్పటికి ఒక సంవత్సరం వయస్సు కలిగిన పాపవుంది.

పంజాబులో మాకున్న ఆస్థిపాస్తులు పోవడం వల్ల తిరిగి బొంబాయిలో మేము పునరావాసం కల్పించుకోవలసి వచ్చింది.

ముందుగా బొంబాయిలో మమ్మల్ని ఎదుర్కొన్న మహాసమస్య ఇల్లు దొరక్కపోవడం. అనేక మాసాలు తీవ్రప్రయత్నం చేసి ఆఖరికి ఒక్క గది- స్నానాలకు చిన్న సందు వున్న ఒక భాగాన్ని సంపాదించగలిగాం, ఆ చీకటికూపంలోనే నాల్గు గోడల మధ్య బ్రతుకు సాగిస్తూ వచ్చాం.

కొంతకాలం గడిచేసరికి, పాప పెద్దదవుతున్న కొద్ది ప్రతిదానికి నామీద ఆధారపడ్డం మొదలుపెట్టింది. ఎప్పుడూ నా దగ్గరే వుండేది. ఎప్పుడేనా నేను ఏదైనా పుస్తకం చదువుకుందామన్నా, స్నేహితురాలికి ఉత్తరం వ్రాద్దామన్నా ప్రశాంతతగాని ఏకాంత సమయం గాని దొరికేవి కాదు. పాప ఏమో ప్రతిదానికి, 'ఆయా' మాట వినక నన్ను వేదించేది.

పిల్లలయందు అశ్రద్ధ చూపడమంటే నాకు ఇష్టం వుండదు. పిల్లలు శిక్షణలేకుండా పెంకితనంతో అల్లరిచిల్లరిగా తిరగడం నేను సహించలేనిపని. తగిన శిక్షణలేకపోతే పిల్లలు పాడవుతారు.

ఇంట్లో ఏ కొద్దిగంటలో తప్ప ఒకళ్ళముందు ఒకళ్ళు తీరికగా కూర్చోవడం నాకు చాలా బాధ అనిపిస్తుంది. దానికి తగినట్లు ఆ ఇల్లుకూడా చాలా ఇరుకు. ఏదైనా వృత్తిలో ప్రవేశించడం ఒక్కటే నాకు పరిష్కార మార్గంగా కనిపించింది.

నాకు పెళ్ళి అవడానికి పూర్వం నేను ఉపాధ్యాయురాలినిగా పనిచేశాను. విద్యావ్యాసంగం అంటే నాకు చాలా అభిరుచి. నేను ఉద్యోగం మానడానికి వివాహం కారణమయింది. అందరి భర్తల్లాగే మా ఆయనకి కూడా స్త్రీలు వుద్యోగాలు స్వీకరిస్తే ఇంట్లో 'ఆడపెత్తనం' వస్తుందనే భయం, నమ్మకమూను. దీనికి కారణం పురుష ఆధిక్యత కాక మరేమిటి! లేకపోతే ఆచారాలకీ, సంప్రదాయాలకీ వ్యతిరేకంగా నడవలేక, వాటిలో అనర్థం వున్నా బానిసలు కావడం.

మొత్తం మీద నేను అప్పుడు ఉద్యోగం మానివేశాను. ఇప్పటి ఇంటి స్థితి చూసి పశ్చాత్తాపానికి అవకాశం లేదని తిరిగి ఉద్యోగం విషయం ఆలోచించడం మొదలుపెట్టాను.

పాప పెరిగి పెద్దదవుతోంది. నాకేదీ చెప్పుకోతగ్గపని వుండేదికాదు. క్రమేణా ఒకవిధమయిన అసంతృప్తి నన్ను ఆవరించింది. ఎప్పుడూ చిరాకుగావుండేది. సోమరితనాన్ని భరించలేక ఒకొక్కసారి తీవ్రంగా నిరాశా, నిస్పృహలు కలిగేవి—— ఏదైనా అఘాయిత్యం చేసి ఈ ఇంటి జైలు పీడ విదిలించుకుందామా అని.

కాని, సకాలంలోనే నా స్థితి గురించి నేను పూర్తిగా తెలుసుకున్నాను. నాలోవుండి, వికాసాన్ని కోరుతున్న సహజశక్తుల అభివృద్ధికి ఒక మార్గం కనిపెట్టాలనిపించింది. ఒక రోజున పత్రికలో ఒక ప్రకటనపడింది—ఒక ఉపాధ్యాయురాలు కావాలి అని. దాన్ని చూసేటప్పటికి నాలో సంచలనం ప్రారంభమయింది. క్రొత్త ఉత్సాహం వచ్చింది. నాకున్న అర్హతలన్నీ ఆ ఉద్యోగానికి సరిపోయాయి. జవాబు వస్తుందనే ఆశ తక్కువగా వున్నా- ఆ ఉద్యోగానికి దరఖాస్తు వ్రాసి పంపాను.

నా భర్త ఏదో వాళ్ళ ఆఫీసు పనిమీద ఢిల్లీ వెళ్ళారు. అదే సమయంలో నన్ను ఇంటర్వ్యూకి రమ్మని నా దరఖాస్తుకి వెంటనే జవాబు వచ్చింది.

ఆ స్కూలు వాళ్ళు నన్ను సెలక్టుచేస్తే ఏంచెయ్యాలా అని సందిగ్ధావస్థలో పడ్డాను. అసలు ఈ వుద్యోగం

# "ఉద్యోగంతో నా వ్యక్తిత్వం బైటకు వచ్చింది"

విషయం ఆయనకు చెప్పనైనా చెప్పలేదు. ఇక పాప సంగతి చూస్తే అప్పటికి దానికి ఒకటిన్నర సంవత్సరాల వయస్సు. అంత పసితనంలోనే 'ఆయా'ను నమ్మి పాపను ఆమె చేతుల్లో పెట్టడమా అనిపించింది. ఏం చెయ్యడానికి నాకేమీ తోచలేదు. కాని ఏది ఏమైనా ఈ నాలుగు గోడల చీకటికూపం నుంచి బైటపడడం అవసరం అనిపించింది.

అటువంటి పరిస్థితుల్లో ఇదివరలో చాలా కాలం మా యింట్లో పనిచేసిన వంటమనిషి దేవుడులా వచ్చాడు. పాపకి ఏలోటూ రాకుండా తను చూసుకుంటానన్నాడు. ఆయాను కూడా ఓకంట కనిపెట్టి వుంటానన్నాడు. చాలా సంవత్సరాలు ఎంతో నమ్మకంగా విశ్వాసంగా అతను మా ఇంట్లో పనిచేశాడు కాబట్టి అతని సంగతి పూర్తిగా నాకు తెలుసు. అతని మాట విశ్వసించాను.

ఒకవిధమైన జంకుతోనే ఇంటర్వ్యూకి వెళ్ళాను. తిరిగి ఆలోచించుకుందుకైనా వ్యవధి లేకుండా తరువాత పనులన్నీ త్వరితంగా పూర్తయ్యాయి. నా ఎప్పాయింట్ మెంట్ లెటరు ఇచ్చారు. అవసరమైన పాఠ్యగ్రంథాలు ఇచ్చారు. పాఠశాలలో ఒక తరగతిని కూడా నాకు ప్రత్యేకించారు. చార్జి తీసుకున్నాను.

నా భర్త ఏంచేస్తారో అని నిజంగా నాకు చాలా భయం వేసింది.

ఆయన ఢిల్లీనుంచి తిరిగిరాగానే నా ఎప్పాయింట్ మెంట్ లెటరు చేతులో పెట్టాను. ఆయన ఒక్కసారిగా రేగి పోయారు.

"నాభార్య ఉద్యోగం చేస్తేనేగాని నాకు గతిలేదూ? ఇంతవరకూ వచ్చిందన్నమాట నీ సంగతి" అని పెద్దగా అరిచారు.

నెమ్మదిగా - కాసేపాగి - ఆయన చల్లబడ్డ తరువాత సంగతంతా మనవిచేశాను. ఉద్యోగంలో ఉండే ఆనందం ఏమిటో చూడాలనే నా ఉద్దేశమనీ, కేవలం వ్యక్తిగతమైన సంతృప్తికోసం మాత్రమే పనిచేస్తానని నచ్చచెప్పాను. ఇంటి 'పోషకుడు'గా ఆయనకు గల హక్కును నేను చేజిక్కించు కుందామనే అభిప్రాయం నాకు లేదనీ విశదం చేశాను.

నిజంగా నాభర్త చాలా మంచివారు. ఏంచెప్పినా మంచి చెడ్డలు ఆలోచిస్తారు. ధర్మంగా ప్రవర్తిస్తారు. ఇతరులకు బాధ కలగనివ్వరు. అందుకే నా ఉద్యోగానికి ఇప్పుడు అడ్డురాలేదు. నాలో వున్న సహజశక్తుల అభివృద్ధికి అవకాశం ఇవ్వడం అవసరమని ఆయన అభిప్రాయపడ్డారు. పాపకి ఏలోటు రాకుండా అన్నీ ఏర్పాట్లు చేస్తానని ఆయనకు నచ్చచెప్పాను. సరే - ఒకనెల ఎల్లావుంటోందో చూద్దాం-ఇంట్లో పరిస్థితి వికలంగా మారితేమాత్రం నువ్వు నీ ఉద్యోగానికి రాజీనామా యివ్వాలి సుమా అన్నారు.

ఇది ఇక్కడకు చాలదు అన్నట్లు నాకింకో సమస్య వచ్చి పడింది. ఐయిన వాళ్ళంతా నానా మాటలు అనడం మొదలు పెట్టారు. మా కూతురు పనిచెయ్యడం మాకు అగౌరవంగా వుందని నా తల్లి దండ్రులు అన్నారు. అత్తా మామ చూస్తే మా కొడుకు సంపాదించలేకపోతున్నాడని, అసమర్థుడనీ' చెప్పడానికే పరోక్షంగా ఇది ఈపని చేస్తోంది' అని కటువుగా తమకు సహజంగా కోడలిమీద వుండే 'ప్రేమ' నంతా వెళ్ళగక్కారు. నా మనస్సులో నిజంగావున్న అభిప్రాయాల్ని దాచుకోకుండా అందరికీ చెప్పడానికే ఓర్పుతో ప్రయత్నించాను.

ఈ గొడవంతా నా మనశ్శాంతి లేకుండా చేసింది. అన్నీ సమస్యల్లాగే, అన్నీ సందేహాలులాగే కనిపించాయి. కాని అంతగా కొంపలుమునిగే పరిస్థితివస్తే అప్పుడే ఉద్యోగానికి రాజీనామా ఇవ్వచ్చులే అని నామనస్సుని నేను కుదుట పరచుకున్నాను.

ఇప్పటికి ఐదు ఏళ్ళనుంచి అదే ఉద్యోగం చేస్తున్నాను. ఈ ఐదేళ్ళ కాలంలోనూ నేను అనేక విషయాలు పరిష్కరించుకొనవలసి వచ్చింది. పాపకి వంట్లో బాగులేకపోతే కాస్త నాపని ఇరుకున పడేది. అల్లాగే, ఆయన పాపని నిర్లక్ష్యం చేస్తున్నానని అనుకొన్న సమయాలు లేకపోలేదు. పాపకి అనారోగ్యంగా వున్నప్పుడు మాత్రం నేను పనిచేసే స్కూలు అధికారులు దయతో శలవు ఇచ్చేవారు. ఆయనకు కలిగిన దురభిప్రాయాల్ని పోగొట్టడానికి పరస్పరం మేమిద్దరు ఒకళ్ళ నొకళ్ళు సమ్యక్ దృష్టితో అర్థం చేసుకొనడం అవసరమయింది. కాలక్రమేణా ఇది కూడా సాధించగలిగాం.

స్కూలు పని ఏదైనావున్నా ఇంటికి తేవడం మాను కున్నాను. శని అదివారాలు కేవలం ఖాళీచేసుకొని ఇంటి

# "ఉద్యోగంతో నా వ్యక్తిత్వం బైటకు వచ్చింది"

పనులు చూసుకునేదాన్ని. నాలుగైదు రోజులు శలవలు వచ్చినప్పుడు ఏదేనా కుట్టుపనీ అదీ వుంటే పూర్తి చేసే దాన్ని.

ఇదికాకుండా ఇంకా చిన్న చిన్న కుటుంబ విషయాలను నేను ఓర్పుతో చక్కబెట్టు కోవలసి వచ్చింది. ముఖ్యంగా చినిగిన బట్టలు మేటుపడి వుండేవి. ఇంటి జమాఖర్చు లెక్క వ్రాసుకోవలసి వచ్చేది. ఒక్కొక్కసారి వారంరోజుల లెక్కలు గుర్తుకు తెచ్చుకొని వ్రాసేదాన్ని. ఇదీ కాస్త చికాకుగానే వుండేది. కొంత కాలం గడిచేసరికి ఈ పనులన్నిటికి ఒక ప్రణాళిక వేసుకొని ఎప్పటికప్పుడు దాని ప్రకారం పూర్తిచేసేదాన్ని. అందుచేత కొన్నాళ్ళకి ఇవన్నీ దినచర్యలుగా మారాయి. నాకు వాటి బెంగే వదిలిపోయింది.

ఆయనలో కూడా మార్పు వచ్చింది. 'అభిమానం' (నాఉద్యోగం విషయంలో) చాలావరకూ తగ్గ నారంభించింది. నేను నిజంగా ఆత్మ తృప్తికోసం మాత్రం పని జేస్తున్నానన్న సంగతి ఆయన గ్రహించారు. ఆదాయం కూడా పెరగడంవల్ల ఆయన బరువు కొంత తగ్గింది. దీనికి ఆయన చాలా సంతోషించేవారు.

చేతినిండా డబ్బు వుండడం వల్ల మాకు కావలిసిన వస్తువులన్నీ కొనుక్కునే వాళ్ళం. పాపాయిని ఒక మంచి స్కూలులో చేర్పించాం. దానికేలోటు రానిచ్చేవాళ్ళంకాదు. ఎప్పుడేనా విశ్రాంతి కావలసివస్తే రెండుమూడు రోజులు శలవుపెటి ఇంటి దగ్గరే హాయిగా కాలం గడిపేవాళ్ళం.

ఉద్యోగం వల్ల నాకు చాలా తృప్తిగా వుండేది. నామనో వాంఛను తీర్చుకుంటున్నాననే ఆనందం. పనిలేక విసుగుచేందే అవకాశమే లేదు యిప్పుడు. పాప అవసరాలేమిటో అన్నీశ్రద్ధగా చూసుకునేదాన్ని. ఆయనకు భార్యగా పాపకు తల్లిగా నేను నిర్వర్తించ వలసిన ధర్మాలలో దేనినీ అలక్ష్యం చెయ్యలేదు.

ప్రతి విషయం సక్రమంగా వుండడం వల్ల నా స్వభావంలో చాలా మార్పు కూడా వచ్చింది. కోపం బాగా తగ్గిపోయింది. నాలుగుగోడల మధ్య రాచ్చిప్పలా పడి వున్నామనే దిగులులేదు. ఉద్యోగం వల్ల జీవితంలో కొన్ని కొత్త అనుభవాలు, అనుభూతులు నాకు కలిగాయి. ఉదాహరణకు చూడండి. నేను ఉద్యోగంలో చేరడానికి పూర్వం శని ఆదివారాలకు నా జీవితంలో ప్రత్యేక విలువ లేదు. ఇప్పుడు శని ఆదివారాలు హాయిగా గడుపుతున్నాను. కొత్త కొత్త ఆనందంతో శని ఆదివారాల అర్థం ఇప్పుడు నాకు పూర్తిగా తెలుసు. ఏదో మనస్సుకు ఆహ్లాదాన్నిచ్చే పని చేస్తూవుంటాం ఆ శలవుల్లో.

ఇరుగు పొరుగు ఇంటి అమ్మలతో తీరిగ్గా కాళ్ళుజాపుకొని కూర్చుని సోమరిగా ఉబుసుపోని కబుర్లు చెప్పడానికి గాని, లేనిపోని పేచీలు తెచ్చుకుందుకి గాని నాకు తీరిక లేదు : అటువంటి వ్యర్థజీవితమంటే నాకు అసలు ఇష్టం వుండదు. ఏదోపుస్తకం చదువుకుంటూనో ఏదోరాసుకుంటూనో — ఏసంగీత కాలక్షేపంలోనో నాతీరిక కాలం గడిచిపోతోంది. మొత్తంమీద ఈ ఉద్యోగం వల్ల నాలో వున్న స్వయంశక్తులు వికశించాయి. నా జీవితంలో నవోదయమైంది. (సన్‌డేస్టాండర్డ్ నుంచి)





# మహాలక్ష్మి పూజ

ఓం కేశవాయస్వాః. నారాయణాయస్వాః. మాధవాయస్వాః, గోవింద, విష్ణు, మధుసూధన, త్రివిక్రమ, వామన, శ్రీధర, ఋషీకేశ, పద్మనాభ, దామోదర, శంకర్షణ, వాసుదేవ, ప్రద్యుమ్న. అనిరుద్ధ, పురుషోత్తమ, అజోక్షయ, నారసింహ, అచ్యుత, జనార్ధన, ఉపేంద్ర, హరేః, శ్రీకృష్ణాయనమః, పృద్ధివ్యాః, మేరో,పృష్ఠఋషిః, కూర్మోదేవతా' సుతలంచ్ఛందః, ఆసనేవినియోగః, అనంతాసనాయనమః, ప్రణవశ్య. పరబ్రహ్మ ఋషిః. పరమాత్మాదేవతాదైవీ గాయత్రీ ఛందః, ప్రాణాయామె. వినియోగః, ఓం, భూః (ముక్కుపట్టుకొనవలెను) ఓం, భువః, ఓం, సువః. ఓం, మహః, ఓం జనః, ఓం తపః, ఓం సత్యం, తత్స వితురువరేణ్యం, భర్గోదేవశ్య, ధీమహి, ధీయోయోనః, ప్రత్యోదయాత్ ఓమాపోజ్యోతి, రసోమృతం, బ్రహ్మ భూర్భవస్వరోం, మమ ఉపాత్త, దురితక్షయద్వారా, శ్రీపరమేశ్వరీ ప్రీత్యర్థం, శుభాభ్యాం, శుభే, శోభనేముహూర్తే, శ్రీమహావిష్ణు వరాజ్ఞాయ, ప్రవర్తమానశ్య, ఆధ్యబ్రహ్మణా ద్వితీయ ప్రహారార్ధే, శ్వేతువరాహకల్పె, వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రధమపాదే, జంబూద్వీపే, భరత వర్షే, భరతఖండే, అశ్మిన్, వర్తమానవ్యవహారిక చాంద్ర మానేన, సంవత్సరే – అయనే – ఋతౌ – మాసే– పక్షే– తిధౌ– వాసరే. సుభనక్షత్ర, సుభయోగ, సుభకర్ణ, హేవంగుణ. విశేషణ విశిష్ఠాయాం, సుభతిధౌ, శ్రీమాన్ శ్రీమతి, గోత్రవతీ. నామధేవతీ, నామధేయస్య, క్షేమస్థైర్య విజయ, అభయ ఆయురారోగ్య, ఐశ్వర్యాభి వృద్యర్థం, ధర్మార్ధ కామ మోక్ష చతుర్విధ, ఫలపురుషార్థ సిద్యర్థం, సత్సంతాన సౌభాగ్య సిద్యర్ధం, శ్రీ మహాలక్ష్మి పూజాం కరిష్యే, తదంగ కలశారాధనం కరిష్యే, కలశశ్య ముఖే, విష్ణుః ఖంఠే, రుద్రసమాశ్రితః. మూలే తత్రస్థితౌ బ్రహ్మా, మధ్యే మాతృగణాస్మితః, కుక్షౌతు సాగరాస్సర్వే, సప్తద్వీపా, వసుంధరా, ఋగ్వేజోజ యజుర్వేదో సామవేదో అధర్వణః, అంగైశ్చ సహితాస్సర్వే, కలశంతు సమాశ్రితః, కలశే గంధపుష్పాచ్ఛితాం నిచ్ఛిష్య, ఆకలశేషుధావతీ, పవిత్రే పరిశిద్యతే, గంగేచైవ, ఘునే చైవ, గోదావరీ సరస్వతీ. నర్మదా సింధు కావేరీ, జలేస్మిన్ సన్నిధం కురు, ఆయాంతు కలశ పూజార్ధం, దురిత క్షయద్వారకాః ద్యానం.

అరుణాం, కరుణాం, తరంగితాక్షీం, ధృతపాశాంకుశ, పుష్పబాణ చాపాం, అణిమాదభి రావృతాం, మయూఖై, రహమిత్యేవ, విభావయేత్ భవానీం, ధ్యాయే త్పద్మాసనస్తాం, వికలిత వదనాం. పద్మపత్రాయతాక్షీం, హేమాభాం పీతవస్త్రాం, కరకలిత లసద్దేమపద్మాం వరాంగీమ్, సర్వాలంకారయుక్తాం, సతత మభయధాం, భక్తనమ్రాం భావానీం, శ్రీ విద్యాం శాంతమూర్తీం, సకలసురనుతాం, సర్వసంపత్ప్రధాత్రీం, సకుంకుమ విలేపనా, మళికచుంభి కస్తూరికాం, సమంద హసితేక్షణాం, సశరచాపపాశాం కుశాం, అశేష జన మోహినీం, అరుణమాల్య భూషాబరాం, జపాకుసుమ భాసురాం, జపవిధౌ స్మరేదంబికాం.

శాంతాకారం, భుజగశయనం, పద్మనాభం, సురేశం, విశ్వాకారం, గగనసదృశం, మేఘవర్ణం, శుభాంగం, లక్ష్మి కాంతం, కమలనయనం, యోగిహృద్యానగమ్యం, వందే విష్ణుం భవభయహరం, సర్వలోకైకనాథం. ధ్యాయామి ధ్యానం సమర్పయామి.

జ్యోతిశ్శాంతం, సర్వలోకాంతరస్తాం, ఓంకారాఖ్యం, యోగిహృద్యాన గమ్యం, సాంగం, శక్తిం, సాయుధం, భక్తిసేవ్యం, సర్వాకారం, విష్ణుమావాహయామి, శ్రీమహాలక్ష్మిదేవతాభ్యోన్నమః ఆవాహయామి, ఆవాహనం సమర్పయామి.

కల్పద్రుమూలే, మణివేదిమధ్యే, సింహాసనే స్వర్ణ మయం, సురత్నం, విచిత్ర రత్నావృత మచ్యుతప్రభో గృహాణలక్ష్మి ధరణీసమన్వితః, శ్రీమహాలక్ష్మిదేవతాభ్యోన్నమః నవరత్న ఖచిత దివ్యసింహాసనం సమర్పయామి.

పాదోదకంతే, పరికల్పితంమయా, పుణ్యం సరిత్సా గరితోపనీతం, పాధ్యం ప్రదాశ్యై, సుసుమత్సమేత, గృహాణలక్ష్మి ధరణీ సమన్వితః, శ్రీమహాలక్ష్మి దేవతాభ్యోన్నమః పాదయోః పాధ్యం సమర్పయామి, హస్తయోః అర్ఘ్యం సమర్పయామి, ముఖే ఆచమనీయం సమర్పయామి-

తీర్థోధకైః కాంచన కుంభ సంస్థైః సువాసితై, ర్దేవ సుమంతపూతైః, మయార్పితం స్నానమిదం గృహాణ

పాదాబ్జ నిష్ఠాత, నదీప్రవాహాః శ్రీమహాలక్ష్మీ దేవతాభ్యో న్నమః సిద్ధోదక స్నానం సమర్పయామి.

క్షీరోధధికృతంచైవ, శర్కరా మధుసంయుతం, పంచామృత మిదందేవీ గృహాణ హరివల్లభే, శ్రీమహాలక్ష్మీ దేవతాభ్యోన్నమః పంచామృత స్నానం సమర్పయామి.

స్వర్ణాంచలం చిత్రతరంసురత్నం కౌశేయుగ్మం పరికల్పితంమయా, దామోదర ప్రావరణగృహాణా మాయా ఫల ప్రావృత దివ్యరూపాన్ శ్రీమహాలక్ష్మీ దేవతాభ్యో న్నమః వస్త్రం సమర్పయామి.

సువర్ణతంత్రోద్భవ యుగ్మసూత్రం, ముక్తాఫల చ్యూత మనేకరత్నం గృహాణ తద్వత్ కుతముత్తరీయకం సకస్మ సూత్రం, హరతే నమోస్తు శ్రీమహాలక్ష్మీ దేవతాభ్యో న్నమః యజ్ఞోపవీతం సమర్పయామి.

కుంకుమంతవదాశ్యామి పంకేరుహ దళోజ్జ్వలే. మయార్పితం గృహాణేతి మహాలక్ష్మీ ర్నమోస్తుతే శ్రీమహాలక్ష్మీ దేవతాభ్యోన్నమః కుంకుమ సమర్పయామి.

మహాలక్ష్మీ ర్నమస్తేస్తు, మహాపురుష సేవకే సౌభాగ్య భాగ్యతేతుభ్యం హరిద్రాచూర్ణ మర్పయేత్ శ్రీమహాలక్ష్మీ దేవతాభ్యోన్నమః హరిద్రా చూర్ణం సమర్పయామి.

శ్యాలియాం శ్చంద్రవర్ణా భాంస్మిద్ధాం, మౌక్తిక సన్నిభాం అక్షతామర్పయేతుభ్యం, శ్రీకుర్ష వరాననా శ్రీమహాలక్ష్మీదేవతా భ్యోన్నమః అక్షితాం సమర్పయామి.

హారకేయూర మంజీర మణితాటంక భూషితా, కిరీటం దేవమయాం దత్తం, గృహాణ హరివల్లభే శ్రీమహాలక్ష్మీ దేవతాభ్యోన్నమః కిరీటం సమర్పయామి.

కేయూర కటకేస్సైవ, హస్తచిత్రాంగుళీయకం, మాణిక్యోల్లాస ముకుటం, కుండలేహార శోభితం, నాళౌనాయక రత్నంచ, నూపురే పాద పద్మయోః అంగుళీ ముద్రికా స్చైవ గృహాణ హరివల్లభే శ్రీమహాలక్ష్మీ దేవతాభ్యో న్నమః ఆభరణం సమర్పయామి.

కస్తూరికా కర్దమ చందనాని కాశ్మీరసంయోజిత గంధసారైః విలేపనం, శ్రీకురు, దేవదేవ శ్రీదేవి వక్షోజ విలేపనాంగం శ్రీమహాలక్ష్మీ దేవతా భ్యోన్నమః దివ్య శ్రీచందనం సమర్పయామి.

చామంతికా, వకుళ చంపక పాటలాబ్జ, పున్నాగ జాజి కరవీర రసాల పుష్పైః, బిల్వప్రవాళ తులసీదళ, మల్లికా భిత్వాం పూజయామి. జగదీశ్వ రమేశ ప్రశీద, ఆరామ పుష్పాణి మనోహరాణి. జలాశయస్థాని సుపల్లవాని త్వంగృహ్యాతాం దేవ వరప్రసీద కరవీరైర్జాజి కుసుమైః చంపకైః వకుళైః, శుభైః శతపత్రశ్చః కల్హారైః అర్చయేత్ పురుషోత్తమా మాల్యాదీని, సుగంధాని మాలత్యాదీని వైప్రభో, మయాకృతాని పూజార్థం పుష్పాణి ప్రతిగృహ్యాతాం శ్రీమహాలక్ష్మీ దేవతాభ్యోన్నమః పుష్పాణి పూజయామి.

ఓం కేశవాయనమః ఓం నారాయణాయనమః ఓం మాధవాయనమః ఓం గోవిందాయనమః ఓం విష్ణవే నమః ఓం మధుసూధనాయనమః ఓం త్రివిక్రమాయ నమః ఓం వామనాయనమః ఓం శ్రీధరాయనమః ఓం హృషీకేశాయనమః ఓం పద్మనాభాయనమః ఓం దామోదరాయనమః ఓం శంకర్షణాయనమః ఓం వాసుదేవాయనమః ఓం ప్రద్యుమ్నాయనమః ఓం అనిరుద్ధాయనమః ఓం పురుషోత్తమా యనమః ఓం అథోక్షయానమః ఓం నారసింహాయనమః ఓం అత్యుతాయనమః ఓం జనార్ధనాయనమః ఓం ఉపేంద్రాయనమః ఓం హరయేనమః ఓం శ్రీకృష్ణాయనమః ఓం శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః ఓం శ్రీమహాలక్ష్మీ దేవతాభ్యోన్నమః ఓం నానావిధ పరిమళ పుష్పాణిపూజయామి.

వనస్పత్యైః ర్సవైర్ దివ్యైర్, నానాగంధైః సుసైంయ్యుతం, ఆఘ్రేయస్సర్వ దేవానాం ధూపోయం ప్రతి, గృహ్యాతాం, శ్రీమహాలక్ష్మీ దేవతాభ్యోన్నమః ధూపమాఘ్రాపయామి.

సాద్యం, త్రివర్తిసంయుక్తం, వహ్నినాయోజితం మయా, గృహాణ మంగళం దీపం, త్రైలోక్య తిమిరాపహః, భక్త్యాదీపంప్రయత్యామి, దేవ్యాయ పరమాత్మనే, త్రాహిమా న్నరకాత్ఘోరా, దివ్యజ్యోతి నమోస్తుతే, శ్రీమహాలక్ష్మీ దేవతాభ్యోన్నమః దీపం సమర్పయామి.

స్వామిన్‌లక్ష్మీశ, దేవేశ, భక్తలోక దయానిధే, జ్ఞానతో, జ్ఞానతోవాపి, భక్త్యా శక్త్యా, సమర్పితం మయోపనీతం, నైవేద్యం, పంచ భక్ష్య సుభోజనం, మక్షికా మశకా : కేశ, పృధుబీజాని పల్కలాః, పాషాణమస్తికం, సర్వం, క్రిమికీట పిపీలికాః, ఏతాం సర్వాన్ పరిత్యజ్య

సుచిపాకాని యానివై, తాని సర్వాణి గృహిణీష్వ, మయా దత్తాని మాధవా, కదళీఫల సాంబ్రాణి, సుపక్వాని, ఫలానిచ, అన్నం చతుర్విధం, సూపం స్తద్యస్తప్తం ఘృతం, ధధిః మయాసమర్పితం సర్వం, సంగృహాణ శ్రీయాసహా, సౌవర్ణస్థాలిమధ్యే, మణిగణఖచితైర్,

గోఘృత పక్వాన్, సుపక్వాన్, భక్ష్యం, భోజ్యాంస్య లేహాం నపరిమిత మహాంజోస్య మన్నంనిధాయ నానా శాఖై, రుపేతం, దధిమధు సుగడ క్షీర పానీయయుక్తాం తాంబూలం చాపి, విష్ణుం, ప్రతిదివస మహాంమానసేకల్ప యామి.

ఓం భూర్భ వశ్వః ఓం తత్స విత్రువరేణ్యం, భర్గో దేవశ్య, ధీమహి. ధీ యోయోనః, ప్రత్యోదయాత్ సత్యం తత్వేన పర్షంచామి. అమృతమస్తు [మహాకాళి మహా సరస్వతి....] మహానైవేద్యం సమర్పయామి. ఓం ప్రాణా యస్వః, ఓం పానాయస్వః, ఓం సమానాయస్వః, మధ్య మధ్య పానీయం సమర్పయామి. హస్తౌప్రక్షాళ యామి, పాదౌ ప్రక్షాళయామి, సుద్ధాచమనీయం సమర్ప యామి. మధ్య మధ్య పానీయం సమర్పయామి.

పూగీఫలైశ్చ, కర్పూరైః నాగవల్లీదళైర్యుతం, ముక్తాచూర్ణేన సంయుక్తం, తాంబూలం ప్రతిగృహ్యతాం, శ్రీమహాలక్ష్మీదేవతాభ్యోన్నమః తాంబూలం సమర్పయామి.

నీరాజనం స్వీకురు దేవదేవ నీలోత్పల శ్రీకర నీరజాక్ష గృహాణ రత్నాగృహ మోళిరత్నా మరీచినీ రాం జిత పాదపద్మం శ్రీమహాలక్ష్మీదేవతాభ్యోన్నమః కర్పూర నీరాజనం సమర్పయామి. నీరాజనానంతరం సుద్ధాచ మనీయం సమర్పయామి.

ఓం, యాసాపద్మాసనస్తా, విపులకటితటీ, పద్మపత్రా యతాక్షీ, గంభీరావర్తనాభి స్తనభరన మిత, సుభ్రవస్త్రోత్త రీయ, లక్ష్మీర్ దివ్యైర్, గజేంద్రై ర్మణిగణ ఖచితైర్ స్నాపితాహేమ కుంభైర్నిత్యం సాపద్మహస్తా, మమవస తుగృహే, సర్వమాంగల్య యుక్తాం.

లక్ష్మీక్షీరసముద్ర రాజతనయాం, శ్రీరంగధామేశ్వరీం, దాసీభూత సమస్త దేవవనితాం, లోకైకదీపాంకురాం, శ్రీమన్మంద కటాక్షలబ్ధ విభవత్ బ్రహేంద్ర గంగా ధరాం, త్వాం త్రైలోక్య కుటుంబినీం, సరసిజాం, వందే ముకుంద ప్రియాం, సిద్ధలక్ష్మీర్, మోక్షలక్ష్మీర్, జయ లక్ష్మీ, సరస్వతీ, శ్రీర్ లక్ష్మీర్, వరలక్ష్మీశ్చ ప్రసన్న మమసర్వదా, వరాంకుశౌ పాశమభీతముద్రాం, కరైరు హంతీం కమలాసనస్తాం, బాలార్కకోటి ప్రతిభాం, త్రినే త్రాం, భజేహిమాంబాం, జగదీశ్వరీంతాం, సర్వమంగళ మాంగళ్యే, శివే, సర్వార్ధ సాధకే, శరణ్యే త్రియంబకే దేవి, నారాయణి నమోస్తుతే, శ్రీమహాలక్ష్మీ దేవతా భ్యోన్నమః సువర్ణమంత్రపుష్పం సమర్పయామి.

యానికానిచ పాపాని, జన్మాంతర కృతానిచ, తానితాని ప్రణశ్యంతి, ప్రదక్షణ పదేపదే పాపోహం, పాపకర్మాణీ, పాపాత్మా, పాపసంభవా, త్రాహిమాన్ కృపయాదేవీ, శరణా గతవత్సలా, అన్యదా శరణంనాస్తి, త్వమేవ, శరణంమమ, తస్మాత్కారుణ్య భావేన రక్షరక్షో మహే శ్వరీ. శ్రీమహాలక్ష్మీ దేవతాభ్యోన్నమః ఆత్మప్రదక్షిణ నమస్కారాం సమర్పయామి.

ఛత్రం సమర్పయామి, చామరం సమర్పయామి, నృత్యం సమర్పయామి, గీతం సమర్పయామి, వాయిద్యం సమర్పయామి, సకల రాజోపచారాన్ సమర్పయామి, సకల దేవోపచారాన్ సమర్పయామి.

అపరాధ సహస్రాణి, క్రియంతే అహర్నిశం, మయా దాసోహమితిమాం, మత్వాక్షమస్వా, పరమేశ్వర, గతం పాపం, గతం దుఃఖం, గతం దారిద్ర్యమేవచ, ఆగతా సుఖ సంపత్తి పుణ్యాశ్చతవ దర్మనాత్ ప్రార్థనాన్ సమర్పయామి. సాష్టాంగ నమస్కారాం సమర్పయామి.

రూపం దేహి, జయం దేహి, యశో దేహి, ద్విశో దేహి, పుత్రాం దేహి, ధనం దేహి, సర్వకామాశ్చ దేహి, మే, ప్రార్ధనాన్ సమర్పయామి, అనేనమయా, యధాజ్ఞానేన యధాసంపాతోప బారద్రవ్యైః, కృతపూజానేన, భగవాన్ సర్వాత్మకః, మహాలక్ష్మీర్, ప్రీతయే సుప్రీతో సుప్ర సన్నో వరదోభవతు. మహాలక్ష్మీ ప్రసాదం శిరసా ఘృర్నామి.

స మా ప్తం.






# అమృతాంజనము

గాని,

“ యథాయథా...............కాళీభవళత్వ శంకయా.”

అమృతాంజనమా ! నీ కీర్తి ముల్లోకములను దెల్పుజేయు పూనికతో పెరుగుచున్నప్పుడెల్లను నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!

# జీవితం



శ్రీమతి నాయని స్వప్నకుమారి.

"రామయ్య కోడలు కాపరానికొస్తుందట! విన్నావా?" అని నీలాటి రేవు వద్ద ఒక అమ్మలక్క ప్రక్కనున్న ఆవిడను ప్రశ్నించింది.

"సూరిగాడి పెళ్ళామా! ఏవూరమ్మాయి, పిల్ల బాగుంటుందా?" బిందె ముంచుతూ అడిగింది ప్రక్కనున్న ఆవిడ.

"అయ్యో నీకు తెలియదటే కామూ! ఎవరో అమ్మాయి కాదు అక్క కూతురేగా! వేరే పిల్లను చేసుకోవడం ఇష్టంలేక స్వయంగా కూతురు బిడ్డనే కొడుక్కు చేసుకున్నది. అందరికీ తెలిసిన విషయమేగా! క్రొత్తగా అడుగుతున్నావేమే!" బట్టలు పిండుతూ సమాధానమిచ్చింది సీతమ్మ.

"ఎప్పుడు ఇంటిముందు చేతులు జట్టుగా పట్టి ఇద్దరూ మట్టిలో ఆడేవారు. ఆ అమ్మాయి పేరు లక్ష్మి కదూ! జ్ఞాపకమొచ్చిందిలే." అంటూ బిందెను చంకనెత్తుకుంది కామాక్షి.

"పెళ్ళికూతురిని చూస్తామా! వస్తావా!" అని కామాక్షమ్మను సీతమ్మడిగింది.

"నాకిప్పుడు తీరదమ్మా! సాయంత్రమయితే వస్తానులే! వెళ్ళేటప్పుడు నన్నుకూడా పిలిచిపో, నేను పోవాలి" అంటూ నడిచింది కామాక్షి.

"అట్లాగే పిలుస్తాలే" అని సీతమ్మ తన పనిలో తాను నిమగ్నురాలయింది.

రామయ్య చౌదరిగారిల్లు పెద్ద పందిర వేసి చుట్టు మామిడాకులు కట్టి ఉన్నది. ఎక్కడ చూచినా పచ్చని తోరణాలతో ఇల్లంతా క్రొత్త శోభతో కల కలలాడుతూంది.

పందిరక్రింద పెద్దలంతా కూర్చున్నారు. ఇంటి పెద్ద రామయ్య చౌదరి అందరికీ స్వాగతం చెప్పాడు. అందరూ రామయ్యని అభినందించారు. ఆ వూరికి రామయ్య గ్రామ 'మునసబ్' అందరితో తల్లో నాలుక వలె ప్రవర్తించేవాడు ఆ పల్లెలో అందరూ రామయ్యను చాలా మెచ్చుకునేవారు. కొడుకు పెండ్లికి ఊరివారంతా చాలా సహాయం చేశారు. పెండ్లి పెద్ద ఎత్తులమీదనే జరిగింది. కాని ఆ పెండ్లిని ఆ ఊరి ప్రజలు చూచే భాగ్యం నోచుకోలేదు. పెండ్లి పల్లెలో జరగలేదు. వాళ్ళను సంతోష పెట్టడానికై కోడలను తీసుకొచ్చేటప్పుడు ఆ పల్లె ప్రజలకు గొప్ప విందు చేయాలని యేర్పాటు చేశాడు.

పెండ్లికూతురు "లక్ష్మి" వాకిట్లో దిగింది. చూడడానికి చాలా ముచ్చటగా ఉన్నది. ముఖాన కల్యాణం చుక్క, బుగ్గన కాటుక చుక్క, వంటినిండా నగలు, తలనిండా పువ్వులు, రేగిన జుట్టు ముఖాన పడ్తూంది. అమాయకమైన ముఖం సిగ్గుతో వంచీ వంచనట్లుగా ఉన్నది. పేరే 'లక్ష్మి' పేరుకు తగ్గ అందం అలంకరణతో 'శ్రీ మహాలక్ష్మి' వచ్చి నిలపడినట్లే ఉన్నది చూపులకు. పెద్ద ముత్తయిదువులు వచ్చి నీరాజనాలతో లోపలకు తీసుకు వెళ్ళారు. ఎదురుగా ఉన్న అమ్మమ్మ (అత్త)కు వంగి నమస్కరించింది. 'వెయ్యేళ్ళు వర్థిల్లమ్మా' మనస్సులో దీవిస్తూ కోడలిని (మనుమరాలు) లేవదీసిందామె. తరువాత మామయ్యకు (తాత) నమస్కరించింది. మనుమరాలు కోడలుగా వచ్చినందుకు సంతోషించాడు. తలమీద చెయ్యివేసి నిమురుతూ "వంశాన్ని నిలబెట్టమ్మా" అని దీవించాడు.

పెండ్లికూతుర్ని గదిలో చాపమీద కూర్చోబెట్టారు. వచ్చినవారికి భోజనాలేర్పాటు చేశారు. పంక్తి భోజనాలన్నీ లక్షణంగా జరిగాయి. అందరూ వధూవరులను ఆశీర్వదించారు. పల్లెప్రజలు తెచ్చే కానుకలకంతేలేదు.

కూతుర్ని అప్పగింతలు చేసి తల్లి జానకి కండ్ల నీరు పెట్టింది. "పరాయివాళ్ళు కాదుగా, అందరూ అయినవారేగా! పిల్ల భర్త నీ తమ్ముడు. పిల్ల అత్త, మామ నీ తల్లి దండ్రులే కదా! విచారించకూడ"దని అందరూ సముదాయించారు. ఎవరెన్ని చెప్పినా కన్న తల్లికి అది సహజమే!

లక్ష్మికి ఆ వూరుకొత్తది కాదు. ఆ పల్లెలో పుట్టక పోయినా తాతగారింట్లోనే పెరిగింది. చిన్నతనంలో తనూ, సూరిమామ కలిసి ఎదురుగుండా వున్న ఇసుక దిబ్బలమీద ఆడేవారు. చూచినవాళ్ళంతా "లక్ష్మి" సూరిగాడి పెండ్లామనేవారు. అట్లా అన్నప్పుడల్లా తను కోపంతో అలిగి కూర్చునేది. "'లక్ష్మి' నిన్ను నే పెండ్లి చేసుకోనుతే!" అంటూ గడ్డం పట్టుకుని సూరిమామ బ్రతి మాలేవాడు. అతని ముఖం చూచి చిలిపిగా నవ్వేది తను. ఆ అలక, కోపం, అదృశ్యమయిపోయేవి. గదిలో కూర్చుని ఆలోచిస్తూ ఉన్న లక్ష్మి తనలో ఉప్పొంగి పోయేది.

బంధువులంతా వెళ్ళిపోయారు. ఇంటి పెత్తనమంతా అత్తమ్మే చేసేది. చిన్న చిన్న పనులు లక్ష్మి అందుకునేది. అత్తమ్మ అని ఒకసారి, అమ్మమ్మఅని ఒకసారి కొంటెగా పిలిచేది. రామూ లక్ష్మికి మరిది. పల్లెటూరిలో చదువు తున్నాడు. వదిన అంటే చాలా ప్రేమ. వదిన వళ్ళో పడుకుని చిన్న చిన్న కథలు చెప్పమనేవాడు.

లక్ష్మి కాపురానికొచ్చి యేడాది గడిచింది. ఒక రోజున రామూ పరిగెత్తుకుని వచ్చి "వదినా నేను పట్నం పోతున్నా చదువుకోడానికై తెలుసా!" అని అడిగాడు.

"ఎవరన్నా"రని ప్రశ్నించింది లక్ష్మి.

"సూరన్న పంపిస్తానన్నాడు. నేను పెద్ద చదువు చదువుకుంటానన్నా గా!" అంటూ చిరునవ్వులు కురి పించాడు రామూ.

"అలాగే లే! బాగా చదువుకోవాల పెద్దవాడివైతే నన్ను మర్చిపోవుకదూ!" అన్న లక్ష్మికి, "ఫో! వదినా! నీవెప్పుడూ ఇంతే!" అంటూ పోయాడు రామూ!

"ఏమిటి మరిదిగారితో వేళాకోళాలాడుతున్నావే" అంటూ ప్రశ్నించాడు సూరి.

లక్ష్మి భర్తను చూచి "ఏమీలేదు — రామూని పట్నం పంపిస్తున్నారటకదూ!" అన్నది.

"అవును. ఇక్కడుంటే వాడికేమొస్తుంది. నాకొచ్చి నంతే వస్తుంది. అందుకని పట్నం పంపిస్తున్నా"నన్నాడు.

"మీకేం మహారాజులు!" కొంటెగా అతని ముఖం లోకి చూస్తూ అన్నది లక్ష్మి.

"నేను మహారాజునైతే, మరి తమరేమవుతారు." నవ్వుతూ అంటున్న సూరికి— "ఒరేయ్ సూరి" అన్న పిలుపు వినిపించి వెనక్కి తిరిగి చూచాడు.

తల్లి వెంకమ్మ యేమిటో చెప్పడానికై వస్తుంది. ఆమె రావడం చూచి అక్కణ్నుంచి మెల్లిగా జారుకుంది లక్ష్మి.

"ఏంటమ్మా ?" అని తల్లిని సూరి ప్రశ్నించాడు.

"లక్ష్మికి మూడో నెలరా !" అంటూ చిరునవ్వుతో అటూ ఇటూ చూచి "లక్ష్మి ఏదిరా" అని అడిగింది వెంకమ్మ.

"ఇప్పు డిక్కడే వుందిగా! ఎక్కడికి వెళ్ళిందో" చిరునవ్వుతో అంటూ వెనక్కి తిరిగి— "అదిగో తలుపు దగ్గిర" అంటూ అక్కణ్నుంచి వెళ్ళిపోయాడు సూరి. అత్త చూడడం చూసి సిగ్గుతో తలుపు మూసుకుంది లక్ష్మి.

తొమ్మిది నెలలూ మోసి లక్ష్మి పండులాంటి మొగ బిడ్డను కన్నది. లక్ష్మీదేవికి మన్మధుడు పుట్టినట్లుగా పుట్టాడు మగబిడ్డ. ఆ కొడుకుని చూచి "సూరి ! అంతా తల్లి పోలి కేరా చాలా అదృష్టవంతుడు" అన్నది తల్లి. ఆమాటలు విని సూరి చాలా పొంగిపోయాడు.

ఆ పసివానికి "సీతాపతి" అని నామకరణం చేశాడు. కాలం దొర్లిపోతోంది. 'సీతాపతి' వచ్చీరాని మాటలతో ఇటు అమ్మనీ నాన్ననీ అటు తాతనూ అవ్వను మురిపిస్తు న్నాడు. తప్పటడుగులతో ఇల్లంతా తిరుగుతుండేవాడు. ఆ బిడ్డను చూచి అందరూ ఆనందపడేవారు.

సీతాపతికి మూడవ యేడు. లక్ష్మికి మళ్ళీ రెండవబిడ్డ. ఆపసివాని పేరు 'గంగారావు.' తమ్ముడు రామూరావుకు వివాహం చెయ్యాలని అన్న సంబంధం చూట్లాడాడు. ఇంక రెండు సంవత్సరాలలో తమ్ముడి చదువు పూర్తవుతుంది. పెండ్లిచేసి బాధ్యత తీర్చుకోవాలనుకున్నాడు. పరాయి మనువే అయినా కలిగినవాళ్ళ యింటి పిల్లను తెచ్చాడు. పెండ్లి వైభవంగా జరిగింది.

కాలం గిర్రున తిరిగింది. రామయ్య అతని భార్య కాల సముద్రంలో కలిసిపోయారు. పెద్దవాళ్ళు పోవడంవల్ల ఇంటి బాధ్యతలన్నీ కొడుకుమీద పడ్డాయి. అత్త మామలు

పోయినందుకు లక్ష్మి చాలా దుఃఖించింది. ఇంతకాలం పెద్ద వాళ్ళ చాటుననుండి తన జీవితాన్ని గడిపింది. ఇప్పుడే ప్రపంచంలో అడుగు పెట్టింది. తమ్ముడి రామం చదువు పూర్తయింది. తాసీల్దారుగా పనిచేస్తున్నాడు. స్థిరంగా ఒక ఊరిలో ఉండే సంసారం కాదు. వాళ్ళ సంపాదనతో వాళ్ళ సంసారం గడుస్తోంది.

సీతాపతికి పది సంవత్సరాలు. చాలా చురుకైనవాడు. తమ్ముడితో కలిసి బడికివెళ్లేవాడు. ఆపల్లెలో ఐదవతగరతి వరకే ఉన్నది. అందుచేత సీతాపతి అమ్మమ్మ వాళ్ల ఇంటికి పంపించారు. తెలివయిన వాడు కావడంవల్ల త్వరత్వరగా పైకి వస్తున్నాడు. స్కూల్లో ఉపాధ్యాయుల ప్రేమకు పాత్రుడయినాడు. పిల్లలు కూడా సీతాపతినే ప్రేమించి కలిసి ఆడేవారు.

## 3

ఆసంవత్సరమే క్రొత్తగా ఆస్కూల్లో అడుగు పెట్టాడు రంగా. తమ్ముడికి క్రొత్తగా ఉండడం వల్ల అన్నతో విడవకుండా తిరిగేవాడు. క్రమక్రమంగా ఆవాతావరణానికి రంగా కూడా అలవాటు పడ్డాడు.

సీతాపతి బి. ఎల్. చదువుతున్నాడు. ఆఖరి సంవత్సరం పరీక్షలు వ్రాసి ఇంటికి వస్తున్నామని కొడుకు వ్రాసిన ఉత్తరం చూచి లక్ష్మి చాలా ఆనందించింది. తన అంత అదృష్టవంతురాలు లేదనుకున్నది. కొడుకు బాగా సంపాదిస్తే తనకేమి కొదవ. చిన్నకొడుకు కూడా ఇంటర్ చదువుతున్నాడు. ఇంక నాలుగు సంవత్సరాలలో చిన్నవాడు కూడా చేతికొస్తాడు. తనకేమి కొదువ. అటువంటి రత్నాలను కన్నందుకు తనకు తానే గర్వించింది.

శలవలిచ్చారు. రావడమే తల్లికి ముందు నమస్కరించాడు సీతాపతి. కొడుకుని కౌగలించుకుంది. ఏమి దీవించాలో తెలియలేదు. కాని రెండు అశ్రుకణాలు ఆ పిల్లవాని నెత్తిన పడ్డవి. చల్లగా తగిలేటప్పటికి తలెత్తి తల్లి ముఖం చూచాడు సీతాపతి. ఇన్నాళ్ళు చూడనందుకని చిరునవ్వుతో తల్లి కండ్లను తుడిచాడు సీతాపతి.

ఎండలు తీవ్రంగా ఉన్నవి. అటునుండి ఇటు ఈడ్చీడ్చి గాడ్పు కొడుతూంది. ఆ యెండలో తండ్రి పొలానికి పోనపం చూచి మేముకూడా వస్తామన్నారు అన్నదమ్ములు. ఎండగా ఉన్నది వద్దన్నాడు తండ్రి బిడ్డలు కందిపోతారన్న భావంతో. 'ఇంతమాత్రానికే కందిపోతామా నాన్నా' అన్నాడు సీతాపతి.

"ఫరవాలేదు తీసుకెళ్ళండి" భర్తనుద్దేశిస్తూ అన్నది లక్ష్మి.

ఆ మిడి ఎండలో తండ్రీ బిడ్డలు బయలుదేరారు. బస్తీలో చదువుకునే వాళ్ళు పోతున్నారని వింతగా వాళ్ళని చూస్తున్నారు ప్రజలు. వాళ్ళను వింతగా చూస్తూంటే వాళ్ళను మరీ పరీక్షిస్తూ బయలుదేరారు అన్నదమ్ములు.

"ఎక్కడికండి చినబాబులు కూడా దయచేస్తుండారే?" అని ఒకరు ప్రశ్నించారు.

"ఆ పొలానికేలే" అన్నాడు సూరి.

"వీళ్ళకెందుకో మధ్య" చిన్నగా అన్న చెవిలో ఊదాడు రంగా.

పోనీలే అన్నట్లుగా మందలించాడు తమ్ముణ్ణిఅన్న.

కపర కపర చీకటి పడుతుందనగా ఇంటికి చేరారంతా. కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళిచ్చింది లక్ష్మి. ఆరాత్రి సీతాపతి సరిగ్గా భోంచెయ్యలేదు. తల్లి అడిగేమనగానే 'ఆకలి లేదన్నా'డు సీతాపతి.

మరునాటికి 'సీతాపతికి' ముమ్మరంగా జ్వరం వచ్చింది. తల్లి చాలా కంగారుపడింది. పిల్లవానికి దిష్టితగిలిందేమోనని దిష్టి తీసింది. కాని జ్వరం తీవ్రంగా ఉన్నది. ఊళ్ళో నాటువైద్యులచేత మందిప్పిస్తున్నారు. జ్వరం తిరుగుముఖం పట్టలేదు. మూడవ రోజుకు వంటిమీద అమ్మవారు చూపెట్టింది చుట్టుప్రక్కల వాళ్ళంతా ఊళ్ళో అమ్మవారున్నదన్న సూచనిచ్చారు.

ఆమాటలతో ఆతల్లి హృదయం తల్లడిల్లింది. పైకి కనపర్చకుండానే బిడ్డకి సేవ చేస్తోంది. మంచంలో సీతాపతి చాలా బాధపడుతున్నాడు. తల్లీ దండ్రికి కంటిమీద కునుకు లేదు. "ఈరోజు గడిస్తే కొడుకుబ్రతికినట్లే" అని చెప్పాడు వైద్యుడు.

ఆరాత్రి చాలా భయంకరంగా ఉన్నది. మృత్యుదేవత సూరయ్య యింట్లో తాండవిస్తున్నట్లుగా ఉన్నది.

సీతాపతికి ఎగ శ్వాస ఆరంభించింది. అతని బాధను చూడ లేక తమ్ముడు మారంగా ఉన్నాడు. తల్లి బిడ్డ కోసం భగవంతుని ప్రార్థిస్తూంది. మగతలో ఉన్న సీతాపతి మెల్లగా కళ్ళు తెరచాడు. తమ్ముణ్ని దగ్గరకు రమ్మన్నట్లుగా చూచాడు. ఆ చూపులో భావాన్ని గ్రహించి రంగ అన్నవద్దకు వచ్చి నిలబడ్డాడు. తమ్ముడికి తల్లీ దండ్రిని చూపించి శాశ్వతంగా కన్ను మూశాడు. ఆ యింట్లో సన్నగా వెలిగే దీపం కొండెక్కింది.

దినవారాలు అయిపోయినవి. కొడుకు పోయాడన్న దిగులుతో తల్లి మంచం ఎక్కింది. కాని భగవంతుడు ఆ మాతృమూర్తిని తీసుకుపోలేదు. ఆమె ప్రపంచంలో ఇంకా యేమేమి అనుభవించాలో యెవరికి తెలుసు? ఆమె జీవితం యెట్లా సాగుతుందో ముందు ముందుకు. దేవునిదయవల్లనో లేక వైద్యుని చలవవల్లనో ఆమె ఆ యింట్లో లేచి నడవ సాగింది. కాని మునుపటి లక్ష్మి కాదు. ఆమె ముఖంలో చిరునవ్వు మాయమయిపోయింది.

## 4

రంగా కాలేజీలో ప్రవేశించాడు. ఇప్పుడు వంటరివాడు. కాలేజీలో రోజులు చాలా తొందరగా సాగిపోతున్నవి.

కాలం గిర్రున తిరిగింది. రంగారావు బి. ఏ. చదువుతున్నాడు. చిన్నకొడుకుని చూచి ఇప్పుడిప్పుడే విచారాన్ని మరచిపోయింది. గతాన్ని తలుచుకుని బాధపడేకన్నా మరచిపోవడం మేలనుకున్నది. చిన్నకొడుకైనా వెయ్యేళ్ళు జీవించాలని ఆమె కోరిక.

ఆరోజు పండుగ. పల్లెంతా పండుగలో మునిగి తేలుతోంది. కాని సూరయ్య ఇల్లు మాత్రం చిన్నబోయిఉన్నది. లక్ష్మి మామూలుగా పనిపాటల్లో లీనమయి ఉంది.

ఇంతలో యెవరో వైర్ వచ్చిందని చెప్పారు. సూరయ్య చేతిలోనికి తీసుకున్నాడు. కాని వైర్ చదివి అర్థం చేసుకునేంత చదువు చదువుకోలేదు. కరణంగారి అబ్బాయి చేతికిచ్చి చదివించాడు. "రంగాకు కారు ప్రమాదం జరిగింది. వెంటనే రావలసిందని" వ్రాసి ఉన్నది. అది వినగానే ఆ దంపతుల నెత్తిన పిడుగు పడ్డట్లయింది. వెంటనే బస్తీకి బయలుదేరారు.

ఆస్పటల్ లో రంగారావు మంచంమీద స్పృహలేకుండా ఉన్నాడు. ఒకటే కలవరిస్తున్నాడు. "అన్నా! నేనుకూడా నీదగ్గర కొస్తున్నా" అని. కొడుకుని చూడగానే తల్లి నిర్ఘాంతపోయింది. డాక్టరు లాభం లేదని చెప్పాడు. ఆ సాయంత్రమే అతగాడి ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసిపోయాయి. కొడుకు పోయాడని వినగానే తల్లి కండ్లనుండి రెండు బిందువులు జారి కిందపడ్డాయి. అంతే ఆమె ఇక స్థాణువులా నిలిచిపోయింది.

సూరయ్య కుప్పకూలినట్లుగా కూలిపోయాడు. చేతికి అందుతూ ఉన్న ఫలాలను యెవరో బలవంతాన లాక్కున్నట్లయింది. దహన కార్యక్రమాలను తీర్చి యింటికి చేరారు.

అడుగు పెడుతూనే సూరయ్య వాకిట్లో పడిపోయాడు. తమ్ముడు రామూ అన్న దుస్థితి చూచి విచారించాడు తన అన్నా వదినలకు యేవిధంగా ఆత్మశాంతి చేకూరుస్తాడు. వారం రోజులనుండి అన్న మంచమెక్కి ఉన్నాడు. రామూ ఆఖరి కొడుకైన రఘూను తెచ్చి అన్న చేతిలో పెట్టాడు. రఘూని మీ బిడ్డగా భావించి మీ దుఃఖాలను మర్చిపొమ్మన్నాడు. రఘూకు 16 సంవత్సరాలు. స్కూలు ఫైనలు నాలుగు సార్లు దండయాత్ర సాగించి విసిగి చదువు మానేశాడు. ఇక ముందునుంచీ రఘూకు తల్లీదండ్రీ లక్ష్మి సూరయ్యలే. ఆ బిడ్డను చూచి సూరయ్య క్రమంగా కోలుకున్నాడు. అది ఆపిల్లవాని అదృష్టం. సూరయ్య మనసబుగిరీ రఘు హస్తగతం అయింది.

## 5

రఘూకు ఇరువది సంవత్సరాలు పెంపుడు తల్లి లక్ష్మి తన తమ్ముడి కూతురైన రత్నాంగిని తెచ్చి రఘూకిచ్చి పెండ్లి చేసింది. పెండ్లయిన వారంరోజులకే సూరయ్యకు జ్వరం తగిలింది. ఆ జ్వరం యింక తిరుగు ముఖం పెట్టలేదు. దాన్ని టైఫాయిడ్ అన్నారు వైద్యులు. అంత్య సమయంలో లక్ష్మిని పెంపుడు కొడుకు రఘూ చేతుల్లో పెట్టాడు. అంతే అతను ఈ ప్రపంచంతో సంబంధం లేకుండానే వెళ్ళిపోయాడు.

పుత్రశోకమే కాకుండా భర్తృశోకంకూడా వెంటాడింది లక్ష్మికి. సంసారంనుండి విముక్తి పొందాలనుకున్నది. అది ఆమెకు సాధ్యం కావటంలేదు. అందరి ఆయుస్సుపోసుకుని యింకా జీవించి ఉన్నది. కొడుకూ, కోడలి చీదరింపులు తప్పలేదు. రత్నాంగికి కొడుకు పుట్టాడు. వాడి పేరు "సీతయ్య" తన కొడుకుపేరే. మనవణ్ని చూచుకుని ఆమె కొంత మనశ్శాంతి పొందగలిగింది. ఆమె జీవితమంతా దుఃఖమే! జీవితమంటే ఆమె ముందు ముందు యేమనుకున్నదో కాని ఇప్పుడిప్పుడు జీవితమంటే నరకం అనుకున్నది. తనలాంటి నిర్భాగ్యురాలెవరైనా ఉన్నారా? చేతికందిన కొడుకుల్ని పోగొట్టుకుని గర్భశోకంతో, భర్తను పోగొట్టుకుని వైధవ్యంతో, పెంపుడు కొడుకూ కోడలు చీదరింపులతో ఆమె కానంపంలేదు. కాని పోరాడుతూ మధ్య మధ్య సన్నని చిరునవ్వులు విసిరే మనుమణ్ని చూస్తే ఆమె కెక్కడలేని ఆనందం. అదే జీవితంలో చిట్ట చివరకూ మిగిలిన ఆశాఫలం. అదే ఆధారంగా కాలాన్ని వెళ్ళబోసుకుంటూ గడిపేది నిర్భాగ్యురాలయిన లక్ష్మి.






# కాలప్రవాహంలో - మానవుని నౌకాయాత్ర

"కాలమా, ఎంతవేగంబు గలదునీకు ! - యుగయుగంబుల క్షణములో నుత్తరించి -
పరగువారెడు నినుబట్ట పగ్గములు- గలవె నీరూపు దెలియగలరె నరులు ;
రేలుబవలును గల్పింపజాలు సూర్య - చంద్రులే నీదుగతి నడ్డజాల ;
రౌర ! యీవెద్దైవంబవో కాక నిన్నునెమ్మి - గల్పనముచేసి నడపెడు ఘనుడుగలడా :"

---

సువిశాలమైన ఈప్రపంచ సృష్టి ఏనాడు జరిగిందో ఏనాడు ఆరంభమయిందో - ఏవిధంగా ఆరంభమయిందో ఎవరూ ఏవిధంగానూ యిదీ అని ఒక ఖచ్చితమయిన పద్ధతిలో — సుస్పష్టంగా ఈనాటివరకూ చెప్పలేకుండా వున్నారు. కాని, చెప్పలేకపోతున్నారూ అంటే అర్థం తెలుసుకోడానికి కృషి జరగలేదని, కృషి జరగడం లేదనీ కాదు యిక్కడ అర్థం చెప్పుకోవలసింది: మానవుడు భూమిమీద అడుగు పెట్టింది మొదలు - అంటే జంతుదశ నుంచి మానవదశలోకి అడుగిడింది మొదలు - నాటి నుండి నేటివరకూ కృషి సాధన చేస్తూనే వున్నాడు - గంట గంటకూ - రోజురోజుకీ తన కృషిలో విజయాలను సాధిస్తూ, ఒక్కొక్క అడుగే ముందుకు వేస్తూనే వున్నాడు. అంతేకాదు: నిన్నటి అనుభవాలను ఈ నాటి కృషియొక్క ఫలితాలతో జతపర్చి రేపటి విజయం కోసం మానవాతీతమయిన ప్రకృతి శక్తులతో పోరాడుతున్నాడు- పోరాడడమేకాదు- మానవుడు సాధించలేనిది ఏదీ లేదని నిరూపిస్తున్నాడు కూడా.

ఈనాటి వరకూ భూగోళశాస్త్రజ్ఞులు సాగించిన కృషిని బట్టి - ఊహకు మించిన వైశాల్యంతో కొన్ని కోట్ల గోళాలు ఒకదానినొకటి ఆకర్షించు కుంటూ, కోట్ల లక్షల- యింకా ఎక్కువమైళ్ళ దూరంలో వున్నాయనీ - ఒకదాని ఆకర్షణశక్తితో ఒకటి ఆకాశంలో నిలబడి వున్నాయనీ భూగోళశాస్త్రకారులు వారు చేసిన కృషి - ప్రయోగాల మూలంగా చెబుతున్నారు.

ఇలాంటి అనంతకోటి బ్రహ్మాండాలలో ఒకటైన - మనం నివశించే భూఖండం, సూర్యకుటుంబంలోని గోళం అంటారు.

ఒకదానినొకటి ఆకర్షించుకుంటూ - ఒకదాని చుట్టూ. మరొకటి తిరిగే గోళాలలో భూమి ఒకటి. మనం నివశిం

---

"ఎల్లోరా"

---

చేదీ, మనం ప్రధానంగా చూచేదీ భూమికనుక ఆభూమినే ప్రధాన గోళంగా భావిస్తున్నాము. మిగిలినవాటిని - అంటే, సూర్యుడు, చంద్రుడు, కుజుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, శని, రాహువు, కేతువులను గ్రహాలుగా పరిగణిస్తున్నాము.

మనకు పెద్దగాను, చలనం ఎక్కువకలవిగాను కనబడే వాటిని గ్రహాలని చిన్నవిగా కనుపించే వాటిని నక్షత్రాలని మనం పరిగణిస్తున్నాము. ఈ పైచెప్పిన గ్రహాలన్నింటినీ మొత్తం సంవత్సర కాలంలో - ఏదో ఒక సమయంలో ఆకాశంలో చూస్తూనే వున్నాము–రాహు కేతువులను తప్ప.

భూమి :– ముందర అనంతకోటి బ్రహ్మాండాలలో ఒకటి అయిన భూమినిగురించి కొంచెం తెలుసుకుందాము;

ఇది ఏనాడు - ఎప్పుడు సృష్టించ బడిందో చెప్పడం చాలా కష్టమయినపని. కాని భూగోళశాస్త్రజ్ఞులు అనేక విధాల పరిశోధనలు చేయగా చేయగా భూసృష్టి జరిగి సుమారు 300 కోట్ల (మూడువందలకోట్లు) సంవత్సరాలలోపు అయివుంటుందనీ - 150 కోట్ల (నూటఏభై) సంవత్సరాలకు తక్కువ కాలేదనీ చాలామంది శాస్త్రజ్ఞులు అంచనాలు కట్టారు - దీనితో - అంటే యీ అంచనాలతో చాలామంది శాస్త్రకారులు ఏకీభవించారు కూడా.

మొట్ట మొదట భూగోళంమీద జీవరాసులు ఏమీలేవు. కాని సూర్యుని ప్రభావంవల్ల - అంటే సూర్యుని కాంతి వలన భూమిమీద రానురాను జలచరాలు, భూచరాలు వుద్భవించాయి. ఉద్భవించడం అంటే జరిగింది కాని, వాటికి ఒకరూపము - పరిణామము రావడం - క్రమంగా అంటే రానురాను మానవరూపం జనించడం అనేది జరిగి యిప్పటికి సుమారు ఒకలక్ష (1,00,000) సంవత్సరాలు అయివుండ వచ్చునని భూశాస్త్ర పరిశోధకుల అంచనా.

మానవుడు జంతుదశలోంచి మానవదశలోకి మారినా చాలాకాలం పశుప్రాయుడుగానే వుండి పోయాడు. కాని, కాలక్రమేణా - అంటే రానురాను జంతుదశనుంచి మానవ దశలోకి అడుగిడడమే కాకుండా ముందుకు అడుగిడడం ప్రారంభించాడు. రాళ్ళను ఆయుధాలుగా చేసుకుని ఆరాళ్ళ తోనే జంతువులను చంపి పచ్చిమాంసాన్నే తినడం - ఆ పచ్చితోళ్ళనే ధరించడం నేర్చుకున్నాడు. ఇది యించుమించుగా యిరవై వేల (20,000) సంవత్సరాలకు పూర్వం అని అంచనాగా చెబుతున్నారు.

మానవుడుగా మారి క్షుత్బాధ తీర్చుకోవడం కోసం తనకు తనే - ఒంటరిగా వుంటూ కాలం గడిపిన ఆ ఆది మానవుడే కాలప్రవాహంలో యింకో కొంచెం ముందుకు వెళ్ళేటప్పటికి - ఏకాకితనం వదలి - సమిష్టిగా, గుంపులుగా చేరి వేటాడి ఆహారం సంపాదించుకోవడం - ఒకే చోట జీవించడం మొదలు పెట్టాడు. రానురాను అంతటితో ఆగకుండా కట్టెలకు ముక్కులుచెక్కి భూమిని దున్నడం - ఆవిధంగా ఆహారాన్ని సంపాదించడంవరకూ రాగలిగాడు. అదియించు మించు ఒకలక్ష (1,00,000) సంవత్సరాలు అయివుంటుందని శాస్త్రజ్ఞుల బలమయిన అంచనా.

కాని, నేడు అనేక రకరకాలయిన పద్ధతులలో, నాగరికతతో - ఆచారవ్యవహారాలతో - కట్టుబాట్లతో, వివిధ రకములయిన బేధాలతో కూడిన సంప్రదాయాలతో - మానవుడు భూమి నాలుగు చెరగులా నివశిస్తున్నాడు - మసలు తున్నాడు.

మానవ పరిణామదశలు :— మానవుడు మొదటి స్వరూపం. వానర స్వరూపమని పరిణామ వాదం చెబుతుంది. మొట్టమొదట కోతిదశయే మానవుని మొదటి స్వరూపమని పరిణామవాదం కనిపెట్టిన "డార్విన్" సిద్ధాంతం చెబుతుంది. ఆవానరుడే రానురాను నరుడుగా మారాడని డార్విన్ పరిణామవాదులు బలమయినసిద్ధాంతం.

దశావతారములు - మానవ స్వరూపం : - మానవుని మొదటి స్వరూపమును గురించి యింకొక విషయం కూడా చెబుతారు. మానవుని పరిణామ క్రమమే దశావతారాలు అని. మొట్టమొదట మానవుని దశను యీదృష్ట్యా చూస్తే మత్స్యం అనుకోవలసి యుంటుంది.

"మత్స్య కూర్మవరాహశ్చ, నారసింహశ్చ వామన
రామోరామశ్చ, బౌద్ధకల్కి మేవచ"—

అనే దశావతార శ్లోకంకూడా ఈ పరిణామ సిద్ధాంతాన్నే సూత్ర ప్రాయంగా సూచిస్తుంది.

మొత్తంమీద ఈ జంతులక్షణాలు మానవుడిలో ఏదో సమయంలో - ఏదో రూపంలో కనుపిస్తూనే వుంటాయి. నాడు మానవుణ్ని మానవుడు చంపుకుతిన్నాడు. - దాన్ని

మనం పశుత్వం అన్నాము. కాని నేడుకూడా తోటిమాన వుడ్ని తోటిమానవుడు పీల్చుకు తింటున్నాడు. - అదే కాదు నిలువునా కాల్చి చంపుతున్నాడు. దీన్ని - అంటే ఈ చర్యను ఏమనాలి? పశుప్రాయత్వాన్నివీడి, రాక్షసత్వం లోకి సాగేడా — ఆధునిక మారణ యంత్రాలతోటి?

మానవుడు - కాలము :- మానవునితోపాటు కాలము: కాలంతోపాటు మానవుడూ మార్పు చెందుతు వచ్చాయన గలమా?

నాడు, అంటే సుమారు ఒకలక్ష సంవత్సరాల క్రితం రాతికి ముక్కులు చెక్కి యివే మారణాయుధాలని ఎగిరి గంతేసిన మానవుడే. నేడు ఆటం - హైడ్రోజన్ లాంటి భయంకర మారణాయుధాలను కనిపెట్టి ప్రపంచాన్నే గడ గడ లాడిస్తున్నాడు. నాడు నిప్పుకోసం రాయీ రాయీ రాపాడించి విసిగి వేసారిన మానవుడే. నేడు స్విచ్ నొక్కితే నిప్పు పుట్టించడమేకాదు, రాత్రినే ఒక్కసారిగా పగలుగా కాంతిమయం చేయగలుగు తున్నాడు - అంత కన్న యింకా నవీన పద్ధతులకోసం అహర్నిశలు కృషి - సాధన చేస్తున్నాడు. నాడు రోగంవస్తే ఏమందూలేక ఏమూలికనో నమిలి బాధతో నలిగి నలిగి చచ్చిన మాన వుడే నేడు ఉన్నగుండె చెడిపోతే వేరేగుండె తగిలించు కుంటున్నాడు - ఉన్నకన్ను చెడిపోతే వేరేకన్ను అతి కించుకుంటున్నాడు. నాడు పచ్చి చర్మాలు — పచ్చ ఆకులూ ధరించిన మానవుడే నేడు మిసమిస మెరిసే గ్లాస్కో పంచకట్టి నవ నాగరికతా - వ్యామోహనా - వివశుడై పోతున్నాడు.

ప్రకృతితో మానవుని పోరాటం : మనిషిని గజగజ ఒణికించి, నమిలి మింగేసే హిమాలయాలలో మానవుడు అడుగు పెట్టడమంటేనే ఆశ్చర్యం వేస్తుంది. అటువంటి హిమాలయ అగ్రపీఠమయిన "మౌంట్ ఎవరెస్ట్"ను అధిరోహించడానికి ఎన్నో సంవత్సరాలతరబడి- ఎంతో మంది జట్లు- ఎన్నో విధాల ప్రయత్నించి చూచారు. కాని ఏ కొలదిదూరం వెళ్ళగలిగారోకాని మొత్తంమీద కృత కృత్యులుకా లేకపోయారు. యిక కష్టమే అనుకున్నారు. ఎంతో మంది పడిపోయారు- అయినా సాధించి తీరాలనే పట్టుదలతో కృషి చేస్తూనే వస్తూన్నారు. అటువంటి హిమగిరిశృంగం— మౌంట్ ఎవరెస్టును నేడు భారతీయు డైన "టెన్‌సింగ్ నార్కే" ఎక్కి విజయం సాధించా డంటే నిజంగా గర్వించదగ్గ విషయం. అజేయమయిన ప్రకృతి శక్తులతో మానవుడు పోరాడి విజయం సాధిస్తు న్నాడు—రేపు సాధిస్తానంటున్నాడు.

"స్విస్ పరిశోధకుడు— ఆగస్టిపికార్డ్ "బాతిసాఫి" అనే యంత్ర సహాయంతో, మెడిటరేనియన్ సముద్రంలో 3. 150 మీట్ల (10, 335 అడుగులు) లోతుకు మునిగి వచ్చాడ"ని విన్నాం. ఆకాశం మీదికి ఎక్కడానికి ప్రయ త్నించి విజయం సాధించినప్పుడు ఆశ్చర్యపడిన మనము అదేమాదిరిగా సముద్రం లోభాగానికి మానవుడు వెళ్ళా డంటే మళ్ళీ ఆశ్చర్యపడుతున్నాం.

బ్రిటిష్ వైజ్ఞానికుడు- విల్కిన్స్ అనే అతను చంద్ర బింబం అవలిప్రక్క ఏముందో కనుక్కోవడం కోసం చాలా కాలంగా కృషి చేసిచేసి అవలి ప్రక్క పటాన్ని (మ్యాపును) ప్రకటించాడట. చంద్రబింబం అవలి ప్రక్క ఏమున్నదో ఊహించడం తప్ప ప్రత్యక్షంగా చూసే అవకాశం లేదని మానవుడు స్పేస్ నౌక సహాయంతో చంద్రమండలంలో అడుగు పెట్టగలిగి నప్పుడే అట్టి అవకాశం కలుగుతుందని ఆ సమయంలో తను తయారు చేసిన మ్యాపు చాలా వుపయోగపడుతుం దనీ విల్కిన్స్ అంటున్నాడు.

హేమగిరిశృంగంలోని మౌంట్ ఎవరెస్ట్ శిఖరం కంటె ఎత్తైన శిఖరం ఒకటి చంద్ర మండలంలో కలదని, దాని నానుకొని అతి విశాలమైన సముద్రమో, మైదానమో కలదనీ కూడా చెపుతున్నాడు. దానికి తార్కాణంగా చంద్ర బింబంలో కనుపించే మచ్చకు కారణమంటున్నాడు. ఈ విషయం "కాంతి కిరణాల" ప్రసారస్వభావం ద్వారా ఆయన కనుగొన్నాడుట.

చంద్రమండలానికి టిక్కట్లు అమ్మడం, ఒక విద్యార్థి టికెట్ బుక్‌చేసుకున్నాడని విన్నాం!

అగమ్యమైన కాల ప్రవాహంలో నౌకాయాత్ర గావి స్తున్న మానవుడు ప్రకృతితో పోరాడి అనేక విజయాలు సాధిస్తూ తన శాస్త్రపరిశోధనల కృషి ఫలితంగా ఆటంలో అణిగియున్న ప్రచండ శక్తిని బయటికి తీసేడు! పూర్వం ఒక కథ ఉంది. ఒక బ్రహ్మరాక్షసిశక్తి, గట్టి పెట్టిలో తాళం వేయబడి ఉంటే— దాన్ని బయటికి విడిచేడట ఒక వెఱ్ఱి బ్రాహ్మణుడు; ఆతణ్ణి మింగుతానని బయలుదేరింది

బ్రహ్మరాక్షసి! ఏమిటి గత్యంతరం? దాన్ని మళ్ళీ పెట్టిలోకి పంపి, బంధించి, మరి నీ జోలికి నేను, నా జోలికి నీవు రావద్దని ఐనా అనాలి, లేదా దాన్ని తన అదుపాజ్ఞల్లో ఉండే టట్లు ఐనా చేయాలి! ప్రస్తుతం మానవుని స్థితీ ఇలాగే ఉంది! తన ఆటంబాంబులు హైడ్రోజన్ బాంబులు తన్నే నాశనం చేస్తానంటున్నాయి!

మానవుని కృషి ఎప్పుడూ మానవాభ్యుదయం కోసం జరగాలి గాని, మానవజాతి నిర్మూలనానికి మారణ యంత్రాల నిర్మాణంలోకి దిగరాదు. కష్టపడి ఆర్జించిన జ్ఞానాన్ని మానవ శ్రేయస్సు కోసరం వినియోగించి ముందుకు సాగిపోవాలి గాని, పర పీడనకు ఆత్మ వినాశా నికి దారి తీయరాదు. చెప్పే దేమిటంటే దేన్నయినా సద్వి నియోగం చేయడం కొరకే సదాయత్నించాలి. చూడండి; ఒక కత్తిని తయారుచేసి, దానితో పరుల పీకా, తన పీకా కూడ నరుక్కోవచ్చు! లేదా దానితో మామిడిపండు కోసి నలుగురికీ పంచిపెట్టావచ్చు! ఔనంటారా కాదంటారా? ఇదే భారత సోదరుడు తోటి సోదరుడికి యిస్తున్న సలహా. విన్నాడా-సంతోషం. వినడా-ఫలింత అనుభవిస్తాడు.

ప్రస్తుతంలో ఇక్కడికి జేరింది- కాలప్రవాహంలో మానవుని నౌకాయాత్ర! ముందే ముందో మనకెలా తెలు స్తుంది? "కాలానికి కళ్ళెం వేస్తాం" అని కొందరంటుంటే -కాలమే అన్నిటికీ కళ్ళెం వేసి నడిపిస్తూఉందేమో! ఉదా హరణకు చూడండి: కొందరు పేకాటలు వగైరాలాడి "కాలాన్ని చంపుతున్నాం" (Killing time)అని భ్రమ పడవచ్చుగాని యదార్థానికి జరిగేదేమిటి? కాలమే అందర్నీ చంపుతూవుంది. కాల గర్భంలోనే అన్నీ యిమిడి ఉన్నాయి. అందుకే మహా విజ్ఞాన నిధులైన మన ఋషు లేమన్నారో చూడండి:

"కాలాత్ స్రవన్తి భూతాని, కాలా ద్వృద్ధిం ప్రయాన్తిచ॥
కాలే చాస్తం నియచ్ఛన్తి కాలో మూర్తిర మూర్తిమాన్"॥
"కాలః పచతి భూతాని, సర్వాణ్యేవ మహాత్మని।
యస్మింస్తు పచ్యతేకాలో, యస్తంవేద సవేదవిత్"॥

ఆహా. ఎంతటి పరమసత్యాన్ని ఎంతటి హృదయంగ మముగ వచించేరు-మనపెద్దలు!

## నేషనల్ ప్లాన్ లోన్‌కు నగలిచ్చిన ప్రథమ నారీమణులు

స్త్రీలు తమవద్ద అనవసరంగా ఉండేనగలు అమ్మి, నేషనల్ ప్లానలోన్‌లో వడ్డీకి వేయడం మూలంగా దేశా భ్యుదయానికి తోడ్పడండని శ్రీమతి దుర్గాబాయిదేశముఖ్ గారు ప్రబోధించేరు. మధుర దగ్గర వసుమతై గ్రామవాసి శ్రీమతి దేవీబాయ్‌గారు (శ్రీ నారాయణదాసుగారి సతీమణి), వారికోడలు శ్రీమతి పుష్పాబాయ్ గారు- తమ నగలను పంజాబ్ నేషనల్ బ్యాంకుద్వారా విక్రయించి వచ్చిన మొత్తం రూ. 13.900 లు నేషనల్ ప్లాన్‌లోన్‌లో వడ్డీకి వేసేరు.

శ్రీమతి దుర్గాబాయిదేశము గారి ప్రబోధ ఫలితంగా ఇలా గావించిన ప్రథమ నారీమణులు వీరే. దేశానికిప్పుడు ఇలాంటి సేవాపరాయణు లెందరో కావలసియుంది. - బ్రహ్మాండమైన జాతీయాభ్యుదయ ప్రణాళికలు ద్విగిజ యంగా సాగించడానికి - అమెరికావారి ధనసహాయం కొంత తగ్గించడానికీను, దేశాభ్యుదయ కార్య క్రమంలో తోడ్పడ్డానికి ప్రతిస్త్రీకి ఇదొక గొప్ప అవకాశం గనుక - తప్పక అంతా ఈ మార్గాన్ని అనుసరించి తమ పూర్తి సహకారాన్ని యివ్వడం విధిమైయుంది.

★

# తెలుగు లిపి సంస్కరణ

## ముద్రణ — టైపురైటర్ లో చేయవలసిన మార్పులు

* శ్రీ గిడుగు వేంకటరామమూర్తి *

[ఈ వ్యాసము రచించిన శ్రీ రామమూర్తిగారు ముద్రణాలయములలో చాలా కాలంగా పని చేస్తున్నారు. కొన్నాళ్ళు అండర్ ఉడ్ టైపు రైటర్సుకు Agent గా పనిచేశారు. వీరికి యీ రెండు శాఖలలో గల అనుభవమే కాకుండా, పండిత వంశంలో పుట్టారు, వీరికి భాషాతత్వం కూడా తెలిసును. వీరి సలహాలను ఆంధ్ర ప్రభుత్వంవారు గుర్తించుతారని మేము భావిస్తున్నాము. సం॥]

———: o :———

భావాలను వ్యక్తపరచడానికి భాష; వాటిని భద్ర పరచడానికి లిపి ఉపయోగపడుతున్నాయి.

ఏ భాషయొక్క లిపిన్ని ఆదినుండి యింతవరకు ఒకే మాదిరిగా లేదు. ప్రతి భాషయొక్క లిపిన్ని సంస్కరణ పొందుతునే వచ్చింది. ప్రతి భాషలోను అక్షర స్వరూపం మారుతునే వచ్చింది. కాని ఆధునిక సౌకర్యాలలో ముఖ్యమైన ముద్రణ వ్యాప్తి చెందిన తర్వాత లిపి స్థిరత్వం ఏర్పరచుకొంది. మన తెలుగు లిపి కూడా మిగతావాటి వలెనే స్థిరంగా ఒక రూపును పొంది ఉండిపోయింది. ముద్రణ సౌలభ్యం కోసం బ్రౌన్ దొరగారు చేసిన ఒకటి రెండు మార్పులకన్నా ఎక్కువ మార్పులు మన లిపిలో ముద్రణ వచ్చిన తర్వాత కలుగలేదు.

ఇతర భాషలలో లిపి ముద్రణకు, టైపురైటరుకు వీలుగా ఉన్నాయి. కాని మన తెలుగు లిపి వీలుగా లేదన్న విషయం అందరూ ఎరిగినదే. ఇంగ్లీషు టైపు రైటరు ఎక్కువగా వాడుకలోనికి వచ్చిన తర్వాత తెలుగు కూడా ఒక టైపు రైటర్ను నిర్మించాలన్న సంకల్పం మన వారికి కలిగింది. అప్పటినుండి లిపిలో ఏ సంస్కరణను తీసుకువస్తే టైపు రైటరుకు వీలుగా ఉంటుందా అని చాలమంది ఆలోచిస్తూనే వచ్చారు. కొందరు కొన్ని సూచనలను చేశారు. కాని తుదకు లిపిలో ఏ మార్పులు లేకుండానే ఒక టైపు రైటరు నిర్మించబడింది. అంత వరకు మనం సంతోషించవలసిందే. ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది. ప్రభుత్వ వ్యవహారమంతా తెలుగులో జరుగ వలసి ఉన్నది కనుక తెలుగు టైపురైటరుకు పని కలిగింది. కాని ప్రస్తుతం నిర్మింపబడిన టైపు రైటర్ తో పని సులువుగాను, వేగంగాను జరగడంలేదు. కనుక లిపి సంస్కరణావశ్యకతను మన ప్రభుత్వం గుర్తించింది.

దేశ భాష లన్నింటిలోను తెలుగు లిపికి ముద్రణలో అక్షర సంఖ్య ఎక్కువ. అప్పటికి కొన్ని ఉచ్చారణలకు తగిన అక్షరాలు లేవు. ఈ లోపం ప్రతీ భాషకు ఉంది. ఎక్కువగా రోమన్ లిపిలో కనబడుతుంది. ఇంగ్లీషు భాషలో ఉచ్చారణకు తగినట్టుగా Spelling ఉండడం లేదు, Spelling ను అనుసరించి ఉచ్చారణ ఉండడం లేదు. కాని ప్రతి పదానికి ఒక Standard Spelling అంటూ ఉంది. మన తెలుగు వ్యావహారిక భాషకు ఒక Standard Spelling లేదు. లిపి సంస్కారంతోపాటు మనం Spelling కూడా ఒక నియమం ఏర్పరచుకో వలసి ఉంది.

జన సామాన్యం యొక్క నిత్యవ్యవహారాలకు ముద్రణ, టైపురైటరు వాడుక పడేటట్టు మనం లిపిని సంస్కరించాలి, దీనికి భాషావేత్తల సహకారం చాలా అవసరం. వ్యావహారిక భాషా వాదులు శకటరేఫ ఉండాలని పట్టు పట్టరు. కాని గ్రాంథిక వాదులు ఉండి తీరాలంటారు. ఈ శకటరేఫ ఎక్కడ వాడాలో చాలామందికి తెలియదు, కనుక దీన్ని ముద్రణలో ఉంచినా, టైపురైటర్ లో తీసివేయడానికి ఎవరూ అడ్డు చెప్పకూడదు. ఇటువంటి సంస్కరణల విషయంలోనే భాషావేత్తల సహాయం మనకు కావాలి.

అర్ధానుస్వారం వ్యావహారిక భాషలో పోయి యిప్పుడు మళ్ళీ బయలుదేరింది. 'అఁ' 'మావాఁ' మొదలయిన చోట వాడుతున్నారు. సందర్భాన్నిబట్టి ఎక్కడ ఏ పదాన్ని ఎలా ఉచ్చరించాలో మనకు తెలుసు యీ ఆచారం వాడు

కలో ఉంది. కనుక లిపిలోనుండి పోతున్న యీ అర సున్నను మళ్ళీ బలవంతంగా లిపిలో ఉంచవలసిన అవసరంలేదు.

ఇంగ్లీషులో ఉన్న 'F' కు సరైన తెలుగు అక్షరం లేదని, ఆ లోపాన్ని తీర్చడానికి కొత్తగా ఒక అక్షరాన్ని సృష్టించాలని కొంతమంది యీ మధ్య సూచనలను చేశారు. ఇంతవరకు మనం 'ఫ' ను ఉపయోగిస్తున్నాము. దానితో వ్యవహారం జరిగిపోతోంది. 'రేఫ' లో 'ఫ' యింగ్లీషు 'F' ఉచ్చారణకు సరిపోతున్నది. సందర్భాన్ని అనుసరించి 'ఫ' ను యింగ్లీషు 'F' మాదిరిగా పలక వచ్చును గనుక కొత్తగా ఒక అక్షరాన్ని సృష్టించి, కొత్త యిబ్బందుల్ని తెచ్చుకోవలసిన అవసరం ఏమీ లేదు. 'చ' 'చ' వేరు వేరుగా ఉన్నా మనం వాటిని వ్రాతలో పాటించడం లేదు. కాని పదముల ఉచ్చారణలో సందర్భానుసారంగా పాటిస్తున్నాము కదా ?

ఈ లిపి సంస్కరణ విషయంలో కొంతమంది గ్రాంథిక వాదులకు కొన్ని ఆక్షేపణలు, అభ్యంతరాలు ఉంటే ఉండవచ్చును. అటువంటి వారు యింకొన్నాళ్ళు యీ ప్రస్తుత లిపితోను, ముద్రణతోను, టైపు రైటరులోను వారి బాధలు వారు పడవచ్చును, సంస్కర్తలు వీరి విషయమై అట్టే బాధ పడనవసరం లేదు. కాని వీలయినంతవరకు ప్రస్తుతం ఉన్న లిపి స్వరూపాన్ని ఉంచుతూ, యంత్ర సౌకర్యానికి తగినట్టుగా లిపిని సంస్కరించాలి. కొన్ని యింగ్లీషు పుస్తకాలలో **Phonetic types, diacritical types** మొదలయిన వాటిని వాడవలసి ఉంటుంది, వీటిని నిత్యవ్యవహారాలలో పాటించరు, అందువల్ల యీ అక్షర దిమ్మలు అన్ని ప్రెస్సులలోను ఉండవు. ప్రత్యేకంగా కొన్ని ప్రెస్సులలో మాత్రం ఉంటాయి. టైపురైటర్లు కూడా ప్రత్యేకంగా ఉన్నాయి. అలాగే మన తెలుగు ప్రెస్సులలో కూడా కొన్ని టైపులను గ్రాంథిక భాష కోసమని ప్రత్యేకించి ఉంచుకోవచ్చును.

అక్షర స్వరూపం వ్రాతలో ఒక మాదిరిగాను, అచ్చులో యింకో మాదిరిగాను ఉండవచ్చును. అందువల్లనే యింగ్లీషుకు రెండు రకాల లిపి ఉంది. అచ్చుకొక లిపి, వ్రాతకు వేరొక లిపి ఉన్నాయి. మన తెలుగులో కూడా వ్రాతలో కొన్ని అక్షరాలు ఒక రూపంతోను, అచ్చులో యింకో రూపంతోను ఉంటున్నాయి. కాని మన తెలుగు టైపురైటరులో మాత్రం వ్రాతకు అనుగుణంగానే అక్షరాలను నిర్మిస్తే బాగుంటుంది. మనం క్రావడిని (' ్ర ') అక్షరం వ్రాసిన తర్వాతనే వ్రాస్తాము. కాని అచ్చులో ముందు పెడుతున్నారు. ముద్రణను అనుసరించి యీ క్రావడిని టైపురైటరులో కూడా పెడితే టైపు చేయడం కష్టమౌతుంది. అక్షరం తర్వాత వచ్చే క్రావడి '్ర' ఒకటి ఉంది. దీనినే ప్రస్తుతం టైపురైటరులో ఉంచారు. కాని యీ 'L' క్రావడి మాదిరిగానే '్ర' ఉంది దీన్ని కూడా ' ⌋ ' మాదిరిగా ఉండేటట్టు మారుస్తే బాగుంటుంది.

ముద్రణ విధానాన్ని, టైపురైటర్ను రెండింటిని మనసులో పెట్టుకుని, యీ రెండింటిని ఉపయోగించే పద్ధతులను తెలుసుకుని, రెండింటిలోని సాధక బాధకాలను గుర్తించి లిపిని సంస్కరించాలి. కొన్ని మార్పుల వల్ల ముద్రణకు, కొన్ని మార్పులవల్ల టైపురైటరుకు అనుకూలం కలుగుతుంది, కనుక యీ రెండు విధానాల మార్పులను సమన్వయ పరచి లిపిని సంస్కరించాలి.

టైపు రైటరుకు లిపినంతనూ 46 మెట్లలో కుదించాలి. ముద్రణలో అతుకులు లేకుండా ఏకాక్షర దిమ్మలను తయారు చేయాలి. మన లిపిలో ఉండే అక్షర సంఖ్యా విస్తారణ వలన యీ రెండింటికి పొత్తు కుదరడం లేదు, కనుక మనం ప్రస్తుతం ఒక రాజీ పద్ధతిని అవలంబించాలి.

ప్రస్తుతం మనకు ఒక టైపు రైటరూ ఉంది, ఒక ముద్రణ విధానం దేశమంతటా వ్యాపించే ఉంది. కనుక యీ రెండింటిని కుదించిపారేయకుండా వీటికే కొలది మార్పులను చేసి వీలయినంతవరకు వీటితో సులువుగాను, వేగం గాను పని జరిగేటట్టు చేయవలసి ఉంది.

టైపు రైటరులో వేగం రావాలంటే dead keys అంటే టైపు కొట్టినా మెషిన్ కదలని మెట్లు పోవాలి. లేక వీలయినంతవరకు తగ్గాలి. ఒత్తులు తగ్గాలి. ఒక అక్షరాన్ని కొట్టవలసి వచ్చినప్పుడు Back space మెట్టును వాడనవసరం లేకుండా చేయాలి.

ముద్రణలో వేగం రావాలంటే టైపు దిమ్మల సంఖ్య తగ్గాలి. ½ దాకీ, ¼ దాకీ దిమ్మలు ఉండకూడదు. అన్నీ ఏకాక్షర దిమ్మలుగానే ఉండాలి.

టైపు రైటరులోను, ముద్రణలోను వేగానికి అవరోధన కలిగిస్తున్నవి ¼ దాకీ వస్తువు. వీలయినంతవరకు యీ ½ దాకీ వస్తువులు (ఝ, ∩, ఓ, ఔ, ఞ, ఱ, ⊙,

[illegible]) పోవాలి. ఇవి ఫుల్ బాడీలుగా రూపొందవచ్చును. ఇందువల్ల ముద్రణలోను టైపు రైటరులోను వేగం హెచ్చుతుంది.

ఈ వత్తు లన్నింటివల్ల యింకొక అనర్థం ఉంది, పంక్తిలో ఏ ఒక్క వత్తు వచ్చినా, రాకపోయినా పంక్తి దిగువను ⅓ వంతు స్థలం కాగితంలో వృథాగా పోతుంది. ఎందువల్లనంటే తెలుగు టైపు బాడీలో 2/3 వంతులు మాత్రమే అసలు అక్షరం. మిగతా ⅓ వంతు వత్తుల కోసమని ఉంచవలసి వస్తోంది. ప్రతి ఫుల్ బాడీ అక్షరం కిందనూ ⅓ వంతు భాగం ఖాళీ దిమ్మను ఉంచవలసిందే. వత్తులు అక్షరం దిగువను రానవసరం లేకపోతే ⅓ వంతు కాగితమే కాకుండా ⅓ వంతు లోహం కూడా ముద్రణ విధానంలో కలసి వస్తుంది. ప్రతి పుటలోను ఎక్కువ పంక్తులు పడతాయి.

ప్రస్తుతం వాడుకలో నున్న ఇ. బి. (ఇంగ్లీషు బాడీ) 13½ పాయింట్లు (కొన్ని ఫౌండ్రీలవి 14 పాయింట్లు) ఉంది. అందులో ⅓ వంతు అంటే 4½ పాయింటు వత్తు కోసం పోతుంది. అసలు అక్షరం 9 లేక 9½ పాయింట్లు మాత్రమే ఉంటుంది. ఇంగ్లీషులో 10 పాయింట్ల టైపు ఎంత పెద్దదిగా కనిపిస్తుందో తెలుగు 13½ పాయింట్ల టైపు ఆమాత్రం పెద్దదిగానే కనిపిస్తుంది. ఇంగ్లీషులో 46 పంక్తులు వచ్చే పుటకు తెలుగులో ఆ సైజులో కనబడే పంక్తులు 31 మాత్రమే పడతాయి. ఈ వత్తుల కోసం ఉండే ఖాళీ వల్ల ఎంత జాగా వృథాగా పోతూందో ఎంత లోహం అనవసరంగా టైపులను అంటిపెట్టుకు ఉందో, ఎంత కాలం వృథాగా పోతోందో సంస్కర్తలు ముందుగా గ్రహించాలి. ఈ వత్తులు గాని, లేక వీటికి బదులు పొల్లులుగాని అక్షరాలతో సమంగా ప్రక్కప్రక్కనే వస్తే అని వాడుక అయినచోట మాత్రమే లోహం, కాగితం కర్చు అవుతాయి గాని పంక్తి అడుగున ఏమీ వృథాగా పోదు.

అయితే యీ వత్తులన్నిటినీ తీసివేసి, వాటికి బదులుగా పొల్లులను వాడడమా? లేక అన్ని వత్తులను ఫుల్ బాడీల కింద మార్చడమా? అనేది నిర్ణయించాలి, వత్తులకు బదులు పొల్లులను వాడితే చాలా అచ్చు దిమ్మలు ముద్రణ లోను, టైపురైటర్‌లో చాలా మెట్లు తగ్గుతాయి. కాని పదాలను సులభంగా ఉచ్చరించడానికి వీలుకాదు. 'ఆంధ్ర'ను 'అంధ్‌ర' అని, స్థైర్యమును 'స్‌థయిర్‌యము' అని కూడ బలుకునని చదవవలసి ఉంటుంది. అందువల్ల వత్తులన్నిటిని ఫుల్ బాడీలుగా మార్చగలిగితే ముద్రణకు, టైపు రైటరుక్కూడ సులువు ఏర్పడుతుంది. ఈ రెండింటిలో ఏమార్పును తీసుకువచ్చినా అక్షరం కింద అక్షరం వచ్చే విధానం పోతుంది. వత్తులనన్నిటిని ఫుల్ బాడీలుగా రూపొందించవలసి ఉంటే ప్రస్తుతం ¼ బాడీలుగా ఉన్న వత్తుల ఆకార పరిమాణాలు మారవలసిఉంటుంది.

(చూ. పటం.)

తమిళం యింకా యితర భాషలకు లిపిలో దీర్ఘానికి ప్రత్యేకంగా ఒక గుర్తు ఉంది. అలాగే మన లిపిలోకూడా ఒక గుర్తును దీర్ఘానికి ఏర్పరచుకుంటే ఆచరణయోగ్యమై అక్షరసంఖ్య చాలా తగ్గుతుంది, ముద్రణలో సుమారు 184 అచ్చు దిమ్మలు తగ్గుతాయి. టైపురైటరులో రెండు మూడు మెట్లు తగ్గుతాయి.

మొదట ముద్రణ విధానంలో మార్పులను నిర్ణయించి, లిపిని ఒక రూపానికి తీసుకు వచ్చిన తర్వాత దానిని టైపురైటరుకు వీలుగా ఏర్పరచుకుంటే మంచిది. కనుక ముద్రణ గురించి ముందు విచారించి తర్వాత టైపురైటరు గురించి విచారించాలి.

ఇప్పుడున్న ముద్రణ కేసు సెట్టుకు నాలుగు కేసులు ఉన్నాయి, వాటిలో సుమారు 586 అచ్చు దిమ్మలు ఉన్నాయి. దీర్ఘానికి సాంకేతిక గుర్తును ఏర్పరచుకున్నందు వలనను, ½ బాడీలు పోయినందువల్లనను సుమారు 320 అచ్చు దిమ్మలు మాత్రమే ఉంటాయి, ఇందువల్ల కంపోజింగ్ వేగంగా జరుగుతుంది.

ఇంకా ఏమైనా అక్షరసంఖ్య తగ్గించ గలమేమో చూడాలి, పొల్లుకు బదులు అసలు అక్షరం మీదనే ఒక చుక్కను పెట్టి దానిని పొల్లుగా పలికే వాడుక తమిళ భాషలో ఉంది. అలాగునే మనంకూడా ఒక సాంకేతిక గుర్తును అక్షరం తలమీద కాకుండా అక్షరానికి చేరువగా మీదివైపు పెట్టి దానిని పొల్లుగా ఏర్పరచుకుంటే 22 పొల్లు దిమ్మలు పోతాయి. కాని వాటి ఉచ్చారణ, ఉప యోగం మనకు ఉండనే ఉంటాయి. దీనివల్ల టైపురైటరుకు అంతగా కలసి వచ్చేది ఏమీ లేదు.

ప,చ,డ,ద వీటి అడుగున ఉన్న కొలికిలో ఒక చిన్న గీతను పెట్టినందువల్ల యివి ఫ,ఛ,ఢ,ధ లుగా రూపొం

దాయి. ఖ,ఘ,ఝ,థ,ధ మొదలయినవి అసలు స్వరూపా నికి భిన్నంగా ఉన్నాయి. కనుక మహాప్రాణాక్షరాలన్నీ ఏదో ఒకే సాంకేతిక గుర్తువల్ల కలిగేటట్టు మనం ఏర్ప రచుకుంటే మంచిది. క,చ,ట,త,ప,గ,జ,డ,ద,బ లకు పక్కను వీలుగా ఒక చోట ఒక గుర్తును పెట్టి మహా ప్రాణాక్షరాలుగా చేసుకుంటే ముద్రణలో 76 అచ్చు దిమ్మలు, టైపు రైటరులో రెండు, మూడు మెట్లు తగ్గుతాయి.

ముద్రణలోను, టైపురైటరులోను అక్షరానికి మీదను, కిందను అతుకులు వస్తే పని కష్టమౌతుంది. కాని కుడి ప్రక్కను అతుకు వస్తే కష్టం ఉండదు. కనుక 'క' ప్రక్కను కొమ్ము పెట్టి 'కు' ను 'ప' ప్రక్కను కొమ్మును పెట్టి 'పు' గాను జేసినట్టే క ప్రక్కను చిన్న + వంటి

హల్లులు

క, కి, కె, కొ, కౌ, 5, గ 5, జ 5, చ 5, ఞ 5, ట 5, డ 5, ణ 5, త 5, ద 5, న 5, పు — ప, పి, పె, పొ, పౌ – 6, బ, 5, య యె, యొ 3, ర 5, ల 5, వు - వ 6, శ 5, ష 5, స 5, హ 5, ళ 5. 110–

'వ' కు కొమ్ము పెట్టినందువల్ల 'మ' అవుతుంది :

వత్తులు :

్క, ్గ, ్చ, ్జ, ్ట, ్డ, ్ణ, ్త, ్ద, ్న, ్ప, ్బ, ్మ, ్య, ్ర, ్ల, ్వ, ్శ, ్ష, ్స, ్హ, ్ళ, — 26

18 Pt 30 24 a
12 48 b
24 c
d
36 Pt క్రావడి e
36 f
వత్తులు

పొల్లుగుర్తు
దీర్ఘం g
మహాప్రాణాక్షరగుర్తు h
క = ఖ j
ప = ఫ k

గుర్తును పెట్టి 'ఖ' గా మార్చవచ్చును. ఇలాగే తక్కిన వాటిని మహాప్రాణాక్షరాలుగా మార్చవచ్చును,(చూ.పటంj)

ప్రస్తుతం వాడుకలోనుంచి తొలగి పోతున్న ఙ, ఞ, ఱ, ఌ మొదలయిన అక్షరాలను టైపు రైటరులో తీసివేయవచ్చును. ఁ, ః వత్తులు వాడుకలో ఉన్నాయి కనుక వాటిని ఉంచవచ్చును.

అయితే చివరకు ముద్రణ విధానానికి నిలచే అచ్చు దిమ్మలు : అచ్చులు

అ. ఇ. ఉ. ఎ. ఐ. ఒ, ఔ = 7

'బ'ను ఋ గా మార్చుకోవచ్చును. కనుక 'ఋ' కావ లిస్తే తయారవుతుంది.

ఇతరం :

ం, ః, ఁ, (కొమ్ము) ᵛ (పొల్లుగుర్తు) ᴦ (దీర్ఘం), మహాక్షరం గుర్తు ⊢, యివి 6 అంకెలు 10 + 9 = 19

మొత్తం 168 అచ్చుదిమ్మలు. ఇవి కాక విరామ గుర్తులు, ., ,, :, ;, !, ?, —, –, ' ', ( ). [ ], ।, /, యివి 14 – మొత్తం 182 దిమ్మలు. వీటిని టైపురైటరులోని 46 మెట్లపై అమర్చాలి. అంటే 92 గుర్తుల కింద వీటిని దింపాలి.

టైపురైటరులో ఉంచవలసినవి :

అ, ఇ, ఉ, ఎ, ఐ, ఒ, క, గ, చ, జ, ట,

ట, డ, ణ, త, ద, న, ప, బ, వ, య, ర, ల, శ, ష, స, హ, ళ, ం, ఫ, వు, = 31

ా ి, ు, ˅ + = 5

ె ౕ ౖ ౄ — Dead Keys. — 4.

వత్తులు — 26

విరామ గుర్తులు, యితరం — 14 [ ,, ,, :, ;, !, ?, /, —, –, ( , ). + ]

అంకెలు — 10

మొత్తం : 31 + 5 + 4 + 26 + 14 + 10 = 90. ఇంకా రెండు గుర్తులు కావలసినవి పెట్టుకోవచ్చును.

ప్రస్తుతం వాడుకలో ఉన్న టైపురైటరులో అక్షర మొండెమును కొట్టిన వెంటనే మెషీన్ నడవదు. దానిమీద గుణింతం కొట్టిన తర్వాతనే మెషీన్ నడుస్తుంది. అందు వల్ల dead keys 20 ఉన్నాయి.

నేను సూచించే విధానంలో dead keys నాలుగు మాత్రమే ఉంటాయి.

ప్రస్తుత టైపురైటరులో మీద గుణింతం చిహ్నం ఏమీ లేకుండా ఉట్టి మొండెమే ఉంది. అలా కాకుండా తలకట్టు ఉండవలసిన అక్షరాలన్నిటికి ఉంచాలి. కాని తలకట్టు స్వరూపం కొద్ది మార్చాలి. తలకట్టు కొనలు కొంచెం వలయాకారంగా ఉంటే దానిపైన వచ్చే గుణింతం ఆ తలకట్టుతోకూడా కలసి పోయేటట్టు తయారు చేయాలి. ఈమాత్రం మార్పువల్ల అక్షం స్వరూపం ఏమీ మారదు. దీనివల్ల టైపురైటరు మెట్లలో ఏమీ కలిసిరాదు కాని వేగం వస్తుంది.

ఇప్పుడు చేసిన సూచనలను అనుసరించి టైపుల వాడీ కొలతలు ఏవిధంగా ఉండాలన్న విషయం చూడాలి. ప్రస్తుతం ఉన్న 72 పాయింట్లు టైపులో విభజన యీ విధంగా ఉంది. అక్షరం మీదను వచ్చే గుణింతం గుర్తు 18 పాయింట్లు మధ్య మొండెం 30 పాయింట్లు. అడుగున వచ్చే వత్తుల భాగం 24 పాయింట్లు ఉన్నాయి.

[చూ. పటం.]

అంటే అక్షరంలో మూడోవంతు వత్తుకున్ను గుణింతానికి ¼ వంతు పోయిందన్నమాట.

నూతన విధానంలో గుణింతానికి 12 పాయింట్లు, వత్తు కొంచెం దిగువగా కన్పించడానికి 12 పాయింట్లు ఉంటే చాలును. ఇప్పుడు మధ్య మొండెం 18 పాయింట్లు పెద్ద దవుతుంది. అక్షరం ప్రక్కను వత్తు వస్తుంది గనుక, వత్తు 24 పాయింట్లకు చిన్నది కాకుండా ఉంటుంది. అంటే ట వత్తు ద వత్తు మొదలయినవి 24 పాయింట్లున్ను వ్ర, మ్ర, మొదలయినవి 36 పాయింట్లును ఉంటాయి.

ఈ విభజనను అనుసరించి ఒక్కసారి ఇ. బి. టైపు అంటే 13½ పాయింట్ల టైపును పరిశీలిద్దాం. వత్తు అసలు అక్షరానికి 2 పాయింట్లు మాత్రమే క్రింద్రికి దిగుతుంది. అప్పుడు గుణింతం గుర్తుతో సహా 11½ పాయింట్ల అక్షరం మనకు కనబడుతుంది. ఇది వరకు యీ అక్షరం 9 పాయింట్లే కనబడేది. అంటే ప్రస్తుతం ఉన్న ఇ. బి. టైపుకన్నా యీ కొత్తరకం ఇ. బి. టైపు పెద్దదిగా కన బడుతుంది. లేక ప్రస్తుతం ఉన్న ఇ. బి. అక్షరం సైజు 12 పాయింట్ల టైపు అవుతుంది. అంటే యిదివరకు 31 పంక్తులు పట్టే పుటకు (ఆ సైజు టైపే) 42 పంక్తులు పడతాయి,

ఈ వ్యాసమును రచించిన తర్వాత పలువురు పండి తులకు, ముద్రాపకులకు చదివి వినిపించి వారి ఆమోదాన్ని, సంతోషాన్ని పొందాను. ఈ మార్పులవల్ల భాషా సంప్ర దాయాలకు ఏమీ హాని కలుగదని భాషా వేత్తలలో నాకు తెలిసినవారు చెప్పారు. ఎవరికైనా సందేహము కలిగితే వాటికి సమాధానం చెప్పగలెను. తప్పుయింటె సవరించు కుందును.

ఈ వ్యాసమును ఆంధ్రులకు అందజేసిన 'ఆంధ్ర మహిళ'కు నా కృతజ్ఞత.



# శ్రీ త్యాగ గురుస్తుతి కీర్తనలు

* శ్రీమతి కె. ఎమ్. సౌందర్యవల్లి *

కీర్తన - 25

రాగం ధన్యాసి, ఆదితాళం.

అ. సగమపనిస — అ. సనిదపమగరిస

ప॥ నీదయ నాపై రావలెగాక, నేపొగడగ గలనా ॥నీ॥

అ॥ప॥ నా దతనుండగు నాధుని నామము
నా దామృతమున, నిరతముగ్రోలిన ॥నీ॥

చ॥ వేకువ జామున, వేగమలేచి
తేకువతో, తంబుర శృతిజేర్చి
ప్రాకటముగ శ్రీరామునిగూర్చి
శ్రీకరమగు కృతి చేసిన, త్యాగమూర్తి ॥నీ॥

| /4 | 0 | 0 |
|---|---|---|
| ప॥ ; గా మా ప నీ స రి స రి నీ స | ; పా నీ స స | స ని రి స ని ద పా |
| నీ - ద య నా - - - పై - | రా . వ లె | గా . . . క . . |
| ; మ పా గ మా పా పా స ని రి స | స స ని ద పా ; | ; ; ; ; |
| నే . పొ గ డ గ గ - ల . | నా . . . . | . . . . |
| ; గా మా ప నీ స రి స రి నీ స | ; పా నీ స స | ని స గ రి రి స ని ద |
| . నీ . ద య నా . . . పై . | రా . వ లె | గా - - - - - కా . |
| పా, మ ప గ మా పా పా స ని రి స | స స ని ద పా ; | |
| . నే . పొ గ డ గ గ . ల . | నా . . . . | |
| అ॥ప॥ ; పా గా మా పా స ని రి స ని ద | పా ; ప ని స స | సా ; రి ని సా |
| నా ద త నుం . . డ . గు . | . నా . ధు ని | నా మ . ము |
| ; ప ని సా స ని రి స ని ద పా ; | ; మా పా గ మ | పా; ప ని సా |
| నా . దా మృ . త . ము , న | ని ర త ము | గ్రో లి . న |
| మగ ॥గ రీ రి స॥ | | |
| - - ॥ నీ-ద య॥ | | |
| చ॥ ; పా పా పా పా ని స ని ద పా | ; గా మా ప మ | ప ప మ గ రీ సా |
| వే కు వ జా ము . న . . | వే . గ మ | లే . . . . చి |
| ; మ గా రి సా సా; రి ని సా | ; సా సా గ మ | పా ని స ని దా, |
| తే . కు వ తో . తం . | బు ర శృ తి | జే . . ర్చి . |
| పా॥ | | |

అ. ప. వలె.

ప్రాకటముగ శ్రీరాముని గూర్చి
శ్రీకరమగు కృతిజేసిన త్యాగమూర్తి ॥నీ॥

# శ్రీ త్యాగ గురుస్తుతి కీర్తనలు

## కీర్తన - 26

**రాగం బేగడ — రూపకతాళం.**

ఆ. స గ రి గ మ ప ద నీ ద ప స   అ. స నీ ద ప మా గ రి స

ప॥ కృతినిచేసెనే, రఘుపతిని సదా తలచి తలచి ॥కృ॥

అ॥ప॥ స్తుతినిచేసి, పరవశమౌ, మతినితరము మరచి మరచి ॥కృ॥

చ॥ కలికలుషము దీర్పగా, పలుగాయక హితముగా
అలఘు గానామృతముగా, లలిత త్యాగరాజు భువిని ॥కృ॥

| 0 | /4 | 0 | /4 |
|---|---|---|---|
| ప॥ మా గా | మా పా దా పా | సా ; | సా ; సా సా |
| కృ తి | ని చే . సె | నే | . ర ఘు |
| దా రీ | స రి నీ దా పా | ప ద ని ని | ద ప మా గా మ రి |
| ప తి | ని . స ద . | త . ల . | చి . త . చి . |
| మా గా | మా పా దా పా | సా ; | |
| కృ తి | ని చే . సె | నే ; | |
| | | | |
| అ॥ప॥ ; మ గ | మ పా, దా పా | సా సా | సా రీ రి స స ని |
| స్తు తి | ని చే . సి | ప ర | వ శ మౌ . . . |
| సా గ రి | గా ప మా గ రి స | రి స ని ని | ద ప మ ద ప ప మ గ |
| మ తి . | ని త . ర . ము | మ . ర , | చి . మ . ర . చి . |
| మ రి . మ గ | మా పా దా పా | సా | |
| . . కృ తి | ని చే . సె | నే॥ | |
| | | | |
| చ॥ ; గ మ | పా దా పా పా | పా ద | ద ద ద ప మ పా మ |
| క లి | క లు ష ము | దీ | ర్ప గా . . . . . |
| ; ద స | దా నీ దా పా | గా మా | ద ప గ రీ సా , |
| ప లు | గా . య క | హి త | ము . గ . . |

అ. ప. వలె

అలఘు గానామృతముగా
లలిత త్యాగరాజు భువిని ॥కృ॥



# రాజు - పేద

బి. ఎ. యస్. ప్రొడక్షన్‌వారు తయారుచేసిన "రాజు - పేద" అన్న ఫిల్ము 4-7-'54 వ తేదీని మద్రాసు పేరగాన్ టాకీస్‌లో ప్రివ్యూ చూపించేరు.

ఈ రోజుల్లో ప్రేయసి - ప్రియుడు లేందే పిక్చర్ రాణించదు, బాక్సు ఆఫీస్‌హిట్ కాదు, అన్న నమ్మకాన్ని ఆక్షేపాటించక, ప్రొడ్యూసర్లు శ్రీ బి. ఎ. సుబ్బారావుగారు ఒక కొత్త పక్కీని అవలంభించి, కృతకృత్యులయ్యేరని చెప్పొచ్చు. ప్రొడ్యూసర్ల ముఖ్యాశయం రాజు — పేదల నిత్యజీవితాల్లోని కష్టసుఖాలు ప్రజల కళ్ళముందు పెట్టి, పేదలయెడ పెద్దలు దయార్ద్ర హృదయులయ్యేటట్లు గావించడం అనుకోవాలి.

ఫిల్ముకు ఇతి వృత్తం: ఒక మహారాజు భార్య ప్రసవిస్తుంటే సహాయం చేయడాన్కి గుర్రపుసార్లు వెళ్ళి రాజ వైద్యుల్ని తెస్తుంది, ఒక నిరుపేద భార్య ప్రసవిస్తుంటే ఎడపిల్ల పరుగెట్టి సారాయిదుకాణంలో గూడుపుఠా మధ్య జూదమాడుతున్న తండ్రి పేరిగాణ్ణి పిల్చుకొస్తుంది. యువరాజు కాబోయే బాలుణ్ణికని రాణీ మరణిస్తుంది. నారిగాణ్ణికని కులాసాగాపురుడోసుకుంటుంది పేదరాలు అచ్చమ్మ. 12 ఏళ్ళు ఇట్టే తిరిగిపోతాయి. వీరి పుట్టిన రోజు పండుగలు, చదువులు, ముచ్చట్లలోని వ్యత్యాసాలు, ప్రేక్షకులకు పేదల కడగండ్లు, కండ్లకు కట్టినట్లు చూపిస్తారు. రాజు, కొడుక్కు రాజనీతులు బోధించి, రాజ ముద్ర చేతికిచ్చి భద్రమని చెప్తాడు. అడుక్కొందుకు వెళ్ళక చదువుకుంటాననే నారిగాణ్ణి తండ్రి చావదరుము తాడు. అతడు ప్రాణభీతితో కోటలో దాక్కుంటాడు. కావలావాళ్ళు దొంగ అని తన్నుతుంటే యువరాజు వచ్చి విడిపించి తన గదిలోకి తీసుకువెళతాడు. సమాన వయస్కులు, ఒకే ఆకారం, దుస్తులు మాత్రం వేరు. రాజు కొడుకు తన దుస్తులు అతనికి తొడిగి అతని గుడ్డలు తను తగిలించుకుంటాడు. ఇంతట్లో రాజకుమారుని దుస్తులు మార్చే దాదులొస్తుంటే, రాజు కొడుకు, రాజ ముద్ర ఒక కోపవిగ్రహంలో దాచేసి, తాను దాక్కుంటాడు. నీవు రాజుకొడుకులా నటించమంటాడు నారిగాణ్ణి. చింకి గుడ్డలతోనున్న యువరాజును ముష్టివాడని కావలావాళ్ళు బయటికి తరిమేస్తారు, తాను యువరాజునని చెప్పినా సరే. దుస్తుల్నిబట్టి నమ్మక, పేదవాని దుస్తులతో యువరాజు కడగండ్లు, రాజు దుస్తులతో నారిగాడి అగచాట్లు, నవ్వు, జాలీ, ఏడుపూ పుట్టిస్తాయి. నేను యువరాజుననే ఇతనికీ, నేను యువరాజునుకాననే నారిగాడికీ అక్కడివారూ, ఇక్కడి వీరూ పిచ్చి ఎత్తిందని అక్కడ రాజ వైద్యులు, ఇక్కడ పేరిగాడిబడితివైద్యంవగైరాలు జరుగుతుంటాయి.

యువరాజు వేషధారి నిజంగా పేదవాడేనని బాగా గ్రహించిన యువరాజు మేనమామ విక్రముడు - అతణ్ణి కీలుబొమ్మగా చేసుకొని రాజ్యం కైవశం చేసుకోవచ్చని పన్నాగం పన్నుతాడు. నిజమైన యువరాజు పేరిగాడి ఇంట్లోవచ్చి నారిగాడుగా చూడబడుతున్నాడని తెలుసుకొని అతణ్ణి అడవిలోకి తీసుకుపోయి హత్యగావించే యేర్పాట్లు చేస్తాడు. అంత పనీ జరిగే ఉండును గాని ఆఖరి గడియలో పేరిగాడు సుధీరు సహాయంతో యువరాజును రక్షిస్తాడు. అక్కడ రాజు మరణిస్తే - నారిగాణ్ణే యువ రాజుగా పట్టాభిషేకం కట్టించే యేర్పాట్లు చేస్తాడు విక్రముడు. అంతట్లో నిజమైన యువరాజును తెస్తారు. విక్రముడు ఇదంతా పన్నాగం అంటాడు. అతడిదే పన్నాగం అనీ, నిజమైన యువరాజు, తాను దాచిన రాజ ముద్ర వివరాలు చెప్పి తెప్పించడంవల్ల, ఋజువు చేస్తాడు.

ఆఖరుకు నిజమైన యువరాజుకు పట్టాభిషేకం, ప్రజలందరికీ ఆనందంతో కథ సుఖాంతం అవుతుంది.
దీంట్లో నటించినవారు :—

యస్. వి. రంగారావు, సుధాకర్, డాక్టరు వి. కాసు రాజు, యస్. టి. రామారావు, లక్ష్మీరాజ్యం, అమ్మాజీ, రేలంగి.

వీరిలో ప్రతి ఒక్కరు తమ తమ పాత్రపోషణం సక్రమంగా గావించి, సహజరీతిని నటించేరు. అప్పం తల్లిగా ఒప్పింది అచ్చమ్మ పాత్రధారి లక్ష్మీరాజ్యం. సుధాకర్ నాలుగిద్దరి పాత్రా బహుప్రశంసనీయంగా నటించేడు. కథలో కొంత హాస్యానికని రేలంగిని సుధీర్ఘంగా ఇమిడ్చేరు. అతడి నటన, గొల్లాటలు కొంచం ఎక్కువ అనిపిస్తాయి. అమ్మాజీ, బాగా నటించింది. కుచలకుమారి నాట్యాలు మనోరంజకంగా వున్నాయి.

పాత్రల మాటలు, పాటలు, ఆటలు సహజాతిరంగా అతిసందర్భానుసారంగా వ్రాసేరు. కథలు — రావి, కె. ఆర్. చౌదరీ, పినిశెట్టిగారలు.

చిత్రగ్రహణం, శబ్దగ్రహణం, సెట్టింగులు, బ్యాక్‌గ్రౌండు మ్యూజిక్ అన్నీ బాగున్నాయి.



# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ మద్రాసు

మహిళా విద్యాలయము : హిందీ, కాశీ విశ్వవిద్యాలయపు ఎడ్మిషన్, ఇంటర్‌మీడియెట్, ఇ.యస్.ఎల్.సి., పరీక్షలు.

పారిశ్రామిక విద్యాలయము (గవర్నమెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది) : కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు, అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చు కూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. బీద విద్యార్థినులకు ఉచితము.

వస్త్రములపై అద్దకపుపని మిషనుకుట్టు, మిషను అల్లిక, చేనేత- బుక్ బైండిగు, ఎంబ్రాయిడరీ. : భారత ప్రభుత్వ పునరావాసశాఖవారిచే ఆంధ్రమహిళా సభ పారిశ్రామిక భవనములు, 7-ఎ రోజరీ చర్చి రోడ్డులో నడుపబడుచున్నవి.

టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ : స్త్రీలకు టైపు,—గవర్నమెంట్ పరీక్షలకు శిక్షణ.

మహిళా మందిరము : స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము.

ఆంధ్ర మహిళ : స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాసపత్రిక.

నిర్మలాదేవి గ్రంథాలయము : సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంథ సముదాయము.

నర్సింగ్ హోమ్ : స్త్రీ, శిశువుల, సంరక్షణశాల, ప్రసూతిశాల, ఉచిత వైద్యశాల— అడయారులో నిర్మించబడినది. భారత ప్రభుత్వ ఆరోగ్యశాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్స్‌ఎయిడ్—మంత్రసాని పనులలో శిక్షణ యివ్వబడుచున్నది.

ముద్రణశాఖ : ఆంధ్ర మహిళా సభవారిచే స్వంతంగా స్థాపించబడినది. విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగు, ప్రూఫ్ రీడింగు, మొదలైనవి వుచితంగా నేర్పబడును.

క్రీడా, క్లబ్బుశాఖలు.

సభ్యురాండ్రుగా జేరి, యీ జాతీయ సంస్థను పోషించండి.

# చిన్న మొత్తములలో నిల్వ సేకరణ-

## ఆంధ్ర మహిళా సభలో కార్యాలయము.

చిన్న మొత్తముల నిల్వలు ప్రోత్సాహించి, ప్రభుత్వమువారి పంచవర్ష ప్రణాళికకు తోడ్పడు స్త్రీల ఉద్యమములో ఆంధ్రమహిళాసభ సభ్యురాండ్రు ఎక్కువగా తోడ్పడవలెనని నిశ్చయింపబడినది. ఇందు కొరకై, ఆంధ్రమహిళా సభ ఆవరణలో ఒక ప్రత్యేకమైన కార్యాలయము ఏర్పరుపబడును. ఇందు దైనిక కార్యక్రమాన్ని నిర్ణయించి, స్త్రీ సామాన్యములో యీ ఉద్యమాన్ని గూర్చి ప్రచారం చేయుటకు, నిల్వచేయదలచినవారికి తగు సలహానిచ్చుటకు, సభ తరపున కొందరు యువతులు నియమింపబడుదురు. ఈ ఉద్యమంలో ఒక ప్రత్యేక ప్రతినిధిగా వ్యవహరించి, ధనము వసూలు చేయుటకు భారత ప్రభుత్వమువారు, ఆంధ్ర మహిళాసభకు అధికారమిచ్చియున్నారు. సభకు వచ్చిగాని, పోస్టు ద్వారాగాని అన్ని వివరములు తెలిసికొనవచ్చును,

ఇంకొక విషయము— మీరు కొనదలచిన సేవింగ్సు సర్టిఫికెట్లు సభ ద్వారా కొన్నయెడల సభకు 1½% కమీషను వచ్చును. ఈ కమీషను సభయొక్క కార్యకలాపాలకై వినియోగించుకోవచ్చును. అందువల్ల మీరు నిల్వ చేయదలచిన మొత్తమునకు సభద్వారా సర్టిఫికెట్లు కొన్నచో, సభకు కూడా సహాయము చేసినవారగుదురు.

ఉత్సాహ వంతులైన సోదరీమణులు, యింత వరకూ సభద్వారా నిల్వ సర్టిఫికెట్లు కొనినట్టి మొత్తము రమారమి రూ. 32945/- ఇందు మూలముగా సభకు వచ్చిన కమీషను రూ. 413/- ఇంకా ఎక్కువమంది సోదరీమణులు యీవిధముగా సభద్వారా సర్టిఫికెట్లుకొని సహాయ పడవలెనని కోరుచున్నాను.

టి. జి. ధనుపతి,

ఆర్. లక్ష్మి.

# గమనిక

'ఆంధ్ర మహిళ' స్త్రీల సచిత్ర మాస పత్రిక. ఆంధ్ర లోకంలో సన్నిహితముగా సుప్రసిద్ధమైనది. మహిళా సంఘంలో నూతన ప్రబోధం కలిగించే ఆశయంతో ఆంధ్ర మహిళా సభ నడుపు "ఆంధ్ర మహిళ" పత్రిక 11 సం॥రములనుండి ప్రకాశితమగుచున్నది.

దీనియందు స్త్రీల మనోవికాసానికి తోడ్పడే వ్యాసములు, కథలు, నాటికలు, పిల్లలకు వినోదం మొదలగు గద్య పద్యాత్మకములైన పలురకముల రచనలున్నవి. సాంఘిక రాజకీయ విషయములు, ప్రభుత్వము వారు దేశాభివృద్ధికై జరుపుచున్న సంక్షేమ కార్యక్రమాలు, స్త్రీలకుపయుక్తమైన గృహ సంబంధ విషయములను గురించి వానిని గూర్చి మాసామాసము యిందు ప్రకటింపబడును.

వార్షిక సంచిక, తపాలా ఖర్చులతోసహా

**సంవత్సర చందా 6-0-0**

సేవాసంస్థలకు, గ్రంథాలయములకు, కళాశాల, పాఠశాలలకు,

సంవత్సర చందా రూ. 4-8-0 మాత్రమే.

వివరములకు:

మేనేజరు
'ఆంధ్ర మహిళ'

ఆంధ్ర మహిళా సభ,
24-ఎ, ఎడ్ చర్చిరోడ్డు, మైలాపూర్, మద్రాసు 4.

# ఆంధ్ర మహిళ

వ్యవస్థాపకురాలు :

శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్

ఎం.ఏ., బి.ఎల్.,

సంపాదకురాలు :

శ్రీమతి చన్నఘంటమ్మ

ఎం.ఏ., ఎల్.టి.,

సంయుక్త సంపాదకురాలు :

శ్రీమతి కె. సుగుణమణి

సంవత్సర చందా ఆరు రూపాయిలు

ఆంధ్ర మహిళా సభవారిచే స్థాపించబడిన ముద్రణాలయములో
ముద్రితము.

# ఆంధ్రమహిళ

సంపుటి 11 :: సెప్టెంబరు '54 :: సంచిక 5





సంవత్సరచందా :: :: ఆరు రూపాయలు.




సంపుటి 11 :: సెప్టెంబరు '54 :: సంచిక 5

# ఏడేళ్ల స్వాతంత్ర్యం

భారతమాత సకల సౌభాగ్య సంశోభిత. ఆ సౌభాగ్యం చూస్తే అనేకమందికి కళ్ళు కుట్టేయి. క్రీస్తుకు 326 సం॥ పూర్వమే అలెగ్జాండరు సింధునది దాటి వచ్చి, అంకినవన్నీ తర్లించుకు పోయేడు. క్రీస్తుకు వెనుక వెయ్యేళ్ళకు గజ్నీ మహమ్మద్ (1-2 సార్లు గాదు, 18 మార్లు దండెత్తి వచ్చి) గుళ్ళు - గోపురాలలోని మణులతో సహా కొల్లగొట్టుకు పోతేగాని అతని కళ్లు చల్లబడలేదు. 1193 లో ఢిల్లీ పతనం. సుమారు 300 ఏళ్ళు సుల్తానులు-ఖిల్జీలు - తుఘ్లక్‌ల జులుమ్. ఆవెనుక సుమారు 200 సంవత్సరాలు మొగలాయీల పరిపాలన, ఆపిమ్మట మరొక 200 ఏళ్ళు ఆంగ్లేయుల ప్రభుత్వం. ఇలా శతాబ్దాల తరబడిని యదేచ్ఛగా ఎవరికి అంకినంత వరకు వారు కొల్లగొట్టుకు పోయేరు— భారత వర్షంలోని భోగభాగ్యాల్ని. "బారత- భూమీ- మనదేగానీ- ఫలితము- మనకేదీ" అని ఆమె బిడ్డలు (పాడి— పంటలకు పుట్టిల్లయిన యింటనే) కూడు గుడ్డలకు కరువాసిపోయి, అలో లక్ష్మణా అని ఆలపించేరు. 1855 లో స్థాపింపబడిన కాంగ్రెస్ 62 ఏళ్ల కృషి సల్పగా ఆఖరుకు గాంధీజీ నాయకత్వం క్రింద అహింసాత్మక విధానంలో, ప్రపంచమంతా విస్తుబోయేటట్లు అఖండ త్యాగాలు గావించగా— 1947 ఆగష్టు 15 వ తేదీని మనకు స్వరాజ్యం లభించింది. "ఎప్పటికైనా గరిక మేసిన గాడిదే పోతుందిగాని గరిక అల్లేయుండి నవనవోన్మేషితయై వర్ధిల్లుతుంది" అని పెద్దల వాక్కులు.

స్వరాజ్యం వచ్చి ఏడేళ్ళయింది. స్వాతంత్ర 'బాల' "అష్ట వర్షాత్ భవేత్కన్య" అన్నట్లు మొన్నటి 1954 ఆగష్టు 15 నాటికి చక్కటి 'కన్య'కా మణియై మన కళ్లెదుటనే పెరిగింది. ఈ కన్యనింకా పెంచి పెద్దదాన్ని చేసి, తీర్చిదిద్ది, ప్రపంచ దేశాలమధ్య సగర్వంగా నిలబెట్టవలసిన బాధ్యత భారతీయుల ప్రతిఒక్కరిదీ యైయుంది. స్వరాజ్యం ఎందుకు కావాలన్నామో, గాంధీజీ ఏరామరాజ్య స్థాపనకోసరం అహోరాత్రాలు కలలుగాంచేడో, ఆ ఆశయసిద్ధికోసరం అంతా సహకరించి కృషి సల్పవలసియుంది. అందరికి (36 కోట్ల ప్రజానీకానికి) సుఖ జీవనానిక్కి వలసిన పని— పాటు, అన్నం— బట్ట, వసతి— విద్య, వైద్యం— విహారం వగైరా సౌకర్యాలు కల్పింపబడాలి. గ్రామసీమలు మళ్ళీ నిత్యకల్యాణం — పచ్చతోరణాలతో విలసిల్లాలి అంటే అందరితోడ్పాటు కావాలి.

స్వరాజ్యం తెచ్చిన హక్కులతోబాటు అనేక బాధ్యతలూ వచ్చాయి. పైవారు కల్పించిపోయిన సమస్యలూ ప్రత్యక్షమయ్యాయి. అటూ ఇటూ పాకిస్తాను, వాటినుండి తరలి వచ్చిన వేలాది కాందిశీకులు, వారి పునరావాసం, అమాయక ప్రజానీకంలో హత్యాకాండ నివారణ, అందందు దేశమంతటా పెట్టి పోయిన సంస్థానాల్ని కూడగట్టుకోవడం, ఇలా ఒక్కొక్క సమస్యే పరిష్కరించుకున్నాం. స్వాతంత్ర రంగంలో పోరాటం ఒక విధంగా పూర్తయింది. వెంటనే ఆర్థిక రంగంలోను, అధికాహారోత్పత్తి రంగంలోను మరోరకం పోరాటం ప్రారంభించాం. సమగ్ర దేశాభ్యుదయానిక్కి పంచవర్ష ప్రణాళిక తయారుచేసుకున్నాం. అన్నిరంగాల్లోను అవసరమైన వస్తూత్పత్తికి చిన్నవీ పెద్దవీ

## ఏడేళ్ళ స్వాతంత్ర్యం

యైన అనేక ప్రాజెక్టులు ప్రారంభించాం. ప్రజలందరూ తమ ప్రభుత్వానికి పూర్తి సహకార సానుభూతుల నిచ్చి తోడ్పడ్డారు కనుక ఇప్పటికి ఆహారం— బట్ట వగైరా విషయాల్లో స్వయం సమృద్ధికి రాగలిగేం. ఇంత స్వల్పకాలంలో ఇంత సమర్థతతో సాధించిన వాటిని గురించి భారతీయులు సగర్వంగానే చెప్పుకోవచ్చు. ఇంకా సాధించవలసింది ఎంతో వుంది. దేశమంతటా కానవచ్చే నవచైతన్యం, నూతనోత్సాహం, నిర్మాణ కార్యక్రమ నిర్వహణలో ప్రతిఫలించి, గ్రామసీమల సర్వతోముఖాభివృద్ధికి, అందు ముఖ్యంగా స్త్రీజనాభ్యుదయానికి, దోహదం కావాలి.

మన నెహ్రూ ప్రధాని అటు సిలోన్, ఇటు చైనాలతో సంప్రదించి సాధించిన తటస్థ వాతావరణం, అటు జెనీవా, ఇటు కొరియా, ఇండోచైనాల్లో ప్రతిఫలించగా, అంతర్జాతీయరంగంలో భారతదేశానికున్న విశిష్టత మరింత ప్రస్ఫుటమయింది. ఐహికాముష్మిక సుఖజీవనాలకు సులభ పంథాలు నిర్మించి మళ్ళీ భారత దేశం అన్నిదేశాలకు మార్గదర్శకమౌతుందని ప్రపంచదేశాలన్నీ (హైడ్రోజన్ బాంబుల అట్టహాస వాతావరణంలో) గంపెడాశతో మనవంక నిరీక్షిస్తున్నాయి. ఈ బాధ్యతకూడ భారతవర్షం దిగ్విజయంగా నెరవేర్చగలదని పాశ్చాత్య ప్రముఖులే ప్రశంసిస్తున్నారు,

ఈ పరిస్థితులన్నీ ఆబాల గోపాలం అవగాహన చేసుకుని కలసికట్టుగా కృషి సల్పి సాధించవలసింది ఇంకా ఎంతో వుంది. పాకిస్థాన్‌తో నీటితగాయిదాలు, ఫ్రాన్సు, పోర్చుగల్లులతో జరుగుతున్న సంప్రదింపులుకూడా త్వరలోనే పరిష్కారమైతీరాలి.

“భారతభూమి— మనదేగాదా— ఫలితము మనదేగా” అని ఇక హాయిగా పాడుకుంటూ, పరస్పరం హెచ్చరించుకుంటూ, అంతా కృషి చేస్తే ఈ సమస్యలు అష్టమ స్వాతంత్ర సంవత్సరంలోనే తప్పక పరిష్కారమవుతాయి.

“ప్రజకున్ స్వస్తి మహీపతుల్ వసుమతిం బాలించుతన్ న్యాయతన్
ద్రిజగంబున్ భజయించుగాతసుఖ; మీదేశం బసంక్షోభమౌ ;
ద్విజగోసంతతి కౌసుభం ;.... .... .... .... .... .... .... .... ....”

అన్న సుజనాశీస్సులు ఫలిస్తాయని ఆశిద్దాం.



---

## ఆంధ్ర మహిళాసభలో 8 వ స్వాతంత్ర్య దినోత్సవము

ఆగష్టు 15 వుదయం 9 గంటలకు ఆంధ్ర మహిళా సభలో 8-వ స్వాతంత్ర దినోత్సవము జరిగింది. శ్రీ గాడేపల్లి సూర్యనారాయణ శర్మగారు పతాకావిష్కరణ జరిపారు. సభ్యురాండ్రు, విద్యార్థినులు జండా వందనము చేసి జాతీయ గీతములు పాడిరి.

ఆ తరువాత శ్రీమతి చెన్నఘంటమ్మగారి అధ్యక్షతను జరిగిన సభలో ప్రసంగిస్తూ శ్రీ శర్మగారు గాంధీజీ నాయకత్వాన్న జరిగిన స్వాతంత్రోద్యమాన్ని గురించి విపులంగా చెప్పారు. గాంధీజీ బోధించిన యాదర్శాన్ని పొగడుతూ, ఈనాడు కూడా మన జాతీయజండా సంపూర్ణ ఆత్మ సమర్పణ కోరుతున్నదన్నారు. నేడు మనకు స్వాతంత్ర్యం లభించిందని హర్షిస్తున్నామేగాని, గాంధీజీ కాంక్షించిన ‘రామరాజ్య’ స్థాపన నేటివరకు జరగలేదని, ఈ లక్ష్యసిద్ధికై ప్రతి భారతీయుడు కృషి చేయాలని అన్నారు.

శ్రీమతి చెన్నఘంటమ్మగారు గాంధీజీ ప్రబోధించిన నూతన యాదర్శాలను గురించి చెబుతూ ‘రామరాజ్య’ స్థాపన యిదివరకు జరగలేదని మనం ఏమాత్రం నిరుత్సాహ పడనవసరం లేదని నేటి కాంగ్రెసు ప్రభుత్వం ‘వెల్‌ఫేర్ స్టేట్’ స్థాపించడానికి ప్రయత్నిస్తున్నది. అభివృద్ధి ప్రణాళికలు తయారుచేసి, ప్రజల సహకారంతో వానిని అమలులో పెట్టుతున్నదని అన్నారు. శ్రీమతి చెన్నఘంటమ్మగారి అభివందనాలతో సభ ముగిసింది.

## వరలక్ష్మి వ్రతం

ఆగష్టు 13 వ తేదీ శుక్రవారం సాయంకాలం మహిళా సభ సభ్యురాండ్రు, విద్యార్థినులు చేరి సభా భవనములో వరలక్ష్మి వ్రతం చేసేరు. సహస్రనామార్చన, పూజ జరిగింది.

—టి. సుశీల.



# ఆంధ్రరాష్ట్రంలో ప్రారంభించిన

# సంఘ సంక్షేమ కేంద్రాలు

భారతసప్తమ స్వాతంత్ర్య వార్షికోత్సవ సందర్భంలో 1954 ఆగష్టు 15 వ తేదీని ఈ క్రింది జిల్లాల్లో సంక్షేమ కేంద్రాలు ప్రారంభింప బడ్డాయని ఆంధ్రరాష్ట్ర చైర్మను శ్రీమతి ఎ. చెన్నఘంటమ్మగారు తెలియ పరుస్తున్నారు.



శ్రీమతి ఎ. చన్నఘంటమ్మ
ఆంధ్రరాష్ట్రసంఘసంక్షేమబోర్డు చైర్మన్.

శ్రీకాకుళం జిల్లా : జిల్లా కలెక్టరు శ్రీ కరియప్పగారు పాత్రునివలస గ్రామంలో పార్కుకు ప్రారంభోత్సవం చేశారు, సాంఘికసంక్షేమ విస్తరణ స్కీము క్రింద ఈ పార్కు నిర్మింపబడింది, శ్రీ కరియప్పగారు మాతాశిశు సంరక్షణ కేంద్రానికి గూడా ప్రారంభోత్సవం జరిపారు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత గ్రామాల్లో జరుగుతున్న అభివృద్ధిని కార్య క్రమాల్ని గురించి మాట్లాడేరు.

పాత్రునివలస, అంపోలు, గ్రామాల్లో రెండు మాతా శిశు సంరక్షణ కేంద్రాలు ప్రారంభించేరు. ఇందుకు కేంద్ర ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వం, ప్రజలు డబ్బు ఎలా యిస్తున్నది చెప్పేరు. ప్రజలు డబ్బు రూపేణాగాని, కాయకష్టం ద్వారాగాని, సాధన సామాగ్రి ద్వారాగాని, యివ్వ వచ్చునన్నారు, శ్రీమతి పౌన్నమ్మ కరియప్ప, డి. సువర్ణాబాయి గారు మాతాశిశు సంరక్షణ గురించి మాట్లాడారు. శ్రీమతి పౌన్నమ్మ కరియప్పగారు శిశుసంరక్షణ కేంద్రాన్ని తెరిచేరు. సభకు పూర్వం, శ్రీ. పి. సూర్యనారాయణగారు, జిల్లా కలెక్టరు గారికి పూలమాలవేసి, స్వాగతం చెప్పారు. సమాజ సంక్షేమ విస్తరణ సంఘసభ్యులు వీరిని ఊరేగింపుతో సభాస్థలికి తోడ్కొని వెళ్ళారు. పాత్రునివలసలో కార్య క్రమం ముగించుకొని, అక్కడికి 7 మైళ్ళలో ఉన్న అంపోలు గ్రామంలో జాతీయ విస్తరణ వికాశ బ్లాకుకు శ్రీ కరియప్పగారు ప్రారంభోత్సవం చేశారు.

విశాఖపట్నం జిల్లా : ఈ జిల్లాలో, బాలచెరువు గ్రామమందు సంక్షేమకేంద్రం ప్రారంభింప బడింది. గ్రామస్తులు చాల ఉత్సాహంతో ఈ ఉత్సవంలో పాల్గొన్నారు. శ్రీమతి కృష్ణగారు, రిజిష్ట్రారుగారి సతీమణి, లాకశాల ప్రిన్సిపాలుగారి సతీమణి, మునిసపల్ డాక్టరు, వారి సతీమణి, మునిసిపల్ కౌన్సులరు, కుమారి. అనసూయాదేవి గారు, శ్రీమతి రుక్మిణమ్మగారు, తదితరులు, ఈ ప్రారంభోత్సవంలో పాల్గొని జయప్రదంగా జరిగించేరు.

తూర్పుగోదావరి జిల్లా : ఈ జిల్లా సంక్షేమ వికాసకార్యక్రమాల ప్రాజెక్టు ప్రథమ కేంద్రాన్ని రాజానగరంలో, రామకృష్ణమఠం అధ్యక్షులు స్వామినిత్యానందంగారు బాల నేరస్తులకు, వికలాంగులకు ప్రారంభించారు. శ్రీనివాసాచారిగారు అధ్యక్షత వహించారు. జిల్లా ప్రాజెక్టు కన్వీనరు కేంద్రపు ఉద్దేశాలను వివరించారు. శ్రీమతి లీలావతిగారు, శ్రీ వెంకట్రాజుగారు, పంచాయతీ బోర్డు అధ్యక్షులు శ్రీ పేర్రాజుగారు, సత్తిరాజుగారు, శ్రీ కూర్మయ్యగారు తదితరులు మాట్లాడేరు. 54 కుంచాల రాగిభూమిని విరాళంగా ఇవ్వడానికి వాగ్దానం చేసేరు. పంచాయితీబోర్డు అధ్యక్షులు పలువిధాల సహాయం చేయడానికి ఒప్పు కున్నారు. సుమారు 12 గురు వికలాంగులు చాపల్ని, బుట్టల్ని అల్లేరు. తరువాత వికలాంగులకు, బాలనేరస్తులకు భోజనాలు పెట్టేరు.

పశ్చిమగోదావరి జిల్లా : ఈ జిల్లాలో కాళ్ళకూరు గ్రామంలో నర్సాపురం సబ్ కలెక్టరు శ్రీ బి. ఎస్. జయసింహాగారు సంక్షేమ కేంద్రానికి ప్రారంభోత్సవం జరిపేరు.

కమిటీ సభ్యులు శ్రీమతి ముల్పూరు చుక్కమ్మగారు అధ్యక్షత వహించేరు. శ్రీమతి రామారాజగోపాల్ జాతీయ పతాకము ఎగుర వేశారు. ప్రాజెక్టు కమిటీ కన్వీనర్ ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ గారు ఏర్పాట్లను జయప్రదంగా చేశారు.

కాళ్ళకూరు గ్రామస్తులు దాదాపు 6 వేల రూ. విలువ చేసే భవనాన్ని కొంతస్థలాన్ని ప్రసూతి శిశు కేంద్రానికి విరాళంగా యిచ్చేరు, ఈ కేంద్ర విజయానికి ఆ తాలూకా పెద్ద లంతా చాల తోడ్పడ్డారు.

ఈ విధంగా ఆరోజు కార్యక్రమం చాల జయప్రదంగా జరిగింది.

కృష్ణాజిల్లా : ఈ జిల్లాలో పోరంకి పెనమలూరు గ్రామాల్లో సంక్షేమ కేంద్రాలు ప్రారంభించేరు. నున్న గ్రామంలో జిల్లాకలెక్టరు శ్రీ అమేషా అబ్దుల్ ఖాదర్‌గారు సంక్షేమ కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు. చింతా నారాయణ స్వామిగారు స్వాగత మిచ్చారు. మద్దాల సోమశేఖరరావు గారు, శ్రీమతి పామర్తి సుందరమ్మ, శారదగార్లు, ఈకార్య కలాపాలకు సహాయపడ వలసిందిగా గ్రామస్తులకు విజ్ఞప్తి చేసారు. భీమవరం కోటిరెడ్డిగారు వందనము లర్పించారు. ఈ కేంద్రంలో ఒక మహిళా సంక్షేమ ఆర్గనైజరు, ఒక మంత్రసాని ఉన్నారు.

గుంటూరుజిల్లా : పల్నాడు తాలుకాలోని ఘూర్జంపాడులో సంక్షేమ కేంద్రం ప్రారంభింప బడింది. అచ్చట ప్రసూతి చికిత్సాలయం తెరువబడింది. దీనికి శ్రీయుత మేడగం సుబ్బారెడ్డిగారు 10 వేల రూపాయలు ఇస్తామని వాగ్దానం చేసేరు. గుంటూరు జిల్లా ప్లానింగు ఆఫీసరు సంఘ అభివృద్ధిస్కీములో నుండి 10 వేల రూపాయలు ఇస్తామన్నారు. ఇతరులు, ఇతర విధాలుగా సహాయం చేస్తామన్నారు. ఒక మంత్రసానిని నియమించేరు. ఈ కార్యక్రమాల్లో ప్రజలు, పైసంఘంవారితో బాగా సహకరించారు.

నెల్లూరుజిల్లా : ఈ జిల్లా సంక్షేమ కార్యక్రమాల సంఘం వారు సంక్షేమ కేంద్రాలు ప్రారంభించారు. సగం గ్రామంలో సంక్షేమ కేంద్రాన్ని జిల్లాకలెక్టరు సతి శ్రీమతి మేడప్పగారు తెరచినారు. తరువాత డా॥ లక్ష్మిగారు, అల్లాడి అన్నపూర్ణమ్మగారు, తదితరులు ఈ సంక్షేమ కేంద్రాల్ని గురించి మాట్లాడేరు. తరువాత ఒక మిడిల్ స్కూలుకు, ఆస్పత్రికి శ్రీమతి మేడప్పగారు శంకుస్థాపన చేసేరు. ఇలాగే మర్రిపాడు, కొత్రిమర్ల, సిద్దిరెడ్డిపాలెం



మాంబట్లు ప్రసూతి కేంద్రం ప్రారంభోత్సవం

## ఆంధ్ర మహిళాసభ ప్రాజెక్టు కమిటీవారు నిర్వహిస్తున్న భాగం.




| బ్లాకు నం. 1 | బ్లాకు నం. 2 | బ్లాకు నం. 3 | బ్లాకు నం. 4 | బ్లాకు నం. 5 |
|---|---|---|---|---|
| 1. కడలూరు | 1. అక్కంపేట | 1. తడ | 1. రామపురం | 1. వాటమబేడు |
| 2. కొండూరు | 2. అండగుండల | 2. బోడిలింగలపాడు | 2. పెరియావట్టు | 2 దేవునికండ్రిక |
| 3. మాంబట్టు | 3. చేనిగుంట | 3. తడకండ్రిక | 3. పన్నన్‌గాడు | 3. వెలగలవాగు |
| 4. ఎండలూరుపాడు | | 4, ప్రూడి | | 4. గొల్లలముల్కు |

# సంక్షేమ కేంద్రాలు

గ్రామాల్లో సంక్షేమ కేంద్రాలు ప్రారంభించేరు. ఈ కార్య క్రమాల్లో ప్రజలు పైసంఘంవారితో బాగా సహకరించారు.

మహిళాసభ వెల్‌ఫేర్ ప్రాజెక్టు ప్రారంభం : ఈ జిల్లాలో అదనంగా ఆంధ్ర మహిళాసభ సంక్షేమ ప్రాజెక్టువారు మరొక విస్తరణ కేంద్రాన్ని తెరిచేరు.

మహిళాసభవార్ని నెల్లూరుజిల్లాలో ఒక ప్రాజెక్టు నిర్వహించమన్నారు. ఈ కమిటీ నియామకాన్ని గురించి జూలై ఆంధ్రమహిళలో చూచే యుంటారు. ఈ కమిటీ వారు జిల్లాకలెక్టరుతో సంప్రదించి, సూళ్ళూరుపేట తాలూకాలో, వెనుక బడిపోయిన ప్రాంతంలో 20 గ్రామాలు ప్రాజెక్టుగా నిశ్చయించేరు. దీన్ని 5 బ్లాకులుగా పరిగణించి వీటిలో సంక్షేమ కార్య క్రమాన్ని అమలు జరపటానికి నిశ్చయించేరు. ముందుగా అగస్టు 15 వ తేదీని మొదటి బ్లాకులో గల మాంబట్టు గ్రామంలో పని ప్రారంభించేరు. ఆ గ్రామస్థులతో సంప్రదించగా తమకు అవశ్యం ఒక ప్రసూతి కేంద్రం కావాలని, అందుకు వలసిన బిల్డింగు యిచ్చేరు.

మహిళాసభ కమిటీ మెంబర్లు స్వాతంత్ర దినంరోజున ఆ బ్లాకులోని గ్రామస్థులు, సూళ్ళూరుపేట పౌరులు, ఆప్రాంతీయ ఉద్యోగులు అందరు అమితోత్సాహంతో తోడ్పడగా సంక్షేమ కార్య క్రమానికి ప్రారంభోత్సవం జరిపేరు. ఆరోజున ఊరంతా తోరణాలు, పందిళ్ళతో అలంకరించేరు. గ్రామ పాఠశాల ఆవరణలో గొప్ప సమావేశం జరిగింది. ఉదయం మేళతాళాలతో గ్రామ విద్యార్థుల పాటలతో కుమారి గిడుగు భారతి, బాలానంద సంఘ బాలికలయొక్క ప్రార్థన గీతావళితో, సూళ్ళూరుపేట పంచాయితీబోర్డు ప్రెసిడెంటు శ్రీ కె. రాజగోపాల శెట్టిగారు పతాకావిష్కరణ గావించేరు. ఆనాటి స్వాతంత్ర్య దినం ప్రాముఖ్యతను గురించి ముచ్చటించేరు. ఆవెనుక మాంబట్టు గ్రామ పంచాయితీ బోర్డు ప్రసిడెంటు శ్రీ గురప్ప దేవర్‌గారి అధ్యక్షతను గొప్ప బహిరంగసభ జరిగింది. సూళ్ళూరుపేట డెప్యూటీ తాహసిల్దారు శ్రీ ఎస్. నాగభూషణరావుగారు పంచవర్ష ప్రణాళిక ఆశయాల్ని గురించి ప్రజలకు తెలియజెప్పేరు. ప్రాజెక్టు కమిటీ సెక్రటరీ శ్రీమతి టి. జి. హైమవతిగారు సంఘసంక్షేమ కార్యక్రమాన్ని గురించి, గ్రామస్థులీయవలసిన సహకార సానుభూతుల్ని గురించి మాట్లాడేరు. సూళ్ళూరుపేట హైస్కూలు హెడ్‌మాస్టరుగారు శ్రీ వెంకట్రామయ్యగారు, హరిజన హాస్టల్ సెక్రటరీ గణపతయ్యాగారు గాంధీజీ నిర్మాణ కార్యక్రమాన్ని గురించి, స్వయంకృషిని గురించి సభ్యులను హెచ్చరించేరు. ప్రాజెక్టు కమిటీ మెంబరు శ్రీమతి కె. సుగుణమణిగారు దేశాభ్యుదయంలో గ్రామాభ్యుదయానికున్న ప్రత్యేకతను గురించి, అందు స్త్రీ జనాభ్యుదయానికున్న ప్రత్యేకనుగురించి, ప్రసూతి కేంద్రంయొక్క ఆవశ్యకతనుగురించి ముచ్చటించేరు, ఆంధ్రులు కార్యశూర్యులై ఇతరులకు ఆదర్శకులు కావాలని హెచ్చరించేరు.

తర్వాత శ్రీమతి యన్. కామేశ్వరమ్మ (రేడియో అక్కయ్య)గారు ప్రసూతి కేంద్రాన్ని తెరుస్తూ బాలల పురోభివృద్ధికి వలసిన దోహదాల్నిగురించి విశదీకరించేరు. పిమ్మట అధ్యక్షుని తుది పల్కులు, వందన సమర్పణ, జన-గణ-మన గీతాలతో సభ ముగిసింది. మధ్యాహ్నం గ్రామస్థులు బీదసాదలకు ఐదారువందలమందికి సంతర్పణ గావించేరు.

సాయంత్రం శ్రీమతి ఎన్. కామేశ్వరమ్మగారు పిల్లల క్రీడా కేంద్రానికి ప్రారంభోత్సవం చేసేరు, ఇందుకు కావలసిన ఆట స్థలంకూడ గ్రామస్థులు ప్రత్యేకంగా యిచ్చేరు. "అక్కయ్యగారు" ఆప్రాంతాల "చిట్టి చిట్టి చెల్లాయిలు, తమ్ముళ్ళ"ను పోగుచేసి ఆటలు, పాటలు నృత్యాలపోటీల కార్యక్రమాలు జరిపి, అంతా ఆనంద వినోదాల్లో పాల్గొనేటట్లు చేసి దిగ్విజంగా నడిపించేరు. నెగ్గినవారికి బహుమతులు, వచ్చినవారందరికీ స్వీట్సు పంచిపెట్టారు. పరిసర బ్లాకులవారంతా త్వరలో తమకు కూడా ఈమాదిరి ఏర్పాట్లు చేయవలసిందని కోరేరు,

ఇలా ఆనాటి కార్యక్రమం అతి జయప్రదంగా సాగింది.

చిత్తూరుజిల్లా : ఈ జిల్లాలో యాదమగిరి గ్రామంలో సంక్షేమకేంద్రం ప్రారంభించబడింది. జిల్లా కలెక్టరు యాగంటిగారు ప్రసూతి వైద్యశాల భవనానికి ప్రారంభోత్సవం జరిపారు. సభకు శ్రీ పి. చిన్నమ్మరెడ్డి ఎం.ఎల్.ఎ.గారు అధ్యక్షత వహించారు. చిత్తూరుజిల్లా ప్లానింగు ఆఫీసరు శ్రీ పి. రాజగోపాల్ నాయుడుగారె మునిసిపల్ చేర్మెన్ శ్రీమతి ఆర్. రత్నాబాయమ్మగారు పబ్లిక్ ప్రాసిక్యూటర్ సతీమణిగారు, సమావేశానికి వచ్చారు. సుమారు వెయ్యిమంది స్త్రీ పురుషులు సమా

(మిగతా 27-వ పేజీలో చూడండి)



# రాజకీయాలు

• శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు •

1954 జులై నెల నాలుగో వారం మొదలుకొని ఆగస్టు మూడోవారం వరకూ అంతర్జాతీయ రాజకీయ రంగంలో చెప్పుకోతగ్గ ప్రముఖ సంఘటనలు ఇవి— సూయజ్ సైనిక స్థావరాల విషయమై బ్రిటన్, ఈజిప్టులకు ఒప్పందం కుదరటం, పర్షియా నూనె పరిశ్రమను నడిపించే విషయమై విదేశ నూనె కంపెనీలతో పర్షియా ప్రభుత్వం రాజీ కుదుర్చుకొనటం, ఆగ్నేయాసియా సైనిక ఒప్పందంలో చేరేందుకు పాకిస్థాన్ మినహా కొలంబో రాజ్యాలన్నీ నిరాకరించటం, యూరప్ దక్షిణ ఒప్పందంపై అభిప్రాయ భేదాలు పెరగటం, బ్రిటన్, చైనాల రాజకీయ సంబంధాలు అభివృద్ధి కావటం. భారత రాజకీయ రంగంలో చెప్పుకోతగ్గ అంశాలు గోవా సత్యాగ్రహోద్యమం, ఉత్తర ప్రదేశ్ సోషలిస్టు సత్యాగ్రహం.

ఆంధ్రదేశ వ్యవహారాల్లో చెప్పుకోతగ్గవి కల్లు గీతకార్మికుల, ఇనాం రైతుల సత్యాగ్రహాలు.

* * *

ఎంతో కాలంనుంచీ పరిష్కారం కాకుండా ఉండి, ఈజిప్టులో ఎన్నో ప్రభుత్వాల పతనానికి కారణమయిన సూయజ్ స్థావరాల సమస్య ఈ నెలలో సౌమ్యంగా పరిష్కారమయింది. ఆ ప్రాంతంనుంచి తమ సేనలను క్రమక్రమంగా ఖాళీ చేయటానికి బ్రిటన్ అంగీకరించింది. రెండు పటాలాలు అక్కడినుంచి బయలుదేరటం కూడా జరిగింది. టర్కీ, మధ్య ప్రాచ్య దేశాలపై దండయాత్ర జరిగే సందర్భంలో బ్రిటిష్ సేనలు తిరిగి ఇక్కడికి రావటానికి కొత్త ఒప్పందం అవకాశమిస్తున్నది. అయితే దురాక్రమణ అని నిర్ణయించటంలో ఈజిప్టును సంప్రదించవలసి వుంటుంది. స్థావరాన్ని సరయిన పద్ధతిలో ఉంచటం విషయమై ఈజిప్టు వాదమే నెగ్గింది.

ఈ ఒప్పందంతో ఈజిప్టు విప్లవ నాయకులు తమ ఆశయాలు రెండింటినీ సఫలం చేసుకున్నారు. సూడాన్ ఎన్నికల్లో ఆ ప్రజలు ఈజిప్టులో చేరాలని కోరుతున్నట్లు నిరూపించి నైలు నదీలోయను ఏకం చేశారు. ఇప్పుడు బ్రిటన్‌ను సాగనంప గలుగుతున్నారు. ఈ లోపలే విప్లవ నాయకులు పదభ్రష్టులవుతారని బ్రిటిష్ ప్రధాని చర్చిల్ ఆశించాడు కాని, వాళ్ళు మరీ గట్టిగా పాతుకుని పోవటంతో రాజీకి రాక తప్పలేదు.

బ్రిటన్‌ను ఒక చెంప సాగనంపుతూ మరొక చెంప అమెరికాను ఈజిప్టు నాయకులు ఆహ్వానిస్తున్నారేమోనన్న సందేహాలు అంతర్జాతీయ రాజకీయ వర్గాల్లో ఏర్పడ్డవి. అమెరికా సహాయాన్ని స్వీకరించటానికి వారు సుముఖత చూపటమే దానికి కారణం. అయితే ప్రాంతీయ రక్షణ వ్యవస్థలు వేటిలోనూ ఈజిప్టు చేరదని ఈజిప్టు నాయకులు ఖండితంగా ప్రకటిస్తున్నారు. ముఖ్యంగా పాకిస్థాన్ టర్కీ ఒప్పందంలో కానీ, అఖిల ముస్లిం ఒప్పందంలో కానీ చేరేదిలేదనీ, ఆ విధంగా చేసి 35 కోట్ల భారతీయుల అసంతృప్తికి తాము కారణం కాదలచలేదనీ వాళ్ళు స్పష్టపరుస్తున్నారు. అంతేకాక, మే నెలలో జరిగిన కొలంబో సభ నిర్ణయం ప్రకారం ఆసియా, ఆఫ్రికా దేశాల సమావేశాన్ని ఏర్పాటు చేయటానికి ఇండోనీషియా చేస్తున్న కృషిని ఈజిప్టు సమర్థించటం కూడా చూస్తే, ఈజిప్టు అంత సులభంగా అమెరికా గుప్పెట్లో చిక్కుకోదనే తోస్తుంది.

# రాజకీయాలు

ఈ నెలలోనే మధ్య ప్రాచ్యంలోని మరొక ముఖ్య సమస్య పరిష్కారమయింది. ప్రధాని మొసాదిక్ జాతీయం చేసిన పర్షియా నూనె గనులను పని చేయించే విషయమై 8 విదేశీ కంపెనీలతో పర్షియా ప్రభుత్వం ఒక ఒప్పందం కుదుర్చుకున్నది. ఈ ఒప్పదం పర్షియా నూనె జాతీయ చట్టాన్ని గుర్తిస్తున్నప్పటికీ, గనులను నడిపించి, నూనెను అమ్మించటంలో మాత్రం విదేశ కంపెనీల పెత్తనమే అంతా ఉంటుంది.

పర్షియా ప్రభుత్వం కూడా తాను ఎటువంటి ప్రాంతీయ రక్షణ వ్యవస్థల్లోనూ జేరేదిలేదని ప్రకటించింది.

* * *

యూరప్‌లో సోవియట్ యూనియన్ మీద కత్తి కట్టటానికి ఉత్తర అట్లాంటిక్ వ్యవస్థను ఏర్పాటు చేసినట్లే ఆగ్నేయాసియా ప్రాంతంలో కూడా చైనా కత్తి కట్టేందుకుగాను ఒక వ్యవస్థను ఏర్పాటు చేయాలని అమెరికా ఎంతో ప్రయత్నించింది. కాని ఆగ్నేయాసియా దేశాల్లో స్వతంత్ర విధానాన్ని అనుసరిస్తున్న ఒక్కటీ అందులో చేరటానికి అంగీకరించలేదు. అమెరికాతో సైనిక ఒప్పందం చేసుకున్న పాకిస్థాను, అమెరికన్ తాబేదార్లుగా ఉంటున్న సయాం, ఫిలిప్పిన్‌లు మాత్రం సంప్రదింపుల్లో పాల్గొనేందుకు అంగీకరించినవి.

మే నెలలో మొదటి కొలంబో రాజ్యాల సభ జరిగినప్పుడే పాకిస్థాన్, సింహళాల వైఖరి కొంత వరకు బయట పడ్డది. తమకు కమ్యూనిస్టు సమస్య ఏమాత్రమూ లేకపోయినప్పటికీ, కమ్యూనిస్టు దేశాల దండయాత్ర ప్రమాదం అసలే లేకపోయినప్పటికీ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ప్రమాదాన్ని వలసవాదంతో పాటు పోల్చటానికి ఈ దేశాలు సాహసించినవి. ఇప్పుడు ఆగ్నేయాసియా వ్యవస్థ సంప్రదింపులకు కొలంబో రాజ్యాలను ఏ విధంగానయినా దించాలని సింహళ ప్రధాని ఇటీవల విశ్వ ప్రయత్నాలు చేశారు. కాని ఇండియా, ఇండోనీషియా, బర్మాలు దానికి నిరాకరించి, ప్రస్తుతం అటువంటి ఒప్పందం ఏర్పడటం శాంతికి ప్రమాదకరమని హెచ్చరించటం వల్లనూ, సింహళ ప్రజలే చాలా మంది ప్రతికూలించటంవల్లనూ ఆయనకూడా అందులో పాల్గొనకపోయేందుకే నిశ్చయించుకున్నారు.

పాకిస్థాన్ మాత్రం అమెరికానే ఆశ్రయించుకుని ఉన్నందువల్లనూ, ప్రజాభిప్రాయాన్ని పాటించే అలవాటు లేనందువల్లనూ, పశ్చిమ రాజ్యాలు సెప్టెంబర్‌లో ఏర్పాటు చేసిన సంప్రదింపులకు హాజరుకావటానికే నిశ్చయించుకున్నది.

ఇండియా మొదలైన దేశాలు సమర్థించని వ్యవస్థ తన శక్తి మీద తాను నిలబడటం అసాధ్యం. దానిని బలపరచటానికి ఇతర పశ్చిమరాజ్యాలుకూడా ఆట్టే ముందుకురావు. ఇంకపోతే అమెరికా ఒక్కటే ఆభారాన్ని వహించవలసి వుంటుంది.

* * *

తన సరికొత్త ఆయుధ బలంతో ఎటువంటివాళ్ళనయినా దెబ్బ తీయవచ్చునని అమెరికా ఉబలాటపడి, ఐక్యరాజ్య సమితిలో 'ఆమోదాల నాటకం' కూడా పూర్తి కానివ్వకుండా, కొరియా యుద్ధంలోకి దూకింది. కేవలం ఆయుధ బలం పట్టుదలతో ఉన్న ఆసియా ప్రజలను లొంగదీయలేదని తెలుసుకున్నది. కొన్ని లక్షలమంది సైనికులను పోగొట్టుకున్నది. అందుకని ఆసియా ప్రజల్నే చీలదీసి చైనామీదికి ఉసి కొల్పాలని ప్రయత్నిస్తున్నది. దానికి సిద్ధపడుతున్నది ప్రజామోదాన్ని పొందలేని ఆసియా దేశాల ప్రభుత్వాలే. సైనిక తిరుగుబాటుతో సయాంలో అధికారం చేజిక్కించుకున్న పిబుల్ సంగ్రాం, ప్రజలు తరిమి వేస్తే అమెరికా నౌకా బలం చాటున దాక్కున్న చాంగ్ కై షెక్, బ్రిటిష్‌వాళ్ళు అధికారం అప్పగించిన లగాయతు ఎన్నికలు జరపకుండానూ, జరిగిన ఎన్నికలను రద్దుచేస్తూనూ ఉన్న పాకిస్థాన్ అధికారులు మినహా వాళ్ళను సమర్థించే వాళ్ళే లేకపోయినారు.

ఫార్మోజాలో చాంగ్ కై షెక్‌ను నిలబెట్టటానికి అవసరమయితే పెద్ద పోరాటానికే అమెరికా సిద్ధంగా ఉన్నట్లు ప్రెసిడెంట్ ఐసెన్‌హోవర్ ప్రకటించటం, కొరియా, ఇండోచైనాల ఒప్పందాలను అమెరికా ఖండిస్తూ ఉండటం ఆగ్నేయాసియా ఒప్పందాన్ని ఏర్పరచాలని చేస్తున్న ప్రయత్నాలూ - ఇవన్నీ చూస్తే అమెరికా తన విధానాన్నేమీ మార్చుకోదలచలేదనీ, ఏదో విధంగా దూర ప్రాచ్యంలో చైనాతో గిల్లికజ్జా తెచ్చుకోవాలని ఆలోచిస్తున్నదనీ తోచక మానదు.

# రాజకీయాలు

యూరప్ రక్షణకని అమెరికా ప్రతిపాదించిన యూరప్ సైన్య పథకం ఇంతవరకూ ఫ్రాన్స్, ఇటలీల ఆమోదం పొందలేదు. ఆపథకం ప్రస్తుతపు పద్ధతిని పట్టి తిరిగీ జర్మన్ సైనిక విజృంభణకు అవకాశం ఇస్తుందని ఫ్రాన్స్ భయపడుతున్నది. అందువల్ల ఫ్రాన్స్ కొన్ని హామీలనూ, ప్రత్యేకాధికారాలనూ కోరుతున్నది. వీటికి అమెరికా కానీ, ఇతర యూరప్ రాజ్యాలుకానీ సుముఖంగా లేవు. ఫ్రాన్స్ ఆమోదాన్ని చూడనిదే ఇటలీ ఈ పథకాన్ని ఆమోదించదనే చెప్పవచ్చు. అవి ఆ పథకాన్ని ఆమోదించకపోతే జర్మనీని సాయుధం చేసేందుకు ప్రత్యేక చర్యలు తీసుకోవలసి వస్తుందని ఐసెన్‌హోవర్ బెదరిస్తున్నాడు.

*   *   *

ఇది ఇట్లా ఉండగా, రష్యా అఖిలయూరప్ రక్షణకు ఒక పథకాన్ని ప్రతిపాదించింది. అందులో యూరప్ రాజ్యాలు యావత్తూ, అమెరికా పాల్గొనవచ్చుననీ రష్యా సూచించింది. ఆ ఒప్పందంలో బ్రిటన్, అమెరికాల ప్రవేశానికి రష్యా అంగీకరిస్తున్నందువల్ల, పశ్చిమ యూరప్‌ను ఒంటరిచేసి రష్యా దెబ్బతీస్తుందన్న భయానికి ఆస్కారంలేదు. జర్మనీలో సైనిక వాదం తల ఎత్తటం ఫ్రాన్సుకు ఎంత ప్రమాదకరమో రష్యాకూ అంత ప్రమాదకరమేకనుక ఆ భయంకూడా వుండదు. అందువల్లనే ఫ్రాన్స్ ఒక్కటీ ఆ ప్రతిపాదనపై సంప్రదింపులు జరపటానికి ఇష్టపడుతున్నది.

*   *   *

జెనీవా సమావేశంలో చౌలిన్‌లే, ఆంతోనీ ఈడెన్‌లు కలుసుకున్నప్పటినుంచీ ఇండోచైనా పరిష్కారానికి చైనా సాయపడినప్పటినుంచీ బ్రిటన్, చైనాల రాజకీయ సంబంధాలు దృఢపడుతున్నవి. రాయబారి హోదాలో కాక పోయినప్పటికీ, కొంత చిన్నహోదాగల ప్రతినిధులనే పరస్పరం నియమించుకునేందుకు ఆసియా దేశాలు నిశ్చయించినవి. బ్రిటిష్ ప్రతినిధి నియామకం ఇంతకుముందే జరిగి ఉన్నది. ఫ్రాన్స్‌కూడా ఇండోచైనా సమస్యలో చైనా వైఖరిని హర్షించింది. చైనా పట్ల బ్రిటన్, ఫ్రాన్స్‌ల సద్భావం, చైనాకు సమితిలో స్థానం ఉండవలసిందేనంటున్న న్యూజీలాండ్ వైఖరి, చైనా పట్ల ఆగ్నేయాసియాదేశాల స్నేహభావం— ఇవన్నీ చైనాపట్ల అమెరికా కొంత జాగ్రత్తతో మెలగాలని సూచిస్తున్నవి. ఆఖరికి జపాన్ ప్రభుత్వ పక్షనాయకులుకూడా అమెరికా విధానం విఫలమయిందని బాహాటంగా విమర్శిస్తున్నారు.

*   *   *

ఈ నెలలోనే డచ్చి - ఇండోనీషియన్ యూనియన్ ఏర్పాటు రద్దు చేయబడ్డది. పశ్చిమ న్యూగినీని ఇండోనీషియాకు అప్పగించటానికి హాలెండ్ నిరాకరించింది. సమితి ఆప్రస్తావన తీసుకురావటానికి ఇండోనీషియా చర్యలు తీసుకుంటున్నది. మధ్యధరా సముద్రంలోని సైప్రస్‌ద్వీపం తమకు ఇప్పించాలని గ్రీకు ఐక్యరాజ్యసమితికి విజ్ఞప్తి చేసింది. అది ఇప్పుడు బ్రిటిష్ పాలనలో ఉన్నది. ఇండోచైనాలో ఆగస్టు 11 న యుద్ధవిరమణ జరిగింది. పర్యవేక్షణ ప్రారంభ మయింది.

ఆగస్టు 15 వ తేదీ - భారత స్వాతంత్ర్య దినంనాడు - గోవా ప్రజలు శాంతియుత సత్యాగ్రహోద్యమం ప్రారంభించారు. పరిసర భారత ప్రాంతాల్లో ఉన్న గోవా వాస్తవ్యులు ఈ సత్యాగ్రహం నడుపుతున్నారు. గోవా జాతీయులు కాని భారతీయులు వెళ్ళటానికి భారత ప్రభుత్వం అనుమతించలేదు. అసలు ఈ ప్రాంతాలను గురించి సంప్రదింపులు జరిపే అవసరమే లేదని వాదిస్తూ వచ్చిన పోర్చుగల్ ఇప్పుడు తటస్థ ప్రతినిధుల పరిశీలన జరగాలంటూ కోరుతున్నందువల్ల భారతీయ సత్యాగ్రహాలను భారతప్రభుత్వం అనుమతించటంలేదు. పోర్చుగీస్ ప్రాంతాలనే కాక, పరిసర భారత ప్రాంతాల పరిస్థితులను కూడా తటస్థ ప్రతినిధులు పరిశీలించాలని పోర్చుగల్ వాదిస్తున్నది. భారత ప్రభుత్వం దానికి నిరాకరించింది, ఈ ప్రాంతాల పరిస్థితులను గురించే కాక, వాటి భవిష్యత్తును గురించి కూడా సంప్రదింపులు జరగాలని కోరుతున్నది. ఆగస్టు 24 న ఢిల్లీలో సంప్రదింపులు ప్రారంభించాలని కోరింది.

ఇండియా ప్రాంతాల మధ్య లంకవలె ఉన్న పోర్చుగీస్ ప్రాంతాల విమోచన పూర్తి అయింది. అయితే ఈ సందర్భంలోను ఫ్రెంచి ఇండియా విమోచనోద్యమ సందర్భంలోను, విమోచన మనే కీర్తిని సంపాదించటం కోసం

అక్కడి పార్టీల మధ్య స్పర్ధలు పెరుగుతున్నట్లు తెలుస్తున్నది.

ఉత్తరప్రదేశ ప్రభుత్వం నీటితీరువను హెచ్చించింది. దానికి నిరసనగా ప్రజాసోషలిస్టులు సత్యాగ్రహం జరుపుతున్నారు. ప్రభుత్వ విధానాలకు ప్రజలు తమ అసమ్మతిని తెలియజేసేందుకు సత్యాగ్రహం పనికిరాదని కాంగ్రెస్ పెద్దలు అంటున్నారు. సత్యాగ్రహమే పనికిరాకపోతే, ప్రజల అసంతుష్టి ఏవిధంగా పరిణమిస్తుందో ఊహించటానికి ఆట్టే కష్టపడనక్కరలేదు.

ఆంధ్రరాష్ట్రంలో కూడా రెండు సత్యాగ్రహాలు సాగుతున్నవి. ఈనాం రైతుల హక్కులను రక్షించేందుకు ప్రజాసోషలిస్టులు కరివెన అనే ఈనాం గ్రామంలో సత్యాగ్రహం జరుపుతున్నారు. ఈనాందారులకు భూములమీద మేల్‌వరం హక్కులేకాని, కుడివరం హక్కులు లేవని వాళ్ళు వాదిస్తున్నారు. ఎసెంబ్లీ సోషలిస్టు నాయకుడు పి. వి. జి. రాజుగారు మొదలైన వాళ్ళు అరెస్టయినారు. ఆంధ్ర ప్రభుత్వం ఈనాం రైతురక్షణ బిల్లు ముసాయిదాను ప్రకటించిందికాని, అది ఉపయోగించేది కాదని సోషలిస్టులు అభిప్రాయ పడుతున్నారు.

మద్యనిషేధం వల్ల నిరుద్యోగులయిన కల్లుగీతకార్మికుల తరఫున కె.ఎల్.పి. నాయకులు, కమ్యూనిస్టులు సత్యాగ్రహాలను నడుపుతున్నారు. ఆగస్టు 19 వరకు ఈ ఉద్యమాల్లోనూ, కరిలెన్ సత్యాగ్రహంలోనూ కలిపి 1160 మంది అరెస్టయినారు. మద్యనిషేధాన్ని రద్దుచేయాలని రామమూర్తి కమిటీ చేసిన సిఫార్సులను అమలు జరపవలసిందని ఆంధ్ర శాసన సభ గతసమావేశంలో తీర్మానించి ఉన్నది. పార్లమెంటరీ విధానంలో సత్సాంప్రదాయాలను ఏర్పరచి, తద్వారా పార్లమెంటరీ విధానాన్నే బలపరచటమే ప్రభుత్వ ఉద్దేశం అయినట్లయితే, అనధికార తీర్మానం నెగ్గటంతో రాజీనామా ఇచ్చి వుండవలసింది. లేకపోతే ఎసెంబ్లీ తీర్మానాన్ని అమలు జరపటమయినా చేసి ఉండవలసింది. కాని ఏదీ చేయకుండా 'నీరా' పద్ధతినే అనుసరించ నిశ్చయించుకున్నది. దాని ఫలితమే ఈ సత్యాగ్రహాలు.

ప్రభుత్వం పార్లమెంటరీ సాంప్రదాయాలను ఉల్లంఘించింది కనుక, ఎసెంబ్లీలో విశ్వాస రాహిత్య తీర్మానం తీసుకుని రావలసిందని రాష్ట్ర కమ్యూనిస్టు కమిటీ ఆగస్టు 18న తమ ఎసెంబ్లీపార్టీకి ఆదేశించింది.

ఇట్లా వ్యవహారాలు నడుస్తున్న సమయంలోనే, ఆంధ్ర కాంగ్రెస్ నాయకులు ప్రభుత్వంమీద తమ పెత్తనం గట్టిగా స్థాపించుకోవాలని ప్రయత్నాలు సాగిస్తున్నారు. ముఖ్యమంత్రి కాంగ్రెస్ సహసభ్యుడు కనుకను, విశ్వనాథంగారు మినహా మిగిలినవారంతా కాంగ్రెస్ సభ్యులే కనుకనూ, ఆంధ్ర ప్రభుత్వం రాష్ట్ర కాంగ్రెస్ విధానాన్ని అనుసరించ వలసివుంటుందని వాళ్ళు వాదిస్తున్నారు. ఇటీవల ఆంధ్రాలో పర్యటించిన అఖిల భారత కాంగ్రెస్ కార్యదర్శి బల్వంతరాయ్ మెహతా కూడా ఈ వాదాన్ని సమర్ధించారు. ఈ పరిస్థితులవల్ల వచ్చే ఎసెంబ్లీ సమావేశంలో ఆంధ్ర ప్రభుత్వపురంగు అటో, ఇటో తెలిసిపోతుందనే భావించవచ్చు.



# అనాధ బాలికలు

డా॥ మిసెస్. ముత్తులక్ష్మిరెడ్డి

"అనాధలకు ఆహారం సమకూర్చలేని, విధవలకు మనశ్శాంతి యివ్వలేని భగవంతుడన్నా, మతమన్నా నాకు నమ్మకంలేదు." అని శ్రీరామకృష్ణపరమహంస శిష్యాగ్రేస్వరుడైన వివేకానందుడు ఉద్ఘాటించేడు. శ్రీరామకృష్ణుని దివ్య సందేశం ఈ శిష్యుని వల్లనే ప్రపంచానికి వెల్లడయింది. సంస్కృతం రాని మనలో చాలమందికి మన హిందూమతంలోని అనేక ధర్మాలు, స్వామి వివేకానందుని ప్రవచనాల ద్వారానే తేటతెల్లమయ్యేయి. రామకృష్ణమఠమూ, దాని వ్యవస్థాపకుడు శ్రీవివేకానందుడూ మూలంగా హిందూమతానికి పునర్జీవం ప్రాప్తించింది. దేశంలో ఎక్కడ క్షామాలు వచ్చినా, వరదలు, అగ్నిప్రమాదాలు వచ్చినా, అంటుజాడ్యాలు ప్రబలినా ఈ మతంవారు చేసే సేవ అమోఘమైంది. శ్రీరామకృష్ణ సంస్థతరపున అనేక అనాధశరణాలయాలు, ఆసుపత్రులు, విద్యాలయాలు నెలకొల్పబడ్డాయి. వీరు ప్రత్యక్షంగా సేవలు గావించి— "మతమంటే మానవసేవ— మానవ సేవే— మాధవసేవ" అని నిరూపించేరు.



(డా॥ మిసెస్. ముత్తులక్ష్మిరెడ్డి)
(మద్రాసు అవ్వయ్‌హోమ్ సంస్థ వ్యవస్థాపకురాలు)

శ్రీమాన్ రాజగోపాలాచారిగారి అధ్వర్యాన్న రాష్ట్రంలోని దేవస్థానాలన్నీకూడ వాటికి వచ్చే ఆదాయంలో కొంత భాగం అనాధ బిడ్డల శరణాలయాలకు ఖర్చు పెట్టాలని నిర్ణయింపబడ్డం చాల హర్షింపదగ్గవిషయం. మన హిందూ మత చరిత్రలో ఇది గొప్ప ముందడుగు అవుతుంది.

"భగవంతుని ప్రసాదం అతని భక్తులందరూ పంచుకోవాలన్న ఉద్దేశంతో గుళ్ళల్లో ప్రసాదం పంచి పెడతారు. అందుచేత అటువంటి పవిత్రమైన వాతావరణంలో అనాధ బాలలు నివసించడం, పెరగడం, తర్ఫీదు పొందడం చాల సమంజసం" అని శ్రీరాజగోపాలాచారి గారు అడయారులో దేవస్థానం తరపున తెరవబడ్డ మగ పిల్లలఅనాధశరణాలయం ప్రారంభోత్సవ సందర్భంలో నుడివిన సుభాషితాలు. ఇప్పటికి దేవస్థానాల తరపున 9 శరణాలయాలు తెరవబడ్డాయి. ఇంకా ఎన్నో తెరవవలసియుంది. ఈ రాష్ట్రంలో అనాధ బిడ్డలు లక్షలాదిగా వున్నారు. వీరిలో బాలురకన్నా బాలికలే ఎక్కువగానున్నట్లు జనాభా లెక్కలవల్ల తేలింది. ఈ అనాధ బాలికలను ఉత్తమ పౌరులుగా చెయ్యాలీ అంటే వారిని శరణాలయాల్లో పెంచి, యధోచిత శిక్షణనివ్వాలి. అలాగ ఆదరించనట్లయితే వాళ్ళంతా ముష్టివాళ్ళగానో, వ్యభిచారిణిలుగానో తయారవుతారు.

తల్లిదండ్రులున్నా కూడా బీదవాళ్ళయినట్లయితే ఆడపిల్లలకు వివాహాలు చెయ్యలేకపోవడం మనం చూస్తూనే వున్నాం. అటువంటప్పుడు అనాధలైన ఆడపిల్లలగతి వేరే చెప్పనక్కరలేదు. మన రాష్ట్రంలో విధవలు, భర్తల వల్ల విడిచిపెట్టబడ్డ దీనులు లక్షలాదిమంది స్త్రీలు పిల్లలతో అలమటిస్తున్నారు. మా శరణాలయంలోకి వచ్చేవారంతా ఈ తరగతికి చెందినవారే. అందుచేత స్త్రీలకు వివాహమొక్కటే జీవితపరమావధి అని అనుకోరాదు.

బాలికలు స్వతంత్రులుగా బ్రతుకగలవారిగాను, ఆత్మవిశ్వాసం గలవారిగాను తర్ఫీదు పొందియుండాలి. ఇంకా వారు టీచర్లు, డాక్టర్లు, నర్సులు, మంత్రసానులు, గుమస్తాలు, యిలా అనేక రకాల ఉద్యోగాలకు తర్ఫీదు పొందవచ్చు. ఏదో ఒక వృత్తిలో ప్రావీణ్యత పొందిన తర్వాత వారికి యిష్టమైనట్లయితే వివాహం చేసుకుని జీవితంలో స్థిరపడవచ్చు. పిమ్మట ఏ కారణంచేతనైనా భర్త విడిచిపెట్టినా, లేక దురదృష్టవశాత్తు భర్త చనిపోయినా, ఆమె తననూ, తన కుటుంబాన్నీ కూడ పోషించుకోగలుగుతుంది. ఆడపిల్లల విషయంలో అంతా కూడా పైపద్ధతి ప్రకారం తర్ఫీదు ఇవ్వాలి.

మన హిందూమందిరాల్లో దేవునికీ, దేవికీ సమాన హోదానిచ్చి, అతనితోబాటు ఆమెనూ సమానంగా ఆరాధించి, పూజిస్తారు. దీన్నిబట్టే తెలుస్తుంది- మనమతంలో స్త్రీ పురుషులిద్దరూ సమానమేనని. అందుచేత బాలురతో బాటు అనాథ బాలికలకు కూడ దేవస్థానం తరపున కొన్ని శరణాలయాలు వుండాలి. క్రైస్తవ ప్రచారకులు, మత ప్రచారంకొరకని అనేక విద్యాసంస్థలు స్త్రీలకొరకు మన దేశంలో నెలకొల్పారు. అనాథ బాలికలకు, బాలురకు కూడ శరణాలయాలు స్థాపించేరు. అలాంటి క్రైస్తవ శరణాలయాలు దేశంలో 200 వరకు వున్నాయి. కాని మన హిందూ శరణాలయాలు వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు.

"మన దేశంలో స్త్రీలకు సంబంధించిన గడ్డుసమస్యలు అనేకం వున్నాయి. ఐనా "విద్య- సద్విద్య- శిక్షణ" అనేటటువంటిగారడీ వల్ల ఎటువంటి సమస్యనైనా పరిష్కరించవచ్చు." అని శ్రీ వివేకానంద ప్రబోధించేరు. అందుచేత మీ స్త్రీలను విద్యావతులుగా చెయ్యండి. నేను ఒక స్త్రీగా బిడ్డలున్న తల్లిదండ్రులందరికీ యిదే సందేశం తిరిగియిస్తున్నాను. దేవస్థానాల్లోని అధికారులంతా పురుషులే అవడంవల్ల బాలికల శరణాలయాలు నిర్వహించడం కష్టమేగావచ్చు. కాని మద్రాసు పట్నంలో అనేక స్త్రీ సంస్థలున్నాయి. దేవస్థానంవారు ఆర్థిక సహాయం చేసినట్లయితే యీసంస్థలే బాలికల శరణాలయాలు కూడా నడపగలవు. తిరుపతి దేవస్థానంవారు మాత్రం బాల, బాలికల శరణాలయాలు రెండూకూడ జయప్రదంగా నడపగలుగుతున్నారు.

(సోషల్ వెల్ఫేర్ పత్రికనుండి)

పెద్దలీవిధంగా చెపుతున్నప్పుడు, దేశంలో అనాథల పిల్లలకు ఎంతో రక్షణ, పోషణాకల్పించాలని సంఘ సంక్షేమ శాఖ కృషి చేస్తున్నప్పుడు- ప్రభుత్వం యిదే తమ ఆశయం అని ప్రకటిస్తున్నప్పుడు- 40 ఏళ్ళగా శ్రీ పిఠాపురం మహారాజావారి ధర్మం వల్ల దిగ్విజయంగా ఎప్పుడూ 80 మంది (తల్లిదండ్రుల్లేని) బాల - బాలికల్ని పోషించి, విద్యాబుద్ధులుగరిపి, వృత్తి విద్యలుకూడా నేర్పించి, యుక్తవయస్కులైన ఆడపిల్లలకు వివాహాలు చేయించి, ఆదరిస్తూ వచ్చిన కాకినాడలోని అనాథ శరణాలయం- ప్రభుత్వంవారు మూసేయడం హర్షింపదగ్గ విషయంగా లేదు. కొత్త అనాథ శరణాలయాలు స్థాపించే ముందు- ఇలా మూలబడ్డవాటిని పునరుద్ధరించడం ప్రభువులు, దేవస్థానాలు, ప్రజాహితాభిలాషులు, సంఘ సంక్షేమ కృషివేత్తలు అందరి కర్తవ్యమూ ఐయుంది.

॥సం॥



## పాఠకులకు చందాదారులకు మనవి:

'ఆంధ్రమహిళ' కాపీలు వి. పి, గా పంపించ వలసినదని అనేకులు మాకు వ్రాస్తున్నారు. అదనం కాపీలు అంత హెచ్చుగా ముద్రించని కారణమున అడిగిన వాదందరినీ సంతృప్తిపరచ లేక పోతున్నాం.

దయయుంచి కాపీలు కావలసినవారు, క్రొత్తవార్ని చందాదారుగా చేర్చి సంస్థకు తోడ్పడే వారు ముద్రణకు ముందుగానే తెలియపరుస్తుంటే అందర్నీ సంతృప్తి పర్చగలమని మనవి.

ఆంధ్ర ప్రజానీకం జూపుతున్న ఆదరణకు 'ఆంధ్రమహిళ' కృతజ్ఞురాలు. విరివిగా సేవ జేయగల అవకాశం యిస్తున్నందుకు తన విధిని యథాశక్తి నిర్వర్తింప గలదు.

# పిల్లల ఆహారం

పసిపిల్లల ఆహారాన్కి క్రమంగా జేర్చేవి, వారి వారి తత్వాల్నిబట్టి కాలం, పరిమాణం కొంచంగా మార్చుకుంటుండాలి.

| ఏ ఆహార పదార్థం | మొదట్లో ఎప్పుడు తినబెట్టొచ్చు | ఎంత |
|---|---|---|
| పళ్ళరసం | 3-వ వారం | ఒక టీచెమ్చాడు, క్రమక్రమంగా అర చెమ్చాడు హెచ్చిస్తూ 6-వ నెల నాటికి 1-1½ ఔన్సులు చెయ్యొచ్చు. |
| పళ్ళు : (అరటి, మామిడి, ఆపిల్) | 4-6 వారాలు | రోజుకు ¼ ఔన్సు. వారం విడిచి వారానికి ¼ ఔ. చొప్పున హెచ్చించండి. |
| కాడ్‌లివర్ ఆయిల్ వంటివి | 6-8 వారాలు | నారింజరసంతో ఒక చుక్క. క్రమంగా హెచ్చిస్తూ రోజుకు ఒక టేబిల్ చెమ్చాడువరకు తేవచ్చు. |
| గ్రుడ్డు | 3-4 మాసాలు | మెత్తగా వండిన పూర్ణం. క్రమంగా 6 వారాల నాటికి పూర్ణమంతా యివ్వొచ్చు. గ్రుడ్డుసొన కొంచం కొంచం చేరుస్తూ— క్రమంగా 5—6 మాసాలనాటికి గ్రుడ్డు పూర్తిగా యివ్వొచ్చు. |
| అన్నం వగైరాలు : (జొన్న, గంటి, చోడి, పేలాలు, మెత్తటి అన్నం.) | 4-6 మాసాలు | జావలాగవడగట్టి 1-1½ ఔ. క్రమంగా మెత్తగా వండి అన్నం నేర్పండి. |
| కూరలు : (కేరట్, బంగాళాదుంప, దుంప కూరలు, ఆకు కూరలు, బీట్, బీర, చిరగడం) | 4-6 మాసాలు | వండి, మెత్తగా పిసికి ఒక టేబుల్ చెమ్చాడు యివ్వాలి. 6-8 మాసాలనాటికి 1½-2 ఔ.లకు హెచ్చించండి. |
| పప్పులు | 4-6 మాసాలు | బాగా వండి పిసకాలి. 1 టేబుల్ చెమ్చాడు. అన్నంతో గాని వట్టినేగాని పెట్టండి. క్రమంగా పరిమాణం హెచ్చించండి. |
| మాంసం పులుసు | 6 మాసాలు | ½ ఔన్సు. 6—10 నెలలకు 2 ఔన్సులకు హెచ్చించండి. |
| చపాతీలు | 6-7 మాసాలు | చిన్న ముక్కలు. క్రమంగా పెద్దవి ఇవ్వండి. |
| మాంసం (మరలో మెత్తగా తిప్పింది) | 9 మాసాలు | ఒక టీచెమ్చాడు. పరిమాణం క్రమంగా జాగ్రత్తగా హెచ్చించండి. |

భోజనం దగ్గర - మీ బిడ్డ చూపే దృక్పథం.

| | |
|---|---|
| 15—21 మాసాల వయస్సప్పుడు | "ఇది నాది" అనే స్థితి. తినడాన్కి కెలకడం, పిసకడం చేస్తుంది. పైపై బుజ్జగింపులు వగైరాల్నిబట్టి ఆకలి మారుతుంటుంది. రుచిలో భేదాలు యిట్టే పసిగడుతుంది. |

## పిల్లల ఆహారం

| | |
|---|---|
| 2-వ ఏట | తిననంటుంది, మారాం చేస్తుంది. కేరట్, బీట్‌రూట్ వంటి రంగు రుచీ ఉన్న తిళ్ళు అంటే యిష్టపడుతుంది. |
| 3-వ ఏట | తీపీ, పులుపూ కావాలంటుంది. కొత్త కూరలు తింటుంది. |
| 4-వ ఏట | తిండి దగ్గర మళ్ళీ మారాం. పూర్తిగా ఎగ్గొట్టడం కూడా చేస్తుంది! ఈ స్వభావం నిల్వదు. ఏమీ శ్రమపడకండి. |
| 5-వ ఏట | సాధారణంగా పెట్టినవన్నీ తింటుంది. కూరలు వగైరాలు కలిపిన అన్నం అంటే యిష్టపడుతుంది. |
| 6-వ ఏట | ఇష్టా ఇష్టాలు చూపిస్తుంది; తిండి దగ్గర తరుచు మొండిపట్లు పడుతుంటుంది. |
| 7-వ ఏట | పెట్టింది తింటుంది. తరుచు త్వరగా త్వరగా తినేసి ఆటకు పరిగెట్టడాన్కి చూస్తుంటుంద. తిండి తినడం అనగానే హడావిడి! |

- ప్రతీ బిడ్డనూ ప్రత్యేక వ్యక్తిగా గమనించండి.
- తిండి దగ్గర క్రమరీతిని ప్రవర్తించేటట్లు నేర్పడాన్కి అనువైన కాలంయిది. రకరకాల ఆహారాలు, వంటకాలూ యిప్పుడు నేర్పొచ్చు.

(సోషల్ వెల్ఫేర్ పత్రికనుండి తర్జుమా)



# రామాబాయి రనడె

రామాబాయి జీవిత చరిత్ర చదువుతూవుంటే అది ఒక కథలా తోస్తుందేగాని, 'యిది వాస్తవం' అని అనిపించదు. చిన్నతనం నుండీకూడా రామాబాయి అటువంటి పట్టుదలను కనుపరచింది.

సతారా రాష్ట్రంలోని 'దేవరాస్తా' పల్లెలో రామాబాయి 1862 వ సంవత్సరంలో పుట్టింది. ఈ రాష్ట్రంలో చాలా మంది రైతాంగానికి చెందినవాళ్ళు. తదితరులందరూ బ్రాహ్మలు. ఈ బ్రాహ్మలలో ఉత్తమవర్గానికి చెందిన కరులేకర్ వంశంలో పుట్టింది రామాబాయి. రామాబాయి వంశీయులు కొంకణ్ ప్రాంతాలకి చెందినవాళ్ళు. భూస్వాములేకాక పండితులుకూడా మరాఠా సైన్యంలో చేరి కీర్తి ప్రఖ్యాతులని ఆర్జించుకొన్నారు. మరాఠా రాజ్యంలో పీష్వాల పతనంతోపాటే యీ కరులేకర్ల కాంతి కూడా సన్నగిలింది.

రామాబాయి తండ్రి అన్నివిధాలా తన వంశీయుల పేరు నిలిపాడు. తల్లి ప్రఖ్యాత వైద్యుని కూతురు. ఆ చుట్టుపక్కల దొరికే మూలికలతో మందులు తయారు చేసి, బీదసాదలకి సహాయపడేది. తన పిల్లలనీ, యిరుగు పొరుగు పిల్లలనీ చేరతీసి రామాయణ, పురాణగాథలు చెప్తూండేది. 'ఇదంతా ఎందుకొచ్చిన అవస్త' అని ఎవరేనా అడిగితే 'వాళ్ళకి యీ కథలు యిప్పుడు తెలియకపోయినా తరువాత జీవితంలో ఎంత సహాయపడతాయి' అని చెప్పేదట రామాబాయి తల్లి. అంతేకాదు 'యీ కథలు ఎవరికీ ఏహానీ చెయ్యవు. ఏమేనా చేస్తే మంచే చేస్తాయి' అనేదట. అనేక సంవత్సరాల తరువాత, యిలా కథలు విన్న ఒక చిన్న పిల్ల 'నా జీవితంలో ఎన్నెన్నో జరిగాయి. నేనెన్నో మరిచిపోయాను. కాని నా మనః ఫలకంమీద శాశ్వతంగా వున్నాయి అమ్మ చెప్పిన కథలు' అని వ్రాసింది. ఇటువంటి యింటిలో చిన్నతనం అంతా గడిపినా రామాబాయికి ఎవరూ, చదువనూ, వ్రాయనూ నేర్పుదామని తలపెట్టలేదు. రామాబాయి ఒకసారి, తండ్రి తన అన్నయ్యకు రాసిన ఉత్తరం చదువలేకపోయింది. ఆక్షణం నుండీ కూడా రామాబాయికి చదువుకోవాలనీ వ్రాయడం నేర్చుకోవాలనీ బలీయమైన కోరిక ఏర్పడింది. కాని చెప్పేవారు ఎవరూ లేరు. ఆ రోజులలో స్త్రీలకెవరికీ చదువన్నా వ్రాతన్నా యిష్టం తక్కువ. అయినాకూడా రామాబాయి ఎన్నో ఉపయోగకరమైన విషయాలు నేర్చుకొంది. తండ్రి గాంభీర్యాన్నీ ఔన్నత్యాన్నీ తల్లి నవనీత హృదయాన్నీ తనలో జీర్ణింప చేసుకొంది. కౌమారదశలోనే ఉత్తమనారీ లక్షణాలన్నీ అలవరచుకొంది.

రామాబాయికి పన్నెండో సంవత్సరంలో వివాహ ప్రసక్తి వచ్చింది. మహాదేవ్ గోవింద్ రనడె దక్షిణాపథాన పేరుగాంచిన వ్యక్తి. రామాబాయికంటె ఇరవైరెండు సంవత్సరాలు పెద్ద. ఇటువంటి వ్యక్తిని వివాహమాడటానికి రామాబాయికి భయమేవేసింది. కాని రనడెకికూడా యీ వివాహం అంత యిష్టంలేదు అని విన్నప్పుడు యింకా భయపడింది. ఎవరికి ఇష్టం లేకున్నా వివాహం మట్టుకు అయిపోయింది: మహాపండితుడయిన రనడెకీ అక్షరజ్ఞానం లేని రామాబాయికీ.

ఇంటికి భార్యను తీసుకువచ్చాక రనడె ఒకటి గమనించాడు: రామాబాయి సూక్ష్మగ్రాహి. ఆనాడే నిశ్చయించాడు: ఆమెకి చదువనూ వ్రాయినూ నేర్పాలని. ప్రతిదినం భార్యాభర్తలు కొన్ని గంటలు గురుశిష్యులయేవారు. ఇది, పురాతన సాంప్రదాయాను వర్తులయిన కుటుంబంలోనివారికి నచ్చలేదు. రామాబాయే దానికి కారణంగా ఆమెని అసహ్యించుకొనేవారు. అయినాకూడా రామాబాయికాని రనడె కాని తాము పట్టిన పట్టు విడువలేదు. యీ దీక్ష ఫలితంగా రామాబాయి చదువనూ వ్రాయనూ నేర్చుకొంది. ఇంటి పనులూ, వంటా సరిగా రాకపోయినా బాధపడని యింట్లోవారికి, ఆమె చదువుకంటక ప్రాయం అయింది.

శ్రీమతి కె. రామలక్ష్మి

కొద్దిరోజుల శ్రమతో రామాబాయి ఇంగ్లీషు కూడా నేర్చుకొంది. "క్రియా సిద్ధిస్సత్వే మహతాన్నోపకరణే" అన్నది అక్షరాలా నిరూపించింది రామాబాయి. కొన్ని సంవత్సరాల తరువాత తన జీవిత చరిత్రను మరాఠీ భాషలో వ్రాసింది. పుస్తకాలంటే యిష్టంవున్న ప్రతివారూ చదువవలసిన జీవితచరిత్ర అది. ఆమె మంచి వక్తకూడా అయింది. బొంబాయి గవర్నరు ఆధ్వర్యాన జరిగిన ఒక సభలో ఇంగ్లీషులో ప్రసంగిస్తూ ఆడపిల్లలకి ఒక హైస్కూలు స్థాపించాలని ఉద్ఘాటించింది.

కొద్ది సంవత్సరాల తరువాత రనడె నాసిక్‌కి జడ్జిగా వెళ్ళవలసివచ్చింది. భార్యాసమేతంగానే వెళ్ళాడు. పూర్వీకులైన పెద్దలు కూడా లేనందున చాలా రోజులు భార్యా భర్తలు ఆనందంగా వున్నారు. చాలా కాలంవరకూ పిల్లలు కలుగనందున, ఒక అమ్మాయినీ ఒక అబ్బాయినీ పెంచుకున్నారు రనడె దంపతులు. తీరిక సమయంలో తన చుట్టుపక్కలవారిని పరిశీలించడం నేర్చుకొన్న రామాబాయి, అందరూ తనంతసంతోషంగా లేరన్నసంగతి తెలుసుకొంది. అప్పటినుండీ యితర స్త్రీలయెడల ఆమె ఆదరాభిమానాలు ద్విగుణీకృతం అయాయి. భర్తతోపాటు పర్యటిస్తూ ఆమె అనేక విషయాలు తెలుసుకొంది.

జీవితం ప్రశాంతంగా ఎన్నాళ్ళు సాగుతుంది?.... రనడెకి చాలా జబ్బుచేసింది. ఆ జబ్బునుండి ఆయన తేరుకోడని డాక్టర్లునిర్ధారణ చేశారు. ఆ జబ్బులోనే రనడె 1901 లో స్వర్గస్థుడయాడు. రనడె జీవితంతోపాటే తన జీవితంకూడా ఒక లెఖ్ఖన ముగిసినట్లుగా భావించింది రామాబాయి. కారణం, ఆమెకి జీవితంలో వెలుగుబాట చూపిన వ్యక్తే రనడె. అతడే లేకుంటే?—కొన్నాళ్ళపాటు ప్రపంచంతో సంబంధమేలేకుండా ఏకాంతంగా కాలం గడిపింది. ఆమె పెంపుడు కూతురు ఎన్నోవిధాల ప్రయత్నించింది సాంఘికసేవలో మనశ్శాంతి కల్గిద్దామని. కాని రామాబాయి భర్తృవియోగం తీవ్రాఘాతంగాభావించింది. దానినుండి కోలుకోలేనని తలపోసింది. తన కూతురి ప్రోద్బలంవల్ల - యీరోజుల్లోనే భర్తతోకలిసిన తన జీవితాన్ని పుస్తకరూపంలో రాసింది. "Reminicences of our life" అన్న యీ మరాఠీ పుస్తకం ఉత్తమ సాహిత్య వర్గానికి చెందుతుందని అంటారు. ఆ తరువాతే రామాబాయికి తోచింది: తన భర్త స్థానాన్ని ఇంకే యితర విషయమైనా పూరింపలేదా? పండిత రామాబాయి తన కష్టాలను ధైర్యంగా ఎదుర్కోలేదా? అలాగేతనూ, ధైర్యం తెచ్చుకొని మానవాళికి ఉపయోగించే ఏ కార్యక్రమమేనా ప్రారంభించరాదా?

హిందూ వితంతువుల దైన్యావస్థ రామాబాయికి తెలుసు. వారికి తనకు చేతనయిన సహాయం చేయ నిశ్చయించింది. అలాగే జైళ్ళలో విషాద పూరిత జీవితాలను గడిపే యువతులసంగతి ఆలోచించింది. వారికీ తనకు చేతనయిన సహాయం చేయ నిశ్చయించింది. రోగార్తులు-వారికి కూడ ధైర్యంచెప్పేవారు అవసరం. కాని యిన్నీ ఒక్కర్తే ఎలాగ చెయ్యగలదు? స్త్రీలని యీ విషయాలలో తర్ఫీదు చేయడానికి ఒక కేంద్రం స్థాపించింది. అదే "పూనా సేవా సదన్." ఈ సేవాసదన్‌కి బొంబాయి రాష్ట్రంలో అనేక ఉపశాఖలు ఏర్పడ్డాయి. మొదట్లో యీ సేవాసదన్ సమావేశాలు రామాబాయి యింట్లోనే జరిగేవి. కాని త్వరలోనే యీ సంస్థ స్వంత భవనం కొనుక్కో గలిగింది. ఈ సంస్థ సేవికలను తయారుచేయడమే కాకుండా స్త్రీలకు చదువనూ వ్రాయనూ నేర్పేది. జీవితంపట్ల ఆశాభావాన్ని అంకురింప చేయడమే యీ సంస్థ లక్ష్యం. కాలం గడచిన కొద్దీ యీ సంస్థకు అనేకులు సహాయులయారు. ఈ సంస్థ చేసే పనికూడా విస్తరించింది. స్త్రీలకి చదువు సంధ్యలు నేర్పడం, ఆరోగ్య విధులు నేర్పడం, స్థానిక పారిశుద్ధ్యాన్ని నేర్పడం - కాక, గ్రంథాలయాలు స్థాపించి ఉపన్యాసాలు యిప్పించి స్త్రీల విజ్ఞానాభివృద్ధికి అనేక విధాల పాటుపడింది. దేశ భవిష్యత్తులో తాము ఒక స్థానాన్ని ఆక్రమించు కోవాలనే కోరిక దేశస్త్రీలలో యీ సంస్థ నాటకల్గింది. సేవాసదన్‌లో నర్సింగ్,వైద్యసంఘాలు స్థాపించింది రామాబాయి. వీటిలో హిందూ వితంతువులు, కన్యలు చేరి చేయూత నిచ్చారు. వీరిలో మొదటి దళాన్ని రామాబాయి, పూనా ససూన్ ఆసుపత్రికి ట్రైనింగుకై తీసుకొని వెళ్ళింది. ఆదినం మొదలు అనేకులు నర్సింగు అభ్యసించి రోగుల సదుపాయాలు చూడ్డానికి కంకణం కట్టుకున్నారు. తన గృహంలోనే అందరికీ అన్ని సదుపాయాలూ సమకూర్చింది. పిల్లలూ పెద్దలూ అంతా గుమిగూడి తమ అభిరుచులకి ఆకృతి కల్పించుకొనే వారు. పిల్లల కోసం ఆమె అనేక పుస్తకాలు వ్రాసింది.

స్త్రీల హక్కుల పోరాటంలో కూడా రామాబాయి పాత్ర వహించింది. బాలికల విద్యా సౌకర్యాల కోసం, హిందూ వితంతువుల ఉద్ధరణ కోసం ఆమె ఎంతో పాటు

పడింది. పిల్లల ఆరోగ్యం స్త్రీల ఆరోగ్య విషయాలు ఆమె ముఖ్యాతి ముఖ్యంగా ఎంచేది. కారణం, వారే భావి భారత దేశానికి ఆయువు పట్టని ఆమె నమ్మకం. ఆమె, ప్రతి రెండు వారాలకి ఒక కారాగారాన్ని సందర్శించేది. వారిలో ఆశాభావం నశించి పోకుండా వారికి పద్యాలూ, గ్రంథాలూ చదివి వినిపించేది.

ఏప్రిల్ 1922 లో రామాబాయి జబ్బు పడింది. అదే సంవత్సరం అదేనెలలో ఆమె స్వర్గస్తురాలయింది. ఆమె చనిపోయినా ఆమె పేరు శాశ్వతంగా నిలిచి పోయేందుకు సేవాసదన్ వుంది. ఈ రోజు వరకూ, సేవాసదన్ సేవిక లకి తర్ఫీదు యిస్తూనే వుంది.

ఒకే ఒక స్త్రీ (అబల!) యింతసేవచేయ కల్గిన దంటే లక్షలాది వనితలున్న భారత దేశంలో సేవికలకి కొదువలేదు. రామాబాయి రనడె జీవితం ఒక లక్ష్యంగా పెట్టుకొంటే నిరక్షరాస్యత ఎంతలో తొలగదు? దీక్ష పూనాలేకాని స్త్రీలు సాధించనిదేమిటి? రామాబాయి నేటి వనితాలోకానికి ధృవతార కావాలి. అప్పుడే పీడిత ప్రజా నీకానికి ఆశాభావం అంకురింప చేసే వనితా రత్నాలు పైకి వస్తారు. రామాబాయి రనడె కీర్తినికూడా యినుమ డింపచేసింది. రామాబాయి భౌతికంగా చనిపోయినా, చేసిన అపారమైన సేవ వల్ల ఆమె కీర్తి శాశ్వతంగా జీవించే వుంటుంది. రామాబాయిరనడె ఒక స్వయంసిద్ధ.



# కస్తూరిబా గాంధీ జాతీయ స్మారక ట్రస్టు

# సేవాకార్యము, సీతానగరము.

—:o:—

శ్రీ కస్తూరిబాగాంధీ 1944 ఫిబ్రవరి 22 వ తేదీన ఆగాఖాన్ భవనములో రాజకీయబందీగా వున్న సమయమున మరణించిరి. ఈమె మహాత్మాగాంధీ అడుగు జాడలలో నడుచుచూ పేదస్త్రీలు, పిల్లలయొక్క యోగ క్షేమములనెల్లప్పుడు కోరుచూ వారి సేవలోనే ప్రాణత్యాగ మొనర్చిరి. గాన మన దేశనాయకులు కస్తూరిబా పేర వివిధ రాష్ట్రములలో ఒక జాతీయ స్మారక నిధిని ప్రోగు చేసిరి. ఆంధ్రరాష్ట్రమునందు శ్రీ బులుసు సాంబమూర్తి, శ్రీమతి దుర్గాబాయిగార్ల కృషి ఫలితముగా ఐదు లక్షల రూప్యములు వసూలైనవి. ప్రప్రథమమున ఈ జాతీయ స్మారక నిధికి పూజ్యబాపూజీ అధ్యక్షులుగావుండిరి.

కస్తూరిబా నిరాడంబరియై ఎల్లప్పుడు పల్లెటూరి జీవితమునే అభిలషించుచూ, అచ్చటి ప్రజల సేవయందు నిమగ్నురాలై యున్నదగుటచే ఈమె పేర నున్న ఈ జాతీయ నిధి పల్లెలలోని స్త్రీ, శిశువుల, ప్రసూతి, పరిశుభ్రత, ఆరోగ్యము, విద్యల కొరకు వుపయోగించవలెనని బాపూజీ నిశ్చయించిరి. వీరు ఈ కార్యక్రమ మంతయు స్త్రీ కార్య కర్తల ద్వారానే జరిపించ దలచిరి. గాన గ్రామాదులందు పని చేయుటకు ఉత్సాహ వతులగు స్త్రీ కార్యకర్తలను తయారు చేయుటకై శిక్షణ కేంద్రములున్నూ, ఈ కార్య కర్తలద్వారా పల్లెలలో గ్రామసేవా కేంద్రములు నడుపుటకున్నూ నిర్ణయించిరి.

ఆంధ్ర దేశమందు నిధి కార్యక్రమ ప్రారంభము:— ఆంధ్ర రాష్ట్రములో గ్రామసేవికా శిక్షణ కేంద్రము ఏర్పరచుటకు 1945 సం॥ రములో ఆంధ్రరాష్ట్ర కస్తూరిబా గాంధీ జాతీయ స్మారకనిధి ప్రతినిధి యగు శ్రీమతి దుర్గాబాయమ్మగారు ఎనమండుగురు మహిళలను సేవాగ్రామములోని హిందూస్థానీ తాలీమీ సంఘమునకు పంపి ఒక సంవత్సరము తరఫీదు ఇప్పించిరి. ఈ మహిళల ద్వారానే ఆంధ్ర దేశమందు ట్రస్టు కార్యక్రమము ప్రారంభమయ్యెను. శ్రీమతి దుర్గాబాయమ్మగారు కాన్‌స్టిట్యూషన్ అసెంబ్లీ మెంబరుగా ప్రత్యేక బాధ్యతలు వహించవలసి వచ్చుటచే ట్రస్టునుండి స్వల్ప కాలములోనే విరమించుకొనిరి. తదుపరి శ్రీమతి డి. యస్. విద్యాదేవి B.A., B.L. గారు 1950 జనవరి వరకు ప్రతినిధిగా పనిచేసి వీరుకూడ విరమించిరి. అప్పటినుండి శ్రీమతి దిగుమర్తి బుచ్చి కృష్ణమ్మగారి యజమాన్యమున ఆంధ్ర దేశమందు ట్రస్టు పని జరుగుచున్నది.

శిక్షణ కేంద్రములు:— ఆంధ్ర దేశమందు ప్రథమమున కస్తూరిబా గ్రామ సేవికా శిక్షణ కేంద్రము ప్రారంభించుటకు తగిన స్థలము నిర్ణయించవలసి వచ్చెను. ఇందుకు తూర్పుగోదావరి జిల్లా సీతానగరమునందు కీర్తిశేషులు, విఖ్యాత పురుషులు యగు డా॥ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారు స్థాపించిన గౌతమీ సత్యాగ్రహ ఆశ్రమము తగియుండునని తలచి శ్రీమతి దుర్గాబాయమ్మగారు పూజ్య బాపూజీని కోరగా వారు దీనిని అఖిలభారత చరఖా సంఘం నుండి ట్రస్టుకి ఇప్పించిరి. ఈ ఆశ్రమము 11 ఎకరముల విస్తీర్ణము కలిగి 13 పెంకుటిండ్లున్నూ, మరి కొన్ని పూరి ఇండ్లతోనూ గ్రామ సమీపముగా శిక్షణ కేంద్రమునకు చాల అనుకూలముగా యున్నది. ఇచ్చట 1946 జూన్ 9 వ తేదీన మద్రాసు ప్రభుత్వపు అప్పటి విద్యాశాఖామంత్రి శ్రీ అవినాశలింగంచెట్టియారు గారిచే గ్రామ సేవికా శిక్షణ కేంద్రమున్నూ, పునాది పాఠశాలయున్నూ నెలకొల్పబడినవి. ఇప్పటికి శిక్షణ కేంద్రమునందు 116 మంది గ్రామసేవికలు శిక్షణ బడసిరి. వీరు ఆంధ్ర దేశమందలి వివిధ జిల్లాలనుండియు, హైదరాబాదు కస్తూరిబా ట్రస్టు, మరియు శ్రీ జనాభ్యుదయ శాఖ తరపు నుండియు కూడ వచ్చిరి. పునాది పాఠశాలకు చుట్టు ప్రక్కల పల్లెల నుండి 450 మంది బాలబాలికలు వచ్చి విద్య నభ్యసించిరి. గ్రామ సేవికలకు శిక్షణ కాలములో ఉచిత భోజన వసతు

లిచ్చి రెండు సంవత్సరములు తరఫీదు ఇవ్వబడును. వీరిలో మంత్రసాని శిక్షణ బడయగోరు వారు ప్రథమమున 6 మాసములు గ్రామ సేవికా శిక్షణ పొంది, తదుపరి రెండు సంవత్సరములు మంత్రసాని శిక్షణ పొందవలెను. శ్రీ బొబ్బిలి మహారాజావారు మంత్రసానులకు వారి ఘోషా ఆసుపత్రిలో శిక్షణ యిచ్చుటకై అవకాశమిచ్చి, విద్యార్థిను లుండుటకు తగిన గృహవసతి కూడ ఏర్పరచి యిచ్చుటచే 1946 సంవత్సరాంతమున 8 గురు స్త్రీలను మంత్రసాని శిక్షణకై బొబ్బిలి పంపడమైనది. ఇంతవరకు ఆంధ్ర దేశ మందు సేవాశ్రమం (Service Home) లేదు. పేద అసహాయ స్త్రీలకు 8 వ తరగతివరకు విద్యాయోగ్యత యున్నూ, కుట్టు, వడుకు మొదలగు చేతిపనులయందు ప్రత్యేక నిపుణతయున్నూ కలుగజేసి, జీవనాధారము చూపు ఈ సేవాశ్రమం అవసరము ఆంధ్ర దేశమునకు ఎంతైననుకలదు. గాన ఇచ్చట కస్తూరిబా ట్రస్టువారు తమ అధ్వర్యమున సేవాశ్రమం నడుపుటకు పూనుకొనిరి. ఆంధ్ర రాష్ట్ర స్త్రీజనాభ్యుదయశాఖవారు దీనికి అన్నివిధ ముల తోడ్పడుటకు అంగీకరించిరి. 1954 జూన్ 23 వ తేదీన కేంద్ర సాంఘిక సంక్షేమ అధ్యక్షులు శ్రీమతి దుర్గాబాయిదేశ్‌ముఖ్ గారిచే ఈ సేవాశ్రమ ప్రారంభో త్సవము జరిపించడమైనది. దీనికి ఆంధ్రరాష్ట్ర ప్రభు త్వమువారున్నూ, మరియు కేంద్ర సాంఘిక సంక్షేమ సంఘమువారున్నూ ఆర్థిక సహాయము చేయ నంగీక రించినందుల కెంతయు సంతసించుచున్నాము. ఇచ్చటి గ్రామసేవికా శిక్షణలో ఒక భాగమైన ప్రీ బేసిక్ టీచర్సు ట్రైనింగుకి రాష్ట్ర ప్రభుత్వంవారు రికగ్నిషన్ ఇచ్చిరి.

శిక్షణ ఆదర్శములు :— పూజ్యులైన కస్తూరిబాకి గ్రామసేవిక ప్రతిమూర్తియై ఆమె జీవితములోని నిరాడం బరత, నిష్ఠ, గ్రామజీవనము, మాతృత్వము, శక్తి, సహ నము, ఔదార్యము అలవరచుకొనవలెను. సేవిక లక్ష్య ములు ఉన్నతముగాను, జీవితమార్గము నిర్మలముగాను వుండవలెను. ఈమె ఆర్థిక, ప్రాపంచిక స్వలాభాపేక్షలు లేక పవిత్రమైన సేవాదృష్టి కలిగియుండవలెను. కుగ్రామ ములకు కూడ వెళ్ళి అజ్ఞానాంధకారములో మూఢ విశ్వా సములతో కుమిలిపోవు పేద ప్రజలకు మార్గము చూప వలెను. నేటి పల్లెటూళ్ళలో పారిశుద్ధ్యము, ఆరోగ్యము, విద్యాసౌకర్యముల ఆవశ్యకత ఎంతైనను కలదు. గాన గ్రామసేవిక, గ్రామములలో పారిశుద్ధ్యము మొదలు విద్యా బోధవరకు నిపుణురాలై ప్రవేశించవలెను. ఈమె పల్లె టూళ్ళలోని ప్రతి సమస్యను పరిష్కరించవలసియుండును. కాబట్టి ఈమె సేవికగాను, నాయకురాలుగానుకూడ ఎన్న బడుచుండును. పై ఆదర్శముల ననుసరించి శిక్షణ కేంద్ర మునందు సేవికలకు తరిఫీదు ఇవ్వడమగును.

సంఘజీవితము :— విద్యార్థినులు సంకుచితక్షేత్రముల నుండియు, వివిధ సంప్రదాయముల నుండియు శిక్షణకు వచ్చుచుందురు. ఇట్టి వారికి జాతి, మత, కుల విచక్షణ లేకుండా శిక్షణ ఇచ్చుటేగాక, సామాజిక జీవితమును, ఐకమత్యమును, జాతీయ భావములను ప్రేరేపింపజేయుట ఈ శిక్షణలోని ముఖ్యాంశములు. సంఘజీవితావసరము లగు ఆహార, వ్యవసాయ, ఆర్థిక, పుస్తక భాండాగార, వృత్తివిద్య, వ్యాయామ, ఆరోగ్య, పారిశుద్ధ్య వగైరా వివిధ శాఖలకు బాధ్యతగల మంత్రులను ఏర్పరచి వీరి ద్వారా కేంద్ర కార్యకలాపములు సక్రమముగా జరిపించడ మగును. కేంద్రములో ఉపాధ్యాయినులు, విద్యార్థినులు ఏక కుటుంబముగా కలసి మెలసి వ్యవహరింతురు.

కేంద్రములోని జీవితము — పాఠ్యక్రమము :— ఈ కేంద్రములో శిక్షణ పొందుటకు వచ్చిన విద్యార్థినులు స్వయంపోషక జీవితమును అలవరచుకొనవలసియుం డును. ఇందు ముఖ్యముగా వారు సమయమును వ్యర్థ పరచక, దానిని సద్వినియోగము చేయుట నేర్చుకొన వలెను. ప్రారంభమున కేంద్ర దైనందిన కార్యకలాపము లకు భయపడెదరు. కాని ఇచ్చటి జాతీయ వాతావరణము నకు పూర్తిగా అలవడిన తరువాత పాయిఖానా పనికి కూడా వెనుదీయరు. కేంద్రములోని కార్య కలాపము ఉదయం 4-30 మొదలు రాత్రి 9-30 గంటల వరకు జరుగును. ఈసమయము ప్రత్యక్ష, బౌద్ధిక జ్ఞాన తరగతు లకున్నూ, కేంద్రమునందు సామూహిక విధుల నెరవేర్చు టకున్నూ వినియోగించబడును.

శిక్షణ కేంద్రము $10\frac{1}{2}$ మాసములు జరుగును. $1\frac{1}{2}$ మాసము వేసవి శలవులు కాక పండుగలు, ఉత్సవములు మొదలగు విశేష కార్యక్రమములు, ప్రతి శుక్రవారము శలవులు పోను మొత్తము 240 రోజులు పాఠ్యక్రమము జరుగును. ఇందు వివిధ మతములు, గ్రామసమస్యయందు ప్రత్యక్ష, బౌద్ధిక జ్ఞానము, సంస్థ నడుపు విధానము, చరిత్ర, భూగోళము, ప్రపంచపరిచయము, ఆరోగ్య

శాస్త్రము, ప్రథమచికిత్స, రాష్ట్ర భాష హిందీ, సామాజిక శాస్త్రము, చిత్రా అవర్జ్యా, (అకౌంటెన్సీ) పూర్వ్యజుని యాని, పేథ శిక్ష, బాలమనోవిజ్ఞానము, జంతుశాస్త్రము, సంగీతము, వ్యాయామము, సహకార వుద్యమము, వ్యవసాయము, వస్త్రస్వావలంబి శిక్షణ (ప్రత్తిగింజ తీయుట మొదలు నేత వరకు గల క్రియలు) చేతిపనులు (కుట్టు, కత్తిరింపులు, అల్లికలు, ఎంబ్రాయిడరీ, నవారు, పట్టానేత, మగన్‌పొయ్యి, సబ్బు తయారుచేయుట, తాటి యాకు, ఈతాకు, బీంపీచు, చొప్పదంటు, కాగితములతో ఉపయోగకరములగు వివిధవస్తువులు తయారుచేయుట) చిత్రకళ, గలపు.

ఈ విద్యావిధానమునందు పరీక్షలకు ప్రాముఖ్యత ఇవ్వబడదు. అయినప్పటికీ కేంద్ర కార్యకలాపములందున్నూ, వారి సాంఘిక జీవితమునందున్నూ నిత్యము విద్యార్థినుల సామర్థ్యము కనిపెట్టబడుచుండును. శిక్షణానంతరము ట్రస్టు ద్వారా పంపబడిన నిరీక్షకులు విద్యార్థినులు తయారు చేసిన చార్టులు, రిపోర్టులు, దినచర్య. రెండు సంవత్సరముల శిక్షణ కాలములో వారు వ్యక్తిగత జీవితములో కనబరచిన ప్రగతి, లిఖిత. వక్తృత్వ పరీక్షల ద్వారాను, కార్యకర్తల సలహాల ఆధారముతోను వీరి యోగ్యతా యోగ్యతలు నిర్ణయించెదరు.

గ్రామ సంబంధ బాంధవ్యములు :— విద్యార్థినులకు గ్రామానుభవము కొరకున్నూ, గ్రామీణులతో పరిచయాభివృద్ధికిన్నీ విద్యేతర కార్యక్రమములుకూడ ఏర్పరచడమగును. గ్రామ పారిశుద్ధ్యము, బాల బాలికలకు, వయోజనులకు తెలుగు, హిందీ అభ్యాసము, మనోరంజన కార్యక్రమములు, ఇండ్లకు వెళ్ళి వారి కష్ట సుఖములు, ఆరోగ్యము గురించి తెలుసుకొనుట, సమిష్టి భోజనములు, కలరా, మశూచి మొదలగు అంటువ్యాధులు ప్రబలినప్పుడు వాటి నివారణోపాయముల గురించి చెప్పుట, పార్టీ విశేషములు తొలగించుట, ఆపత్సమయములందు గ్రామవాసులకు సహాయము చేయుట, ఉదాహరణకు : ఇండ్లు అంటుకొనినప్పుడు మంటలు ఆర్పుట, ఇండ్లలోని సామానులు భద్రపరచుట, వారికి వంట భోజన సదుపాయములు చేయుట, అవుసరమైన ప్రథమ చికిత్స చేయుట, ఇటులనే గోదావరీ వరద భీభత్సమునకు గ్రామము గురి కాకుండ స్వయముగా శరీరశ్రమ చేసి అనగా మట్టిమోసి గోదావరీ గట్టును గండ్లు పడకుండ కాపాడుట, వరదబాధితులకు ఆశ్రయమిచ్చి రక్షించుట వగైరా కార్యక్రమములద్వారా గ్రామీణుల కష్టములు తొలగించి వారిలో విద్యా విజ్ఞానాభి వృద్ధులు కలుగజేయుటకై కృషి సల్పడమగుచున్నది.

జాతీయ ఉత్సవములు, పండుగలు, శిక్షణ విహారములు-:

కేంద్రములో పండుగలు, పర్వదినములు, జాతీయ ఉత్సవములకు హెచ్చు ప్రాముఖ్యత ఇవ్వబడును. ఆయా సందర్భములలో ప్రాతఃకాల నగరసంకీర్తనము, పతాకవందనము, అఖండ సూత్ర యజ్ఞము, వినోద కార్యక్రమములు, బహిరంగ సభలు, గ్రామ పారిశుద్ధ్యము, సామూహిక ప్రార్ధనలు వగైరా జరుపబడుచున్నవి. మృత వీరుల జాతీయస్మారక దినములు, స్వాతంత్ర్యదినము, ఆంధ్రరాష్ట్ర అవతరణ దినము, రిపబ్లిక్ డే, గాంధీ వర్ధంతి మొదలు, కస్తూరిబా వర్ధంతి వరకు సామూహిక సూత్రయజ్ఞము, వారి జీవితచరిత్ర పఠనము, బహిరంగ సభలు జరుపబడుచున్నవి. కస్తూరిబా వర్ధంతికి కేంద్ర వాసులందరు నూలు సమర్పించగా దానితో బట్టనేయించి బీదవిద్యార్థినులకు ఇవ్వడమగుచున్నది. పై కార్యక్రమములందు గ్రామవాసులందరు పాల్గొందురు.

శిక్షణ విహారములకై విద్యార్థినులను గ్రామసంప్రదాయ, దేశచరిత్ర, సంస్కృతి, కళ, విద్యలకు ప్రాముఖ్యత చెందిన స్థలములకు తీసుకొని వెళ్ళడమగును. తద్వారా విద్యార్థినులకు ప్రత్యక్షానుభవము పొందుటకు సదవకాశము లభించుచున్నది.

గ్రామసేవ, ఆరోగ్యకేంద్రములు :— సీతానగరమునందు తరిఫీదు పొందిన సేవికలద్వారా ఆంధ్రదేశమందలి వివిధ జిల్లాలలోని గ్రామములందు గ్రామసేవ, ఆరోగ్య కేంద్రములు ప్రారంభించి గ్రామాభివృద్ధి కార్యక్రమములు జరిపించడమగుచున్నది. వేరు వేరు జిల్లాలలో మొత్తము 25 గ్రామసేవ, ఆరోగ్యకేంద్రములున్నూ, ఒక శిశు శరణాలయమున్నూ ప్రారంభించబడినవి. పూజ్య బాపూజీ ఆదేశించిన నిర్మాణ కార్యక్రమమును గ్రామములందు అమలు జరుపుటయే గ్రామసేవా కేంద్రముల ముఖ్యోద్దేశము. గాన దీని ననుసరించి కేంద్రములందు పని జరుగు

చున్నది. నేటి పిల్లలే భావిభారత పౌరులుగా తయారు కావలసి యున్నందునను, చాల కాలమునుండి ఎన్నో దురాచారములకు లోనైన వయోజనులయందునూ తన జీవితమును ప్రవేశపెట్టవలసి యున్నందునను గ్రామసేవా కేంద్రములందు బాల్వాడీ, బేసిక్, వయోజన విద్యాతరగతులకు ముఖ్యస్థానమివ్వబడెను. కేంద్రములందు విద్య, విజ్ఞాన, ఆరోగ్య, స్వయంపోషకములకు సంబంధించిన విషయములు బోధించుటమాత్రమేగాక గ్రామసేవికలు జాతి మత కుల వర్గ విచక్షణగాని, పార్టీ విభేదములుగాని లేక సేవాకార్యములద్వారా గ్రామస్థులను ఆకర్షించుకొనెదరు. వీరు గ్రామస్థులతోబాటు కష్టసుఖములను అనుభవించుచూ కలసి మెలసి యుండుటచే కొంతకాలమునకు వీరి యెడల గ్రామస్థులకు భక్తి విశ్వాసములు కలుగు చున్నవి. అందువలన గ్రామాభివృది కార్యక్రమములు జరిపించుటకు హెచ్చు అవకాశము లభించుచున్నది. రాయలసీమ యందలి కడప, చిత్తూరు జిల్లాలలో వర్షాభావముచే పంటలు లేక కరువు కాటకములు ప్రబలినప్పుడు అచ్చట పనిచేయుచున్న గ్రామ సేవికలు ఈ కరువు బాధకు గురియైకూడ ఆకలి దప్పులచే అలమటించు పేదల ప్రాణములు రక్షించుటకై అమోఘమైన సేవచేసి ప్రభుత్వము, రామకృష్ణమిషన్ వారల మన్ననలను పొందిరి.

సీతానగరమందు 19 జనవరిలో శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులు గారిచే ప్రసూతి వైద్యశాల ప్రారంభోత్సవము జరిపించడమైనది. ఇందు M.B., B.S., డాక్టరు కడు సేవాభావముతో పనిచేయుచున్నారు. ఈ వైద్యశాల ద్వారా సీతానగరము చుట్టు ప్రక్కల సుమారు 20 గ్రామములలో 22 వేల మంది ప్రజలు వైద్యసహాయము పొందు చున్నారు. వీరిచ్చట ఆరోగ్య విధులు, అంటువ్యాధుల నిరోధ నివారణోపాయములు వగైరా తెలుసుకొనుచు తమ తమ ఆరోగ్యములను జాగ్రత్తగా కాపాడుకొనుట నేర్చుకొనుచున్నారు. ఇది కేవలము ప్రసూతి వైద్యశాలయే అయినప్పటికీ చుట్టు ప్రక్కల ఇతర వైద్య సౌకర్యము లేనందున ఒక్క ప్రసూతి కేసులేగాక స్త్రీలకు అన్నివిధములగు రోగములకు చికిత్స చేయడమగు చున్నది. ఇంతియేగాక అత్యవసర ప్రమాద పరిస్థితులు ఏర్పడినప్పుడు పురుషులకుగూడ వైద్య శాలలలోనే **(In patients)** వుంచి చికిత్స చేయవలసివచ్చుచున్నది. ప్రభుత్వమువారిచ్చిన పాలపొడితో పాలు తయారుచేసి ప్రతి దినము సుమారు 300 మంది బీద పిల్లలకు, గర్భిణి, బాలింత స్త్రీలకు, అనారోగ్యులకు పంచడమగు చున్నది. ఆంధ్ర దేశమందలి వివిధ జిల్లాలలో బొబ్బిలి, సీతానగరమందు మంత్రసాని శిక్షణ బడసినవారిద్వారా ఆరోగ్య కేంద్రములు నడపబడుచున్నవి. ఈ కేంద్రముల వలన మరణముల సంఖ్య తగ్గి గ్రామారోగ్యములు బాగు పడుచున్నవని తెలుపుట కెంతయు సంతసించుచున్నాము.

పునఃశిక్షణ శిబిరములు :— ఆంధ్రదేశ మందలి కస్తూరిబా కేంద్రములలో పనిచేయుచున్న సేవికలు వారి గ్రామ సమస్యలు, కష్టసుఖములు చర్చించుటకున్నూ, తగిన సలహాలు పొందుటకున్నూ ఈ శిబిరములు ప్రతి సంవత్సరము ఏర్పరచబడినవి. పలు ప్రముఖులు విచ్చేసి కార్యకర్తలు చేయు పనికిన్నీ, వారి విజ్ఞానాభివృద్ధికిన్నీ తోడ్పడు వేరు వేరు విషయములపై ఉపన్యాసములిచ్చు చుందురు. గాన ఈశిబిరములు గ్రామాభివృద్ధి కార్యక్రమములు జరుపుటయందు సేవికలకు చాల సహాయకరముగా నుండును.

ప్రేక్షకుల ఆగమనము :— దేశములోని అనేకమంది ప్రముఖులు, నాయకులు, నిర్మాణ కార్యకర్తలు సీతానగరం విచ్చేసిరి. వీరిలో శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులుగారు, శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్య, శ్రీ జయప్రకాశ నారాయణ్ దంపతులు, శ్రీ పైడా వెంకటనారాయణ M.L.A మద్రాసు, ఆంధ్రరాష్ట్రీయుల మంత్రులగు శ్రీ మాధవ మీనన్ దంపతులు, శ్రీ గురుపాదం, శ్రీ భక్తవత్సలం, శ్రీ అవినాశలింగం చెట్టియార్, శ్రీ చంద్రమౌళి, శ్రీబి.పి. పట్టాభిరామారావు, శ్రీ ఎమ్. వి. కృష్ణారావు, శ్రీ తిమ్మారెడ్డిగార్లు, తూర్పుగోదావరి జిల్లా కలెక్టర్లు, ఆరోగ్య, విద్యాశాఖాధికార్లు, భారత దేశమందలి వివిధ రాష్ట్రీములనుండి అఖిలభారత చరఖాసంఘాధ్యక్షులు శ్రీ కృష్ణదాసు జాజూజీ, ధీరేంద్రమజుందారు, కస్తూరిబా ట్రస్టుకేంద్ర కార్యదర్శి శ్రీ శ్యామలాల్ జీ, మంత్రి శ్రీమతి సుశీలాపైజీ, శ్రీమతి సుచేతాకృపలాని, సేవాగ్రాం హిందూస్థాన్ తాలీమీసంఘం కార్యదర్శినులు శ్రీ ఆర్యనాయకం, ఆశాదేవిగార్లు, శ్రీ భన్సాలీ, కస్తూర్బా ట్రస్టు వైద్యకీయ సలహాసంఘం సభ్యులు డా॥ వర్దేకర్ జీ, శ్రీమతి డా॥ సౌంద్రం రామచంద్రన్, కేంద్ర ఆర్థిక శాఖామాత్యులు శ్రీ సి.డి. దేశ్‌ముఖ్,

# సేవాకార్యము, సీతానగరము

కేంద్ర సాంఘిక సంక్షేమ సంఘాధ్యక్షురాలు శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ గార్లున్నూ మరియు తదితర ప్రముఖులు అనేకమంది సీతానగరం విచ్చేసి పలువిధ ములుగా ప్రోత్సహించిరి.

ఆర్థికస్థితి :— భారత దేశమున వివిధ రాష్ట్రము లలో వసూలైన సొమ్ము ఆరాష్ట్రములలోనే వాడబడును. రాష్ట్రములో ఏఏ జిల్లాలలో ఎంత వసూలైనదో ఆ వసూలైన మొత్తములో మూడు వంతులు ఆయా జిల్లాల లోనే ఖర్చుచేయడమగును. నాలుగవవంతు రాష్ట్రమంత టికి సంబంధించిన కేంద్రములకై వినియోగింపబడును. ఆంధ్ర రాష్ట్రమందలి వివిధ జిల్లాలలోని గ్రామసేవ, ఆరోగ్య కేంద్రములకై ఒక్కొక్క కేంద్రపు ఖర్చులో నూటికి 15 నుండి 50 శాతము వరకు స్థానిక చందాలు వసూలు చేయవలసియున్నది. కస్తూరిబాట్రస్టుద్వారా నడుపబడుచున్న ఈ కేంద్రములు గ్రామములందలి బీద అసహాయ ప్రజానీకమునకు మిక్కిలి సహాయకరముగా యుంటున్నవి. కాని వీరినుండి కేంద్రములకు వలయు ఆర్థిక సహాయము లభింపజాలకున్నది. గాన గ్రామపురో భివృద్ధికై తగినన్ని కేంద్రములు నడుపుటకు వలయు ఆర్థిక సహాయము ప్రభుత్వము, మరియు స్థానిక సంస్థల నుండియు ఆశించడమగుచున్నది.

సహాయకులు, సలహాదారులు :— సీతానగరము నందలి గ్రామసేవికా శిక్షణకేంద్రము, ప్రసూతివైద్య కీయకేంద్రము, ఆయా జిల్లాలయందలి గ్రామసేవ, ఆరోగ్య కేంద్రములు దేశములో అనేకమంది ఆదరాభి మానములకు పాత్రమైనవి. అఖిల భారత చరఖాసంఘం వారు సీతానగరమునందలి శిక్షణ, వైద్యకీయ కేంద్రము లకు వసతి సౌకర్యములు కలుగజేసి, వ్యవసాయమునకు పొలము కూడ యిచ్చిరి. రాజమండ్రి కలప వర్తక సంఘంవారు శిక్షణ కేంద్రమునకు సింగరు మిషను యిచ్చిరి. రాజమండ్రి కాపరస్తులు ముడుంబి భానుమతి, భాస్కరమ్మలు, శ్రీమతి దామెర్ల శకుంతలగారును నృత్య ప్రదర్శనము జరిపి ధనసహాయముచేసిరి. తూర్పుగోదావరి జిల్లా కలెక్టరు రేడియో వగైరా పరికరములకు రు 1500/- లు విరాళముగా ఇచ్చిరి. ఇది గాక శిక్షణ కేంద్రపు ఇంటి మరమ్మత్తులు, నీటికి వసతికి ధనసహా యము చేసిరి. శ్రీ స్థానం నరిసింహారావుగారు తమ సోదరి సత్యాదేవి స్మారక చిహ్నముగా ఒక వీణ, గ్రంథాలయమునకు 300 పుస్తకములు ఇచ్చిరి. శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మగారు గ్రంథాలయమునకు 100 పుస్తకములు ఇచ్చిరి. ఆంధ్ర రాష్ట్రమునందలి వివిధ స్థానిక సంస్థలవారు కేంద్రములకు ఆర్థిక సహాయము చేయుచున్నారు. గోదావరి భీభత్స సందర్భమున ప్రభు త్వము, రామకృష్ణమిషన్‌వారు సీతానగరమునందలి వైద్య కీయకేంద్రమునకు మందులు, పాలపొడి, వస్త్రములు వగైరాలిచ్చి వరద బాధితులకు సహాయము చేయుట యందు తోడ్పడిరి. కేంద్ర సాంఘిక సంక్షేమ సంఘము వారున్నూ మరియు రాష్ట్ర ప్రభుత్వమువారున్నూ ఆంధ్ర కస్తూరిబా ట్రస్టుకి ఆర్థిక సహాయము చేయుచూ చేయూత నిచ్చి ప్రోత్సహించుచున్నందులకు మిక్కిలి సంతసించు చున్నాము.





# విజ్ఞానపు వేయిపడగలు

"ఏకంసత్ - విప్రా బహుదా వదంతి"

శ్రీ మద్దూరి శ్రీరామకృష్ణ

సత్యం ఒక్కటే - పల్వురు పలువిధాల చెపుతారు.

సృష్టి పరిణామంలో మానవునికి కొంతవివేకం కలిగి నప్పటినుండీ కూడ, అనంతంగా తోచేది, అనంతకోటి నామరూపభేధాలతో గూడిందిగా కనబడే బాహ్య ప్రకృతిని పరిశీలించి, దాని యదార్థత్వాన్ని అవగాహన చేసుకోవాలన్న జిజ్ఞాస కలుగుతూనేవుంది.

అన్వేషణ :— ఈ జిజ్ఞాస - విజ్ఞానదృష్టి మానవసహజం. ఇవే ఇంతవరకు మనిషి సేకరించిపెట్టిన విజ్ఞానానికి మూల కారణం. విజ్ఞానమంటే మన పంచేంద్రియాల ద్వారా ఎరుగ నయ్యే విషయసంచకమని పాశ్చాత్తులనుకున్నారు. కాని, మన ప్రాచ్యుల దృక్పథం అంతకంటె సమగ్రమైంది. భౌతికం - భౌతికేతరంకూడ అవగాహన చేసుకొని, అసలు వస్తువుని గ్రహించగలిగిందే నిజమైన విజ్ఞానం ; దేన్ని తెలుసుకోవడం వల్ల సర్వాన్నీ తెలుసుకోవడం అవుతుంతో అదే 'విజ్ఞానం' అన్నారు- మనవారు ; "కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వ మిదం విజ్ఞాతం భవతి". ద్వందం - బహుత్వం ఎందుకు చూస్తావు, భిన్నత్వంలో ఏకత్వం గ్రహించు ; అంతా ఒక టేసుమా, "ఏకమేవా - ద్వితీయం" అని సూచించేరు. కాని, భౌతిక శాస్త్రజ్ఞునికీ, సాధారణదృష్టికీ ఎటుజూచినా భిన్నత్వంలాగు తోస్తుంది ; అన్వేషణ ప్రారంభించేరు. మనిషి - మన్ను, చెట్టు - పుట్ట, రాయి - రప్ప, ఇనుం - బంగారం, నీరు - గాలి, సూర్యుడు - చంద్రుడు, ఆకాశం- నక్షత్రాలు, ఇలా విభిన్నమైనవాటిని చూచి చూచి, విశ్వం అంటే ప్రదేశం (Space) అందులోనున్న ద్రవ్యం (Matter) అని వర్గీకరించుకున్నారు. విశ్వమంటే ఏమిటో తెలుసుకోవాలంటే ఈరెంటినిగురించే ఆరాతీయాలను కున్నారు. శాస్త్రపరిశోధన ప్రారంభమైంది. అంతలో కాలం (Time) అనేది మరొకటి ఉందిరోయ్, మొత్తం మూడు అన్నారు. వీటి సంగతి తేలుద్దాం పట్టండి అన్నారు. అనేక పరిశోధనలు, ప్రయోగాలు గావించేరు ; చుట్టు త్రోవలు త్రొక్కి త్రొక్కి ఎంతో వెదుకులాడేరు. ఆఖరుకు 'ఏది చూచినా అయోమాయ్ గారడీ లాగుందే!' నన్నకాడికి వచ్చేరు. ఇంక దిక్కులు చూడ్డం మొదలెట్టేరు.

ప్రవేశం :- (Space) అంటే ఆకాశం (అవకాశం- ఏమీలేనిది), దీన్ని తెలుసుకోవడం ఎట్లాగ ! ఎటు జూచినా ప్రదేశం- ప్రదేశం- అనంతగాతోచే ప్రదేశమహార్ణవం. ఈ ప్రదేశమహార్ణవంలో భూగోళం- సూర్య- చంద్ర- నక్షత్రగోళాలు- నెబ్యులాలు- గెలాక్సీలు- మహా సముద్రంలో చిరు తెప్పల్లాగ అక్కడక్కడ అపురూపంగా, అవగింజల్లాగైనా లేవు !

## "ఏకంసత్ - విప్రా బహుదా వదంతి"

కాలం :- (Time) పోనీ కాలం సంగతి చూద్దాం అంటే ఇది పైదాన్ని మించింది! కాలాన్ని అవగాహన చేసుకోవాలని భూతం- వర్తమానం- భవిష్యత్తు అని విభాగించి చూడబోతే, సినిమా ప్రొజెక్టర్‌లో ఫిల్ములాగ పరుగిడి పోతుందాయిరి! భవిష్యత్తు అనుకున్నది అంతలోనే వర్తమానమై, అది అంతట్లో భూతమై, బుద్ధికి అందకుండా మరో పూర్ణానుస్వారంలాగుంది. ఈ రెంటినీ అలా ఉంచండిరా, మన పంచేంద్రియాలకు అందేది, పదార్థం (Matter) ఉంది, దీని తాళం పడదాం పట్టండి అని ఉపక్రమించారు.

పదార్థం :- (Matter) దీన్ని గురించి శాస్త్రజ్ఞులు తేల్చిన పరిశోధనలు ఇలా ఉన్నాయి: పదార్థం అంటే కొంత ప్రదేశాన్ని ఆక్రమించేది అన్నారు. ఇది వాయు- ద్రవ-ఘన రూపాల్లో ఉంటుంది. ఉదాహరణ: గాలి, నీరు, ఉప్పు, బంగారం, పంచదార. ఇలా ప్రపంచంలో ప్రతీ పదార్థాన్నీ పరిశీలించగా, పరిశీలించగా, అన్నీ మొత్తంమీద 93 రకాల ధాతువులు (Elements) అనే మూల పదార్థాలవల్ల నిర్మింపబడ్డాయి అన్నారు-- సున్నం ఇటుకవగైరాలవల్ల అనేక రకాల యిళ్ళు రూపం దాల్చినట్లు. ఉదాహరణ: బంగారం ఒక ధాతువు, భాస్వరం మరో ధాతువు. నీరు అంటే ప్రాణవాయువు- ఉదజని అనే రెండుగాలుల సంయోగ వస్తువు. ఉప్పుఅంటే క్లోరిన్ - అనే విషగాలి, సోడియం అనే ధాతువు కలిసి యేర్పడింది. పంచదార అంటే బొగ్గు- ప్రాణవాయువు- ఉదజనుల యౌగికం (Compound) ఇలాగ ధాతువులు ఒకటి- రెండు- మూడు ఇంకా ఎక్కువగాను, వేరు వేరు పరిమాణాల్లో, వేరువేరు విధాలుగా సంయోగం జెంది, అనంతకోటి పదార్థాల రూపేణా ప్రత్యక్షమౌతున్నాయి. మన భూమి, భూమి మీద వస్తువులేగాదు, సూర్య చంద్రాది గోళాలూ ఇంతేనన్నారు.

[సశేషం]

## సంక్షేమ కేంద్రాలు

(8-వ పేజీ తరువాయి)

వేశంలో పాల్గొన్నారు. అధ్యక్షులు శ్రీ పి. చిన్నమరెడ్డిగారు ప్రసంగిస్తూ యీ ఆస్పత్రివల్ల ఎంతో ప్రయోజనం ఉన్నదని, ప్రజలు యీ ఆస్పత్రికి ధన సహాయం చేయాలని విజ్ఞప్తి చేశారు. ఈ ఆస్పత్రికి ఒక కమిటీని ఎన్నుకొన్నారు. కాళహస్తి తాలూకా కోవనూరులో ఒక ప్రసూతి చికిత్సాలయానికి డా॥ వి. వి. చలంగారు ప్రారంభోత్సవం జరిపారు. ఆ సందర్భంలో జరిగిన డి. వి. రాఘవ రెడ్డిగారు అధ్యక్షత వహించారు. ప్రసూతి చికిత్స కేంద్రాల అవసరాన్ని చలంగారు వివరించారు. రాఘవరెడ్డిగారు చికిత్సకేంద్రం అభివృద్ధికి యీ ఫిర్కా ప్రజలు కృషి చెయ్యాలన్నారు. ప్రసూతి సమయంలో స్త్రీలు అనుసరించదగ్గ జాగ్రత్తలను శ్రీమతి మరియమ్మగారు వివరించారు. ఈ కేంద్రానికి కోవనూరు గ్రామ పంచాయితీ బోర్డు 200 రూ॥లు, కంతనపల్లి గ్రామ పంచాయితీ 100 రూ॥లు, అంజారుగ్రామ పంచాయితీ 100 రూ॥లు, తిమ్మసముద్రం గ్రామ పంచాయితీ 50రూ॥లు విరాళాలివ్వడానికి వాగ్దానం చేసేరు. అద్దూరు వెంకురెడ్డిగారు సభికులకు విందుచేశారు. రామకృష్ణారెడ్డిగారు కృతజ్ఞతాభివందనాలతో సభ ముగిసింది.

కడపజిల్లా : ఈ జిల్లా సంక్షేమ కార్యక్రమాల సంఘంవారు వల్లూరు గ్రామంలో ఒక సంఘ సంక్షేమ కేంద్రం ప్రారంభించారు. గ్రామంలోని ప్రజలు ఉత్సాహంతో కార్యక్రమంలో పాల్గొన్నారు. సంఘంవారికి తోడ్పడ్డానికి ఒప్పుకొన్నారు, సభ జయప్రదంగా జరిగింది.

అనంతపురం జిల్లా ; (రిపోర్టు మాకు చేరలేదు)

కర్నూలు జిల్లా : డిటో

ఈమాదిరి ప్రాజెక్టులు దేశం మొత్తంమీద యిదే రోజున 78 ప్రారంభింపబడతాయని ఇవి 1,560 గ్రామాలకు సేవగావిస్తాయని, వీటిల్లో 2,160 గ్రామసేవికలు కృషిచేస్తారని కేంద్ర సంఘ సంక్షేమ బోర్డు చేర్మన్ శ్రీమతి దుర్గాబాయిదేశ్‌ముఖ్‌గారు ఢిల్లీలో పత్రికావిలేఖరులతో ప్రసంగిస్తూ ఆగస్టు 12 వ తేదిని తెలియపర్చేరు.

ఈ ప్రాజెక్టులు ఎలానడిచేదీ ఇదివరకే విశదీకరించేరు. ఈ వివరాలు ఆంధ్రమహిళ జూలై- ఆగష్టు పత్రికల్లో ప్రకటించేము.



# గాంధీజీ సుభాషితాలు

నూతన సాంఘిక పద్ధతి :—దేశంలోని మానవులందరూ సమాన అంతస్థులో వుండేటట్లు చేయాలని నేను కోరుతున్నాను. శతాబ్దాలుగా వృత్తులు చేసేవాళ్ళు దూరంగా వుంచబడి తక్కువవారిగా చూడబడుతున్నారు. వాళ్ళను 'శూద్రులు' అంటే తక్కువజాతివారు, అని పిలుస్తున్నారు. ఇప్పుడు నేను సాలి బిడ్డకూ, రైతు బిడ్డకూ, బడిపంతుల బిడ్డకూ ఏమీ వ్యత్యాసం లేకుండా చేయాలని అనుకుంటున్నాను.

ఏ నూతన సాంఘిక పద్ధతీకూడా నిర్బంధంగా ప్రవేశపెట్ట కూడదు. అలాచేస్తే వ్యాధికంటే పథ్యం కఠినమైనట్లుంటుంది. సంఘ సంస్కరణలో నాకు ఓపిక తక్కువ. మనదేశ సాంఘిక వ్యవస్థలో పూర్తిగా మార్పు తేవాలని కోరుతున్నాను, కాని ఇది క్రమంగా రావాలిగాని ఒక్కసారిగా పైనుంచి బలవంతంగా పెట్టినట్లుండరాదు.

*　　*　　*

స్త్రీలు :— స్త్రీలను అబలలనడం చాల అన్యాయం. అది పురుషుడు స్త్రీకి చేసిన ప్రథమ అన్యాయం. బలంలో అయినట్లయితే పురుషుల బలం పశుబలం కాబట్టి స్త్రీలో యిది తక్కువనే ఒప్పుకోవాలి. కాని మానసిక శక్తిలో చెప్పవలసివస్తే, పురుషునికంటె వెయ్యి రెట్లు, స్త్రీయే గొప్పది. స్త్రీలో పురుషునికంటె ఎక్కువ సహజమైన తెలివి, త్యాగబుద్ధి, ఓర్పు, ధైర్యం కలవని ఒప్పుకోవాలి. అన్నెందుకు ? స్త్రీలేందే పురుషుడు లేనేలేడు.

ప్రసవవేదనకు మించిన బాధవుందా ? కాని తాను సృష్టించిన బిడ్డను చూచి ఆమె ఆబాధనంతా మర్చిపోతుంది. తర్వాత ఆ బిడ్డ దినదినాభివృద్ధి పొందాలని ఆమె పడే అగచాట్లు ఎవరు పడతారు ? ఆ ప్రేమ ఇప్పుడామె సంఘాభ్యుదయానికి వినియోగించాలి. తాను పురుషుని, విలాసవస్తువు అన్న సంగతి మర్చిపోవాలి. అప్పుడామె మాతృదేవిగా, ఆదర్శవనితగా, పురుషుని ప్రక్క, సమాన స్థాయిలో నిల్వగలదు. యుద్ధోన్మత్తతలో మునిగియున్న పురుషులకు స్త్రీలే శాంతి పాఠం నేర్పాలి.

*　　*　　*

మాతృత్వమూ - కర్తవ్యమూ :- మాతృదేవిగా మన బాలికలు నెరవేర్చ వలసిన విధులను వారికి ముందుగా నేర్పక పోవడం బిహుశోచనీయం. గృహిణీత్వం ఒక పవిత్రధర్మం అనుకున్నప్పుడు మాతృత్వం కూడా అంతే. ఆదర్శమాతగా చరించడం సాధారణ కార్యంగాదు. ఇందుకు వలసిన విజ్ఞానం వున్నప్పుడే బిడ్డల్ని కనాలి. గర్భధారణ సమయంనుండి బిడ్డపుట్టేవరకు తన కర్తవ్యం ఏమిటో పూర్తిగా తెలిసియుండాలి. ఎవరైతే ఆరోగ్యవంతులు, తెలివైనవారు చక్కటి తర్ఫీదు పొందినవారు ఐన బిడ్డల్ని దేశానికి వప్పజెప్పుతారో, వారు గొప్పదేశ సేవ చేసినట్లే.

*　　*　　*

విధవావివాహం :- వితంతు వివాహంలో తప్పేమీలేదు. అది తప్పు అన్నట్లయితే భార్య మరణించినప్పుడు భర్త పెండ్లి చేసుకోవడం కూడా అంతే అనాలి.

*　　*　　*

బిడ్డల శిక్షణ :- బిడ్డలకు చక్కటి తర్ఫీదు ఇవ్వడానికి తల్లిదండ్రులకు విస్తారమైన ప్రపంచజ్ఞానం వుండాలని నాకు బాగా నమ్మిక కుదిరింది. సామాన్యంగా మనం ఏమను కుంటామంటే, బిడ్డలు ఐదు ఏళ్ళ లోపుగా ఏమీ నేర్చుకోరని. కాని, నిజానికి, బిడ్డలు ఐదేళ్ళు దాటిన తర్వాత నేర్చుకొనేది చాల తక్కువనే చెప్పాలి.

ఆదర్శ గృహానికి మించిన పాఠశాలలేదు, సత్యవంతులూ, ఆదర్శ ప్రాయులూనైన తల్లిదండ్రులకు మించిన గురువూలేడు.

# అపూర్వ భారతం, అపూర్వ కవి!

## (హాస్యనాటిక - ఏకాంకిక)

(" 'బొల్లి బొల్లరా మల్లన్నా అంటే, గోల్కొండ రత్నాలు గొప్ప తాటికాయలంతేసి !' అన్నట్లుంటాయి యీ తెనాలి రామలింగని బొల్లులు - నమ్మకండి" అని భట్టుమూర్తి, రాయల సభలో, ఆక్షేపిస్తే "రాయలవారూ, అష్టదిగ్గజాలూ అనుజ్ఞయిస్తే అతనికంటె గొప్ప బొల్లి బొల్లుతా !!" నన్నాడట తెనాలి రామకృష్ణుడు ! ఆ తమాషా చూదామని అంతా అంగీకరిస్తే, రాయల ఆస్థానంలో అందరి యెదుట, మర్నాడు, ఈ నాటకం ప్రదర్శించేడట రామలింగకవి. సహృదయులు కూడ ఈ 'అపూర్వ భారతా'న్ని అట్లే గైకొందురుగాక అని ఈ నాటకం ఉపక్రమిస్తున్నాం.)

———: o :———

### 1 వ రంగం

శ్రీకృష్ణదేవరాయల ఆస్థానం.

శ్రీకృష్ణదేవరాయలు, అష్టదిగ్గజాలైన కవులు, అల్లసాని పెద్దన, ముక్కుతిమ్మన, భట్టుమూర్తి, తెనాలి రామకృష్ణుడు వగైరాలు సభాసదులు ఉంటారు.

శ్రీకృ.దే : పెద్దనగారి మనుచరిత్రలోని "పాటున కింతులోర్తురె" అన్న పద్యం, తిమ్మనగారి పారిజాతాపహరణంలోని "ఈసునఁబుట్టి డెందమున" అన్న పద్యం, భట్టుమూర్తికవి వసుచరిత్ర యందలి "అజాబిల్లి వెలుంగు వెల్లికల" అన్న పద్యం ఈ మూడూ తుల్య సందర్భం గలిగి అతి మనోహరమైన పద్యాలు. సభాసదులు వీటిని విమర్శింప విన ముచ్చటగుచున్నది.

తె.రా : విమర్శించుట కేమున్నది ? అల్లసాని పెద్దన అటు నిటు నేడ్చెను, ముక్కు తిమ్మన ముద్దుగా నేడ్చెను, భట్టుమూర్తి బావురుమని యేడ్చెను !

(ఈ రామలింగకవి ఎప్పుడూ ఇంతేనని సభాసదుల కరతాళధ్వనులు)

భట్టు : అష్ట దిగ్గజములన బరగు మహాకవులనిట్లు బరిహసించి తానే మహా కవిపుంగవుడననుకొనుచున్నాడు యీ రామలింగన్న. ఏదీ- నేనిచ్చు యీ సమస్య పూరించమనుడు — చూతము : "కుంజరయూధంబు దోమ కుత్తుక సొచ్చెన్"

తె.రా : "గంజాయిత్రాగి తురకల సంజాతులఁగూడి కల్లు
చవిగొన్నావా ?
లంజెల కొడుకా ! యెక్కడ- కుంజరయూధంబు
దోమ కుత్తుక సొచ్చెన్ ?"

భట్టు : శ్రీరాయలవారు, పెద్దలు గమనించెదరుగాక, నిండు పేరోలగమున యీతని ప్రేలుడు కారుకూతలు !

శ్రీ.కృ.దే : రామలింగకవి వాచాలతకు రాయల కోపమున కాతడు గురి యగుచున్నాడు. షేమిట్టి పరుష వాక్యములు పూర్తిగా గర్హించుచున్నాము. అతడు సభ విడిచి పోనైన పోవలెను, లేదా క్షమాపణ కోరవలెను.

తె.రా : ప్రభువులు క్షమించెదరుగాక ! లేకున్న యీ వెర్రి భట్టూ, మహాకవులకు సమస్య లొసగువాడు !

శ్రీ.కృ.దే : చాలును- రామకృష్ణకవి. రాయలవారే యీ సమస్య యిచ్చియుంటి రనుకొమ్ము ; ఏది నీపూరణ. నీ తత్వమేమైన మారునేమో చూచెదముగాక !

తె.రా : "రంజనచెడి పాండవులరి - భంజనులై విరటుఁ
గొల్వఁ బొల్పడి రకటా !
సంజయ ! యేమనిచెప్పుదుఁ- గుంజరయూధంబు
దోమ కుత్తుక సొచ్చెన్"

(రాయలు పరమానంద భరితుడగును. శెభాష్ అని సభాసదులందరు ఎంతకైన రామకృష్ణుడేసరి. అంటూంటారు. అంతలో రాజభటుని ప్రవేశం)

శ్రీమతి పి. సూర్యకుమారి.

రా.భ : జయ ! శ్రీ శ్రీ కృష్ణదేవరాయలు మహారాజులుంగారికి జయ ! ప్రభూ ! ఢిల్లీ సుల్తాన్ పంపిన రాయబారి యట. తమ దర్శన భాగ్యమునకు..........

శ్రీ.కృ.దే : మంచిది. ప్రవేశపెట్టుము, సుల్తానులకు మాతో పని యేమైయుండవచ్చును ?

(రాయబారి ప్రవేశం)

రా : మహా-రాజా-వార్కీ-మాదీ- సుల్తాన్ - సందేహం - హిది- సుల్తాన్-వార్కీ-మీద-భార్తం-రాయించ్వాలా - హుద్దేశం. మీకీ- దర్బార్‌మే- బడాబడా- కవీశ్వర్- హుండ్వాలా- సుల్తాన్‌వార్కీ- మాలుమ్- హైంది. అందుకీ- కొందర్- కవీశుల్‌కి- ఢిల్లీ- పంప్వాలా. బడా- యీనామ్ .........

శ్రీ.కృ.దే : మంచిది. గ్రహించితిమి. అట్లే పంపెదమని చెప్పుము.

(రాయబారి నిష్క్రమించును)

శ్రీ.కృ.దే : విన్నారా ? ఢిల్లీ సుల్తాన్‌మీద భారతం వ్రాయగలవారు కావలెనట. మీలో పెద్ద పెద్ద కవీశ్వరులు కావలెనట. ఎవరు వెళ్ళ నిచ్ఛగించెదరు ?

(ఎవరును పో నిచ్ఛగింపరు)

భట్టు : ఢిల్లీ వెళ్ళినచో జుట్టు తీయించుకోవలెను ; లేదా జిజియా పన్ను చెల్లించవలెనుగాన మా కిష్టములేదు. తెనాలి రామన్న తానే మహాకవినిగదా అని గర్వపడుచున్నాడు ప్రభువులు అతనినే పంపనగును.

(భట్టు మూర్తికీ రామలింగనికీ ఎప్పుడూ బద్ధవైరం)

శ్రీ.కృ.దే: రామలింగకవి అభిప్రాయము వినగోరుచున్నాము.

తె.రా : దిగ్గజములు దిగులు మోము వైచినచో మీసము ఉన్న రామలింగసింగమే పోగలడు ! ప్రభువుల ఆజ్ఞయైనచో రామకృష్ణకవి వెళ్ళి యీ కార్యము చక్కబెట్టుకొని రాగలడు, అతనికి ఎనమండుగురు తోడువచ్చిన జాలును. వీరే అష్టదిగ్గజములని బొల్లులు బొల్లి, కథ అంతయు నేనే నడుపగలవాడను !

(సభలో మరల కరతాళ ధ్వనులు) (తెర పడును)

## 2 వ రంగం

ఢిల్లీ సుల్తాన్ సభ.

(సుల్తాను, సభాసదులు యథోచిత స్థానములలో ఆసీనులై యుందురు.)

(తెనాలి రామకృష్ణుడు, ఎనమండుగురు కవుల వేషధారులతో ప్రవేశము.)

సుల్తాను : కపీశం సాబ్ ! మీకీ- బడా- కపీశం- కోన్ ?

తె.రా : (ఒక్కొక్కరి చూపుతూ) అదిగో వారు- మనుచరిత్ర గ్రంథకర్త- కవితా పితామహులనబరగు- అల్లసాని పెద్దన ; అల్లదిగో వారు పారిజాతాపహరణ ప్రబంధకర్త ముక్కు- తిమ్మన ; ఇల్లదిగో వీరు వసుచరిత్ర రచయిత భట్టుమూర్తి.......... వీరందరికి చేతగానిదేదైననూ సాధించగలవాడను నేను- వారి గురువును !

సు : మాకీ- బలే బలే- సంతోషం ! నీకీ- బహూత్- హుషార్- ఆద్మీ ! కపీశంభాయి ! మాకీ- మీదా- భరాతం- కట్వాలా- వ్రాయ్‌వాలా. అందుకీ- మీకీ- ఒకటి- మాషం- షర్తు- యిచ్‌నామ్, అచ్ఛాహైతో- బడా- యీనామ్. నైతో మీ తల్‌కాయ్- గొర్గుతాం- మాలుమ్‌హై ?

తె.రా : (అందరి తరపునా) చిత్తం ! చిత్తం. సుల్తానువారు చూస్తారుగా ! మాకు మాత్రం చక్కటి విడిది భోజనం వగైరాలు ఏర్పరచాలి. (బ్రాహ్మణో భోజన ప్రియా !)

సు : సుబ్‌దార్ ! అరే- ఇన్కో- బొమ్మన్‌కి- బడా- భోజన్ పెట్వాలా.

(అందరు నిష్క్రమింతురు)

(తెర పడును)

## 3 వ రంగం

విడిది

ఎనమండుగురు బ్రాహ్మణులు, తెనాలి రామకృష్ణుడు ఉపవిష్టులై ఉంటారు.

బ్రాహ్మ : ఐతే సుల్తాన్‌మీద భారతం వ్రాయడం మాట

ఏమైనా ఆలోచిస్తున్నారా ? భోజనం మాత్రం మహా బాగా జరుగుతూవుంది ! నెల్లాళ్ళు ఇట్టే అయిపో యింది. రేపు సుల్తాన్‌ను చూడాలిలావుంది. భారతం మాట ఏమిటి ?

తె.రా : చూచేరా ! ఈ 18 వట్టి తాటాకు కట్టలు. ఇవి 18 పర్వాలన్నమాట ! ఒక్కొక్కడు రేపు 2-3 కట్టలు మోసుకొని నా వెంట రావాలి. ఇప్పుడు మీ సిగల్లో ఇంతింత జుట్టు కత్తిరించి, వాటికి తాటాకు పేరు బిళ్ళలు కట్టి, నా బిచాణాలో దాస్తా. వాటి పని తర్వాత ఉంది- మనం రాయలు దగ్గరకు తిరిగివెళ్ళాక.

బ్రా : మీరేమి చేయమంటే అలా చేయపలసిందనే రాయల వారు మా కాజ్ఞాపించి పంపేరు. అదిగాక సుల్తాన్ వ్రాయమన్న భారతం వ్రాయలేనందుకు మా తలలు ఎలాగా గొరుగుతాడు !

## 4 వ రంగం

సుల్తాను కొలువు కూటం.

(అష్టదిగ్గజాల పేర్లతో బ్రాహ్మణులు, తెనాలి రామ కృష్ణుడు తాటాకు కట్టలు మోసుకుంటూ ప్రవేశం.)

సు : మాకీ- మీద- భరాతం- సమాప్తం- హోగయాక్యా ?

బ్రా : చిత్తం. కాశీ-గయా చూచుకొనే ఇంటికి పోదామను కుంటున్నాం ప్రభువుల చిత్తం.

తె.రా : చిత్తం. చిత్తం. 18 పర్వాలు పూర్తిచేసి తీసు కొచ్చేం. ఒక్క సందేహం ఉంది.

సు : మీకీ బలే- సందేషం భోలో- భాయ్. సందేహం- ఎందుక్క- పద్వాలా ?

తె.రా : ఏమీలేదు. భారతం అంతటికీ ముఖ్య స్త్రీ పాత్ర ద్రౌపతి.

సు : అచ్ఛా- అచ్ఛా.

తె.రా : ఆవిడకు ఐదుగురు భర్తలున్నారు. ప్రభువువారు కాక, సుల్తానా వారికి మిగిలిన నలుగురు భర్తల పేర్లు చెప్పేయెడల, తమ మీద వ్రాసిన భారతం ముగించి, చదివి వినిపించి, శెలవు తీసుకుందామని....

సు : అరె- అల్లా ! హిది- యేమ్టి- భాయ్ ! మాది- సుల్తా నాకి- హైదు- భర్త ! తూ తూ ; ఇది-భరాతం- మాకీ- వద్దూభే.

తె.రా : అరెరె ! ప్రభువులు అలా సెలవిస్తే ఎలాగ ? ఈ ఎనమండుగురూ నేనూ నెల్లాళ్ళు రాత్రింబగళ్ళు కష్టపడి యింత గ్రంథం తయారు చేసుకొచ్చేం. ఢిల్లీ సుల్తాన్ వారి మెప్పుబొంది, గొప్ప గొప్ప బహు మానాలు పొందాలని గంపెడాశలు పెట్టుకొని ఉన్నాం. ప్రభువులు పర్యాలోచించాలి.

సు : మీకీ- బడా- బహుమాన్, చేస్తాంభే. సలాం- చేస్తామ్. ఆ భరాతం- అగ్గిమె- డాలో. సుబేదార్- దేఖో- అగ్గీ- లావ్.

(18 తాటాకు కట్టలు అంటించేస్తారు)

సు : ఈ- బొమ్మన్‌కీ- బడా బడా- ఈనాం- హిచ్చి- వంప్వాలా. పహ్‌లే వాలా- హీడ్కీ- బడేఆద్మీ- దోగుణ్- ఈనాం- దేవ్. అల్లా, అల్లా ! సైతాన్- మీకీ- సలాం చేస్తాం- జావో, జావో. (అందరు శెలవు తీసుకొందురు)

(తెర పడును)

## 5 వ రంగం.

శ్రీకృష్ణ దేవరాయల ఆస్థానం.

(శ్రీకృష్ణ దేవరాయలు, కవులు, తదితరులు సభ జేసి యుందురు)

(బ్రాహ్మణుల నెత్తులమీద పెద్ద పెద్ద గుమ్మిడి కాయల మూటలు, కాయలు పైకి కనబడకుండ కట్టి, మోయించుకుంటూ తెనాలి రామకృష్ణుడు, చంకలో అంగవస్త్రమున చుట్టిన ఒక కట్టతో ప్రవేశించును)

శ్రీకృ.రా : ఇదేమి ? రామకృష్ణ కవీ- ఇంతింత పెద్ద మూటలు ?

తె.రా : భట్టుమూర్తి బొల్లిల్లాంటివి కావు నమ్మండి. ఢిల్లీ వజ్రాలు గొప్ప గుమ్మడికాయలంతేసి !" ఈ అష్టదిగ్గ జాలూ నేనూ రచించిన అపూర్వ భారతాని బలే మెచ్చుకొని, ఈ అపూర్వ బహుమతులిచ్చి పంపించేడు ఢిల్లీ సుల్తాన్. ఈ వజ్రాలన్నీ బహుమతులిచ్చి నాకు సలాం పెట్టి పంపించేసేడు.

(అంతా ఆశ్చర్యంగా వింటూ చూస్తుంటారు)

(రామకృష్ణ కవి ఎంతకేని తగు, ఎన్ని బొల్లిలు బొల్లినా యితడే బొల్లవలెనని అష్టదిగ్గజ వేషధారులు అనుకుంటూ మూటలు దింపుకుంటారు)

## అపూర్వ భారతం, అపూర్వ కవి!

శ్రీకృ.దే: ఏదీ? ఆ అపూర్వ భారతం?

తె.రా: ఇంకెక్కడిది? అక్కడే కాల్చేసేం! సుల్తానే కాల్పించేసేడు!

భట్టు: అంటే—అంత బాగున్నదన్నమాట!

శ్రీకృ.: నీ చంకనున్న దేమిటి?

భట్టు: మళ్ళీ ఏ "తిలకాష్ట— మహిష- బంధనమో ప్రదర్శిస్తాడు! అంతకంటె ఏముంది? ఎరుగము గనుకనా ఈతడి ప్రజ్ఞలు!

తె.రా: ఢిల్లీకి వెళ్ళి జయించుకొచ్చాను. భట్టువంటి చేత గాని వాని జుట్టు సిగ తరిగి బుజువు తెచ్చాను. ఇదిగో "అష్టదిగ్గజ ప్రలాప హంతక తెనాలి రామకృష్ణ కవి సింగని విజయ రాజీయం!" (అని ఏడు గురుది జుట్టు శిఖలూ, వాటికి కట్టిన తాటాకు పేర్ల బిళ్ళలతో ప్రదర్శిస్తాడు)

భట్టు: రామలింగన్నా కవే; నేనూ కవినే! కవులకేమి లోటు!

ఆ॥ దేవునానమున్ను దేశానకొకరుండ - నిప్పుడూరనూర నింట నింట
నేవురార్వురేడ్వు రెనమండ్రు తొమ్మండ్రు - పదువురైరి కవులు పద్మనాభ!

శ్రీ.కృ.దే: మొత్తము మీద రామకృష్ణ కవి బొల్లులూ కవిత్వమూ చాల చమత్కారముగా నుండునని నేను, ఆస్థాన కవులు, అందరు ఒప్పుకొనుచున్నాము. చాలు గదా!

తె.రా: మాతో పోల్చుకొని భట్టుమూర్తి తానొక కవినని చెప్పుకొనుచున్నాడు!

క॥ కవి యల్లసాని పెద్దన - కవి తిక్కనసోమయాజి గణుతింపంగా
గవి నేను రామకృష్ణుఁడఁ - గవియను నామంబు నీరు కాకికి లేదే?

(జయ - శ్రీకృష్ణదేవరాయలుంగార్కి జయ - జయ ఆంధ్ర భోజునుకి జయ - జయ - రామలింగ కవికి జయ - అను జయజయ ధ్వనులతో సభ ముగియును)

(తెర పడును)



మూలం : పరలి బక్ •

# ఫ్రిల్లు

అనువాదం : "శ్రీ శిల్పి"

"ఈ టైలర్లతో ఖచ్చితంగా వుండకపోతే లాభం లేదు" అంటూ పోస్టు మాస్టరుగారి భార్య కొంచం ఆయాస పడుతూ పడక కుర్చీలో చేరబడింది. ఈ ప్రాంతాల్లో గడిపిన యీ పది సంవత్సరాలుగా ఆమె శరీరం స్థూలమయి వుంది, "టైలరు వచ్చేడమ్మా" అని చెప్పిన నౌకరు ప్రక్కగా నిలుచుని వున్నాడు.

బల్లమీద వున్న విసినికఱ్ఱ తీసుకొని మెల్లగా విసురుకొంటున్న అతిథి ఆమె ధోరణికి ప్రశంసిస్తూ "వీళ్ళని మీరు పగడలో పెట్టినట్లు నాకూ చేతనయితే బాగుండు నండీ. ఇక్కడ బట్టలు యెంత చవుక అయితే మాత్రం యేం లాభం యీ టైలర్లతో వేగటం ఎంతో కష్టం. మా టైలరున్నాడు చూచేరూ మూడు రోజుల్లో యిచ్చేస్తానని చెప్పి వారాలు గడిపివేస్తాడు. అదయినా చివరకు ఎందుకూ పనికి రానిదిగా తయారు చేస్తాడు. వీళ్ళ కుట్టూ వీళ్ళూను. అబ్బా!" అంటూ నిట్టూర్చి, విసిని కఱ్ఱతో వేగంగా విసురుకో సాగింది.

"ఇప్పుడు చూడండి" ధీమాగా అంది శ్రీమతి. నౌకరుతో సగర్వంగా "టైలరనిటు పిలువు" అని ఆజ్ఞాపించింది. వినయ విధేయతలు వుట్టిపడుతూ "చిత్తమమ్మా" అంటూ పోయి టైలర్ని నడి వయస్సులో వున్న ఆ సన్నని టైలర్ని వెంటబెట్టుకొని వచ్చేడు. టైలర్ రాగానే వారిద్దరికి నమస్కరించి తన చంకలో వున్న బట్టల చుట్టను నేలమీద పెట్టి విడతీసేడు. అందులో నలిగిపోయిన యింగ్లీషు కంపినీ, మాదిరి పుస్తక మొకటి, సగం కుట్టి వున్న నీలం చుక్కల సిల్కు గౌను ఒకటి వుంది. గౌనును జాగ్రత్తగా దులిపి పైకి ఎత్తి ఆమెకు చూపేడు.

దాన్ని పరీక్షించి చూచి, వెంటనే స్వభావిక మయిన పెద్ద గొంతుకతో "ఆ కాలరేమిటి టైలర్? ఫ్రిల్లు పెట్టమనలేదూ?" అంటూ తొందరగా మాదిరి పుస్తకంతీసుకుని పేజీలు వేగంగా తిప్పి "ఇదిగో యీ మాదిరి కాదూ నీకు చెప్పింది? అంత వెడల్పు కాలరెందుకు పెట్టేవు? నీకు చెప్పి ప్రయోజనమేమిటి? నీవు వింటేగా?— తీసుకుపో దాన్ని?" అని గద్దించింది.

దానితో టైలర్ నిశ్చల మయిన మొహంలో చెమటలు పట్టుకు వచ్చేయి. "అలాగేనమ్మా" నీరసంగా అన్నాడు. "మీరు మొదట ఫ్రిల్లే కావాలన్నారు తరువాత వద్దన్నారు. ఆరోజు వెడల్పు కాలరు పెట్టమన్నారు. ఫ్రిల్లు మరి ముతక అవుతుందన్నారు." అని ప్రార్ధనా పూర్వకంగా ఆమెవైపు చూచేడు. కానీ ఆమె మాత్రం ఆ లావుపాటి చేతుల్ని వూపుతూ గొంతెత్తి "లేదు. లేదు. నీవన్నీ అబద్ధపు మాటలు చెబుతున్నావు" విసురుగా "నేనేంచెప్పిందీ నాకు తెలుసు. నే నెప్పుడూ పెద్ద కాలరు కావాలనలేదు. ఈ రోజుల్లో పెద్దకాలర్లెవరు పెట్టుకుంటున్నారు? అదెందుకు పెట్టినట్లు నీవు?" "అవునమ్మా" ఆశ పొడసూపింది. "ఫ్రిల్లు పెడితే కొంచం బట్ట యెక్కువ పడుతుంది. పరవాలేదంటారా అమ్మా" అని ప్రాధేయపూర్వకంగా వేడుకున్నాడు.

ఆమె మాత్రం అంత తేలికగా యే విషయం ఒప్పుకునేది కాదు. "నీకేమీ పరవాలేదు. కానీ నా బట్ట మాత్రం బోలెడంత తగలవేశావు. వూరికే యీ బట్టల్ని కొన్నానను కున్నావా డబ్బు యెంతో వృధా చేసేవు." ఆ పడక కుర్చీలో వెనుకకూ ముందుకూ వూగుతూ వేగంగా విసురుకొంది. అతిథి వైపు తిరిగి "నేనీదుస్తులు వస్తాయని కనిపెట్టుకుని కూచున్నాను. ఇప్పుడు చూడండీ! ఎల్లుండి వుద్యానవనంలో విందుకు వేసుకోవాలనుకున్నాను. ఫ్రిల్లు పెట్టమని మరీమరీ చెప్పేను. అవెఱ్ఱి కాలరు చూడండి!" అతిథి దానికి వంతవేస్తూ "అదే నేనూ అనేది, మరి దీని సంగతేం చేస్తారు?" అంది. "అదీ నే చూస్తాగా" అంది శ్రీమతి ధైర్యంగా. కొద్దిసేపు టైలర్ వునికినే గుర్తించనట్లు తన చక్కని తోటపై దృష్టి నిలిపింది. టైలర్ ఆ గౌనును పట్టుకొని ఆమె ప్రసన్నత కొరకు ఎదురు చూస్తూ నిలుచున్నాడు. చెంపలు మీదుగా చెమట ధారలు కారిపోతుంది. పెదాలు తడి చేసుకుని తొట్రు

పాటుతో "వేసుకుని చూస్తారా అమ్మా ?" ప్రాధేయ పడ్డాడు. "లేదు. అవుసరంలే" దని విసిరింది, "ఎందుకు వేసుకోవటం! అధ్వాన్నంగా వుంది కుట్టు. కాలరంతా శుద్ధతప్పు, వేసుకుని చూడటం దేనికి!" తోటమీది దృష్టి మరల్చ కుండగానే అంది. "ఆ ఫ్రిల్లే కుడతానమ్మా, మీరు చెప్పిన విధంగానే కుడతాను. మీ కెప్పుడు కావాలి ?" "నాకు రేపు కావాలి. మధ్యాన్నం పన్నెండు గంటలకు. లేదా డబ్బు ఆశ పెట్టుకోకు." "అలాగే చేస్తానమ్మా" అంటూ ఆ బక్కచిక్కిన చేతులతో గౌనును జాగ్రత్తగా మడిచి వేసేడు. లేచి దేని కొరకో ఎదురు చూస్తున్నట్లు నిలుచున్నాడు. విచార రేఖలు అతని మొహంలో ప్రతిబింబిస్తున్నాయి. ఆవేదనతో కూడిన మొఖంలో చమటలు కమ్ముకున్నాయి. చివరికి ఆమె కూడా యీ ఆవేదన చాయలను గుర్తించ కుండా ఉండలేక పోయింది. ఏమిటి చూస్తున్నా వింకా? టైలరు పెదేలు తడిచేసు కొని, హీన స్వరంతో "కొంచెం డబ్బిప్పిస్తారా అమ్మా ?" ఆమె వాడి చూపుల క్రింద అతని గొంతు మరీ నీరసించి పోయింది. "నాఅన్న కొడుకు యీ రోజు చచ్చిపోయేలా వున్నాడు. వాడికి భార్యా, ముగ్గురు పిల్లలూను. దహనానికి కూడా డబ్బు లేదు." ముగించ గలిగేడు. "నే నను కుంటూనే వున్నాను. వాళ్ళ కెప్పుడూ యేదో ఒక విపత్తు వచ్చి పడుతూనే వుంటుంది. ఈ కుట్టుకు తోడు ఎప్పుడూ డబ్బు గొడవె." అతడికి ఆమె వైపు చూచే శక్తి కూడా నశించింది. "నేను చెప్పినట్లు ఫ్రిల్లుతో గౌనంతా పూర్తి చేసుకురా పూర్తికాక పోతే డబ్బిచ్చేది లేదు" "అలాగే నమ్మా" అని నిట్టూర్చేడు. ఆశా జాడలన్నీ అడుగంటుకు పోయేయి. నిరాశ తెర ఆ ముఖాన కమ్ముకుంది. "రేపు తెస్తానమ్మా" అంటూ వెను తిరిగేడు. "చేసేలాచూడు" కేక పెట్టింది, జిగుప్సతో అతను పోయేవైపుగా చూస్తూ.

"నేను రేపంటే వాడు బహుశా ఎల్లుండి కయినా తెస్తాడేమో"అని యేదో గుర్తుకు వచ్చినట్లు గంట నొక్కింది. నౌకరు రాగానే "ఆటైలరు వెధవ పోతూపోతూ యింట్లో వస్తువేదో పట్టుకు పోకుండా పోడు." అని హెచ్చరించిన ఆమె గొంతు దూరంగా వరండా దిగుతున్న టైలర్‌కి కూడా వినిపించక పోలేదు. డబ్బు కొరకు వీళ్ళీ కథలన్నీ అల్లుకొస్తారు. వీళ్ళకి డబ్బు అవుసరం లేని దెప్పుడు? ఇలాంటి మనుషుల్ని నేనెక్కడా చూడలేదు. మనకి బట్టలు కుట్టి బోలెడంత డబ్బు కూడ బెడుతున్నారు, వీళ్ళంతా. ఇతడు మరీ అన్యాయం. పనికాక ముందే డబ్బు కావాలని కూచుంటాడు. ఈ మధ్య మూడుపర్యాయాలు పిల్లలు చచ్చి పోతున్నారని బొంకేడు. అందులో నేనొక్కమాట నమ్మలేదు. తాగుడుకు, నల్లమందుకు తగలేస్తుండాలి. వీళ్ళంతా యింతే. ఒక్కమాట నమ్మకూడదు. "మమ్మాటికి నిజం మీరన్నది" అంటూ అతిథి సెలవు తీసుకోవటానికి లేచింది. 'వీళ్ళతో ఖచ్చితంగా వుండాలండి' అంది శ్రీమతి.

ఎండ తీవ్రంగా వుంది. టైలరు శ్రీమతి యిల్లుదాటి నిశ్చింతగా సాగిపోతున్నాడు. ఆమెను అడిగి చూచేడు— కానీ ప్రయోజనం లేక పోయింది. తిరస్కరిస్తుందేమో నన్న భయం వేధిస్తున్నా ధైర్యం కూడబట్టుకుని అడిగినా ఫలితం మాత్రం లేదు. ఆ నాల్గుడబ్బులూ వస్తే తన కొడుకు దహనానికి పనికి వస్తుంది. తన ముగ్గురు కొడుకులూ తన కండ్లముందే మట్టిలో కలిసి పోయేరు. అన్న కొడుకయినా యితడొక్కడేగా మిగిలింది. ముగ్గురు కొడుకుల తండ్రి అయి అనుకోని విధంగా చావు దాపురించింది. రెండు నెల్లు వెనుక ఎఱ్ఱగా కాలిన నాగలికఱ్ఱు పొరపాటున కాలుమీదపడి ఎముకల కంటా కాలిపోయింది. వాడిన తైలా లేమీ పనిచేయలేదు. ఈ రెండు నెలల్లో కాలువాచి ఆశలు వదులుకునే పరిస్థితికి వచ్చింది.

ఈ రోజు ఉదయమే రోగిని చూచి వచ్చేడు. చావు పీఠమేసుకు కూర్చుందని అతనికి తెలిసి పోయింది. గుమ్మంలో అతని భార్య కూర్చుని రోదిస్తోంది. పెద్ద పిల్లలిద్దరూ దిగులుగా చూస్తూ కూచున్నారు. పొత్తిళ్ళలో పసివాడు రొదపెడుతున్నాడు. తల్లి రెండు రోజులుగా ఏడుపు పెడబొబ్బలలో పాలన్నీ ఎండి పోవటం వల్ల వాడు ఆకలికి గింజుకు పోతున్నాడు.

టైలరు సందు తిరిగి ఓ ద్వారంలోకి ప్రవేశించేడు. పెద్ద వసారాలో మొండి మొలలతో పిల్లలంతా ఆటలలో కీచులాడుకొని కాకి గోల చేస్తున్నారు. తలమీద మురికి నీళ్ళలో గుంజిన చింకి పాతలు దండేలమీద వ్రేలాడుతున్నాయి. అక్కడి ప్రతి గదిలోనూ ఒక కాపురం నివసిస్తుంది. ప్రతివాడూ చెత్తా చెదారం అంతా ఆ ముందే వేయడంవల్ల వేసవి అయినా ఆ ప్రదేశమంతా దుర్గంధంతో నిండి వుంది. కానీ యీతడు మాత్రం యివన్నీ పట్టించుకునే పరిస్థితిలో లేడు. కుడివైపుగా వున్న ఒక

చీకటి గదిలోకి దారి తీసేడు. ఈ గదిలోనూ దుర్గంధమే-కాని యిది మాంసము కుళ్ళిన వాసన. మంచం ప్రక్కన ఆమె రోదిస్తుంది. అతడు రావటం కూడా ఆమె గమనించలేదు. కన్నీటితో ముఖమంతా మలినంగా వుంది. నల్లని పొడుగాటి జుట్టు ముడి విడి బుజాల మీదుగా విరబోసి వుంది. "అయ్యో! నీవు వెళ్ళిపోతున్నావా? మా గతేమిటి" అని పదే పదే రోదిస్తుంది. ప్రక్కనే నేలమీద పడివున్న చంటివాడికి యేడవటాన్కి కూడా వూపిరి లేకుండా వున్నాడు. పెద్ద పిల్లలిద్దరూ తల్లి చెంగు పట్టుకు కూర్చున్నారు.

టైలరు మంచం వైపు తిరిగి "ఎలావుంది నాయనా?" అన్నాడు. రోగి కష్టంమీద కండ్లు విప్పి చూచేడు. అస్థి పంజరంలా వున్నాడు. ఎంతో సతమతమయి పెదేలు కదిపి 'యీ పిల్లలు' అనగలిగేడు నెమ్మదిగా. టైలర్ ముఖం బాధతో వివర్ణమయింది. మంచానికి ఓ మూలగా కూర్చుని "నీ బిడ్డల కొరకు విచారించకు నాయనా. శాంతంగా వెళ్ళిపో. నీ భార్యా బిడ్డలు నా యింటికి వస్తారు. నీ భార్య మాకుబిడ్డలాంటిది. నీ ముగ్గురు బిడ్డలు మాకు మనుమలు. నీవేమయినా దూరపు వాడివా నాకు?" లోలోపలే దుఃఖిస్తున్నాడు– కన్నీరు ధారలుగా కారిపోతోంది. రోగి కొంతసేపటికి గొణుగుడుగా "నీవూ బీద వాడివే నాయె...." "నీవు విచారించకు శాంతంగా వుండు నాకు చేతిలో పని వుంది. నాదగ్గర యిప్పుడు పోస్టు మాస్టరు భార్య దుస్తులు వున్నాయి. ఫ్రిల్లు తప్ప అది దాదాపు పూర్తి అయింది. బహుశా ఇంకా బట్టలు వస్తాయి. మాకు బాగానే జరిగిపోతుంది——" కానీ రోగి తిరిగి మాట్లాడలేదు. కండ్లు మూసుకొని నెమ్మదిగా వూపిరి పీలుస్తున్నాడు. టైలరు తన బట్టల చుట్టను ఒక మూల పెట్టి వచ్చి నిశ్శబ్దంగా రోగి ప్రక్కన కూర్చున్నాడు. రోగి భార్య పెద్దగా రొద పెడుతూనే వుంది. గంటలు గడిచిపోతున్నాయి. చివరకు ఆమె అలసిపోయి కండ్లు మూసుకొని మంచానికి చేరబడింది. పొరిగింటి ఒకామె చంటివాడిని పాలు పట్టటానికి తీసుకుపోయింది.

మసగ చీకటి పడగానే రోగి ప్రాణం వదిలేడు. అప్పుడు టైలర్ లేచి మూల నున్న బట్టల చుట్టను పట్టుకొని కోడలితో "వాడు వెళ్ళిపోయాడు, నీదగ్గరేమయినా డబ్బు వుందా?" అన్నాడు. ఆమాటలు వినగానే ఆమె వెంట్రుకలు వెనక్కి లాక్కొని లేచి మంచంమీద చూచింది. ఆమె యింకా యౌవనంలోనే వుంది. ఇరవయ్యేళ్ళ కన్న ఎక్కువుండవు. అంత అందగత్తె కాకపోయినా కురూపి మాత్రం కాదు. ఏ పూట కాపూట సంసారాన్ని గడుపుకు వస్తున్న యిల్లాలు. ఇటువంటి అవాంతరం వచ్చి మీద పడుతుందని యెన్నడూ అనుకొని ఎరుగదు. దైన్యంతో టైలరు వైపు చూచి "మాకింకేమీ మిగలలేదు. వారి బట్టలు, నా చలికోటు అమ్మివేసేను. ఇప్పుడున్నదంతా యీ మంచమే!" అతని మొహం దిగులుతో కుంచుకుపోయింది. "ఎవరేనా అప్పిచ్చే వాళ్ళున్నారా?" అన్నాడు. "మా పొరుగు వాళ్ళ తప్ప నాకింకెవ్వరూ తెలియదు. వాళ్ళకి మాత్రం యేముంది?" కన్నీరుపెట్టుకుంటూ "మీరుతప్ప మాకీభూమ్మీద యెవ్వరూ లేరు" అంది. "అవునవును" అంటూ మంచంమీదికిచూచి "మొహంమీద బట్టకప్పు" అంటూ బయలుదేరాడు.

చాల దప్పిపోయి వున్నాడు. రోజంతా తిండీ తిప్పలూ లేకపోయినా ఆకలి మాత్రం కావడంలా. భార్య తెచ్చి అన్నం కంచం ముందు పెట్టినా తినబుద్ధి కాలేదు. ఆ దుర్గంధం యింకా అతని బట్టలకు పట్టుకొని వదలలేదు. హఠాత్తుగా సిల్కు గౌను సంగతి గుర్తుకు వచ్చింది. ఈ దుర్గంధం ఆ బట్టలలో పసిగడితే ఆమె! వెంటనే లేచి గౌను దులిపి వంకీకి తగిలించేడు. అయినా అది ఎంతసేపు అక్కడుంటుంది. కుట్టు పూర్తిచేసి డబ్బు తేవాలి. దుస్తులు మార్చుకున్నాడు. కుట్టేటప్పుడు చెమట గౌనుమీద పడకుండా చూచుకోవాలి. చెమట యింకటానికి గాను ఒక తువాలు తలకు చుట్టుకున్నాడు. చేతులు తుడుచుకోవటాన్కి ఒక బట్ట పక్కనే వుంచుకున్నాడు.

బట్టను అతి జాగ్రత్తగా పట్టుకొని ఆమెను ఎక్కడ అసంతృప్తి పరుస్తానో అన్న భయంతో తనకి చేతనైనంత నేర్పుతో కుట్టు ప్రారంభించేడు. ఆమె యింకో గౌను కూడా యిస్తే ఆ డబ్బు కూడా చేర్చి దహన క్రియలు జరపవచ్చు. కానీ ఒకవేళ ఆమె దగ్గర యింకేమీ కుట్టించవలసినవి లేకపోతే, తానేం చేయాలి! అప్పు చేయవలసిందే. అదయినా వడ్డీ భారం భరించవద్దూ! దహన క్రియలు చేసి అతని భార్యా పిల్లలను తీసుకురావాలి. ఈ ఒక్క గదిలో వారందరినీ యిముడ్చుట మెలాగు? పిల్లలసంగతి తలపుకు రాగానే అదోవిధమయిన సంతోషం కలిగింది కానీ వారిని పోషించాలి అన్న సంగతి వెంటనే గుర్తుకు వచ్చి అది మాయమైపోయింది.

ఇంకా పని చూచుకోవాలి. తప్పక పని దొరుకుతుంది. శ్రీమతిగారి వద్ద యింకా కుట్టించవలసిన బట్టలు వుండే వుండాలి. ఆమె గొప్ప యింటి యిల్లాలు. అర్ధరాత్రి అయినా గౌను పూర్తికాలేదు. అన్నిటికన్నా ముఖ్యమైన ఫ్రిల్లు యింకా కుట్టనే లేదు. మాదిరి పుస్తకం తిరగవేసి చూచేడు. సన్నని కుచ్చులు మడిచేడు. చేతులు నీర్సంతో వణికేయి. తెల్లవారు ఝామకు చేతితో కుట్టవలసిన అంచులు మాత్రం మిగిలాయి. ఒక్క క్షణం కన్నుమూసి బడలిక తీర్చుకుని కుట్టు పూర్తిచేయవచ్చు ననుకున్నాడు. గౌను వంకీకి తగిలించి నడుం వాల్చాడు. గాఢంగా నిద్ర పట్టింది.

కాని ఎంతో సేపు నిద్రపోలేదు. ఏడు గంటలకే లేచి కుట్టు ప్రారంభించి దాదాపు మధ్యాహ్నం వరకూ కుడుతూనే కూర్చున్నాడు. చివరకు ముగించేడు. తాననుకున్న దానికన్న ఎక్కువ కాలమే పట్టింది. తొందరపడి వెళ్ళాలి. ఆమెను ఆగ్రహ పరచకూడదు. ఇంకో గౌను కూడా కుట్టాలి. సాయింత్రము రాత్రీ కుడితే అది కూడా పూర్తి చేయవచ్చును. ఆత్రతగా కుట్టిన గౌను వాసన చూచేడు. కొద్దిగా మాత్రం వాసన కొడుతోంది. ఆమె అది గుర్తిస్తుందా ?

వెళ్ళగానే "పూర్తి అయిందా'' అందామె. "అయిందమ్మా" అంటూ అందించేడు. "అయితే నేను వేసుకు చూస్తాను" అంది. ఆమె గదిలోకి పోగానే వూపిరి బిగబట్టి వేచి వున్నాడు టైలర్. ఆమె ఆ వాసన గుర్తించిందేమో ! ఆమె బయటికి వస్తూ తృప్తిగానే కనిపించింది. కానీ పూర్తితృప్తి పైకి కనబరచలేదు. "ఎంత ?" అంది క్లుప్తంగా. సందేహిస్తూ "ఇరవై రూపాయిలమ్మా" అన్నాడు. ఆమె కోపంగా చూడటం గమనించి "సిల్కు బట్ట కాదమ్మా. ఎవరైనా అంతే అడుగుతారు." "అంత ఎక్కువా అంత ఎక్కువా ! నీవు నా బట్ట అంతా వృధా చేసేవుకూడాను !" చివరకు యిష్టం లేకుండానే డబ్బు యిచ్చింది. "వందనాలమ్మా" నెమ్మదిగా అన్నాడు. ఆమెను యిప్పుడు అడగాలి—— కానీ ఎలాగు ? ఆమె లేదంటే, తానేంకావాలి ! ధైర్యాన్ని ఎలాగో కూడబెట్టు కున్నాడు. ఆమె కండ్లలోకి చూడకుండా "అమ్మా ! యింకా బట్టలుంటే కుడతాను. వూపిరి బిగబట్టుకొని ఆమె సమాధానం కొరకు ఎదురుచూస్తున్నాడు. ఆమె గౌను మార్చు కోవటానికి గదిలోకి వెడుతూ నిర్లక్ష్యంగా "లేవు లేవు. యింకేమీ లేవు. నాబట్టల్ని పాడుచేస్తున్నావు. ఇంకా చాలామంది టైలర్లున్నారు. వాళ్ళు చవుకగాకూడా కుడతారు" అంది. పిడుగువంటి యీ మాటలు టైలర్ చెవిని పడి కృంగిపోయేడు.

రెండవరోజు వుద్యానవనం విందులో కిందటిరోజు తన యింటికి వచ్చిన అతిధిని కలుసుకుంది శ్రీమతి. శ్రీమతి కొత్తగౌను చూచి ఆమె కండ్లు ఆశ్చర్యంతో మెరిసేయి. "చివరికి ఎలాగో మా గౌను తయారయిందండీ ! అతడు పూర్తిచేసి యిస్తాడనుకో లేదు సుమండీ ! ఆ ఫ్రిల్లు బాగా కుట్టేడు కదండీ !" శ్రీమతి తృప్తిగా తన ఫ్రిల్లు చూచుకుంది. "అవును బాగావుంది కదండీ ! చివరికి ఫ్రిల్లే కుట్టించుకోవటం మంచిదే అయింది. పైగా ఎంతో చవక ! ఈ ఫ్రిల్లూ యిదీ కుట్టటాన్కి మనవాళ్ళయితే యింకా ఎనిమిది రూపాయలు ఎక్కువ తీసుకునేవారు ! ఏమంటారు ?" "అవునవును సరిగా పన్నెండు గంటలకే తెచ్చి యిచ్చేడు నేను చెప్పినట్లు. వాళ్ళతో ఖచ్చితంగా వ్యవహరించడమే దీనిలో రహస్యమండీ !"

★



# సమాజసేవ: ఉత్సాహం కల్పించడము

శ్రీమతి దరిశి సుభద్రమ్మ.

సమాజ శ్రేయస్సుకు అందరూ సమిష్టిగా ఉత్తేజంతో కృషి సల్పిననే సర్వ జనులు సుఖప్రదమైన సాంఘిక జీవనం జీవించుటకు సాధ్యపడుతుంది. మానవులు సహజంగానే సంఘజీవులు. అన్యోన్యానురాగం, ఆత్మీయత, పరస్పరసహకారం, సానుభూతి అనేవి మానవుని ఉగ్గుపాలతోనే ప్రారంభ మవుతవి. ఎప్పుడు కొందరు జనులు స్వార్థపరులై వ్యక్తిగత శ్రేయస్సునే లక్ష్యమిచ్చి సమష్టి శ్రేయస్సును విస్మరిస్తారో, ఆ నాటినుండియే తక్కిన జనుల సాంఘిక జీవనం దుర్భరమవుతూ క్రమేణ సమాజమే శిథిలమగు స్థితికి వస్తుంది. కొన్ని వందల ఏండ్ల నుంచి నిన్న మొన్నటిదాక మన సమాజానికి అలాంటి పరిస్థితి ఏర్పడి వుండినది. సమాజంలో దురాచారాలు మూఢ విశ్వాసాలు, స్వార్థ పరత్వం, పదవీ వ్యామోహం భోగలాలసం, మతవైషమ్యాలు, అనైక్యత, అంతః కలహాలు పెచ్చు పెరిగిపోయినవి. తత్ఫలితంగానే భారతీయులందరం విదేశీ పరపాలన క్రింద దాస్యంతో, దారిద్ర్య క్లేశాలతో వందల ఏళ్ళ పర్యంతం నానా బాధలు పడ్డాము. ఇంతేకాదు; మన సమాజమే శిథిలమై భూగతమయ్యేస్థితి ఏర్పడినది. ఎందరెందరో మహనీయులు మన సమాజాన్ని సంరక్షించటానికి కృషి చేయసాగారు.

ఇట్టి తరుణంలో మనదేశపిత గాంధిజీ మన సమాజం యొక్క స్థితిగతులను అవగాహనం చేసికొని మనల్ని తరింపజేయుటకు దీక్ష వహించారు. మన బాపూజీ, సహచరులననేకులను కూడగట్టుకొని బహుముఖాలుగా సమాజసేవ చేస్తూ ఆ బాలగోపాలాన్ని ఉత్తేజపరచినారు. అందరితోబాటు భారత మహిళలు కూడా, కుటుంబం, ఆస్తి పాస్తులు మున్నగువాటిని పరిత్యాగం చేసి దుర్భర కష్టాలనోర్చుకొని అద్వితీయంగా స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నారు. సమాజంలో నానాటికి పెరిగిపోతున్న దుర్గంధపూరితమైన కుళ్ళును తొలగిస్తూ వివిధమైన నిర్మాణ కార్యకలాపాల్లో పాల్గొన్నారు. పురుషులతోపాటు భారతవనితలు కూడా సమస్తం త్యజించి అపూర్వోత్సాహంతో సమాజసేవ సల్పినందుననే, మనకు స్వాతంత్ర్య సౌభాగ్యం లభించింది. కాని, ఇంతటితో మహిళల బాధ్యత పూర్తి కాలేదు. ఎందుకంటే మన దేశం దాస్యంనుంచి విముక్తి చెందినదే కాని, దారిద్ర్య క్లేశాలనుంచి చెందలేదు. ఈనాడు కూడా ఎక్కడ చూచినా నిర్ధనులు, నిరుద్యోగులు, నిర్వ్యాపారులు, నిరక్షరకుక్షులు, అజ్ఞానం అనారోగ్యాలతో అలమటించిపోతున్నారు. పూర్వంలాగే ఈనాడూ మన సమాజంలో అనేకులలో అధికారకాంక్ష, స్వలాభాపేక్ష, స్వబంధు, స్వజన పక్షపాతం మున్నగు దుర్గుణాలు తలెత్తుచున్న సూచనలు గోచరించుచున్నవి. అందుచేత ఇట్టి దుర్భర దారిద్ర్య స్థితులనూ, సమాజానికే అరిష్టదాయకమైన వ్యక్తిగత శ్రేయోభిలాషనూ, తుదముట్టించి సమస్త ప్రజలకు సుఖప్రదమైన సమాజాన్ని నిర్మించేందుకు తిరిగీ భారతమహిళలు పూనుకోవలసిన సందర్భమేర్పడినది. పైగా, ఆనాడు మహిళలను సమాజసేవకు ఉత్తేజపరిచినట్టి పరిస్థితుల్లాంటివే ఈనాడూ మనకి ఏర్పడియున్నవి. ఎలాగనగా, జాతిజనకుని మహాదాశయాన్ని గ్రహించిన ఆయన పరమ శిష్యులు, వినోబాభావే, ఆయన సహచరులు, అందరికీ ఆర్థిక సమానత్వము, వైజ్ఞానికంగా సాంఘికంగా అభ్యున్నతినొందుటకు సమాన సదవకాశములున్నట్టి నవ్య సమాజాన్ని నిర్మించుటకు "సర్వోదయ" అనే ఉద్యమాన్ని నెలకొల్పినారు; ఈ ఉద్యమంక్రింద, భూదాన, సంపత్తుదాన, శ్రమదాన అనే ఉద్యమాలని బయల్దేర్చి, అహర్నిశలు కృషి చేస్తున్నారు. భూస్వాములు, పారిశ్రామిక యజమానులు, ధనికులు, వీరియొక్క హృదయ పరివర్తనముద్వారా ఆర్థిక అసమత్వాన్ని క్రమేణ తొలగించటానికి సంకల్పించు

కొన్నారు. ఈ మహనీయులు దేశంలోని సమస్త గ్రామాలను వేలకొలది మైళ్ళు పాదచారులుగా వెళ్లుతూ అప్పుడే కొన్ని లక్షల యకరాల భూమిని భూస్వాములనుంచి సంపాదించారు. ఈ ఉద్యమాలలో వందలుకొలది సమాజ సేవకులు చేరిపోయి అద్వితీయమైన ఉత్సాహంతో సమాజసేవ సల్పుచున్నారు. ఇదే రీతిగా మరికొందరు సమాజసేవకులు భారత సేవక సమాజం, స్త్రీలు, శిశువుల సంక్షేమ సంస్థలు, అనాథ శరణాలయములు ఇత్యాదులను స్థాపించి అవిరామమైన కృషి సల్పుతున్నారు.

ఒక వైపు ఈలాంటి సంస్థలూ, సమాజ సేవకులు మనలను సమాజ సేవకు ఉత్తేజపరుస్తున్నారు. మరోవైపు, భారత ప్రభుత్వమే మనలను సమాజసేవకు అనేకవిధాలుగా ప్రోత్సహిస్తున్నది. ఏలాగంటే, మన భారత ప్రభుత్వ లక్ష్యం కేవలం ప్రజాప్రభుత్వ స్థాపన మాత్రమేగాదు; భారత భాగ్య విధాత గాంధీజీ యొక్క పరమాశయమైన సంక్షేమ రాజ్య స్థాపన కావున, పరమ లక్ష్య సాధన కోసం, భారత ప్రభుత్వం కృషిచేయ నారంభించినది. మన ప్రభుత్వము, జాతి, మత, కుల, వర్గ విభేద రహితమై, సమస్త ప్రజలు, ఆర్థికంగా, సాంఘికంగా, వైజ్ఞానికంగా అభ్యున్నతి నొందునట్టి సమాన సదవకాశములుండి సమానత్వం, సహృదయం, సౌభ్రాతృత్వములతో ప్రజలే పరిపాలన చేసుకొనుటకు వీలగునట్లు నూతన రాజ్యాంగమును రూపొందించినది. అప్పుడే, ప్రజాస్వామ్య ప్రభుత్వ పద్ధతి ప్రకారం, అక్షరాస్యతతో నిమిత్తం లేకుండానే వయోజన ఎన్నికలుకూడా జయప్రదముగా జరిగిపోయినవి.

ఇక, సంక్షేమ రాజ్యస్థాపనకావశ్యకమైన ప్రణాళికలను అమలు పరచుటకు కేంద్ర ప్రభుత్వం పూనుకొన్నది. కాని, ఇట్టి కార్యకలాపాలను అమలు పరచుటకు ప్రభుత్వ కృషిమాత్రమే చాలదు. ప్రజల సహకార సానుభూతులు, వారి అఖండకృషి అత్యవసరంకదా ! అందుచేత, మన కేంద్ర ప్రభుత్వం సమస్త జనుల సహకారమును సమీకరిస్తూ జాతీయ విస్తరణ ప్రణాళికలను దేశవ్యాప్తిగా అమలు పరచుటకు ప్రారంభించినది.

ఇంతేకాదు. ప్రతి గ్రామంలోను, స్త్రీలు, బిడ్డలు, గ్రుడ్డి, మూగ మున్నగు వికలాంగులు, బాల నేరస్థులు సత్వరాభివృద్ధినొందుటకని, కేంద్ర ప్రభుత్వంవారు ప్రత్యేకంగా "అఖిలభారత సంక్షేమ బోర్డు"ను, 1953 సం॥ ఆగస్టులో స్థాపించినారు. ఆంధ్ర, అస్సాం, బొంబాయి, హైదరాబాదు, మధ్యప్రదేశ్, మద్రాసు, తిరువాన్కూర్, కొచ్చిన్, ఒరిస్సా, ఢిల్లీ మొదలగు ప్రాంతాలలో 300 సంక్షేమ కేంద్రాలు స్థాపించబడినవి. ఈ నెలలో అనగా, భారత స్వాతంత్ర్య దినోత్సవమైన ఆగస్టు 15 తారీఖు నుంచి ఈ కేంద్రాలలో సంక్షేమ కార్య కలాపాలను సమగ్రంగా జరుప నిశ్చయించబడినది. క్రమేణ తక్కిన రాష్ట్రాలలో సంక్షేమ కేంద్రాలు స్థాపించబడుతవి.

ఈ 300 సంక్షేమ కేంద్రాలకూ 6000 గ్రామాలు 60 లక్షల జనాభా వుంటుంది. సంక్షేమ కార్యకలాపాల కయ్యే వ్యయంలో సగం కేంద్ర ప్రభుత్వం అఖిలభారత సంక్షేమ బోర్డుద్వారా గ్రాంటు యిస్తుంది. తక్కిన సగం ఆయా ప్రాంతాల ప్రజలు, స్థానిక సంస్థలు, రాష్ట్ర ప్రభుత్వాలు యిచ్చుకోవాలి. ప్రజలు ధన ధాన్యరూపంలో, కాయకష్ట రూపంలో యిచ్చి సహకరించాలి.

ఆంధ్ర రాష్ట్రంలో జూలైమాసంలో ఉభయ గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు జిల్లాలలో సాంఘిక సంక్షేమ ప్రణాళికల నిర్వాహణకు కమిటీలు ఏర్పరుపబడినవి. ఆగస్టు 15నుంచి సంక్షేమకృషి వివిధ రూపాల్లో జరుపబడుతవి.

స్త్రీలకు, విద్య విజ్ఞానాలకూ, బ్రతుకు తెరువుకూ, వయోజన విద్యాశాలలు, పరిశ్రమ కేంద్రాలు నెలకొల్ప బడుచున్నవి. ప్రసూతి వైద్యశాలలు, శిశుసంక్షేమకేంద్రాలు, శిశుసంరక్షణ, శిశుశిక్షణ శాలలు (క్రీచ్చీలు నర్సరీలు) వికలాంగులకు విద్య పరిశ్రమలు నేర్పు పాఠశాలలు, బాలనేరస్థులకు విద్యా వివేకాలు, సాంఘిక జీవనం సమాజసేవ. ఇత్యాదుల నేర్పు నట్టి పాఠశాలలు, సంస్థలూ, కుటుంబ సంక్షేమ కేంద్రాలు నెలకొల్పుటకు కృషి అతి చురుకుగా జరుగుతున్నది. ఇంతేకాక, కేంద్ర సంక్షేమ బోర్డు స్వచ్ఛంద సంక్షేమ సంస్థలకు ధనరూపంగా, సలహా రూపంగా సహాయ పడుతూ ఉన్నది.

ఇదివరకే మనవిచేసి వున్నట్టుగా తిరిగి భారతమహిళలు అపూర్వోత్సాహంతో సర్వతోముఖంగా సమాజసేవ చేయుటకు సన్నివేశ సందర్భాలు ఏర్పడుచున్నవి. మనం అనేక

సమాజసేవ

విధాలుగా కార్య కలాపాల్లో పాల్గొనుటకు స్వచ్ఛంద సంస్థలు, సమాజ సేవకులేగాక, భారత ప్రభుత్వమే మనల్ని ప్రోత్సాహిస్తున్నది. కావున, మనం జాతీయ పునర్నిర్మాణ కార్య క్రమాల నిర్వహణకు (1) జాతీయ ప్రణాళిక బాండు లను వీలయినంత పెద్దమొత్తం మిచ్చి కొనవచ్చును. (2) ముఖ్యంగా గ్రామోద్ధరణ కార్యకలాపం కోసం మనం ధన ధాన్య రూపంలో, కాయకష్ట రూపంలో సహాయ పడ వచ్చును. (3) సాంఘిక సంక్షేమ కృషికి ఆవశ్యకమైన సుశిక్షణలను పొంది స్వచ్ఛంద సమాజసేవకులుగానో లేదా జీవనోపాధికి తగినంత మాత్రమే వేతనం పుచ్చుకొని సంక్షేమ కార్యకర్తలుగానో కృషి సల్పవచ్చు. ఇంకా ఎన్నో విధాలుగా సేవచేయుటకు పూనుకోవచ్చును. మహిళ కుటుంబానికేగాక సమాజానికే మాతృస్వరూపిణి కాన, సమానత్వం, సహృదయం, సౌభ్రాతృత్వంతో కూడిన సర్వాంగ సౌష్టవమైన నవ్యసమాజాన్ని నిర్మించు బాధ్యత ముఖ్యంగా భారత మహిళలమీద ఉన్నదను విషయాన్ని గుర్తించి వెంటనే కార్యాచరణకు పూనుకోవాలికదా!

(ఆలిండియా రేడియోవారి సౌజన్యంతో)

# గణపతి పూజ



గీ॥ ఆది మధ్యాంతశూన్య, పరాపరస్వ
రూప పరిపూర్ణ, పరిశుద్ధ పాపహరణ
పంచకర, దివ్యవదనాబ్జ, ప్రథమపూజ్య
వినుతిఁగొనుమయ్య వరసిద్ధి విఘ్నరాజ!

# బాలానందం

## అనాధ బాలలు !

"శ్రీ తాత"

బాలల్లారా, విన్నారా—ఈ" అనాధ బాలల" దీనచరిత్ర ! ?
బాలుడు, బాలిక— వారి పేరులను ఎరుగను నేనది పాతకథ !!
చిన్న తనంబునె తల్లి గతించెను ; తండ్రే సాకెను బిడ్డలను.
సిరిసంపదలతో తులతూగుచు పిల్లలు తల్లిని మరిచివేగ
ఇంతలోనే యా మృత్యుదేవత తండ్రినికూడా వలచినది ; ఆ
గతిని ఎరింగిన ముదుసలి తన పిల్లల గతికై చింతించెన్.
చేరువనున్న తమ్ముని పిలచీ పిల్లల నాతని సాకుమనెన్
పిల్లి కళ్ళతో, దేబె ముఖముతో కడు దుష్టుడయా పినతండ్రి.
చంకలు కొట్టెను, ఆస్థి చిక్కుటకు పిల్లల చంపగ తాదలిచెన్ !
మండు వేసవిలో మెండగు దుష్టుల నిద్దరి నాతడు మాట్లాడెన్
"సాయంసమయపు షికారుకై పొండి వీరితో మీర"నెను.
నమ్మిన పిల్లలు నెమ్మదిగా దుష్టుల వెంబడి చనినారు.
దాపున నున్న అరణ్యమందున ముద్దు బాలలను చంపగలేక,
"మిఠాయి లడ్లు తెచ్చెద" మంటూ మెల్లగ జారిరి దుష్టు లిర్వురు.

*　　　*　　　*　　　*

సంధ్యా సమయము— అమవశరాత్రి--సూర్యచంద్రులూ మటుమణిగారు !
పదిరెండేండ్ల పిల్లవాడు తన చెల్లితొ అడవిని తిరుగాడెన్.
దారిని గానక, భీతిలిబాలలు గజగజ వణికిపోయారు,
కడుపు మంటచే నడువగలేరు, గొంతుకెండెను ఏడ్వగలేరు,
లేత హృదయములొక చెట్టు క్రిందనే శయనించెను నిశ్శబ్దముగా !
పసిపాపలను మృత్యు దేవత ఏడ్చుచు నెట్లో చేర్చుకొనెన్ !
చెట్లే ఏడ్చుచు ఆకులు రాల్చెను పూల పాన్పుగా పాపలకు ;
పిట్టలె పాడెను దీనముగా పిల్లల ఆత్మకు శాంతి కోరుతూ,
బాలల దుస్థితి చూడలేకనో తారలె రాలెను మెరయుచును,
మానవ జాతి, నీతి, మతములనె నిందించెగా అడవిమృగములె ! ! !
—బాలల్లారా, విన్నారా ఈ "అనాధ బాలల" దీన చరిత్ర ? !

# గొప్పవారికి చిన్నపాఠం!

శ్రీమతి కె. అమ్మాజీ.

బాలలూ! మీలో చాలామంది న్యూటన్‌ను గురించి వినే ఉంటారు. ఇతడు ప్రపంచ ప్రఖ్యాతి చెందిన గొప్ప గణితశాస్త్ర వేత్త. ఇతడొకప్పుడు పప్పులో కాలు వేసిన చిన్న కథ వినండి!

ఒక రోజున ఆపిల్ పండు చెట్టునుంచి రాలి క్రిందకు పడుతుంటే చూచేడు; ఆ పండు క్రిందకే పడ్డమేమి- పైకెందుకు పోకూడదు? అన్నజిజ్ఞాస పట్టుకుంది అతడికి. అన్ని వస్తువులూ పైనుంచి భూమి మీదకే పడ్డానికి ఏదో కారణం ఉండాలి అని ఆలోచించి ఆలోచించి, అనేక పరిశోధనలు చేసి, గొప్ప లెక్కలు కట్టేడు. భూగోళం తన కేంద్రం వైపుకు అన్ని వస్తువుల్ని ఆకర్షించుకుంటుందని, అలాగే భూమి చంద్రుణ్ణి, సూర్యుడు నవగ్రహాల్ని, ఇలా ఒక్కటొక్కటి పరస్పరం ఆకర్షించుకోవడం వల్లనే అవి అనంతాకాశంలో బంతుల్లాగ తిరుగాడుతున్నాయని ప్రకటించేడు. దీన్నే 'గురుత్వాకర్షణ నియమం' **(Law of Gravitation)** అంటారు. ఇంతటి గొప్ప మేధావికి కూడ ఓ చిన్న విషయం తోచిందిగాదు; వినండి.

ఆయనకు ఒక పెంపుడు పిల్లి ఉండేది. అది తన యిష్టం వచ్చినప్పుడు ఆయనగదిలోకి రావడం, ఆయన్ని రాసుకొని ఆడుకోవడం వగైరాలు చేస్తుండేది. ఆయన దీర్ఘాలోచనల్లోను లెక్కల్లోను నిమగ్నుడై యున్నప్పుడు ఇది కొంత చికాకుగానే ఉండేది. రాకుండా తలుపు వేసేస్తే మ్యావ్ మ్యావ్ అంటూ కూచుని అతని ఆలోచనలకు అంతరాయాలు కల్పించేది. అలాగే కాలక్షేపం చేసుకొస్తుంటే కొన్నాళ్ళకు పిల్లల్ని పెట్టి, పిల్లలూ తానూ తయారయింది! తలుపు తీసి వుంచితే, లోనికివచ్చి గోలా ఆటలూను; మూసేసుకుంటే, తలుపు దగ్గర మ్యావ్ మ్యావ్‌లు! ఒకటికి ఐదయ్యేయి ఇప్పుడు! బయటి గోలకన్నా లోనికి రానిస్తేనే కొంతబాధ తగ్గేటట్టు కనిపించేది. తరుచు లెక్కలు అలాపెట్టి, లేచివెళ్ళి తలుపు తీసివచ్చి, మరీ పనిచూచుకో వలసివచ్చేది రాత్రుళ్లైనాను.

ఈ డిస్టర్బెన్సు తగ్గేమార్గాంతరం ఏమిట్రా అని ఆలోచించేడు. ఒక వడ్రంగి కుర్రాణ్ణి పిలిపించేడు, "చూడు: ఆతలుపులో ఒకపెద్ద కన్నం, ఒకచిన్న కన్నం కొట్టు; అస్తమానులేచి వీటికోసం తలుపుతీయ లేకుండా ఉన్నాను" అన్నాడు. "ఎందుకు మహాశయా రెండు కన్నాలు?" అన్నాడు అబ్బాయి. "ఎందుకేమిట్రా నీ బొంద! పెద్దది పిల్లికీను, చిన్నది దాని కూనలకూను. వేగం కొట్టేసి పో" అన్నాడు న్యూటన్. ఈయన లెక్కల్లో గొప్పమేధావిగదా, రెండు కన్నాలు కావాలంటాడెందుకురా? అని వడ్రంగి కుర్రాడు ఆశ్చర్యపోతున్నాడు. "పెద్దకన్నం ఒకటి కొడితే చాలదాండి? దాంట్లోనుంచే పిల్లలుకూడ రావచ్చునుగా" అన్నాడు. న్యూటన్ మేధావి, తన పరాలోచనకి, ఆ అబ్బాయి మేధాశక్తికి ఒకటే నవ్వట! "బలేపాఠం నేర్పావురా" అని బహుమతీ యిచ్చి పంపించేడట. ★

## పాపాయి ఊహ?

మింటను మెరిసే చుక్కల్లారా!
మిమ్ముల చేరాలనుకుంటానోయ్.
నాకే, కనుకను, రెక్కలు వుంటే!
మిమ్ములచేరీ వుండుదు నోయ్!

మింటను మెరిసే జాబిల్లీ ఓ జాబిల్లీ,
క్రిందటి వారం చిన్నగ వున్నావ్?
ఇప్పుడు చూస్తే సున్నలాగనూ!
పెద్దగ ఎదిగావ్?

ఏమిటోయ్, నీలో విచిత్రమూ!

సూర్యుడు కానీ మీ అన్నయ్యా?
చుక్కలు కానీ మీ తమ్ముళ్ళా!
మీరులేనిదే విశ్వం లేదని మా తాతలు
తండ్రులు చెప్పదురోయ్!

నిజమేనా అది నిజమేనా!
ఎలాగు మిమ్ముల చేరుదునోయ్?
ఉపాయ మేదైనా నుడువండోయ్?

# రావుగారి పైజమా

శ్రీ చేబ్రోలు సూర్యారావు.

ఇది చాలా కాలం క్రిందటిసంగతై వుంటుందిలెండి; అయినాకానీ చాలా గమత్తయిన విషయం అందుకనే, నేను దాన్ని కథగా రాయడాన్కి వుపక్రమించాను. ఇక చదవండి.

పది పదిహేనేళ్ళ క్రితం ఓ చిన్న పట్టణంలో "రావుజీ" అనే ఆయనొకడుండేవాడు. ఆయనవృత్తి ఓ పెద్ద ఆఫీసులో చిన్న గుమాస్తా.

ఒకనాడాయన ఆఫీసుకు పోతూ.... పోతూ.... ఓమాంచి పైజమా కుట్టి అట్టేపెట్టమని దర్జీవానికి ఆర్డర్ జారీ చేసాడు.

సాయంకాలం ఆఫీసునుంచి "రావుజీ"గారు రాకముసుపే దర్జీ పైజమాను తయారు చేసి "రావుజీ"గారింట్లో అప్పచెప్పి వెళ్ళిపోయాడు.

చీకటి పడ్డాక "రావుజీ"గారు ఆఫీసునుంచి యింటికి వచ్చి దర్జీ కుట్టిన పైజమా ఎలావుందో అని తొడిగి చూసుకొన్నాడు. కాలకర్మవశాత్తూ ఆ పైజమా రావుజీగార్కి రెండంగుళాలు పొడుగైంది.

పొడుగు తగ్గించమని దర్జీకి చెప్దామనుకున్నాడు కాని దర్జీ కొట్టుమూసివేసివుంది.

ఆమర్నాడే "రావుజీ"గారి ఆఫీసులో ఎవరో అధికారి ఇన్‌స్పెక్షన్‌కి వస్తాడట. అంచేత ఆ క్రొత్త షరాయి రావుజీగారు ధరించి ఆఫీసుకు వేంచెయ్యాలి.

అందుకని "రావుజీ" ఆయన భార్య వద్దకు వెళ్ళి పైజమా చూపించి దానిలో రెండంగుళాల పొడుగు తగ్గించి కుట్టమని చెప్పాడు. అందుకాయన భార్య తనకేదో పనివుందని కాస్సేపుపోయాక కుట్టిపెడతానని చెప్పింది.

కంగారులో వున్న రావుజీగారు తక్షణం ఆయన సోదరి దగ్గరకెళ్ళి పైజమా రెండంగుళాల పొడుగు తగ్గించమని చెప్పాడు. అందులకామె తనకు వంట యింటిలో పని వున్నదని ఒక అరగంట తరువాత కుడతాననీ చెప్పింది.

వీళ్ళిద్దరివల్లా పని జరుగకపోయేసర్కి రావుజీగార్కి మరీ కంగారు ఎక్కువై తనస్థితి కూతురితో చెప్పుకొన్నాడు.

ఆ అమ్మాయి చాలా మంచిదికనుక తండ్రి మాట శిరసావహించి పైజమా రెండంగుళాలు పొడుగు తగ్గించి కుట్టింది.

ఈమె రెండంగుళాలు పొడుగు తగ్గించినట్టు రావుజీగారి సోదరికి తెలియకపోవడంచే ఆమె మళ్ళీ రెండంగుళాలు పొడవు తగ్గించి కుట్టింది. ఈ సంగతులేవీ తెలియని ఆయనభార్య రెండంగుళాలు పొడుగు తగ్గించి మళ్ళీ కుట్టింది.

ఈ సంగతు లేవీ రావుజీగార్కి తెలీవు. ఆయన ప్రొద్దున్నే లేచి పైజామా తొడుక్కునేసర్కి అది నాలుగంగుళాలు పొట్టై పూరుకుంది. అదలా ఎందుకైందా అని ఆయన చాలా తికమక పడ్డాడు.

కాస్సేపటికి జరిగిన దంతా గ్రహించాడు కాని ఏం చేయగలడు. అదే ధరించి ఆఫీసుకు సిద్ధ మయ్యాడు రావుజీ.

## కృతజ్ఞత

శ్రీమతి గజ్జెల లీలగారు ఆంధ్ర మహిళా సభ నిర్మలాదేవి గ్రంథాలయమునకు కొన్ని పుస్తకములు విరాళముగానిచ్చిరి. వీరికి మా కృతజ్ఞత.

కార్యదర్శినులు.

# భర్త ఉన్నత విద్యకు తోడ్పాటు

రచన :
శ్రీ శ్రీమతి జానకీదేవి.

సమర్పణ :
శ్రీ బుద్ధవరపు సత్యనారాయణ

నాకు వివాహం కావడానికి పూర్వమే నేను బి. ఏ. ప్యాసై, టీచరు ట్రైనింగు పొందాను. అప్పుడు నా భర్త ఒక వ్యాపారం చేసేవారు. లేమి అనేది లేకుండా చాలా హాయిగా ఉండేది.

కొంతకాలానికి వ్యాపారంలో చాలా నష్టం వచ్చింది. అది మానుకొని ఆయన ఒక ఉద్యోగంలో ప్రవేసించా లని నిశ్చయించుకున్నారు. కానీ ఆయన ఇంటర్ మీడియట్ వరకే చదివారు. ఆ చదువుకి సరైన ఉద్యోగం రాదు. అందుచేత ఇంకా పెద్ద చదువులు చదవాలని నిర్ణయించు కున్నారు.

మేం ఉన్న ఊళ్ళోనే టీచరు ఉద్యోగంలో చేరతా నన్నాను నేను. ఎలాగయితేనేం ఆయన్ని ఒప్పించాను. ఉద్యోగంలో ప్రవేశించాను. నేను సంపాదించేది మాకు బాగానే సరిపోయేది. ఎందుకేనా మంచిదని ట్యూషన్లు చెప్పేదాన్ని.

ఇంట్లో ఇబ్బంది లేకుండా గడవడం వల్ల ఆయనకు ఉత్సాహంగా ఉండేది. బి. ఏ. చదువుతూ ఉండేవారు. ఇదివరలో ఆయన చేసిన వ్యాపారాన్ని పూర్తిగా వదిలించేసు కోవడంవల్ల కొంత డబ్బుకూడా మా చేతికి వచ్చింది,

బి. ఏ. పూర్తి చేసిన తరువాత బి. టి. క్లాసులో చేరారు. సంవత్సరం గడిచేసరికి నాకు మల్లేనే ఆయనకూడా అధ్యాపకత్వం స్వీకరించారు. మంచి జీతం చక్కటి ఉద్యోగం దొరికింది.

తరవాత. ఇంక ఉద్యోగం మానెయ్యమని నన్ను బలవంతం చేసి నంత పనిచేశారు. ఆయన మనస్సును కనిపెట్టి నేనూ అందుకు అంగీకరించాను. కొన్ని మాసాలు గడిచేసరికి ఆయన తనకు ఎం. ఎ. ప్యాసవ్వాలని వుందన్నారు. మళ్ళీ వదులుకున్న ఉద్యోగంలోనే నేను తిరిగి ప్రవేశించాను. ఆయన కాలేజీలో చేరారు. ఎం. ఎ. చదవడం ప్రారంభించారు. రెండు సంవత్సరాలు పట్టింది పూర్తి అయ్యేసరికి.

క్రిందటి సంవత్సరమే ఆయన ఎం. ఎ ఫస్టు క్లాసులో ప్యాసయ్యారు. వెంటనే లెక్చరర్‌గా ఒకమంచి ప్రభుత్వోద్యోగంలో ప్రవేశించారు. త్వరలోనే ఆయన గెజిటెడ్ ఆఫీసరు అయ్యే అవకాశాలున్నా యంటున్నారు. నా ఉద్యోగం ఈ విధంగా ఆయన అభివృద్ధికి తోడ్పడినందుకు నాకు చాలా సంతోషంగా వుంది.

గడచిన ఈ నాలుగు ఏళ్ళపాటు మే మిద్దరం ప్రాణ స్నేహితుల్లాగ - ఒకరి కొకరు సహాయం చేసుకొనే అప్పుల్లాగ గడిపాం. సాయంకాలం మేం చల్లగాలిలో షైరు వెళ్ళేవాళ్ళం.

మాకు ఉన్న ఇద్దరు పిల్లలయందు మేము ఎటువంటి అశ్రద్ధా చూపలేదు. వాళ్ళని నిర్లక్ష్యం చేయడం అన్న ప్రశ్నే లేదు. వేళకి అన్నం పెట్టేదాన్ని. బట్టలు తొడిగే దాన్ని. టైమయ్యేసరికి బడికి పంపుతూ వుండే వాళ్ళం. వాళ్ళ చదువులు గురించి కూడా మే మిద్దరం తగిన శ్రద్ధ తీసుకున్నాం.

కష్టించి పనిచేసుకున్న ఈ నాలుగు సంవత్సరాలు మా యిద్దరిని మరింత ఆత్మీయుల్ని చేశాయి. త్వరలో ఒక చక్కటి ఇల్లు కట్టుకోవాలనుకుంటున్నాం. మా పెద్ద పిల్లాడిని తగిన వయస్సు రాగానే మంచి ప్రామాణికమైన స్కూలుకు పంపిస్తాం.

మనలో చాలామంది అత్యవసరమైనప్పుడు స్నేహితుల దగ్గర అప్పు తీసుకుంటూ వుంటాం. నా వల్ల జరిగిన

## స్త్రీలు : ఉద్యోగాలు



# పుట్టుటయెగాని పూవేమి పొందగలిగె?

* శ్రీ వెంకట పార్వతీశ్వరకవులు *

ఆమె : చెట్టునకు మొగ్గ దొడిగెడు చేష్టగలదు,
కోరకమునకు వికసించు గుణముగలదు,
విరికి వలపుల వెదజల్లు విద్యగలదు ;
వలపునకు గుబులొక్కను నలవాటు గలదు ;
ఇట్టి సౌభాగ్యమంతయు నెందుకొరకు ?

అతడు : తీగ సాగిన తొలికారు తీపి పెనుప,
మొగ్గ దొడిగిన మలికారు మురువుగొలుప,
దళము విరిసిన క్రొక్కారు తళుకులొలుక,
ననుచు వలపుల విరిదోట మనుపఁగాదె

ఆమె : లలిత పరిమళతతి వాయువులు హరించు,
మధుర మకరంద రసము బంభరముగ్రోలు,
తత ఫలోదయమునకె జీవితము గడచు,
పుట్టుటయెగాని పూవేమి పొందగలిగె ?

అతడు : తరపి తేనెల తృషితాళి తనిపి తనిపి,
అలరు నెత్తావి నాశల నాక్రమించి,
సుకృత సత్ఫల సంపద చూరగొన్న
పూత చారిత్ర పూవేమి పొందలేదు ?

## భర్తకు ఉన్నత విద్యకు తోడ్పాటు.

(45 వ పేజీ తరువాయి)

"సహాయం" కూడా మా ఆయన అదేవిధంగా చూస్తున్నారు: ప్రతినెలా ప్రత్యేకంగా కొంత డబ్బు నా చేతికి ఇస్తున్నారు — ఏదో ఖచ్చితంగా నా బాకీ నాకు తీర్చివేస్తున్నట్టు, ఋణం తీర్చుకుంటున్నట్టు!

నా జీతంవల్ల — మాకు సరైన ఆహారం దొరుకుతోంది. మంచి గృహవసతి దొరికింది, నేను ఉద్యోగంలో చేరడానికి 'అభిమానపడి' చేరకపోతే మా పాట్లు ఎల్లా ఉండేవో.

అందుచేత ఆడపిల్లల్ని కన్న తల్లిదండ్రులకు నాదొక్క విన్నపం. ఆర్థికంగా స్వతంత్ర జీవనాన్ని ఇవ్వగలిగే ఏదో వొక వృత్తిని మీ పిల్లలకు చెప్పించండి. ఆడపిల్లలు తమ కాళ్ళమీద తాము నిలబడ గలిగేటట్టు చేయండి. మీరు అలాచేస్తే అవసర సమయాల్లో వాళ్ళ భర్తకు తోడు నీడగా వాళ్ళు ఉండగలుగుతారు. వాళ్ళ జీవితాలు నిరాటంకంగా హాయిగా సాగిపోతాయి.

ఉద్యోగం చేస్తున్నాం కదా అని ఏ స్త్రీ కూడ తన ధర్మాన్ని మర్చి పోకూడదు. ఇల్లు చక్కబెట్టుకుంటూ వుండాలి, భర్తను ఉత్సాహ పరుస్తూవుండాలి. పిల్లలను నిర్లక్ష్యం చెయ్యతగదు. అన్నిటికంటే కూడా తన ఆరోగ్యం విషయంలో ఎక్కువ మెలకువతో వ్యవహరించాలి.



# అలవాటు ★

శ్రీమతి సి. హెచ్. అరవిందాదేవి.

మన అలవాట్లను బట్టే మన ఊహలు, చర్యలు, నడవడి ఉంటుంటాయి; వాటినిబట్టే మనం ఎలాంటి వారమో, లోకం నిర్ణయిస్తూ ఉంటుంది. జీవితంలో చిన్నప్పుడే మంచి అలవాట్లు అలవర్చు కొందుకు ప్రయత్నించాలి. అలవాట్లు మంచి వైనా, చెడ్డవైనా, ఒకసారి ఏర్పడ్డాక వాటిని విడిపించు కొందుకు చాలా ప్రయాస పడాలి. అలవాట్ల ప్రభావాన్ని నచ్చచెపుతూ ఒకసారి మా నాన్నగారిలా బోధించేరు: "ఇంగ్లీషులో అలవాటును HABIT అంటారు. దింట్లో కొంత (H) వదుల్చు కున్నామనుకోండి, ఇంకా కొంత A-BIT ఉండనే వుంటుంది. ఇంకా కొంత (A) వదుల్చు కొన్నా 'కొంచెం' BIT ఉంటుంది ! మరికొంత (B) వదుల్చుకున్నా కూడా IT'అది' ఉండనే ఉంటుంది ! ! అలవాట్ల ప్రభావం అలాంటిది"

అందుకే ఎప్పుడూ 'మంచి' అలవాట్లే అలవర్చుకోవాలి. చెడ్డవారినీ, చెడ్డ అలవాట్లనూ తెలియక చేరదీసినా తెలుసుకున్న వెంటనే వదల్చు కోవాలి. పట్టుదలతో తరిమేస్తేగాని అవి ఒక పట్టునపోవు. ఒకాయన రామకృష్ణ పరమహంస నడిగారట "నేను ప్రార్థన దగ్గర కూర్చున్నా పూర్వపు పాడు తలంపులే యింకా వస్తున్నాయి. దీనికేమిటి మార్గం" అని. అందుకు వారి జవాబు "మీరు చాలా కాలంగా ఆ తలంపులనే జేరదీసేరు. ఒక్కసారిగా ఎలాపోతాయ్ ? మీ కుక్క చూడండి, దానిమీద మీకు మక్కువ తగ్గి, తన్నేస్తున్నా మళ్ళీ తయారవుతుంది. వచ్చినప్పుడల్లా తన్నుతుంటే గాని కొంత కాలానికి మిమ్మది విడిచి పోదు. తలంపులూ అలవాట్లూ అంతే."

మానవులనగానే కొన్ని అలవాట్లకు అలవడి వ్యవహరించే జీవులు. మన నిత్యజీవితంలోని చర్యలు, ఊహలు గూడ పూర్వపు అనుభవాలు, అలవాట్ల వల్ల నిర్ణయింపబడి, మనకు పూర్తిగా స్మృతి పథంలోకి రాకుండానే అలా జరిగి పోతుంటాయి. ప్రొద్దుట దైవ ప్రార్థనతో లేవడం, పళ్ళుతోముకోవడం, తతిమ్మా కాలకృత్యాల్ని నిర్వహించుకోవడం వగైరాలన్నీ కొన్ని అలవాట్ల ప్రకారం యథాతథాగా సాగిపోతుంటాయి. అలవాట్లకు ఎంతైనా ప్రభావం ఉంది. పొగత్రాగుడూ, మద్యపానం అలవాట్లున్న వారిని చూడండి. మనుష్యులు వీటికి దాసులై చరిస్తుంటారు. అందుచేతనే చిన్నప్పటినుంచీ మంచి అలవాట్లు అలవర్చుకోవాలని తల్లి తండ్రులు, మేష్టర్లు, పెద్దలూ అలా అనేక విధాలుగా నూరిపోస్తుంటారు.

మంచి అలవాట్లవల్ల మనం ప్రపంచంలో మంచివారిగా పరిగణింప బడ్డమేగాక, మనశరీర మానసికారోగ్యాలు మన జీవితంకూడా వాటిపైనే అధారపడి వుంటుంది. ఆరోగ్య జీవన సూత్రాలు — పరిశుభ్రమైన గాలి, మంచినీరు, సాత్వికాహారం, నిరాడంబర వస్త్రధారణ, శుచిగా నుండే గృహం, తగువ్యాయామం వగైరాలు, వీటితోబాటు ఆనందంగా ఉండడం, మంచితలంపులు, సంఘీభావం, దేశభక్తి, పెద్దలయెడ వినయం, పరోపకారం, ప్రేమ, దైవచింతన వగైరాలు మానసికారోగ్యానికి అవశ్యకం. వాటిని సరిగా చిన్నప్పటినుంచీ అలవర్చు కున్నవారు ఆరోగ్య వంతులై, సజ్జనులై, ప్రజామోదాన్ని పొందుతుంటారు. వీటి నుల్లంఘించినవారు ఆరోగ్యం కోల్పోయి, దుర్జనులై, లోక కంటకు లౌతారు. అలవాట్లే మనం, ఎప్పుడూ ప్రతివిషయంలోనూ - తిండి, వస్త్రధారణ, విహారం, సాంగత్యం, సంభాషణ, తలంపులు, ప్రవర్తన మొదలైన విషయాలన్నిట్లోనూ చక్కటి అలవాట్లు ఏర్పరుచు కోవడం చాలా ముఖ్యం.

మంచి అలవాట్లకంటే చెడ్డవి చప్పున పట్టు బడతాయి గనుక మరీ జాగ్రత్త అవసరం. ఇదే ఒకసారి గాంధీజీని ఒకరడిగితే "మెట్లు ఎక్కడం కష్టంగాని, దిగడం సులువేగా ! పతనానికేమి యిట్టేపడొచ్చు - పాడవ్వొచ్చు. పైకి సాగడం, ప్రయోజకులవడం ప్రయత్నాలతో కూడుకొని వుంటాయి" అని ఆయన సహజ మాధురీ రీతిని మారు బలికేరు. ఇవి ఆయన జీవితంలో స్వానుభవం అన్న మూసలోనుంచి రాలిన బంగారు తునకలు. చిన్నప్పుడు దుర్జన సాంగత్యం. దురలవాట్లు ఆయన్ని ఎంత వరకూ తీసుకెళ్ళేయో, బాధించాయో, మర్మం లేకుండా చెప్పి మనకందరికీ మరువరాని గుణపాఠాలు నేర్పేరు. ఆ సత్యసంధత, ఆ తాలిమి, ఆ అహింస, ఆ విశ్వమానవ సౌభ్రాత్రత, ఒకటేమిటి భారత దేశంలోని మహామహుల "సద్గుణంబులెల్ల సంఘంబులై వచ్చి" సమ్మిశ్రత జెంది లోకోత్తర ప్రతిభా సంపన్నుడైన "మహాత్ముడై", లోకానికే ఆదర్శకుడయ్యేటట్లు చేసేయి. ఆయన ప్రయత్నించి, చర్యల్లోను, తలంపుల్లోను అలవర్చుకున్న అలవాట్లేగదా

## అలవాటు

ఆయన్ని అంతవారినీ, ఆయన్ని కన్నభారతాంబ నంతటి దాన్నీ జేసేయి.

అలా మంచివార్ని ఆదర్శంగా, తీసుకొని, వారిలోని మంచి గుణాల్ని స్మరిస్తూ, ఆలోచిస్తూ అలాంటివి అల వర్చు కొందుకు అంతాకూడా ప్రయత్నించడం తమకూ, తమవారికీ, తమ దేశానికీ కూడా శుభావహం.



# బిడ్డలు - తల్లిదండ్రులు

## బిడ్డల బెంచుటలో తల్లిదండ్రులకు తర్ఫీదు

* శ్రీ కె. వెంకట్రామయ్య *

పెద్దవారికి పిల్లలయెడగల యభిప్రాయములలోను, భావములలోను, నేటికాలమున నొక గొప్ప మార్పు గన్పట్టుచున్నది. నలుబది ఏబదియేండ్లకు పూర్వము "శిశు పరిశీలన" తలిదండ్రులకవసరమని జెప్పిన వారునవ్వి యుండెడివారు. ఏలయన బిడ్డ పుట్టగనే తల్లికి ఆ బిడ్డను బెంచు జ్ఞానము సహజముగ నలవడునని వారి యభిప్రాయమైయుండెడిది. ఇప్పటికిని ఆ నమ్మకము వారిలో జూడ నగును. కాని అది క్రమముగా మారుచున్నది.

శిశువును బెంచుటకవసరమగు జ్ఞానసంపత్తి తలిదండ్రులకు సహజముగనేయలవడు ననుకొనుట వట్టి పొరబాటు. అదే నిజమైనచో బిడ్డలవలనవారికి కష్టములే యుండవు. బిడ్డలను వారు తరచుగ శిక్షించుటయును, శిక్షించియు ఫలితమును బొందకుండుటయును జరుగవు. చాలమంది పిల్లలు చెడుత్రోవల బడుటయు, నిష్ప్రయోజకులగుటయు మనము చూడబోము. పిల్లల దుర్గుణములు మాన్ప ప్రయత్నించిన కొలది నవిపెంపొందు వింతను గనము. కడుశ్రద్ధతో బిడ్డలను బెంచినను వారు చెడ్డవారుగ తయారైన యెడల చెడు స్వభావమువారికి సహజమేయై యుండవలెనని తలిదండ్రులనుకొనవచ్చును.

కాని, ఈకాలపు తలిదండ్రుల తలంపులు వేరైయున్నవి. బిడ్డ జీవించుట తమకొరకును తమ యింటికొరకేయని వారను కొనుటలేదు. గృహమును, కుటుంబమును గూడ బిడ్డకొరకేయని వారు గ్రహించుచున్నారు. దీనిని బట్టి బిడ్డనింటి యందును, కుటుంబమునందును, విచ్చలవిడిగ నుండనీయవలెనని మనమనుకొనరాదు. బిడ్డ పుట్టుకకు తలిదండ్రులే కారకులుగనుక, ఆ బిడ్డ సంపూర్ణాభివృద్ధి బొందుటకనువగు వసతిని జేకూర్చు బాధ్యత వారిదేయని తెలిసికొనవలెను. శిశువులకు తమయెడ సంపూర్ణ విశ్వాసముండునట్లు తలిదండ్రులు ప్రవర్తించుచుండవలెను. వారు శిశు మనస్తత్వమును బాగుగ తెలిసికొనగలిగి యుండవలెను. బిడ్డయెడ సానుభూతిని గలిగి ప్రవర్తింపవలెను. ఈ విషయము లందెట్టిలోపములున్నను పిల్లల ప్రవర్తనా సమస్యలను వారెదుర్కొనక తప్పదు. అట్టి సమస్యల నెదుర్కొనుటకు తగిన సహాయమును తలిదండ్రులకు చేకూర్చుటకే "తలిదండ్రుల బోధనోద్యమము"(Parents Education Movement) బయలుదేరినది. నేటికాలపు తలిదండ్రులు తామే నీతిపరులమను భావముతో తమ బిడ్డలయెడ ప్రవర్తింపరు. బిడ్డల నన్నివిధముల నర్థము జేసికొనుటకే యాశింతురు. మరియు ప్రయత్నింతురు.

### శిశుపాలనము తలిదండ్రుల వృత్తి :

ఎవరి వృత్తికి తగిన శిక్షణ వారి కొసగుట యవసరమని మానవు లాది నుండియు గ్రహించియే యున్నారు. వడ్రంగి, వైద్యుడు, శాస్త్రజ్ఞుడు, కృషికుడు మొదలగు వారందరును శిక్షణను బొందవలసినవారేయై యున్నారు. విద్యను గరపుటయు, "శిశుపాలనము"ను గూడ వృత్తులే యగును. ఇవి వృత్తులలోకెల్ల చాల ముఖ్యమైనవి. ఐనను శిక్షణ బొందవలసినవారిలో నుపాధ్యాయుడును, తలిదండ్రులును, కడపటివారగుట ఎంతయు శోచనీయము. ఉపాధ్యాయుడు తాను బోధించు విషయములందేగాక "శిశు స్వభావము"ను దెలిసికొనుటయందు గూడ తగిన శిక్షణమును బొందవలెనని "కిండర్‌గార్డెన్" స్థాపించిన ఫ్రోబెల్ మహాశయుడును, ఇతర విద్యాసంస్కర్తలును చాలకాలము క్రిందనే జెప్పిరి. దానియవసరము నిప్పుడందరు నొప్పుకొనుచునే యున్నారు. కాని తలిదండ్రులకు గూడ బిడ్డలను బెంచుటలో శిక్షణమవసరమను విషయమింకను తగినంత ప్రచారమును బొందవలసియున్నది. ఆస్ట్రేలియా, అమెరికా మున్నగు దేశములందు శిశు సంరక్షణ విషయములలో తల్లులకు తగిన శిక్షణము నొసగుటకును, సహాయపడుటకును, సలహానిచ్చుటకును, "శిశుసంరక్షణాలయము"లు స్థాపింపబడి యున్నవి. వీని వలన తల్లులు తమ బిడ్డల శరీర సంరక్షణ విషయములందు తగిన తర్ఫీదును పొందుచునే యున్నారు.

బిడ్డయవసరములు కేవలము శరీరమునకు జెందినవే గావు. అవి మనస్సునకును, భావములకును గూడ చెంది యున్నవి. శిశువునకు శీలమును, మూర్తిత్వమును గూడ నున్నవి. ఇవియు నభివృద్ధి జెందవలెను. వీనిని దెలిసికొనుటకు సూక్ష్మగ్రహణ శక్తియు, శిక్షణయు చాలముఖ్యము.

# బిడ్డలు - తల్లిదండ్రులు

శరీర విషయములందు కడుశ్రద్ధ దీసికొన్నను ఒక్కొక్క శిశువు చిరచిరలాడుచుండుటకు కారణమేమి ? అనుకొనకుండ మరియొక బిడ్డ భోజన స్నానాదిక విషయ ములందు బాధించుటకు కారణమేమి ? ఎప్పుడు సంతోష ముగా నుండు బిడ్డ తటాలునవస్తువులను పగులగొట్టు చుండుటకు కారణమేమి ? ప్రతి దినమును బిడ్డలవలన తలిదండ్రుల కిట్టిసమస్యలే, యెన్నో గలుగుచుండును. కాని ఇట్టి సమస్యలకు గల కారణములను వారు గ్రహింప లేక ఎంతయు బాధపడుచుందురు. అట్లు బాధపడకుండ నుండవలెనన్న బిడ్డల మనోవృత్తులను తలిదండ్రులు బాగుగ తెలిసికొనవలెను. చిన్న బిడ్డలు తమ యూహలను, ఉద్దేశ్యములను మాటలలో జెప్పుకొనజాలరు. అట్లగుటచే, వారి మనస్సులోనేమున్నదియు దెలిసికొనుట చాల కష్టము. ఐనను తగిన ఇంగితజ్ఞానమును, సానుభూతియు, మనకున్నయెడల బిడ్డల ప్రవర్తనలను బట్టి వారి నర్థము జేసికొనవచ్చును. బిడ్డల నర్థము జేసికొన్నచో వారు సంతోషముగా నుండగలరు. అప్పుడు సమస్యలే ఉండక పోవచ్చును.

తలిదండ్రులు తమ బిడ్డలను పెంచుట నొకవృత్తిగా, భావించి తగిన శిక్షణమును బడయుట యవసరమని పై కారణములే మనకు జెప్పుచున్నవి. మన గృహ నిర్మాణ ములకే శిక్షణనొసగి శిల్పులను తయారు జేసికొను చున్నాము. అట్టియెడ మానవశీలమును మూర్తిత్వమును నిర్మించు తలిదండ్రులకు తగిన శిక్షణనిచ్చుట ఎంత యవసరమో వేరుగ జెప్పనక్కరలేదు.

**తలిదండ్రులు మేలుకొనుచున్నారు :**

తలిదండ్రుల బోధనోద్యమమింకను శీఘ్ర గతిని సాగు టలేదు. ఐనను దాని ఫలితములప్పుడే గన్పట్టుచున్నవి. తలిదండ్రులలోననేకులు మానసిక శాస్త్ర గ్రంథములను పఠించియు, నవలలను, పత్రికలను చదివియు, రేడియో సంభాషణలను వినియు, పిల్లలను గూర్చిన విషయముల నెన్నిటినో దెలిసికొనుచున్నారు. మానసిక శాస్త్రము సంపూర్ణమే యైనను, పిల్లల ప్రవర్తనను పరిశీలించుటలో నది తలిదండ్రులకెంతయు తోడ్పడుచున్నది. కొన్ని సందర్భములలో తలిదద్రులు తమ్ము దామే పరిశీలించు కొనుచు బిడ్డల క్షేమమునకై తమ ప్రవర్తనలను సవరించు కొనుచున్నారు. మరియు శిశు నిర్వహణమందలి కొన్ని సామాన్య దోషములను వారు గ్రహించి అవి లేకుండ జేయుటకై ప్రయత్నించుచున్నారు. ఆ దోషములేవన—

(1) నిశ్చితోద్దేశములేని విద్యా విధానము

(2) బిడ్డల దృక్పథమునర్థముజేసికొనకుండుట

(3) ఎదిగెడి బిడ్డలకేవయస్సునందెట్టి యవసరములు గలుగునదియు దెలిసికొనకుండుట.

(4) క్రమశిక్షణను గూర్చిన తప్పభిప్రాయములు.

(5) తలిదండ్రులకేకాభిప్రాయమును అన్యోన్యతయు లేకుండుట ఇక వీనిని గూర్చి మనమిచట కొంచము వివరముగా పరిశీలించి చూతము.

**(1) విద్యా విధానము యొక్క ముఖ్యోద్దేశము :**

బిడ్డలు బడిలో చేరినంతనే వారిచదువారంభమగు ననియు, బడి పాఠములను నేర్చుకొనుటయే చదుయువని చాలమంది యభిప్రాయమై యున్నది. మరియు బిడ్డలెదిగి ఉన్నత పాఠశాలకుబోయి పిదప కళాశాలలో జదివి పెద్ద పరీక్ష ప్యాస్కాగానే చదువు ముగియునని వారను కొందురు. కాని బిడ్డలు బడి పాఠములనేగాక ఇంకను ఎన్నో విషయముల నేర్చుకొనవలెను. ఇతరులతో కలసి మెలసి సంతోషముగానుండుట, స్వయముగా నాలో చించుట, నిర్ణయించుకొనుట, స్వతంత్రముగానుండుట, ధైర్యము కలిగియుండుట, మొదలగు విషయములు బిడ్డల కతిబాల్యమునందే యలవడ జేయవలెను. అట్టి గుణములనలవరచుటకూడ విద్యా విధానములో నొక ముఖ్య భాగమై యున్నది.

స్వతంత్రముగానుండుట, ధైర్యము కలిగి యుండుట, నిజము పాటించుట, ఇతరులతో కలసి మెలసియుండుట మొదలగు మంచి గుణములను బిడ్డలకలవరచు తలి దండ్రులు బడిలోని ఉపాధ్యాయులకన్న నెక్కువ కృషియే చేయుచున్నారని చెప్పవలెను.

నిజమైన విద్యా విధానము బిడ్డ తొట్టెయందుండగనే యారంభమగును. అది బిడ్డబాల్య యవ్వన దశలు గడచు వరకు సాగుచునే యుండును. మరియు నట్టి విద్యకు గల లక్ష్యమేమన బిడ్డ మనశ్శరీర శీల స్వభావాదులకు తగిన లక్షణ నొసగుచు అతనిని సంపూర్ణాభి వృద్ధిని జెందినవ్యక్తి గను, సంతోషముగ నితరులతో సహకరించు సంఘ జీవి గను తయారు చేయుటయే యైయున్నది.

(2) బిడ్డ యొక్క దృక్పథము:—

శిశు నిర్వహణము సరిగా కొనసాగవలెనన్న మన మెన్నో విషయములను గూర్చి విచారింపవలసియుండును. ఐనను బిడ్డల దృష్టినుండి విషయములను జూడగలుగుట అన్నిటి కంటెను చాల ముఖ్యము. ఇది అందరకును సాధ్యమగు పనిగాదు. కాని బిడ్డ లెదుగు విధమును గూర్చి బాగుగ తెలిసికొన్నచో, మనకది కొంత వరకు బోధపడగలదు.

భౌతిక ప్రపంచమందలి వస్తువులను జూచుటయందే బిడ్డలకును మనకును ఎంతో భేదముండును. రెండున్నర సంవత్సరముల బిడ్డ దృష్టినుండి మనమే ప్రపంచమును జూచిన, అది యెంతో వేరుగ నగుపడగలదు. కుర్చీలు కూర్చుండుట కెంతో యెత్తుగా నుండును. మేజా యంచులను మించి మనము చూడలేము. చిన్న కుక్కయు నెంతో పెద్ద జంతువుగా గోచరించును. తండ్రి మనకంటె నెన్నో రెట్లు పెద్దవానిగ దోచును. ఇట్లే చిన్న బిడ్డల దృష్టికి అన్నియు పెద్దవిగా నగుపడుచుండును. వారు తమ జీవితమును చాల వరకు వారియొక్కయు, కుర్చీ మేజాల యొక్కయు కాళ్ళ మధ్యనే గడుపుచున్నారనిపించును. వారు బాహ్య ప్రపంచమునే దృష్టితో జూచుచుందురో అట్లే ఇతరుల చేష్టలను, ప్రవర్తనలను గూడ జూచుచుందురు.

బిడ్డలకు మనకువలె తప్పొప్పులు తెలియవు. అనుభవమును లేదు. మనమిది తరచు మరచి, తెలియక పరితనముచే, జేసిన పనులకు వారిని దండించుచుందుము. తప్పని తెలియని దానికి వారిని దండించినప్పుడు వారికి మన న్యాయ బుద్ధియందు నమ్మకముండదు. అట్టి దండన లధికమగు కొలది బిడ్డలు మనల నెక్కువగా బాధించుచుందురు. చేసిన తప్పు ఉద్దేశరహితమై, పొరబాటు మాత్రమే యైనప్పుడు బిడ్డలను దండించుట చాల అన్యాయము. దానివలన వారికి మనయెడ నెంతో కోపమును, ద్వేషమును జనించునేగాని పశ్చాత్తాపమెంత మాత్రమును కలుగదు. కాబట్టి పిల్లలను పరిశీలించునపుడు వారి చర్యలనేగాక ఉద్దేశ్యములను గూడ తెలిసికొనుట చాల ముఖ్యము. లేనిచోవారికి మనయందలి నమ్మికచెడును. నమ్మకమున్నంతకాలమే బిడ్డలు మనలను ప్రేమింపగలరు. వారి ప్రేమయే మనకు ముఖ్యమగునెడ ఆ నమ్మికకు భంగకరమగు పరిస్థితులేర్పడకుండ జూచుకొనుటయే మన కర్తవ్యము.

(3) బిడ్డల అవసరములను దెలిసికొనుట:

బిడ్డలెదుగునపుడు ప్రతిదశయందును వారికి కొన్ని ప్రత్యేకావసరము లేర్పడుచుండును. వీనిని పెద్దలు గ్రహింపకపోయిన యెడల బిడ్డలువారిని బాధింపగలరు. ఆహారము, నిద్ర, తగిన ఉష్ణము బిడ్డలకవసరమను సంగతి అందరకును దెలిసినదే. కాని బిడ్డకు శరీర సంబంధమగు అవసరములేగాక మనస్సునకును, భావములకును సంబంధించిన యవసరములుగూడ గలుగుచుండును. వీనిని గూడ పూర్తిగా సంతృప్తి పరచినగాని బిడ్డ శరీరమును, మనస్సును భావములును **(Emotions)** సంపూర్ణారోగ్య స్థితియందుండ జాలవు.

బిడ్డలు శరీరావసరములను దీర్చుకొనుటకు ప్రయత్నించునట్లే, మనస్సునకును, భావములకును జెందిన యవసరములను దీర్చుకొనుటకు గూడ ప్రయత్నింతురు. ఈ విషయము వారి చర్యలను సరిగా గమనించినచో తెలియగలదు. మూడేండ్ల బిడ్డయొకడు దండనలకు లెక్కసేయక ఇంటినుండి పారిపోవుటకారంభించెను. అతడా విధముగనేల ప్రవర్తించు చుండెనో మనమాలోచించి చూతము. బిడ్డకు చాల రకముల ఆట వస్తువులున్నను వానియం దతనికిష్టములేక పోవచ్చును. పోవలెనను బుద్ధి ప్రబలమై దండనలయెడ భయమునతనిని నాపలేకున్నది. ఇట్లతనిని ప్రేరేపించునదేమై యుండగలదు? అతని కాటవస్తువులున్నను అవి యాంత్రికములో, మెత్తని, జంతువుల బొమ్మలో యగుటచే అతని వయస్సునకు తగినవి కాకపోవచ్చును. అతని యాటవస్తువులు లాగుట, త్రోయుట, త్రవ్వుట, దిగగొట్టుట మున్నగు పనులకనువై యుండవలెను. పెద్దకండరములకు పని కల్పించునవి కావలెను. ఊహనుపయోగించుట అవసరమగు ఆట వస్తువులా వయస్సు బిడ్డకు పనికిరావు.

ఆటవస్తువులు సరియైనవే యనుకొందము. కాని అతడొంటరి బిడ్డకాబోలు. లేదా కుటుంబములో నితరపిల్లలందరు బడికిబోవువారై యుండవచ్చును. ఇంటనింకొక శిశువున్నను తనతో నాడు వయస్సు లేనివాడగుటచే, నా బిడ్డ తగిన జతగానికై వెదకుచుండవచ్చును. ఏలయన

బిడ్డలకు రెండు, మూడేండ్లు రాగానే అదే వయస్సు గల ఇతర పిల్లల సహవాస మవసరమగును. బిడ్డ ఇంటినుండి పారిపోవుటకింకొక కారణముగూడ నుండవచ్చును. అతనికి క్రొత్తగా తమ్ముడో, చెల్లెలో పుట్టెనను కొందము. అప్పుడు తల్లి అతనియెడ పూర్వము జూపినంత ప్రేమ జూపకపోవుటచే ఆమె ప్రేమయందు అతనికి నమ్మికచెడి యావిధముగ నితరులయిండ్లకేగ వచ్చును. అట్టియెడ బిడ్డపై నెక్కువమక్కువ జూపుచూ, నా తల్లి నన్నెప్పటి యట్లే ప్రేమింపగలదను భావమతనికి గలుగజేయుట యవసరము. దండనలచే నతడు మరింత బాధపడునేగాని ఎట్టి ప్రయోజనమును గలుగబోదు.

బిడ్డలకు వారి వయస్సును బట్టి కొన్ని ప్రత్యేకావసరములు గలుగుచుండునని మనము తెలిసికొనియున్నాము. ఈయవసరములను దీర్చుట మన విధియైయున్నది. మన మొకవేళ వానిని దీర్చకున్న యెడల బిడ్డలే వానిని దీర్చుకొనుటకు ప్రయత్నించుచుందురు. కాని వారి ప్రయత్నములు తరచు తప్పుత్రోవలబడి ప్రవర్తనా సమస్యలకును, నాడీవ్యాధులకు దారి దీయుచుండును. ఎదిగెడి బిడ్డలకెట్టి యవసరము లేయేదశలయందు గలుగు చుండునో, వానిని దీర్చుట యెట్లో రాబోవు అధ్యాయములలో చర్చింపబడును.

(4) క్రమశిక్షణను గూర్చిన తప్పభిప్రాయములు:—

దీనిని గూర్చి గూడ పైయధ్యాయములలో ప్రత్యేకముగా వ్రాయపడినది. ఒక్క విషయమును మాత్ర మిచ్చట జెప్పుచున్నాము. అది ఏమనగా శిక్షణ పద్ధతులు అసంగతములును, అవిరుద్ధములునుగాక ఏక రీతిగ నుండుట చాల యవసరము. తలిదండ్రుల శిక్షణా విధానమీరీతిగ లేని యడల బిడ్డలు తరచు వారిమాట వినక ఎదిరించుచుందురు. తమ బిడ్డ దొక విధముగ నుండిన బాగుండునని తలి దండ్రు లొకప్పుడనుకొందురు. తిరిగి మనసు మారగనే వేరొక విధముగ తలంచుచుందురు. ఇట్లు తమలో స్థిరత్వమును, నిశ్చితాభిప్రాయములును లేక పిల్లలను నిర్వహించుటకు తగిన విధానమును వారు తెలిసికొన జాలకుందురు.

బిడ్డల దైనిక జీవనమునందు క్రమవిధానముండవలెను దానివలన వారు మానసికముగను శారీరకముగను గూడ నారోగ్యమును బొంది మనలను కష్టపెట్టకుందురు.

ఈకాలపు తల్లులు చాల మంది తమ బిడ్డలను బెంచుటలో నొక క్రమవిధానము ననుసరించుచునే యున్నారు. కాని బిడ్డ యెదుగగనే వారాక్రమ విధానమును పాటించుట నంత ముఖ్యముగా తలంచుటలేదు, దాని వలన బిడ్డ భుజించుట, నిద్రించుట, మొదలగు విషయములందు తన యిష్టప్రకారముండుట తటస్థించుచుండును. మరియు నతడు తల్లి మాట వినక తన మాట చెల్లించుకొనుట కప్పుడప్పుడు ప్రయత్నించుచుండును. అట్టి సమయములందు తల్లి కేమిచేయుటకును తోచక బిడ్డ పట్టు చెల్లింపవచ్చును. లేదా బిడ్డ తల్లిని బాధించుటయు, ఆమె కొట్టుటయు, అత డేడ్చుటయు జరుగగలవు.

ఇట్టి సందర్భము లెక్కువైనకొలది తల్లిని తా నొకప్పుడు ధిక్కరింపగలననియు, మరియొకప్పుడు ధిక్కరింపలేననియు బిడ్డ తెలిసికొనును. మరియు తల్లి మంచిగా నున్న సమయములలో తానేది చేసినను ఆమె ఊరకుండగలదని గూడ బిడ్డ గ్రహించును. తల్లి యెడగల యభిప్రాయమే తండ్రి యెడను అతనికి గలుగును. తలిదండ్రులకు తప్పొప్పుల విషయమై నిశ్చిత భావములున్నవని అతనికి తోచదు. తప్పొప్పులు వారి మనస్థితులనుబట్టి మారుచుండును. ఇట్టి అనుమాన పరిస్థితులలో మెలగుట బిడ్డలకెంతయు కష్టముగా దోచవచ్చును. తామేదిచేయవచ్చునో ఏది చేయగూడదో బిడ్డలకు సరిగా దెలియక ఎంతో బాధపడుదురు. ఒకేపనిని తలిదండ్రు లొకదినమునచేయ నిత్తురు, మరియొకదినమున చేయరాదందురు, ఇట్లగుటచే బిడ్డల కేమిచేయుటకును తోచక తలిదండ్రుల నెదిరించి కష్టపెట్టుచుందురు. బిడ్డలు తమ్ము బాధింపక, సంతోషముగా నుండి, సరిగా మెలగవలెనని పెద్దవారాశింతురేని తమ్ము దామే శాసించుకొనవలెను. మరియు వారి ప్రవర్తనములు పరస్పర రానుగుణ్యములును, బిడ్డల కాదర్శ ప్రాయములును నయియుండవలెను.

(5) తలిదండ్రులన్యోన్యతగలిగి యుండునవసరము :—

బిడ్డజనించిన కొన్ని నెలల వరకు తల్లియే చాల ముఖ్యము, అతడు నడచుట కారంభించి నప్పటినుండియు తండ్రికిగూడ నొక ప్రత్యేక స్థానమేర్పడును. ఐనను ఈకాలపు తండ్రులు కొందరు మొదటినుండియు పసి బిడ్డల శరీర సంరక్షణ విషయములందు తల్లులతోబాటు తామును పాల్గొనుచున్నారు.

[సశేషం]




# కండ్లు

"సర్వేంద్రియాణాం నయనం ప్రధానం"

మనకున్న పంచేంద్రియాలన్నిట్లోకీ కన్నుకే గొప్ప ప్రాధాన్యత, ఎందుకంటే ప్రపంచమంతా, బ్రతుకంతా చాలవరకు దీనితోటే వుంది. అదీగాక "మనస్సుకు ముఖం ఒక విషయసూచిక వంటిది" అన్నారు. అంటె- ముఖం లోని కళ్ళల్లోనే యిది వ్యక్తమౌతూ ఉంటుంది. కళ్ళ యొక్క ఆకారం, దృష్టియొక్క వైఖరీ, నిజంగా మనిషియొక్క మనస్తత్వానికి దర్పణం. అందుచేత కంటినిగురించి ఎంత శ్రద్ధ అయినా తీసుకోవలసియుంది. ముఖ్యంగా స్త్రీలకు యిది మరీ అవసరం. కవులు చూడండి: స్త్రీల కళ్ళుచూచి మృగేక్షణ, ఇందీవరాక్షి, మీనాక్షి, కమలాక్షి, అని వర్ణిస్తారు. నిజానికి కండ్లసోయగం, అర్ధచంద్రాకారంగా వంగి విల్లును బోలు ఆ కనుబొమలు, కలువరేకులవంటి ఆకారము రంగూగల కండ్లు, అందు బాహ్యప్రపంచాన్ని లోనికి, లోని ఊహా ప్రపంచాన్ని బాహ్యానికి తోపించే ఆ చిత్రాతిచిత్రమైన నల్లటి కనుగ్రుడ్లు, అన్నిటికంటె ప్రాధాన్యమైన ఆ కంటిచూపు ప్రసారం ఎంతో ఆకర్షవంతంగావుండి, అల్లే చూడబుద్ధి వేస్తుంది. కండ్లయొక్క సహజసౌందర్యాన్ని కాపాడు కొందుకు స్త్రీలకు ఈ క్రింది సలహాలు అందిస్తున్నా.

కళ్ళకు ఇంత ప్రాధాన్యత ఉన్నప్పటికీ వీటినిగురించి ప్రజలు తీసుకొనే శ్రద్ధచూడండి: సామాన్యంగా ప్రొద్దుటి పూట ముఖంతోబాటు కండ్లనుకూడా కడుగుతారు, బొట్టు పెట్టుకునేటప్పుడింత కాటుక తీసి రాస్తారు. కాని అంత మాత్రం చాలదు. కొంతమందికి అదృష్టవశాత్తు మంచి కనుబొమలు, ఆకర్షించె కండ్లు పుట్టుకతోనే వస్తాయి. అలాంటి వాళ్ళు ఎక్కువ శ్రమపడకుండానే కండ్ల సౌందర్యాన్ని సంరక్షించుకోవచ్చు. కాని కొంత మందికి రెప్ప వెంట్రుకలు, కనుబొమలుకూడా బాగుండవు. అలా అని నిరాశ పడనక్కరలేదు. కొంచెం శ్రద్ధ తీసుకొంటే చక్కగ దిద్దుకోవచ్చు.

రోజూ ప్రొద్దుట స్నానానికి ముందొక అరగంట సేపు కొబ్బరినూనెగాని, హైర్‌వేసలైనుగాని కనుబొమలకు, రెప్ప వెంట్రుకలకు రాయాలి. కనుబొమలెంత అందాన్నిస్తాయో రెప్ప వెంట్రుకలుకూడ అంత అందాన్నిస్తాయి. కనుక వాటిని గురించికూడ శ్రద్ధ తీసుకోవాలి. పై రెప్పవెంట్రుకలు కనుబొమల కానేటట్టుగా వంగి ఉంటే అందంగా ఉంటాయి. అలా వంగి యుండని రెప్ప వెంట్రుకలకు ఆముదం గాని, వేసలైనుగాని రాసి, మునివేళ్ళతో వాటిని పైకి ఐదారు సార్లు వంచితే కొద్ది

శ్రీ సువేణికాశ్యప్.

రోజులలో మంచి రెప్ప వెంట్రుకలు వస్తాయి. ఇలా నూనె వ్రాయడంవల్ల కనుబొమలు, రెప్ప వెంట్రుకలు వత్తుగా పెరగటమేగాకుండా నల్లగా నిగనిగలాడుతూ ఉంటాయి.

కొంతమందికి కనుబొమలు వత్తుగా ఉన్నాకూడ అందంగా కనిపించవు. దానికి కారణం అవి సరిగా లేక ఐద్దెలాగ వెడల్పుగా ఉండడమే. అలాంటప్పుడు కావలసినవి ఉంచుకొని అక్కర్లేని వెంట్రుకలను రేజరుతో గాని, కత్తెరతో గాని తీసివేస్తే బాగుంటుంది. కనుబొమలు ఒకదానికొకటి ఎంత దూరంలో ఉంటే అంత బాగుంటుంది. అందుకని భ్రూమధ్యం లోని వెంట్రుకలను తీసేయాలి. ఇలా చేస్తే కనుబొమలు బాగా ఉంటాయి.

కొంతమందికి ముఖానికి పసుపు రాసుకొనే అలవాటుంటుంది. అలాంటప్పుడు పసుపును గబగబ రెండు చేతులతో ముఖం అంతా పులమక నెమ్మదిగా వ్రేళ్ళతో రాసుకొంటే, పసుపు కనుబొమలలోకి పోకుండా ఉంటుంది. పసుపులో వెంట్రుకల నూడదీసే గుణముంది. అందుకని జాగ్రత్తగా రాసుకోవాలి. సబ్బుతోనో, సీకాయితోనో కొంచెము ఎక్కువ రుద్ది, దానిమీద నీళ్ళుపోసి వ్రేళ్ళతో అటు ఇటు వాటిని నెమ్మదిగా కదిలించడం మంచిది.

కాటుకను కొంతమంది చక్కగా పెడ్తారు. కనుకొలుకులలోనుండి కంటి చివర వరకు సన్నగా పెడ్తే చూసేందుకు చక్కగా ఉంటుంది. కాటుకను చేత్తోకంటే, బాగా కడిగిన చీపురు పుల్లతో పెడ్తే ఇంకా చక్కగా ఉంటుంది. అయితే పుల్లతో పెట్టేటప్పుడు చాలా జాగ్రత్తగా ఉండాలి. ఏమాత్రం కంటికి తగిలినా నీళ్ళు వచ్చి కాటుక అసహ్యంగా కన్నంతా అవుతుంది. కాటుకను రెండు మూడు పద్ధతులలో పెడ్తారు. కొంచెము పట్టుకొనే కాటుక అయితే ముఖం రుద్దుకొనే ముందు కంటికి రాసుకొని, తర్వాత సబ్బుతో జాగ్రత్తగా కంటిని రుద్దాలి. అలా అయితే కాటుక కన్నంతా అంటుకొని బాగా ఉంటుంది. కాటుకను క్రింది రెప్పకి పెట్టినట్లే పై రెప్పకి కూడా పెడ్తారు. కొందరికి పై రెప్పకి పెట్టడం కుదరదు. అలాంటప్పుడు క్రింది రెప్పకి కొంచెం మందంగారాసి, కన్నును కొంచెము గట్టిగా మూస్తే పై రెప్పకి అంటుకొంటుంది.

కొంతమంది కనుబొమలను వెచ్చు పెన్సిల్‌తో దిద్దుకొంటారు. ఇది మితంగా చేస్తే బాగానే ఉంటుంది. ఈ పెన్సిల్ తోనే కంటి రెప్పమీద సన్నని గీతను గీస్తారు. అయితె ఇది అందమైన కంటికిగాని బాగుండదు.

ఇలా పైన జూపే శ్రద్ధ కండ్ల పూర్తి సౌందర్యానికీ ఆరోగ్యానికీ చాలదు. కండ్లు ఆరోగ్యంగా ఉండాలంటే మనం తినే తిండిని గురించి శ్రద్ధ వహించాలి. ముఖ్యంగా కండ్లను ఆరోగ్యంగా ఉంచేది విటమిను 'ఎ'. చక్కని చూపు నిచ్చేది ఈ విటమినే. ఇది మనం తినే తిండిలో లోపిస్తే ఎన్నో కంటి జబ్బులొస్తాయి. దీర్ఘదృష్టిగాని, హ్రస్వదృష్టి గాని (Long Sight, Short Sight)ఉంటే దినానికి 10,000 యూనిట్సు తీసికొంటే రెండు నెలల్లో పూర్తిగా తగ్గిపోయి మామూలు దృష్టి వస్తుంది. అయితే దీనితోపాటు విటమిను 'డి' ని కూడ తీసికోవాలి. ఇది 100 యూనిట్సు ఉండాలి. ఇవి రెండు కలిపి తీసికొంటే బాగా పనిచేస్తుంది. కండ్లలో పువ్వులు, దుర్మాంసాలు లేవటానికి కారణం తిండిలో విటమిను 'సి' లోపించడం. ఈ విటమిన్లు మందుల షాపుల్లో మాత్రలుగా అమ్ముతారు. లేకపోతే మనము తినే సహజ కూరలు వగైరాలనుండి పొందవచ్చు.

విటమిను 'ఎ' ఆకు కూరలు, పాలు, కేరట్సు, కేబేజి మొదలగు వాటిలో ఉంటుంది. కేరెట్సు పచ్చివి తినగల్గితే రోజుకొక గడ్డను తినడం మంచిది.

విటమిను 'సి' నిమ్మ, నారింజ, టొమాటో వగైరాల్లో ఎక్కువగా ఉంటుంది. 'డి' విటమిను సూర్యరశ్మి ద్వారా వస్తుంది. మంచి చెట్లుంటే మధ్యాహ్నము పూట ఒక అరగంట వాటి క్రింద కూర్చుంటే చాలు 'డి' విటమిను లభిస్తుంది. లేకపోతే మాత్రలు కాడ్‌లివర్ ఆయిలు వంటివి తీసికోవచ్చు.

ఆహారంలో శ్రద్ధతోబాటు తగు వెలుతురులో పనులు చేసుకుంటూ ఉండాలి. చదివేటప్పుడు, కుట్టేటప్పుడు సరి అయిన వెలుతురుండాలి. సన్నని అచ్చు చదివినప్పుడు, ఎక్కువ కుట్టినప్పుడు కండ్లు అలసిపోయి మంటగాను, నొప్పిగాను ఉంటాయి. అలాంటప్పుడు బోరిక్ లోషన్‌తో గాని, చల్లని స్వచ్ఛమైన నీళ్ళతోగాని కండ్లను కడుగుకొంటే కళ్ళ శ్రమ నివారిస్తుంది. లేదా కండ్లను బాగా చీకటిగా ఉండేట్లు చేత్తో మూసుకొని ఐదు నిముషాలుంటే కండ్ల మంటలు తగ్గుతాయి. కండ్లు ఎక్కువగా మండేటప్పుడు ఐడ్రాప్స్ వేసుకోవచ్చు..వారానికొక సారి ఆముదంతో తలంటు కూడ కండ్లకు మంచిపని చేస్తుంది. ఇలాంటి శ్రద్ధలు తీసికొంటే కండ్లు అందంగానే గాకుండా దృష్టి లోపాలు రాకుండా ఆరోగ్యంగా ఉండి ఆకర్షవంతంగా ఉంటాయి.

# హిందూ వారసత్వపుబిల్లు - స్త్రీల హక్కులు

కుమారి డి. శారదాదేవి, B.A.,B.L.,

చిరకాలం నుండి స్త్రీలకు సాంఘికంగా జరుగుతున్న అన్యాయాలను తొలగించాలని అందోళన జరుగుతోంది. అనేక స్త్రీ సమాజాలు, స్త్రీశ్రేయోభిలాషులు మహాసభలు జరిపి ప్రభుత్వానికి తమ కోరికలు తెలుపుతూ వచ్చారు. వీని ఫలితంగా యీ సాంఘిక దురన్యాయాలను తగ్గించడానికి ప్రభుత్వం ఒకదాని వెంట ఒకటిగా శాసనాలు చేస్తూ వచ్చింది. ఈ విధంగా హిందూ వితంతు స్త్రీలకు వివాహం చేసుకునే హక్కు, వివాహిత స్త్రీలు కొన్ని కొన్ని సందర్భాలలో భర్తనుండి వేరుగా నివసించుతూ మనోవర్తి కోరే హక్కులు, కొన్ని రాష్ట్రాలలో విడాకులు కూడా కోరే హక్కు మొదలైనవి లభించాయి. అలానే ఆస్థిలో కూడా కొద్దిపాటి వారసత్వపు హక్కులనిస్తూ కొన్ని శాసనాలు వచ్చాయి. కొద్ది కాలంలో పార్లమెంటు ముందు చర్చకు రాబోయే 'హిందూవారసత్వపు బిల్లు' కూడా ఇలాంటిదే.

ఈ బిల్లుద్వారా హిందూ వారసత్వ శాస్త్రంలో మూడు ముఖ్యమైన మార్పులు చేయబడు తున్నాయి. మొదటిది కుమార్తెకు కుమారునితోబాటు తండ్రి ఆస్థిలో భాగం రావడం. ఇప్పటి 'లా' ప్రకారం కుమారులుగాని, భార్యగాని ఉన్నట్లయితే కుమార్తెకు ఆస్థిలో భాగం లేదు. వారు లేనప్పుడు కుమార్తెలకు జీవితకాల హక్కులతో ఆస్థి సంక్రమిస్తుంది. రెండో మార్పు యేమిటంటే స్త్రీలకు ఆస్థి సర్వహక్కులతో సంక్రమించడం. ఇప్పటి 'లా' ప్రకారం బొంబాయి రాష్ట్రంలో తండ్రి ఆస్థి కుమార్తెలకు సంక్రమించి నప్పుడు తప్ప మిగతా అన్ని సందర్భాలలో స్త్రీలకు వారసత్వేనా ఆస్థి వస్తే అందులో పూర్తి హక్కులు ఉండవు. కేవలం జీవితకాలంలో అయివేజు అనుభవించే హక్కు మాత్రమే ఉంటుంది, కొన్ని పరిస్థితుల్లో తప్ప ఆస్థిని అన్యాక్రాంతం చేయడానికి వీలులేదు. మూడోమార్పు యేమిటంటే తల్లి ఆస్థిలో కుమార్తెతోబాటు కుమారునికి భాగం యివ్వడం. ప్రస్తుతం తల్లి ఆస్థి కుమార్తెలకు, వారులేకపోతే మనుమరాళ్ళకు, తరువాత మనుమలకు, వారెవ్వరూ లేకపోతే కుమారులకువస్తుంది. తండ్రి ఆస్థిలో కూమార్తెలకు భాగం యిస్తున్నాము కాబట్టి దానికి ప్రత్యామ్నాయంగా తల్లి ఆస్థిలో కుమారునికి భాగం యివ్వడం సమంజసంగా భావించి యీ మార్పు చేస్తున్నారు.

ఈ విధంగా యీ బిల్లు చట్టం అయితే హిందూ వారసత్వంలో అతి ముఖ్యమైన మార్పులు వస్తాయి. అందువల్ల ప్రజలంతా యీ బిల్లువల్ల కలగబోయే ఫలితాలను తెలుసుకొని తమ తమ అభిప్రాయాలను ప్రకటించాలని ప్రభుత్వం కోరుతోంది.

ఈ బిల్లు వలన స్త్రీలకు అమూల్యమైన హక్కులు కొన్ని వస్తున్నాయనేది నిస్సంశయం. కాని రాజ్యాంగం ప్రకారం యే సమానత్వాన్ని మనం కోరుతున్నామో అది మాత్రం లభించటం లేదు. కుమార్తెలకు కుమారునితోబాటు సమాన హక్కులు లభించటంలేదు, సగం హక్కు మాత్రమే యివ్వ బడుతోంది. అంటే, కుమారుడు, కుమార్తె, భార్య, ఉంటే, భార్యా కుమారులకు చెరొక భాగం, కుమార్తెకు సగభాగం వస్తాయి. ఇంతేగాదు. ఈ బిల్లు జాయింటు కుటుంబ ఆస్థులకు వర్తించదు. ఒక్క బెంగాలు రాష్ట్రంలో తప్ప మిగిలిన అన్ని రాష్ట్రాలలో జాయింటుకుటుంబాస్థులకు, స్వార్జితపు ఆస్థులకూ వారసత్వంలో తేడా ఉంటుంది. జాయింటు కుటుంబాస్థి అంతా పూర్వార్జితమైన ఆస్థి, అంటే పెద్దలార్జించి పెట్టిన ఆస్థి అన్నమాట. తండ్రి స్వార్జితంగా సంపాదించిన ఆస్థి కుమారునికి సంక్రమించగానే పూర్వార్జితపు ఆస్థిగా మారిపోతుంది. దీనిలో కుటుంబంలో ఉన్న పురుషులకు వారిలో ఎవరైనా చనిపోతే వారి వితంతువులకూ, మాత్రమే భాగం ఉంటుంది. స్వార్జితపు ఆస్థి ఒక తరం దాటగానే పూర్వార్జితపు ఆస్థి అయి పోతుంది కాబట్టి మనలో సాధారణంగా స్వార్జితపు ఆస్థికన్నా కుటుంబాస్థి యెక్కువుంటుంది. వారసత్వపు బిల్లు కుటుంబాస్థులుకు వర్తించదంటే, కుటుంబాస్థిలో కుమార్తెకు భాగం రాదన్న మాట, అంతేకాకుండా, తండ్రి స్వార్జితపు ఆస్థిలో కుమా

రునికి వచ్చిన పూర్వార్జితంగా మారి పోతుంది కాబట్టి మనుమరాలికి అందులో భాగం ఉండదన్నమాట. ఇలా ఒకతరంలో కుమార్తెకు భాగం వస్తుంది. రెండోతరంలో భాగం లేకుండా పోతుంది. ఈ విధంగా లెక్క చూస్తే మొత్తం ఆస్థిలో కుమారునికి వచ్చేదానిలో నాలుగోవంతో అయిదోవంతో కుమార్తెకు వస్తుంది.

అలాగే సర్వహక్కులు రావడం కూడాను. భార్యకు స్వార్జితపు ఆస్థిలో వచ్చే భాగంలో పరిపూర్ణ హక్కులు ఉంటాయి, కుటుంబాస్థిలో వచ్చే భాగంలో జీవిత హక్కులు మాత్రం ఉంటాయి.

ఇవే కాకుండా వారసుల జాపితాలో కూడా స్త్రీలకు పురుషులకు భేదం చూపబడింది. కుమారుడు, కుమారుని కుమారుడు అతని కుమారుడూ మూడుతరాలూ వారసులే. కాని మనుమరాలి పిల్లలు, కుమార్తె కుమారుని పిల్లలు, కుమారుని కుమారుని ఆడపిల్లలూ వారితోపాటు వారసులు కారు.

ఇలానే ఇతర వారసుల విషయంలో కూడా భేదం చూప బడుతుంది. పురుషుల ద్వారా మాత్రమే చుట్టరికం ఉన్నవారు దూరపు బంధువులైనా సరే, స్త్రీలద్వారా చుట్టరికం ఉన్నవారికంటే దగ్గిర వారసులు, అంటే మేనత్త కూతురు, పినతండ్రి మనుమడూ, ఇద్దరూ ఉంటే ఆస్థి పినతండ్రి మనుమడికే పోతుంది. ఒకే బంధుత్వం ఉన్న స్త్రీ పురుషులు ఇద్దఱూ ఉంటే పురుషునికి ఆస్థి వస్తుంది.

ఈ విధంగా అడుగడుగునా స్త్రీ పురుష వివక్షత చూప బడుతూనే ఉన్నది. మన రాజ్యాంగం 13, 15 సూత్రాల ప్రకారం స్త్రీ పురుష వివక్షత పాటించడానికి వీలులేదు. అలా పాటిస్తూ యేవైనా శాసనాలు చేసినా అవి చెల్లనేరవు. ఈ భేదాన్ని పాటించడానికి సక్రమమైన కారణాలేమీ లేవు కూడాను.

ఇక మూడో మార్పును పరిశీలించుదాము. కుమార్తెకు తండ్రి ఆస్థిలో భాగం వస్తోంది, కాబట్టి తల్లి ఆస్థిలో కుమారునికి భాగం యివ్వబడు తున్నట్లున్నది. ఈ న్యాయాన్ని ఎవరూ కాదనరు. కాని తండ్రి ఆస్థిలో కుమార్తెకు యే అయిదోవంతో లభిస్తూండగా తల్లిఆస్థిలో కుమారునికి సగంభాగం యివ్వడం యేమిన్యాయం? సమానత్వమే చూపదలచు కొంటే కుమార్తెకు తండ్రి ఆస్థిలో సగంభాగమును యివ్వాలి. లేదా కుమారునికి తల్లి ఆస్థిలో యే అయిదో వంతు భాగమన్నా యివ్వాలి. లేక పోతే స్త్రీలకు కొత్త హక్కులు రాకపోగా ఉన్న హక్కులు కూడా తగ్గి పోతాయి.

ఇవన్నీ కాకుండా బిల్లులో మరొక విచిత్రమయిన అంశం ఉన్నది. ఇది 1937 వ సంవత్సరపు 'హిందూ వివాహిత స్త్రీల ఆస్థి హక్కుల చట్టం'లో కూడా ఉన్నది. అది యేమిటంటే, ఒక పురుషునికి ఇద్దరో ముగ్గురో భార్యలు ఉంటే ఆ భార్యలందఱకూ కలిపి ఒకే భాగం వస్తుంది. అంటే యిద్దఱు భార్యలూ, ఒక కుమారుడు, ఒక కుమార్తె ఉంటె కుమారునికి ఒక భాగం, యిద్దరు భార్యలకూ కలిపి ఒక భాగం, కుమార్తెకు సగంభాగం వస్తుంది. ఈ సూత్రం యే న్యాయాన్ని అనుకరించి ఏర్పరిచారో తెలియదు. తన ఆనందానికి, స్వార్థానికిగాను పురుషులు అనేకమంది స్త్రీలను వివాహం చేసుకొని, బ్రతికి ఉన్నంత కాలంవారిని పరస్పర సంఘర్షణలకూ, యీర్ష్యాద్వేషాలకూ గురి చేసింది చాలక, అతడు మరణించాక కూడా వారందఱూ ఒకే భాగాన్ని పంచుకొని తక్కువ ఆస్థితో జీవించాలా? పురుషుడు చేసే దురన్యాయానికి ఆ అమాయిక స్త్రీలకు ఈ శాస్తి దేనికి? ఎంత మంది భార్యలుంటే అంతమందికీ తలొక భాగం యివ్వడం న్యాయం.

ఈ బిల్లువల్ల కలగబోయే ముఖ్యమైన మార్పులివి. స్త్రీలకు కొన్ని హక్కులు వస్తున్నమాట నిజమైనప్పటికీ పైన సూచించి నట్లుగా సవరణలు జరిగితేనేగాని బిల్లు నిర్దుష్టంగా ఉండదు. ప్రజలు, సంఘాలు తమ తమ సూచనలను రాష్ట్ర ప్రభుత్వాల ద్వారా పంపాలని కేంద్ర ప్రభుత్వం నిర్దేశించింది. కాబట్టి స్త్రీ సంఘాలన్నీ వెంటనే సభలు చేసి, బిల్లును పూర్వార్జితపు ఆస్థికి కూడా వర్తింప చేయాలని, కుమార్తెకు సమాన భాగం యివ్వాలని, వారసులలో స్త్రీ పురుష భేదం పాటించరాదనీ, భార్య లందఱకూ తలొక భాగం యివ్వాలని, తీర్మానాలు చేసి ప్రభుత్వానికి పంపాలి. లేకపోతే యింత కాలం నుండీ స్త్రీలకు ఆర్థికంగా జరుగుతూన్న అన్యాయాలు ఇంకాజరుగుతూనే ఉంటాయి.






## రత్నగీతి

(ఖండకావ్యము)

గ్రంథకర్త్రి : చదలవాడ నాగరత్నము

ప్రాప్తిస్థానము :– సరస్వతీ బుక్‌డిపో, విజయవాడ

శ్రీమతి రత్నమ్మ ఆలపించిన గీతములు రత్నములవలె నున్నవి. కవిసామ్రాట్. శ్రీ విశ్వనాథసత్యనారాయణగారి వంటి ప్రముఖుల ప్రశంసల నందుకొన్న యువతీరత్నము. ఆంధ్రనారీ లోకమునకంతకు గర్వకారణ మనక తప్పదు. ప్రతి యువతీరత్నము చదువదగిన వివిధ విషయముల గూర్చి వ్రాసిన పద్యసంపుటి.

వెల తెలియదు.

## మానవా - మానవా

(గేయసంపుటి)

రచన : వసంతరావు వేంకట్రావు.

ప్రాప్తిస్థానము : వసంతనికేతనము, విజయనగరము.

వెల : 0—8—0

ఈ సంపుటిలో గేయములు ఆరుగలవు. ప్రథమ గేయ నామమె సంపుటి కంతకును యిచ్చియుండుట సమంజస ముగానే యున్నది. "ఉబలాటం, విగ్రహారాధన. వాతావరణం, పరమశూన్యం, రెడ్‌క్రాస్‌సంఘం," అనే శీర్షికల క్రింద గేయరూపంలో అధునాతన విజ్ఞానసంపత్తికి సనాతనమైన ఆధ్యాత్మికశక్తికి వుండే సంబంధమును యుక్తముగ సమన్వయించి చెప్పిరి. గ్రంధకర్త శైలి మాత్రము సరళముగాను గేయములు భావ గాంభీర్యముతోను వున్నవనుటకు సందియములేదు. కాని వైజ్ఞానిక విషయములు గేయరూపములో సులభముగా ప్రచార మయ్యే అవకాశము వున్నదనిన గ్రంధకర్తగారి యభిప్రాయముతో మేమేకీభవింప జాలకున్నాము. వైజ్ఞానిక విషయములు పద్యములలోకన్న గద్యములోనే యుండుట మంచిది, ఈ గ్రంథమునందుకూడా రచయిత గద్యసహాయమపేక్షింప వలసి వచ్చిన ఘట్టములు కలిగి యుండుటయే మాయభిప్రాయమును బలపరచు చున్నది. నాస్తిక వాదము ప్రబలియున్న యీ నేటి ప్రపంచకమునకు యిట్టి గ్రంధములు మిక్కిలి యవసరమే.

## ఉపహారము

(గేయాలు)

రచయిత : సామవేదం వేంకటశార్ఙపాణి

ప్రాప్తిస్థానం : శ్రీ కృష్ణమణిమాల, పొన్నూరు.

వెల తెలియదు.

గ్రంథనామము తెనుగుతల్లికి ఉపహారమై సార్థకమైనది. కృతికర్త ఉభయభాషా కోవిదులైనట్లు వారి రచనయే చెప్పుచున్నది. భావ గాంభీర్యము పదములకూర్పు ఉత్తమ స్థాయిని పొందినవి. ఇందు "భృంగము, కోకిలా, మత సామరస్యము, ప్రాణత్యాగి" మొదలగు గేయములున్నవి.

గాడేపల్లి సుందరీశంకరం.

# శ్రీ త్యాగ గురుస్తుతి కీర్తనలు

* శ్రీమతి కె. ఎమ్. సౌందర్యవల్లి *

కీర్తన - 27

రాగం, ఖరహరప్రియ - అది తాళం.

ఆ. సరిగమపదనిస — అ. సనిదపమగరిస

ప॥ ఏమాటలాడిన, నీమాట ప్రియమౌ
మారామచంద్రునకు మహానుభావ ॥యే॥

అ॥ప॥ రామాభిరాముని, నీ ప్రేమవలలో
నేమంబుతో బట్టి, నామామృతంబాని ॥యే॥

చ॥ ఏరా పలుకవిది యేపాటియందువు
ధీరానన్నేలుకో రారాయటందువు
ధారాధరాభ శరీరా యనుచుకడు
గారామున బల్కెదు, గాక త్యాగగురు ॥ఏమాట॥

| | /4 | 0 | 0 |
|---|---|---|---|
| ప॥ | దా నీ పా దా ప మ ద ప మ గ రి స | రీ గ మా, మా | ప, ప, ద మ పా |
| | ఏ - మా ట లా . . . డి . న . | నీ - మా ట | ప్రి య - మౌ . |
| | మ పా దా, నీ సా; స ని దా . | నీ సా ; సా | ని ద ద మ పా దా |
| | మా - రా మ చం ద్రు . న | కు - మ | హా- ను - భా వ॥ |
| | దా నీ పా దా | | |
| | ఏ - మా ట | | |
| అ॥ప॥ | మ పా దా, నీ సా; సా సా | సా; సా సా | స ని రి స స ని ని ద |
| | రా మా భి రా ము ని | నీ ప్రే మ | వ - ల - లో - - - |
| | దా, దా, నీ దా ని పా, దా | దా నీ పా పా | మ గ రి రి గ మ ప ద |
| | నే మం బు తో బ - ట్టి | నా . మా మృ | తం . . బా . . ని . |
| | దా నీ పా దా | | |
| | ఏ మా - ట | | |
| చ॥ | దా; దా నీ దా దా నీ దా | దా; ద పా ద | నీ నీ ద ప ప మ |
| | ఏ రా ప లు క వి ది | ఏ పా . టి | యం. దు . వు . |
| | నీ ద పా పా, మ గ ద ప మ గ రి స | రీ గ మా, మా | ప ద నీ దా పా |
| | ధీ - రా న న్నే - - - లు . కో . | రా - రా య | టం . దు వు |

అ. ప. వలె

ధారాధరాభ శరీరాయనుచుకడు
గారామున బల్కెదుగాక త్యాగగురు ॥యే॥

# శ్రీ త్యాగ గురుస్తుతి కీర్తనలు

కీర్తన - 28

కళ్యాణిరాగం — రూపకతాళం.

ఆ. స రి గ మ ప ద ని స — అ. స ని ద ప మ గ రి స

ప॥ పేదలలో కుచేలుడవు, సాధుజనులలో మేటివి ॥పే॥

అ॥ప॥ నాదగానసుధ నెరుంగ, నారదువలె కోవిదుడవు ॥పే॥

చ॥ భక్తిని ప్రహ్లాదుండవు, విరక్తి భువిని బుద్ధుండవు
ముక్తిగన పరీక్షితుడవు, శక్తియెంతో త్యాగరాజ ॥పే॥

| 0 | /4 | 0 | /4 |
|---|---|---|---|
| ప॥ మ పా మ | గ రి గ రి సా ; | స రి స ని | దా నీ రీ గా |
| పే - - | ద - ల - లో . | కు . చే . | . లు డ వు |
| పా, ప | పా సా సా సా | స ని ద ప | మ ద ప మ గ రి గా |
| సా . | ధు జ ను ల | లో - - - | మే - - - టి . వి |
| (పామ) | | | |
| (పే -) | | | |
| అ॥ప॥ ; సా | సా స స ని ద పా | నీ దా | నీ సా ; సా |
| నా | ద గా . . . న | సు ధ | నె రుం గ |
| సా గ రి | సా స ని దా పా | ప ప ని ద | మ ద ప మ గ రి గా |
| నా . . | ర దు . వ లె | కో - - - | వి . దు - . డ - వు |
| (పా మ) | | | |
| పే .) | | | |
| చ॥ ; పా | పా పా పా ; | పా ; | పా; మ ని ద ప |
| భ | క్తి ని ప్ర | హ్లా | దుం . డ . వు |
| మా ప మ | గా రీ సా సా | ; పా . | గా; మా పా |
| వి ర . | క్తి భు వి ని | బు | ద్ధుం డ వు |

అ. ప. వలె

ముక్తిగన పరీక్షితుడవు

శక్తి ఎంతో త్యాగరాజ ॥పేదలలో॥



చిత్రసమీక్ష :

# భారతవాణి

'ది వాయిస్ ఆఫ్ ఇండియా' (భారతవాణి) అన్న 35 మిల్లీ మీటర్ల గాంధీజీ డాక్యుమెంటరీ ఫిల్ము 1,8,15 తారీఖుల్లో మద్రాసు నగరపౌరులకు చూపించేరు. ఆబాలగోపాలం చూచి ఆనందించేరు. ప్రదర్శనకాలం ఒక గంట. సైలెంటు ఫిల్మేగాని, బ్యాక్‌గ్రౌండు మ్యూజిక్కుతోను, మిస్. మీరాబెన్ (మిస్‌స్లేడ్) శ్రీ ప్యారీలాల్, శ్రీ దేవదాస్ గాంధీగార్ల విస్పష్టమైన ఇంగ్లీషు కామెంటరీలతోను అపూర్వంగాఉంది. నేపథ్యసంగీతం ప్రాచ్య - ప్రచీతల సమ్మేళనం వల్ల మరీ సమంజసంగా ఉంది. మధ్యలో ఈజిప్టు పడవపాటకూడా ఉంది. ఐతే గాంధీజీకి అత్యంత ప్రియతమమైన రామధున్, మనజాతీయ గీతం కోసం మనం ఆశపడతాంగాని ఈ ఫిల్ము ముఖ్యంగా పాశ్చాత్త్య దేశాలవారికని తయారయిందని కొంత సంతృప్తి పడతాం.

ఫిల్ము ఆశయం గాంధీజీ జీవితమంతా చూపించడం గాదు. మహాత్ముని జీవితంలోను, భారత స్వతంత్ర పోరాటం చరిత్రలోను చిరస్థాయిగా నుండి పోయే రెండు సంవత్సరాల సంఘటన లిందున్నాయి. ఫిల్ముపొడుగునా గాంధీజీ వ్యక్తిత్వం ప్రస్ఫుటమౌతూ ఉన్నా ఇంకా మన ఇష్టనాయకు లందర్నీకూడ చూచాయగా చూస్తాం. డిశంబరు 1929 నుంచి జనవరి 1932 మధ్యకాలానికి సంబంధించిన హంశాలు : రెండవ రౌండు టేబిల్ సమావేశానికి గాంధీజీ ఇంగ్లాండు ప్రయాణం, అక్కడి ప్రజలకు ఆయన భారతవాణి — సందేశం ; అప్పట్లో వినపడింది గాని అంతగా పాటించింది గాదు. అప్పటి పాశ్చాత్త్య ప్రభుత్వం. విదేశ పత్రికా ప్రతినిధితో గాంధీజీ సంభాషణ "మీరు ఇంగ్లాండు రాజును సందర్శిస్తున్నప్పుడు ఏ దుస్తులు ధరిస్తారు" అన్న ప్రశ్నకు "ఇప్పుడేమి ఉన్నాయోఅవే!" నన్న గాంధీజీ నిరాడంబర వాక్కులు, ఓడపై బాలుణ్ణి ఎత్తుకుని నవ్వుతున్న ఆ విశ్వ సమ్మోహనమైన నవ్వు, లాంకషైరులో పళ్ళు అందిస్తున్న బాలలతో ఛలోక్తి, ఎక్కడికి వెళ్ళినా అనంత ప్రజాసందోహాన్ని ఆకర్షించే ఆ వ్యక్తిత్వం, ఇటలీలో ముసోలినీ బాలకభట వర్గాన్ని తిలకించడం, రోమైన్‌రొలాండ్‌తో సమావేశం, ఓడదిగే సరికి భర్త అరెష్టును చెప్పవచ్చిన కమలానెహ్రూ, వగైరా సన్నివేశాలు చూస్తాం. కాంగ్రెస్ సమావేశాలు, ఆ దండి సత్యాగ్రహం, బొంబాయి పోలీసుల దుండగాలు, వగైరాలన్నీ తిలకించి ఎలాంటి పోరాటం సల్పి యీ స్వాతంత్రత సాధించుకున్నామో జ్ఞప్తికి తెచ్చుకుంటాం. మళ్ళీ మన పూజ్య బాపూజీతో ఆ రోజుల్లో గడిపినట్లే అనుభవిస్తాం.

ఈ అపూర్వ చిత్రాన్ని తయారు చేసిన గాంధీస్మారకనిధి కమిటీవారూ, నిర్మాత శాంతారాం, వ్యాఖ్యాన ప్రముఖులూ అంతాకూడా భారతీయుల కృతజ్ఞతను చూరగొన్నారు. ఇంకా గాంధీజీ పూర్తి జీవితగాధను చూపించే ఫిల్ము నిర్మింప బడుతూవుందని విన్న భారతీయులు ఆబాలగోపాలం ఆతురతతో ఎదురు చూస్తున్నారు.

కె. సు.



ఇటీవల మధ్యప్రదేశ్ రాష్ట్రంలో పర్యటిస్తూ, భారత ప్రసిడెంటు శ్రీరాజేంద్రప్రసాద్‌గారు బస్తర్ జిల్లా దంటెవారాలో మేరియాజాతి ఆదిమవాసులకు బట్టలు, చీరలు పంచిపెడుతున్న దృశ్యం.

# చిన్న మొత్తములలో నిల్వ సేకరణ-
## ఆంధ్ర మహిళా సభలో కార్యాలయము.

చిన్న మొత్తముల నిల్వలు ప్రోత్సాహించి, ప్రభుత్వమువారి పంచవర్ష ప్రణాళికకు తోడ్పడు స్త్రీల ఉద్యమములో ఆంధ్రమహిళాసభ సభ్యురాండ్రు ఎక్కువగా తోడ్పడవలెనని నిశ్చయింపబడినది. ఇందు కొరకై, ఆంధ్రమహిళా సభ ఆవరణలో ఒక ప్రత్యేకమైన కార్యాలయము ఏర్పరుపబడును. ఇందు దైనిక కార్యక్రమాన్ని నిర్ణయించి, స్త్రీ సామాన్యములో యీ ఉద్యమాన్ని గూర్చి ప్రచారం చేయుటకు, నిల్వచేయదలచినవారికి తగు సలహానిచ్చుటకు, సభ తరపున కొందరు యువతులు నియమింపబడుదురు. ఈ ఉద్యమంలో ఒక ప్రత్యేక ప్రతినిధిగా వ్యవహరించి, ధనము వసూలు చేయుటకు భారత ప్రభుత్వమువారు, ఆంధ్ర మహిళాసభకు అధికారమిచ్చియున్నారు. సభకు వచ్చిగాని, పోస్టు ద్వారాగాని అన్ని వివరములు తెలిసికొనవచ్చును.

ఇంకొక విషయము— మీరు కొనదలచిన సేవింగ్సు సర్టిఫికెట్లు సభ ద్వారా కొన్నయెడల సభకు 1¼% కమీషను వచ్చును. ఈ కమీషను సభయొక్క కార్యకలాపాలకై వినియోగించుకోవచ్చును. అందువల్ల మీరు నిల్వ చేయదలచిన మొత్తమునకు సభద్వారా సర్టిఫికెట్లు కొన్నచో, సభకు కూడా సహాయము చేసినవారగుదురు.

ఉత్సాహ వంతులైన సోదరీమణులు, యింత వరకూ సభద్వారా నిల్వ సర్టిఫికెట్లు తీసుకున్న మొత్తము రమారమి రూ. 33800/- ఇందు మూలముగా సభకు వచ్చిన కమీషను రూ. 423/- ఇంకా పెక్కుమంది సోదరీమణులు యీవిధముగా సభద్వారా సర్టిఫికెట్లుకొని సహాయ పడవలెనని కోరుచున్నాము.

టి. జి. హైమవతి,
ఆర్. లక్ష్మి.

---

# గమనిక

'ఆంధ్ర మహిళ' స్త్రీల సచిత్ర మాస పత్రిక. ఆంధ్ర లోకంతో సన్నిహితానుబంధం ఏర్పరచుకొని, మహిళా సంఘంలో నూతన ప్రబోధం కలిగించే ఆశయంతో ఆంధ్ర మహిళా సభ తరపున "ఆంధ్ర మహిళ" పత్రిక 11 సం॥రములనుండి ప్రకాశితమగుచున్నది.

దీనియందు స్త్రీల మనోవికాసానికి తోడ్పడే వ్యాసములు, కథలు, నాటికలు, పిల్లలకు బాలానందం మొదలగు గద్య పద్యాత్మకములైన పలురకముల రచనలున్నవి. సాంఘిక రాజకీయ విషయములు, ప్రభుత్వము వారు దేశాభివృద్ధికై జరుపుచున్న సంక్షేమ కార్యక్రమాలు, స్త్రీలకుపయుక్తమైన గృహ పరిశ్రమలు మున్నగు వానిని గూర్చి మాసామాసము యిందు ప్రకటింపబడును.

వార్షిక సంచిక, తపాలా ఖర్చులతోసహా

**సంవత్సర చందా 6-0-0**

సేవాసంస్థలకు, గ్రంథాలయములకు, కళాశాల, పాఠశాలలకు,
సంవత్సర చందా రూ. 4-8-0 మాత్రమే.

వివరములకు :

మేనేజరు
'ఆంధ్ర మహిళ'

ఆంధ్ర మహిళా సభ,
24-ఎ. లజ్ చర్చిరోడ్డు, మైలాపూర్, మద్రాసు 4.

# నమస్తే

ఆంధ్రమహిళాసభా ప్రాంగణములో కలదు ప్రమదా వనము. నాటిన ఉన్నతాశయములు నేటికి కన్నుల పండుగ నుండు ఒక చిన్న పుష్పవనముగ తయారైనది. ఆంధ్ర మహిళ ఇప్పటికి పదునొకండు ఏళ్ళ మొక్కయే. తరు ఛాయల బాటసారులకు నీడనిచ్చు వృక్షము కాలేదు. సుగంధ పుష్ప గుచ్ఛములతో మనోరంజకమగు మొక్కయుకాదు. అట్లు కావలయుననియే ఆంధ్రమహిళా సభవారి అభీష్టము. కాని అది నేటికి భగవదనుగ్రహముతో ఆంధ్ర సోదర సోదరీమణుల ఆదరముతో బాలారిష్టపు గడ్డుదినములు దాటి ఇప్పుడే ఏపుగా కోపుగా పెరుగు చున్నది.

ఈ మొక్కను నాటినది శ్రీమతి దుర్గాబాయిదేశ్‌ముఖ్ గారు. దాని సంపాదకత్వము వహించి అయిదారేండ్లు దీనిని అతి జాగ్రత్తతో పెంచిరి. వీరు ఉన్నత పదవుల నలంకరించు నిమిత్తము ఢిల్లీ వెళ్ళ వలసి వచ్చినప్పుడు శ్రీమతి చెన్నఘంటమ్మగారికి ఆ బాధ్యత వదలి వెళ్ళిరి. తిరిగి శ్రీమతి చన్నఘంటమ్మగారును ఆంధ్రరాష్ట్ర సంఘసంక్షేమ బోర్డు చైర్మన్‌గా నియమింప బడుటచేత ఈ 'ఆంధ్రమహిళ' నిర్వహణ వేరొక్కరికి ఒప్పగించ వలసిన పరిస్థితులేర్పడినవి. శ్రీమతి దుర్గాబాయిదేశ్‌ముఖ్‌గారి అభిమతానుసారము నేను ఈ పత్రికా సంపాదకత్వభారము వహించుటకు సమ్మతించితిని.

సాహసించితినేమో ? మహిళాభ్యుదయమునకై చేతనైనంత సేవ ఈ పత్రికా ముఖమున నిర్వహింప నుత్సాహముతో నిట్టి బాధ్యత వహించుటకు నుద్యుక్తురాలనైతిని. ఆంధ్ర సోదర సోదరీమణుల ఆదర అభిమానములను, వారి సుహృద్భావము నపేక్షించుచూ ఇట్టి బాధ్యతాయుక్తమగు కార్యము సక్రమముగా నిర్వహింపగలనని నమ్ము చున్నాను.

ఆంధ్ర దేశమంతటా ఇంటింటా ఈ 'ఆంధ్రమహిళ' మనోవికాసములు వెదజల్లగల ఒక చిన్న దివ్వెగా చదువరులకు అందివ్వవలయునని నా ఆశయము, అనతికాలములో సఫలీకృతమయ్యేనేని ధన్యురాలను.

లక్ష్మీరఘురామ్.

# ఆంధ్రమహిళ

సంపుటి 11 :: అక్టోబరు '54 :: సంచిక 6





సంవత్సర చందా :: :: ఆరు రూపాయలు.


## విజ్ఞప్తి

ఆంధ్రుల ఆదరాభిమానములనందుచు, అల్లారు ముద్దు బిడ్డగా పెరుగుచు 11 ఏళ్ళ ప్రాయమునకు వచ్చిన 'ఆంధ్ర మహిళ' డిశంబరు నెలలో ప్రత్యేక జన్మదిన సంచిక ప్రకటింప నుద్యమించినది. నవంబరు నెలాఖరుకే పత్రిక వెలువడును.

చందా దారులు—పాఠకులు, రచయతా— రచయితలు, పెద్దలు-పిన్నలు చక్కటి వ్యాసములు, పద్యములు, కథలు, నాటికలు, టుమ్రీలు, చిత్రములు, వగైరాలు- స్త్రీలకు, పిల్లలకు విజ్ఞాన- ఆనందదాయకములగునవి ఏ శీర్షికతోనైనను వ్రాసి వీలైనంత త్వరలో పంపగలరని ప్రార్థన.

వేరు వేరుగా అందరిని కోరుట సాధ్యము కానందున యీవిజ్ఞప్తి గావించుచుంటిమి.




సంపుటి 11 :: అక్టోబరు '54 :: సంచిక 6

# పర్వ దినములు

ఈ మాసములోనే అనేక పర్వదినములు సంఘటితపడుట చిత్రము. హిందూ సాంప్రదాయాల ననుసరించి నవరాత్రిళ్ళు దీపావళి పండుగలు మన పండుగలలోకెల్ల ముఖ్యమైనవి. యావద్భారత దేశము ఈ పండుగలను చేసికొనుట పరిపాటే. భక్ష్యముల క్రొత్త బట్టల ఆనందమేగాక అల్లుళ్ళరాకలు, బొమ్మల కొలువులు, దీపాలవేడుక, టపాకాయలు వినోదము ఈ పండుగల ప్రత్యేకత. ఒక్కొక్క గృహము పచ్చని తోరణములో మన అపూర్వ సంస్కృతిని ప్రదర్శించు చిన్న ప్రదర్శనశాలై అలరారగలదు. ఆబాలగోపాలము తమ తమ సంసార బాధలు మరచి, కష్టములు, దుఃఖములు తాత్కాలికముగానైన మరపునకు ద్రోసి ఈ పర్వదినములతో ఆనందోత్సాహములతో పండుగలను జరపుకొనుదురు.

పూర్వమునుండి జరపుకొను ఈ రెండు పండుగలేగాక ఈ మాసము మొదటతారీకు రెండవతారీకు మనకు రాజకీయముగా సాంఘికముగా ఎర్పడ్డ పండుగలు.

అక్టోబరు ఒకటవ తేది మనకు చిరవాంఛితమైన ఆంధ్ర రాష్ట్రము ఏర్పడిన సుదినము. ఏడాదినాడు మన వాంఛలు సఫలీకృతమై ప్రత్యేక రాష్ట్రము ఏర్పడినది. ఆనాడు ఆంధ్రదేశమంతటా, వాడ వాడల ఆనందము పొంగి గట్లుతెగిన గోదావరివలె ప్రవహించినది. ఆంధ్ర రాష్ట్ర కన్య తా స్వయంవరమున వరించిన వరునితో వివాహము మహావైభవమున జరిగి ఏడాదైనది. ఆమె దీర్ఘసుమంగళియై, ఆమె దాంపత్య జీవితము అతి మధురమై, ఆమె అనేక సుపుత్ర పుత్రికాసంతానవతై, ధనకనక వస్తువాహనాదులతో, సంపూర్ణ ఆరోగ్య సకలైశ్వర్యములతో సుఖముగా నుండవలయుననియే ఆంధ్ర ప్రజానీకము అనుదినము చేయు దైవప్రార్థన.

అక్టోబరు రెండవ తేది పూజ్య మహాత్మాగాంధి జన్మదినము. దేశమంతటా ఆయన జన్మదిన మహోత్సవము అత్యంతోత్సాహముతో జరుపబడును. నిష్కామ దేశ సేవ ఏ కార్యక్రమమున రూపొందినను ఆ మహాత్ముని ఆత్మశాంతి కలిగించుటకు తోడ్పడును. ఈ సంవత్సరము ఆయన జన్మ మహోత్సవ సందర్భమున ఎన్నియో మాతా శిశుసంరక్షణశాలలు నెలకొల్పబడుట ప్రత్యేకముగా మహిళలకు సంతోషము కలిగించు విషయము.

ఈ అపూర్వ పర్వదినములో ఆంధ్ర మహిళలకు చేతినిండుగా పని. దైవము వీరికి తోడ్పడి అనుగ్రహించుగాక.



మీ బిడ్డ మామూలుగా
భుజించనిచో

మందంగా వుండి, పొట్ట ఉబ్బివున్నచో, బహుశా కడుపులో బల్ల (లివర్) పెరుగుతుండవచ్చు. యీ లివర్ వ్యాధి సాధారణముగా 3 సంవత్సరాలలోపు పిల్లలకు వచ్చుట సహజము.



జమ్మి వారి

# లివర్‌క్యూర్

లివర్ & స్ప్లీన్ వ్యాధుల
చికిత్సకు, నివారణకు.




ఇప్పుడు మాత్రల
రూపంలో లభిస్తున్నది.

JVZ-ITG

జమ్మి వెంకటరమణయ్య అండ్ సన్స్,
'జమ్మి బిల్డింగ్స్', మైలాపూర్, మద్రాసు.
శాఖ: వోరుగంటివారి వీధి, విజయనగరం సిటీ,
మరియు ఇతర స్థలములలో.

---

# గృహలక్ష్మి

## దసరా - దీపావళి సంచిక

దసరా ఉత్సవాలు, దీపావళి వేడుకల సందర్భమున 'గృహలక్ష్మి'ని అక్టోబరులో ప్రత్యేక సంచికగా వెలువడ జేయనుద్దేశించాము.

ఎక్కువ పేజీలతోటి, కథానికలు, నాటికలు, గేయాలు, అమూల్యములైన వ్యాసములతోటి ఆకర్షణీయంగా వెలువడగలదు. రచయిత్రులు, రచయితలు తమ ఉత్తమ రచనలు పంపియు, పాఠకులు ఎప్పటి ఆదరాభిమానములతోటి మాకృషికి సహాయపడవలసినదిగా మా విజ్ఞప్తి.

సంపాదకులు.

---

మీరందరు తప్పకుండా

చదువ తీరాల్సిన పుస్తకం:

# జాజిమల్లి

(ఆంధ్ర మహిళలో సీరియల్‌గా ప్రచురింపబడిన నవలానిక)

గ్రంథకర్త:

కీ. శే. కులపతి అడివి బాపిరాజుగారు

150 పేజీలు :: వెల 1-8-0

ప్రతులు దొరుకుస్థలము:

హిగ్గిన్‌బాదమ్స్ అన్ని బుక్‌స్టాల్సు,
వెంకట్రామా అండ్ కో.,
ఆంధ్ర మహిళా ప్రెస్, మద్రాసు-4.



# రాజకీయాలు

*శ్రీ జొన్నలగడ్డ రాధాకృష్ణ*

గత నాలుగు వారాలలోను అంతర్జాతీయంగా నేమి, జాతీయంగా నేమి పెక్కు సంఘటనలు జరిగాయి.

మనిలాలో ఆగ్నేయ ఆసియా రక్షణసంధికి ఒడంబడిక, యూరోప్ రక్షణ సంధి వైఫల్యం, రష్యా, చైనాలకు బ్రిటీష్ కార్మికపక్షంనాయకుల సందర్శన, క్వెమోయి దీవివద్ద చైనీస్ సేనల లిస్టులకు, కమ్యూనిస్టులకు మధ్య యుద్ధ ప్రజ్వలన, బీహార్, అస్సాంలలో వరదల బీభత్సం, లంకప్రధాని బెదిరింపులు, ఢిల్లీకి ఇండోనేసియా ప్రధానిరాక, కరివెన సత్యాగ్రహం విరమణ, తిరుపతిలో వెంకటేశ్వర విశ్వవిద్యాలయ స్థాపన మున్నగునవి.

బ్రిటిష్ కార్మికపక్ష నాయకుడు మిస్టర్ అట్లీ నాయకత్వంలో కొందరు కార్మిక నాయకులు రష్యా చైనాలను సందర్శించినారు. కొన్ని రాజ్యాలు అనుకొంటున్నట్లు అవి ప్రపంచంలో యితర రాజ్యాలతో స్నేహాన్ని వాంఛించకపోవడం లేదని కనుగొన్నారు. వీరి పర్యటన రెండు దేశాలను సామ్రాజ్య రాజ్యాలకు మరింత సన్నిహితం చేసిందని అనూరిన్ బెవాన్ అన్నాడు. ఇదినిజం.

యూరోప్‌లో రష్యాతో, ఆసియాలో చైనాతో వ్యతిరేకంగా సైనికంగా కూటాలను ఏర్పాటు చెయ్యడానికి అమెరికా పెద్ద ప్రయత్నం చేస్తున్నది. పశ్చిమ యూరోప్ రాజ్యాల సైన్యాలతో పశ్చిమ జర్మనీ సైన్యాన్ని కూడా చేర్చడానికి యూరోప్‌రక్షణ ఒడంబడికను సాధించడానికి ప్రయత్నించింది. అయితే చివరిక్షణంలో ఫ్రాన్సు దీనికి నిరాకరించింది. ఇప్పుడు మరో కొత్త ఏర్పాటు చెయ్యడానికి పాశ్చాత్య రాజ్యాల సమావేశం లండన్‌లో జరగబోతున్నది.

[illegible] రాజ్యాలతో ఒడంబడిక [illegible] అమెరికా [illegible] దాని ప్రధానమైన రాజ్యాలు ఇండియా, బర్మా, సిలోన్, ఇండోనీసియాలు దానిలో చేర నిరాకరించాయి. పాకిస్తాన్, ఫిలిప్పిన్స్, బ్రిటన్, అమెరికా, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, థాయ్‌లెండ్, ఫ్రాన్సులు మాత్రమే చేరాయి. ఈ ఒడంబడికను చైనా తీవ్రంగా విమర్శించింది.

సెప్టెంబర్ మాసారంభంలో సైబీరియా వద్ద ఒక అమెరికన్ విమానాన్ని రష్యన్ విమానాలు కూల్చి వేశాయి. అమెరికన్ విమానాలు మా భూభాగంలోకి ఎగిరి రావడమే గాక, కాల్పులు జరిపింది కనక మేము ప్రతీకారానికి తలపడ్డాము అని రష్యాఅంది. ఆమెరికాదీనిని భద్రతాసంఘంలో పిర్యాదు చెయ్యడం వరకు వెళ్ళింది. అక్కడ తీవ్ర పరిణామాలు ఏమీ లేకుండా చర్చల్లోనే నిలచి పోవడం మేలే.

ఫార్మోజా తమది అని చైనీస్ కమ్యూనిస్టుల వాదం, దాని విమోచనకు పూనుకొంటాం అంటూనే క్వెమోయ్ దీవిపై దాడి జరిపారు చైనీస్ కమ్యూనిస్టులు. అప్పటినుంచి సేనలిస్టుల విమానాలు, నౌకలు కమ్యూనిస్టుల అధీనంలోని చైనా నడిగడ్డపై దాడులు జరుపుతూనే వున్నాయి. కమ్యూనిస్టుల విమాన విధ్వంసక శతఘ్నులు వాటిని కూల్చుతూనూ వున్నాయి.

* * *

ఇండో-చైనాలో యుద్ధ విరమణ పర్యవేక్షణకు జెనివా ఒడంబడిక ప్రకారం నియమించబడిన మూడు సంఘాల లోను ఇండియా అధ్యక్ష పదవిని నిర్వహిస్తూవుంది. భారత ప్రతినిధులు సిబ్బంది సహా అక్కడకు చేరుకొని అప్పుడే శాంతి సాధన కార్యక్రమాన్ని ప్రారంభించారు.

కొన్ని సంవత్సరాలుగా ఇరాన్ పెట్రోలు వివాదం పరిష్కారమై పెట్రోలు పరిశ్రమ తిరిగి పనిచెయ్యడానికి సిద్ధంగా వున్న పరిస్థితులలో ఉన్నట్టుండి 500 మిలియన్లకు పైగా ప్రభు

త్యోద్యోగులు అరెస్టయినారు. వీరిలో కొందరు పర్ష్యా రాజ బంధువులట కూడా. వీరు రష్యా తరఫున గూఢచారులుగా వ్యవహరిస్తున్నారని ఆరోపించ బడింది. త్వరలోనే సైనిక న్యాయస్థానాలలో వీరిని విచారణ చేస్తారు.

గోవా పరిస్థితిలో మార్పులేదు. గోవన్ సత్యాగ్రహులు విమోచనం సాధించిన గ్రామాల పునరాక్రమణకు బుడత కీచులు సైన్యాలను గొనివస్తున్నారని వినికిడి. కాని ఆ గ్రామాలకు ఇండియా భూభాగం నుంచి వెళ్ళడానికి ఏవిధమైన అవకాశంయివ్వమని ఇండియా ప్రభుత్వం స్పష్టం చేసింది.

సిలోన్ - ఇండియాలపేచీ చివికి చివికి గాలివానగా మారేట్లు వినిపిస్తోంది. ఢిల్లి ఒడంబడిక ప్రకారం ఇండియాకు తిరిగి రాగోరే భారతీయులను ఇండియా పౌరులుగా నమోదుచేసి, స్వదేశానికి వారు రావడానికి అంగీకరిస్తే, ఉద్యోగాలు, వృత్తులు లేకుండాచేసి, మొత్తం అక్కడ వున్న భారతీయులందరిని పంపివేసే ఎత్తులోవున్న సిలోన్ ప్రభుత్వం అవసరమైతే ఐక్యరాజ్య సమితివరకు వెడతామని బెదిరిస్తోంది.

ఎందుకైనా మంచిదని సింహళ ప్రధాని ముందు ఇండియా ప్రధాని పండిట్ నెహ్రూతో మాట్లాడి, ఆ పైనే సమితి వరకు వెడతాడట. ఈయన ధోరణి యిచతల వెర్రి తలలు వేస్తోంది. ఆ మధ్య నెహ్రూ అధికారానికి పిమ్మట దక్షిణ ఇండియాలోని కమ్యూనిస్టులు లంకపై దండయాత్ర జరపకుండా జాగ్రత్త పడాలని ప్రకటించాడు కూడా.

సెప్టెంబర్ మాసారంభంలో ఆంధ్రులకు మరొక శుభ సంఘటన - తిరుపతిలో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ స్థాపన, ప్రెసిడెంటు రాజేంద్రప్రసాద్, పండిట్ నెహ్రూల శుభాశీస్సులతో విభిన్న సంస్కృతుల విశిష్టసమన్వయం జరగడగు ఈ విజ్ఞాన పీఠానికి ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ ప్రకాశంగారు ప్రారంభోత్సవం జరిపారు.

హైస్కూలు తరగతులలో హిందీవిద్యా బోధనకు, యూనివర్శిటీ కోర్సుకు విద్యార్థి యోగ్యతల పరిశీలనలలో హిందీలో వచ్చిన మార్కులను కూడా గణించాలని ఆంధ్ర ప్రభుత్వం ఉత్తరువు చేసింది.

ఈనాంకాలు దార్ల రక్షణ ఆర్డినెన్స్ పట్ల ఆక్షేపణగా ప్రజాసోషలిస్టులు కరివెనలో ప్రారంభించిన సత్యాగ్రహం, సత్యాగ్రహుల కోర్కెలు త్వరలో తీర్చటానికి చర్య తీసుకొంటామని ప్రభుత్వం వాగ్దానం చెయ్యడంతో విరమించబడ్డది. ఈ సందర్భంలో అరెస్టయిన శ్రీ పి. వి. జి. రాజుగారు, తదితరులు విడుదల చెయ్యబడ్డారు.

ఈ సమయంలోనే గీత సత్యాగ్రహులు కూడా విడిచి పెట్టబడ్డారు.

రాష్ట్ర ప్లానింగ్ కమీషన్‌ను రద్దుచేసి ఒకటి మంత్రులతోను, మరొకటి ప్రభుత్వకార్య దర్శులతోను కొత్తగా ఏర్పాటు చెయ్యడానికి ఆంధ్రమంత్రి వర్గం నిశ్చయించింది.

విజయవాడలో ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెస్ సర్వసభ్య సమావేశం సెప్టెంబరు 17 వ తేదిని జరిగినపుడు తుంగభద్ర ఎగువ కాల్వ, నందికొండ, వంశధార ప్రాజెక్టులను తొలి పంచవర్ష ప్రణాళికలోనే చేర్చాలని తీర్మానించ బడింది.

బ్యాంకి ఉద్యోగుల వేతనాల విషయాలలో ట్రిబ్యునల్ అవార్డుపై ప్రభుత్వం తలపెట్టిన సవరణలపై కేంద్ర మంత్రి వర్గంలో ఏర్పడ్డ విభేదాల ఫలితంగా కార్మికమంత్రి శ్రీ వి. వి. గిరిగారు తమ పదవికి రాజీనామా యిచ్చారు.

ఈ సమస్యను సమగ్రంగా పరిశీలించడానికి శ్రీ రాజాధ్యక్షుడు నియుక్తులైనారు.

బీహార్, అస్సాం రాష్ట్రాలలో మరొక ప్రకృతి విపర్యయం సంభవించింది. ఈసారి వరదలవల్ల కొన్ని కోట్ల రూపాయల ఆస్థి, పాడి పంటలు, నష్టమై పోయాయి. 1,[illegible],087 కుటుంబాలు నాశనమైనాయి. ప్రధాని పండిట్ నెహ్రూ, 22 మంది పార్లమెంటు సభ్యులతో ఆ ప్రాంతాన్ని చూసి వచ్చారు. వరద బాధితుల సహాయానికై విరాళాలు సేకరించ బడుతున్నాయి. నేపాల్ కూడా దెబ్బతింది.

వివాహాల బిల్లును లోక్‌సభ ఆమోదించింది. రాజ్యసభ కూడా అలస్యం లేకుండా ఆమోదించాలని ప్రధాని పండిట్ నెహ్రూ సూచించారు.

యు. పి. ప్రభుత్వం 301 హయ్యర్ ఎలిమెంటరీ పాఠశాలలకు, 2046 జూనియర్ ఎలిమెంటరీ పాఠశాలలకు పాఠ్య గ్రంధాలు ఉచితంగా యివ్వడానికి నిశ్చయించింది. వ్యవసాయంలో శిక్షణకు 24,000 యకరాలు ప్రత్యేకించి దానిపై వచ్చే రాబడిని ఈ విధంగా వినియోగిస్తుందట.





## అబ్బాయి జిజ్ఞాస - అమ్మాయి అన్వేషణ !

(ఇద్దరికీ స-రి-గ్గా సరిపోయింది ! !)

అబ్బాయి : "పూవు నీరీతి నలరించు ప్రోఢ యెవరా ?

అమ్మాయి : సరస మకరంద మిటనిల్పు చతురు డెవడొ ?

అబ్బాయి : కమ్మతావుల నిటఁజిమ్ము ఘనుడెవండొ ?

అమ్మాయి ; ఎందునుండునొ, కనుపింపడేలనొక్కొ ?"



# లోకులు — కాకులు

శ్రీ చవలవాడ నిర్మల - నాగరత్నము.

"లోకులు — కాకులు" సామెత
వాకొందు రిదేమి ? యం దబద్ధము లేదా ?
కాకుల యైక్యత యున్నన్
లోకులు దుష్కృత్యములకు లోనగుదురాకో !

ఒకరు పచ్చంగ నున్నఁ దా మోర్వలేక
గొంట చిక్కుల నన్నింటి నంటఁ గట్టి
త్రాఁచు పగ పట్టి, పరిమార్పఁ దలఁచునట్టి
వారు లోకులా ! కాకులో ! వ్రాయఁగలమె ?

ఒక్క కాకికి నాపద యొదవె నేని
కావు కావు మటంచు లోకమ్ము నెంచు
కాక లోకమ్మె యాదర్శకమ్ము సుమ్మ
సుజన సంఘమ్మునకు ; నిద్ది సూనృతమ్ము.

శాస్త్ర పాండిత్య జన్య విజ్ఞాన మహిమ
మారణాస్త్ర నిర్మాణ సంపాదనమున
వ్యయ మొనర్చుటయే న్యాయమా ? యిదేమి
ధర్మమో ! గోచరింపని మర్మమేమొ !

లోక కళ్యాణమంత చీకాకు పఱచి
ప్రాముకొనఁబోవు నామహాభాగ్యమేమి ?
అందుఁగల చిదంబర రహస్యంబుఁ దెల్పు
మానవా : కావ ? దానవా ! మానవోయి !





"ఎవ్వని శాంతమూర్తి యని యెల్లరనారతమున్ భజియింతురు,
ఎవ్వడధర్మ మార్గమున నించుకయేని గాల్వెట్టడు.
ఎవ్వడు లోకమంతకు నహింసయయే యుత్తమమంచు జాటెఁ-
నట్టిఘనమూర్తిఁ, మనోబలశాలిఁ, గాంధిఁ, జేమొత్తి నమస్కరింతు...."



# గాంధీజీ ఏమంటారు?

## (గ్రామ స్వపరిపాలన)

గ్రామ స్వరాజ్యం అంటే నా వుద్దేశంలో తన ముఖ్యావసరాలకు ప్రక్కవారిపై ఆధారపడకుండా పూర్తి స్వపరిపాలన. అందుచేత ప్రతీగ్రామం యొక్క ప్రధమ కర్తవ్యం తన ఆహారానికి కావలసిన పంటలు, గుడ్డకు కావలసిన ప్రత్తీ పండించు కోవడం. ప్రతీగ్రామానికి పశువులు తిరగడానికి, మెయ్యడానికి తగినంత స్థలం, పెద్దలు పిల్లలు విరామానికీ, ఆటకీ, తగినంత స్థలంవుండాలి. ఇంకా ఎక్కువ స్థలముంటే (గంజాయి, పుగాకు, నల్లమందు, వంటివిగాక) డబ్బుతెచ్చే పంటలు పండించొచ్చు. ఒక గ్రామ నాటక రంగస్థలం, స్కూలు. గ్రామచావడి ఆగ్రామం పోషించాలి. గ్రామస్థులకు పరిశుభ్రమైన నీరు సప్లయి చేయడానికి తన సొంత నీటి సప్లయిఏర్పాట్లు చేసుకోవాలి. దీనికి ప్రత్యేక సంరక్షణగల నూతులు, చెరువులు వుండాలి. ప్రాధమిక విద్య పూర్తి అయ్యేవరకు నిర్బంధ విద్యావిధానం వుంటుంది. వీలైనంతవరకు ప్రతీ ఉద్యమంకూడా సహకార పద్ధతుల ప్రకారం నడుస్తుంది. ఇప్పటిలాగ ఇంతో అంతో అస్పృశ్యతతో కూడిన వర్ణ విభేదం వుండదు. అహింసా, దానికి క్రియా రూపాలైన సత్యాగ్రహం, సహాయ నిరాకరణా, గ్రామ సమాజానికి సొంత హక్కులు, గ్రామం తయారు చేసిన పేర్ల పట్టీనుంచి ప్రతీవారు ఎప్పుడో ఒకప్పుడు గ్రామ రక్షకులుగా కొంతమంది తర్వాత కొంతమంది నియమింపబడుతుంటారు. కొన్ని నిర్ణీత అర్హతలుగలవార్ని ఐదుగురిని, ఏటేటా, గ్రామంలో మైనారిటీ దాటిన స్త్రీ పురుషులంతా కలిసి. ఎన్నుకుంటుంటారు; వీరు పంచాయితీ సభ్యులైన గ్రామ పరిపాలనా విషయాలన్నీ చూస్తుంటారు. వీరు న్యాయం చెప్పడంలోను, పరిపాలించడంలోను, పరిపూర్ణ హక్కులు కలిగియుంటారు. ఇప్పటి మాదిరిగా శిక్ష విధించే పద్దతులు వుండవు గనుక ఈ పంచాయితీ సభ్యులే తాముండే ఏడాదిపాటు శాసన కర్తలూ, న్యాయసభ్యులు, పరిపాలకులుగా వ్యవహరిస్తుంటారు. ఇతరుల ఆటంకాలు లేకుండా ఈరోజున ఏగ్రామమైనా యీ మాదిరి స్వపరి పాలనా విధానాన్ని అవలంబించవచ్చు.

నా ఉద్దేశం ఏమిటంటే గ్రామ పరిపాలనా విధానానికి ముఖ్య సూత్రాల్ని సూచించడం. ఈ పద్ధతిలో వ్యక్తి స్వాతంత్రం ప్రాధాన్యంగాగల పూర్తి స్వపరిపాలన ఏర్పడుతుంది. తన ప్రభుత్వాన్ని తానే నిర్ణయించే హక్కు ప్రతీ వ్యక్తికీ ఉంటుంది. అహింసా విధానం అతన్నీ, అతని ప్రభుత్వాన్నీ నడిపిస్తూ వుంటుంది.

అస్పృశ్యులు: యుగయుగాలుగా మనకు చుట్టుకున్న పాప విమోచనానికి మార్గం ఏమిటంటే - హరిజనులతో కలసి మెలసి వుండడం. వారి ఇళ్ళకువెళ్ళి, వారి బిడ్డలను నీ బిడ్డల మాదిరి ఆదరించాలి. వారి కష్టసుఖాలు తెలుసుకోవాలి. వారు కూడా మనమాదిరిగా పరిశుభ్రమైన గాలి, వెల్తురూ అనుభ విస్తున్నారా అని విచారించాలి.

"నన్ను ముట్టుకోకు" మన్న దృక్పధం, హిందూ మతానికొక కొయ్యగండ. ఇది మానసిక కాఠిన్యాన్ని వ్యక్త పరుస్తుంది. మనగుడ్డినమ్మకాన్ని వెల్లడి చేయడానికి మాత్రమే పనికొస్తుంది. ఇది మతతత్వానికీ, నైతిక జీవనానికీ కూడా జుగుప్సకరం.

హిందూదేశ జనాభాలో ఐదోవంతు ఐన అస్పృశ్యుల్ని దాస్యంలో వుంచేస్తూ వారి సర్వతో ముఖాభివృద్ధికి దోహదం కల్పించనంత వరకూ మనకు స్వరాజ్యం వచ్చిందనుకోవడం అర్థంలేని ప్రలాపం.



# సంక్షేమ విస్తరణ కార్యక్రమం



విశాఖపట్టణం జిల్లా బాల చెరుపు గ్రామంలో సంక్షేమ కేంద్రం స్థాపించినపుడు తీయబడిన చిత్రం. శ్రీమతి వి. ఎస్ కృష్ణ, ఎ. రుక్మిణమ్మ, కనక దుర్గమ్మ, డి. జానకీబాయి. దిగుమర్తి రామస్వామి గార్లను ఈ చిత్రంలో చూడవచ్చును.

రోడ్డుమీద ఉన్నది. ఆ గ్రామమును ఆనుకొని అయిదారు మైళ్ళ పరిధిలో ఇంచుమించు పన్నెండు గ్రామాలు ఉన్నవి. గ్రామంలో ప్రతినెల ఇంచుమించు నలుగురు పిల్లలు జన్మిస్తున్నారు. కూడేరు గ్రామస్త్రీలు ముఖ్యంగా పొలాలలో పనిచేసుకు జీవించే కష్టజీవులు. అందువలన వారిపిల్లలకు ఏ విధమైన సంరక్షణ లేక అల్లరి చిల్లరగా తిరుగుతు ఉంటారు. అనంతపురం జిల్లా సాంఘిక సంక్షేమ విస్తరణ కేంద్రమును స్థాపించటానికి నిశ్చయించారు.

ఆగష్టు 15, భారతదినోత్సవం నాడు ప్రజల ఆనందోత్సవాలతో కూడేరు గ్రామసంక్షేమ కేంద్రం తెరువబడింది. జిల్లా కలెక్టరు శ్రీ భగవాన్‌దాస్ సభకు అధ్యక్షత వహిస్తూ స్వయం సహాయాన్ని అలవర్చుకోవాలని, సంక్షేమ కార్యక్రమమువంటి అత్యుత్తమ కార్యమును తలపెట్టిన దానితో పూర్తిగ సహకరించ వలెననీ సలహాలిచ్చారు. జిల్లా మెడికలు ఆఫీసరు, జిల్లా ప్లానింగు అఫీసరు, శ్రీ పప్పూరి రామాచార్యులు, శ్రీ బి. రంగనాధము గారలుకూడ సాంఘిక సంక్షేమ కార్యక్రమ ఆవశ్యకతను గురించి ఉపన్యసించారు, గ్రామ పంచాయితీ అధ్యక్షులైన శ్రీ బి. వేణుగోపాలరావుగారు సభికులకు, అధ్యక్షులకు వందనములు తెలియజేస్తూ, ఆ కేంద్ర నిర్వహణకు అయే వ్యయంలో సగం తామే భరిస్తామనీ వాగ్దానం చేశారు.

కూడేరు కేంద్ర ప్రారంభోత్సవం నాడే ప్రణాళికానిర్వహణ సంఘసభ్యురాలు, డాక్టరు, శ్రీమతి నాయక్ రెండు ప్రసూతికేసులు, కళ్ళకలక, విషకురుపులు, మలేరియా మొదలైన చిల్లరరోగాలకు చికిత్స చేశారు. ప్రసూతి కేసులు చూచుటకై ఒక మంత్రసానిని, ఒక దాదిని ఆ కేంద్రంలో నియమించారు. అనంతపురం రెడ్‌క్రాసువారు ఒక మంచమును, శ్రీ జిల్లాకలెక్టరుగారు రెండుమంచములను ఆ కేంద్రానికి బహూకరించారు. రెడ్‌క్రాసు వారు ప్రసూతికి, ఇతర జబ్బులకు అవసరమయే ఇతర మందులను, పాలడబ్బాల పెట్టెను కూడ ఇచ్చారు, గ్రామ పంచాయతీ వాగ్దానం చేసిన విరాళమునుండి కొన్నిమందులు కొనవలసి వుంటుందని, గ్రామపంచాయితీ అధ్యక్షుడ్ని ఆదేశించారు.

స్వయంసహాయంలో పాఠం నేర్పుటకుగాను, ఆ గ్రామస్త్రీలు మరుగు దొడ్లిలేక బాధపడుచున్నామని చెప్పగా, తామే దానిని స్వయం కృషితో కట్టుకుంటే ఆ కొరత నివారణ అవుతుందని ప్రణాళికా సంఘం సలహా నిచ్చింది. ఆ సలహా ననుసరించి, సభకు హాజరయిన స్త్రీ సభ్యులు, ప్రభుత్వోద్యోగుల సహాయంతో మరుగుదొడ్డి ఏర్పర్చుకున్నారు. సేవాసమాజంవారు ఉచిత చీరెలను, పిల్లలకు బట్టలను పంచి పెట్టారు. ప్రజలలో ఉత్సాహం పట్టుదల ఉన్ననాడు, సంక్షేమ విస్తరణ ప్రణాళికలద్వారా జీవితము ఎంత జయప్రదంగా నిర్వహించు కోవచ్చునో, చూపుటకు కూడేరు గ్రామము చక్కని ఉదాహరణ.

సెప్టెంబరు 3 వ తేదీన కూడేరు గ్రామమును నిర్వహణ సంఘమువారు తిరిగి దర్శించినపుడు అక్కడిమంత్రసాని రెండు పురుళ్ళను పోసిందనీ, 27 మంది గర్భవతులకు, వారి ఆరోగ్యమును గురించి తగిన సలహాలనిస్తూందని విశదమవుతోంది. అనంతపురం రెడ్‌క్రాస్ సంఘం వారి సంచారదళం వారమున కొకసారి ఆ గ్రామమును

దర్శించి, మందులు, మల్టి విటమిన్ మాత్రలు, మొదలైనవి ప్రజలకు అందజేస్తుంది. గ్రామంలో ప్రతిదినం 30 మంది పిల్లలకు పాలిస్తున్నారు. నూనె, సబ్బు, షీకాయ, దువ్వెనలు మొదలైనవి శిశు సంరక్షణాలయమునకు ఇచ్చుటకు ప్రయత్నాలు సాగుతున్నవి

శ్రీమతి డాక్టర్ నాయక్ బలహీనులైన పిల్లలను, మలేరియాతో బాధపడుతున్న గర్భవతిని చూచి వారిరోగ ఉపశమనానికి కృషిచేసింది.

సెప్టెంబరు 15 వ తేదీన మారూరు గ్రామములో మరియొక ప్రసూతి, శిశు కేంద్రమును జిల్లాసంక్షేమ విస్తరణ సంఘంవారు స్థాపించారు. మారూరు, అనంతపురంనుండి బెంగుళూరు వెళ్ళేదారిలో అనంతపురానికి 15 మైళ్ళ దూరంలో ఉన్నది. మారూరు, శివారు గ్రామాల జనాభాతో కలసి మొత్తం 2634 మంది. ఇందులో చిన్న పిల్లలు 229 మంది. 12 మైళ్ళలోపల మందు కావాలన్న దొరకదు. అందువలన గ్రామపంచాయితీ దారులుకూడ తమబాధ్యతను గుర్తించి, కేంద్రానికి అయే ఖర్చులో సగం భరించటానికి పూనుకున్నారు. ఈ కేంద్రమునకు ప్రారంభోత్సవంచేస్తూ. జిల్లా కలెక్టరు శ్రీ భగవాన్‌దాస్ ఐ. ఎ. ఎస్ గారు సంక్షేమ కేంద్రాల వలన ప్రజలకు చేకూరే లాభాలను వివరిస్తూ. ప్రజలు అత్యంతోత్సాహంతో ఈ కార్యక్రమంలో పాల్గొన వలెనని హెచ్చించారు. శ్రీ ఎమ్. లక్ష్మనసప్ప, పప్పూరి రామాచార్యులు, డి. రామనాద్, శ్రీమతి నాయక, తదితరులు వివిధ అంశములను గురించి వివరించారు.

ఆ తేదీ నుండి ఆ కేంద్రములో ఒక మంత్రసాని, దాది పని చేస్తున్నారు. పరిసర గ్రామాలకు కూడ వెళ్ళి అక్కడ గర్భిణీ స్త్రీలకు వలసిన సలహాలను, ఆరోగ్య విధులను బోధపరుస్తూన్నారు, ఇతర ప్రజల ఆరోగ్య కార్యక్రమమును గురించి ఉద్బోధ చేస్తున్నారు.

జిల్లా రెడ్‌క్రాస్ సంస్థవారు కొన్ని మందులను, పాల డబ్బాలను, పాలపొడిని ఈ కేంద్రానికి విరాళంగా ఇచ్చారు, మరికొన్ని మందులుకూడ కొనబడినవి. జిల్లా కలెక్టరు రెండు పరుపులను, గ్రామ ప్రజలు రెండు మంచాలను పై కేంద్రానికి బహూకరించారు.

సెప్టెంబరు 29 తేదీన గుగుడు గ్రామంలో ప్రసూతి కేంద్రాన్ని, మాతాశిశు రక్షణాలయమును ఏర్పరుచుటకు సత్వర ఏర్పాట్లు సాగుతున్నవి.

<u>పశ్చిమ గోదావరి జిల్లా</u>: కాళ్ళకూరు గ్రామంలో 15-8-54 న స్థాపింప బడిన ప్రసూతి కేంద్రాన్ని గురించి ఇదివరలో తెలియజేశాము. సెప్టెంబరు 15 తేదీన రాయలం గ్రామంలో మరియొక ప్రసూతికేంద్రం స్థాపింప బడినది. ఆంధ్రరాష్ట్ర సాంఘిక సంక్షేమ సలహాసంస్థ అధ్యక్షురాలు శ్రీమతి చన్నఘంటమ్మగారు దీనికి ప్రారంభోత్సవం జరిపారు. ఈ గ్రామం భీమవరానికి మూడు మైళ్ళ దూరంలో ఉన్న క్షత్రియ గ్రామం. ఇచ్చటస్త్రీలు విద్యాభ్యాసమైనా లేకుండా, ఘోషా ఈనాటికి పాటిస్తూ, వెనుక పడివున్నారు. ఈ గ్రామవాస్తవ్యులు, చుట్టుపక్కల ఇతర గ్రామాలను చెందినవారు కూడ, ప్రసూతి సౌకర్యాలు ఏమి అవసరమైనా, ఎంత ప్రమాదస్థితిలోనైనా బండిమీద భీమవరం వెళ్ళవలసినదే. ఇతర మార్గములేదు, అందువలన రాయలంలో ఒక ప్రసూతికేంద్రం ఏర్పాటు చేయవలసిందని ప్రజలు కోరగా, పశ్చిమగోదావరి జిల్లా సంక్షేమ సంఘంవారు ఈ కేంద్రాన్ని స్థాపించారు. దీనికి గానువసతిగృహాన్ని ఇచ్చుటకుగ్రామస్థులుఅంగీకరించారు.



పశ్చిమ గోదావరి జిల్లా కాళ్ళకూరు గ్రామంలో ప్రసూతి కేంద్రం ప్రారంభోత్సవం జరిగినప్పటి చిత్రము. శ్రీ బి. ఎన్. జయసింహా, శ్రీమతి మూలుప్పూరి చుక్కమ్మ, రమూరాజ గోపాల్, పి. అనసూయ. డి. లక్ష్మి బాయమ్మ (కన్వీనరు) డి. సత్యవతమ్మ, ఎ. ఎస్. సెట్టి గార్లను ఈ చిత్రంలో వరుసగా చూడవచ్చును.

## సంక్షేమ విస్తరణ కార్యక్రమం

గాంధీ చౌకలో జరిగిన ఆనాటి సభకు శ్రీ దండు పెద రామ జోగిగారు అధ్యక్షత వహించారు. భీమవరం మహిళా సమాజ కార్యదర్శిని, శ్రీమతి రమాదేవి రాజ గోపాలన్ పతాకా విష్కరణ చేశారు.

శ్రీమతి చన్నమంటమ్మగారు ఉపన్యసిస్తూ, సంక్షేమ విస్తరణ ప్రణాళికా కార్య క్రమమును వివరించి, స్త్రీల యొక్క, పిల్లల యొక్క సంక్షేమానికై జరుగుతున్న ఈ కార్య క్రమాన్ని ప్రజలందరూ ప్రోత్సాహించాలనీ, ఆ ప్రాంతపు స్త్రీలే ముఖ్యంగా కదిలి ఈ కార్య క్రమమును దిగ్విజయంగా కొనసాగించాలని విజ్ఞప్తి చేశారు.

కేంద్ర నిర్వాహణకు విరాళాలను అభ్యర్థించగా, సభాధ్యక్షులు రు 116 లు శ్రీ పాలూరు కోదండరామయ్యగారు రు 50 లు, శ్రీ ఆలూరి పల్లం రాజుగారు (పంచాయతీ బోర్డు అధ్యక్షులు) రు25 లు ఈ విధముగా ఎవరికి తోచినది వారు విరాళాల నిచ్చారు. ★

---

## కుటీర పరిశ్రమల ఆశయం

శ్రీ లక్ష్మీనారాయణ సిన్హా, శాంతినికేతనం.

హిందూ దేశంలో ప్రతి వృత్తిలోను ఉన్న సున్నితమూ రక రకాలునైన చేతి పనులు మరేదేశంలోనూ ఉండవు. పాశ్చాత్త ప్రభుత్వం ఎంత నిర్లక్ష్యత చూపి, ఎంత నశింపు చేవామని ప్రయత్నించినా, పూర్తిగా నశించి పోకుండా, కుటీర పరిశ్రమలు ఎలాగో సాగుకొస్తున్నాయి అన్నది కొంత తృప్తికరమైన విషయం. ప్రస్తుత కేంద్ర ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాలు కూడ వీటిని సముద్ధరించాలని పూనుకోవడం చాల ఆశా జనకంగా ఉంది. గ్రామాభ్యుదయం, సంఘ క్షేమం మొదలైన కార్య క్రమాలలో, గ్రామ పరిశ్రమాభి వృద్ధికి మన ప్రథమ పంచవర్ష ప్రణాళిక, ప్రముఖస్థానాన్నిచ్చింది. కుటీర పరిశ్రమలకు సంబంధించిన ఏర్పాట్లు, విధానం, పరిశోధన, తర్ఫీదు, పెట్టుబడి, విక్రయం వగైరాల్నిగూర్చి ఆయా ప్రభుత్వ శాఖలు ప్రత్యేక శ్రద్ధ వహిస్తున్నాయి.

మన ముందు ఇలా ఆశాజనకమైన చిత్రాన్నుంచుకొని, జాగ్రత్తసుమండి అని హెచ్చరించడం వింతగా తోచవచ్చు. నా ఉద్దేశం— సంఘ సంక్షేమంలో కుటీర పరిశ్రమలకున్న స్థానం కేవలం ఆర్థిక విషయానికి సంబంధించింది మాత్రమే కాదని గృహ పరిశ్రమలు, కుటీర పరిశ్రమలుగాను, చిన్న పరిమాణాల్లోని పరిశ్రమలుగానూ ఎలా పరిమాణంచెందేయో ఎరుగుదుం గనక, కుటీర పరిశ్రమలను ప్రోత్సహించాలి అన్న ఉత్సాహంలో ఈ క్రింది హంశాల్ని గమనించకపోతే— నైతికంగా తప్పు చేసిన వారమౌతామని మనవి చేస్తున్నాను:—

**(I)** కుటీర పరిశ్రమల ప్రథమాశయం ఏమైయుండాలి అంటే గ్రామాలకు కావలసిన ముఖ్యావసరాల్ని తీర్చాలి అన్నదే. వీటిని వేరు పరచి, పోటీలు పెంచే పొదుపు అన్న వ్యామోహంనుంచి సంరక్షించాలి.

**(II)** కళాకారుడు తనకు అలవాటైన వాతావరణంలోనే ఉండి, కృషి చేసుకునేటట్లు చూడాలిగాని, కుత్రిమ కర్మాగార పరిస్థితుల్లోకి తేబడకూడదు.

**(III)** కళాకారుడియొక్క ఉత్పత్తిశక్తికీ సృష్టించే శక్తికీ కూడ ఏకరీతిగా దోహదం కల్పించేవిగానుండాలి— కుటీర పరిశ్రమలంటేను.

కుటీర పరిశ్రమల వస్తూత్పత్తిని హెచ్చరించడానికీ, నాణ్యాన్ని సమానాల్ని స్థిరపరచడానికీ, విక్రయ సౌకర్యాలు కల్పించడానికీ మీరు ఏ ఏ పద్ధతుల నవలంభించినా సరే— పైన ఉదాహరించిన హంశాలు గమనింపబడినంతవరకూ— మన కుటీర పరిశ్రమలు న్యాయ సమ్మతమైనవి, మోసంలేనివి, గౌరవ జీవితాన్ని నిలబెట్టేవిగాను ఉంటున్నంతవరకూ— ఒకరికొకరు అన్యాయం చేసుకోనటువంటివిగాను, కులంతో ప్రమేయం లేనటువంటివిగాను, చక్కటి సహకార సంస్థలు గాను ఉంటూ, ఏ భయమూ లోటూ లేకుండా వృద్ధిపొందేవిగాను ఉన్నంత వరకూ— నాకు ఏ విధమైనటువంటి అభ్యంతరమూ ఉండదు.

(సోషల్ వెల్ఫేర్ పత్రికనుండి)



# కమలా నెహ్రూ

శ్రీమతి కె. రామలక్ష్మి.

కమలా నెహ్రూ జీవితం పరిశీలిస్తే, గాలిలో పెట్టిన చిన్న దీప కళిక జ్ఞాపకం వస్తుంది. ఆ వింత శోభతో వెలిగే దీప కళిక గాలికి కదలాడుతుంది. స్తబ్ధతలో నిశ్చలంగా నిలుస్తుంది. కొద్ది క్షణాలు శక్తివంతంగా వెల్గుతుంది. ప్రమిదలో నూనెనుండి శక్తిని ఆస్వాదిస్తూ దాన్ని తక్షణమే కర్చుచేసేస్తూ కాలక్షేపం చేస్తుంది. దీప కళికకి విద్యుద్దీపానికుండే తళతళలు లేవు. హరికెను దీపపు సాధారణతా లేదు. అది ఏ బంధాలూ లేని స్వేచ్ఛా



జీవి. ఒకనాడు ఆ ప్రమిదలోని నూనె పూర్తిగా అయిపోతే ఏమవుతుంది? ఆ దీప కళిక రెపరెపలాడి కళ్ళు మూస్తుంది. ఈ ప్రపంచంలో అది తన జ్ఞాపక చిహ్నంగా విడిచే దేమిటి? సంతోషమనేదే లేని ముసురు రాత్రిలాంటి ఒక భావం. కమలా నెహ్రూ జీవితం కూడా యిలాగే నడిచింది. తొలినుండీ శరీరం అనారోగ్యంగా లేకపోయినా, కొన్నాళ్ళకే అనారోగ్య పూరితం అయింది, ఎక్కడనుంచి వచ్చేదో ఆ శక్తి ఆమెకు: కొద్ది రోజులపాటు గాలిలో రెపరెప లాడే దీప కళిక లాగే, బయలుదేరి తన శక్తికి మించిన పనులు చేసేసేది. ఆ క్షణంలో ఆమెలోని శక్తి దివ్య కాంతితో వెలిగేదన్నమాట. తిరిగి యథాప్రకారం అనారోగ్యమే. అలాగే తన జీవితాన్నంతా గడిపి కన్ను మూసింది కమలా నెహ్రూ.

కమలా నెహ్రూ జీవితాన్ని గురించి యిదమిద్ధంగా చెప్పడం కష్టం. కారణం, ఆమె పూర్ణాయుద్దాయంలో సగమేనా జీవించలేదు. ఆమెను గురించి ఎక్కువగా ఎక్కడా గ్రంథస్తం కాలేదు. దానికి కారణం, ఆమె జీవితంలో అతిముఖ్యమైన ఘట్టాలు అతి చైతన్యవంత మైన భాగం, మనదేశ చరిత్రలో ఆందోళనా పూరిత దశలో గడిచాయి. ఆరోజులలో ప్రపంచ దృష్టిని అరి కట్టిన మహాపురుషులు — మహాత్మాగాంధీ, మోతిలాల్ నెహ్రూ, జవ్హార్‌లాల్ నెహ్రూ, సి. ఆర్. దాస్ మొద లైన వాళ్ళు. ఆ ఆందోళనా పూరిత దినాలలో, కొంచం వ్యవధి కాని కొంచం శక్తిగాని కమల వంటి వారిని కనిపెట్టేటందుకు వినియోగించే అవకాశం లేకపోయింది. దీనివల్ల కల్గిన నష్టం మనదే. ఆరోజులలో మహిళలని ఉత్తేజ పరచి ముందుకు నడిపించిన ఒక ఉత్సాహాన్ని గురించి ఎక్కువగా తెలుసుకొనే అవకాశం మనకి లేకుండా పోయింది. ఆ ఉద్యమపు ఆత్మలో లీలమైన ఆమె వ్యక్తిత్వం ఆమెకే అంత ప్రాముఖ్యం వహించలేదు ఆ రోజులలో. కాని ఆమెని గురించిన చిన్న చిన్న విషయాలు— ఆమె శక్తి, ఆమె బలహీనతా— ఏవీ అందరికీ తెలియకుండానే వుండిపోయాయి. అవీ తెలిసి వుంటే అందరూ కమలా నెహ్రూను ప్రత్యేకించి అభిమ నించే అవకాశం కల్గేది. నెహ్రూ భార్యగా దేశంలో ఆమె పేరు చిరస్థాయిగానే వుంటుంది. కాని ఆమె చేసిన సేవ

ఆమె చైతన్యమూ తెలుసుకోలేక పోయాము మనం. కమలా నెహ్రూ వ్యక్తిత్వం గల ఒక మహిళ. అయినా కూడా యీరోజువరకూ ఆమె జవహర్ భార్యగానే మనం దరికీ జ్ఞాపకం వుంటుంది. అంత మాత్రం చేత ఆమె కించ పడిందనికాదు నా భావం. నెహ్రూకి భార్యగానూ అతని వుద్దేశాలే తన వుద్దేశాలుగాను కమల జీవించలేదు. అనేక విషయాలమీద ఆమెకు ప్రత్యేకాభిప్రాయాలుండేవి. కాని ప్రతి విషయాల ఫండమెంటల్సులోనూ వారు ఏకీభవించే వారు. ఎదుటి వారిని యిట్టే సమ్మోహన పరిచే వ్యక్తిత్వం గల నెహ్రూని కమల గెలిచింది, ఎందుకంటే, అతని ప్రేమనేగాకుండా, అతని గౌరవానికికూడా పాత్రురాల యింది. తమ కుమార్తె ఇందిరకి లేఖ వ్రాస్తూ, నెహ్రూ "నిజంగా నువ్వు అదృష్టవంతురాలివి. అలాంటి ధైర్య స్థైర్యాలుగల మహిళ నీ తల్లి. నీకేమాత్రం సందేహం వచ్చినా, కష్టాలొచ్చినా ఆమెను మించిన స్నేహితురాలు దొరకదు." ఏ భార్య మట్టుకు యింతకంటె ఎక్కువ కోరుతుంది? ఇందులో ఎంత గౌరవం, ఎంత ఆత్మ విశ్వాసం, ఎంత ప్రేమ యిమిడి వున్నాయి!

కమలా నెహ్రూ జీవితాన్ని గురించి మనం తెలుసు కోవడం మొదలు పెట్టిన దగ్గరనుంచీ ఆమె అనారోగ్య విషయమే ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. దీనిని బట్టి ఆమె నాజూకుగా బలహీనంగా వుంటుందని ఊహించుకోవచ్చు. కాని నిజం అదికాదు. నెహ్రూకి పెండ్లి కూతుర్ని చూచే సందర్భంలోనే అతని తండ్రి మోతీలాల్, తన కోడలు ఆరోగ్యవంతురాలూ, పుష్టివంతురాలూ అయి వుండాలని చూశాడు. కారణం నెహ్రూతల్లి ఎప్పుడూ అనారోగ్యంగా వుండేదట. తన కొడుక్కి కూడా అలాంటి భార్య రాకూడదని మోతీలాల్ ఉద్దేశం. కాశ్మీరు ఉత్తమ వంశంలో జన్మించిన కమల పదహారవ యేట, అందరు యువతుల లాగే చాలా ఆరోగ్యంగా వుండేది.

అన్ని విషయాలలోనూ పాశ్చాత్య పోకడలు అనుస రించినా నెహ్రూ వివాహం హిందూ సాంప్రదాయ సిద్ధం గానే జరిగింది. తలి దండ్రులు చూసిన కన్యని కాదనే అవకాశం నెహ్రూకి కలగలేదు. కారణం: ఆ సమ యంలో మనదేశ చరిత్ర ఒక ప్రముఖ ఘట్టాన ప్రవేశి స్తోంది. నెహ్రూ తలమునకలుగా రాజకీయాలలో వుండి వివాహం పట్ల అంత శ్రద్ధా, ఆశక్తీ చూపలేదేమో అని పిస్తుంది. అతనికి తెలియకుండానే దేశ పరిస్థితులు అతన్ని పూర్తిగా స్వాధీనం చేసుకుంటున్నాయి. భార్య పట్ల విముఖుడు కాకపోయినా వారిద్దరికీ మధ్య అతని రాజకీయ జీవితం అడ్డు వస్తూనేవుంది. ఒకరి నొకరు ఎప్పుడూ అర్థం చేసుకుందుకి ప్రయత్నించలేదు. సరికదా యిద్దరికీ ముక్కోపం: ఒకరితో ఒకరు మాట్లాడుకోడం నిప్పు రాజేయడంలా వుండేది. జీవితారంభంలోని యీ భేదా లన్నీ తరువాత జీవితంలో వారి మధ్య సన్నిహిత్వాన్ని పెంపొందచేశాయి.

కానీ దురదృష్టవశాత్తూ వివాహమైన కొద్ది సంవత్స రాలలోనే కమల ఆరోగ్యం చెడింది. ఇదే సమయం నెహ్రూ జీవితంలో కూడా ప్రముఖమైనది. జైలు కట కటాలలో లేకుండా వుంటే అతను రాత్రింబవళ్ళు రాజకీ యాలలో సతమతమయేవాడు. ఇలా వున్న యీ సమ యంలోనే వీరిద్దరి మధ్యా సన్నిహితత్వం పెంపొందింది. దీనికి కారణం శక్తి వున్నంతవరకూ కమల కూడా దేశ ఉద్యమాలకి చేయూతనిచ్చేది. నేషనల్ సంరంభాలన్నిటా తన శక్తిహీనతని అవతలనెట్టి, వాటిలో ఆ క్షణాన ఐక్యమయ్యేది. ఒక విధమైన వింత ఉద్రేకంతో కమల సమస్యల్ని పరిష్కరించేది. జీవితం పొడుగునా వ్యాపిత మైన సమస్యలనీ, సరదాలనీ కొన్ని ఘడియలలోనే యిమడ్చాలనే ఉద్రేకం ఆవిడ చేతలలో గోచరించేది. ఎంతో కాలం బ్రతకననేది తెలిసినట్లే ఎప్పుడూ ప్రవర్తిం చేది. జీవిత ఘడియలు పరిపూర్తి అవుతున్నకొద్దీ ఆవిడలో ఉద్రేకం హెచ్చేది; దానిలో, శారీరకంగా ఎంత వరకూ శ్రమని ఓర్చుకలదో అంతదాకా ఆమె శ్రమించేది. ఆవిడ ఆదర్శ సూత్రం "చేయగలిగిన శక్తి వున్నప్పుడే చేయ గలిగినంతా చేయి" అన్నట్లు వుండేది. దేశం మొత్తంమీద జాతీయోద్యమం ప్రజలందరినీ ఆకర్షి స్తోంది. ఆ జాతీయోద్యమంలో పురుషుల దుస్తులు ధరించి కమల సత్యాగ్రహోద్యమానికి యువతులను వాలంటీర్లుగా తరిఫీదు చేసేది. ఎక్కడెక్కడ పని ఎక్కువ కష్టమో అక్కడంతా తానేవుంటూ, స్త్రీలని ఉత్తేజపరుస్తూ, సహా యంచేస్తూ, తనని తనే మరచిపోయిన కమలను చూసి, ఆమెలో అణిగివున్న శక్తికి నెహ్రూ ఆశ్చర్య పడేవాడు. తను వెచ్చిస్తున్న శక్తి తన జీవిత ఘడియల ప్రమాణాన్నే తగ్గించేస్తోందని తెలుసుకొన్నా కమల లెఖ చేసేది కాదేమో? నెహ్రూకి కమల మీద ఎక్కువ కోపం రావ డానికి కారణాలలో యిదొకటి — ఆరోగ్య విషయంలో

కమల శ్రద్ధ చేయకపోవడం. ఈ విషయంలోనే ఆమెని చూసి విసుక్కునేవాడు. అతనికి ఒకటే భయం: తను యింతగా ప్రేమిస్తున్న యీ స్త్రీని కోల్పోవలసిన సమయం వస్తుందేమోనని. యౌవనంలో ఒకరి నొకరు బాగా అర్థం చేసుకోకపోయినా వయస్సులో ఒకరి నొకరు బాగా అర్థం చేసుకొన్నారు. కమల, తన అతి బలహీన మైన ఆరోగ్యంతోటీ, పనిలో ఏకాగ్రతతోటీ, నెహ్రూకి అమూల్యం అయింది. తన కుటుంబ విషయంలో తన సంసార విషయంలో, తన జీవిత లక్ష్యం విషయంలో అతి అదృష్టవంతుడైన నెహ్రూ- తన భార్య విషయంలో ఎంతో మానసిక ఆరాటన పడేవాడు. తనని గురించి ఆమెకి ఎంతో చెప్పవలసింది వుండిపోయింది. తను తొలి రోజులలో కోల్పోయిన అమూల్యమైన సన్నిహితత్వం, తరువాత కాలంలో దానికోసం, తను పడ్డ మానసికారాటం, ఎన్నో చెప్పవలసినవి వున్నాయి. చేయగల్గినంత చేశాడు- కాని చెప్పవలసింది చెప్పేందుకు ఎక్కువ అవకాశం లేకుండానే కమలా నెహ్రూ యిహలోక యాత్ర చాలించింది.

శ్రీమతి కమల ఆరోగ్యం చెడి శానిటోరియంలో వున్నప్పుడు నెహ్రూ జైలులో వున్నాడు. కలిసివుండే అవకాశాలు చాలా తక్కువ. అలాంటి అవకాశం ఎప్పుడు దొరికినా కలిసి వుండేందుకు ప్రయత్నించారు. అమూల్యమైన కలయికలు గాఢాంధ కారంలో వెలుగుచుక్కలలా వుండే. ఒకరి నుండి యింకొకరు శక్తినీ, ధైర్యాన్నీ అందుకునేవారు. 1920 లో తొలిసారిగా చాలా కాలం కలిసివుండే అవకాశం కల్గింది. ఆరోజులలో శ్రీమతి కమలా నెహ్రూ వైద్యసలహా అందుకొంటూ విశ్రాంతి తీసుకొనేది. స్విజర్లెండులో ఎక్కువకాలం గడిపినా, పారిస్, బెర్లిన్, మాస్కోలు కూడా తిరిగి చూశారు. డిసెంబరు 1927 లో మాతృదేశానికి తిరిగి వచ్చినప్పుడు కమల చాలా మట్టుకు కోలు కొంది.

జవ్వార్‌లాల్‌కి ఆరాధకులకి లోటులేదు. అతని కుటుంబంలోనే తలి దండ్రులు అతి ముద్దు చేసేవారు. అక్క చెల్లెళ్ళ అభిమానానికీ ఆరాధనకీ అంతేలేదు. కాని కమల మట్టుకు ఎప్పుడూ గుడ్డిగా అతన్ని ఆరాధించలేదు. అతన్ని చూసి గర్వపడేది. అతడు చేసిన యే ఘనకార్యమైనా ఆమెకి అతి సహజంగా తోచేది. జవ్వార్లాల్ అంతకంటె తక్కువగాగాని. సామాన్యంగాగాని ఎలా చేస్తాడు- అని ఆమె వుద్దేశం. అంటే అతని లోటుపాటులు అంతగా మథించకల్గింది ఆమె. అందుకే, అతను ఏంచేసినా, దానిలో ఆమెకి వింతగాని ఆశ్చర్యంగాని గోచరించేది కాదు. సన్మాన పత్రాలలో నెహ్రూను పొగుడుతూ "Jewel of India" అనీ Embodiment of Sacrifice" అని అంటూంటే యింటి దగ్గర కమల అతన్ని ఆమాటలతోనే వేళాకోళం చేస్తూండేదట.

కమల చాలా విషయాలలో ఫెమినిస్టు. స్త్రీకి వ్యక్తిత్వం లేదు. ఆమె అసంపూర్ణ, అసహాయ, అంటే వప్పుకొనేదికాదు. అయినా కమల తత్వంలో విరుద్ధ సిద్ధాంతాల కలయిక కన్పిస్తుంది. 1931 లో తనని జైలుకి పంపిస్తుంటే, తన భర్త అడుగు జాడలని తనూ అనుసరిస్తున్నందుకు సంతోషంగా వుందని అన్నదట. ఈ మాటలు విని "ఆమాటల పూర్తి భావం ముందుగానే గోచరిస్తే కమల ఫెమినిస్టు తత్వం అలా అననిచ్చేది కాద'ని పండిట్ నెహ్రూ అన్నాడట. ఇంకోసారి భర్తతో పాటు హైదరాబాదు వచ్చి శ్రీమతి నెహ్రూ పరదాస్త్రీల సభలో ప్రసంగించింది. ఆ స్త్రీలని యీమె ఉపన్యాసం ఎంతగా ఉత్తేజపరిచిందో చెప్పలేముగాని, కమలా నెహ్రూ మాట్లాడిన తరువాత తమ భార్యల దృక్పథం చాలా మారిపోతూందని చాలా మంది భర్తలు ఫిర్యాదు చేశారట!

ఆమెలో స్వాతంత్ర్యేచ్ఛ ఎక్కువ. తన శారీరక దౌర్బల్యాన్ని మానసిక శక్తితో గెలుస్తూ కాలం గడిపింది. శరీరం ముందుకు నడవనంటున్నా ఆమె ఆత్మబలం ముందుకు నెట్టేది. ఇదే, ఆమె ఆరోగ్యం తిరిగి చెడిపోడానికి ముఖ్య కారణం. తను పాల్గొన్న ఉద్యమం చూసి గర్వపడేది; దానిలో తన భర్త పాత్రకి తాను గర్వపడేది; తనలో శక్తివున్నంతవరకూ అతని ప్రక్క నిలుపగల్గినందుకు గర్వపడేది. ఆమె ఆరోగ్య విషయం అందరినీ ఆందోళన పరుస్తున్నప్పుడు, పెరోల్ మీద నెహ్రూని విడుద్దామనుకొంటున్న సందర్భంలో నెహ్రూని జైలు అధికారులు కమలను చూడ్డం కోసం, తీసుకువచ్చారు. జ్వరపీడితమైన తన ముఖాన్ని పైకెత్తి, కృశించిన తన చేతిలోకి అతని చేయి తీసుకొంటూ, "మీరు పెరోల్ మీద రావడం ఏమిటి? అలా చెయ్యవద్దు" అందిట. ఆమె స్వాభిమానం అటువంటిది. ఒక ఆదర్శం కోసం, తన సుఖాన్నీ కోరికలనీ, చిరునవ్వు నవ్వుతూ

బలిపెట్టకలిగిన శక్తివుంది ఆమెకి. లేకుంటే, జబ్బుతో జీవితపుతుది ఘట్టంలో ఉన్నప్పుడు ఏ స్త్రీ తన భర్త సామీప్యాన్ని కోరదు? కోరి వదులుకోకలదు?

కమలా నెహ్రూ ప్రసక్తి వచ్చినప్పుడు ఇందిర సంగతి రాకతప్పదు. ఇందిర జీవితం ఎంత మంది మధ్యనున్నా ఏకాంతంగానే గడిచింది. తలి తండ్రులకి దూరంగా కాలం గడిపినా వారే ఆమెకి అతిసన్నిహితులు. 1931లో జైలునుండి ఇందిరకి ఉత్తరం వ్రాస్తూ, నెహ్రూ "ఒంటరిగా నీకేం తోచడం లేదుకదూ! పదిహేను రోజులకి ఒకసారి నన్ను అమ్మనీ చూడవచ్చు. మా మాటలు ఒకరివి ఒకరికి చెప్తూవుండువు గాని" అని వ్రాస్తాడు. ఇందిర జీవితంలో ప్రస్ఫుటంగా కన్పించేది యిదే: వారిద్దరిమధ్య సందేశాలు తీసుకొని పోవడమే. ఇంకొకసారి వ్రాస్తూ "మలక్కా గోల్‌లో అమ్మా, నైనిటల్ జైల్లో నేనూ' అక్కడ ఆనందభవన్‌లో నువ్వూ ముగ్గురం ముగ్గురినీ పొకొట్టు కొన్నట్లువుంది. అవునా?" అంటాడు. తన చుట్టూ ఆప్యాయిత కురిపించే బంధు కోటివున్నా తన జీవితానికి అతిసన్నిహితులైన తల్లి తండ్రులను గురించి ఏకాంతంలో దీర్ఘాలోచనలో మునిగి పోయేదేమో ఇందిర.

1934 లో శ్రీమతి నెహ్రూ ఆరోగ్యం తిరిగి దిగజారడం మొదలైంది. నెహ్రూని తాత్కాలికంగా విడుదల చేశారు. కాని, పదకొండు రోజుల తరువాత తిరిగి అతను జైలుకు వెళ్ళిపోయాడు. కమల, కూతురు ఇందిరతో యూరపు వైద్యచికిత్సకోసం వెళ్ళింది. కాని, 1939 లో చనిపోయింది. ఆమె మృతికి కొన్నినెలల ముందే నెహ్రూను విడుదల చేశారు. కమల చనిపోయింది. కాని యీ ప్రపంచంలో శాశ్వతంగా ఏకాంత జీవుల్ని ఇద్దరిని వదిలి మరీ చనిపోయింది: అంత పని ఒత్తిడి మధ్యాకూడా ఏదో వెలితిగా బాధపడే వ్యక్తి నెహ్రూని - తల్లి ఎక్కువగా ఆదరించవలసిన కాలంలో ఆమెని కోల్పోయిన ఇందిరని.

కమలా నెహ్రూ జీవితాన్ని గురించి తెలుసుకోడానికి ఆమె భర్త రచనలే ఆధారం. వాటిలోకూడా ఎక్కువగా వ్యక్తిగత జీవిత విశేషాలు దొరకవు. దానికి కారణం, యిద్దరూకూడా, వ్యక్తిత్వాలని మరచి, దేశంకోసం పాటు పడ్డవాళ్ళే. కాని అతనెంత ప్రయత్నించినా, కట్టువడని మనోభావాలు, అతని కట్టుబాట్లను తెంచుకొని బైటపడ్డాయి కొన్ని సందర్భాలలో. ఆ సందర్భాలలో ఒకటి అతని జీవిత చరిత్ర అంకితం. అతని 'జీవిత చరిత్ర'ని (Autobiography) అంకితం చేస్తూ, To Kamala, who is no more" అంటాడు. ఆ ఒక్క వాక్యం చాలు: ఆమె ఎడల అతనికి వున్న ప్రేమా వాత్సల్యం విశదమవడానికి; ఆమె అతనిని ఎంతగా ఉత్తేజపరిచిందో తెలుసుకోడానికి.

కమలా నెహ్రూ జీవిత చరిత్ర, గాలిలో (అందులోనూ పెనుగాలిలో) తన శక్తి వంచన లేకుండా నిల్చికొనిన దీపకళిక జీవితచరిత్రని స్ఫురింపచేస్తుంది. "ఈ శరీరానికి ఆరోగ్యం లేకపోతేనేం? ఆత్మ బలం వుంటే ఏమైన చేయొచ్చు" అన్న తత్వం కమల నిరూపించింది. అదే ఆత్మ విశ్వాసాన్ని అందరు వనితలూ అలవరచుకొంటే, దేశం అంతా మొక్కవోని ధైర్యస్థైర్యాలు పెనవేసు కొంటాయి అనుకోడం సత్యదూరం కాదు.



## కృతజ్ఞత

శ్రీ. వి. శ్రీనివాసంగారు ఆంధ్ర మహిళా సభ నిర్మలాదేవి గ్రంథాలయమునకు కొన్ని పుస్తకములు విరాళముగా నిచ్చిరి. వారికి మా కృతజ్ఞత.

కా ర్య ద ర్శి ను లు.

# శ్రీ కస్తూరిదేవి పారిశ్రామిక విద్యాలయము

## నెల్లూరు.

కార్యవర్గము :—అధ్యక్షులు : శ్రీ పొణకా కనకమ్మ గారు ; కార్యదర్శులు : శ్రీ డి. లక్ష్మీబాయమ్మగారు, శ్రీ డాక్టరు (Mrs) మాథ్యూస్ ; కార్యవర్గము : శ్రీ బెజవాడ లక్ష్మీకాంతమ్మగారు, శ్రీ రేబాల సుజాతమ్మగారు, శ్రీ డాక్టర్ ఎస్. లక్ష్మిగారు, శ్రీ పోకూరి రాఘవమ్మగారు, శ్రీ పైడా సుశీలమ్మగారు, శ్రీ మేరి జ్ఞానయ్యనాయుడు గారు, శ్రీ సి. వి. లక్ష్మి రెడ్డిగారు, శ్రీ మ. హేమ లతగారు, శ్రీ పి. వసుంధరగారు.

ప్రణాళిక:—దేశాభ్యుదయమునకు, జాతీయోన్నతికి విద్యతోపాటు కళలు, పరిశ్రమలు అత్యంత ప్రధానములు. కళాకలితములు, పారిశ్రామిక సంపన్నములునైన విద్యావిజ్ఞానములు తేజస్వంతములై విరాజిల్లగలవు. దేశము సర్వశక్తిసంపన్నమై, జాతి సర్వతో ముఖాభ్యుదయముతో పెంపొందుటకు సామాన్య ప్రజానీకానికి అన్నవస్త్రాలు చేకూర్చగల స్వయంపోషకమైన విద్యావిధానము, విజ్ఞానసంపత్తి నేడు విధిగా కావలసియున్నది. కేవలము కాలేజీ, హైస్కూలు విద్యావిధానములు మాత్రమేగాక, స్త్రీలకు అత్యావశ్యకములైన గృహపరిశ్రమలు, లలితకళలు నేర్పుకొల్పుట ముఖ్యముగా మా ఉద్దేశ్యములలో నొకటి. ఈ ఆశయముతో శ్రీ కస్తూరిదేవి పారిశ్రామిక విద్యాలయము స్థాపించినాము.



శ్రీమతి పొణకా కనకమ్మగారు

ఈ పారిశ్రామిక సంస్థ ముఖ్యముగా వయోజనులైన యువతుల కొరకు ఉద్దేశింపబడియున్నది. ఆయా కళల యందు అభిరుచిగల యువతులకందరకును ఇందు ప్రవేశముకలదు. మరియును అనేక కారణాలచే ఆర్థిక దుస్థితికిలోనై జీవనోపాధికి ఆర్జించుకోవలసియున్న యువతులకును, స్కూలు ఫైనలు వరకైనను చదువులు కొనసాగించుకొనలేని విద్యార్థినులకును, ఇది అత్యంత ప్రయోజనకారి కాగలదు. స్వయంశక్తి మీద ఆధారపడిగౌరవంగా జీవయాత్ర గడుపుకొనగలశక్తిసామర్థ్యాలు అలవడి బ్రతుకు తెరువు కల్పింపగలదు.

ఈ విద్యాలయములో ప్రభుత్వ పారిశ్రామిక శాఖ వారి ఆమోదముతో వారి నియమావళి, విధానాలు ఆధారంగా బోధనగరపబడుతూ గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ ఈయబడును. కృతార్థులకు గవర్నమెంటు సర్టిఫికెట్లు లభింపగలవు. ఈ ట్రైనింగులో ఉత్తీర్ణులైనవారు ఆయా పాఠశాలలలో ఉద్యోగార్హులగుటయే గాక స్వయంశక్తిసమన్వితులు, స్వతంత్ర సంపాదనాపరులు కాగలరు. పరీక్షలకు పోయేవారినేగాక వర్కర్లను కూడా తయారు చేయగలము. ఇతరశాఖలు, లలితకళలు క్రమేపి ప్రారంభింపబడును.

ఆంధ్ర యూనివర్సిటీ ప్రొఫెసర్లు శ్రీయుత బి. గోపాలరెడ్డిగారి అధ్వర్యమున, విద్యామంత్రి శ్రీ డాక్టరు

# శ్రీ కస్తూరిదేవి పారిశ్రామిక విద్యాలయము

ఎం. వి. కృష్ణరావుగారు ప్రారంభకులుగా శ్రీకస్తూరిదేవి విద్యాలయ సంస్థాపకులు శ్రీ పొణకా కనకమ్మగారిచే, ఈ ఇండస్ట్రియల్ స్కూలు 16-8-1952 తేది స్థాపింపబడి, ఆ సంవత్సరమే ప్రభుత్వమువారిచే రికగ్నయిజు కాబడినది. ఇది ప్రత్యేకం స్త్రీల కమిటీచే నిర్వహింపబడుచున్నది. ఇది చిరకాలాశయము.

ఇందు గత 2 సం॥ నుండి వయోజనులైన యువతులు సుమారు 150 మంది చదివినారు. ఈ సంవత్సరము 80 మంది చదువుచున్నారు. పరీక్షలకు హాజరైనవారిలో 80% కృతార్థులైనారు.

మేము ఇక్కడ ఉత్పత్తి కేంద్రముకూడా నెలకొల్పినాము. స్త్రీలకు, పిల్లలకు వారివారి అభిరుచులకు తగిన రకరకాల కలంకారీ అద్దకాలు, ఎంబ్రాయిడరీకుట్లు క్రొత్త క్రొత్త ఫ్యాషన్సుతో ముచ్చటగా నాణ్యంగా అన్నిరకాల ఉడుపులు తయారుచేసి సప్లయిచేయగలము. లాభం స్కూలుకే చెందుతుంది.

ప్రతి పరిశ్రమలోను సుశిక్షితులైన సమర్థులగు ఉపాధ్యాయినులచే గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ ఈయబడును. గవర్నమెంటు పరీక్షలకు హాజరగు విద్యార్థినులకు కనీస విద్యార్హత కుట్టుశాఖకు 5 వ తరగతి. అద్దకంశాఖకు 3 వఫారము. పరీక్షలకు హాజరుగాకుండా పనులుమాత్రమే నేర్చుకొనువారికి యీ నియమము అవసరములేదు.

ఆయా శాఖల ననుసరించి ఒకటి, రెండు సంవత్సరములు ఈ శిక్షణ (ట్రైనింగు కోర్సు) ఉండును. జీతములు నెలకు మొదటి సంవత్సరం రు 2/- రెండవ సంవత్సరం రు 3/లు చొప్పున విద్యార్థినులవద్ద వసూలు చేయబడును. బీద పిల్లలైనచో శిక్షణ ఉచితము,

పొరుగూళ్లనుండి వచ్చు విద్యార్థినుల సౌకర్యార్థము ఈ ఇండస్ట్రియలు స్కూలు పక్షమున ప్రత్యేకముగ వేరే హాస్టలుగూడ నడుపబడుచున్నది. సదరు హాస్టలు ఛార్జీలు నెలకు రు 18/-లు మాత్రమే.

శ్రీ కస్తూరిదేవి పారిశ్రామిక విద్యాలయము అచిర కాలములోనే ఇట్టి అభివృద్ధితో వర్థిల్లుతున్నదని తెల్పుటకు మిక్కిలి సంతోషిస్తున్నాము. ఇందుకు సర్వవిధాల తోడ్పడిన అభిమానులందరకు మా కృతజ్ఞతాపూర్వక ధన్యవాదములు.

ఇంకను ఎంతో కృషికావలసియున్నది. ఉదార హృదయులు సర్వదా మాకు ఇతోధిక ప్రోత్సాహముతో చేయూత నివ్వగలరని అభ్యర్థిస్తున్నాము.

భారత ఆర్థిక మంత్రి శ్రీ చింతామణి దేశ్‌ముఖ్, కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ అధ్యక్షురాలు శ్రీమతి దుర్గాబాయిగార్ల ఆంధ్రదేశ పర్యటనములో, 20-6-54 తేది ఇండస్ట్రియల్ టీచర్సు ట్రైనింగు కోర్సుకున్ను, నేత శాఖకున్ను శ్రీ దేశ్‌ముఖ్ దంపతులచే ప్రారంభోత్సవము గావింపబడినది. మాకృషికి కేంద్ర సంక్షేమ బోర్డువారు ఈసంస్థకు రు. 15వేలు సాలీనాగ్రాంటుమంజూరు చేసిరని తెల్పుటకు ఆనందిస్తున్నాము: స్టేటు గవర్నమెంటు గ్రాంట్లు ఇంకను రాలేదు. ఇదిగాక ఉదారంగా స్థానిక, జిల్లా ప్రముఖులనుండియు. నృత్య, నాటక సమాజాలూ సినిమా నటీనటుల ఉచిత ప్రదర్శనాల మూలంగాను సుమారు 20 వేలు విరాళాలు లభించినవి.

ఇందు ప్రస్తుతమున్న శాఖలు :-

1. కుట్టుశాఖ : కత్తిరింపులు, కుట్టు, ఎంబ్రాయిడరి, ఉడుపులు తయారుచేయుట, చమ్కీ జరీకుట్టుపనులు, మేజోళ్లు, బనియన్లు, ఊలు, లేసు అల్లికలు. (2సం॥శిక్షణ)

2. అద్దకంశాఖ : వస్త్రములపై వివిధరకాల అద్దకాలు. ప్రింటింగులు, బ్లీచింగు సహా శాస్త్రయుక్తంగా, [సైంటిఫిక్.] (1 సం॥ కోర్సు.)

3. నేతశాఖ : వివిధరకాల డిజైన్లలో చక్కని జరీ సాదా 60, 80, 100 నెం. చీరలు, జంఖానాలు, దుప్పట్లు, తువాళ్లు మరియు నవారు నేత ; - (1 సం॥కోర్సు)

4. ఇండస్ట్రియల్ టీచర్సు ట్రైనింగు కోర్సు: కుట్టు శాఖలో ఉత్తీర్ణులైన విద్యార్థినులకు టీచర్సు ట్రైనింగు: (1 సం॥ ట్రైనింగు)

5. తదితరములు : పేముపని, ఫ్రెట్‌వర్కు, చేతి సంచులూ, మనీపర్సులు, నవారునేత, నేత, బుక్‌బైండింగు, చాపలు, అల్లిక వగైరా చేతిపనులు.

మిగిలిన శాఖలన్నియు క్రమేణా ప్రవేశపెట్టబడును.

6. హైస్కూలు : శ్రీ కస్తూరిదేవి విద్యాలయము గరల్సు హైస్కూల్ స్థాపించి 9 సం. అయినది. 1 ఫారం మొదలు స్కూలుఫైనలువరకు ఉన్నది. సుమారు నాలుగువందలు విద్యార్థినులు చదువుచున్నారు. హాస్టలులో ఏబదిమందికలరు. ఇందు కాలేజి విద్యార్థినులకుకూడ వసతి ఈయబడుచున్నది.

ఈ హైస్కూలులో సంస్కృతము హిందీకూడ ప్రత్యేకముగా బోధింపబడుచున్నది. అసలు మాతృసంస్థ అయిన శ్రీ కస్తూరిదేవి విద్యాలయము 30 సం. క్రితము తొలుత జాతీయవిద్యాపీఠముగ స్థాపింపబడి పూజ్యబాపూజీ మన్ననలు పొందినది.

# పిచ్చి పట్టు

## (జర్మను ఏకాంకిక)

రచయిత : రోడరిక్ బెన్‌టిక్స్.    అనువాదం : డాక్టర్ వి. ఎస్. శర్మ.

ఈ ప్రహసనాన్ని చిత్రించిన రోడెరిక్ బెన్‌డిక్స్ (Roderick Benedix), 1811 సం॥లో జనించాడు. వ్యంగ్యోక్తిక ప్రహసనాలను రాయటంలో ఈయనదే జర్మను నాటక సాహిత్యంలో సిద్ధహస్తం. కళోపాసకుడు. తాను రాసిన నాటికలలోని ముఖ్య పాత్రలను తానే ధరించి ప్రజాలోకాన్ని ఆనందింపజేసేవాడు. ఈయన రాసిన నాటికలను లెక్కబెట్టదలచుకొంటే నూటికి పైగానే వున్నాయి.

సామాన్యంగా జర్మను రచయితలు హాస్యానికి తమ రచనల్లో అంత ప్రధాన స్థానాన్ని యియ్యరు. వారి రచనలు విషాదపరిస్థితులను చిత్రించటానికే పూనుకొంటాయి. కాని బెన్‌డిక్స్ తన వ్యంగ్యోక్తిక రచనలద్వారా జర్మను సాహిత్యంలో నూతన పంథాల ననుసరించి తరువాత రచయితలకు ఆచార్య పదవి నలంకరించాడు.

జర్మను జాతికి సహనం ఎక్కువ. ఎట్టి విషాద ఘట్టాలనూ ఈ సహనంతోనే ఎదుర్కొని తమ అనాది సాంప్రదాయాలను శాశ్వతంగా నిలువబెట్టుకొంటుంది. పెద్దలపైని భక్తి విశ్వాసాలు జర్మనులకెక్కువ. బహునాయకత్వం వాళ్ళ కేమాత్రం రుచించదు. పెద్దలకు అనుభవమెంతో వుంటుంది. వారేసలహా యిచ్చిన అదంతా మన పురోభివృద్ధి కోసరమే. వాళ్ళ ఆజ్ఞలను ఏ అడ్డు ప్రశ్నలనూ వేయక మక్కికి మక్కిగా వాటి ననుసరించటం వీళ్ళకు పెట్టినదే పేరు. జర్మను రచనలు యీ పంథాలోనే నడుస్తాయి. ఆకాలపు జర్మను సాహిత్యానికి చక్రవర్తి గొథే (Goethe) మహాకవి. బెన్‌డిక్సూ ఆయన మార్గాన్నే అనుసరించాడు, బెన్‌డిక్సూ ఆయన తరువాతి కవి కుమారులూ— "జీవిత యాత్రలో ఎన్ని విషాద ఘట్టాలున్నా వాటి నావలకు త్రోచిపైచి అందలి ఆనందావస్థల్నే చూచుతూ వచ్చిన మన పురోభివృద్ధి చక్కగా వికాసించును" అనే దృక్పథాన్నే మనస్సులో నుంచుకొని కవిత్వాన్ని చిత్రించటానికి ప్రయత్నించారు.

ఈ నాటికకు జర్మను భాషలో రచయిత "అయిగన్ సిన్" (పిచ్చి పట్టు) అని పేరు పెట్టాడు. ఇట్టి పిచ్చి పట్టుదలతో ఇరుగు పొరుగు వాళ్ళ జీవిత సౌఖ్యాన్ని అయోమయంలో దింపే వాళ్ళూ మనలో చాలా మంది వున్నారు. వాళ్ళకీ రచన అంత రుచించక పోవచ్చు. కాని మనం జీవిత రహస్యాన్ని కొంచం వోపికతో తెలుసుకోవాలి. అలాతెలుసుకొన్నామా మనల నప్పుడప్పుడు కలవరబెట్టుతూవున్న ఘట్టాలు తాత్కాలికములని గ్రహించవచ్చు. తద్వారా మన జీవితాన్నే సవ్యంగా సంతోషంగా నడుపుకోవచ్చు. ఈ నాటిక ద్వారా బెన్‌డిక్సు మనకిచ్చే సందేశమూ యిదే.

అనువాదము చేసేటప్పుడు జర్మను వాతావరణాన్ని ఏమాత్రమూ మార్చలేదు. జర్మను పేర్లనూ మార్చలేదు. ప్రారంభానా యీ జర్మను పేర్లు మనకు క్రొత్తగా వున్నా క్రమేణా వాటినీ మనం చక్కగా అర్థం చేసుకోగలం.

——:o:——

## ఇందు వచ్చే పాత్రలు

అవుస్‌డోర్ఫు : భాగ్యవంతుడు. (పెద్ద వ్యాపారి.)

కాతరీనా : అవుస్‌డోర్ఫ్ భార్య.

ఎమ్మా : వాళ్ళ కూతురు.

ఆల్‌ఫ్రెడ్ : ఎమ్మా భర్త.

హైన్‌రిచ్, లీసబెత్ } ఆల్‌ఫ్రెడ్ నౌకర్లు.

# పిచ్చిపట్టు

## కాలం — కథ.

కథ నూరేండ్ల క్రిందట ఆల్‌ఫ్రెడ్ ఇంట్లో జరుగుతుంది. ఆల్‌ఫ్రెడ్ ఈమధ్యనే ఎమ్మాను పెళ్ళిచేసుకొన్నాడు. అల్లుణ్ణీ కూతుర్నీ చూస్తానికి అవుస్‌డోర్ఫ్ కాతరీనా, వాళ్ళ ఇంటికే వస్తారు.

జర్మనులు, ఏపనైనా చేసిముగిస్తే "దైవకటాక్షం వల్ల అంతాముగించాం" అని చెప్పేస్తారు. నిద్రలేచినప్పుడూ, దీన్నే అనేస్తారు. భోజనసమయాన దీన్నే పాడ్తారు... ఈవాక్యాన్నే రచయిత ఆధారంగా దీసుకొని, దానిమీదే కథనంతా సాగిస్తాడు.

---

## 1 వ రంగం

(ఒక మధ్యతరగతి కుటుంబపు ఇల్లు. భోజనాలగదిలో మధ్య పెద్ద బల్ల. తలుపు మూయబడివుంటుంది. ఎడమ ప్రక్క గోడదగ్గిరే మరొక చిన్న బల్ల పాత్ర సామగ్రి వుంచటానికి అమర్చబడ్డది. కుడివైపు అల్మారా. దాన్లో కప్పులూ, ప్లేట్లూ, స్పూనులూ, గ్లాసులూ, వగైరాలు వుంటాయి. ఇంటి నౌకర్లు, హైన్‌రిచ్, లిజబెత్, అల్మారాను తెరిచి కప్పులూ, ప్లేట్లూ, స్పూనులూ తీసి చిన్న బల్లమీద వుంచుతారు. బల్లమీద టేబిలు క్లాత్‌ను పరుస్తారు. సామాన్లను సద్దుతూ వుంటారు. ప్రాతఃకాలం. యజమాని వచ్చేలోపుగ కాఫీసామాన్లను అమర్చాలి)

హైన్‌రిచ్ : (కూనిరాగాలు తీస్తూ బల్లమీద సామాన్లను సద్దుతూ వుంటాడు.)

లిజబెత్ : (వెలుపలివుంచే) హైన్‌రిచ్! అలారాగాలు తీస్తూవుంటే పని జరుగుతుందనుకొన్నావా? వాటిని కట్టిపెట్టి పనిచెయ్యాలి!

హైన్ : (గది తలుపు తెరుస్తాడు ఆకూనిరాగాలతోనే)

లిజ : (ట్రేలో టోస్టూ, వెన్నా, జాం, పారిడ్జి వగైరాలను తెస్తుంది)

హైన్ : అంత బరువును మోసుకొని వస్తున్నావే? సుకుమారివి, ఎంత కష్టపడ్డావో దీన్ని తెచ్చేటందుకు? సహాయం చెయ్యనామరి?

(ట్రేను లిజబెత్ చేతినుంచి తీసి చిన్న బల్లమీద వుంచతాడు. పెద్దబల్లను ఇద్దరూ సర్దుతుంటారు. ఆపని మధ్యనే హైన్‌రిచ్ లిజబెత్‌ను ముద్దుపెట్టుకోబోతాడు......)

లిజ : (సిగ్గుతో) హైన్‌రిచ్! ఏమిటాసరసం?.. ఎవరైనా చూస్తేనో?...

హైన్ : ఎవరు చూస్తారు?... చూచినా ఫరవాలేదులే.

లిజ : యజమాని వచ్చే వేళయింది?...ఆయన దీన్ని చూస్తేనో?

హైన్ : ఆలోపునే దీన్ని పూర్తి చేస్తానులే...ఆముద్దు ఎంతో రుచిగావుంది...అది చాలుతుందనుకొన్నావా? ఇంకో ముద్దునియ్యాలిమరి?...దాన్నే ఇస్తివా! ఇక నాకేం కావాలి...

లిజ : ఈపిచ్చి చేష్టలు నాకేం నచ్చవు...పైన సందడి అవుతున్నది. ఇక వచ్చేస్తాడు.

హైన్ : వస్తేరానియ్యి. ఆయనా మన సంతోషాన్ని చూచి తప్పక ఆనందిస్తాడు...

లిజ : బాగానేవుంది నీ సరసం?...కాని నాకు అవమానం కాదూ ఆయన దీన్నే చూస్తే!

హైన్ : అవమానం లేదూ గివమానంలేదూ...ఆయనో?... భార్యను ముద్దుపెట్టుకోటం లేదామరి?...ఎంతకాలమయింది వాళ్ళు పెళ్ళిచేసుకొని...మూడునెలలయినా కాలేదే...

లిజ : ఓ. ఆవిడ ఆయన భార్య! ఇక మనమో...పెళ్ళి అయ్యాక...

హైన్ : (లాలనతో) మనకా ...ఆపనీ తొందరగానే అయిపోతుందిలే...

లిజ : (నిట్టూర్పువిడుస్తూ) అంత అదృష్టమా...ఏమో?

హైన్ : (గట్టిగా కౌగలించుకొని) నిన్నే ప్రేమించాను. అంతవరకూ తప్పక వోపిక పట్టుకొనే వుంటానులే.

లిజ : (తప్పించుకొంటూ) ఈ వుపన్యాసమంతా ఎందుకు వచ్చింది? అదీ ఇప్పుడేనా?...ఈపని ముందుగా సర్దుకోవాలి.

(ఇద్దరూ అంతా సిద్ధం చేస్తారు. ఆల్‌ఫ్రెడ్ ఏమాత్రం చప్పుడు చేయకుండా వచ్చి బయట నిలుస్తాడు. వీళ్ళ సంభాషణను వింటుంటాడు)

## 2 వ రంగం

(గదిలోపల హైన్‌రిచ్ లిజబెత్ లుంటారు. బయట ఆల్‌ఫ్రెడ్ తలుపురంధ్రంలోనుంచి లోపలి దృశ్యాన్ని చూస్తూవుంటాడు)

లిజ : అత్తమామలూ వీళ్ళతో కాఫీ పుచ్చుకోటానికి వస్తున్నారు.

హైన్ : ఔ. వచ్చి వీళ్ళ సంసారాన్ని కన్నులార చూచి తప్పక ఆనందిస్తారు...హూ! ఇక మనసంగతో?...మీ నాన్నా, అమ్మా మనల్నీ ఈలా చూస్తేనో...

లిజ : మా వాళ్ళ మర్యాదా?...ఆ సంగతే వచ్చిందా మరి?

హైన్ : కాక? మన ప్రేమను చూస్తేనా వాళ్ళూ తప్పక ఆనందిస్తారు. ఆ సంగతి నాకు తెలియదను కొన్నావా, లిజబెత్? (చేసిన పనినంతా చక్కగా వున్నదో లేదో చూస్తూవుంటాడు) అమ్మా, అంతా చక్కగా అమర్చాం.

లిజ : హూ...

హైన్ : ఏమిటా "హూ?"

లిజ : ఇంకేం అనాలి?

హైన్ : దాంతో సరిపోదు, ... నీవూ చెప్పాలి?

లిజ : ఏమని?

హైన్ : "హూ బహుచక్కగా అమర్చాం" అని.

లిజ : ఎందుకు?

హైన్ : మర్యాద, మర్యాద

లిజ : మర్యాదా, మట్టి గడ్డలా!

హైన్ : లిజబెత్! నీవూ నేర్చుకోవాలి పని పూర్తి అయ్యాక దైవకటాక్షాన అంతా పూర్తి చేసామని. అది కాకపోతే అంతా దేవునిపనే. దాన్ని పూర్తి చేసాము అని చెప్పాలి. ఇది మర్యాద దాన్నే చెప్పక పోతివా.

లిజ : నీకూ ఆ వెర్రేనా? మగవాళ్ళంతా ఇంతే?

హైన్ : అది వెర్రికాదూ, పిచ్చికాదూ. ఆలా అనడం మర్యాద. అనాది నుంచీ వచ్చిన సాంప్రదాయం. దాన్లో తప్పేముంది?

లిజ : ఈ వుపన్యాస మంతా ఎందుకోసం? వెళ్ళు, వెళ్ళు, నీ పనేదో దాన్నే చూచుకోవాలి?

హైన్ : (అట్టహాసంతో) ఇందేం తప్పువుందని ఆ రభసను చేస్తావు? (వినయంగా) లిజబెత్! నాదగ్గిరికేరా దైవ కటాక్షం వల్ల అంతా అమర్చాం అని ఒకసారి చెప్పాలి?

లిజ : నేను చెప్పను.

హైన్ : నన్ను మర్యాద చేస్తానికైనా......

లిజ : నేను ఎప్పటికీ అనను.

హైన్ : (కోపాన్ని నటిస్తూ) చెప్పే, చెప్పే ......

లజ : నేను చెప్పను. ఏమాత్రం చెప్పను.

హైన్ : గయ్యాలి గంగవు...... కాని ప్రార్థిస్తాను. దాన్ని ఒక్కసారి చెప్పాలి?

లిజ : నీవు ఎంత ప్రార్థించినా చెప్పను. నూరుసార్లు అడుగు. నా జవాబూ ఇదే.

హైన్ : అది నీ స్వభావం. దాన్ని మార్చటానికి నా తరమా .... ఈలాచేస్తే ...

లిజ : ఏంచేస్తావో చూస్తాను కాదూ? తప్పంతా నాదేనా? నీ వీలా అంటానికి ప్రారంభిస్తివా?

హైన్ : ఎందుకు వచ్చిందీ రభస? అది మర్యాద. దాన్ని గంగలో తోసివేస్తావామరి? ఒక్కసారే అను. దాన్లో తప్పేమీలేదు!

లిజ : ఎందుకలా బలవంతం చేస్తావు? నేను చెప్పను అంతే ...

హైన్ : (తిరస్కారంగా) లిజబెత్?

లిజ : (ఆలాగే) హెన్‌రిచ్?

హైన్ : (గంభీరంగా) ఆ మర్యాదను నిలుపవా?

లిజ : (నవ్వుతూ) అనాలా మరి?

హైన్ : (తిరిగి గంభీరంగా) ఔా! దీన్నే కోరుతున్నాను.

లిజ : (నవ్వుతూ) ఏమిటీ అవస్థంతా? కలగంటున్నావా? లేక త్రాగున్నే ఎడమ కాల్ని క్రింద బెట్టుతూ నిద్రలేచావా?

హైన్ : (కోపంతో) ఆహాస్యానంతా చాలించాలి? నేను మనమర్యాదకోసం అడుగుతున్నాను. నీవూ తప్పని సరిగా చెప్పాలి "దైవసహాయాన అంతా అమర్చాం" అని.

లిజ : (కోపంతో) నేనే చెప్పాల్నా ?

హైన్ : ఔాఁ .........

లిజ : (ఎగాదిగా చూస్తూ) చెప్పాలా ? తప్పక చెప్పాల్నా ?

హైన్ : ఊఁ ...... తప్పక.

లిజ : దీన్నే చెప్పను.

హైన్ : (వచ్చేకోపాన్ని అణచుకోలేక) లిజబెత్ ! ... నిన్నే అడుగుతున్నాను.

లిజ : చెప్పను. చెప్పను అంతే.

హైన్ : ఇదే కడపటిసారి ...

లిజ : (నవ్వుతూ) ఎందుకొచ్చిందీ పిచ్చిపట్టు ? నేను చెప్పను. ముమ్మాటికీ చెప్పను.

హైన్ : (కోపంతో) నాదిపిచ్చి పట్టో, మరేదో చూస్తాం గాదూ ?

లిజ : (చేతులను కట్టుకుని అట్టహాసంతో) చూస్తాం కాదూ ?

హైన్ : (గంభీరంతో లిజబెత్ చేతినిగట్టిగా నొక్కుతూ) నామాట ససేమిరా వినవే ? ఎందుకీ గట్టిపట్టు ?

లిజ : ఎవరిది పట్టో చూస్తాం కాదూ ?

హైన్ : ఆడవాళ్ళకు ఎందుకు వచ్చింది ఈ పిచ్చిపట్టు ? దాన్ని తెగనరికి వెయ్యాలి. ఆపనిని నేనే చేస్తాను చూడు !

లిజ : దాన్ని చేస్తానికి నీచేత అవుతుందనుకొన్నావా ?

హైన్ : ఎందుకుకాదూ ? ... (తిరిగి చేతిని గట్టిగా నొక్కుతాడు)

లిజ : (కోపంతో) నా చేతి నెందుకు నొక్కుతావు ? విడు ! విడు ! ఇప్పుడేవిడిచి వెయ్యక పోతివా ?

హైన్ : ఈ రాద్ధాంత మంతా వాళ్ళు విన్నారా ...... ఒక్కసారి చెప్పివేసెయి. లేకపోతేనా ?... వొళ్ళు మండిపోతున్నది

(తిరిగి చేతిని నొక్కుతాడు)

లిజ : ఎందుకాలా నొక్కుతావు ? ... నొప్పి, నొప్పి, అఁ నొప్పి ...

(ఏడుస్తుంది)

హైన్ : (వేడుకూ) లిజబెత్, ఆ పిచ్చిపట్టుదలను వదలె య్యాలి. నాకోసంవొక్కసారి చెప్పివెయ్యి దేవునిదయ వల్ల అంతా సిద్ధం చేశాం అని.

లిజ : (తప్పించుకొని ఒకమూలకు వెళ్ళుతుంది) నీ చేష్ట లేం బాగాలేవు. నీవు ఎంత వేడుకొన్నా ఆ మాటను మాత్రం అనను.

హైన్ : ఎందుకు వచ్చింది ఈ గభసంతా. మనకేమాత్రం ఇదివద్దు ...

లిజ : ఆ మాట ......

హైన్ : ఎంతధైర్యంతో అంటున్నావు ? నా మీద నీ కింత......

లిజ : నీకింత పట్టువుంటే మరేంచేయ మన్నావు ?

హైన్ : (లాలనతో) నీ వింత గడుసుదానివని ఎప్పుడూ అనుకోలేదు ...... ఆ మాటను అనటానికి అంత కష్టమా మరి ?

లిజ : ఏమన్నా అను. నేను మాత్రం ఆ మాటను అనను అంతే ...

హైన్ : వాళ్ళు వచ్చేవేళ అయింది. ఈ నాటకాన్ని చూస్తే వాళ్ళు నవ్విపోతారు. సరేలే ...

(బయటి నుంచి సందడి అవుతుంది)

లిజ : (గాభరాతో) వాళ్ళే వస్తున్నారు ఇకమన పని

చూచుకోవాలి (బల్లకు కుడిపక్కను నిలుచుంటుంది)

హైన్ : (లిజబెత్ చేతినిపట్టుకొని) లిజబెత్ ! నీవుఎంతో మంచిదానివి. ఒక్కసారి దాన్ని అని వెయ్యి. ...

లిజ : (నేలను తన్నుతూ) అనను. అనను.

(అమాంతంగా వున్నస్థలానుంచి బయటికి పోతుంది)

హైన్ : వీళ్ళ పట్టు పట్టే! దాన్ని మార్చుతానికి ఎవరితరం? (తనలో) ఈ రభసంతా నాకేం ఎంత మాత్రం నచ్చదు. వేడుకొన్నా, కోపపడినా వింటుందా నా మాటను ?

(ఆల్‌ఫ్రెడ్ తలుపు తెరుస్తాడు. లోపలికి వస్తూ...)

ఆల్‌ఫ్రెడ్ : ఎందుకు చేస్తావోయి ఈ రాద్ధాంతానంతా? ఆ మాటను చెప్పకుంటేనేం ?

హైన్ : (సిగ్గుతో) మా మాటలను వింటున్నారా మరి ?

ఆల్ : (చిరునవ్వుతో) కొంత విన్నాను ... ఔను, అది పట్టుదలమనిషి.

హైనె : (నవ్వుతూ) లిజబెత్ మంచి మనిషేకాని ...... నాకేం తెలియటంలేదు, దానికింత పట్టుదల ఎందుకో ?

ఆల్ : స్త్రీలకు ఈలాంటి పిచ్చి పట్టు లేకపోతేనా ? ........ జరిగినదేమో జరిగిపోయింది. దానికోసం... ఈ సంగతి నెందుకు ప్రస్తావించాలి ? ... మామయ్యా, అత్తయ్యా భోజనానికి వస్తున్నారు, ఆయన పానీయాలంటే చచ్చిపోతాడు. వాటిని తీసుక రావాలి ? ఆ అల్మారాలోనే వున్నవి కాదూ? ......

హైన్ : (అల్మారాదగ్గిరకువెళ్ళుతూ తనలో) ఫరవాలేదు. లిజబెత్ నా మాట తప్పకుండా వింటుంది, నేనంటే దానికెంతో ప్రాణంగాదూ ! తప్పక ఆ మాటను చెప్పి వేస్తుంది, ఇప్పుడింత భీష్మించుకుతూ వున్నా ......

ఆల్ : (తలుపు వైపు చూస్తూ) ఇంకా రాలేదేమి చెప్పుమా ? ఆ ముస్తాబు ఇంకా పూర్తికాలేదు కాబోలు ! ఆఁ బయట సందడి అవుతున్నది. ఆఁ ... వస్తున్నది.

(ఎమ్మా ప్రవేశించుతుంది. ఆయన ప్రక్కనే నిలుచుంటుంది)

## 3 వ రంగం

(అదేరంగం. ఆల్‌ఫ్రెడ్, ఎమ్మా గదిలో వుంటారు)

ఎమ్మా : గూడెన్ మోర్గెన్ (గుడ్‌మార్నింగ్) ఆల్‌ఫ్రెడ్ !

ఆల్ : (ఎమ్మాను కౌగలించుకొని) ఎమ్మా, నా ఎమ్మా !

ఎమ్మా : (చిరునవ్వుతో) బాగా మంచికలలను కన్నావా మరి ?

ఆల్ : నాకేం తెలుస్తాయి. హాయిగా నిద్ర పట్టింది అంతే !

ఎమ్మా : ఈ క్రొత్త జీవితం ఏలావుంది మరి ?

ఆల్ : అట్టి ప్రశ్న నేలా ఇప్పుడు అడగటం? నాభార్యవయ్యావు. అదే నాకు కావలసింది. తక్కిన విషయాలు మనకెందుకు చెప్పు, ఎమ్మా ?

ఎమ్మా : గడుసువాడివి. నే నడిగినదానికి అట్టి జవాబు నేనా ఇయ్యవలసింది ? (కోపాన్ని నటిస్తూ) మనకు పెండ్లయి చాలాకాలమయింది కామిం ? భర్త ఇట్టి జవాబు నేనా ఇయ్యటం ? ఈ బెట్టుసరి నాకేం నచ్చటంలేదు.

ఆల్ : నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నాననే చెప్పటానికి !..

ఎమ్మా : నీ వింకా అమాయకుడివనే అనుకొన్నాను. పెండ్లి అయ్యాక మగవాళ్ళు ఈలా మారిపోతారని కలలో కూడా అనుకోలేదు. నీవలా అంటే నాకే ఎంతో బాధగా వుంటుంది.

(ఆల్‌ఫ్రెడ్‌ను కౌగలించుకొంటుంది)

ఆల్ : (ఆనందంతో) నే నెప్పటికీ మారిపోయ్యేవాణ్ని గాను అప్పటికీ, ఇప్పటికీ నాలో ఏమార్పూ లేదు.

ఎమ్మా : మగవాళ్ళెప్పుడూ అలాగే అంటారు. అదివాళ్ళ స్వభావమే ! మార్పు వున్నదో లేదో తెలుసుకొంటానికి నేను అవకాశాన్ని ఇచ్చి వుంటేగామా మరి ?

ఆల్ ; నీ సంగతీ నాకు బాగా తెలుసు. నా ప్రేమ లక్ష్మివి నీవే. ఆ సంగతిని మరి చెప్పాలా ? నా కోర్కెలన్ని నీవే తప్పక తీరుస్తావు. అదినీకు చక్కగ [illegible]

ఎమ్మా : అల్‌ఫ్రెడ్ ! నీవా ? నా కోర్కెలను నీవూ తీర్చటంలేదా మరి ?

అల్ : మనం నిజంగా అదృష్టవంతులం. నీ ఆనందాన్ని ఆ కళ్ళలోనే చూస్తున్నాను కాదూ ? ఇక ఒక ముద్దు యియ్యాలి (ముద్దు పెట్టుకోబోతాడు).

ఎమ్మా : (తప్పుకొంటుంది కొంత చిలిపితనంగా) మెల్లగా! అంత గట్టిగా కాదు ! ఎన్ని గండాలు వచ్చినా ఇవే మనలను రక్షించుతాయి

అల్ : గండాలు ఎందుకు వస్తాయి ? అలా గాభరా పడవద్దు. నేనున్నాను కాదూ ! ......

ఎమ్మా : (కౌగలించుకొంటూ) మంచివాడివి. చాలా మంచి వాడివి.

అల్ : ఎమ్మా ! నా ప్రాణలక్ష్మీ ........

ఎమ్మా : (బల్లదగ్గిర కూర్చుంటుంది. అల్‌ఫ్రెడ్ ప్రక్కనే కూర్చుంటాడు) అమ్మా నాయనా ఇంకా రాలేదే ? వాళ్ళు ముందే వచ్చారను కొన్నాను.

అల్ : (ఎమ్మా చేతిరుమాలను తీసుకొంటూ) వాళ్ళా ఇప్పుడే వస్తారులే ... కాని ఎందుకు వచ్చింది ఈ బెంగ ? ......

ఎమ్మా : (అతనివైపు చూస్తూ) అటువంటి ప్రశ్నలను మాత్రం అడుగకు.

అల్ : అవు, అవు, నాదేతప్పు. ఇంక అడగనులే...... కాని ఏంచెయ్యాలి. (ఏదో ఆలోచించుతాడు ...... పకపక నవ్వుతాడు) ఇప్పుడే... నేను దాన్ని ఇప్పుడే... (ఇంకా నవ్వుతాడు)

ఎమ్మా : ఏమిటా ఇప్పుడే ఇప్పుడే ? ఎందుకలా నవ్వుతావు ?

అల్ : (తిరిగినవ్వుతూ) ఒక నాటకాన్ని చూచాను ... దానికోసమే ......

ఎమ్మా : ఏమిటది ? చెప్పివెయ్యాలి.

అల్ : (ఇంకా నవ్వుతూ) ఏమిటా ? ...... నాగదిలో నుంచి వచ్చి కొంచెంసేపు బయట నిలబడ్డాను. వాళ్ళ రాద్ధాంతానంతా విన్నాను ...... తలుపు రంధ్రంలో నుండే వాళ్ళు చేస్తున్నదీ కన్నులారా చూచాను. ఇద్దరూ బల్లను అమర్చుతూ వున్నారు. హైన్‌రిచ్ లిజబెత్ అంటే చచ్చిపోతాడు. తన ఆనందాన్ని ఆపుకోలేక "దైవసహాయం వల్ల బల్లనంతా అమర్చేసాం" అన్నాడు. దాన్నే చెప్పమని లిజబెత్‌ను అడిగాడు. అది వాడి మాట వింటేకాదూ ?

ఎమ్మా : కొంటెతనం కాక మరేమిటి ? ఎందుకు దాన్ని బలవంత పెట్టాలి ?

అల్ : లిజబెత్ బొత్తిగా వొప్పుకోలేదు. హైన్‌రిచ్ కాలాంతకుడు. తన పిచ్చి పట్టును వదలడే మరి ? కేకలు వేస్తాడు. కాని లిజబెత్ లిజబెత్తే ...... అదీ క్రిందికి ఏమాత్రం దిగలేదు.

ఎమ్మా : (లిజబెత్తునే సమర్థించుతూ) వాడికి పిచ్చి పట్టు ఎందుకు ? ఇందులో తప్పెవరిది ? హైన్‌రిచ్‌దా లేక లిజబెత్‌దా ?

అల్ : వాడి తప్పేమీకాదు. అలా అడుగ కూడదా మరి ?

ఎమ్మా : వాడిదే తప్పు. ఆలా అడుగ వచ్చునా ?

అల్ : దాన్ని వొప్పుకొంటాను కాని ...... అది వాడి మర్యాదను నిలుపవాలి. దాని పట్టు నాకేం నచ్చటం లేదు.

ఎమ్మా : (కోపంతో) వాడిపట్టు నాకేం నచ్చలేదు. లిజబెత్ మార్గమే న్యాయ మయింది.

అల్ : (నవ్వుతూ) ఆ పనిమనుషుల రాద్ధాంతానికి మన మెందుకు తగవు లాడుకోవాలి ? అట్టి విషమస్థితి మన కెన్నటికీరాదు. ఏమంటావు ?

ఎమ్మా : (అతనివంకే చూస్తుంది కాని మాట్లాడదు)

అల్ : నీ మనస్సులోని భావాలు నాకూ తెలుసు నీవు జవాబు చెప్పక పోయినా! నీ వెంతో మంచిదానివి. నేనేది అడిగితే దాన్ని తెచ్చి యిస్తావు.

ఎమ్మా : (మందహాసంతో) అలాగా ! అలాగా !

# పిచ్చి పట్టు

ఆల్ : (గంభీరంతో) అందుకు సందేహమా! నీవు నా కోరికను నెరవేరుస్తావు. ఆ సంగతి చెప్పాలా ?

ఎమ్మా : నీ కోరికను నెరవేర్చకుంటే ?

ఆల్ : నీవా, ఎమ్మా ? నీవు తప్పకదాన్ని నెరవేరుస్తావు కావలసి వస్తే పందెం వేసుకొందామా?

ఎమ్మా : దీనికా పందెం ?

ఆల్ : ఒక్కసారి చూస్తామా ?

ఎమ్మా : (తొందరతో) వద్దు, వద్దు, అట్టివి మనకే మాత్రం వద్దు!

ఆల్ : ఒక్కసారి చూస్తాం. నిన్నే అడిగా ననుకో దాన్ని చెప్పాలి ? "దైవ ప్రసాదంవల్ల మేజా మీద అంతా సర్దాం" అని చెప్పు ?

ఎమ్మా : ఈ చిలిపితనం నాకేం ఇష్టంలేదు. ఇవన్నీ మనకెందుకూ ?

ఆల్ : (వేడుకొంటూ) ఒక్కసారి. ఒక్కసారే నా కోరిక చెల్లించాలి ?

ఎమ్మా : ఆల్ఫ్రెడ్ ! ఏమిటీ పిచ్చిపట్టు ?

ఆల్ : నా ముద్దు చెల్లించాలి. అలా అంటే తప్పేం లేదులే ?

ఎమ్మా : (కోపంతో) నే చెప్పను. ఎన్నటికీ అలా చెప్పను.

ఆల్ : ఒక్కసారే ......

ఎమ్మా : (గంభీరంతో) అనను అనను.

ఆల్ : చెప్పే ?......

ఎమ్మా : చెప్పను.

ఆల్ : (లేస్తూ) నా కోరికనా నిరాకరించేది ?

ఎమ్మా : ఎందుకు వచ్చింది ఈరభసంతా. ఈ పిచ్చి పట్టు నాకేం నచ్చటంలేదు.

ఆల్ : (నిలుచుంటాడు. గంభీర గాత్రంతో) దీన్ని పట్టుదలే అను. లేదా కాదనేఅను ...... కాని నాక్కావలసింది నీవు నా కోరికని ఒక్కసారి చెల్లించటమే.

ఎమ్మా : (కోపంతో) ఇట్టికోరకల్తో నన్నెందుకు బాధ పెడతావు ?

ఆల్ : కాని నువ్వు నా కోరిక నెరవేర్చకుండటం న్యాయంకాదు. ఒక్కసారి...... ఒక్కసారి చెప్పు ?

ఎమ్మా : (కోపంతో – తోకతొక్కిన పాములె లేస్తుంది) నేనేం చేసానని ఈ రభసంతా? ఇట్టిరభసను చూడటం ఇప్పుడే !

ఆల్ : ఈ రభస నీదా లేక నాదా? అడగక అడిగిన దీన్ని నిరాకరించటం ఏమాత్రం న్యాయంకాదు..... సరేలే ...

ఎమ్మా : ఈకథంతా మనకెందుకు ? ...... ఈ చలిపితనాన్ని ఇప్పుడే ......

ఆల్ : దీన్ని చిలిపితనంఅను. మరేదైనా కానియ్యి. ఏమ్మాటలు వింటున్నాను ? భార్య భర్త పట్ల చూపే ప్రేమ భావాయిది ?

ఎమ్మా : సరేలే భర్త అడగాలసిన ప్రశ్నా ఇది ? ఇలాగా అజ్ఞాపించటం ?

ఆల్ : నేనా ఆజ్ఞాపించేది ? నిన్ను వేడుకొంటున్నాను.

ఎమ్మా : (నవ్వుతూ) అంతేనా ? నీవు ఆజ్ఞాపించినా సరే, వేడుకొన్నా సరే ......

ఆల్ : (కోపంతో) అవసరం వస్తే ......

ఎమ్మా : (కోపంతో) నువ్వు అలా ఆజ్ఞాపిస్తే...దాన్ని ...

ఆల్ : (గంభీరంగా) నేను భర్తను. భర్త కోరికను ఒప్పుకోపోతివా ?

ఎమ్మా : (గంభీరంగా) భర్త ఈలాటి పిచ్చి కోరికలను కోరటానికి మొదలు పెట్టినా, తప్పక నిరాకరిస్తాను. తప్పక. తప్పక.

ఆల్ : ఎమ్మా ! నీవా ?

ఎమ్మా : ఆల్ఫ్రెడ్ ! నీవా నన్ను ఆజ్ఞాపించటం ? ఏదైనా కోరిక వుంటే ...... అడుగ వలసిన మార్గానా అడగాలి ...... అప్పుడు ఆలోచిస్తాను. దానికిట్టి జవాబియ్యాలనో దాన్నే ఇస్తాను. (నౌకర్లకోసం బల్లమీద వున్న గంటను చేతబుచ్చుకొని కొట్టుతుంది)

ఆల్ : అప్పుడే పిలుస్తావా వాళ్ళను ? ...... మన సంగతేమిటో దాన్ని పూర్తి చేసుకోవాలి కాదు ? భర్తను నీవీలా అమర్యాద చేయటం మాత్రం సబబుగా లేదు.

ఎమ్మా : ఇంకేం చెయ్యమంటావు ? భార్యను భర్త ఈలా క్షోభ పెట్టటం మన మర్యాదకూ ఏ మాత్రం మంచిది కాదు ...... భర్తపట ? జౌ, భార్యను భర్త చూపే ప్రేమ ఇదే కాబోలు ........

(లిజబెత్ తలుపు తెరచి లోపలికి వస్తుంది. వాళ్ళిద్దరి మధ్య వచ్చి నిలువ బడుతుంది)

# మహిళల ఆరోగ్యరక్షణకు

## లోధ్ర

### గర్భాశయరోగ నివారిణి

స్త్రీలకు గలుగు ఋతుశూల, బహిష్ఠ కాకుండుట, అకాలబహిష్ఠ, మైల జాస్తిగాను తక్కువగాను పోవుట, కుసుమరోగము, సంతానహీనత, రక్తహీనత, మలబద్ధము, సూతికావాతము, కీళ్ళనొప్పులు, అరికాళ్ళు అరచేతులు మంట మొదలగు స్త్రీ మర్మ వ్యాధులను కుదుర్చును.

12 ఔ. రు. 4-4-0      6 ఔ. రు. 2-4-0

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణిస్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్ళు) యిది సంజీవివంటిది. తలతిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము. జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలెయుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

3 ఔన్సుల బుడ్డి రు. 1-4-0

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాలప్రసవము, అప్పుడప్పుడు కడుపు నొప్పి, నడుమునొప్పి, రక్తహీనము, శరీరమందు నీరు చేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పైజబ్బులు రాకుండుటయేగాక ప్రసవించు వరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండు మాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

3 ఔ॥ రు. 3-2-0      6 ఔ॥ రు. 5-8-0

## క్షీరబలా తైలం

స్త్రీలకు ఋతుస్రావ దోషముచే గల్గు వాతవ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయ వ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3-0-0

## సౌభాగ్య శొంఠి

### బాలింతలేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమను ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగనున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారు చేసి యిచ్చుచున్నారు. ఇందు కలియువస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

బుడ్డి రు. 2-0-0

## ప్రమేహాంతకం

### (తెల్లబట్టవ్యాధికి)

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయమునుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీజాతియందు యీ జబ్బు సర్వసాధారణముగనుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీ వ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనతసంభవించును.

బుడ్డి రు. 4-0-0

# కేసరికుటీరం లిమిటెడ్

15, వెస్టుకాట్‌రోడ్డు, రాయపేట, మద్రాసు 14

తెనుగుజిల్లాలకు, నైజాముకు ఏజంట్లు

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికిందరాబాదు



# నెక్లెస్

శ్రీ అడివి కనకరాజు.

సుజాతకి చిన్నప్పటినుంచీ చాలా పెద్ద కోరికలుండేవి. ఆమె ఒక పాఠశాల ఉపాధ్యాయుడి కుమార్తె మాత్రమే. ఓవిధంగా అందమైనదనే చెప్పాలి. నిడుపాటి నిగనిగలాడే ఆమె పొడవైనజుట్టు, చక్కటికళ్లూ-పచ్చటి శరీరచ్ఛాయా-ఆమె లావుగానూ కాకుండా సన్నగానూకాకుండా-కొంతవరకూ నాజూకుగా ఎటువంటివాళ్ళనైనా ఆకర్షించేది. ఆమె ప్రకృతి ఇచ్చిన అందంతో - యవ్వనపు బిగువుల్లో — మిసమిసలాడ్తూ ఉండేది. కాని, ఆమెకెప్పుడూ ఒకవేదిగులు. ఆమె అందాన్ని ప్రకాశింపచేయదగ్గ నగలుగాని, దుస్తులుగాని లేకపోవడమే దానికి కారణం. ఆమె ఎల్లప్పుడూ అద్దం ముందు కూర్చుని వేడినిట్టూర్పులు విడుస్తూ తన గత జీవితాన్నీ, భావినీ నెమరు వేసుకునేది.

ఆమె మొట్టమొదటి కనీసపు కోరిక ఒక ఉన్నతోద్యోగిని పరిణయమాడటం. కాని అదికూడా నిరాశ అవటానికెంతోకాలం పట్టలేదు. ఆమె తండ్రి తనకు తగినట్లుగానే ఒక సామాన్య గుమాస్తాకు ఆమెనిచ్చి వివాహం చేశాడేకాని, మంచిస్థితిమంతుణ్ణి కాని తేలేకపోయాడు. ఆమె జీవితం ఇంక ఒక సామాన్య గుమాస్తాతో స్థిరపడిపోయింది. ఈ విషయం ఆమె తలుచుకున్నప్పుడల్లా కండ్ల వెంటనీళ్ళు తిరిగేవి. ఆమె తన విధిని దూషించుకునేది.

సుజాత భర్తతో పట్నంలో కాపురం ఒక చిన్న ఇంటిలో ఒక చిన్నవాటాలో. అందులో రెండేరెండు చిన్న గదులు. ఒకటి వంటకీ, రెండవది పడకకీ. ఈయింటిని చూడగానే ఆమెకు బాధ కలిగింది. కాని, ఆమె విధికి బాధ్యురాలుకాదు.

ప్రతి రోజూ వంటవండి భర్తకి పెట్టి ఆఫీసుకు పంపి ఆమె సగంపతనమైన ఆపాతనిలువుటద్దం ముందు కూర్చుని రెండుకన్నీటిబొట్లు రాల్చేది. ఆమె వెంటనే తన దుస్తులవంక చూసుకునేది. తను కట్టుకొన్నవి....పాత బట్టలు. తన స్నేహితురాలు — ప్రక్క వీధిలో ఉంది. ఆమె శ్రీమంతురాలు. ఆమెకిమల్లే తనకు పట్టుచీరలులేవు. మెడలో నెక్లెస్ లేదు. బంగారు నగలు లేవు. ఆమె.... హాయిగా సాయంత్రం భర్తతో బీచికి వెడ్తుంది. కాని, కాని....తను? తన భర్తకి వచ్చే డబ్బులో నాలుగోవంతు ఇంటద్దె....తనకి చిరుగుల చీరలు. భర్తకి రెండే రెండు జతల బట్టలు ఆఫీసుకి—ఇంటిదగ్గర కట్టుకునేందుకో పాతపంచె. ఆమె దుఃఖం మితిమీరిపోయేది. ఒకొక్క రోజున భోజనం మాటమరచేది. విధి తననెందుకల్లా బాధిస్తుంది? ప్రతి స్త్రీ వాంఛించే నగలూ మంచి దుస్తులూ తనకెందుకు లభించవు?....తనకి డబ్బెందుకు లేదు? తనేం పాపంచేసింది? ఆమె ఆ కుక్కి మంచం గళ్ళల్లోంచి కన్నీటిబొట్లు ధారగావదిలేది.

సాయంత్రం భర్త వచ్చేవాడు. ఆమె మౌనంగా — బాధగా — నిట్టూరుస్తూ పరధ్యాన్నంగా కూర్చుని ఉండేది. అతనికి తెలుసామె బాధ. కాని, తనసమర్థుడు. పేదవాడు. భార్య కోర్కె తీర్చగల సమర్థుడింకా కాలేదు. ఇక

ముందైనా కాగలడా? ఆ చాయలెక్కడా కనిపించవు. అతడు తలవంచుకుని లోపలికి వెళ్ళి చొక్కా వంకిని తగిలించేవాడు. ఆమె తలవంచుకుని, మెల్లిగా అడుగులు వేస్తూ అతను కూర్చున్న ఆపాత మూడు కాళ్ళ కుర్చీని సమీపించేది. అతడు తలెత్తేవాడు. ఆమె అతని కళ్ళల్లోకి లోతుగా బాధగా చూసేది. అతడు తలదించేసుకునేవాడు.

రోజులిట్లాగే గడుస్తున్నాయి. సుజాత తను బాధ పడుతోంది - తన భర్తని బాధపెడుతోంది. ఆమె దరిద్రానికి కారకులెవరు? ఆమె ప్రశ్నకు జవాబెవ్వరూ ఇవ్వరేం?

ఆరోజు నామె భర్తని ఆఫీసుకి సాగనంపి తలుపుమూసి ఏదో యుద్ధంలో—బహుశా ఎన్నోఏళ్ళ క్రితం చిన్న పిల్లల యుద్ధంలో కాలుపోగొట్టుకున్న కుర్చీలో కూర్చుంది. తనెందుకు బ్రతుకుతోంది? తనకోర్కె ఏమి తీరింది? తన భర్త దరిద్రుడు. అతనికి మంచి హృదయం ఇచ్చేకంటె భగవంతుడు ధనం ఇవ్వలేక పోయాడా? తన భర్త దరిద్రుడైతే తనుకూడా అనుభవించాల్సిందేనా? ఇంట్లో ఒక్క కుర్చీలేదు. తన మిత్రురాలి ఇంట్లోలాగ బల్లలులేవు. దీపాలు లేవు. పాత కొంప - రెండు గదులు — అందులో బ్రతుకుతున్నాం అనే పేరుకు మాత్రం రెండు ప్రాణాలుంటున్నాయి. అందులో ఏవక్క ప్రాణికీ సుఖంలేదు. శాంతిలేదు. తనకి మంచి బట్టలు లేవు. తన స్నేహితురాలింటికి వెళ్ళటానికి కూడా సిగ్గుగా ఉంది. ఆమె భోజనాన్ని కూడా మరిచి అదేబాధతో చాలా కాలం గడిపింది. తరువాత బాధగానడుంవాల్చింది.

సాయంత్రం అయింది. ఆమెభర్త వచ్చేవేళైంది. ఆమె ఇల్లు శుభ్రంచేసుకోలేదు. వంట చేయలేదు. తను ప్రొద్దుట్నుంచీ భోజనం చేయలేదు. కాని....ఇంకా దిగులుగా సూన్యంలోకి చూస్తూ ఆలోచిస్తూనే ఉంది. ఆమెసున్నితమైన చెక్కిళ్ళమీదుగా జారిన కన్నీటి బిందువుల చారలింకా వదిలిపోలేదు. ఆమె కళ్ళు బాధతో లోతుకు పోయాయి.

సుజాత ఇంకా ఆలోచిస్తూండగానే ఆమె భర్త వచ్చాడు. ఆమె తలెత్తలేదు. అతను సంతోషంగా అన్నాడు. "సుజా! నీకో మంచి కబురు చెప్పనా?" ఆమె బాధతోటే మెల్లిగా తలపైకెత్తి ఏమీ ఆశ్చర్యం లేకుండానే అతని కళ్ళల్లోకి "ఏమిటి?" అన్నట్లుగా చూసి తలదించేసింది.

అతడు చాలా నిరుత్సాహపడిపోయాడు. మెల్లిగా వెళ్ళి, ఆమె ముఖాన్ని రెండుచేతుల్తోటీ ఎత్తి, ఆమె కళ్ళల్లోకి లోతుగా చూస్తూ అన్నాడు.

"సుజా! ఎందుకంత బాధపడతావ్? మనం దరిద్రుల మనేనా? అతని గొంతులో జీరవినిపిస్తోంది, అతని కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి. ఆమె అతని కళ్ళల్లోకి చూడ లేక తలదించేసుకుంది. నిజమే తమ దరిద్రానికి తామే కారణమా? ఆమెకి చాలా బాధగా ఉంది. కాని - భర్తని కూడా బాధపెడుతోంది. నవ్వు ముఖంతో హుషారుగా వచ్చిన భర్త బాధగా కళ్ళనీళ్ళతో చూస్తున్నాడు తనకేసి. అతని ఆనందాన్నీ సుఖాన్నీకూడా తనే నాశనం చేస్తోందా? ఆమె పెదవులమీదకి రానినవ్వును బలవంతంగా తెప్పించుకుని చురుకుగా అనడానికి ప్రయత్నించి అంది. "నేనా? అబ్బే! బాధపడటంలేదే? ఆ!....అన్నట్టు మీరేదో చెప్తానన్నారుకదూ!" ఆమె కళ్ళు మెల్లిగా మెరిశాయి. అతడు మళ్ళా కొంచెం ఉత్సాహంతో అన్నాడు.

"నాకు తెలుసు సుజా! మనం సుఖసమయంలోకూడా ఇంత బాధపడకూడదు. ఈ వేళ నలుగురిలోనూ ఆనందంగా గడుపుదాం! మా ఆఫీసులో మేనేజరు ఇంట్లో విందు. నేనుకూడా ఒక ఆహ్వాన పత్రిక సంపాదించాను, అది సామాన్య గుమాస్తాలెవ్వళ్ళకీ దొరకలేదు. మనం అదృష్టవంతులంకాదు? పెద్దమనుషులందర్లోనూ విందు" ఆమె బరువుగా తలవంచి అంది. "నాకు మంచిబట్టలు లేవు." అతడామెను దగ్గరకు తీసుకుంటూ అన్నాడు. "పోనీలే. ఇవాళే జీతం వచ్చింది నీకో చీరా; జాకెట్టూ కొంటాను. ఎంతకాలమని పాతబట్టల్తో బాధపడ్తావు? ఉంటే తిందాం! లేకపోతే పడుకుందాం!" ఆమెకళ్ళు కొంచెంగా మెరిశాయి.

"మరి నగలుకూడా ఏమీ లేకుండా పెద్దమనుషుల్తో విందుకెళ్తే ఏం బాగుంటుందండీ?" "మరేం చేద్దాం? ఇప్పటికే బద్దెట్టు సగం జీతాన్ని మింగేసింది....ఆ! అన్నట్లు మీ స్నేహితురాలుందికదూ! ప్రభ! ఆమెనడిగి ఏమైనా తేకూడదూ!"

"నిజమే! ఆమెకు నేనంటే ప్రాణం! ఇస్తుంది. తప్పకుండా ఇస్తుంది. ఏమడిగినా ఇస్తుంది." ఇద్దరూ

# నెక్లెస్

ఉత్సాహంగా లేచారు. ఆమె ముందు తన స్నేహితురాలు ప్రభ ఇంటికి బైల్దేరింది.

సుజాత వెళ్ళేటప్పటికి ప్రభ ఏదో పత్రిక చూస్తోంది. సుజాతను చూడగానే ప్రేమతో ఆహ్వానించి కూర్చో పెట్టి అడిగింది.

"ఏమీ సుజా! ఇన్నాళ్ళనుంచీ కనపడటంలేదు? నేనూ వద్దామనుకుంటానుకాని - తీరటం లేదు?"

సుజాత లోపల అనుకుంది. "మా యింటికొస్తే ఎక్కడ కూర్చో పెడతాను?" అని.

సుజాత పైకి అంది. "కాదు ప్రభా! ఈ మధ్య నా వంట్లో బాగుండటంలేదు.

ఒకక్షణం నిశ్శబ్దంగా గడిచింది. తరువాత సుజాత కంఠం నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ మెదిలింది.

"నేను నీవల్ల ఓ ఉపకారం కోరివచ్చాను. నువ్వు చేస్తావనే నమ్మాను."

ప్రభ ఆశ్చర్యంగా సుజాత కళ్ళల్లోకి చూస్తూ అంది. "ఏం? అల్లా అడుగుతున్నావు? ఏనాడన్నా నిన్ను కాదన్నానా?

"కాదు ప్రభా! ఈవేళ ఒక విందుకు వెళ్తున్నాం. నా కంత చెప్పుకోతగ్గ నగలేమీలేవు నీకు తెల్సుగా! నువ్వేమన్నా ఇస్తావేమోనని వచ్చాను. మళ్ళా రేపు ప్రొద్దుటే నీ వస్తువు నీకు జాగ్రత్తగా అప్పచెప్తాను."

ప్రభ బాధగా చూస్తూ అంది. "క్షమించు సుజా! ఆయన ఊళ్ళో లేరు. పొరపాటున తాళంచెవులాయన దగ్గరే ఉండిపోయాయి.

ఆమె తన వద్ద అబద్ధ మాడదని సుజాతకి తెలుసు. కాని....ప్రభ తరవాత అంది. "ఒక నెక్లెస్ మాత్రం ఉంది. అదిస్తాను. చాలా బాగుంటుంది. తీసుకెళ్ళు." సుజాత ఆశగా చూసింది. ప్రభ పెట్టితాళం తీసి ఒక చిన్న కేసులోంచి తళతళలాడే ఒక హారాన్ని తీసి ఇచ్చింది. సుజాత సంతోషంతో దాన్నందుకుని శలవుతీసుకుని వెళ్ళిపోయింది.

సుజాత కొత్త బట్టలు కట్టుకుని, తన స్నేహితురా లిచ్చిన హారం ధరించి జట్కాబండిమీద విందుకెళ్ళింది. విందు ఘనంగానే జరిగింది. దానికెక్కువగా ఆఫీసర్లు హాజరయారు. అందులో చాలా మందితో సుజాతభర్తకు పరిచయమైంది. చివరికి ఆనందంగానే విందుముగిసింది. సుజాత భర్తతో తిరిగి జట్కాబండిలో ఇల్లుచేరింది. ఆమె తాళం తీస్తూంటే ఆమె భర్త బండివాడికి బాడుగడబ్బు లిచ్చి పంపివేశాడు.

సుజాత తలుపు తెరచి లోపల ప్రవేశించింది. ఆమె వెనుకనే ఆమె భర్త లోపలికి అడుగెట్టాడు. అతని దృష్టి ఆమె మెడమీద పడగా అతని కెందుకో ఆమె మెడలో ఏదో విశేషం గోచరించింది. ఆమె మెడలో నెక్లెస్ లేదేం? ఏమైపోయిందీ?

"సుజా! నీ నెక్లెస్ అప్పుడే తీసేసావా?" ఆమె మెడ తడుముకుంటూ అంది. "అప్పేలేదే!" ఆమె చేతికి తాళితప్ప మరొక వస్తువు స్పర్శ కలగలేదు. ఆమె కంగా రుగా అంది.

"అరె! నెక్లెస్........................"

సుజాత కంగారుగా తనమెడనంతా పరీక్షగా పరిశీలిం చింది. కాని, నెక్లెస్ లేదు.

అతడుకూడా కంగారు పడ్డాడు. ఆమె కొంచెం ఆలో చించి బండిలో పడిపోయి యుంటుందండి అని అంది. అతడు హడావిడిగా బైటకు పరుగెత్తాడు.

నెక్లెస్ పోయిందా? తిరిగి దొరకదా? అది తనది కూడాకాదు. ప్రభ కెంత నమ్మకం చెప్పింది తను? ఆమె మళ్లా తనని విశ్వసిస్తుందా? అది తక్కువ ఖరీదుది కూడా కాదు. తను కొనివ్వగలదా? కొనివ్వకపోతే ప్రభే మనుకుంటుందీ? తన భర్త ఎంతదుర్దశలో ఉన్నాడు? ఇటువంటి ఆలోచనలు సుజాతమెదళ్ళను కలచివేశాయి.

సుజాత భర్త నడివీధిలోకి వచ్చిచూస్తే బండి కనపడ లేదు. అతడు కంగారుగా వీధి రెండువైపులకూ కూడా వెళ్ళి వచ్చాడు. కాని లాభంలేకపోయింది. అతనికికూడా సుజాతకువలెనే మనస్సుపాడైపోతోంది. ఆలోచించిన కొద్దీ ఆమెమీద చిరాకు వృద్ధవుతోంది. అతడుతొందరగా నడుస్తున్నాడు. బండినెంబరైనా గుర్తించలేదే! తప్ప కుండా జట్కాబండిలోనే జారిపడిపోయుంటుంది. ఒక వేళ సుజాతేమైనా బండినెంబరు గుర్తించిందేమో! పోలీసు రిపోర్టు ఇవ్వవచ్చు. అతడు వేగంగా ఆమె ముందుకిదూకి అన్నాడు. "సుజా! బండినెంబరు గుర్తిం చావా?"

ఆమె ఆలోచనల్లోంచి ఒక్కసారి ఉలికి పడి అంది. "లేదు...."

అతడు చిరాకుగా వీధిలోకి పరుగెత్తాడు. వీధిలో కనుపించిన బండినల్లా పరిశీలిస్తూనే ఉన్నాడు పోలీసు స్టేషనుకు వెళ్ళేదాకా. హారంతాలూకు వివరాలన్నీ రిపోర్టులో రాసి సబినస్పెక్టరుకిచ్చాడు. కాని, బండినెంబరు గుర్తులేదు. బండిమనిషి నానవాలుపట్టగలడు. ఐతేయేం! ఆ మహాపట్టణంలో ఏమో! దొరక్కపోతుందా అనే ఆశ మాత్రం అతన్ని వదలలేదు.

రోజులు గడుస్తున్నాయి. రాత్రులు పరుగులెత్తున్నాయి. గడియారాలు మూల్గుతున్నాయి. కాని ఆమె, నెక్లెస్ జాడ మాత్రం దొరకలేదు. ఆమె నిద్రాహారాలు మానివేసింది. ఇప్పటికే ప్రభ ఏమనుకుంటుందోననే ఆవేదన ఆమె నావరించింది. కాని, ఆమె కోరిక తీరలేదు.

భగవంతుడు తన్నవమానపరుస్తున్నాడా? తనను పరీక్షిస్తున్నాడా? తనెందుకింత అగాధంలో పడింది? ఆనాడు విందుకి మానివేసినా బాగుండిపోయేదిగదా! అసలు పేదలైనంత మాత్రాన తనెందుకంత బాధపొందటం? దానివల్లేకదా ఇంతవరకూవచ్చింది! ఛీఛీ! ఇంకెప్పుడూ ఇటువంటిపనులు చెయ్యకూడదు. ఆలోచించగా ఆలోచించగా ఆమెమీద ఆమెకే అసహ్యంకలగ జొచ్చింది.

ఆమె భర్తకూడా చాలా బాధపొందుతున్నాడు. "నెక్లెస్ దొరక్కపోతే తనెల్లా మరోటికొని ఇవ్వగలడు?" అనేదే అతన్ని సర్వావస్థలయందూ పీడించేబాధ.

రోజులు గడచిన కొద్దీ నెక్లెస్ దొరుకుతుందనే ఆశ సన్నగిలసాగింది. ఆమె రోజు రోజుకీ క్షీణించిపోతోంది. చివరికొకరోజున ఆమె ఒక నిశ్చయానికొచ్చింది. తన తండ్రి తనకిచ్చిన భూమి కాస్తా అమ్మి, నెక్లెస్ కొనాలి. అదే అభిప్రాయాన్ని ఆమె ఆనాడే ఆఫీసునుంచి వచ్చిన భర్తకి తెలియజేసింది. అతడూ గత్యంతరంలేక ఒప్పుకున్నాడు. "ఆ భూమి అమ్మితే మూడు వందలో నాలు వందలో వస్తుంది. దాని ఖరీదెంతో కనుక్కోరండి!" అన్నదామెభర్తతో. అతడానాడే వాకబుచేయగా అదే రూపంలోఉన్న నెక్లెస్ ఐదు వందలనితేలింది. మరిమిగిలిన డబ్బు?

అతడు కొద్ది రోజుల్లోనే తనకూ—తన భార్యకూ ఉన్న యావత్స్థిరాస్థినీ అమ్మగా నాలుగువందలువచ్చింది. ఇంకా వంద కావాలి. ఎక్కడనుంచి తేగలడు? తనను నమ్మి అప్పిచ్చేదెవరు? తను రోజు గడవని గుమాస్తా. ఎవరైనా ఇచ్చినా ఎల్లా తీర్చగలడు? చివరికామె ఆలోచించి దానికికూడా ఓ ఉపాయం చెప్పింది. పనిమనిషిని మాన్పించటం. దానివల్ల నెలకు రెండు రూపాయలుకూడ గట్టవచ్చు. తరువాత కాఫీ మానివేయటం.

ఇప్పుడు పాచిపనిదగ్గర్నుంచి ఇంటిపనంతా సుజాతే చేస్తున్నది. ఇరువురు కాఫీ మానివేశారు. ఇంకా ఇంకా ఏవిధంగా డబ్బును కూడదీయగలరో అణాపైసలలో కూడా జాగ్రత్త వహించారు. ఆమె నాటికీ ఆశ్చర్య పడుతోంది. ప్రభ తన నెక్లెస్కోసం కబురైనా పంపదేం? ఆమె ఉండబట్టలేక భర్తని ఒకసారి వెళ్ళి చూసిరమ్మంది. అతడు వెళ్ళివచ్చి ఆమె ఊళ్ళో లేదని చెప్పాడు. ఆమె కొంచెం ఊరటచెందింది.

సుజాత కనారోగ్యం హెచ్చిపోతోంది. డాక్టరు చూసి, ఆమె విశ్రాంతి తీసుకోవాలనీ, పుష్టికరమైన ఆహారం తీసుకోవాలనీ చెప్పాడుకాని, ఆమె ఒక్క నిట్టూర్పు విడచి అనుకుంది. "నాకు సుఖం ఈ లోకంలో లేదు గాబోలు!"

సుజాత సంవత్సరం గడిపింది. ఆ సంవత్సరం వేడి నిట్టూర్పుల్తో, బాధాకరమైన జాలిచూపుల్తో గడిపింది. ఐదు వందలు పూర్తిఐనాయి. ఆమె భర్త ఆనాడె వెళ్ళి క్రొత్త నెక్లెస్ అదేరకపుది అదేరకపు కేసులో జాగ్రత్త చేసింది కొనుక్కువచ్చాడు. సుజాత ఆనాడు సాయంత్రమే ప్రభ ఇంటికి బైలుదేరింది. దారిలో ఆమె ఆలోచించసాగింది.

తనని చూడగానే ప్రభ ఏమనుకుంటుంది? ఏమనుకుంటుంది? తనామెను మోసం చేసిందనుకుంటుంది. ఐతేనేం! జరిగిన కథ యావత్తు ఆమెతో చెప్తేసరి! తప్పకుండా మన్నిస్తుంది—ఆమెకు తనంటే ప్రాణం.

సుజాత ప్రభ యిల్లు చేరింది. అప్పటికి ప్రభ పత్రిక చదువుతోంది. సూజాతనామె ఆశ్చర్యంగా ఒకసారి లోతుగా ముఖంలోకి చూసి ఆహ్వానించి కుర్చీలో కూర్చొ పెట్టింది.

సుజాత మారిపోయింది. ఎంతగా మారిపోయింది! ఇదివరకామె బిగువైన శరీరం! ఇప్పుడు చర్మం పల్చగా

వేలాడుతున్నది. చాలా చిక్కిపోయి సన్నపడిపోయింది. కేశాలు ఎర్రబడ్డాయి. ఆమె పిక్కలు నీరసించాయి. చెక్కిళ్ళు వ్రేలాడ్తున్నాయి. ఈ విశేషాలే ప్రభని ఆమె ముఖపు లోతుల్లోకి ఆశ్చర్యంగా చూడనిచ్చినై.

ప్రభ సుజాత చేతిని సవరిస్తూ అడిగింది! "సుజా! ఏమిటిల్లా చిక్కిపోయావ్?" సుజాత వేడిగా ఓనిట్టూర్పు విడిచింది. తనల్లా మారిపోవటానికి కారణం ఏమిటి? నెక్లెస్....

"నామీద నీకుగాని కోపం వచ్చిందా?" ప్రభ అంది. క్షమించు సుజా! నువ్వు మా యింటికి వచ్చివెళ్ళినవారం రోజులకే మేం యాత్రలకి బైల్దేరాం! అదైనా హఠాత్తుగా బైల్దేరాం. నీకు తెలియజేద్దామనుకున్నాగాని టైములేక పోయింది. తరవాత ఉత్తరం రాయటానికి అశ్రద్ధ ఐపోయింది. మేం ఇక్కడికొచ్చి సుమారు నెలరోజులైంది. అప్పట్నించీ ఏదో మహిళా సంఘానికి కార్యదర్శిగా ఉండటంవల్ల నిన్ను కల్సుకునేందుకు తీరికలేకపోయింది. ఇవాళో రేపో వద్దామనుకుంటున్నానింకా. ఇంతలోనే నీవూ వచ్చావు. అంతేగాని, నీమీద నాకు కోపం ఏంలేదు."

సుజాత కొంచెం ఆశ్చర్యపడింది. ఆమె నెక్లెస్ మాట ఎత్తదేం? చివరికి తనే అంది.

"నువ్వానాడు నాకో నెక్లెస్ ఇచ్చావు ..." "నెక్లెస్?...." ప్రభ ఆశ్చర్యంగా అమె మొఖంలో కొకసారి చూసి, ఓసారి ఆలోచనగా చూసింది, అహ! అసలామెకు జ్ఞాపకమున్నట్టే లేదు.

"మరే! అవును.... అప్పుడిచ్చాను. అదీ?" ప్రభ సుజాతకేసి ప్రశ్నార్థకంగా చూసింది.

సుజాత మొదలు పెట్టింది "అది ఆనాడు విందుకెళ్ళి బండిలో వస్తుంటే ఎక్కడో పడిపోయింది, నా సంగతి నీకు తెల్సుగా! ఒకళ్ళ వస్తువును దగ్గరుంచుకోను ఇన్నాళ్ళూ నేను బాధపడ్తూనే ఉన్నాను. నువ్వేమనుకుంటావో అని" ప్రభ ఆశ్చర్యంగా చూస్తోంది వింటూ.

"దాని కోసం పోలీసు రిపోర్టిచ్చినా దొరకలేదు. తరవాత నా అరెకరం అమ్మితే నాలుగు వందలొచ్చింది. దాని ఖరీదు ఐదువందలట. మరోవంద ఇంట్లో పనివాళ్ళని, దూబరా ఖర్చులు, కాఫీ మొదలైనవి తగ్గించి, నేనే పనంతా చూసుకుంటూ కూడబెట్టాను. నే నీ విషయం అంతా చెప్పి క్షమాపణ కోరాలనుకున్నాను. ఈ రోజునే ఆయన కొనుక్కొచ్చారు. ఇదిగో. నన్ను క్షమించవూ!" ప్రభ చేతులు పట్టుకుంది సుజాత.

ప్రభ ఆశ్చర్యం, వేదనా మిళితమైన చిన్న నవ్వునవ్వి. ఒక్కసారి సుజాతని కౌగలించుకుంది.

"క్షమించు సుజా! నిన్నన్ని కష్టాలు పెట్టాను. అసలు రహస్యం నీకు చెప్పలేదు. నేను నీకిచ్చింది నకలు నెక్లెస్. దాని ఒరిజినల్ ఇనప్పెట్టిలో ఉంది. తాళాలు మావారు పట్టుకెళ్ళారని చెప్పినట్టున్నాను బహుశా. దాని ఒరిజినల్ ఐదు వందలే. కాని, నకలది- అంటే నీకిచ్చినది ఐదు రూపాయలకంటే ఎక్కువవుండదు. ఈవిషయం చెప్తుంటే ప్రభ కళ్ళు కొంచెం కొంచెంగా మెరిశాయి.

సుజాతకి భూవలయం అంతా ఒక్కసారిగా గిర్రున తిరిగినట్లనిపించింది. కాళ్ళకింద భూమి పగిల పోతున్నది. ఆమె గుండె వేగంగా కొట్టుకొంటున్నది. చేతిలో రుమాలు జారి క్రిందపడిపోయింది. కళ్ళు తిరుగుతున్నాయి. ఆమె నిలబడలేక మెల్లిగా ప్రక్కనున్న కుర్చీలో కూలబడిపోయింది ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూ!



# నవ్వు

శ్రీమతి ఏ. ప్రభావతి.

'నవ్వు' ఆరోగ్యానికి అమోఘమైన ప్రక్రియ. ఇది మానవజాతికి దైవప్రసాదితమైన పరమౌషధం. నవ్వు అందరికీ సులభ్యం— ఏ పదవిలో, ఏ వృత్తుల్లో, ఏ వయస్సులో, ఏ స్థితిగతుల్లోనున్నవారైనా— పైసా ఖర్చు అక్కరలేకుండా ఆనందించవచ్చు. రోజుకొక్కసారియైనా పక్కలు పగిలేటట్లు హాయిగా నవ్వుకొనేవారికి వైద్యుని అవసర ముండదని ఘనవైద్యులే చెపుతారు. ఆరోగ్య రక్షణకేగాదు, ఆయుస్సును పెంచగలిగింది నవ్వు. యంత్రాలకు చమురెలాంటిదో శరీర యంత్రానికి 'హాసం' అలాంటిది. శరీర మానసిక రోగాల్ని రెంటినీ బయటకు నెట్టేస్తుంది—నవ్వు. జీర్ణ శక్తిని హెచ్చించడమేగాదు, రుచిగానుండే పదార్థాల్ని రుచితరంగాను, రుచితమంగాను చేస్తుంది.

నిజంతెలుసుకుంటే— నవ్వు— శరీరవయవాలకూ మనస్సుకూ గూడ ప్రకృతి యేర్పరచిన ప్రశస్తమైన వ్యాయామ విధానం. ఊపిరి తిత్తుల్లోని శ్వాసను ప్రకోపింపజేసి, శరీరాంగాలనన్నింటినీ, ఝంఝూమారుతం వృక్షాల్ని కదిల్చినట్లు, కదిల్చేస్తుంది. ముఖానికీ అన్ని అంగాలకూ రక్త ప్రసారాన్ని హెచ్చిస్తుంది, కన్నుల్ని కాంతిమంతం చేస్తుంది. ముఖవర్చస్సు హెచ్చిస్తుంది. నవ్వే వారిముఖం. వికశించిన పుష్పంలాగున చూడబుద్దేస్తుంది. ఆనందాన్నిస్తుంది. నవ్వేవారికి నూతనోత్సాహం, విపరీతమైన బలం వచ్చినట్లుంటుంది - వెంటనే. అనేక రోగాలికి హాసం తిరుగులేని దివ్యౌషధంగా పనిచేస్తుంది. ఎంత మోతాదు ఎక్కువైతే అంత అమోఘ గుణం యిస్తుంది. సమర్థులైన భిషగ్వరుల సిద్ధౌషధం కంటె, ప్రవీణులైన పాశ్చాత్య డాక్టర్ల ప్రిస్క్రిప్షన్లకంటె, పటుతరమైనదీనవ్వు. ఐనా ఎందరుదీన్ని సేవిస్తున్నారు? డబ్బిచ్చి కొనుకున్న గాజుపెంకుపై ఉండేమోజు ఊరికే వచ్చిన వజ్రంపై నుండదు- అదేమిచిత్రమోగాని !

నవ్వు ఆరోగ్య వర్ధనకరం, ప్రాణ రక్షకం, విజయప్రదం, ఆనందోత్పాదకం. సంఘ సన్మానం సమారాధనల్లో నవ్వుకంటె మంచి విందే లేదు ; (ఐతే యదార్థంగా భోజనం చేస్తున్నప్పుడు మాత్రం వద్దు సుమండి !) ఉత్సవ సమయాల్లోను వివాహ సందర్భాల్లోను నవ్వుకంటె శ్రావ్యతరమైన వాద్యంలేదు. వసంత ఋతువుకు కోకిలాగమనంలాగున ఇలాంటి సందర్భాల్లో నవ్వులుంటేనేగాని రక్తే గట్టదు. నవ్వు ఒకరినుంచి ఒకరికి ఇట్టే వ్యాపించే గుణం కలది.

నిజంగా నవ్వుయొక్క రోగ నివారక శక్తులేగాదు, ప్రజారంజక గుణమేగాదు, ఆయుర్వృద్ధి తత్వమేగాదు ప్రజలు పూర్తిగా గ్రహించియుంటే, ప్రపంచంలో సగం మందుల షాపులు మూసేయవచ్చు, కష్టాలనుకొన్నవి వచ్చినప్పుడైనాసరే, వాటినిజూచి విరగబడి నవ్వగలిగే వారిముందు, అవి నీటి బుడగల్లాగ చితికి నశించిపోతాయి. ఒకరికోసరమే గానీయండి, లేదా మీ ఆరోగ్యరక్షణకే గానీయండి, కారణం ఉన్నా సరే లేకపోయినాసరే, మనఃపూర్వకంగా, (డొక్కలు చెక్కలయ్యేటట్లు- అంటే అంత పూర్తిగా నన్నుమాట), రోజుకు అధమం మూడు సార్లయినా, ఇల్లంతా మారుమ్రోగేలాగ, నవ్వుకోవాలన్న నియమం పెట్టుకోండి ! పిచ్చి ఆసుపత్రి పేరు ఎత్తే పిచ్చివారెవరైనా ఉంటే, వారిని కూడగట్టుకొని, మళ్ళీమరోసారి నవ్వండి !

ఆనందం, హాసం, మీ స్వస్వభావాన్ని రోపించడానికి, పుట్టుకవల్లనే మీకు సంక్రమించిన పసుపు ఆస్తులని తెలుసుకోండి.

ఉల్లాస చిత్తత - నుండుదే నీవు,
నీతోడ నవ్వును- నిఖిల లోకంబు.
పాడుదే మారుగా - పాడును గిరులు,
నిట్టూర్పు గాలిలో-నే లయమందు.
హర్షమాకర్షించు - నందర దరికి,
దొలగి పోజేయును - దుఃఖమెల్లరకు
పెక్కురు సఖుల గా- వించు మోదంబు,
వారి నందర నెడ - బాపు ఖేదంబు.
విందన్న నింటిలో - పెక్కురుండుదురు,
పస్తన్న నందరు - జారిపోదురుగా !



## వాక్చాతుర్యం !

శ్లో॥ "అనవేమ మహీపాల స్వ_స్త్యస్తు తవబాహవే,
ఆహవే రిపుదోర్దండ చంద్రమండల రాహవే !"

అనవేమ నృపాలునిపై నొక కవి, పైశ్లోకమును చెప్పగా, రాజు సంతసించి మూడువేల రూపాయలు పారి తోషికము నీయబోయెనట. కవి, "నేను నాల్గువేలు (వే అను నక్షరములు) ఒసగిన మీరు మూడువేలే యిచ్చుట ధర్మమా ?" యనెను. రాజు, నాల్గువేలొసగితిననెను. కవి, "మే మొసగినదే తిరిగి మా కొసంగి పంపుట న్యాయమా ?" యనెను. రాజు, ఐదువేలు గైకొనుడనెను. కవి, తన (ఆర్వేలనియోగి) కులమును గురితించితిరా ? యనెను. రాజు, ఆరువేలిచ్చితిననెను. కవి, "నేను పుట్టువుతోడనే యార్వేలవాడ !" ననెను. రాజు, ఏడు వేలుగైకొని యిక సంతసింపుడనెను. కవి, "సంతసించుటకు మీరిచ్చెదమన్న సంఖ్య మంచిదికాద"నెను ! రాజు, కవి వాక్చాతుర్యమునకు మెచ్చి, కడకు ఎనిమిది వేలిచ్చి సాగనంపగలిగెనట !

## దశరా - మశరా !

పురాణం చదివే శాస్త్రిలుగారికీ, అర్థం చెప్పే శాస్త్రిలుగారికీ తర్కం వచ్చిందట ఒక రోజున. నేను బాగా చదివితేనేగాని పురాణం రాణించదని ఆయనా, నేను వ్యాఖ్యానం చేసి విడమర్చి చెపితేగాని పదిమందికీ అర్థంకాదని ఈయనా వాదులాడేరట. ఇందులో ఎవరు గొప్ప ? అని తగవులాడితే అర్థం చెప్పేవారే హెచ్చని సభికులంతా తగవుతీర్చేరు. ఐతే నా సంగతి చూపిస్తా ననుకున్నాడు చదివే ఆయన. "దశరా - మశరా !" అని చదివేడు ఒకచోట. ఇదేమిట్రా నాయనా, "రాముడి తోక-పివరుండిట్లనియె" అన్నట్లుందని అంతా కొట్టుమిట్లాడేరు ! మళ్ళీ చూడండి అన్నారు. ఈసారి "దశరామ - శరాః" అని చదివేడు. అంటే దశరథ రాముడియొక్క బాణాలు అని అర్థం చెప్పుకుందామన్నా కుదరకుండాయుంది. మళ్ళీ ఒక్కసారి చూడండి, శాస్త్రిలుగారూ అన్నారు. ఈసారి "దశ — రామశరాః" అని సరిగా చదివేడు. పదియైనటువంటి రాముని బాణాలు అని అర్థం చెప్పుకుంటే అప్పుడు సరిపోయింది ! చదివే ఆయనకు కూడా సమాన ప్రాధాన్యత ఉందని అంతా ఒప్పుకున్నారు. పండితులు పేచీలు వదులుకున్నారు. కాని అప్పట్నుంచీ 'దశరా — మశరా' మాత్రం మనల్ని వదల్లేదు !

## వడ్డింపుల మేష్టారు

మాకో మేష్టారుండేవారు. ఆయన క్లాసులో ఎవరైనా అల్లరి చేస్తే బెత్తాం తెచ్చి, రెండు వడ్డించి వెళ్లేవారు. ఇది పోనీ కొంత బాగానే ఉందనుకోండి. అంతటితో ఊరుకుంటే మేముమాత్రం పేరెందుకు పెడతాం! ప్రక్క పిల్లాణ్ణి కూడా రెండు వడ్డించి మరీ వెళ్ళేవారు. "ఇదేం టండి- మేష్టాండీ— నేనేం చేసేనండీ ?" అంటే, "నీవు అల్లరి చేసినప్పుడు నీ కోసరం మళ్ళీ వస్తానట్రా ?" అనేవారు !

## అత్తగారి పెత్తనం

కోడలు క్రొత్తగా కాపురానికొచ్చింది. ఇంట్లో అన్నిటికీ అత్తగారి పెత్తనం ఉంటుందని ఎరుగదు, పాపం ! బిచ్చగాడొస్తే, 'బియ్యం నిండుకున్నాయి— వెళ్ళిరా నాయనా" అంది. లోనున్న అత్తగారు చర్రున చక్కా వచ్చింది. పోయేవాణ్ణి తిరిగి పిలిచింది. (ఆశతో అతడొచ్చేడు, ఏమి అపరాధం చేసేనో అని ఈవిడ చూస్తూవుంది.) "బొమ్మన దానికి అదెవరు ? అది బొమ్మంటే మాత్రం నీ వెందుకు పోతున్నావు ? నేను బొమ్మంటున్నాను. ఇప్పుడు పో" అని ఆజ్ఞాపించింది. అప్పటినుంచీ ఇలాంటి పిచ్చి పెత్తనాల కన్నింటికీ 'అత్తగారి పెత్తనం' అని లోకం పేరెట్టింది.

## సత్యకాలపు అవ్వ

మనుమడు : అవ్వా, అవ్వా ! రేపు రైలుకెళ్ళాలి ; పదింటికల్లా వంటచేసేయ్ ?

అవ్వ : పదెందుకురా ? రెండు గంటలకల్లా వంట చేసేసి, వడ్డిస్తే సరా ?

మనుమడు : అందుకే మిమ్మల్ని సత్యకాలం వాళ్ళంటారు ! నీ పుణ్యమా అంటూ ముందు చెప్పేపు - రక్షించేవ్ !

అవ్వ : అదేమిట్రా ?

## అమాయకపు ఇల్లాలు

నేనంతకు ముందెన్నడూ నీటి కుళాయిలు చూడలేదు. పట్నం వెళ్ళిన కొత్తలో నీటి గొట్టంగల గదిలోనికి వెళ్ళితిని. త్రాచు బుసకొట్టు చున్నట్లు కుళాయినుండి శబ్దము వినవచ్చెను. హడలిపోయి, బయటకు పరుగెత్తి, ఇతర స్త్రీలకు చెప్పితిని- 'నీటి గొట్టములో పామున్నది, బుసకొట్టుచున్నద'ని. వారందరు పక్కున నవ్వి- 'పాము గాదు, నీరు వచ్చుటకు ముందు బుస బుస మను శబ్దము వచ్చును' అని ఊరడించిరి. అంతట మేమందరము కలిసి పక్కులు పడిపోవునట్లు నవ్వ నారంభించితిమి!"

(శ్రీరామకృష్ణ పరమహంస సతీమణి- శ్రీ శారదా దేవి చరిత్ర నుండి)






# అందమైన అమ్మాయి

ఎల్. ఎం. బాబూ

ఒక చిత్రకళా ప్రదర్శనంలో
ఒక అమ్మాయి అడిగింది.

"ఏమండీ! ఇటు చూడండీ!
ఎనిమిదో నెంబరు చిత్రంలో
ఏమిటున్నది గొప్పతనం?
తెలుపునలుపు రంగులలో
తెల్లకళ్ళ నల్లపిల్లను
తేలికగా చిత్రించారు.

వెలచూస్తే వందరూకలు
వర్ణంచూస్తే నల్లపిల్ల
దానికిచ్చిన నామకరణం
"అందమైన అమ్మాయి"
ఎక్కడున్నదా అందం?
ఎక్కడున్నదా చందం?"
అని తర్కించి తర్కించి
అడిగింది ఆ అమ్మాయి.

నేను కొంత చెప్పాను
నేను చెప్పింది ఆమె వినలేదు
వెనుకకూ ముందుకూ జరిగి,
ఒక కన్ను మూసి, ఒక కన్ను తెరిచి
చూసింది — చూసింది నిలబడి
కడకు మరల తిరిగి
అడిగింది ఆ బొమ్మగురించి
"ఎవరీ బొమ్మ చిత్రించింది
ఎడ్రసు మీకు తెలుసా? యిస్తారా?"
నవ్వుకుంటూ యిచ్చాను
ఆ చిత్రకారుని చిరునామా.

అద్దాల చేతి సంచీ తెరిచి
ఆ చిరునామా కాగితాన్ని మడిచి
అందులో అడుగున ఉంచింది.

*　　*　　*

ఒక రోజు ఉదయం గదిలో
ఒక చిత్రం చిత్రిస్తున్నాను
టక్.... టక్.... మని తలుపుకొట్టిన శబ్దం
కిర్.... కిర్.... మనిజోళ్ళ చప్పుడు
సరిగా వినిపించుకోలేదు నేను
మరలా తలుపుకొట్టిన శబ్దం
"ఎవరక్కడ? లోపలకు రండి"
అన్నానుకాని తిరిగి చూడలేదు.
తలుపు తెరిచిన శబ్దం
గదిలో అడుగుల శబ్దం
అప్పుడు నేను బొమ్మమీద
అన్ని రంగుల కలయికనూ
ఆలోచిస్తూ కూర్చున్నాను.
అయిదునిమిషాల తర్వాత
అక్కడకు వచ్చినవారెవరో
ఒకసారి తిరిగి చూశాను.
ఆశ్చర్యం కలిగింది యిద్దరికీ
"నమస్తే" అందామె
"నమస్కారం" అన్నాను నేను
అంతవరకూ నిలబడే ఉందామె
కుర్చీలు లేవు గదిలో —
కూర్చోమన్నాను చాపమీద
పరికిణీ నలిగిపోతుందనో
వల్లెవాటు మాసిపోతుందనో

# అందమైన అమ్మాయి

ఎందుకో ! ఆమె కూర్చోలేదు.
"ఆరోజు ఎగ్జిబిషనులో
"అందమైన అమ్మాయి" బొమ్మ
చిత్రించింది మీరేనన్న మాట
అంటే జ్ఞాపకం లేదేమో !
ఆ తెల్ల కళ్ళ నల్ల పిల్ల బొమ్మ."
"ఔనన్నాను" నేను
"అయితే చెప్పలేదేమి ?
అసలాబొమ్మకు మీరు
అందమైన అమ్మాయని
ఎందుకు పెట్టారు పేరు ?
ఎక్కడున్నదా అందం ?
నాకు నచ్చలేదా చిత్రం
నాకు నచ్చలేదా వర్ణం
ఇంకా మీ బొమ్మలిక్కడ
ఏమైనా ఉంటే చూపిస్తారా ?"

నాదగ్గరున్న బొమ్మలన్నీ
నాలుగు గోడలచుట్టూ
వరుసగా నిలబెట్టాను.
పురాతన చిత్రాలు చూసి
వర్ణములు నచ్చలేదంది
క్యూబిస్టు చిత్రాలు చూసి
పిచ్చిపిచ్చి బొమ్మలంది.
ఆధునిక చిత్రాలు చూస్తూ
మరలా అడిగిందామె
"అదిగో ! ఆమూలనున్నది
నల్ల పిల్ల బొమ్మ
దానిగురించే నేనడిగేది
దానికి "అందమైన అమ్మాయని"
ఎందుకు పెట్టారు పేరు."
నాజవాబుకు ఎదురు చూడకుండానే
ఆమె ప్రశ్నలవర్షం కురిపించింది.
"ఎక్కడున్నది అంచం అంటే
ప్రతిచోటా ఉందంటాను
ప్రతి వస్తువులో ఉందంటాను
కలువరేకుల్లాంటి కళ్ళలో
కాటుకపెట్టిన కనురెప్పల్లో
లిప్‌స్టిక్ దిద్దిన పెదవుల్లో
పెన్సిలు దిద్దిన కనుబొమల్లో
పౌడరుకొట్టిన ముఖముల్లో
ఉందంటావు అందం నీవు.
వాటిలోనే కాదుసుమా !
మంచితనం కలిగిన మానవులల్లో
మఱుగుపడి ఉందొక అందం
ఆ అందం చూచుటకు మనకు
కళ్ళురెండూ సరిపోవంటాను
వాటికితోడు ఆత్మసహాయపడితే
కనుగొనగలవా అందం.

మంచితనంవలన గలిగిన
అందానికి లేదు చలనం
ప్రొద్దుట కొట్టిన రంగుపౌడరు
చెమటతో కలిసిపోతుంది.
ఉదయం వేసిన లిప్‌స్టిక్ రంగు
మధ్యాహ్నం మాడిపోతుంది.
ఇందులోనే ఉందంటావు
అందం చందం నీవు.

ఇంతకూ నల్లపిల్ల బొమ్మలో
రంగులు నచ్చలేదంటావు
తెలుపురంగు ఆమె సుఖం
నలుపురంగు ఆమె కష్టం
తెలుపునలుపు కలయిక ఆ చిత్రం
కష్టసుఖాల కలయిక ఆమె జీవితం
తెలుపంటే ఒకటే రంగనుకున్నావు
కాదు కాదు ఏడు రంగుల కలయిక
ఆ తెల్లకళ్ళలో ఏడురంగులున్నాయి.

కరుణ, ప్రేమ, సత్యం, ధర్మం
న్యాయం, శాంతం, అందం
ఈ ఏడూ ఆ తెల్లకళ్ళలో
ఉన్నాయి చూడునెమ్మదిగా
అందుకే ఆ బొమ్మకు
"అందమైన అమ్మాయని
పేరు పెట్టాను నేను."
నేను చెప్పడం ముగించాను.

ఆమె బొమ్మదగ్గరకు వెళ్ళి
అయిదు నిమిషాలు చూసింది
"ఈ బొమ్మ నాకు కావాలి"
అంటూ అద్దాల చేతిసంచీ తెరిచి
వందరూపాయలు తీసింది
ఆ అందమైన అమ్మాయి.






# నోరు

స్త్రీ సౌందర్యాన్ని పెంపొందించే వాటిల్లో అందమైన నోరు ఒకటి. చిన్న నోరు కలిగి వుండడం నిజంగా అదృష్టమనాలి. చిన్న నోరు కలవాళ్ళు పాడుతున్నా, మాట్లాడుతున్నా ముచ్చట వేస్తుంది. "నోరు మంచిదైతే ఊరు మంచిదౌతుంది" అంటారు పెద్దలు! వాస్తవం. ఇప్పుడు నోటి పరిమాణాన్ని గురించే మనం చెప్పుకుందాం. చిన్ననోరు లేదని విచారించక్కర్లేదు. కొన్ని సమయాల్లో ఎటువంటి నోరైనా ఆకర్షణీయంగానే ఉంటుంది. ఈ నోరు చిన్నదైనా పెద్దదైనా పెదిమలు సన్నగా ఎర్రగా వుంటే ముఖానికొక ఆకర్షణ వస్తుంది. ఈ పెదిమల కలయికలో ఎంతో ఆకర్షణ అందము ఇమిడి ఉంటాయి. కొంతమంది నవ్వేటప్పుడు పెదిమలను వంకరగా తిప్పుతారు. అలాగే మాట్లాడేటప్పుడుకూడా. ఈ నవ్వు కొంతమంది కెంతో శోభనిస్తుంది. కొంతమంది వంకరనవ్వు అసహ్యంగా కూడా వుంటుందనుకోండి. కొంతమందికి పెదిమలు కొరకటం గిల్లడం మొదలైన అలవాట్లుంటాయి. దాని వల్ల చూసేందుకు అసహ్యంగా వుండటమే కాక పెదిమల సహజ అందం పోయి అవి లావుగా మొద్దుబారి పోతాయి. ఈ అలవాట్లు మానుకోవడం మంచిది. చలికాలంలో పెదిమలు పగిలి రక్తం రావడం జరుగుతుంది. అలాంటప్పుడు సైబాల్, జాంబక్ మొదలైన ఆయింట్‌మెంట్సో లేక వాసలైన్, నూనె, కోల్డ్ క్రీమ్ మొదలైనవో పెదిమలకు రెండు పూటలా నెమ్మదిగా రుద్దడం మంచిది. ఇలా చేయడం వల్ల పెదిమలు మెత్త పడ్డమేకాక పెదిమల మీది నలుపు విరిగి చూసేందుకు చక్కగా వుంటుంది.

ఈ పెదిమలు ఎంత అందంగా వున్నా పై పెదిమల మీద వెంట్రుకలుంటే అందవికారంగా ఉంటుంది. అలాంటప్పుడు ఆ వెంట్రుకల్ని తీసేసేందుకు చూడాలి. వ్రేళ్ళతోనో, లేక చిన్న తండసంతోనో తీసేయడం తేలిక. లేదా కోల్డ్‌క్రీమ్ కొంచెం మందంగా రుద్దడం మంచిది. ఈ వెంట్రుకల్ని తీసేందుకు యింకో మార్గంఉంది. నాలుగు చిటికల పసుపులో ఒక చిటిక టేబుల్ సాల్టు గాని, మెత్తగా నూరిన మామూలు ఉప్పుగాని వేసి, నీళ్ళలో కలిపి కొంచెం మందంగా రుద్ది, పావుగంట సేపు అలా ఉంచితే రోమాలు సులువుగా వచ్చేస్తాయి.

ఇలా చేసి ఆమీదట కోల్డ్‌క్రీమ్‌గాని, స్నో గాని రాయడం మంచిది. అసలు సహజంగా స్త్రీల అధరోష్టం దొండపండులా అందంగా ఉంటుందికాని, కొందరు ముఖ్యంగా పాశ్చాత్తులు, పెదిమలకి లిప్‌స్టిక్ వేస్తారు. ఇది వేయడం తప్పు కాకపోయినా ముఖానికొక విధమైన కృత్రిమఅందంవచ్చి మన సంఘంలో విపరీతంగా చూస్తారు. కనుక యిది సందర్భానుసారంగా వాడడం మంచిది,

శ్రీ సువేణికాశ్యప్.

లిప్‌స్టిక్‌కు బదులు మన సంఘంలో తాంబూలం వాడతారు. అది ఉత్తమమైన ప్రక్రియ. పెదిమలకు అందమిస్తుంది; నోటికి సుగంధ మిస్తుంది.

ఇలా పెదిమలను మాత్రం అలంకరిస్తే చాలదు. పండ్లను గురించి మంచి శ్రద్ధ తీసుకోవాలి, ఇంకా చెప్పాలంటే మన శరీరంలో దేనికీ యియ్యని శ్రద్ధ, జాగ్రత్త పండ్లకు చూపాలి. మన అందమూ ఆరోగ్యమూ చాలా వరకు మన పనువరుసను బట్టి ఉంటుంది.

పండ్లు మామూలుగా ప్రొద్దుటే కడుగుతాం. ఆకడిగేటప్పుడు ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలి. పండ్లను సామాన్యంగా పండ్లపొడితో రుద్దుతాం, ఇది మంచిది కాదనలేముగాని యీ పండ్ల పొడిని చేత్తోకంటె, వేపపుల్లతోనో, గానుగ పుల్లతోనో, యింకా ఉత్తమం ఉత్తరేణివేరు, మర్రి ఊడ వగైరా పుడకలతోనో అద్ది ఉపయోగించటం మంచిది. పేస్టు, బ్రష్ ఉపయోగించటం మంచిదే గాని బ్రష్‌ను తగిన జాగ్రత్తతో ఉంచుతూ దాన్ని నాలుగు నెలలకన్నా ఎక్కువ ఉపయోగించకుండా ఉండాలి. కొంత మంది రెండు పూటలా పండ్లు తోముకుంటారు. ఇది పండ్ల ఆరోగ్యానికి బాగా తోడ్పడుతుంది. రాత్రుళ్ళు పండ్లను తోముకుని చల్లని నీటితో ముఖం కడుక్కుంటే హాయిగా ఉండి సుఖ నిద్ర పడుతుంది.

పండ్లను బలంగా వుంచేది కాల్షియమ్ (సున్నం). ఇది తినే తిండిలో లోపిస్తే పండ్లు కదలడం, ఊడడం జరుగుతుంది. క్యాలిషియమ్ తీసుకోవడంలో ఏమర కూడదు. దీనివల్ల ఎప్పటి కప్పుడు కొత్త కొత్త ఎముకలు వచ్చి పండ్లు గట్టిగా ఉంటాయి, ఇది తెలకపిండి వగైరా కూరల్లో సమృద్ధిగా ఉంటుంది.

కొంతమంది ఎప్పుడు పిప్పరమెంట్లు, చాకలెట్లు మొదలయిన తీపి పదార్థాల్ని నములుతూ ఉంటారు. ఇది పండ్లకు చాలా చెడ్డది. పంచదార పండ్ల బలాన్ని పోగొట్టడమే కాకుండా అందాన్నిచ్చే పండ్లపై నుండే ఎనామిల్‌ను నాశనం చేస్తుంది. కనుక యీ తీపి పదార్థాల్ని విరివిగా నమిలే అలవాటు పోగొట్టుకోవాలి. పండ్లలోనుండి నెత్తురు కారడం, పండ్లు నొప్పి పెట్టడం, 'సి' విటమిన్ లేకపోవడంవల్ల జరుగుతుంది. ఈ 'సి' విటమిన్ ఎంత తీసికొన్నా మితమనేది వుండదు. పెద్ద ఉసిరి, టొమెటొ, నిమ్మ వగైరాల్లో యిది విస్తారంగా ఉంటుంది. **Tooth Drops** వేసుకోవడంవల్లకూడా ఒక్కొక్కసారి నొప్పి తగ్గుతుంది. సొంఠి పొడి, వుప్పు కలిసి అద్దితే పండ్ల తీపు తగ్గుతుంది. ఇలా ఆహారములో జాగ్రత్త మాత్రమే కాకుండా పండ్లను ఉపయోగించేటప్పుడుకూడా జాగ్రత్తగా ఉండాలి. గట్టి పదార్థాలేమీ మోటుగా కొరకరాదు. ఐస్‌క్రీమ్ మొదలైన విపరీతంగా చల్లగాఉండే పదార్థాల్ని ఎక్కువగా తినడం మంచిదిగాదు. దానివల్ల పండ్లు ఊడిపోవడం, పెచ్చులు, పెచ్చులుగా విరిగిపోవడం జరుగుతుంది.

పండ్లతో పాటు చిగురులకుకూడా శ్రద్ధ చూపడం అవసరం. తెల్లని చీరెకు ఎర్రటి అంచులాగ పండ్లకు ఈ చిగుళ్ళు ఒక వింత అయిన అందాన్నిస్తాయి. ఈ చిగుళ్ళని ప్రొద్దుటా సాయంకాలం పండ్లతోపాటు వేలితో రుద్దాలి. ఇలా రుద్దడంవల్ల చిగుళ్ళమీద నున్న నలుపు రంగు పోవడమే కాకుండా పండ్లకు బలం వస్తుంది. కొంతమందికి చిగుళ్ళు నల్లగా అసహ్యంగా ఉంటాయి. అలాంటప్పుడు ఎర్ర మిరియాలు, పచ్చమిరియాలు నమలడం మంచిది. అవి దొరకని పక్షంలో 'బి' విటమిన్ గాని అది ఉన్న మార్మైట్‌గాని లేదా ఆ విటమిన్ విస్తారంగా నున్న ఆకుకూరల వంటివిగాని ఎక్కువగా తీసికొంటే ఆ నలుపు పోతుంది.

ఒక్కొక్కసారి పైత్యం వల్ల, జబ్బువల్ల నోరు వాసన వేస్తుంది. అలాంటప్పుడు పైత్యానికి విరుగుడు తీసుకోవడం, ఉప్పు నీళ్ళతో పుక్కిలించడం మంచిది. ఇలా శ్రద్ధతో నోటిని కాపాడుకొన్నప్పుడే ఆకర్షణీయమైన చిరునవ్వును పొందగలం.






# డూ డూ బసవన్న

శ్రీ ఎల్. ఆర్. కె. శర్మ.

డూడూడూ — బసవన్న
రారారారా బసవన్న -
అయ్యకి దండం పెట్టరా -
వంగి సలాములు చెయ్యరా -
కనికరించమని వేడరా -
దయచూడమని కోరరా -
డూడూడూ — బసవన్న !

నిజం చెప్పరా బసవన్న
నిన్నే నమ్ముకున్నాంరా -
పిల్లలగీత అయ్యకు
ఉందేమో చూడరా -

"అంబా ! అంబా !"
చూస్తిరా బాబుగోరు
ఔనన్నాడు బసవన్న
మీకు గీతుంది బాబుగోరు
గొప్పోరు మీరు బాబుగోరు- !

నిజం చెప్పరా బసవన్న
నిన్నే నమ్ముకున్నాంరా.
పెద్దుద్యోగం అయ్యకు
ఔతుందేమో సూడరా !

"గణ గణ గణ గణ"
చూస్తిరా బాబుగోరు
నిజం పలికేడు బసవన్న
మహారాజౌతారు బాబుగోరు.
మహాదొడ్డవారు బాబుగోరు
పండగ పూటిది బాబయ్యా
పప్పు దప్పళం పెట్టించండి.

మంచోడివిరా బసవన్న
మరి పోదాం రారా బసవన్న
డూడూడూ బసవన్న
రారారారా బసవన్న —

# కష్టార్జితం

శ్రీ పిళ్ళా సుబ్బారావుశాస్త్రి.

అవి ఉజ్జయినీ నగరాన్ని భోజరాజు పరిపాలిస్తూవుండే రోజులు. భోజరాజు గొప్పవాడు. ఆయన రాజ్యంలో దారిద్ర్యం అనేది లేకుండా చేశాడు. పండితులను, కవులను పోషించేవాడు. ఎవరు యేది అడిగినా లేదనక యిచ్చేవాడు.

అటువంటి ఉజ్జయినీ పట్టణంలో ఒక పేద బ్రాహ్మణ కుటుంబం వుండేది. బ్రాహ్మణుడు ధర్మబుద్ధి, న్యాయబుద్ధి గలవాడు. ఆతని భార్య చెప్పింది "ఏమండీ! మన రాజుగారు ఎవరు యేది అడిగినా యిస్తున్నారట....! మీరుగూడా పోయి మన దరిద్ర బాధ ఆయనకి చెప్పండి! ఆయన ఏదన్నా యిస్తే సుఖపడదాం!" అని.

"పిచ్చిదానా! రాజులు ఎందుకు అలా అడగ్గానే యిస్తున్నారో ఆలోచించావా? అది వారి కష్టార్జితమైతే యిస్తారా....? అది వారి కష్టార్జితం కాదు! దొంగ సొమ్ము....!! ప్రజలను పీడించి ఆర్జించిన పాపపు సొమ్ము....!!! పట్టపగలు పోయి దోచుకున్న దోపిడీ సొమ్ము....! ఈ ఆకలి బాధతో చచ్చినా సరే. వారి దగ్గరకు వెళ్ళి యాచించను!!! ముష్టి యెత్తుకునేటంత వెధవపని మరొకటి లేదు....!!!" అన్నాడు ఆ బ్రాహ్మణుడు.

ఒకనాడు బ్రాహ్మణుడు భార్య నిర్బంధం మీద భోజరాజు దగ్గరకి వెళ్ళాడు. తన దరిద్ర బాధని ఆయనకి వివరించి చెప్పేడు! "స్వామీ! అయితే మీరు ఏరాజ్యం నుండి వచ్చారూ?" అని ప్రశ్నించాడు భోజరాజు.

"ప్రభూ! నేను యీ పట్టణంలోని వాడనే!" అనగానే రాజు చాలా బాధపడ్డాడు— తర్వాత కావల్సిన ధనం యిచ్చి పంపమని ఆజ్ఞాపించాడు.

"ప్రభూ! నాకు కావల్సింది మీకష్టార్జితం మాత్రమే!" అన్నాడు బ్రాహ్మణుడు. భోజరాజు యీమాట విని కొంతసేపు ఆలోచించి "బ్రాహ్మణోత్తమా! ప్రస్తుతం నా కష్టార్జితం దమ్మిడీకూడా లేదు! రేపు రా!" అని ఆయన్ని సాగనంపేడు.

భోజరాజు ఆరోజురాత్రి మారువేషంలో బయలుదేరాడు పని కోసం!— పట్టణమంతా తిరగ్గా ఒక కమ్మరివాడు కనిపించాడు. అక్కడికి వెళ్ళి వాడిని యేదయినా పని యిమ్మని బ్రతిమాలేడు— యెలాగయతేనేం ఉదయానికి నాలుగు రాగి కానులు సంపాదించేడు!

మర్నాడు బ్రాహ్మణుడికి అవి యిచ్చేశాడు. బ్రాహ్మణుడు అవి ఎంతో సంతోషంతో పుచ్చుకున్నాడు. వాటిని తీసుకుపోయి భార్యచేతికివ్వగానే ఆమె ఖస్సుమంటూ ఒక గూటిలో పారేసింది!

మర్నాడు ఆ రాగి కానులను చూడబోతే బంగారు కానులయి వున్నాయి! బ్రాహ్మణ దంపతులు వాటిని తీసుకొని పగలగొట్టి బజార్లో అమ్మి కావల్సిన సరుకులు తెచ్చుకున్నారు. ఇలా వీరు వాటిని విరుస్తూవుండడం, అవి తిరిగి యథాప్రకారంగా కానులవడం జరుగుతోంది.

ఒకనాడు భోజరాజు పట్టణ పరిస్థితి చూడటానికి వచ్చాడు. ఆయనకళ్లు ఒక పెద్ద భవనాన్ని ఆకర్షించేయ్! ఆ భవనంలోనుండి బ్రాహ్మణుడు వచ్చి ఆహ్వానించేడు.

"మహారాజా! మీరు యిచ్చిన నాలుగు రాగి కానులే యిలా బంగారు కానులుగా మారినై! ఇవి తుంచినా తిరిగి కానులయిపోతున్నాయి!!" అంటూ చెప్పాడు.

రాజు వాళ్ళు సుఖంగా వుండటంచూసి ఆనందిస్తూ తన రాజ్యం చేరుకున్నాడు.

# జాలిగలవారెవరు?

* శ్రీ సన్నాకుల సుందరరావు. *

ఆవూరిచివర ఏకాంతంగా పూరిగుడిసెలో నివసించేదల్లా, ఒక మనుమడూ, ఒక ముసలి అవ్వ. వారిసంగతి, అందరికీ తెలియదు. వాళ్ళిద్దరూ ఏమి తింటున్నారో, ఏమి త్రాగుతున్నారో తెలియదు. కాని, వాళ్ళుమాత్రం, నిరుపేద అని చూసినవారికి చప్పున గుర్తుకువస్తుంది. ఉదయాన్నే లేచి, పనిచెయ్యలేని స్థితిలో ఫ్యాక్టరీకి వెళ్ళి బొగ్గు మోయటమే అవ్వ చేసేపని. చాలీచాలని గంజితో అవ్వా మనుమళ్ళు ప్రశాంతంగా భగవధ్యానం చేస్తూ ఉండేవారు.

దసరా పండుగ వచ్చింది. ఇంటింటా ఆనందంతో పిల్లలంతా కబుర్లాడుకుంటూ యున్నారు. బడిపంతుళ్ళు మామూళ్ళకొరకై బడిపిల్లల్ని వెంటబెట్టుకుని, ఇంటింటికి తిరుగుతూయున్నారు. ఒకరిమీద ఒకరు పట్టుదలతో విల్లునుధరించి రాళ్ళురువ్వుకుంటూయున్నారు. ఇంటి ముందు చక్కటి ముగ్గులు చూడటానికి ముచ్చటగా ఉన్నాయి. ఎవరి ఆనందం వారికేగాని ఊరి చివర పూరి గుడిసెలోయున్న అవ్వా మనుమళ్ళ విషయం ఆలోచించిన వారెవ్వరూ లేరు. అప్పటికి రెండు దినాలనుంచి అవ్వకు జ్వరంగాయుంది. ఊరి ప్రజలంతా ఆనందంగా యున్నా అవ్వా మనుమళ్ళకు ఆనందం లేదు. తొమ్మిది సంవత్సరాల మనుమడు. అవ్వ శరీరముమీద చెయ్యి ఉంచి చూశాడు. శరీరం నిప్పులా వెచ్చగాయుంది. అవ్వా! నీకు జ్వరంగాయుంది. పట్నం వెళ్ళి డాక్టరుగారి వద్ద మందుతీసుకొస్తాను అని అన్నాడు. వద్దు నాయనా! వద్దు! ఏడుమైళ్ళు నడచి నీవు వెళ్ళలేవు నాయనా! బీద వారి మీద జాలిపడేవారెవ్వరూ ఉండరు. అని కన్నీరు కారుస్తూ పలికింది, అవ్వ.

అవ్వా నీవపుడపుడూ భగవంతుడు, పేదలకు సహాయం చేస్తాడని చెప్పావు. ఊరంతా ఈపండుగకు సంతోషంగా యుంది. ఈ ఆనందంలో మనల్ని రక్షించే వాళ్ళెవరూ ఉండరా? నేవెళ్ళొస్తానవ్వా. కూర్చున్నవాడల్లా లేచి నిల్చున్నాడు. చీకట్లో జాగ్రత్తగా వెళ్ళు నాయనా? నీకూ, నాకూ భగవంతుడే దిక్కు అని చెప్పేమాటలేమీ వినిపించుకోకుండా పరుగెత్తి రోడ్డు మీదకు వెళ్ళాడు. ఆతృతతో నడచి నడచి సాయంత్రం ఆరుగంటలకు బయలుదేరిన రాము డాక్టరుగారి ఇంటికి పదిగంటల రాత్రికి చేరి, తలుపుతట్టాడు. అపుడే నిద్రపోతూయున్న డాక్టరుగారు, కళ్ళు నలుపుకుంటూ, తలుపుతీశారు. తలుపుతీసిన వెంటనే రాము డాక్టరుగారి కాళ్ళు రెండూ పట్టుకొని డాక్టరుగారూ? మా అవ్వకు జ్వరము అపరిమితంగా యుంది. మీరు మందివ్వకపోతే నేనిక్కడే ప్రాణం వదలుతాను. మాకెవ్వరూ దిక్కులేరు. మీరే మాకు దిక్కు అని అన్నాడు ఏడుస్తూ. డాక్టరుగారిది జాలిహృదయం; వెంటనే సీసా తీసి, మందుపోసి రాము చేతికిఅందించారు. మందు పుచ్చుకుని ఒకటే సంతోషంతో ఇంటిముఖం పట్టాడు రాము. డాక్టరుగారు రామువెళ్ళిన తరువాత, తానతనకి ఇచ్చిన మందువైపు చూసి, నిర్ఘాంతపోయారు. నిద్రమత్తులో పిల్లాడికి విషమిచ్చానని తెలిసికుని కాళ్ళు చేతులూ వణకటం మొదలెట్టాయి. వెంటనే భగవంతుని ఫొటో ఎదురుగా కూర్చుని, తండ్రీ నేను ఈతప్పును చెయ్యాలని చెయ్యలేదు. ఇప్పుడన్యాయంగా ఆ ముసలమ్మ ప్రాణం పోతుంది. పోనీ నాప్రాణమైనా తీసికుని ముసలామెను బ్రతికించండి అంటూ ప్రార్థిస్తూయున్నాడు. ఆఖంగారులో డాక్టరుగారి పెదిమలువణకుతూ ఉన్నాయి. ఇంతలో దుఃఖస్వరంతో, డాక్టరుగారూ? అని పిలచిన పిలుపు వినిపించి వెళ్ళి తలుపుతీశారు డాక్టరుగారు. ఎదురుగా మోకాలునుంచి రక్తం కారుతూయున్న రాముని చూసి దుఃఖంగా, బాబూ ఏమైంది? మళ్ళా వచ్చావు అని అన్నారు.

డాక్టరుగారూ! నేను మందు దొరికిందనే సంతోషంతో ఇంటికి పరుగెత్తుతూయుండగా రాయితగిలి సిమెంటు రోడ్డుమీద సీసాపగిలి మందంతా కారిపోయింది. నేను అవ్వదగ్గరకు వట్టిచేతులతో పోను. ఈసారికూడా దయ ఉంచి, మందు ఇస్తారా అని అన్నాడు రాము. అలాగే నాయనా! అంటూ జరిగిన సంగతంతా, తెలియపరచి, బాబూ భగవంతుడు జాలిగలవాడు, తెలియకచేసిన తప్పులన్నిటినీ క్షమిస్తాడు. ఈ ఐదు రూపాయలూ అవ్వకు ఇయ్యి నాయనా అని అన్నారు.

డాక్టరుగారూ! మీఅంతటి జాలిగలవారు, ప్రపంచంలో లేరు అని అన్నాడు రాము. తప్పు నాయనా అలాఅనకు. అందరికంటె జాలిగలవాడు భగవంతుడు అని అన్నారు డాక్టరుగారు. అలాగేనండి, నేవెళ్తాను. మిమ్మల్ని దేవుడు కరుణించాలి, అంటూ పరుగెత్తుకుంటూ వెళ్ళిపోయాడు రాము. రామూకింతవరకూ భగవంతుడు జాలిగలవాడో డాక్టరుగారు జాలిగలవారో తెలియలేదు. మీరుమాత్రం ఎవరు జాలిగలవారో తెల్పండి, మనం ఎల్లపుడూ బీదలకు సహాయం చేస్తుంటేనే గొప్పవారమవుతాం. ఈమాట మరువకండి.



# బిడ్డలు - తలిదండ్రులు

♦ శ్రీ కె. వెంకట్రామయ్య ♦

[బిడ్డలను పెంచుటలో తలి దండ్రులకు శిక్షణ యవసరము. శిశు నిర్వహణమునందలి దోషములే బిడ్డల ప్రవర్తనా సమస్యలకు కారణములు. ఆదోషము లేవన 1. నిశ్చితోద్దేశములేని విద్యావిధానము 2. బిడ్డల దృక్పథమునుండి చూడకుండుట 3. బిడ్డల కాయావయస్సులందు గలుగు అవసరములను గుర్తింపకుండుట, 4. క్రమశిక్షణమునుగూర్చిన తప్పభిప్రాయములు. 5, తలి దండ్రుల కేకాభిప్రాయము లేకుండుట— ఈ విషయములనుగూర్చి గత వ్యాసమందు విశదీకరింపబడెను.]

———: ೦ :———

కొన్ని కుటుంబములందు, ప్రతి వారమును వచ్చు శలవు దినములలో తండ్రియే బిడ్డల సంరక్షణ బాధ్యతను పూర్తిగ వహించుచుండును. దానివలన తల్లికి తగిన విశ్రాంతి చేకూరుటయేగాక తండ్రికి బిడ్డతో కలసియుండుటకు తగిన అవకాశము కలుగును.

బిడ్డలను బెంచు విషయములందు తలి దండ్రులకు భిన్నాభిప్రాయము లుండరాదు. చాల కుటుంబములలో తండ్రి బిడ్డను కఠినముగా దండించిన తల్లి గారాబముగా జూచును, తల్లి కఠినముగానున్న, తండ్రి గారాబము జేయును. దీని వలన బిడ్డలు చెడిపోవుటయేగాక తలి దండ్రులలో తరచుగ కలతలు పుట్టుచుండును. అట్టి స్థితులలో బిడ్డలు తలి దండ్రులలో నొకరి నండగా జూచుకొని తమ యాటలను సాగించుట నేర్చుకొందురు. బిడ్డ యభివృద్ధికి కుటుంబములో శాంతియు నైకమత్యము నత్యంతావసరములు. తామేకీభవింపని విషయములను తలి దండ్రులు బిడ్డల యెదుట చెర్చింపరాదు.

నా తలి దండ్రులు నన్ను ప్రేమింతురు ; నా క్షేమమునే గోరుదురు ; నన్ను కాపాడుదురు ; నాకెట్టి భయమును లేదను నమ్మిక బిడ్డలకు గలుగునట్లు తలిదండ్రులు ప్రవర్తించుకొనవలెను. అప్పుడే బిడ్డలు సుఖముగా నుండగలరు. వారు పెరిగి పెద్దవారైనను తలి దండ్రులను మరువక అనురాగముతో నుండగలరు. ఇది తలిదండ్రులెరిగి బిడ్డల నర్థము జేసికొనుచు వారికి తమయెడ నమ్మిక యుండు రీతిగ మెలగవలెను.

ఇక బిడ్డ ఎదిగెడి విధానమునుగూర్చి ఇట వివరించుచున్నాము.

**బిడ్డ ఎదిగెడి విధానము :** శిశు నిర్వహణములోగల కొన్ని సామాన్య దోషములను గూర్చి ఇదివరకే చర్చింపబడెను. ఆదోషములు లేకుండ జేయదలచినయెడల బిడ్డ ఏయే దశలలో నేవిధముగ నెదుగుచుండునో అర్థము జేసికొనుటయు, పరిశీలించుటయు చాల అవసరము. బిడ్డ యెదుగుట యనగా శరీరము పెరుగుట మాత్రమేయని అనుకొనరాదు. మానసికముగను, శారీరకముగను, సాంఘికముగను క్రమముగా నభివృద్ధిచెంది సంపూర్ణత్వము బొందుటయే ఎదుగుటయని తెలిసికొనవలెను.

ప్రారంభదశయందు బిడ్డ మనస్సును, శరీరమందలి వివిధ భాగములును, వాని వ్యాపారములను నిర్వర్తించుటకు తగిన స్థితిని బొందియుండవు. అట్టి సమయమున వానికి పనికల్పించుట గాని అభ్యాసము నిచ్చుటగాని హానికరము. బిడ్డ శరీర భాగములు పెరిగిన కొలదియు పనిచేయుటకు తగిన స్థితిని బొందుచుండును. అప్పుడు బిడ్డ సహజముగనే ఆయా భాగములను వాడుటకు ప్రయత్నించుచుండును. కాళ్ళయందును, వీపునందును గల కండరములు బిడ్డ పది పండ్రెండు నెలల వాడగువరకును పెరుగుచునేయుండును. ఆకండరములకు సంబంధించిన నాడీ కేంద్రములు మెదడునందును, వెన్నుపామునందును ఏర్పడుచుండును. అవి సిద్ధ స్థితిని బొందగనే అతడు నడచుటకు ప్రయత్నింపగలడు. అట్టి ప్రయత్నమును చేయుటకు తగిన శక్తి నతడు బొందకుండగనే బలవంతముగా నడిపించినయెడల దొడ్డి కాళ్లు రావచ్చును. నడచుటకు ప్రయత్నించునపుడు కదలకుండ తొట్టెలో నుంచుటయో మరి యేవిధమునైనను ఆటంకపరచుటయో జరిగిన యెడల బిడ్డ సహజాభివృద్ధి సరిగాజరుగకుండును. ఇట్లే బిడ్డ

మానసికాభిరుచులు ఏర్పడకుండ వాని కభ్యాసము నీయ ప్రయత్నించుటగాని ఏర్పడినపుడాపుటగాని పనికిరాదు.

అందరు పిల్లలు నొకే విధముగా నెదుగరు. కొందరు తొందరగా నెదుగుదురు. మరికొందరు నెమ్మదిగా నెదుగుచుందురు. ఎప్పుడు నేదో కొంత భేదముండును. ఇది తెలియక తలిదండ్రులు కొందరు తమ బిడ్డలు సమవయస్కులగు ఇతర పిల్లలవలె నభివృద్ధి జూపుటలేదని బాధ పడుచుందురు. దీనివలన వారు తమ బిడ్డలను బాధించుట గూడ తటస్థించుచుండును.

బిడ్డ యెదుగుట క్రమముగను అవిచ్ఛిన్నముగను జరుగును.

బిడ్డ లెప్పుడును ఎదుగుచునేయుందురు. వారి యభివృద్ధి ఒక క్రమము ననుసరించి యుండును. ఈ విషయమును గుర్తించి బిడ్డ లెదిగిన పిదప వారేవిధముగనుండ గోరుదుమో దాని కనుగుణముగ మొదటినుండియు తర్ఫీదు నొసగుట యవసరము. బిడ్డ లెదిగిన పిదప తర్ఫీదు నొసగుట సాధ్యముకాకపోవచ్చును. స్వతంత్రముగనుండుట, ఒరులకు సహాయపడుట, న్యాయము పాటించుట మొదలగు సుగుణములను బిడ్డకు మొదటినుండియు నలవడజేయక అతడే ఎనిమిదేండ్లవాడో కాగానే ఆగుణములతనికి లేవనుకొనుటలో నర్థములేదు. ఇట్లే చిన్నప్పుడత డేదడిగిన యిచ్చుచు, గారాబముగా పెంచి పాడు జేసి తొలి యౌవనము రాగానే ఇంద్రియనిగ్రహము జూపవలెనని తలచుటలో నర్థములేదు.

బిడ్డ ప్రతి దశయందును తన సహజ శక్తులను పూర్తిగా నుపయోగించుచు అభివృద్ధి జెందుటకు తలిదండ్రులు సహాయపడవలెను. ఏయొక్క దశయందైనను బిడ్డల యభివృద్ధి తత్పూర్వదశయందలి యభివృద్ధిపై నాధారపడియుండును. వారు సంపూర్ణాభివృద్ధిని బొందవలె నన్న ప్రతియొక్క దశయందును ఆదశకు తగిన యభివృద్ధిని బొందవలెను. అట్లభివృద్ధి జెందినప్పుడే వారియందలి సహజశక్తులన్నియు వికాసమునొంది సాంఘిక జీవనమున కెంతయు తగియుందురు.

శిశు దశ యందలి లక్షణములు: అప్పుడే పుట్టిన జంతువునకును, బిడ్డకును భేదమంతగా నగుపడదు. బిడ్డకు గావలసినవియు అహారము, నిద్ర, సుఖోష్ణత, రక్షణయే యగును. కాని మానవులకు సహజమై, ఇతరజంతువులకు లేని కొన్ని శక్తులను బిడ్డ మొదటినుండియు చూపుచునే యుండును. అతదేడ్చును. కొన్ని మనోవృత్తులను జూపును. జంతువులట్టివి చేయనేరవు.

బిడ్డకు పుట్టుకతోనే నాడీ మండలము, ఇంద్రియములు, కండరములు, ఇతర అంగములు ఏర్పడియుండును. ఇవి ఇంకను సరిగా పెరిగియుండవు. అంతేకాక ఇవి బాహ్య పరిసరముల కలవాటు పడవలసియుండును. తల్లి గర్భమందున్న బిడ్డకు కాంతి, శబ్దము, స్పర్శ అనునవి తెలియవు. శీతోష్ణములందలి భేదములును తెలియవు. చలనము బహుస్వల్పము. కాని బిడ్డ పుట్టగనే కేవలము క్రొత్త పరిసరములేర్పడును. అతనిని కాంతి అవరించును. శబ్దముల సందడి, శీతోష్ణములందలి మార్పులు బాధించును. తన్నందరు కదలించుట, ఇటు నటు త్రిప్పుట, స్నానము చేయించుట అతనికి చాల క్రొత్త యనుభవములైయుండును. తల్లి గర్భమునందున్నంతకాలము ఆమె రక్తమే బిడ్డను పోషించును. శ్వాసించు యవసర మాతనికుండదు. కాని పుట్టినంతనే బిడ్డ శ్వాసించవలెను. అహారమును గ్రహింపవలెను, ఇవియు నతనికి క్రొత్త యనుభవములే. అతడు శ్వాసించుటకు చేయు ప్రయత్నమే తొలి యేడ్పునకు కారణము కావచ్చును.

బిడ్డ పుట్టినది మొదలు ఎన్నో కార్యములను జేయ గలిగియుండును. తన కండరముల ననేక విధముల చలింపజేయగలడు. కాని ఆ చలనములలో క్రమత యుండదు. ఒడుదుడుకుగానుండును. మరియు నవి ఉద్దేశరహితములై యుండును. దేనినైనను గుప్పెలితో పట్టుట బిడ్డకు మొదటినుండియు బాగుగ తెలియును. పాలు కుడుచుట, గుటక వేయుట, తల నిటునటు త్రిప్పుట, వ్రేళ్ళను మెలిపెట్టుట మొదలగు కార్యముల నతడు చేయ గలిగియుండును. కాని అతని చూపు ఇంకను సరియై యుండదు, రెండు కండ్లును కలిసి పనిచేయుట కింకను అలవాటుపడి యుండవు. ఆతదు వస్తువులను చూచునే గాని దేనిపైనను దృష్టి నిలుపజాలడు. దూరము చూడలేడు. ఇట్లే వినుటగూడ ఇంకను సరిగా నుండదు. పెద్ద శబ్దములు మాత్ర మతని నాకర్షించును. బిడ్డ పుట్టినప్పు డెక్కువగా నుపయోగపడునది ఒక స్పర్శేంద్రియమేయని చెప్పవలెను. చూపు వలన కంటె స్పర్శనుబట్టియు వాసనను బట్టియే అతడు మొదట తల్లిని గుర్తించును.

# బిడ్డలు - తలిదండ్రులు

బిడ్డలు పుట్టిన తొలి దినములలో ఆహార స్నానాదిక విషయములకు దప్ప తక్కిన కాలమంతయు నిద్రించుచునే యుందురు. మొదటి వారము నుండియు వారి ప్రవర్తనలలో భేదములగుపడుచుండును. ఒక బిడ్డ శాంతమును సాధుత్వమును జూపుచుండును. మరియొక బిడ్డ తన ఇష్టానిష్టతలను స్పష్టము జేయుచు పట్టుదలజూపును. ఇది తల్లు లెరుగనిదిగాదు.

బిడ్డ పుట్టిన మొదటి వారములలోను, నెలలలోను ఎట్టి మార్పులు గలుగునో కొంచము విచారింతము. అతడు బాహ్య ప్రపంచములోనికి రాగానే జ్ఞానేంద్రియములు వికాసముచెంద నారంభించును. నేత్రములు రెండును కలసి పనిచేయుట మొదలిడగానే అతడు చూచుట కారంభించును. తన్నన్ని విధముల సంరంక్షించి పోషించునది తల్లియే గనుక అతడామెను జూచుటకే మొదట కుతూహలము జూపును. ఈస్థితియందున్నప్పు డతనిని మెరయు రంగులును, కాంతులును ఆకర్షించుచుండును, రెప్పవేయక దృష్టి నిలిపినంత మాత్రమున బిడ్డ చూచుచున్నాడని మనమనుకొనరాదు. తొలుత నతడు తన దృక్పథమును దాటి చనిన వస్తువునుగూర్చి తలంపడు. కాని ఒక దినమున నతడు తన చూపునకు గోచరమై కదలిపోయిన వస్తువులను తిరిగి చూచుటకై తల ద్రిప్పును. బిడ్డ మానసికాభివృద్ధిలో నిదియొకమెట్టు. దీనిని బట్టి అతడు వస్తువులను గుర్తించి జ్ఞప్తియందుంచుకొనగలుగుచున్నాడని తెలియును. ఇట్లు జ్ఞాపకముండుట కొన్ని క్షణములే కావచ్చును. స్పష్టము కాకపోవచ్చును. ఐనను ఈ తాత్కాలికానుభవమునుండియే స్మృతి, ఊహ, హేతుజ్ఞానము కలుగుచున్నవి.

చలనము : బిడ్డ పుట్టిన కొన్ని వారములవరకు కాలు సేతులను కొట్టుకొనుచుండును. ఈ చలనములు క్రమత లేక ఒడుదుడుకుగా నుండును. పద్ధతి, ఉద్దేశములేనివిగా నగుపడును. కాని ఒక నెల గడచినంతనే ఇవి ఉద్దేశప్రేరితములగును. బిడ్డ నిరంతరము చలించుచుండుటచే నేవో కొన్ని యనుభవములు కలుగుచుండును. అవి సంతోషదాయకములైనను కావచ్చును. బాధాకరములైనను కావచ్చు. ఆ కలిగిన యనుభవములనుబట్టియే బిడ్డ తాను చేయదగిన పనులేవో మానవలసినవేవో తెలిసికొనుచుండును.

కాలు సేతులను కదలించుచుండుటచే ఆయా భాగములకు తగిన అభ్యాసము కలిగి నడచుశక్తిని, పనిచేయు నేర్పును బిడ్డ పొందుచుండును. మన మించుక నేర్పు జూపిన అతనికి సహజమగు నీ చలనములే ఉపయుక్తమగు క్రీడగా మారగలవు. ప్రతి దినము స్నానమైన పిదప బిడ్డ కేదుస్తులను తొడుగక కొంతసేపు స్వేచ్ఛగా నుండనీయవలెను. అప్పుడతడు తన కాలు సేతులను కొట్టుకొనుచు ఆడుకొనును. అట్టి సమయములందు తల్లి తన చేతులను అతని పాదముల కెదురుగ పట్టియుంచిన వాని నతడావలకు తన్నుచుండును. అతని పాదములొక గోడ కెదురుగ నుండునట్లు పరుండబెట్టిన గోడను తన్నుచుండును. ఇట్టి యుపాయములచే బిడ్డ కాళ్ళకు మంచి అభ్యాసము కలుగజేయవచ్చును. ఆటసమయములందు (మధ్యాహ్నవేళ దాటిన పిదప) తల్లి ఒక కాగితము నతనిపై గప్పిన దానిని తన్నుచు, శబ్దము చేయుచు అతడెంతో ఆనందముగా నాడుకొనగలడు.

పైనుదహరించిన ఆటలో బిడ్డ ఒక ఆటంకమును (కాగితమును) ఉద్దేశముతో త్రోసివేయుట జరుగుచున్నది. ఈవిధముగా నాడుటచే దేహమునకు బలము కలుగుటయేగాక ఉద్దేశముతో పనులను జేయుటగూడ బిడ్డల కలవడును. మరియు తల్లిపై నాధారపడకుండ తానేదైన పని చేయుచు కులాసాగా నుండుట అతని కలవాటగును.

సహవాసము : బిడ్డను సంరక్షించుట యనగా ఆహారమిచ్చుట, స్నానము చేయించుట, దుస్తులు తొడుగుట, నిద్రపుచ్చుట మాత్రమేగాదు. ఎదుగు కొలది అతడితరుల ప్రేమను స్నేహమును గూడ గోరుచుండును. ఇది తెలిసికొని తల్లి ప్రతిదినము ఒకటి, రెండు గంటలకాలము బిడ్డతో నుండుట అవసరమగును. ఇట్లాతనితో నుండుట కతని మధ్యాహ్నపు ఆటసమయమెంతయు తగియుండును.

రెండు నెలలు దాటినది మొదలు బిడ్డ యితరులను జూచి ఏదో మాట్లాడబోవును. దోబూచులాడగోరును. ఒరుల సహవాస మపేక్షించును. ఇట్టి కాలమున బిడ్డకు తగిన సహవాసము చేకూరనియెడల తనలో తానే ఆనందమును బొందుటకు ప్రయత్నించును. వ్రేళ్ళు చీకుట, వెనుకకు, ముందుకు ఊగుట, హస్తప్రయోగము చేయుట ఇత్యాదులు బిడ్డ తనలో తాను సంతోషమును బొందుటకు చేయు ప్రయత్నములే యగును. బిడ్డకు గలుగు యీ

యలవాట్లు అంత పాటింప వలసినవిగావు. భయపడవలసినవియునుగావు, అతడు కులాసాగా నున్నయెడల ఇవి యెంతకాలమో ఉండవు. కాని మాతృప్రేమ యందాతనికి నమ్మిక సరిగాలేదని మాత్రమివి సూచింపగలవు.

<u>అన్నిటిని తన వశమునందుంచుకొనవలెననెడి కోరిక :</u> కామేచ్ఛయును, అధికారేచ్ఛయును మానవులకు సహజములు. ఏదో విధముగ నీరెంటికిని తృప్తి చేకూరినగాని మానవునకానందముండదు. శిశువు జనించినది మొదలు తన పరిసరములను స్వాధీనము జేసికొనుటకై ప్రయత్నించుచుండును. ఏడ్చుట వలన ఇతరులను తన కడకు రప్పింపనగుననియు తనకు కావలసిన వేవైనను పొందవచ్చుననియు అతడాదియందే గ్రహించును. తలిదండ్రుల జాగ్రత్తగ మెలగుచుండిన అతడేడ్పునొక ఆయుధముగ వారిపై ప్రయోగింపసాగును. తన పరిసరములలోని వస్తువులను స్వాధీనము జేసికొనుటకుగూడ బిడ్డ ప్రయత్నించును. కాని పెద్దల నధీనులుగ జేసికొనుటయే ఆతనికెక్కువగా పట్టువడును.

ఏడ్చినపుడెల్ల తల్లి తన కోర్కెల దీర్చునెడ బిడ్డ ఏడ్పుచే నామెను సాధించుచు తన పనులను కొనసాగించుకొనుచుండును. అట్లగుటచే నతడెదిగియు పశివానివలె ప్రతివిషయమునకు తల్లిపై నాధారపడుచుండును.

<u>ఏకాగ్రత</u> : పశిబిడ్డ విషయములో ఏకాగ్రతనుగూర్చి చెప్పుట అసందర్భముగా తోచవచ్చును. కాని యీ మానసిక ప్రవృత్తిని వానిలో కొన్నిటిని గూర్చి ఇట సూచించుచున్నాము—

ఆహార సమయములందో, ఆటల సమయములందో తప్ప తక్కిన సమయములందు బిడ్డను తొట్టెయందైనను త్రోపుడు బండియందైనను ఏకాంతముగ నుండనిచ్చుట మంచిది. అతడు మెలకువగానున్నచో అప్పుడప్పుడు పలుకరింపవచ్చును. ముద్దుగా తట్టవచ్చును. అంతేగాని వేళ పాళలు లేక అతని నెత్తుకొని ముద్దాడుట పనికిరాదు. చుట్టములుగాని, స్నేహితులుగాని సమయాసమయములను గుర్తింపక బిడ్డను ముద్దాడవచ్చిన తల్లి దానికెంతమాత్రము ఒప్పుకొనరాదు. బిడ్డ కొంచెమెదిగిన పిదప అతని నాకర్షించు వస్తువు నొకదానిని తొట్టె దగ్గర వ్రేలాడగట్టుట మంచిది. అది యతనిదృష్టి నిటునటు బోనీక నిలుకడగా నుంచగలదు. రంగు గిలక, రంగు రిబ్బనులు మొదలగునవి ఈపని కనువైయుండును.

బిడ్డ యింకను కొంచెమెదిగిన పిదప చేతితో పట్టి ఆడుటకును, ఆవలకు ద్రోసి తిరిగి లాగుకొనుటకును వీలుగ నొక గిలకనో బంతినో తొట్టెకొక త్రాటితో కట్టనగును. దానివలన బిడ్డ వ్యర్థముగా కాలము గడుపకుండుట నేర్చుకొనగలడు.

మానసికాభివృద్ధికి ఏకాగ్రత ఎంతయు ముఖ్యము. ఏవిషయమందైనను బిడ్డ ఏకాగ్రత జూపు నెడ ఆటంకపరచుట తగదు. కదలిపోవు బండిని జూచుటయందో, బూటును తొడుగుకొను ప్రయత్నమునందో అతడేకాగ్రత జూపుచున్నాడనుకొందము. ఆసమయమే ఆహారపువేళ యని అతని ఏకాగ్రత కడ్డు వచ్చుట పనికిరాదు. బిడ్డ చూపు ఏకాగ్రత ఎంతకాలమో జరుగదు. ఆహారము దీసికొనుటకు అయిదారు నిమిషములాలస్యమైనను ప్రమాదములేదు. వేళకు భుజించుటకంటె, ఏకాగ్రత కలవాటగుటయే బిడ్డ కెక్కువ ముఖ్యము.

<u>భద్రత</u> : బిడ్డకు కోపముగాని భయముగాని గలుగకుండ జూచుకొనుట శిశు నిర్వహణములో చాల ముఖ్యము. వీని వలన బిడ్డ శీలతాభివృద్ధికి భంగము కలుగును. మరియు నతనికి తలిదండ్రుల ప్రేమయందు నమ్మిక సరిలేక ప్రవర్తనా సమస్య లారంభమగును.

(సశేషం)






## "ఏకంసత్ - విప్రా బహుదా వదంతి"

శ్రీ మద్దూరి శ్రీరామకృష్ణ

(గత సంచిక తరువాయి)

<u>సూక్ష్మ పరీక్ష</u>:- ఇంతవరకు కొంత స్థూల దృష్టితో గూడిన ప్రపంచం. ఇక సూక్ష్మ దృష్టితో చూద్దాం. ఐతే మరి, 'ధాతు' వంటే ఏమిటీ? ఆ ధాతు గుణాలుగల (Molecules) సమూహం. ఆ అణువులు, పరమాణువుల (Atoms) వల్ల ఏర్పడ్డాయి. 'పరమాణువు' అంటే? అంటే పరమాణువేను! దాన్ని విచ్ఛిన్నం చేయడం సాధ్యం కాదు- అన్నారు- కొంత కాలం. ఇటీవల దీన్ని పగలగొట్ట గలిగేరు (అంటే సుత్తి- సమ్మెటా పెట్టిగాదుసుమండి! దీనికి వేరే పద్ధతులున్నాయి) పరమాణువు నిర్మాణంకూడ, సూర్యుడు నవగ్రహాల నిర్మాణంలాగే అపూర్వంగాఉంది. కేంద్రంలో ప్రోటాను, దాని చుట్టూ అపరిమితవేగంతో పరిభ్రమిస్తున్న ఎలెక్ట్రానులతో ఏర్పడి ఉందన్నారు. ఇవేమిటీ? అంటే విద్యుతావేశాలు అన్నారు, 'విద్యుత్తు' ఏమిటీ? అంటే, శక్తి తెలియదా- (వేడి, వెలుగు, శబ్ధం, అయస్కాంతశక్తి, ఎలెక్ట్రిసిటీ అన్న పంచ) శక్తుల్లో ఒకటి. మొన్నటివరకు పదార్థం (Matter) వేరు, శక్తి (energy), వేరు, అని చెప్పేం- బొడ్డుకు త్రువ్వు!- ఈ రెండూ ఒకటేను, పరస్పర రూపాంతరాలు- అంతేను అన్నారు. అదెలాగ? అంటే, ఎలెక్ట్రాన్— ద్రవ్యమా అంటే ఒకప్పుడు ద్రవ్య గుణాలు, శక్తా అంటే ఒకప్పుడు శక్తి గుణాలు చూపించి శాస్త్రజ్ఞుల్ని ఢిల్ల పరుస్తూంది- అవునూ కాదూ కూడాను అన్నట్లుంది! అన్నారు.

విశ్వంలోని అన్ని పదార్థాలూ, ధాతువులు యావత్తూ కూడ ప్రోటాన్లు, ఎలెక్ట్రాన్లువల్ల ఏర్పడ్డవే నన్నారు. ఉదాహరణ: ఒక ప్రోటాను, ఒక ఎలెక్ట్రాను కలిస్తే (అన్ని ధాతువుల్లోకి తేలికైన) హైడ్రోజన్ (ఉదజని) అనే పరమాణువయ్యింది. (అన్నిటికంటె పెద్దదయిన) యురేనియం ఆటంలో 238 ఎలెక్ట్రానులున్నాయి. ఇలాగే మళ్ళీ అన్నిటికీ మూలపదార్థం ఎలెక్ట్రాన్ అన్న కాడికి మరో మజిలీలోకి చేరేం. వెనుకటికి 'ఏనుగ'ంటే ఏమిటంటే, ఒకాయన 'దంతి' అన్నాట్ట; అదేమిటంటే, 'కరి' అన్నాట్ట; మళ్ళీ అదేమిటి అంటే, 'గజం' అన్నాట్ట; అదేమిటయ్యా నాకు అర్థమయ్యేట్లు చెప్పు అంటే, ఏనుగంటే ఏనుగేనూ - ఎరుగవా— చేటల్లాంటి చెవులు, స్తంబాల్లాంటి కాళ్ళు, పాములాంటి తొండం వగైరాలు కలిగి ఉండే పే-ద్ద జంతువన్నాట్ట! ఇదీ కొంతనయమేను, ఏడుగురు గుడ్డిప్రభృతులు ఒక్కొక్కడే ఒక్కొక్క అంగాన్ని తాకిచూచి, తాను గ్రహించిందే ఏనుగం

తానని వాదులాడినట్లుగాక — ఇది కొంత సమగ్రంగా ఉంది! ఏనుగును ఏనుగంటేనే చులాగ్గా అర్థమవుతుంది!

ఇంకా సులువు పద్ధతి :- శాస్త్రజ్ఞులు ఇలాగ పరిశోధనలు, ప్రయోగాలు చేసి చేసి, పదార్థమూ- శక్తీ ఒక్కటే నన్న వరకు వస్తే- ప్రపంచ ప్రఖ్యాత శాస్త్రవేత్తయైన ఐన్‌స్టీన్ మహాశయుడు- ఏమగ్రోయ్! 'కాలం' వేరనడం పొరపాటు; త్రిధావిస్తృతమైన (Three dimentional) ప్రదేశానికి కాలం అనే చతుర్థం (fourth dimention) కలిపి, దేశ-కాల-అవిరతికం (space - time - continuum) అనాలి! అని ఒక పట్టాన సామాన్య శాస్త్రజ్ఞుడికి, మామూలు మనిషికీ అవగాహనగాని (relativity theory) సాపేక్ష్య సిద్ధాంతాన్ని ప్రతిపాదించేడు.

మొత్తంమీద శాస్త్రజ్ఞులు చుట్టుదారి త్రొక్కినా, చివరకు అంతా ఒకటేనన్న సత్యానికి కనుచూపుమేరవరకు రావడం హర్షింపదగ్గ విషయం. మనం ఇదివరకే అడ్డత్రోవను అక్కడకు జేరి తిష్టవేసేం- "సదేవసౌమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయం."

—"ఏకం సత్ విప్రా బహుదావదంతి"—

ఐతే ఒకటి : ఇలా కష్టపడి సేకరించిన— జ్ఞానమనుకోండి- విజ్ఞానమనుకోండి- దాన్ని సద్వినియోగం చెయ్యాలి. విజ్ఞానం 'వేయిపడగలు' ఎత్తి, ఆడి, అందరినీ రంజింపజేసి, ఆనందం చేకూర్చి, మానవాభ్యుదయానికి తోడ్పడితే లోకం హర్షిస్తుంది; 'వెర్రితలలు' వేసి, మారణయంత్రనిర్మాణానికి దిగి, మానవజాతినే నిర్మూలించడానికి చప్పున విషపు కాటు వేయబోతే మాత్రం లోకం గర్హిస్తుంది. సత్యాన్వేషణ అనండి, శాస్త్రపరిశోధన అనండి, అది, సదా, మానవశ్రేయస్సుకు దోహదం కావలసిందే. ఇలాంటి కాలకోటి సర్పాల్ని లొంగదీయడం, హారాల్లాగ ధరించడం, సన్మార్గంలో బెట్టడం, భారతీయులకు, సామెత చెప్పినట్టు ఆదిశక్తి- శంకరుడు దగ్గరనుండీ వస్తున్న వారసత్వం. ఆటంబాంబులుగాదు, హైడ్రోజన్ బాంబుగాదు, వాటి అబ్బ అణగి మణగి హరించి లీనమైపోతుంది మన సాంప్రదాయంలోను.



భారత వర్ష పురోభివృద్ధికి

ఒక శిక్షణకేంద్రానికి జెందిన పొలాల్లోని నారుమళ్ళకు నీరుపోస్తున్న నారీమణులు—సోషల్ ఎడ్యుకేషన్ ఆర్గనైజర్లు. ఇలా దేశసంపదల్ని సక్రమ విధానంలో సమన్వయించి అభివృద్ధి జేసే ప్రజల నిర్మాణ కార్యక్రమావళి వల్ల నవభారత నిర్మాణం జగుతూవుంది.

# క్లిష్ట పరిస్థితిలో ఉద్యోగం చెయ్యడానికి ప్రతిస్త్రీ సంసిద్ధంగా ఉండాలి

రచన :
శ్రీమతి శారదాబాయి.

సమర్పణ :
శ్రీ బుద్ధవరపు సత్యనారాయణ.

మా కుటుంబం చాలా కష్టదశలో పడింది. 1946 వ సంవత్సరం చివరలో నా భర్త ఉద్యోగం పోయింది. 1947వ సంవత్సరమంతా అప్పుడప్పుడు మేము కూడబెట్టుకున్నదానితో ఎల్లాగో కాలం గడిపివేశాం. ఆయనకు ఎంత ప్రయత్నించినా ఉద్యోగం దొరకలేదు.

ప్రతిరోజూ ప్రొద్దున్నే లేచి ఉద్యోగం కోసం బయలేరి పోయేవారు. ఆదుర్దాతో ఎక్కడేనా ఖాళీ ఏర్పడిందేమోనని పత్రికలన్నీ తిరగవేసేవారు. కనిపించిన ప్రతి దానికి దరఖాస్తు పెట్టేవారు. ఎంప్లాయిమెంట్ ఎక్స్చేంజి కార్యాలయానికి ఆయన వెళ్ళనిరోజు వుండేదికాదు. క్రమంగా మేము కూడ బెట్టుకున్న ఆ కాస్తా కూడా హరించిపోయింది.

1948 లో నేను ఒక పనిలో ప్రవేశించాను. అవి చాలా గడ్డు రోజులు. అందరూ అలాగే బాధపడేవారు. మాపని మరీ ఇబ్బందిగా వుండేది. అప్పటికి మాకు ముగ్గురు పిల్లలు. నాన్న రోజూ ఇంట్లోనే వుండడం, అమ్మ ఉద్యోగం చెయ్యడం- ఇదంతా వాళ్ళకు విచిత్రంగా వుండేది.

గత కొద్ది సంవత్సరాలలోనూ నాలో చాలా మార్పు వచ్చింది. అనుభవం సంపాదించాను. జన్మతః నేను గృహ మానస పుత్రికను : వంట చెయ్యడమంటే నాకు ఎంతో సరదా. కుట్టుపనిలో నాకు చక్కటి అభిరుచి, ప్రవేశం వున్నాయి.

కాని, ఉద్యోగం మూలాన ఇంటి పనులు చూసుకుందుకు టైము లేకుండా పోయింది. హడావిడిగా అది అలా చెయ్యమని, ఇది ఇలా చెయ్యమని వంటమనిషికి పురమాయిస్తూంటాను. నేను దగ్గరుండి చూసుకునే వీలు లేకపోవడంవల్ల ప్రతిరోజూ భోజనాలదగ్గర అసంతృప్తిగానే వుంది.

నాకు శారీరకంగా అలసట ఎక్కువయింది. తీరిక దొరికినప్పుడల్లా ఆయనా నేనూ కూర్చొని ఇద్దరికీ ఆహ్లాదాన్నిచ్చే సరదాలలో నిమగ్నులమయ్యేవాళ్ళం.

నేను ఒక పాఠశాలలో పని చేస్తున్నాను. ప్రతి సంవత్సరం పాఠశాల వృద్ధిచెందడంతో పాటు నాకు నిర్ణయించిన పనికూడా పెరుగుతోంది. స్కూల్లో చేసినా ఇంకా పని మిగిలితే ఇంటికి తెచ్చి పూర్తి చేస్తున్నాను.

సరిగ్గా విశ్రాంతి తీసుకొనడానికైనా వ్యవధి వుండడం లేదు. పిల్లలతోటీ ఆయనతోటీ ఆనందంగా హాయిగా కాలం-గడపలేకపోతున్నాను. జీవితం ముళ్ళమీద నడకగా మారింది. కాని గత్యంతరం లేదుమరి. దీని కంతకీ కారణం మా లేమితనం.

నేను ఉద్యోగంలో ప్రవేశించిన కొత్తలో నాకు జీవితం చాలా కష్టంగా వుండేది. ఐదారు నెలలు గడచేటప్పటికి పరిస్థితులు విషమిస్తున్నాయని గ్రహించాను. ఆయన చాలా చిన్నతనంతో బాధపడుతున్నారు. వాళ్ళ అమ్మ దగ్గర లేకపోవడం వల్ల పిల్లలు పక్క ఇళ్ళ పిల్లలతో తిరిగేవారు. ఎప్పుడూ ఎవళ్ళతోనో ఒకళ్ళతో పోట్లాడి తగాదా తెచ్చేవారు ఇంటికి వచ్చేసరికి.

ఇంటికి రాగానే వాళ్ళని వోదార్చి కష్ట సుఖాలు చూసే వోపికా నాకు కనిపించలేదు. సాయంకాలమప్పుడు దగ్గరకు చేరితే ఒకో సారి కసిరేదాన్ని.

ఒకరోజు రాత్రి — గాలి వెయ్యక — నిద్రపోవడం అసాధ్యమయింది నాకు. నాప్రవర్తనగురించి ఒక్కసారి

యోచించుకుని- సాధక బాధకాలు సమీక్షించుకున్నాను. నేను పనిచేసి కుటుంబాన్ని నిర్వహిస్తున్నాననే అహంభావం కొన్నాళ్ళనుంచి నాలో ఎక్కువయింది. ఇంటి పనుల విషయంలోనూ, పిల్లల విషయంలోనూ, నా భర్త విషయం లోనూ నా కనీస బాధ్యతలనైనా నేను నిర్వహించడం జరగడంలేదు- ఇదీ సారాంశం.

నిద్ర పట్టక లేచి కూర్చున్నాను. మగవాళ్ళు చేసే పని చేస్తున్నాను. ఇది నా శక్తికి మించి కనిపిస్తోంది. పైగా ఇంటి బాధ్యతలొకటి. స్కూల్లో సాయంత్రం దాకా— పాఠ్యపుస్తకాలతోనూ, పాఠాలతోనూ, పరీక్ష పేపర్లతోనూ సతమతమవుతూ మళ్ళీ ఇంటికి వచ్చి— పిల్లలతో ఆడుతూ పాడుతూ వుండడానికి గాని, ఆయనతో కులాసాగా కబుర్లు చెప్పడానికి గాని కాస్త బాధగా వుండేది. ఈ రెండు తరహా పనులకు సఖ్యత కుదర్చలేకపోవడం ఒక ఇబ్బందయింది.

ఏమయినాసరే. కొన్ని మార్పులు చెయ్యాలనుకున్నాను. అదేవిధంగా నా కార్యక్రమాన్ని తగినట్టుగా మార్చు కున్నాను. ఆరాత్రి నా పంథాలో గొప్ప మార్పు తెచ్చింది. పరిస్థితులు కాస్త బాగుపడ్డాయి. కాని నా మట్టుకి నాకు కొద్దిగా కష్టంగానే వుండేది. గృహిణిగావుంటూ సంసారం చేస్తూ అటు ఉద్యోగం నిర్వహించడమంటే అంత సులు వైన పనికాదు. మనోస్థైర్యం కావాలి. చురుకుతనం వుండాలి. శరీర దారుఢ్యం వుండాలి. ధైర్యంగా ముందుకు పోతే పరిస్థితులు వాటంతట అవే చక్కబడతాయిలే అని మనస్సుని స్థిమితం చేసుకున్నాను.

ఎప్పుడేనా కాస్త తీరిక దొరికితే ఏదో నవలో, కథో చదువుకోడానికి బదులు కష్టం సుఖం మాట్లాడుకుంటూ ఆయనతో కాలం గడిపేదాన్ని. సాయంకాలం షికారుకి వెళ్ళేదాన్ని ఆయనతో. ఇంటి సంగతులన్నీ చర్చించే దాన్ని ఆసమయంలో.

ముఖ్యమైన వంటపనంతా పనిమనిషే చూసుకున్నా. ఏదో తీరిక చూసుకొని మా అందరికీ ఇష్టమైన దాన్ని నా అంతట నేనే ప్రత్యేకంగా తయారు చేసేదాన్ని. ఈ విధంగా ఇంటి పనుల్లో ప్రత్యేక శ్రద్ధ చూపడంవల్ల చాలా మార్పు వచ్చింది. మానసికంగా నాకు ఎంతో హాయిగాను సంతృప్తిగానూ వుంటోంది.

మొన్న మా చిన్నపిల్ల- తారకోసం- బ్లూ గౌను మీద ఎంబ్రాయిడరీ కుట్టి- ఎంతో అందంగా తయారుచేశాను. ఆగౌను తొడిగితే తార నిజంగా చాలా పొంగి కేరింతాలు కొట్టిందంటే నమ్మండి. అవును మరి. దానికా సంతో షాన్ని కలిగించడానికి మూడు రాత్రులు కూర్చొని ఆ ఎంబ్రాయిడరీ కుట్టాను. మామూలు బద్ధకపు ధోరణిని మార్చుకోబట్టేకదా మా చిట్టి తారను అంత సంతోషపెట్ట గలిగాను!

మా పిల్లలకు తండ్రిమీద గౌరవాన్ని భక్తిని కలిగించ వలసివస్తోంది. దానికి కారణం ఆ పశి హృదయాలలో- ఊళ్ళో కొందరు- చెడ్డ మాటలు చెప్పి చెడు అభిప్రాయాలు ఏర్పరుస్తున్నారు. కొందరు ప్రబుద్ధులు పనిగట్టుకొని- "మీ నాన్న ఎక్కడైనా పనిచేస్తున్నాడా, ఏ ఆఫీసులో?" అని ప్రారంభించి ఆయనను చులకనగా మాట్లాడుతు న్నారు పిల్లల దగ్గర.

కొందరు మిత్రులు సానుభూతి చూపేవారు. "మీ నాన్నకు ఎక్కడైనా ఉద్యోగం దొరికిందా! పాపం మీ అమ్మ ఎల్లా నిర్వహిస్తోందో సంసారాన్ని. శారద చాలా కష్టపడుతోంది!" అని కష్టసుఖాలు తెలుసుకునేవారు.

ఇదీ మా కుటుంబ పరిస్థితి. మా ఇంట్లో సంగతులు అసహజంగానే వున్నాయిమరి. మా రోజులు ఇవ్వాళ కాకపోతే రేపైనా బాగుపడతాయి. ఆయనకు తగిన ఉద్యోగం దొరికితే మాకు ఆశాజనకమైన భవిష్యత్తు లేదంటారా! ఇబ్బందుల్లో వున్నాం కాబట్టి ఉద్యోగంలో చేరాను. ఎవరో ఏదో అనిపోతారని భయపడి నేను ఉద్యోగంలో చేరకపోతే మా కుటుంబ పరిస్థితి ఎలా వుండేదో ఒక్కసారి మీరే ఊహించండి.

వివాహితస్త్రీ ఉద్యోగం చెయ్యడం తన అభిరుచికి సరిపడకపోయినా, కష్టాల్లో వున్నప్పుడు ఉద్యోగంలోచేరి కుటుంబ భారాన్ని వహించడానికి సంకోచించకూడదు. ఇదే మహిళా లోకానికి నా మనవి.



# పిల్లల ప్రవర్తన

శ్రీమతి గురుజు సరస్వతీరామ్

అదుగో, పాపాయి మళ్ళీ నోట్లో వేలు పెట్టుకు చీకుతూవుంది! తల్లి ఏమీ తోచక చూస్తూవుంది. "ఏమి చెయ్యను! ఎంతమానిపించినా మళ్ళీ తయారు!" అని విచారిస్తూవుంది.

అసలు ఎందుకిలా బొటనవేలు చీకుతుంది పాపాయి? ఎందుకూ లేదు; పిల్లలకదొక అలవాటు. బొటనవేలు, ఇతరవేళ్ళూ, కాలిబొటనవేలూ, కర్రదొండపండూ, బొమ్మ తలకాయి, ఇలా ప్రతీదీ నోట్లో పెట్టుకోవడం పిల్లలకు సహజం. ఈ సంగతి ప్రధమకాన్పుగనుక తల్లికి అర్థంకాక హడలిపోతూవుంది. కొన్నాళ్ళకు పాపాయే మానేస్తుంది ఈ అలవాటు. ఈలోపున లోపలకు మింగటానికి వీలుగా ఉండే చిన్న చిన్న వస్తువులు మాత్రం అందుబాటులో లేకుండా చూచుకుంటే అంతే చాలు.

అదుగో, రాధిగాడు మసిబొగ్గు పుచ్చుకొని గోడలన్నీ బొమ్మలతో నింపేస్తున్నాడు; వాడి అన్న గోపిగాడు, పాతడబ్బాతెగవాయించి చెవులు చిల్లులుపడగొట్టేస్తున్నాడు! "ఎలాగురా భగవంతుడా! డబ్బాలాక్కుపడేస్తే మళ్ళీ తెచ్చేడు వీడు. గోడ పాడుచేయకురా అంటే వికారం బొమ్మలన్నీ చిత్రిస్తున్నాడు వాడు!" అని తల్లి ఆలోచిస్తూ ఉంది.

ఎందుకలా రాధిగాడు బొమ్మవేస్తాడు? గోపిగాడు చప్పుడు చేస్తాడు? పిల్లలకు ఇలా బొమ్మలు వేయడం చప్పుడు చేయడం చాలా యిష్టం. గోడ పాడవుతుందని గాని, ఇతరులకు గొడవవుతుందనిగాని వాళ్ళకు తలంపే ఉండదు. వాళ్ళకు తెలియకుండానే పిల్లలీ మాదిరిగా ఆడుకుంటారు. దానికోసరం తల్లులు విసుక్కుంటే మరింత ఎక్కువ చేస్తారు. విసుక్కోక ఆడుకోనివ్వాలి. గోడ పాడయితే పలక - పలకపుల్లా, కాగితం - పెన్సిలో యిచ్చి డ్రాయింగులు వేయమనాలి. అంతేగాని అడ్డు తగలరాదు.

రాముణ్ణి వేసుకుని తల్లి ప్రక్కింటి వారింటికి వెళ్ళింది. మాటల సందర్భంలో తల్లి మర్చిపోతే, కుర్చీపీటవేసుకొని బల్లలమీద బొమ్మలు దిగలాగుతున్నాడు — రాముడు. "ఇంకొకరి యింటికి వెళ్ళినప్పుడు అల్లరిచేయకుండా కాలు చేతులు కట్టుకుని చక్కగా కూచోవాలి" అని అమ్మ అనేకసార్లు చెప్పింది. కాని మళ్ళీ ఎలా తయారయ్యేడో చూడండి.

అసలు ఎందుకిలా చేస్తారు పిల్లలు? వాళ్ళను వట్టినే కూర్చోమనడంకంటె శిక్షలేదు! వట్టినే కూచుంటే వాళ్ళకు ఒక్కఘడియ తోచదు; కాలికో, చేతికో, నోటికో ఏదో వ్యాపకం ఉండాలి! ఆడుకొందుకు తగినన్ని ఆటబొమ్మలో మరే వస్తువులో ఉంటే వాళ్ళకు బ్రహ్మానందం. ప్రక్కింటికెళితే మాత్రం - బొమ్మలెక్కడుంటే అక్కడే వాళ్ళ దృష్టి, అక్కడే ఆటలు - వాళ్ళ ప్రపంచమే వేరు!

రంగడు ఎన్ని చెప్పినా పక్కలో ఉచ్చపోయడం మానలే! తన పక్కలో పడుకోబెట్టుకొనే నాయనమ్మ కొట్టీ, తిట్టీ, ఎన్నిసార్లో చెప్పి చూచింది. మళ్ళీ పోసేడు — ఈవేళ! "చూసేరా, రంగడేమి చేసేడో" అని తడిగుడ్డలు ఇంట్లో అందరికీ చూపించింది — రంగడికి సిగ్గొచ్చి మానేస్తాడని. (తల్లీ దండ్రీ) ఏమిటా రంగా? అంటే, "నేనుకాదు, మామ్మే"నని పారిపోయేడు!

అసలు ఎందుకిలా ప్రవర్తిస్తారు పిల్లలు? ఒక్కొక్క వయస్సులో ఒక్కొక్క అలవాటు ఉంటుంది పిల్లలకు. పక్కలో ఉచ్చపోస్తే తప్పనితెలియదు. ఒంటిమీద గుడ్డ లేదని సిగ్గు ఉండదు. సిగ్గు వచ్చేటట్లు చేయాలని కొట్టీ తిట్టి మాన్పించాలంటే అదిసక్రమ పద్ధతిగాదు. చూసేరుగా రంగడి జవాబు!....తల్లి మంచిపన్నాగం పన్నింది; రంగడికొక మంచిలాగూ, పక్కకు చిన్న దుప్పటీ తయారు చేసి యిచ్చింది. "నా"లాగూ, "నా"దుప్పటీ ఆప్రొద్దంతా అందరికీ చూపించి ఊరేగేడు. "రాత్రి పిటిల్లో ఉచ్చపోసుకోడు రంగడు, చాలా మంచి మగాడ"ని ఉబ్బించేరు - అంతాను. తన 'మంచితనం', 'మగాడితనం' నిలబెట్టుకోవాలన్న ఊహవల్ల ఉచ్చపోయడం అప్పట్నుంచీ మానేసేడు — రంగడు!

ఇలా చక్కటి పద్ధతుల్లో పిల్లల్ని సక్రమవిధానాల్లో పెట్టడంలోనే ఉంది మాతృశిక్షణ.

# శ్రీ త్యాగ గురుస్తుతి కీర్తనలు

* శ్రీమతి కె. ఎమ్. సౌందర్యవల్లి *

కీర్తన - 29

రాగం హిందోళ, ఆదితాళం.

ఆ. సగమదనిస — అ. సనిదమగస

ప॥ అర్థమునేనరులు, ఆశింతురనుట
వ్యర్థము చేసితివౌర, త్యాగవర ॥అర్థము॥

అ॥ప॥ పార్థివోత్తముల, పొందును గోరక
సార్థక నాముడవై, జగతినివారక

చ॥ నిధిసుఖ మారాము, సన్నిధి సుఖమాయని
దధిరుచియోనామ, సుధరుచియోయని
బుధులు నుతింపగ, మదికుపదేశించి
మధురమౌకృతితతి, విధవిధములగూర్చి ॥అర్థము॥

| /4 | 0 | 0 |
|---|---|---|
| ప॥ ; మా మ, మా మా గ మా, గా<br>అ ర్థ ము నే న రు లు<br>; గా మా ద నీ సా గ స ని ద నీ<br>వ్య - ర్థ ము చే . . సి . తి<br>స గ (మామమామా)<br>. , (అర్థమునే ) | స సా ని ద, నీ<br>. ఆ శిం .<br>స గ స గ నీ సా స స<br>వౌ . . . ర . త్యా , | సా సా మ గ మా<br>తు ర ను - ట<br>ని ని ద ద మ మ గ గ<br>. . గ . వ . ర . |
| అ॥ప ; దా ద దా, ద నీ స నీ దా<br>పా ర్థి వో త్త ము - ల<br>; స మా గా సా సా స ని ద నీ<br>సా - ర్థ క నా ము డ - వై<br>స గ॥ (మా మ మా)<br>. . అ ర్థ ము. | ; ద ని సా సా<br>పొం దు ను<br>; దా నీ ద మ<br>జ గ తి ని | సా గ గ స ని సా<br>గో . . ర . క<br>మ గ ద మ గ మ గ స<br>వా . . . ర . క . |
| చ॥ ; మా మ మా మా మా; గ స గ<br>ని ధి సు ఖ మా రా ము , స<br>; స మా గ సా సా ని ధా ని సా<br>ద ధి రు చి యో నా . . మ<br>మా | మా గా మా ద మ<br>- న్ని ధి సు ఖ<br>; సా సా మ గ<br>సు ధ రు చి | మా, గ మ గా స<br>మా యి . ని .<br>మా, ద ద మ గ .<br>యో య . ని . |

అ. ప. వలె.

బుధులు నుతింపగ, మదికుపదేశించి
మధురమౌకృతితతి, విధవిధములగూర్చి॥

# శ్రీ త్యాగ గురుస్తుతి కీర్తనలు

## కీర్తన- 30

మధ్యమావతి రాగం, రూపక తాళం.

ఆ. స రి మ ప ని స — అ. స ని ప మ రి స

ప॥ శ్రీ త్యాగరాజస్వామిని, నిత్యంబుదలతు నాదు మదిని ॥శ్రీ॥

అ॥ప॥ అత్యంత భక్తిమీర, సత్యాత్మకుడైన గురుని ॥శ్రీ॥

చ॥ వరరాగ తాళగతుల, స్వరసాహిత్య విధుల

నెరిగి నాద సుధనుగ్రోలి, ధరణిజాధిపు పొగడు ఘనుని (శ్రీత్యాగ)

| 0 | /4 | 0 | /4 |
|---|---|---|---|
| ప॥ సాం ; | ; సం సం ని ప ప మ | రీ , రి | సా రీ; ప మ |
| శ్రీ | త్యా . , . గ . | రా జ | . స్వా మి . |
| రీ ; | సా; సా సా | రి మ రి మ | పా ప మ ప ని సం రిం |
| ని | . . ని | త్యం . . | బు త . ల . తు . |
| మం రిం మం రిం | రిం సం సం ని ప మ ప ని | (సా .) | |
| నా . . . | దు . మ . ది . ని . | (శ్రీ ) | |
| అ॥ప॥ ; రీ | రీ ; మ రి రి స | సా రి స | నీ పా ని సా స |
| అ | త్యం . . త . | భ క్తి . | . మీ . , ర |
| ; రీ | సా, రి రి ని నీ | ని సం సం ని | ప మ రి స రి మ ప ని॥సా॥ |
| స | త్యా . త్మ . కు | డై . . . | న . గు . రు . ని . ॥శ్రీ॥ |
| చ॥ పా | నీ పా పా పా | ప ప మ రి | మా పా పా పా |
| ; | | | |
| వ | ర రా . గ | తా . . . | ళ గ తు ల |
| ; రీ | మా ప ని స ని ప మ | రీ ; | మా రి స రీ సా |
| స్వ | ర సా . . . . . | హి | త్య వి . ధు ల |

అ. ప, వలె.

నెరిగి నాద సుధనుగ్రోలి

ధరణిజాధిపు పొగడు ఘనుని॥





# గ్రంథ సమీక్ష

★

## శతపత్ర సుందరి

శ్రీ బాలాంత్రపు రజనీ కాంతరావుగారి విరచితములైన రసవత్తరములగు 260 గేయముల సంపుటి. శ్రీ పింగళి లక్ష్మీకాంతకవిగారి ఆశీస్సు పరిచయ వాక్కులతోను, చక్కటి ముద్రణ, గెటప్పులతో 381 పేజీలుగల గ్రంథ రాజము.

'ఏగూటి చిలుక ఆగూటి పలుకే పలుకుట సహజము.' వసంత ఋతాగమమున కోయిలకు మధురగీతికల నాలపించుట ఎవరు నేర్పింపవలెను? లోనపొంగిపొరలే రాగసుధారస మధురామృతమును లోకమునజిలికి, లోకము తన్మయత్వమున మారుపలుకునట్లు జేయుచు, హాయిగా పాడుకొనుట కోయిలకు స్వభావము.

"నే పాడుదును గళమెత్తి, స్థాయులు !

మూడు పైపై హెచ్చగా, రాగమ్ము తీగలుసాగ, శ్రోతలు
బాగుబాగని మెచ్చగా, నేపాడుదును,
కవిరాజహంస గురుప్రసాదము, కవనమై ఫలియించగా
ఆకాశవాణీ సేవలోనా, గానధోరణి నించగా,
నేపాడుదును
శతపత్ర సుందర కావ్య కన్యక, సమితిమన్ననలందగా
సహజన్మిమన్యుల సత్కృతుల సహ, సన్నుతుల
నేపొందగా, నేపాడుదును,
స్వాతంత్ర్య విభవామోదమోహిత, తల్లిభారతి పొంగులో
అభ్యుదిత రాష్ట్రనందవర్ధిత
అమ్మ ఆంధ్ర వెలుంగులో, నేపాడుదును."

ఈఫక్కీని ఉగాది గీతములు, బృందగానము, ప్రణయ గీతలు, ప్రబోధ గీతలు, రాష్ట్ర గీతలు, మంగళగీతలు ఇత్యాదులెన్నెన్నియో గలిగి ప్రేమ, భక్తిమున్నగు అపూర్వభావముల రెకెత్తించుచు కవిత్వ సామర్థ్యము - శబ్దమాధుర్యము - భావపౌష్కల్యము ఒకదానితోనొకటి విద్యోతమానమగుచు నున్న యీ ఉత్తమ శ్రేణికి జెందిన గేయ రచనలకు విమర్శలక్కరలేదనుటయే సమంజసము.

ఆంధ్రు లెల్లరు విరివిగా పఠించి, మరిమరిపాడు కొనుచు, 'శతపత్ర సుందరి' కావ్యకన్యక గూర్చు ఆనందము నవారిగా ననుభవింపవలసినదే.

ప్రకాశకులు : వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు.
పుస్తకము వెల రూ. 3.

—కె. సు.

## గ్రామాయణము

రచన : "ఆరుద్ర" - కుబేరా ప్రచురణ, మద్రాసు.
వెల : ఒక రూపాయి.

దేశ సౌభాగ్యానికి ఆటపట్టైన గ్రామాలనూ గ్రామస్థులనూ పునరుద్ధరించి సంఘసంస్కరణకీ, దేశము యొక్క భావి భాగ్యోదయానికీ తోడ్పడ్డమే యీ గ్రామాయణ కథా సారాంశం. త్రాగుడు, దొంగతనం, దోపిడీలు మొదలైన అవినీతులకు లోనైన వారికి నీతి నియమాలు, సహకారోద్యమం అలవరచి సమాజంలో వారికి గౌరవ మర్యాదలను పెంపొందించడమే ఆశయంగా నుంది. ఈ ఆశయాన్ని సాధించడానికి, దేశానికి వరవడియైన సత్యాహింసా సూత్రాన్నే ఆయుధం చేసుకున్నారు రచయిత.

—గిడుగు లక్ష్మీకాంతమ్మ.

## తీరని కోరిక

(తమిళ రచయిత చిరంజీవి నవలకు అనువాదము)
అనువాదకుడు : బి. విశ్వేశ్వరరావు. ప్రకాశకులు పళని యప్ప బ్రదర్సు. మద్రాసు 5.

వెల : 1-0-0

వైవాహిక జీవితం గడుపుతూ స్వార్థంకోసం నీతి నియమాలను అతిక్రమించి సంచరించే కామాంధుల జీవితగాథ కథా వస్తువు. కథ మొదటినుంచి చివరవరకు చదివాను. అక్కడక్కడ అపశబ్దాల ప్రయోగం, అసభ్యపు విషయాలను యేమాత్రం లౌక్యం లేకుండా యెత్తి చూపిస్తూ ఉన్నదున్నట్లుగా అతి వాస్తవికంగా చెప్పడం లేకపోతే కథ చదువుకోతగినదిగానే యుండేది. ఈతీరని కోరిక కథలోని పాత్రలకు, ఆ పాత్రలు సృష్టించిన కవికీ, చదువరులమైన మనకు, ఆంధ్రభాషామ తల్లికీ తీరనికోరికే. ఏ ఒక్కరూ సఫలీకృత మనోరథులు కాలేకపోయారు.

గాడేపల్లి సుందరీశంకరం.



# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ మద్రాసు

| | |
|---|---|
| మహిళా విద్యాలయము | : హిందీ, కాశీ విశ్వవిద్యాలయపు ఎడ్మిషన్, ఇంటర్‌మీడియెట్, ఇ.యస్.ఎల్.సి., పరీక్షలు. |
| పారిశ్రామిక విద్యాలయము (గవర్నమెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది) | : కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు, అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చుకూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. బీద విద్యార్థినులకు ఉచితము. |
| వస్త్రములపై అద్దకపుపని మిషనుకుట్టు, మిషను అల్లిక, చేనేత- బుక్ బైండిగు, ఎంబ్రాయిడరీ. | : భారత ప్రభుత్వ పునరావాసశాఖవారిచే ఆంధ్రమహిళా సభ పారిశ్రామిక భవనములు, 7-ఎ రోజరీ చర్చి రోడ్డులో నడుపబడుచున్నవి. |
| టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ | : స్త్రీలకు టైపు.—గవర్నమెంట్ పరీక్షలకు శిక్షణ. |
| మహిళా మందిరము | : స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము. |
| ఆంధ్ర మహిళ | : స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాసపత్రిక. |
| నిర్మలాదేవి గ్రంథాలయము | : సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంథ సముదాయము. |
| నర్సింగ్ హోమ్ | : స్త్రీ, శిశువుల, సంరక్షణశాల, ప్రసూతిశాల, ఉచిత వైద్యశాల— అడయారులో నిర్మించబడినది. భారత ప్రభుత్వ ఆరోగ్యశాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్స్ఎయిడ్—మంత్రసాని పనులలో శిక్షణ యివ్వబడుచున్నది. |
| ముద్రణశాఖ | : ఆంధ్ర మహిళా సభవారిచే స్వంతంగా స్థాపించబడినది. విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగు, ప్రూఫ్ రీడింగు, మొదలైనవి వుచితంగా నేర్పబడును. |

క్రీడా, క్లబ్బుశాఖలు.

సభ్యురాండ్రుగా జేరి, యీ జాతీయ సంస్థను పోషించండి.

వచ్చుచున్నది -

# ఆంధ్ర మహిళ

## 11 - వ వార్షిక ప్రత్యేక సంచిక

★

కొత్త పోకడలు -

సరికొత్త విధానము -

సుప్రసిద్ధ రచయితల రచనలతో

ఆకర్షణీయమైన చిత్రములతో

విజ్ఞానవిధాన వినోదములతో

పిన్నలకు - పెద్దలకు

స్త్రీలకు - పురుషులకు

కన్నుల పండుగగా వెలువడుచున్నది.

<u>డిశంబరు సంచిక</u>

**200** పేజీలు        వెల రూ **1**/- మాత్రమే.

మీ మీ కాపీలకు త్వరపడుడు



## దీపావళి దీపాలు

"అమవస చీకట్ల నాకాశమునకంపి
మిరుమిట్లు గొల్పేటి మెఱుపు దీపాలు
మిద్దె మేడలమీద మింటి చుక్కలదాక
వేయిరంగుల వెల్గు వింతదీపాలు"

"ఆంధ్ర మహిళ"

సంపాదకురాలు :
లక్ష్మీ రఘురామ్

ప్రచురణ :
ఆంధ్ర మహిళాసభ
మైలాపూరు, మద్రాసు-4

సంయుక్త సంపాదకురాలు :
కె. సుగుణమణి

# ఆంధ్రమహిళ

సంపుటి 11 :: నవంబరు '54 :: సంచిక 7





సంవత్సరచందా :: :: ఆరు రూపాయలు.


## రచయితలకు మనవి

మాకు కథలు, గేయాలు పంపేవారు ఈ క్రింది అంశాలను గమనించ ప్రార్థన.

రచనలు ప్రచురించనివానిని త్రిప్పి పంపగోరేవారు బుక్‌పోస్టుకు అవసరమైన స్టాంపు, లేదా స్టాంపుకు తక్కువకాకుండా పంపాలి.

రచనలు కాగితానికి ఒకే వైపు సిరాతో వ్రాసి పంపాలి.

రచనలు మాకు చేరిన విషయాన్ని, ప్రచురణ విషయాన్ని తెలియపర్చలేము.

సమీక్షకు గ్రంథాలు పంపేవారు రెండు ప్రతులు పంపవలసినదని మనవి.




సంపుటి 11 :: నవంబరు '54 :: సంచిక 7

# మన సంస్కృతి సంరక్షణ

— —:o:— —

గర్తపురి సీమలో — కృష్ణానదీతీరమున పల్నాడు తాలూకాలో మాచర్లకు పదునారు మైళ్ళ దూరములో — నాగార్జున కొండ గలదు. అది నిజముగ నొక కొండకాదు. ఒక సుందరమైన లోయ. ఆ లోయలో పూర్వము అతి ప్రాచీనమైన విశ్వవిద్యాలయముండెడిదట. విదేశములనుండికూడ విద్యార్థులు వచ్చి అచ్చట విద్య పడయుచుండెడివారని చెప్పుదురు. అనేక బౌద్ధాలయములు, మండపములు, విహారములు, స్థూపములుండెడివట. అవి ఇప్పుడు జీర్ణమై శిథిలమై యున్నవి. కొంతవరకు ప్రభుత్వ పురావస్తు శాఖవారు ఆ శిథిలములనుండి త్రవ్విన శిల్పములను భద్రపరచినారు. ఇప్పుడు నందిగొండ ప్రాజక్టు నిర్మాణముతో నాగార్జున లోయ జలమయం కాగల ప్రమాదం ఏర్పడినది. కాబట్టి ఈ శిథిలములను సంపూర్ణముగా త్రవ్వి వాటిని జాగ్రత్త పరచుకొనవలసిన అవసరము ఏర్పడినది. మొన్ననే అచ్చట త్రవ్వుటకు ఆరంభించినారు. ఎట్టి అపూర్వ కళా శిఖరములు బయల్పడగలవో! అచ్చట త్రవ్వ ప్రతి రాయి ఏదో చెప్పుచున్నట్లుండును. ప్రతి శిలా ఏదో కళా శిల్పపు తునకే. వీటినన్నిటిని జాగ్రత్తపరచుట ప్రభుత్వ కర్తవ్యము. ప్రభుత్వమునకు వలయు సహకారము ఆంధ్ర ప్రజలిచ్చుట వారి ధర్మము.

మాచర్లలోగాని ఆ సమీపములో ఎచ్చటైనగాని ఒక పెద్ద భవనములో ఈ శిథిలములను జాగ్రత్తపరచి ఒక సుందరమైన ప్రదర్శన శాలగా ఏర్పాటుచేయుట అవసరము. శిథిలములను త్రవ్వుట ఒక వంతు. త్రవ్వినవాటిని చక్కగ నేర్పాటుచేయుట నొక వంతు. ఈ శిలాఖండములతో ఏర్పాటైన ప్రదర్శనశాల మన అపూర్వ సంస్కృతిని సంరక్షించినదగును. అంతేకాదు. ముందు తరములవారికి ఈ అపూర్వ సంపదను క్రమముగా నిచ్చినవారమగుదుము. ప్రభుత్వము, ప్రజలు, కళావేత్తలు, కళాభిమానులు అందరు సహకరించి ఎట్టి ప్రదర్శన శాలను నిర్మింతురో చూడవలసియున్నది. ఇది కేవలము సాధారణ వస్తుసముదాయపు ప్రదర్శనశాల గాకపోవుటచేతను, అపూర్వ కళా సంస్కృతులు నిబిడీకృతమైయున్న వస్తు సముదాయపు ప్రదర్శనశాలంగావునను అందరూ ఎంతో ఆత్రుతతో ఈ ప్రదర్శనశాల నిర్మాణమును అపేక్షింతురు.



# అతివృష్టి - అనావృష్టి

వెనకటికి మా వూళ్ళో ఒకావిడ ఉండేది. పోయిన వాళ్ళు పోగా మిగిలిన సవితి బిడ్డలను వేసుకొని ఉన్నా కొంపా గోడుతో కాలక్షేపం చేస్తుండేది. ఇల్లు అన్న పేరేగాని సూర్య - చంద్రులు, వరుణ - వాయుదేవుళ్ళు యథేచ్ఛగా విహరించేటట్లుండేది. వర్షం కారుతుంటే కిటికీలలో తలదాచుకొనేవారు పిల్లలు. చూచిన వారెవరైనా "ఇల్లు మరమ్మత్తు చేయించుకోరాదా ?" అంటే- "ఇప్పుడెలాగ చెప్పండి వర్షాల్లోను ?" అనేది. వర్షాకాలం గడిచి ఎండలు కాస్తున్నప్పుడు ఏ 'వదిన' ఐనా ఉండబట్టలేక "ఇల్లు ఇప్పుడే నేయించుకోరాదటమ్మా" అంటే "ఇప్పుడెందుకు చెప్పు వదినా - వర్షాలు లేనిదానికి ?" అనేది - ఇక కొంప బాగుపడ్డం ఎప్పుడు ! పాపం గడవక అలా చెప్పేదో, సవితితల్లి ప్రేమో, దైవానికే ఎరుక.

పాశ్చాత్త ప్రభుత్వంకూడ స-రి-గ్గా అదే పద్ధతిలో పెట్టి పోయింది మన కొంపను. రెండు వందల ఏళ్ళు పెత్తనం సాగించింది ఈ కొంపలో. అనావృష్టి వల్ల అనేక కాటకాలొచ్చేయి, అతివృష్టి వల్ల అనేక వరదలువచ్చాయి; ఎప్పటి కప్పుడే కమిటీ నియామకాలు, రిపోర్టులు, కళ్ళుతుడిచే రిలీఫ్ మెజర్సు ! వానలు - వరదలు లేనప్పుడు సరేసరి - ఎవరికీ ఆగోల అక్కరలేదు ! అసలు వీటికేపైనా శాశ్వత నివారణోపాయాలు, పథకాలు వేయాలన్న ఉద్దేశం (వాన్టింగుగానున్న) లోపించిన సవితితల్లి ప్రేమలో, అంకినదంతా తమ దేశానికి తర్లించుకు పోవాలన్న పాశ్చాత్త ప్రభుత్వ విధానంలో, ఇంతకంటె వేరే సౌకర్యాలు లభిస్తాయని మనసుమాత్రం ఎందుకనుకోవాలి ! దానికితోడు, మన హైందవుల వేదాంతం ఒకటి - "అంతా మనకర్మం - విధినియామకం" అన్న సంతృప్తి ! ఇక ఇలాంటి పరిస్థితులలో వీటికి నివారణోపాయాలు మార్గాంతరాలు ఏమిటి !

అందుకే ఫలితాలు అనుభవిస్తున్నాం. ఉన్న పరిస్థితులు అవగాహన చేసుకొనుట మంచిది ——

అనావృష్టిక్షామాలు :— సంభవించిన సంవత్సరాలు : 1875-76, 1896—97, 1899—1900, 1907—08, 1909, 1921—22, 1924, 1931—32, 1934—35, 1937—38, 1941, 1942—43, 1945—46, 1951—52 అన్నిటికంటే మనచెవులతో మనం విన్నాం — బెంగాలు క్షామము లక్షలాది ప్రజల మరణాలూ; మనకళ్ళతో మనం చూచేం రాయలసీమలో 42—43 సం॥లో హృదయ విదారక క్షామపరిస్థితులు, అప్పటి యుద్ధాలవల్ల యీ బాధ మరీ దారుణం, దుర్భరం అయింది. 51—52 పరిస్థితులు కూడా మర్చిపోలేం. నెహ్రూప్రధాని శ్రీమతి దుర్గాబాయి దేశ్ ముఖ్ గార్ని పంపడం. అనేక రిలీఫ్ సౌకర్యాలు (ఫామిన్ కమీషన్, తక్కావీ అప్పులు, రోడ్లు - చెరువులు వంటి రిలీఫ్ పనులు — ధర్మాలు వగైరాలు) కల్పించడం అంతా ఎరిగిందే. ప్రజానష్టం — ఇంత అంత అని చెప్పలేం.

ఎన్నో ఫేమిన్ కమీషన్లు విచారణలు జరిపాయి. 1939 లో ఫేమిన్ కోడ్ రివిజన్ జరిగింది. 1941 లో రాయలసీమ ఆర్థికాభివృద్ధి బోర్డును నియమించడం, దాన్ని 49 లో కరిగించడం కూడ జరిగింది. ఈ బోర్డువారు సాధించదలుచుకున్న పనులన్నీ నెరవేరలేదు.

అతివృష్టి బాధలు :— ఇవి సంభవించిన సంవత్సరాల వివరాలు సరిగ్గా లభించడంలేదు. గాని స్వరాజ్యంవచ్చాక గూడ అనేక వరదలవార్తలు విన్నాం-కన్నాం-స్వయంగా అనుభవించాం గూడ. ఒక్కసారి గతసంవత్సరం తూర్పుగోదావరిలోని వరదలు, పశ్చిమగోదావరిలోని దెబ్బలు జ్ఞప్తికి తెచ్చుకోండి. దేశంలో యు. పి. ఉత్తర బీహార్, పశ్చిమబెంగాల్, అస్సాం వరదలు కల్పించిన ప్రళయం, ప్రజానష్టం పంటలనష్టం- ఇళ్ళువాకిళ్ళు ఘోరం కోత, రస్తాలు-రోడ్లపాలు ఇటీవల హైదరాబాదు రైళ్ళ ప్రమాదాలు ఇలా ఎంతని వర్ణించగలం మీరే ఊహ్యం. గత ఐదేళ్ళ వివరాలు :— అస్సాంలో 4 గొప్పవరదలు, బీహారులో 2 గొప్పవి 2 చిన్నవి, పశ్చిమ బెంగాలు, ఉత్తర ప్రదేశాలు రెంటిలోను కూడ 3 బ్రహ్మాండమైన అతివృష్టి దెబ్బలు. వరదలో మునిగిన విస్తీర్ణం 19[illegible]లో 60 లక్షలఎకరాలు, 1953 లో 100 లక్షలు, ఈ సంవత్సరం ఎన్నడూ కనీ వినీ ఎరుగని స్థాయిలో వరదల్లో మునిగిపోయినవి 120 లక్షలఎకరాలు ! వీటివల్ల ఆస్తి నష్టం 135 కోట్లరూ. అని చెప్పొచ్చుగాని ఇన్ని వేల ప్రజా పశువులూ చచ్చేయని ప్రజలు అనుభవించిన కష్టాలు ఇంతని చెప్పలేం. యదార్థబాధలు అనుభవించిన వారికే తెలుస్తాయి.

# అతివృష్టి - అనావృష్టి

సమస్యాపరిష్కారం : — పాశ్చాత్య ప్రభుత్వం కల్పించి పోయిన సమస్యలతోబాటు, ఇలా 3, 4 ఏళ్ళ కొకసారి క్షామదేవత మనల్ని చూచిపోతూంది, ఏటేటా గంగాభవాని వచ్చి మనల్ని మనకొంపల్నీ ముంచుతూ వుంది. వీటికి శాశ్వత నివారణోపాయాలు ఎలాగని ప్రజలు, ప్రభుత్వం దీర్ఘంగా ఆలోచించి చేయీ చేయీ కలిపి కృషిచేస్తే ఏదీ అసాధ్యంకాదు. పూర్వం కూడ ప్రజాక్షేమం కోరిన ప్రభువులూ, వారికి పూర్తి సహకారాన్నిచ్చి తోడ్పడ్డ ప్రజలూ అనేక ఆనకట్లు, ఏటిగట్లూ చెరువులూ వగైరాలు నిర్మించారు. అమెరికాలో "టెన్నిసీవేలీ అథారిటీ" గావించిన కృషి ప్రపంచ ప్రఖ్యాతి నందింది. నదుల్నీ వరదల్నీ సక్రమవిధానంలోకి తెచ్చి, అనేక సౌకర్యాలు కల్పించి, ఒకప్పుడు యమలోకంగా ఉండే ప్రాంతాల్ని స్వర్గతుల్యంగా మార్చేయ గలిగారు మానవులు. పోనీ వారికి యంత్రాలున్నాయి చేశారనుకుందాం. ఇటుచైనా చూడండి. కేవలం ప్రజలు లక్షలు వేలూ పనిచేసి బ్రహ్మాండమైన గట్లువేసి అనేకం సాధించారు. ఇలామనం కూడా ఎందుకు చేయలేం ?

ఇండియా ప్రభుత్వంవారు వరదబాధితులకు 175 కోట్ల రూ.లు ఖర్చు పెట్టవచ్చు. అది తాత్కాలిక ఉపశమనానికేగాని, మనపరిస్థితులు మారవు. నెహ్రూ ప్రధాని సారథ్యంతో యీనాటికి వరద నివారణోపాయమునకు ఒక కేంద్ర కమిటీని నియమించడం, అన్ని రాష్ట్రాలు వీరితో సహకరించి శాశ్వత మార్గాన్వేషణ గావిస్తారనడం చాల హర్షింపదగ్గ హంశం. ఇలాంటి పనులు కేవలం ప్రభుత్వమే గావించాలంటే అయ్యేదిగాదు. ప్రత్యేవక్తి సహకార సానుభూతుల నిచ్చి తోడ్పడితే ఏదీ దుస్సాధ్యంగాదు— అనేక బ్రహ్మాండమైన ప్రాజెక్టులు నిర్మించవచ్చు. అపారమైన సేవ మనకు మనమే గావించుకోవచ్చు.

★

కె. సు.



# కృతజ్ఞత

శ్రీమతి సి. బి. విశాలాక్షి.గారు. ఆంధ్ర మహిళా సభకు నూరురూపాయిలు విరాళమిచ్చి శాశ్వత సభ్యురాలిగా యెన్నుకోబడ్డారు. సభయన్న యీమెకున్న ఆదరాభి మానములకు మా కృతజ్ఞత.

దసరా మహోత్సవ సందర్భంలో శ్రీమతి న్యాపతి వెంకటరమణమ్మగారు, కుమారి అనసూయా దీనదయాళ్‌గారు కూడా చెరియొక వందరూపాయిలు విరాళమిచ్చి శాశ్వత సభ్యురాండ్రుగా యెన్నుకోబడ్డారు. చిన్ననాటినుండి మనసభలో సన్నిహిత సంబంధం కలిగియుండి సభాకార్యక్రమంలో ఉత్సాహంతో పాల్గొంటున్న వీరికి మా అభివందనములు.

ఆంధ్ర మహిళాసభ "మైక్‌ఫండు"కు శ్రీమతి టి. జి. హైమవతిగారు రెండువందల రూపాయిలు విరాళమిచ్చారు. సోదరి హైమవతి మనసభ శాశ్వత సభ్యురాలు మాత్రమేగాదు. మన సభ తలపెట్టిన ప్రతీ కార్యక్రమమునకు బాధ్యతవహించి వుత్సాహముతో పాల్గొనుచున్న ఆంధ్ర మహిళ. సెంట్రల్ సోషల్‌వెల్ఫేర్ బోర్డువారి కార్యక్రమానుసారం సూళ్లూరుపేట తాలూకాలో నెలకొల్పబడిన మాతాశిశు సంరక్షణాలయముల నతిసమర్థతతో నిర్వహిస్తూ మహిళాభ్యున్నతికి నిరంతరము సేవచేస్తున్న హైమవతిగారికి యీసందర్భమున మాకృతజ్ఞతాభివందనములు.

కార్యదర్శినులు.



# రాజకీయాలు

శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు.

1954 సెప్టెంబర్ నాలుగోవారం మొదలుకుని అక్టోబర్ మూడోవారం వరకు జాతీయ, అంతర్జాతీయ రాజకీయరంగాల్లో నడిచిన ప్రముఖ సంఘటనలు ఇవి—ఫ్రెంచి ఇండియాలో వాస్తవిక అధికారాలను ఇండియాకు ఫ్రాన్స్ అప్పగించటం, యూరప్ రక్షణపథకం భగ్నమై, దానిస్థానే బ్రుసెల్స్ ఒప్పందంలో జర్మనీకి స్థానం లభించటం, ఏడెన్ పరిసరప్రాంతాల్లో బ్రిటిష్ దుస్తంత్రాలమీద యెమెన్ ఐక్యరాజ్యసమితికి ఫిర్యాదు చేయటం, భారత ప్రధాని నెహ్రూ చైనాకు వెళ్ళటం, ఆయుధాల తగ్గింపు సమస్యపై అగ్రరాజ్యాలు తిరిగి సంప్రదింపులు జరపనిశ్చయించటం, పాకిస్థాన్ ప్రభుత్వ వ్యవహారాల్లో కలవరం, ఆంధ్రలో భూమిశిస్తు సవరణ.

*　　　*　　　*

దాదాపు 300 సం॥ల నుంచీ ఫ్రెంచి పరిపాలనక్రింద ఉన్న భారత భూభాగాలు పుదుచ్చేరి, యానాం, కారైకల్, మాహేలను భారతదేశం ఆధీనంచేసే విషయమై అక్టోబర్ 21 వ తేదీన ఇండియా, ఫ్రాన్స్ ప్రభుత్వాలు ఒక ఒప్పందం చేసుకున్నవి. దీని ప్రకారం ఈ ప్రాంతాల్లో క్రియకు యావత్తు పరిపాలనాధికారాలూ నవంబర్ 1 వ తేదీన ఇండియాకు అప్పగించబడతవి. చట్టరీత్యా అధికారాల అప్పగింత లాంఛనం తరవాత కొంతకాలానికి జరుగుతుంది. ఈప్రాంతాలు కేంద్రప్రభుత్వ విదేశాంగశాఖ పరిపాలనకింద ఉండగలవు. స్థానిక రాజకీయ పక్షాల ప్రతినిధులు కేంద్ర పరిపాలకుని సలహాదార్లుగా ఉంటారు.

తెలివితక్కువ స్నేహితుడికన్నా, తెలివిగల శత్రువు మేలు అన్న సామెత ఒకటి ఉన్నది. బ్రిటన్, ఫ్రాన్స్‌లు నిజానికి ఇండియాను వదులుకోదలచనప్పటికీ, ఇక్కడ ఉండలేమని తెలుసుకున్నతరవాత మంచిగా బయటికి పోయి, ఇండియా స్నేహాన్ని నిలుపుకున్నవి. ఫ్రెంచి వాళ్ళు మొదట తమకు ఇక్కడ స్థానంలేదని తెలుసుకున్నది చంద్రనగర్‌లో. అందువల్ల చంద్రనగర్‌ను ఇంతకుముందుగానే ఇండియాకు అప్పగించారు. పుదుచ్చేరి మొదలైన చోట్ల నిలవగలమేమోనని చూశారు. లాభం లేదని తెలిసిన తరవాత వెళ్ళిపోతున్నారు.

అయితే మనకు పోర్చుగల్ తెలివితక్కువ శత్రువుగా ఉన్నది. తనకు స్థానం లేదని తెలిసికూడా మొండిగా పోట్లాడుతున్నది. కాని, ఆదేశానికికూడా పరిస్థితులకు తల ఒగ్గక తప్పని పరిస్థితి ఏర్పడకతప్పదు.

*　　　*　　　*

యూరప్ రక్షణ పథకం పేరుతో పశ్చిమ జర్మనీని తిరిగీ సాయుధబలంగా తయారుచేయటానికి అమెరికా చేసిన ప్రయత్నం కిందటి నెలలో భగ్నమయింది. అమెరికా, బ్రిటన్‌లు స్వయంగా యూరప్ రక్షణకు సేనలను పంపితేనేగాని, లేకపోతే జర్మనీ దెబ్బకు ముందుగా తామే బలి అవుతామని ఫ్రాన్స్ భయపడి, ఆపథకాన్ని ఆమోదించలేదు. అందువల్ల పశ్చిమరాజ్యాల ప్రతినిధులు దానిని వదులుకుని బ్రిటన్‌చేత ఫ్రాన్స్ కోరిన హామీ ఇప్పించారు. బ్రుసెల్స్ ఒప్పందంలో పశ్చిమ జర్మనీ, ఇటలీలకు స్థానం ఇప్పించారు. ఈ ఒప్పందం ప్రకారం యూరప్ రక్షణ కోసం ఈ శతాబ్దం చివరవరకూ కొన్ని సేనలను పంపటానికి బ్రిటన్ అంగీకరించింది. జర్మనీకి స్వపరిపాలన ఇవ్వటానికీ, జర్మనీకి కొన్ని సేనలు ఉండేందుకూ ఫ్రాన్స్ అంగీకరించింది.

అయితే సార్ ప్రాంతంమీద కూడా ఒప్పందం కుదిరితేనేకాని, ఒప్పందాన్ని పూర్తిగా అమలు జరిపేది లేదని ఫ్రాన్స్ బెదిరిస్తున్నది.

*　　　*　　　*

మధ్యప్రాచ్యంలో పశ్చిమ రాజ్యాల ప్రయత్నాలు సక్రమంగా సాగిపోతున్నవి. సూయజ్ స్థావరాలమీద బ్రిటిన్ ఈజిప్టుతో అక్టోబర్ 19 న ఒప్పందం కుదుర్చుకున్నది. 20 నెలల్లో బ్రిటిష్ సేనలు అక్కడనుంచి వెళ్ళిపోవటం జరుగుతుంది. అయితే టర్కీ మీదకానీ, ఆరబ్ రాజ్యాల మీదకానీ దాడిజరిగితే, వాటి రక్షణకు 'బ్రిటిష్' సేనలు తిరిగీ అక్కడకు రావటానికి ఒప్పందం అవకాశం ఇస్తున్నది. అంటే ఏదో ఒక విధంగా మధ్య ప్రాచ్య ఒప్పందంలో ఒక అంశానికి ఈజిప్టు ఒప్పుకున్నదన్నమాట. అట్లాంటిక్ ఒప్పందంలో జేరి, పాకిస్థాన్‌తో సైనిక ఒప్పందం చేసుకున్న టర్కీతో చేయికలపటానికి ఇరాక్ సిద్ధపడుతున్నది. మధ్యప్రాచ్య ఒప్పందం ఒకటి అవసరమంటూ ఈ రెండు దేశాల ప్రధానులూ ఒక సంయుక్త ప్రకటనచేశారు. పర్షియా నూనెగనుల విషయంలో 8 విదేశీ కంపెనీలతో జహేదీ ప్రభుత్వం చేసుకున్న ఒప్పందాన్ని పర్షియా పార్లమెంటు చాలా గొప్ప మెజారిటీతో ఆమోదించింది.

అయితే పశ్చిమరాజ్యాలు వీలయినచోటల్లా బెదిరింపులు సాగిస్తూనే ఉన్నారు. ఏడెన్‌లో తిష్టవేసుకుని ఉన్న బ్రిటన్, పక్కనే ఉన్న యెమెన్‌తో గిల్లి కజ్జాసాగిస్తున్నది. అందువల్ల యెమెన్ ఐక్యరాజ్య సమితికి ఫిర్యాదు చేసింది. లాహాజ్ అనే ఆరబ్ సంస్థానాన్ని బ్రిటన్ కైంకర్యం చేసి ఎంతో కాలం కాలేదు. ఈ ప్రాంతాలన్నింట్లోనూ నూనె గనులు ఉండటం బ్రిటన్ వైఖరికి ప్రధానకారణం.

* * *

ఆయుధాల తగ్గింపు సమస్యమీద తిరిగీ సంప్రదింపులు జరపటానికి అగ్రరాజ్యాలు అక్టోబరు 22 న అంగీకరించినవి. దక్షిణాఫ్రికా భారతీయ సమస్యను పరిష్కరించే నిమిత్తం దక్షిణాఫ్రికా, ఇండియా, పాకిస్థాన్ ప్రభుత్వాల మధ్య ఒక మధ్యవర్తిని నియమించాలని ఐక్యరాజ్యసమితికి దక్షిణ అమెరికా రాజ్యాలు సూచించినవి.

* * *

భారత ప్రధాని పండింట్ నెహ్రూ ఈ అక్టోబరు 15 న చైనా పర్యటనకు బయలుదేరారు. చైనాతో మిగిలిన రాజ్యాల సంబంధాలను అభివృద్ధిపరచి తద్వారా శాంతిని స్థిరపరచటమే తన ప్రయాణోద్దేశమని ఆయన ప్రకటించారు. చైనా నాయకులు, ప్రజలు ఆయనకు మహత్తర స్వాగతం ఇచ్చారు. వేరువేరు సిద్ధాంతాలను అనుసరించే దేశాలయినా ఒకరిహక్కులను మరొకరు గుర్తిస్తూ, ఒకరి వ్యవహారాల్లో మరొకరు జోక్యం కలిగించుకోకుండా ఉంటే శాంతంగా ఒకరిపక్కన ఒకరు జీవించవచ్చుననీ, ఈ సూత్రాల ప్రకారం శాంతి ప్రాంతాన్ని నెలకొల్పాలనీ నెహ్రూ సాగిస్తున్న ఉద్యమాన్ని పూర్తిగా బలపరచటానికి చైనా హామీఇచ్చింది. చైనాపట్ల ఇరుగుపొరుగు దేశాలకు గల భయ సందేహాలను తొలగించటానికి కూడా చైనా నాయకులతో కలిసి కృషిచేస్తున్నారు.

చైనా వెడుతూ నెహ్రూ వీట్మిన్ నాయకుడు డా॥ హోషిమిను కలుసుకున్నారు. ఆయన కూడా శాంతియుత సహజీవన సూత్రాలను బలపరిచారు.

చైనాకు బయలుదేరే ముందు అక్టోబర్ 10 న నెహ్రూ సింహళ ప్రధానితో సింహళ భారతీయుల సమస్యను చర్చించి ఒక ఒప్పందాన్ని సాధించారు. క్రిందటిజనవరిలో జరిగిన ఒప్పదం సరిగా అమలు జరగటానికి వీలులేకుండా తాము కొన్ని చర్యలు జరిపినట్లు సింహళ ప్రధాని ఒప్పుకుని, వాటిని సవరిస్తామని మాట ఇచ్చారు. సింహళ పౌర హక్కులు లభించకుండాను, ఇండియా పౌరసత్వం లేకుండాను ఉన్నవాళ్ళ సంఖ్యను వీలయినంత వరకూ తగ్గించి (ఏదో ఒక పౌరహక్కు ఇవ్వటంద్వారా) రెండు సం॥ ల తరవాత మిగిలిన వాళ్ళ సంగతి మళ్ళాపరిశీలించటానికి ఉభయ ప్రధానులూ అంగీకరించారు.

* * *

అక్టోబర్ 19 వ తేదీన ఇండియా చైనాలు ఒక వ్యాపార ఒప్పందాన్ని చేసుకున్నవి. అందులో ఇండియా పొగాకు అమ్మకానికి అవకాశం వచ్చినందువల్ల పొగాకు పంటలో ప్రధానస్థానం వస్తున్న ఆంధ్ర రాష్ట్రానికి ఈ ఒప్పందం మరీ ముఖ్యం. ఆసియాదేశాల్లో భారతదేశపు పొగాకుకు మార్కెట్లను సంపాదించటంలో కొర్త. రఘురామయ్యగారి నాయకత్వాన ఇటీవల పర్యటించి వచ్చిన ఆంధ్ర వాణిజ్యబృదం చాలా కృషిచేసింది. ఇదికాక 14 వ తేదీన ఇండియా చైనాలు మరొక ఒప్పందం కుదుర్చుకున్నవి.

* * *

పాకిస్థాన్‌లో మళ్ళీ అశాంతి బయలుదేరింది. కేంద్ర ప్రభుత్వానికీ రాష్ట్రాలకూ విభేదాలు పెరిగిపోగా, ప్రాం

తీయ ఉపసమాఖ్య లంటూ ఏర్పాటు చేస్తామని ప్రధాని మహమ్మద్ ఆలీ నాటకాలు ఆడుతున్నాడు. సరిహద్దు రాష్ట్ర ప్రధానిగా ఉండి ఇప్పుడు కేంద్ర ప్రభుత్వంలో చేరిన కయాంకాన్ తిరిగి తన రాష్ట్రానికే పోతానంటున్నాడు. ఇదివరకు పార్లమెంటుఎన్నికలకు కొన్నాళ్ళవరకూ అనర్హులుగా ప్రకటించబడ్డ. సింధు. పంజాబ్ నాయకులు అనర్హతను గవర్నర్ జనరల్ గులాంమహమ్మద్ తొలగించారు. కేంద్ర ప్రభుత్వ అధికారాలను తగ్గించాలని పాకీస్థాన్ నాయకులు అలజడి చేస్తున్నారు.

ఈ సంఘటనలన్నీ ప్రధానిమహమ్మద్ అలీ అమెరికా కెనడాల పర్యటనలో ఉండగా జరిగినవి, ఈ పరిస్థితులకు ఆయన అనుచరులు భయపడి గోలపెట్టగా. ఆయన పర్యటన మధ్యలో ఆపుకుని స్వదేశానికి బయలుదేరారు. మహమ్మద్ ఆలీని బలపరచే నిమిత్తం అమెరికా తను పాకీస్థాన్‌కిచ్చే ఆర్థిక సహాయాన్ని అయిదురెట్లు చేసింది. ఆయుధ సహాయం సగం ఎక్కువ చేసింది. కాని ఇవి ప్రస్తుత కలవరానికి కారణాలయిన ఆంతరంగిక సమస్యలనేమీ పరిష్కరించలేవు. మహమ్మదాలీ స్వదేశానికి తిరిగి వచ్చిన తక్షణమే గవర్నర్‌జనరల్ దేశంలో ఆవాంతర పరిస్థితులు యేర్పడ్డాయని ప్రకటించి మంత్రివర్గంలోని కొందరికి స్వస్తి చెప్పాడు. పాకీస్తాన్ శాంతి పరిస్థితులు తిరిగి యేర్పడుటకు కొంతకాలం పట్టవచ్చు.

* * *

ఆంధ్ర ముఖ్యమంత్రి ప్రకాశంగారు రాష్ట్రావతరణ దినోత్సవంనాడు ఒక ప్రకటనచేస్తూ. పదిరూపాయలకు తక్కువ భూమిశిస్తు చెల్లించేవారు అది చెల్లించ నవసరం ఉండకుండా చేస్తామని అన్నారు. అయితే దీనిమూలంగా వచ్చే తరుగును భర్తీచేయటం కోసం నీటి తీరువను హెచ్చించాలనీ. నీటి పారుదలవల్ల బాగుబడ్డ భూముల మీద అభివృద్ధి పన్ను విధించటానికి ప్రభుత్వం ఆలోచిస్తున్నదని రెవెన్యూమంత్రి కోటిరెడ్డిగారు అక్టోబరు 12 న వెల్లడించారు. మొదటి సూచనను ప్రతికూలించే వాళ్ళు ఉండరుకానీ. రెండవ ప్రతిపాదనవల్ల పన్నుభారం ఉన్న వాళ్ళమీదనే మరింత పెరుగుతుందని ఆందోళన జరుగుతున్నది. ఏది ఎట్లాఉన్నా, భూమిపన్నులవిధింపు అందరికీ న్యాయంగా ఉండాలంటే. దానిమీద వచ్చే ఆదాయాన్ని పట్టి విధించాలేకాని. ఇతరత్రా ప్రయత్నించటం సరయిన పద్ధతికాదు.

* * *

ఆంధ్ర దేశంలో ప్రాజక్టుల ఆందోళన జోరుగా సాగిపోతున్నది. నందికొండ ప్రాజక్టు ఆలస్యానికి ప్లానింగ్ కమీషన్ పెద్దలే కారకులని ఆంధ్ర. హైదరాబాద్‌ల నాయకులు బయటపెట్టారు. ఈపరిస్థితుల్లో అది ఎట్లా సానుకూలమవుతుందో అర్థం కావటంలేదు. అయినప్పటికీ ఆప్రాజక్టువల్ల మునిగిపోయే నాగార్జునకొండ శిథిలాల్లో మిగిలినవాటిని తప్పించటానికి అక్టోబర్ 17 న కేంద్ర ప్రభుత్వ పని ప్రారంభించింది కనుక. మొత్తానికి ఇది అమలు జరుగుతుందనే అభిప్రాయం ఒకటి కలుగుతుంది.

అయితే అది ఎప్పుడు అన్నదే ప్రశ్నగా ఉన్నది. స్థానిక ప్రజలు దానికోసం ఒక ఉద్యమాన్ని సత్యాగ్రహం రూపంలో నడపాలని ఉద్దేశిస్తున్నట్లు వార్తలు వస్తున్నవి. ప్రాజెక్టుల్లో మొదటి స్థానం తుంగభద్ర ఎగువ కాలవకే నని ఆంధ్ర ప్రభుత్వంచేత కేంద్రానికి అదేపనిగా చెప్పిస్తున్న సంజీవరెడ్డిగారే, ఆపని త్వరగా కావాలంటే ఆసక్తి గలవాళ్ళంతా కేంద్రం మీద ఒత్తిడి తీసుకొని రావాలని చెప్పినప్పుడు. నందికొండను కోరే మామూలు జనం ఉద్యమం ప్రారంభించినా ఆశ్చర్యం ఉండదు.

అక్టోబర్ 29 న ప్రారంభమయే ఆంధ్ర శాసన సభలో ప్రభుత్వం ఎదుర్కొనే అనేకసమస్యల్లో ఇదికూడా ఒకటి.



# ఆంధ్ర మహిళాసభ దసరా ఉత్సవాలు

అక్టోబరు 5,6,7 తేదీలలో ఆంధ్ర మహిళాసభ జరిపిన దసరా ఉత్సవాల వివరాలు :

దేవీపూజ :— దుర్గాష్టమి, మహార్నవమి, విజయదశమి పర్వదినాలలో దేవీపూజ, బొమ్మల కొలువు పేరంటం జరిపారు.

చేతి పనుల ప్రదర్శన :— ఈ మూడు రోజులు సభాభవనములో మహిళాసభ పారిశ్రామిక శాఖవారు, విమెన్సుహోమ్, శ్రీ సదనం, మద్రాసు విమెన్ వెల్‌ఫేర్ డిపార్టుమెంటు, టి. నగర్ మహిళాసభ, ఆవ్వైహోమ్ సంస్థలు కలిసి చక్కటి చేతిపనుల ప్రదర్శన ఏర్పాటు చేశారు. శ్రీమతి నల్లముత్తు రామమూర్తి గారు ప్రారంభోత్సవం జరిపి, లలిత కళలను గురించి ఉపన్యసించారు. అనేకమంది స్త్రీలు యీ ప్రదర్శనను సందర్శించారు.

ఆటల పోటీలు ;- మహిళాసభ విద్యార్థినులు సమిష్టిగా మోతీ, హీరాదళములు రెండు కలిసి—

పొటెటో రేస్
ఫ్లాగ్ రేస్
పాసింగిది బాల్
జిగ్‌జాగ్ రేస్
} అనే 4 ఆటల్లో పోటీ చేశారు.

మొదటి మూడు ఆటల్లోను మోతీదళం గెలుపడంవల్ల షీల్డు మోతీదళానికే వచ్చింది. ఒక్కొక్క ఆటలో గెలిచిన దళములోని ప్రతి బాలికకు బహుమతులిచ్చారు.



శ్రీమతి నల్లముత్తు రామమూర్తి

ఇంకా వ్యక్తిగతమైన ఆటలలో రోప్‌స్కిప్పింగులో ఫస్టుప్రైజు—విమల గుప్త, సెకండు ప్రైజు- ఆహాలత; మూడు కాళ్ళ ఆటలో ఫస్టుప్రైజు- ఎలిజ బెత్తు, లక్ష్మి; సూదీ దారంలో ఫస్టుప్రైజు — ఇందు, ప్రీతి : సెకండు ప్రైజు- ఎలిజబెత్తు, లక్ష్మి; మ్యూజికల్ చైర్సులో ఫస్టుప్రైజు— కుమారీనందిని లకు బహుమతులు వచ్చినవి.



(దసరా ఉత్సవాల సందర్భంలో నృత్యంచేసిన కొచ్చిన్ సోదరీమణులు)

సర్వింగుహోమ్ విద్యార్థినుల ఆటలు : స్కిప్పింగులో - ఫస్టు ప్రైజు పి. చంద్ర, సెకండు ప్రైజు—వి. శాంత. సూదీ—దారం ఆటలో ఫస్టుప్రైజు ఎ. రామలక్ష్మి సెకండు ప్రైజు- వి. శాంత ; బేలన్సింగ్ ఆటలో ఫస్టుప్రైజు- ధనలక్ష్మి, సెకండు ప్రైజు— భవాని.

సభ్యురాండ్ర పిల్లల పోటీలు :— మూడు కాళ్ళ ఆటలో—ఫస్టు ప్రైజు [illegible], పాపాయి; సెకండు ప్రైజు [illegible].

# ప్రత్యేక వివాహాల చట్టం.

**శ్రీమతి ఎఱ్ఱమిల్లి సరోజినీదేవి**

ప్రత్యేక వివాహాలబిల్లు శాసనసభలో **లోక సభ**, రాజ్య సభలచే ఆమోదింపబడి ప్రెసిడెంటు ఆమోదము కూడ పొందింది. స్వరాజ్యము వచ్చిన తరువాత యావద్భారత దేశమునకు వర్తించు శాసనములలో ఒకటి ఇది. దీనికి ముందు వివాహములకు సంబంధించిన చట్టములు కొన్ని వున్నవి. 1872 వ సంవత్సరంలో ప్రత్యేక వివాహాల శాసనము **(Special Marriage Act of 1872)** పాసయింది. ఈ శాసనము క్రింద వివాహము చేసుకొనే వారు తాము హిందూ, మహమ్మదీయ, సిక్కు, జైన, క్రైస్తవ మతములకు చెందలేదని (declare) వక్కాణించ వలసి వచ్చెను. ఈ చట్టము క్రింద వివాహము చేసుకోదలచినవారు సహజముగా అబద్ధము చెప్పి చేసు కొనేవారు; దీనిలోని అనర్ధకము కనిపెట్టి 1923 వ సంవత్సరములో ఒకే మతమునకు చెందినవారు ఈ చట్టము క్రింద వివాహము చేసుకోవచ్చునని సవరణ చేయడమయినది.

ఇప్పుడు ప్రతిపాదింపబడుచున్న ప్రత్యేక వివాహాల బిల్లు ముఖ్య ఉద్దేశము మతవిషయ మయిన భేదములను లెక్కకు తీసుకోక పోవుట. యేమతమునకు చెందిన వారయినా ఈ చట్టము క్రింద వివాహము చేసుకోవచ్చు. హిందూ, మహమ్మదీయులనే భేదములేకుండా యెవ రయినా వివాహము చేసుకోవచ్చు. కాని ఈ చట్టము యావద్భారత దేశమునకు అనువర్తిస్తుంది. ఈ చట్టముక్రింద యిష్టమయిన వారే వివాహము చేసుకోవచ్చును కాని, అందరిలా చేసుకొని తీరాలను నిర్బంధము లేదు. **"It is optional or permissible but not Compulsory"** ఈ చట్టము క్రింద వివాహము చేసుకొనే వారికి హిందూ ధర్మశాస్త్రము వర్తింపదు. **Indian Succession Act** వర్తిస్తుంది. హిందూ ధర్మశాస్త్రమునకు **Indian Succession Act** కు ఆస్తి పంపుదలలో **(radical)** భేదములున్నవి. **Indian Succession Act** క్రింద కుమార్తెకు, కుమారునితో సమానముగా తండ్రి ఆస్తిలో సగము భాగము వస్తుంది. భార్యకు మూడవంతు భాగము వస్తుంది. హిందూ ధర్మశాస్త్రములోవలె కాక స్త్రీకి ఆస్తి సంపూర్ణహక్కుతో వస్తుంది. బొంబాయి రాష్ట్రంలో తప్ప హిందూ దేశములో మిగిలిన ఇతర రాష్ట్రములు స్త్రీకి ఆస్తి జీవిత హక్కుతోనేవస్తుంది. ఈచట్టము రానిముందు కాని తరువాతకాని వివాహము చేసుకున్న వారు వారి యిష్టమయితే ఈ చట్టముక్రింద మరల వివాహము **Register** చేయించుటకు ఈచట్టమును అనువర్తింప చేసుకోవచ్చు. ఈ చట్టము క్రింద వివాహము చేసుకొనుటతోనే హిందూధర్మశాస్త్రముకాని, మరి యే యితరమయిన **(Personal laws)** తో సంబంధము త్రెంచివేయడమవుతుంది. ఈ చట్టముక్రింద వివాహము చేసుకొనేవారికి వారిసంతానముకు **Indian Succession Act** వర్తిస్తుంది.

ఈచట్టముక్రింద వివాహము చేసుకునే స్త్రీపురుషుల వయస్సు విషయమై దీర్ఘ వాదోపవాదముల తరువాత స్త్రీలకు 18 సంవత్సరములు, పురుషునకు 21 సంవత్సరములు వయస్సు వస్తేనేకాని ఈచట్టముక్రింద వివాహము చేసుకొనుటకు వీలులేదని నిశ్చయించబడింది. ఈచట్టము క్రింద చేసుకొనే ప్రతివివాహము **Register** చేయించ వలెను. ఇంతకుముందు వివాహము చేసుకుని ఈ చట్టము క్రింద మరలవివాహము**Register** చేయాలంటే ఈ క్రింది పరిస్థితులలో వుండాలి. (ఎ) ఆభార్యాభర్త వారివ్యక్తిగతచట్టము personal laws ప్రకారంవివాహము చేసుకుని అప్పటినుండి కాపురముచేస్తూవుండవలెను. (బి)వివాహము **Register** చేయించుకునేటప్పుడు భార్యా భర్తలకు వారు తప్ప యితరులకి మరియొక భార్యకాని భర్తగాని వుండ కూడదు. (సి) వారు **(Prohibited degrees)** నిషేధపు బంధుత్వములో వుండకూడదు. (డి) భార్యకాని భర్తకాని రిజిష్టర్ చేయించు కునేటప్పుడు పిచ్చివారుగా వుండకూడదు. (ఇ) వయస్సు 21 సంవత్సరములలోపుగా వుండ కూడదు,

ఈచట్టముక్రింద చేసుకొను వివాహాలు భార్యాభర్తల అనుమతిమీద రద్దు చేసుకుని విడాకులు తీసుకొనవచ్చు. అనుమతిమీద విడాకులు తీసుకోదలచిన భార్యాభర్తలు భేదాభిప్రాయములు వచ్చి ఒక సంవత్సరము విడిగావున్న తరువాత, ఇద్దరూ కలసి యికముందు వుండుట అసంభవమని నిర్ణయమునకు వచ్చినతరువాత ఇద్దరూ కలసి జిల్లా జడ్జిగారివద్ద పిటిషను దాఖలు చేసుకోవచ్చు. పిటిషను దాఖలు చేసిన ఒక సంవత్సరములోపు కాకుండా భార్యా భర్తలు పిటిషను withdraw (ఉపసంహరించుకొనక)కుండా విడాకులు కావాలని కోరగా జిల్లాజడ్జి తగినంత విచారణచేసి, పిటిషనులోని

మని, ఈ చట్టముక్రింద వివాహము అయినదని నిశ్చయమునకు వచ్చినతరువాత వివాహము రద్దు అయినదని **decree pass** చేయవచ్చు. కోర్టువారిపై అనుమతిమీద విడాకులకు వచ్చినవారి అనుమతి వారి యిష్టముమీద వచ్చినదో లేక వారి అనుమతి బలవంతముచేత యియ్యబడినదో అను సంగతి చాల జాగ్రత్తగా పరిశీలించవలసిన బాధ్యత వున్నది. జిల్లా జడ్జి వీలయినంతమటుకు వారి మధ్య ఐక్యమత్యమును పెంపొందించుటకు, భేదాభిప్రాయములు మరచిపోయి, విడాకులు కోరకుండేటట్టు ప్రయత్నములన్నీ చేయవలెను. సంధి అసంభవమని తోచినప్పుడే వివాహము రద్దు పరచి విడాకులు యివ్వవలెను.

ఈసమ్మతిపై విడాకుల అంశముపైన శాసనసభలో తీవ్ర వాదోపవాదములు జరిగి చివరకు ఆ **Clause** వోట్లు తీసుకుని ఆమోదింపబడింది,

ఈచట్టములోని ఒక **Clause** ద్వారా భార్యకాని, భర్తకాని తగ్గని పిచ్చికాని **venreal disease** కాని, కుష్టుకాని వుండి, ఆకారణముచేత విడాకులకు **petitio** పెట్టినప్పుడు మూడు సంవత్సరముల గడువు తరువాత వివాహము రద్దుచేయవచ్చును.

ఈచట్టము మూలముగా వివాహ, విడాకుల విషయములో మనదేశము చాల ముందంజవేసింది. ఈచట్టము క్రింద యిచ్చిన హక్కును దుర్వినియోగముచేసి అబలలైన స్త్రీలను యిష్టములేని, యేలాగయిన పెళ్ళాలను తప్పించుకోవాలనే భర్తలు బలవంతముమీద వారి సమ్మతిని పొంది, వివాహము రద్దు చేయించుకుని, ఆర్థిక మానసికంగా వెనుకపడివున్న స్త్రీలను అధోగతి పాలుచేస్తారేమో నని ఒక వంక ప్రజల భయము తెలియపరుస్తున్నారు. యెంతవరకూ ఈచట్టము అమలులోకి వచ్చి నిజంగా వివాహ సమస్యలు వున్నవారికి వివాహము రద్దుచేసి సహాయము చేస్తుందో మనము చూద్దాము!



# మీరు కొన్నారా

# 10-సంవత్సరాల నేషనల్ ప్లాన్ సర్టిఫికేట్లు

**4½%**
**ఫలించునాటికి వడ్డీ ఆదాయపు పన్ను లేదు**

## ఇప్పుడే కొనండి

### ఇలాగ మీరుపెట్టే పెట్టుబడి ఇండియా అభ్యున్నతి నిమిత్తమే

- మీరు రు. 25/- నుండి రు. 1,000 వరకు, జాయింటుగా రు. 2,000 వరకు పెట్టుబడి పెట్టవచ్చు.
- ఫలించునాటికి సాలుకు 4½% ఆకర్షణీయమైన వడ్డీ-ఆదాయపు పన్ను లేదు.
- ఒక సంవత్సరం గతించినమీదట ఎప్పుడైనా వీటిని ఇచ్చి సొమ్ము పుచ్చుకోవచ్చు. కాని, అవి ఫలించువరకు ఆగడమే ఉత్తమం.

ఇతర వివరాలకై కోరండి :

ఏ తపాలాఫీసులోనైనా; అధికార నియుక్తుడగు ఏ ఏజెంటునైనా; లేక, నేషనల్ సేవింగ్స్ సంస్థ ఆర్గనైజరు; ప్రాంతీయ నేషనల్ సేవింగ్సు ఆఫీసరు.

AC 588 TG

## ఇండియా భవిష్యత్తు నిమిత్తం పెట్టుబడి పెట్టండి

# పండిత రామాబాయి

శ్రీమతి కె. రామలక్ష్మి

జీవిత చరిత్రలు అందులోనూ చనిపోయిన వారివి చదువడంవల్ల వచ్చేలాభం ఏమిటి? బతికి ఉన్నవారిని గురించి రాయకూడదా? లేకుంటే యింక దేన్నిగురించేనా వ్రాయకూడదా? అంటారు చాలామంది. కాని అందరికీ తెలిసినవే అయినా మానవత్వంలో నమ్మకం నశించకుండా నీలో నీకు, నీశక్తిలో నీకు అపనమ్మకం కలుగకుండా జీవితచరిత్రల పునశ్చరణ అవసరం అని నా నమ్మకం. నీ జీవితంలో నిన్ను ఏవ్యక్తి ఎక్కువగా ఆకర్షించింది? నీ ఆదర్శమూర్తి ఎవరు? అని



ప్రశ్నించుకొంటే మనోవీధిని అనేకులు మెదులుతారు. వీరందరి జీవిత చరిత్రలూ ఒక్కసారి మననం చేసుకొంటే, ఛాయా మాత్రంగా వెలిగిన యీ మూర్తులు మరొక్కసారి వెలిగి సడలుతున్న నీ ఆదర్శాలకీ, నమ్మకాలకీ మరింతబలం యిస్తారు. ఇదే నమ్మకంతో గతించిన వారి జీవిత చరిత్రలని పునశ్చరణ చేస్తున్నాను.

స్వీయకథగా తన కథని పండిత రామాబాయి వ్రాసింది. అది చదివితే మనకి స్ఫురించేది - ఆవిడగాంభీర్యమూర్తి. ఎంత గంభీర్య హృదయమో, ఆమెది అంత దయార్ద్ర హృదయం అన్న సంగతి తేట తెల్లమవుతుంది.

1858 లో అనంతశాస్త్రి డాంగ్రె లక్ష్మీబాయిలకి జన్మించింది — రమాబాయి. అసలు, అనంతశాస్త్రి లక్ష్మీబాయిల కలయిక జీవితం చదవడానికే వింతగావుంటుంది. అనంత శాస్త్రి ప్రథమ భార్య తీర్థయాత్రలు చేస్తూమరణించింది. భార్యా విహీనుడై కూడా తీర్థయాత్రలు సాగిస్తూ పైథాన్ అనే చిన్ని పట్టణాన్ని చేరుకున్నాడు అనంతశాస్త్రి. అక్కడే లక్ష్మీబాయినీ ఆమె తండ్రిని చూశాడు. ఈ రోజులలో మనం ఊహించుకోలేని వివాహం ఆరోజులలో అతిమామూలుగానే జరిగిపోయింది: పెళ్ళినాటికి లక్ష్మీబాయికి తొమ్మిది సంవత్సరాలైతే, అనంతశాస్త్రికి నలభైతొమ్మిది. వివాహం కాగానే భార్యను స్వస్థలమైన మంగుళూరుకి తీసుకువిచ్చి సంస్కృతం నేర్పడం ప్రారంభించాడు. ఆడదానికి చదువెందుకు? అందులోనూ పండితులు నేర్చుకోవలసిన సంస్కృతం ఎందుకు అనే యింట్లో వారిమాటలను లెక్క చేయకుండానే ఆమె చదువు సాగించాడు. వారి సూటీపోటీ మాటలకు స్వస్తి చెప్పడంకోసం భార్యాసమేతుడై యిల్లు వదిలి వెళ్ళిపోయాడు.

మంగుళూరు వదలి, గంగామూల అటవీ ప్రదేశం తన నివాసస్థలంగా చేసుకున్నాడు. సంస్కృతంలో పండితునిగా పేరుగాంచిన అనంతశాస్త్రి ఆ పరిసరాల వున్నాడని తెలియగానే చుట్టుపక్కల వూళ్ళనుంచి అనేకులు వచ్చి సంస్కృతాధ్యయనం చేసేవారు. చిన్న గుడిసె ఒకటివేసి అదేపాఠశాలగా చేసి తన శిష్యులకి శాస్త్రాలు వాటి సారలూ బోధిస్తూండేవాడు అనంతశాస్త్రి. అతను పుణ్యతీర్థాలు దర్శింపబోయినపుడు, అతని స్థానే లక్ష్మీబాయే విద్యగరిపేది. మైసూరు నేపాలు మహారాజుల ఆదరణకి పాత్రుడైనాడు అనంతశాస్త్రి. ఈ ప్రదేశంలో 20

## జీవిత చిత్రణ

సంవత్సరాలపాటు వున్నారు. కాని తమ ముగ్గురు పిల్లల భవిష్యత్తుకొరకై మైసూరు పోవనిశ్చయించారు. కాని, మైసూరు వచ్చేసరికే వృద్ధుడైన అనంతశాస్త్రిని ఎవరూ గుర్తించలేదు. దానికితోడు అతని ఆరోగ్యం కూడా సరిగాలేదు. లక్ష్మీబాయే, అతనిస్తానే సంస్కృత గ్రంథ పఠనం చేస్తూండేది. మైసూరులో గడవక, ఒక స్థలంనుండి యింకొక చోటికి, పాదచారులైపోతూ, చాలా కాలం కాలక్షేపం చేశారు. అటువంటి సమయంలోకూడా అనంతశాస్త్రి తన పిల్లలకి సంస్కృతంలో పాండిత్యం యిచ్చే యత్నంమట్టుకు మానలేదు.

ఇటువంటి కష్టపూరితమైన కాందిశీక జీవితం అనంత శాస్త్రి పిల్లలకి విద్యగావరణమించింది. కష్టసుఖాలలో ఒక్కలా వుండకల్గడం కష్టాలను ఎదురీదడం దారిద్ర్యంలో కూడా ఆనందంగా వుండకల్గడం - ఇవన్నీకూడా కష్ట మయ జీవితం ప్రసాదించిన విషయాలే. అనంతశాస్త్రి కుటుంబం పడని యిక్కట్లులేవు. 1879 లో మద్రాసు వచ్చినప్పుడు, తినడానికి ఏ ఆహారంకూడా దొరక్క బాధపడ్డారు. అసలే వయస్సు ముదిరిన అనంతశాస్త్రి జీవితం త్వరగా ముగియడానికి యివన్నీ తోడ్పడ్డాయి. వారి బిడ్డలే - ముగ్గురు. ఈముగ్గురిలోనూ చిన్నది రమాబాయి.

అనంతశాస్త్రి కాలంచేసిన కొద్ది మాసాలకే, లక్ష్మీ బాయి, వారిపెద్ద కుమార్తెకూడా కాలం చేశారు. ఇక మిగిలినది రమాబాయి, ఆమె అన్నగారే. ఇద్దరూ కలిసి కాలక్షేపంకోసం ఉత్తరాదికి వెళ్ళారు. ఎన్ని కష్టాలుపడ్డ మంచిరోజులు ముందువస్తాయన్న నమ్మకంమట్టుకు పోలేదువారికి.

రమాబాయి యిరవై సంవత్సరాల యువతిగా నున్నప్పుడు, అన్నా చెల్లీ కలిసి కలకత్తా చేరుకున్నారు. రమాబాయి ఎవరో తెలియకపోయినా, అనేకవందల మైళ్ళు నడిచిన వ్యక్తి అనీ, సంస్కృతంలో పండితురాలనీ తెలుసుకొని, అనేకులు ఆమెను చూడవచ్చారు. పండిత ప్రకాండులుకూడా ఆమె సంస్కృత పఠనాన్ని గురించి విని, తామే విని, ఆమె పాండిత్యాన్ని కొనియాడేరు.

సంతోషించే రోజులు, ప్రారంభం కాగానే రమాబాయి అన్న మరణించాడు. దుఃఖిత అయిన రమాబాయి, తన అన్నగారి ప్రాణస్నేహితుడైన ఒక బెంగాలీ యువకుణ్ణి వివాహమాడి, అతనితో అస్సాం వెళ్ళిపోయింది. కాని, ఈ సౌఖ్యంకూడా ఎక్కువకాలం నిలువలేదు. పంధొమ్మిది మాసాల అనంతం కలరావ్యాధికి గురిఅయి రమాబాయి భర్త మరణించాడు. అతని జ్ఞాపక చిహ్నంగా ఒక పసి పాప మాత్రం మిగిలింది. తన హృదయానికి ఆనందం యిచ్చే యీ చిన్ని ప్రాణానికి "మనోరమ" అని పేరెట్టుకుంది రమాబాయి.

రమాబాయి, జీవితంలో దేన్నిగురించీ భయపడడం గాని బాధపడడంగాని ఎరుగదు. ఎన్ని కష్టాలనైనాసరే సాధారణంగానే నెట్టివేయడం ఆమెకు అలవాటయి పోయింది. ఇన్ని కష్టాల మధ్య ధైర్యంగా వుంటూ ఇంగ్లీషు నేర్చుకో నిశ్చయించింది. అందుకై మద్రాసు పోనిశ్చయించుకున్న సందర్భంలో, "దైవనిర్ణయంచేత నైతేనేం, మరెందువల్లనైతేనేం, యీపాటికి కర్ణాటకంలో, మహారాష్ట్రంలో, అస్సాంలో నా బంధువులూ, ప్రియ బాంధవులూ, నన్ను విడిచిపోయారు. ఆయా ప్రాంతాల నివశించే అవసరం నాకేముంది యింక ?....కాని మద్రాసులో వారి భాష నాకెలా తెలుస్తుంది అందుకే, ఏమీలేకున్నా తిరిగి మహారాష్ట్రం పోకతప్పదు" అని తన జీవిత చరిత్రలో రాసింది రామాబాయి.

పూనాలో పండిత రామాబాయి ఉత్తమోత్తమమైన స్నేహితులను పొందకల్గింది. మహదేవ గోవిందరనడె, రామకృష్ణగోపాల్ భండర్కర్ మొదలైనవాళ్ళు ఆమె అండనిలచారు. పూనా స్త్రీలకి ఆరోజులలో ఆమెచదువు సంధ్యలు నచ్చలేదు. అయినాకూడా, హిందూ స్త్రీలకి, హిందూ వితంతువులకి రామాబాయి తలపెట్టిన సేవ అపారం. 'ఆర్యమహిళా సమాజం' స్థాపించి ప్రతి శనివారం సమావేశాలేర్పరుస్తూ గంభీరంగా మాట్లాడి, ప్రేక్షకులని ఉత్తేజపరిచి, ఉత్సాహులని చేసేదిరమాబాయి. మహిళల స్థితిగతులను తెలుసుకొందుకు ప్రభుత్వం ఏర్పరచిన రాయబారం పూనా వచ్చినప్పుడు, రామాబాయి వారిని కలుసుకొని విద్యాసౌకర్యాలు ఆడువారికి కల్గించ మని కోరింది. స్త్రీ వైద్యులుకూడా అత్యవసరం అని కోరింది. ఇంత చేసినా, తగిన ఆర్థిక స్తోమతూ, మనుష్య సహాయమూ లేక తన సమాజ నిర్వహణకి చాలా కష్ట పడింది రమాబాయి.

వితంతు శరణాలయం స్థాపించి హిందువితంతువుల కష్టాలను బాపుదామనే ఆమె కోర్కెకి అడ్డు నిలచినది

ఆర్థికలోపమే. డబ్బు పోగుచేయడంకోసం "స్త్రీధర్మ నీతి" అనే చిన్న మరాఠీ గ్రంథాన్ని రచించింది. స్త్రీలు జీవితం సౌఖ్యప్రదం చేసుకోవాలంటే ఎలా బ్రతకాలో, ఎలా పని చేసుకోవాలో, యింటినీ పిల్లలనీ ఎలా సరిదిద్దు కోవాలో అన్నీ యీ పుస్తకంలో సవివరంగా వ్రాసింది.

తరువాత తన కుమార్తెతోసహా ఇంగ్లండు వెళ్ళింది. ఇంగ్లాడులో "వాంటేజి సిస్టర్సు"తో ఉన్న రోజులలోనే ఆమె క్రిస్టియను మతాన్ని స్వీకరించింది. తరువాత కాలేజీలో చేరి సంస్కృతం నేర్పుతూ, తాను ఇంగ్లీషూ, లెఖ్ఖలూ, సైన్సూ చదువుకో నారంభించింది.

రామాబాయి అమెరికాకు వెళ్ళినప్పుడు ఆనందిబాయి జోష్ డాక్టరు పట్టాను పుచ్చుకొంది. తానుకూడా డాక్టరు కావాలని రామాబాయికి చాలావుత్సాహం కల్గింది. కాని, పడలేదు. కాలం వృధాపుచ్చకుండా, పిల్లలకి చదువు సంధ్యలు ఎలా నేర్పాలో, నేర్చుకొంది. అదేవిషయంపై కొన్ని గ్రంథాలుకూడా వ్రాసింది. "సనాతన హిందూ స్త్రీ" అన్న ఆమె పుస్తకం అమెరికనులను ఎక్కువగా ఆకర్షించింది. ఆమె యిచ్చిన గంభీరోపన్యాసాలూ, హిందూ స్త్రీల దైన్యస్థితీ, ఫలితంగా అమెరికనులు 'రామా బాయి అసోసియేషన్' ప్రారంభించి డబ్బు పోగుచేశారు.

ఆ డబ్బుతో యిండియాకు తిరిగివచ్చి రామాబాయి 'శారదాసదన్' స్థాపించింది. మహాపట్నం బొంబాయిలో ఆర్థికంగా పరిష్ఠంగాని ఒక సంస్థని నడపడం సామాన్యం కాదు. కొద్దిరోజులలో ఈసంగతి గ్రహించిన రామాబాయి తన సంస్థని పూనాకి మార్చింది. పూనాకి ఆమె రాక ఉత్సాహాన్ని కల్గించలేదు. ఇదివరకటి ఆమె స్నేహితు లంతా ముఖం చాటుచేసుకొన్నారు. దానికి కారణం ఆమె క్రైస్తవ మతాన్ని స్వీకరించడమే. అయినా, రామాబాయి తన పట్టుదలనీ ధైర్యాన్ని విడువలేదు. తన 'శారదా సదన్' సవ్యంగానే నడకసాగించింది.

ఇదేసమయంలో సెంట్రల్ యిండియాలో క్షామం ప్రారంభమయింది. తన సదన్ గొడవలలో మునిగి వుండే రామాబాయి చూస్తూ వూరుకోలేకపోయింది. తనతో పనిచేస్తున్న యితర స్త్రీలని జట్టుకట్టుకొని క్షామ పీడిత ప్రదేశాలకి పోయి సేవసాగించింది. కెడగోవన్‌లో 'ముక్తి ఆశ్రం' అనే ఇంకో సంస్థని ప్రారంభించింది. అదే తనకీ ఆశ్రయం చేసుకొంది. శారదాసదన్‌ని తన తోటి స్త్రీలకి అప్పగించింది. ఈముక్తి ఆశ్రమం సరిగా నడవడానికి డబ్బు పోగుచేయడానికి తిరిగి మరోసారి అమెరికా వెళ్ళింది. ధనమైతే సమకూరిందికాని, రామా బాయి ఆరోగ్యం కొంచం కొంచంగా క్షీణింపనారంభిం చింది.

ముక్తి ఆశ్రమం - పండిత రామాబాయి తలపెట్టిన సర్వతోముఖ అభ్యుదయానికి కేంద్రం. ఇదనేకులకు ఆశ్రమం అయింది. అంతేకాక, దిక్కులేని పిల్లలకీ స్త్రీలకీ సహాయంకోసం కృపాసదన్ ప్రారంభించింది.

వయస్సుతోపాటు ఎక్కువయిన పనికి తోడు పండిత రామాబాయి ఆరోగ్యం తీవ్రగతిని క్షీణించింది. 1922లో తన 64-వ ఏట పండిత రామాబాయి కనుమూసింది.

రామాబాయి జీవిత చరిత్ర చదువుతుంటే - ఎంతటి పిరికివారికైనా, ఎంతటి దిక్కులేని పక్షులకైనా - గమ్యం చేరగలమనే ధైర్యం రాక మానదు. ఈమె జీవితం ఒక సత్యాన్ని చాటుతుంది: "ప్రపంచం నీకు ప్రసాదించే దానికంటే నీవే ప్రపంచానికి ఎక్కువగా ప్రసాదించే అవకాశాలు ఉన్నాయి" అన్నదే ఆ సత్యం. రామాబాయికి ప్రపంచం యిచ్చినదేమిటి? — అష్టకష్టాలూ అశాంతీనూ. కాని రామాబాయి యీ ప్రపంచానికి చేసిన సేవ, స్త్రీ జాతికి చేకూర్చిన అభ్యుదయం విలువ ఎంత? — అమూల్యం అది. స్త్రీజాతికి అబలత్వం అంతా అంట గడతారేకాని, కారణాలుంటే అవకాశాలుంటే, వారు తమ సబలత్వాన్ని వేయినోళ్ళ చాటకలుగుతారు. పండిత రామాబాయి జీవిత చరిత్ర చదువుతే మనకి చిరకాలం జ్ఞాపకం వుండిపోయేవి — ఆమె — కష్టాల గాథకాదు; ఆమె పడిన శ్రమకాదు: ఫలించిన ఆమె శ్రమమాత్రమే. స్త్రీ జనాభ్యుదయానికి ఆమె యిచ్చిన చేయూతమాత్రమే.



# గాంధీ సాహిత్యం

• శ్రీమతి కె. సుగుణమణి •

"రామాయణమంతా మూడుముక్కల్లో చెప్పు" అన్నాడట వెనుకటికి ఒకాయన! ఎలాగ చెప్పడం? "పుట్టె - కొట్టె - తెచ్చె" అని చెప్పవలసివచ్చిందట! అలాగ, 'గాంధీజీ సాహిత్యాన్నిగురించి రేడియోవారు పది నిముషాల్లోచెప్పండి' అంటే ఎదిసాధ్యమయ్యేపని? మరొకరి విషయంలో ఐతే, వారు వ్రాసిన వ్రాతలే 'సాహిత్యం' క్రిందలెక్క; కాని, గాంధీజీ విషయంలో ఆయన వ్రాసిన ప్రతీ అక్షరం, మాట్లాడిన ప్రతీ ముక్కా సాహిత్యమే గాంధీజీ పల్కులన్నీ వ్రాతలన్నీ త్రికరణశుద్ధిగా జరిగినవే గనుక ప్రతీదీ ఒక కావ్యమే, ప్రతీదీ గొప్ప సాహిత్యమే. అవన్నీ లిఖితమాత్రాలుగాక, 'జీవితం' అనే గ్రంథంలోని పుటలు. నిత్యాచరణ, స్వానుభావం అన్న మూసలోనుంచి రాలిన బంగారు కణికలు. మహాత్ముడి చిరునవ్వొక చిద్విలాస సాహిత్యం. ఆయన నవ్వులో విశ్వమంతా నవ్వినట్లే యుండేది. చిటికిన వ్రేలెత్తితే దేశమంతా లేచి పోయేది. "ఉ" అంటే ప్రపంచ పత్రికలన్నిట్లోను ప్రతిధ్వనించేది.

ఆ మహానుభావుడు మాట్లాడని హంశంలేదు. వ్రాయని శీర్షికాలేదు; చీమదగ్గరనుండి, హరిజనులవరకు ఆయనకు కావలసిన విషయాలే; గోసంరక్షణ మొదలు, ప్రపంచ రక్షణ అంతా ఆయన తాపత్రయమే; బ్రహ్మచర్యం నుంచి, భగవద్గీతవరకు భాష్యం వ్రాసాడు. ఆయన అలవరచుకోని గొప్పగుణంలేదు. శంకరుడున్నాడంటే ఒకే ఒక లక్ష్యం — అద్వైతం ఆయన మతం; బుద్ధుడంటే — అహింస ఆయన సిద్ధాంతం; నన్నయభట్టు వంటివారికి — ఒకటే కావ్యలక్ష్యం; శ్రీ రామకృష్ణ పరమహంసకు — భగవంతుడు తప్ప మరో విషయమే తెలియదు. కాని, మహాత్ముడేమిటి! ఆయనకు అక్కరలేని హంశంలేదు, ఆయనరాకనివిషయం లేదు! భారతావనిలోని మహామహుల సద్గుణాలేగాదు, లోకోత్తర ప్రతిభా సంపన్నులైనవారి అందరి గొప్ప గుణాలు మూర్తీభవించాయి — ఈతనిలో. ఇతడు ప్రాచ్య లింకోలిన్, ఇండియా క్రైస్తున్ను; భగవద్గీతలోని నిష్కామ కర్మాచరణానికి అర్థం చెప్పినంత సులువుగానూ బైబిలులోని 'సెర్మన్ ఆన్ ది మౌంటు'కూ భాష్యం చెప్పగల సమర్థుడు.

ఇతడు సత్యస్వరూపి. ప్రేమమూర్తి, అహింసా వ్రతధారి, నిరాడంబరులలో నిరాడంబి, హరిజనులలో హరిజనుడు, గృహస్థులలో బ్రహ్మచారి, మానవులలో దేవతామూర్తి, యుగపురుషుడు, రాజకీయవేత్త, సంఘసంస్కర్త, వేదాంత వేత్త, ప్రకృతి — వైద్యుడు, శాస్త్రజ్ఞుడు, ఋషి, వీరాధివీరుడు, వివిధభాషలలో అపూర్వవక్త, గీతకు వ్యాఖ్యాన కర్త, అందలి అమూల్య సూత్రాలను అరవైయేళ్ళు ఆచరణలో పెట్టగలిగేనని చెప్పుకోగల అఖండ ఆధ్యాత్మిక శక్తిస్వరూపి, రాజకీయాలను పరమార్థానికి ముడిపెట్టిన ప్రధానమనీషి. భారతీయుల భావముక్తికి, సాంఘిక ముక్తికి, రాజకీయ ముక్తికి, ఆర్థికముక్తికి ఆధ్యాత్మికముక్తికి, జీవిత సర్వస్వాన్నీ తృణప్రాయంగా ధారబోసిన త్యాగస్వరూపి. భారతమాతే — తాను, తానే - భారతమాత. ఇలాంటి సర్వజ్ఞుడూ, స్థితప్రజ్ఞుడూ, మహాత్ముడూనైన "గాంధీజీ సాహిత్యాన్ని" గురించి పది నిమషాల్లో చెప్పమంటే నాతరమా! ఆయన వ్రాసిన హంశాల్ని దిగ్దర్శినిగా చూచాయగా చూపించడానికిగూడ సాధ్యంకానిపని! "భారతాన్నే గనుక నేను వ్రాయవలసి యుంటే బండ్లకెక్కించేద్దు" నన్నబమ్మెరపోతనలాంటి ఏమహాకవో ఈ యుగపురుషుని సాహిత్యం సంగతి ఎత్తాలి. గాంధీ 'భారతా'న్ని, ఆయన మాటల్లోనే, నాలుగు వేల పేజీలుగల 8 'పర్వా'ల్లోకి యిమిడ్చేసరికి, టెండిల్కర్‌లాంటివాడూ, ఆయన సహకరులూ, టక — టకలాడిపోయారు! భారతాన్ని — ధర్మశాస్త్రం, వేదాంతం, నీతి శాస్త్రం, మహాకావ్యం, లక్షణ గ్రంథం, ఇతిహాసం, పురాణం వగైరాల సముచ్చయం అన్నారు. నవయుగ ప్రవక్తయైన గాంధీ సాహిత్యానికిగూడ ఈ లక్షణాలన్నీ ఉన్నాయనొచ్చు.

గాంధీజీ వ్రాసిన గ్రంథాలు: 'ఆత్మకథ', సత్యాగ్రహం, దక్షిణాఫ్రికాలోని సత్యాగ్రహం, ఆహార సూత్రాలు, శాంతి - యుద్ధకాలాల్లో అహింస, స్త్రీలు — సాంఘిక అన్యాయాలు, హిందూ ధర్మం, స్వదేశీ, బేసిక్ విద్య, వగైరాలు. ఇవిగాక నడిపిన పత్రికలు, నవజీవన్, హరిజన్, యంగ్ ఇండియాలు. వీటిల్లో ప్రతీ వ్యాసంలోను, మాటలోను సాహిత్యం తొణికిసలాడుతూ ఉంటుంది. ఆఖరుకు "ఆయన మౌనంకూడ, లండన్

పౌరులు, సాహిత్యంకంటె, గొప్పగా ఆనందించా"రని డా॥ మాంటుసోరీ వ్రాసింది. 'ఆత్మకథ'లో మచ్చుకు కొన్ని సాహిత్య విషయాలు చూడండి. అందలి భాష అతితేలిక ; ఆంగ్లేయులుకూడా ఆశ్చర్యపోయారు ఆ కవనానికి. "గద్యం కవీనాం నికషం వదంతి !" తనపై దుర్జనసాంగత్యం సాగించిన ప్రభావాన్ని మర్మంలేకుండా చెప్పడంలో మనకందరికీ మరువరాని గొప్పగుణపాఠా లున్నాయి ; వట్టినీతులెన్ని బోధించినా యీ పద్ధతికి సరి రావు. "'విద్య' అంటే బాలల హస్తం - హృదయం - మస్తిష్కాలకు ఏకరీతిని తర్ఫీదిచ్చి - శరీర మానసిక శక్తుల విజృంభణకు తోడ్పడేది" అన్న డిఫినిషన్ చూడండి; విద్యను గూర్చి యింతకంటె సూక్ష్మంగా చెప్పగలవారెవ్వరు? "నయాగరా జలపాతాన్ని ఉపయోగించడం నేర్చుకున్న మనిషి, తన హృదయకోశంలోని అఖండశక్తిని సద్వినియోగంలోకి తెచ్చుకున్నాడుగాదు" అంటాడు. 'నీవారసూకవత్తన్వీ' అన్న ఋగ్వేద మంత్రంతో యిదితులతూగడంలేదు ? భగవద్గీతకు వ్యాఖ్యానం వ్రాస్తున్నప్పటి ఇతని ప్రథమ వాక్యం చిత్తగించండి : 'గీత మొదటిసారి చదివినప్పుడే అది ఐతిహాసం కాదనీ, నిత్యం ప్రతిమనిషి హృదయంలోను జరిగే ద్వంద్వయుద్ధ వర్ణనేనని' గ్రహించాడట ! 'నిష్కామ కర్మాచరణ' గీత సారాంశమట ! ఏళ్ళతరబడిని, నిత్యం, గీత, పారాయణ గావించే మనలో ఎంతమంది దీన్ని అవగాహణ చేసుకున్నాం ? 'హరిజన్' పత్రికలోని సుభాషితం వినండి : 'మానవుడు అందలానికెక్కి చిందులు దొక్కే 'ఆనందాన్వేషి' అంటాడు ; ఏమి సూత్రప్రాయమైన వాక్కులు ! 'హరిజన్'లో వేరే చోట వ్రాసిన మాటలు : 'గ్రంథాలన్నీ గ్రంథులే'నట ; 'తనకే పూర్తి హోదాయిస్తే పాఠశాలల్లో పాఠ్యగ్రంథాలనేవే ఉండవట ! అతని మాటల్లో చలోక్తికూడ నర్మగర్భితంగా ఉంటుంది: సంతకం కోసరం కాగితమిస్తే, డబ్బుకోసరం చేయిచాపుతాడు ! "నా ఐదు రూపాయిలేవి ? - నేను లోభిని (మై కంజూస్ హూమ్), హరిజన్ ఫండుకు యాచకుణ్ణి !" అంటాడు. ఇక ఐదుకు పది చెల్లించకుండా ఎవరైనా యెలా ఉండగలుగుతారు !

ఆ మహానుభావుడు ఒకటి చెప్పాడు, ఒకటి చెప్పలేదు అనలేం : దేవుడు, ప్రార్థన, నమ్మకం, సత్యం, మతం, ఉపవాసం, మౌనం, నిర్భయత్వం, త్యాగం, పెళ్ళి, స్త్రీలు, వర్ణాశ్రమం, చర్కా, ఖాదీ, స్వదేశీ, మద్యపాన నిషేధం, విద్య, కళ, జాతీయత, స్వరాజ్యం, కార్మికులు, యంత్రాలు, బ్రతుకు, చావు - ఒకటేమిటి ? సర్వం, అతడి వాఙ్మయంలో ఇమిడివుంది. "హక్కు పట్టాలతో బాటు బాధ్యతా చిట్టాలు సంక్రమిస్తాయి" అంటాడు. "మరణంలోనైనా జీవించడం కనబడుతుంది" అంటాడు. "నాకు భగవంతుడంటే సత్యమే" అంటాడు. "అవాఙ్మానస గోచారమైనదొకటి సర్వాన్నీ శాసిస్తుంది" అంటాడు. ఇలాంటి సూత్రప్రాయమైన మాటలు గాంధీజీ వ్రాతల్లో ఎక్కడ చూచినా లెక్కలేనన్ని ఉంటాయి. వాటినితరచే కొద్దీ అనంతార్థం అవగాహన మౌతూనే ఉంటుంది. గాంధీజీ సాహిత్యంలో హృదయం హృదయంతో మాట్లాడుకుంటుంది. అదొక అపూర్వ భాష ! భాషకు మించిన భావసంపద ! ఇట్టిట్టివనిమాటల్లో చెప్పరాని సాహిత్య తళుకులవి !

గాంధీ సాహిత్యంలో మరొక్క విశిష్టత ఉంది ; సాధారణంగా కవి వ్రాతల్లోనున్న ఘనత, కవి జీవితంలో మృగ్యం. కాని, గాంధీజీ మాత్రం, తాను సృష్టించిన సాహిత్యంకంటె, అనేకరెట్లు గొప్పవాడు. నిత్యజీవితంలో తనకు స్వానుభావంగానిది అతడు వ్రాయలేదు. అందులోను అలా అనుభవించిన దాంట్లో ఏ అరవయ్యోవంతో వ్రాశాడు. ఆమాటల వెనుకనున్న అనుభవమూ, సూటిగా హృదయాన్ని తాకే సామర్థ్యమూ అలాంటివి. ఆయన 'ఆత్మకథ'లో మొదటి 52 ఏళ్ళ జీవిత గాథ ఎలా ఇమిడ్చాడో అంతా గమనించే యుంటారు. మరొకరెవరైనా అంత చరిత్రా చెప్పాలంటే అలాంటి వాల్యూములు పదైనా అంతటి సారాన్నీ సారస్వతాన్నీ పెట్టలేరు. క్లుప్తాతిక్లుప్తంగా ముఖ్య విషయాలే చెపుతూ ఆయన వ్రాశాడు. గాంధీ సాహిత్యాన్ని చదివేవారంతా ఈఃహాంశం జ్ఞాపకముంచుకోవచ్చు. మిగత సాహిత్యకారుల వ్రాతలకు, గాంధీ సాహిత్యానికి ఇలా ఎంతో తేడా ఉంది. ఉపనిషత్తుల భాషలో చెప్పాలంటే గాంధీజీ "ద్రష్ట" (సత్యాన్ని ముఖాముఖీ చూచేవాడు). అందుచేత ఆయన సాహిత్యాన్ని పరికించేవారికి అందులోనున్న దానికంటె పదిరెట్లు అవగాహనలోనికి రాకతప్పదు.

ఇలాంటి గాంధి సాహిత్యాన్ని గురించి ఎంత చదివినా. ఎంత చెప్పినా "చెవులకు తనివయ్యెడిననెడి" వారుండరు. ఇప్పటికైనా ప్రజలూ ప్రభుత్వమూ వీటి సామర్థ్యాల్ని గమనించి, పాఠశాలల్లో పాఠ్య గ్రంథాలుగా పెడితే

బాగుంటుంది. యువతీ యువకులు వీటిని పఠించి అందలి హంశాల్ని కొన్నైనా ఆచరణలో పెడితే ధన్యులమౌతాం.

గాంధీ నేషనల్ మెమోరియల్ ఫండ్‌వారు గాంధీ వాఙ్మయ సాహిత్య - ప్రచారాలకు ఇంకా కృషిసల్పవలసి యుంది. కాన్‌స్టిట్యూషన్ నిర్మాణం జరుగుతున్నప్పుడూ, పంచవర్ష ప్రణాళికలు తయారు చేస్తున్నప్పుడూ గాంధీ సూత్రాల్ని దృష్టిలోనుంచుకొని నిర్మించేరన్న విషయం దేశానికెంతైనా శుభావహం. ప్రభుత్వంవారు అనుదినం కూడా గాంధీ పల్కుల్లో నమ్మకాన్ని ప్రకటిస్తూనే ఉన్నారు. ప్రభుత్వోద్యోగులు శాసన సభ్యులు వీటిని సర్వత్రావర్లిస్తున్నారు. ఆయన సాహిత్య సంపద దేశాని కంతకూ కళతెచ్చేదిగానున్నప్పటికీ, భావిపౌరులు తయారయ్యే కళాశాలల్లో మాత్రం, ఆ కళాకారుని కళనేర్పబడ్డం లేదు. "దేశగర్వము దీప్తిజెందగ, దేశచరితము తేజరిల్లగ, దేశమరసిన ధీరపురుషుల వీరగాథలు" ప్రతీ దేశంలోనూ పాఠ్యగ్రంథాలుగా ఉంటుంటే, మనదేశంలో యిది గమనింపకబడకపోవడంకంటె శోచనీయాంశం లేదు. దీన్ని అంతా ఎంత త్వరలో గ్రహిస్తే అంత శుభావహం.

గాంధీ సాహిత్యంలో ఎక్కడ ఏపుట త్రిప్పినా గాంధీ మీతో మాట్లాడుతున్నట్లే ఉంటుంది. ఏ పల్కు-విన్నా 'శరీరం' గగుర్పాటొందుతుంది. చదివేవారి 'చిత్తం' అని వార్యమైన సంస్కారాన్ని పొందుతుంటుంది. వినే జనుల చెవులు — నోరూ స్వాతివానకు ముత్యపుచిప్పల్లాగు తెరుచుకొని ఉంటాయి! ఒక్కొక్క ఘట్టనలో అప్రయత్నంగా అశ్రుబిందువులు రాలుతాయి. మరొకప్పుడు చేతులు వాటంతట అవే లేచిపోయి జోడించి నమస్కారాలు పెడతాయి :—

"ఖ్యాతిగలట్టి గట్టికవు లందఱులేరె, అదేమిచోద్యమో 'మ
హాత్మ'డన్నచో గరగిపోవు నెడెంద, జొహారుచేతకై
చేతులులేచు ; ఆజన వశీకరణాద్భుత శక్తిమూడగా
నాతని పేరులోగలదొ ; ఆ గాంధి సారస్వతాన
నున్నదో!"

అని ముగించవచ్చు.

(ఆలిండియా రేడియోవారి సౌజన్యంతో)

## ఉరుములు - మెరుపులు

గ్రహాలపట్ల భారతీయులు చూపుతున్నంత ఆసక్తిని భారత ప్రజలపట్ల గ్రహాలు చూపుతున్నవాయని ప్రధాని నెహ్రూ మొన్న బొంబాయిలో అన్నట్లు పత్రికలలో వార్త—

గ్రహాలతో సాంగత్యము చేస్తేనేకదా ఆవిషయము మనకు తెలసేది.

"ఇండియాలో బిసికెట్లు తినుట తగ్గినది" — పత్రికా వార్త.

శ్రీ కిద్వాయిగారి పుణ్యమాని బియ్యము సమృద్ధిగా దేశములో పండుతున్నవిగా!

"భిన్నత్వంలో ఏకత్వము మన సంస్కృతీ లక్షణము" — బూర్గుల.

మన సంస్కృతీ లక్షణమేకాదు. మన జాతి లక్షణము - పైగా ఆంధ్రుల పత్యేక లక్షణము.

"వడ్రంగమును వృత్తిగా అవలంబించడమే తనకు ఎక్కువ యిష్టంగా వుండేదని, కాని విధి అన్యథా తలచడమువల్ల తాను మంత్రయి ప్రజల విమర్శలకు, పత్రికల విమర్శలకు సరికావలసివచ్చిందని" తిరుకొచ్చి పబ్లిక్‌వర్క్సు శాఖమంత్రి శ్రీ అచ్యుతన్ మేనన్‌గారు వాపోయారు — పత్రికా వార్త.

చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకునేమి లాభము.

"మన ఫిల్ము నిర్మాతలుగూడా సమాజక్షేమము నిమిత్తము ధర్మసూత్రాలను ఏర్పరుచుకొని పనిచేస్తే బాగుంటుంది" — రాజేంద్ర ప్రసాద్.

ఇవి చెవిటివాని చెవిలో శంఖమూదిన చందము కావుకదా? — కె. ల. ర.

## తపాలా ఆఫీసులు

మన దేశములో రకరకాల తపాలా ఆఫీసులున్నవి.

ప్రపంచములోకెల్ల ఎక్కువగా కుంభవృష్టికి గురి అయ్యే తాపాలా ఆఫీసు చిరపుంజిలోవుంది. ఇది నీలగిరి కొండలపై త్రాళ్ళసహాయంతో తపాలాలు చేరవేయిబడుతున్న మాదిరిగానుండును.

రాజస్థాన్ ఎడారులలో ఒంటెలపై పోస్టల్ సర్వీసు జరుగుచున్నది.

హుగ్లీలో స్టీమర్ పోస్టల్ సర్వీసున్నది.

బీహార్‌లో కోసినది వరదలకు గ్రామాలు మునిగిపోయినప్పుడు నాటుపడవలలో తపాలా సర్వీసు నడుపబడుచున్నది.

కాశ్మీరు పర్వత ప్రాంతములలో కంచరగాడిదలతా పోస్టలు సర్వీసు జరుపబడుచున్నది.

ఒరిస్సాలో పోలీసుదళము అతిప్రాచీన వార్తావాహక సాధనమైన కపోతములను ఉపయోగిస్తున్నారట.

# నా సింహళ ప్రయాణము

శ్రీమతి ఆ. భాస్కరమ్మ

నా సోదరుఁడు సింహళమును చూచివచ్చి దానిని నద్భుతంగా వర్ణించి చెప్పాఁడు. "See Naples and die" అంటారు. కాని నేను "See Ceylon and die" అంటాను అన్నాఁడు. ఒకటేమాట. అప్పటినుండి నాకు సింహళమును చూడాలని యుండేది. చూచేది యెట్లా? నా జీవితముతో ఎప్పుడైనా సింహళమును చూస్తానా అని అనుకొంటూ ఉండేదాన్ని. నేను చదువుకొనే రోజుల్లో ఒకసారి నీవు చేసిన యొక ప్రయాణాన్ని గుఱించి యింగ్లీషులో కాంపొజిషను వ్రాయమంది మా టీచరు. తక్కిన విద్యార్థులందఱూ మేమేమీ అంత యెక్కువయిన ప్రయాణాలు చేయలేము. ఏమి వ్రాయమని ఏదో వ్రాశారు. నేను నా సోదరుఁడిచ్చిన వర్ణనంతా వ్రాశేసాను నేనే చూచినట్లు. మా ఉపాధ్యాయిని తరగతికి వచ్చి నిజంగా నీవు సింహళం వెళ్ళావా? అని అడిగింది. నేను వెళ్ళ లేదన్నాను. నీవు చూచినట్లే వ్రాశావే చాలా బాగాను ఏలా వ్రాశావంది. నా సోదరుఁడు వెళ్ళాఁడు. అతను అంతా వర్ణించి చెప్పాఁడు. అదే ఇప్పుడు నేను వ్రాశానన్నాను. చాలా బాగుందని మెచ్చుకొన్నది.

తిరువనంతపురంలో జరిగే అఖిలభారత మహిళాసభకు వెడుతోన్నాం. అక్కడనుండి వెడితే బహుశః సింహళం కూడా వెడతామన్నాను ఇంట్లో. నా సోదరుఁడునవ్వాడు. మీరు వెళ్ళేవాళ్ళంతా ఆడవాళ్ళు. సింహళం వెళ్ళడమంటే సామాన్య విషయంకాదు. ఇక్కడినుండి వెళ్ళేవాళ్ళని ఆరోగ్యంగా ఉన్నారో లేదోనని పరీక్ష చేస్తారు. వారం రోజులు ఆపేస్తారు. ష్టీమరెక్కడానికి టిక్కెట్టు దొరకడం కష్టం. వెళ్ళారులే. అన్నాఁడు.

త్రివేండ్రంలో కాన్ఫరెన్సు అయిపోయింది. ఇంటికి తిరిగి వస్తోన్నాం. మాతోనున్న ఒకామెకు సింహళంలో ఉన్న ఇండియా గవర్నమెంటు ఏజెంటుగారి భార్య స్నేహితురాలు. ఆమె నాకూ స్నేహితురాలే. ఆమె అంతక్రితమొకసారి వారక్కడుండగా అక్కడకు రమ్మనమని అడిగింది. సింహళం వెడదామా అంటే వెడదామని అనుకొన్నాం. రామేశ్వరంలో దిగి అదికూడా చూడాలని రైలెక్కాం. రైలు మండాపం ష్టేషనునకు వచ్చింది. రైలులోని వారు చాలా మంది దిగి ఏవో కాగితాలు తెచ్చుకొంటున్నారు. రైలు చాలాసేపు ఆగిందక్కడ. మా బండిలోనున్న ఒకాయన వద్దకు వెళ్ళి ఆ కాగితాలేమిటని అడిగాను. అది డాక్టరు సర్టిఫికేట్టనియు, తాను కొలంబోలోనొక పాఠశాలకు ప్రధానోపాధ్యాయుఁడననియు, త్రివేండ్రంలో వాలంటీర్లకు కేప్టెనుగానుండి మమ్ములనందఱి నక్కడ చూచితిననియు చెప్పారు. మేము సింహళం వెళ్ళాలనుకొంటున్నాము. ఇండియా గవర్నమెంటు ఏజెంటుగారి యింటికి వెడతామనియు, ఆయనకూడా కొలంబోలోనేకదా ఉంటారనియు అడిగాను. ఆయన యుండేది కొలంబోకాదు కాండీ, మీరంతా ఆడవాళ్ళు వెడుతోన్నారు. అక్కడ మోసం చాలా యెక్కువగా ఉంటుంది. ఆయనకొక టెలిగ్రామివ్వండి పుల్గావలె జంక్షను దగ్గరకొక నవుకరును పంపమని. అప్పుడు మీరు సుఖంగా వెళ్ళవచ్చునని చెప్పారు.

రామేశ్వరంలో దిగి ష్టేషనునుంచే టెలిగ్రామిచ్చాను ఏజెంటుగారికి. రామేశ్వరంలో సముద్ర స్నానం చేసి, దేవాలయంలోకి వెళ్ళి చూడవలసినవన్ని చూసి రాత్రి మళ్ళీ రైలెక్కాం. తెల్లవారి 10 గంటలకు మండాపం జేరుకొన్నాం. డాక్టరుగారింటికి వెళ్ళాం. ఆయన వచ్చి ఏజెంటు చంద్రన్‌గారు తనకిచ్చిన టెలిగ్రాము చూపించారు. మేమంతా బాగా ఆరోగ్యంగా నున్నట్లు సర్టిఫికేట్లు ఇచ్చారు. అవి తీసికొని మళ్ళీ సాయంకాలం రైలెక్కాం. 5 గంటలకు ధనుష్కోడి చేరుకొన్నాం. అక్కడ ష్టీమరు సిద్ధంగా ఉంది. ష్టీమరు దగ్గరకు వెళ్ళేసరికి ష్టీమరులోని ఉద్యోగస్తులు వచ్చి మమ్ముల నాహ్వానించి లోపలికి తీసికొనివెళ్ళారు. అంత పెద్ద ష్టీమరెప్పుడూ చూడకపోవుటచేత అదంతా తిరిగి చూస్తోన్నాం. ష్టీమరులోని ప్రతి యుద్యోగి మా యొద్దకు వచ్చి **What do you want madam? What shall I do for you?** అని యెంతో నమ్రతతో అడుగుతున్నారు. మాకాశ్చర్యం వేసింది. ఏమిటిది యెంతో ఎరిగినవాళ్ళలాగ వీళ్ళిలా వచ్చి మర్యాదచేస్తోన్నారనిపించింది. సింహళం వెడుతో

న్నామేగాని దానిని గురించి యేమీ తెలియదు. ఆ స్టీమరులో ఒకచోట సింహళ ద్వీపపు పెద్ద మేపు ఒకటి తగిలించి యున్నది. వీళ్ళంతా వచ్చి యిలా అడుగుతూ ఉంటే ఒక కుర్చీ తీసికొనివచ్చి ఆ మేపు దగ్గర వేయ మన్నాను. ఒక పడక కుర్చీ తీసికొనివచ్చి అక్కడ వేశారు. ఆ మేపంతా పరిశీలిస్తోన్నాను. మేము స్టీమరు ఎక్కడ దిగుతామో, పుల్గావలె జంక్షను ఎక్కడో, కాండీకి రైలు మార్గమేలా యున్నదో మొదలైన విషయాలన్నీ తెలిసికొంటున్నాను. టిఫను, టీ వచ్చాయి. ఎవరో స్నేహితులింటికి వెడితే వచ్చినట్లు. తీసికొన్నాం. స్టీమరు కదిలింది. అందులో ఒకరికి వాంతులు ప్రారంభించాయి. కొందరు నెమ్మదిగా పడకలు వేశారు. నేను, మరికొందరు కూర్చుని పాక్ జలసంధిలో నుండి స్టీమరు వెళ్ళే మార్గం చూస్తోన్నాం. స్టీమరు శ్రీరాముఁడు కట్టిన వారధి ప్రక్కనుండే వెడుతోంది. కూలి శిథిలమైపోయినా ఇంకా ఆ పెద్ద పెద్ద రాళ్ళు మాత్రం ఉన్నాయిపొడుగునా.

7 గంటలయింది. స్టీమరు తలైమన్నారు రేవుకు చేరింది. స్టీమరులోని ఒక ఉద్యోగి వచ్చి రైలుకు టిక్కెట్లు తెచ్చిపెట్టనా అని అడిగాడు. మాకు సెకండు క్లాసు టిక్కెట్లు కావాలని అంతా డబ్బిచ్చాం. ఆయన ఇక్కడ హిందూదేశంలోలాగ రైలుకు, ఇన్ని తరగతులు లేవు. రెండే తరగతులు - **Upper class & Lower class**, అప్పరు క్లాసులో కొంచెం డబ్బుగలవాళ్ళు, ఉద్యోగస్తులు ప్రయాణం చేస్తారు. లోయరుక్లాసులో కూలీలు, బొత్తిగా డబ్బులేనివాళ్ళు ప్రయాణం చేస్తారు. అప్పరుక్లాసు మీపైపు సెకండుక్లాసువలె ఉంటుంది. కాని కూర్చుండుటకే కాని పరుండుటకు తగిన సమపాయం లేదు. ఇంతడబ్బూ ఖర్చుపెట్టి మీరు తెల్లవార్లూ మేలుకొని కూర్చోవాలి. లోయరుక్లాసులో ఒక పెట్టి మీకు ప్రత్యేకంగా యిచ్చేటట్లు ఏర్పాటు చేస్తాను. హాయిగా పడుకోవచ్చును. అంతగా మీకు డబ్బెక్కువగా ఉంటే నాకీయండి పిల్లలుగలవాణ్ణి అన్నాఁడు. తీసికోమన్నాం. ఆయన నవ్వుతూ ఊరికే అన్నాను. మీవద్ద డబ్బు తీసికొంటానా ? అన్నాఁడు. హార్బరులో దిగి రైలుకు వచ్చాం. రైలు చాలా యెత్తుగా ఉంది. ఎక్కటానికి చిన్న చిన్న బల్ల నిచ్చెనలు వేసియున్నాయి. మాకొఱకు నియమింపబడిన పెట్టె యొద్దకు వచ్చి నిచ్చెనలమీదనుండి లోపలికి వెళ్ళాం. పెద్ద పెట్టి ఒక వందమంది కూర్చోవచ్చు. కడగఁబడి శుభ్రంగా ఉంది. మేము ఏడుగురం పక్కలు పరిచేసికొని హాయిగా పడుకొన్నాం. మాకు టిక్కెట్లు కొనియిచ్చి రైలెక్కించిన ఆయన మా యొద్ద సెలవు తీసికొని వెళ్ళిపోయారు. మాకిదంతా చూస్తో ఉంటే ఆశ్చర్యంగా ఉంది. ఏమిటిది! ఎంతో ఎరుగున్న వాళ్ళలాగ వీళ్ళంతా ఈలా ఆదరించి గౌరవం చేస్తోన్నారు! ఇక్కడ మర్యాదాయిది ? మన వేపున ఎన్నో ప్రయాణాలు చేశాంకాని ఇంత ఆదరణ యెక్కడా లేదే! అనుకొంటూ నిద్రపోయాం.

తెల్లవారి 5 గంటలవుతుంది. ఇంకా వెలుతురు రాలేదు. అది జనవరి నెల యగుటచేత యింకా చీకటి గానే యుంది. మాకింకా మెలుకువ రాలేదు. మంచి నిద్దట్లో ఉన్నాం. మా పెట్టె యొద్దకెవరో వచ్చి తలుపు తట్టారు. ఎవరా అని లేచాను. నాచేతికొక టెలిగ్రాము ఇచ్చాఁడు. అది నేను చంద్రన్‌గారికిచ్చిన టెలిగ్రామే. ఈ టెలిగ్రామిచ్చినది మీరేనా అని అడిగాడు వచ్చీరాని యింగ్లీషులో. అవునన్నాను. పుల్గావలె జంక్షను వచ్చింది దిగండి నన్ను చంద్రన్‌గారు పంపారు అన్నాఁడు. సామాను నేను చూసుకొంటాను మీరు వెళ్ళి వెయటింగు రూములో కూర్చోండన్నాఁడు. మేము దర్జాగా వెళ్ళి కూర్చున్నాం. 9 గంటలకు రైలు వచ్చింది. మేము వెళ్ళి బండీలో కూర్చున్నాం. మా పెట్టెలో మేము ఏడుగురము తప్ప యింకెవరూలేరు. రైలు టన్నెల్‌లో నుండి పోతోంది. అందులో ఒక టన్నెలు ఒక మైలు పొడవుంది. అవన్నీ చూస్తూ లంకాద్వీపము యొక్క సౌందర్యాన్ని మెచ్చుకొంటో సరదాగా ప్రయాణం చేస్తోన్నాం. కాండీ స్టేషను వచ్చింది. 12 గంటలయింది. నౌకరు వచ్చి మాకొఱకు సిద్ధంగా ఉన్న రెండుకార్లలో మమ్మెక్కించి తాను వెనకాలనుండి సామాను తీసికొని వచ్చాఁడు. ఏజెంటుగారి బంగళాకు చేరికొన్నాం. ఆ దంపతులిరువురూ మమ్ముల నతిఆదరముతో ఆహ్వానించారు. చంద్రన్‌గారితో దారిలో మాకు జరిగిన గౌరవాదరణలను గుఱించి చెప్పాం. ఇక్కడంతా యీలా మర్యాద చేస్తారా అని అడిగాం. ఆయన సమాధానం చెప్పకుండా నవ్వుకొంటో వెళ్ళిపోయారు. ఆయన భార్య చెప్పింది ఈలా మీరు వస్తోన్నట్లు, మీకు కావలసిన సౌకర్యములన్నీ చేయవలసిందని ఈయన వాళ్ళందరకు టెలిగ్రాము లిచ్చారని. వారం రోజులున్నాం అక్కడ. సిగిరి, న్యూవ రేలియా, బౌద్ధదేవాలయాలు మొదలైన చూడవలసిన స్థలములన్నీ చూశాం.

## నా సింహళ ప్రయాణము

న్యూవరేలియా 6000 అడుగుల యెత్తుగల ఒక చక్కని కొండ. లంకాద్వీపానికి మధ్యగా ఉంది. నత్తగుల్ల చంట్లవలె ఆ పర్వతమునకు చుట్టూ చక్కని తారు రోడ్డు మరియొక వైపునుండి రైలు మార్గము ఉన్నవి. ఒక వైపున తేయాకు తోటలు, లవంగ ఏలకుల తోటలు మొదలైనవానితో గూడిన మైదాన ప్రదేశములు, అడవులతో నిండిన యెత్తైన యేటవాలు ప్రదేశములు. మరియొక ప్రక్కన చూస్తే అగాధమైన లోయలు, ఆ లోయలలో అతియెత్తైన రబ్బరు, టేకు మొదలైన చెట్లు. ఈలోయకు, కారు నడచే మార్గమునకు మధ్య ఒక మనిషి మాత్రమే నడచుటకు వీలుగానుండే ఒక సన్నని కాలిబాట. కారు నడిపే డ్రైవరు ఏమాత్రం ఏమరిపాటగానున్నా ఆ కారు ఆ లోయలో పడిపోయిందంటే ఇక యెక్కడా కనపడదు. ఒక కారులో ముగ్గురం కొంచెం పెద్దవాళ్ళం, బాధ్యతకలవాళ్ళం కూర్చున్నాం. రెండవ కార్లో నలుగురు కుఱ్ఱకారు కూర్చున్నారు. కార్లు రెండూ అతివేగంగా యెక్కుతోన్నాయి కొండ. దారిపొడుగునా తేయాకు తోటలు, రబ్బరు తోటలు, ఏలకులు లవంగములతోటలు, అడవులు, జలపాతములు, రకరకముల పక్షులు దృశ్యము అతిమనోహరంగా ఉంది. స్వర్గంలోకి వెడుతోన్నామా అనిపించింది. ఈ సింహళమంత అందమైనది కనుకనే "The pearl of the sea" అన్నాఁడు ఒక కవి. నా సోదరుఁడు చెప్పినమాట నిజమే. ఈ సింహళమును చూచిన తరువాత యిక చూడవలసినదేమీలేదు అనుకొన్నాను. జీవితములో పొందవలసిన అతిఉచ్చస్థాయి ఆనందము ననుభవిస్తోన్నాం.

వెనుకకు తిరిగి చూస్తిమికదా రెండవకారు కనబడలేదు. మా కారునాపమన్నాం. ఆ కారు వచ్చే జాడలేమీ కనబడటంలేదు. ఏమయింది ఆ కారు? ఒకవేళ లోయలో కాని పడిపోలేదుకదా? సంతోషమంతా పోయింది. మనస్సు పరిపరివిధాల పరుగెత్తుతోంది. వెనక్కు వెడదామా అనుకొన్నాం. మా డ్రైవరు భయంలేదని మాకు ధైర్యం చెపుతోన్నాఁడు. ఒక గంట అయింది. కారు ఇంకా కనఁబడలేదు. ఇక మాకు ఓపిక తగ్గిపోయింది. ఆరాటము హెచ్చయింది. ఏమీ తోచడంలేదు. ఎందుకు వచ్చామా యిక్కడకు అనిపించింది. ఇక చాలు కారును వెనుకకు మరల్చమని డ్రైవరును తొందరపెడుతోన్నాం.

ఇంతలో దూరాన్నుంచి కారుచప్పుడు వినిపించింది. మా కారు ఆగియుండటం, మేమంతా యేమీ తోచక అక్కడ బయట తిరుగుతో ఉండడం చూచి వాళ్ళు నవ్వుతోన్నారు. మాకు తెలుసు మీరీలా ఖంగారు పడతారని అందుకే త్వరత్వరగా ముగించుకొని వచ్చాము అన్నారు వాళ్ళు. మాకు చాలా కోపం వచ్చింది. ఏమిటది ముగించుకొని వస్తా? కారే చెడిపోయిందో, పైరే పోయిందో, లేక ఆకారు వంపులు తిరగడంలో దారి తప్పి అగాధంలో పడిపోయిందో అని ఖంగారు పడుతోన్నాం అన్నాం.

అందులో నున్న నా చెల్లెలొకామె చిత్రకారిణి. ఆ దృశ్యాన్ని చూస్తో ఉంటే ఆమె మనస్సు పరవశమై పోయింది. ఆమె అన్నీ మరచిపోయి ఆ కారునక్కడాపించి అక్కడి దృశ్యాన్ని సంక్షిప్తంగా వ్రాస్తోకూర్చుంది. ఆ బొమ్మలు చూపించింది. అంత తక్కువ కాలంలో అంత చక్కగా చిత్రించిన ఆ బొమ్మల్ని చూడడంవలన కలిగే ఆనందం కలగలేదు మా చెదిరిపోయిన మనస్సులకు. వారిని కోప్పడి ఈసారి వారి కారు ముందు మా కారు వెనుక పెట్టి పైకి వెళ్ళాం. ఎక్కడ చూచినా అశోకపు వృక్షములే. పెద్ద వనం దానికి అశోకవనమని పేరు. ఒక చోట నిర్మలమైన ఒక సెలయేరు ప్రవహిస్తోంది. అది పడే స్థలమొక పెద్ద గుండం. స్వచ్ఛమైన రాళ్ళమధ్య నుండుటచేత నీరతి నిర్మలంగా ఉంది. సీతమ్మవారక్కడ సమీపంలోనున్న ఒక అశోక వృక్షం క్రింద ఉండేదని. ఆ గుండంలో స్నానం చేస్తో ఉండేదని చెపుతారు అక్కడివాళ్ళు. ఆ కొండమీద ఒక పెద్ద వూరుంది. అక్కడ తేయాకు తోటల యజమాన్లు దొర్లుంటారు. అక్కడి షాపులన్ని యూరపియను కంపెనీలవే. ముఖ్యంగా ఇంగ్లీషువారివి.

సింహళం వదిలి తిరిగీ వచ్చేటప్పుడు కొలంబోలో ఆగాం. అక్కడ విక్టోరియా హోటలులో దిగాం. కొలంబోలో ఉన్న హోటళ్లన్నిటిలో పెద్ద హోటలది. అక్కడొ గమ్మత్తు జరిగింది. మేమున్న గదిలో టేబిలుమీద రెండు పెద్ద సీసాలున్నాయి. వాటిమీద "ఇటలీ" అని లేబిల్సు అంటించి యున్నాయి. ఇదేమిటి మనగదిలో కూడా సీసాలు పెట్టాడు. మనం త్రాగుతామనుకొన్నారా వీళ్ళు అని నవ్వు కొన్నాం. మాకు దాహం వేసింది. మంచినీళ్ళు కావాలని గుమ్మంలో కూర్చున్న Waiting boy ని పిలిచి మంచినీళ్ళు తీసికొనిరా అన్నాం. అదిగో ఆటేబిలు మీద

ఉన్నాయి అన్నాడు వాడు, ఆ టేబిలుమీద యెక్కడ? ఇక్కడ బీరు బుడ్లున్నాయన్నాం వాడు నవ్వి అవి బీరు కావండి డిష్టిల్డు వాటరు బీరు సీసాలలో పోశాం లేబిల్సు తీయలేదు. అంతే మీరుస్త్రీలు. అందులోనూ స్వచ్ఛమైన భారతస్త్రీలు మీరున్న గదిలో బీరు సీసాలు పెడతామా? అన్నాడు. ఆమాత్రం జ్ఞానం వాడికున్నందుకు సంతోషించాం.

అక్కడనుండి అనురాధపురం, గాల్ మొదలైన స్థలాలు చూచుకొని యింటికి చేరుకొన్నాం. మేమతి జయప్రదంగా చేసికొని వచ్చిన (Adventures) సాహసమైన యీ ప్రయాణం విని మా వాళ్ళంతా ఆశ్చర్యపోయారు. మాసోదరుడు మరీను, ఇదంతా మీ గొప్ప కాదు లెండి ఏజెంటు చంద్రన్ గారి యోగ్యత అన్నాడు.

# భావసంకీర్తనము

* కవిరాజహంస, కవికులాంకార, శ్రీ బాలాంత్రపు వేంకటరావు *

సీ॥ చదల చుక్కలపేరి జపమాలలీవోయి!
                తొలిమంతరపుపాట తోఁచుదాఁక—
    కడలిముత్తెపునావ నడపింపఁగదవోయి!
                బ్రదుకుపేటలపాట లదుకుదాఁక!—
    బ్రదుకుటామనితోట పల్లవింపఁగదోయి!
                జీవకోకిలము కూజించుదాఁక—
    జీవవీణను బ్రపంచించిమీటగదోయి!
                ఆత్మరాగాలాపమందుదాఁక—

    ప్రణయవాహినుల్ గాత్రగోత్రములఁదెరలి
    చారులై వచ్చి ప్రణవాబ్ధిఁబడినదాఁక
    జీవగాయకుల్ నిన్నుఁజేరిపోవుదాఁక
    మైమఱచుదాఁక, పాటలు మాన్పకు ప్రభు!

సీ॥ నేనాడు మాటలు, నిగమంపుఁదోఁటలో
                శుకభాషణములుగా శ్రుతులనింతె?—
    నేఁబాడుపాటలు, నిర్మలశ్రుతివీధి
                సామగానములుగా, సంతరింతె?—
    నేవ్రాయువ్రాతలు, నీ చిత్రసృష్టిలో
                బ్రహ్మసూత్రములుగాఁబ్రస్తరింతె?—
    నేఁజేయుకైతలు, నిఖిలభారతములో
                నాత్మభారతముగా ననువదింతె?—

    అలవుచేఁగాదు— ఆశచేనడుగుచుంటి,
    చలముచేఁగాదు— చనవుచేఁ బలుకుచుంటి,
    చేవచేఁగాదు— చెలిమిచేఁ జెప్పుచుంటి,
    మొదలననిపించి, తుదిని నవ్వేదుగద! ప్రభు!

సీ॥ ప్రభుగోపురము పూర్ణభక్తిచేగఁట్టించి
                గోపరాజెత్తించె శ్రీపతాక!—
    రక్తికీర్తనలఁ దారకములోఁ బట్టించి
                త్యాగరాజెక్కించె నమృతనౌక—
    భక్తికావ్యము రామభద్రుఁడేపల్కింపఁ
                బోతరాజూఁదించె భువనమురళి—
    లలితకావ్యముకుశీలవులచేఁబాడించి
                మునిరాజు మ్రోగించెముక్తివీణ—

    వారిలోనెవ్వఁడను గానివాఁడనైన
    నందితిపతాక, నౌకాశ్రయంబుగంటిఁ
    మురళి వూఁదుచునుంటి నీశరణమంది,
    వీణమ్రోఁగింతు నిఁకనీవె వినఁదగుప్రభు!

సీ॥ ఒంటి నేనని నొచ్చుకొంటినిఁగాబోలు!
                జంట నేనని యచ్చుకొంటి వీవె—
    పదమందదని వెఱ్ఱిపడితినిగాఁబోలు!
                పదములందించి కాపాడితీవె—
    అర్థమున్నదెయని, యనుకొంటిఁగాఁబోలు!
                శ్రుతులంటిచూపి నవ్వితివి నీవె—
    భావ్యమా! యనితొట్రుపడితినిగాఁబోలు!
                ఉపనిషద్భావాల నూర్చితీవె—

    మనసు వ్రాసినదనుకొనఁ జనితినేమొ!
    మనసు వ్రాసినదనుమాట మలపి-యిదియె
    భక్తతతిపాట- జ్ఞానులబాట- భావ
    సూనములపేట యనియెదఁ జూపవె ప్రభు

# సాంఘిక సంక్షేమం



ఇటీవల ఇండియాలో సంఘ సంక్షేమాభివృద్ధికై జరిగే కార్యావళిలో అతి ప్రాముఖ్యమైన హంశం ఏమిటంటే, దేశంలో సంఘ సంక్షేమం సాగించే ఐచ్ఛిక సంస్థల కృషిని సమీకరణగావించడానికై కేంద్ర సంఘ సంక్షేమ బోర్డు యొక్క నియామకం.

ఈ పేజీలలో, మాసమాసం, పాఠకులకోసరం – ఆ బోర్డుయొక్క కృషీ, సాధించిన పనులూ, వీటితోబాటు, కేంద్ర సంఘ సంక్షేమ బోర్డువారు ప్రకటించే 'సంఘ సంక్షేమ' పత్రికనుండి కొన్ని ముఖ్య వ్యాసాల తర్జుమాలు కూడ ప్రకటించగలిగే అవకాశం మాకు లభించినందుకు గర్విస్తున్నాం.

ఈసదవకాశాన్ని మాకు కల్పించినందుకు బోర్డువారికి మా కృతజ్ఞత తెలియపరుస్తున్నాం.



# స్త్రీలు - కార్మిక సంక్షేమం

పద్మినీసేన్ గుప్త

మానవుడు తన స్వంత పనిముట్లతో తన ఆత్మీయుల సహాయంతో తన జీవితావసరములను తయారు చేసుకొంటూన్నన్నాళ్ళూ కార్మిక సంక్షేమం అనే ప్రసక్తే లేదు. పారిశ్రామిక విప్లవం ధర్మమా అంటూ ఆవిరి యంత్రాలతో బాటు కర్మాగార పద్ధతి అమలులోకి వచ్చినందువల్లనే అనేక కార్మిక సమస్యలు యేర్పడ్డాయి; ఆ సమస్యలను పరిష్కారం చేయడానికే కార్మిక సంక్షేమ కార్యక్రమం యొక్క అవశ్యకత కలిగింది.

ప్రస్తుత పారిశ్రామిక వ్యవస్థలో కార్మికుడు కూలి కోసం ఒకరి అజమాయిషీలో పనిచేసే వ్యక్తి. అతనుపయోగించే పనిముట్లమీద గాని, ముడి పదార్థాలమీద గాని, తాను తయారు చేసిన వస్తువులమీద గాని అతనికేమాత్రం అధికారం లేదు. వీటన్నిటికీ యజమాని పెట్టుబడిదారు. కార్మికుడు యజమానింప బడేవాడు మాత్రమే. అందుచేత యజమానికీ కార్మికులకీ మధ్య స్పర్థలు రావడం సహజం. వాటిని సరిదిద్ది పరిశ్రమలో సామరస్యం చేకూర్చి కార్మికుని పురోభివృద్ధికి తోడ్పడడమే కార్మిక సంక్షేమ కార్యక్రమం యొక్క ప్రధాన లక్ష్యం. కార్మికులు యంత్రాల్లో పళ్ళచక్రాల్లాంటి వారు మాత్రమేగాక, వారూ మానవులే కాబట్టి వారికి ఆరోగ్యం, విద్య, వసతి మున్నగు సౌకర్యాలు కల్పించే బాధ్యత సంఘంపైన వుంది. కార్మికుల సంతృప్తిపైననే జాతియొక్క శ్రేయస్సు ఆధారపడి వుందని గ్రహించుటచేతనే మన ప్రభుత్వం కార్మిక సంక్షేమ కార్యక్రమాన్ని జయప్రదంగా కొనసాగించేందుకు కృషి చేస్తోంది.

కార్మికుని జీవితం సుఖప్రదం చేయడమే కార్మిక సంక్షేమ కార్యక్రమం యొక్క లక్ష్యం. ఈ కార్యక్రమమును సక్రమముగా నిర్వహించే బాధ్యత ప్రభుత్వం, పెట్టుబడిదారు, కార్మిక సంఘాలు, సంఘ శ్రేయస్సునభిలషించే స్వచ్ఛంద సేవకులపైనా ఆధారపడి వుంది. ఈ రోజుల్లో కార్మిక సంక్షేమ కార్యక్రమానికి విశిష్టమైన ప్రత్యేక పద్ధతులేర్పడ్డాయి కాబట్టి ఆ పద్ధతులను అవగాహన చేసుకుని వాటిని అమలులో పెట్టగల సమర్థత లేబర్ ఆఫీసర్లోనూ, అతని సిబ్బందిలోనూ వుంటేనే యీ కార్యక్రమం జయప్రదం అవుతుంది. ఈ 'లేబర్ ఆఫీసరు' యజమాని కార్మికుల మధ్య సమన్వయం యేర్పరచుటకు నియుక్తుడైన వుద్యోగి. వేలకొద్దీ కార్మికుల శ్రేయస్సు వారి జీవితపథం 'లేబర్ ఆఫీసరు' సమర్థతపైనే చాలా మటుకు ఆధారపడి వుంది. అందుచేతనే యీ 'ఆఫీసరు' ఆఫీసరువలె గాక జీతం కోసమే పనిచేసే వుద్యోగివలె గాక కార్మిక సంక్షేమమనే మహత్తర ఆశయ సిద్ధికి పాటుపడే మనఃప్రవృత్తి కలిగి వుండాలి.

పరిపాలనా భారం వహించిన యీ యేడేళ్ళ స్వల్పకాలంలోనే మన ప్రభుత్వం శ్రామికుల సుఖ జీవనానికి తోడ్పడే అనేక శాసనాలు చేయగలిగింది. వీటిలో ముఖ్యమయినది సమగ్రమైన 'ఫాక్టరీస్ ఏక్ట్'. కార్మికులనెదుర్కొంటున్న విభిన్న సమస్యలను పరిష్కరించి కార్మిక సంక్షేమానికి తోడ్పడుతోంది యీ శాసనం. కర్మాగారాల్లోని 'మురికి'ని కడిగి వాటిలో పనిచేయుటకనువగు పరిస్థితుల నేర్పరచడంలో నేమి, శుభ్రమైన పాయికానాలు, కేంటీనులు, సంక్షేమ కేంద్రాలు, క్రీడలు, విశ్రాంతిగదులు- యిట్లే అనేక అవసరాలు యీశాసనంవల్ల కలుగజేయబడ్డాయి. 14 ఏండ్లలోపు గల పిల్లలను ఫాక్టరీలలో నియోగించరాదన్న హంశం గూడా యీ చట్టం స్థిరపరిచింది. ఈ సౌకర్యాలన్నీ కర్మాగారాలలో నెలకొల్పబడ్డాయా లేదా అని పరీక్ష చేసి లోటుపాట్లను సరిదిద్దడానికి సంక్షేమోద్యోగులను(వెల్ఫేర్ ఆఫీసర్లు) నియమించుటకు యీ చట్టం వీలు కలుగజేసింది. ఈ వుద్యోగులు యజమానుల సహకారంతో కార్మికుల శ్రేయస్సుకు పాటుబడుతూ వుంటారు.

భారతదేశానికి స్వాతంత్ర్యం లభించాక మన ప్రభుత్వం సాధించిన ఘన విజయాల్లో "ఎంప్లాయీస్ స్టేట్ యిన్సూరెన్సు ఏక్ట్" ఒకటి. ఈచట్టం ఢిల్లీ కాన్పూరు పట్టణాలలో అప్పుడే అమలులో పెట్టబడింది. దేశంలోని తదితర పారిశ్రామిక పట్టణాలలో గూడ త్వరలో అమలు చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

ఈ శాసనం కలుగజేసే సమహాయాల వల్ల కర్మాగారాల్లో చిక్కి శల్యమౌతున్న కార్మికుల ఆరోగ్య పరిస్థితి

## స్త్రీలు - కార్మిక సంక్షేమం

చక్కబడి తీరుతుంది. కార్మికులకు తగువసతి కల్పించడం మొదలగు అనేక సౌకర్యాలు మన పంచవర్ష ప్రణాళిక ద్వారా కార్మికవర్గానికి అందుబాటులోనికి రాబోతున్నాయి. ఈనాడు కార్మిక సంక్షేమం అన్నది మహత్తరమైన సమస్యగా పరిగణింప బడుతోంది.

దేశంలో పారిశ్రామిక సంస్థల్లో పనిచేసే స్త్రీ కార్మికుల సంఖ్య సుమారు అయిదు లక్షలు. ఇది 70 లక్షల స్త్రీల వరకున్న కార్మిక సంఖ్యగల గ్రేట్ బ్రిటన్‌లాంటి దేశాలతో పోలిస్తే తక్కువే అనుకోండి. నిజానికి ఇంగ్లాండులోని కార్మిక సంఖ్యలో మూడోవంతు స్త్రీలే. మనదేశంలో స్త్రీ కార్మికుల సంఖ్య తక్కువైనా, ప్రభుత్వంవారు అనేకమంది స్త్రీలను లేబర్ ఆఫీసర్లుగా నియోగించారు. మెటర్నిటీ బెనిఫిట్ ఆక్టు (గర్భవతిగానున్నప్పుడు సెలవు, అలవెన్సు మొదలగు సహాయాలు కలుగజేసే చట్టం) అమల్లోపెట్టారు. 50 మంది కార్మికస్త్రీలకంటె మించిఉన్న కర్మాగారంలో క్రెచీలునెలకొల్పాలని, ప్రొద్దుట 6- సాయంత్రం 7గం.లకు మధ్యకాలం తప్పించి ఇతరకాలాల్లో వీరిని వినియోగించ రాదని, విస్తారం బరువులు ఎత్తించ రాదని, విశ్రాంతికి, కాలకృత్య నిర్వహణకు కావలసిన సౌకర్యాలు కల్పించాలని యిట్లే అనేకవిషయాల్లో ప్రభుత్వం శ్రద్ధ తీసుకొని కార్మిక స్త్రీల యోగక్షేమాలు కనిపెడుతున్నారు. ఒకేపనిచేసే స్త్రీపురుష కార్మికులకు సమాన వేతనాలివ్వాలని కూడా నొక్కి చెబుతున్నారు. అందుచేత మన దేశంలో కార్మికస్త్రీల స్థితిగతులు చాలబాగు పడ్డాయి. యుద్ధకాలంలో నారమిల్లుల్లో పనిచేసే స్త్రీల దురవస్థ నాకు బాగా జ్ఞాపకం. రాత్రుళ్ళు లాంతర్లు పట్టుకొని కాళ్ళీడ్చుకుంటూ అర్ధరాత్రులు పనిచేయడానికి వెళ్ళేవారు. అప్పుడు ఏర్పడ్డ పరిస్థితుల్లో స్త్రీలను బొగ్గుగనుల్లోనికి, కూడ పంపించి పని చేయించేవారు. ఇలాంటి అవస్థలన్నీ పోయినందుకు అంతా సంతోషిస్తున్నారు.

అంతే కార్మికుల, అందు ముఖ్యంగా స్త్రీలయొక్క, సంక్షేమం సంతృప్తికరమైన అవధికి వచ్చిందని గాదు. ఇంకా చేయవలసింది ఎంతో ఉంది; ప్రతీ పారిశ్రామిక సంస్థలోను ఇంకా ఎక్కువగా విమెన్ లేబర్ ఆఫీసర్లను నియోగించేటట్లు చూడ వలసియుంది. కొన్ని పరిశ్రమల్లో నుంచి స్త్రీలను తీసేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. వీరికి శాసనప్రకారం సమకూర్చ వలసిన సౌకర్యాలు ఎక్కువగా ఉంటున్నాయని! విద్యా సౌకర్యాలు అభివృద్ధి పొందుతున్న యీ రోజుల్లో స్త్రీలను హెచ్చుగా నియోగించడానికి బదులు, వారి సఖ్యతగ్గించడం చాలా శోచనీయం.

ఇండియాలో కార్మికుల సంక్షేమ కార్యక్రమావళి ఎత్తుకునే ముందు వారిస్థితిగతులు అవగాహన చేసుకోవాలి. ముఖ్యంగా తోటిసోదరులకంటె అమాయకత్వంలోను, అవోతంతులోను పూర్వాచారాల్లోను పడికొట్టుకొనే స్త్రీల విషయంలో వీటిని అర్థం చేసుకోవాలి. ఆధునిక పాశ్చాత్త్య పద్ధతులు ఇండియా కర్మాగారాల్లోను, కార్మికుల యిళ్ళల్లోను ప్రవేశ పెట్టాలంటే వాటిని కార్మికులు ఎంతవరకు అవగాహన చేసుకున్నారు అన్నదాన్నిబట్టి అవిజయప్రదమౌతాయి. ఒక శ్రేయోభిలాషియైన విమెన్ వెల్‌ఫేర్ ఆఫీసరు — స్త్రీ కార్మికులను టొమెటోపళ్ళు వండకుండా తినడం చాలా ఆరోగ్యం అని హెచ్చరించింది! వీటిని పైటచెరగుల్లో దాచి ఇంటికి పట్టుకుపోయి వండుకునే వారు చాలమంది! వండుకు తినడం కంటె టమేటోలు అలాగే తినడం చాల ఆరోగ్య కరమని మనవారికి ముందునచ్చితే తప్ప పూర్వాచార పరాయణులు బాగుపడ్డం ఎలాగ!

పురుషుల సంక్షేమ కార్యక్రమావళి కంటె స్త్రీల సంక్షేమ కృషి చాలకష్టం— ఏందుకంటె స్త్రీ ఒక విశిష్ట సాంఘికవ్యక్తి—భౌతికరీత్యాను, మానసికశాస్త్ర రీత్యాను ఆమె తత్వమే వేరు. ఒక సంక్షేమపత్రిక వ్రాసినట్లు "ఆమె పురుషునికంటె శారీరకంగా అబల, అందుచేత కాయకష్టం విస్తారంగా కావలసిన వృత్తులకు ఆమె సరిపడదు. సంతానాన్ని కనవలసిన విధికూడా వుంది ఆమెకు. అందుచేత కాన్పుకు ముందూ వెనుకా చాల విశ్రాంతి కావాలి. ఆమె ప్రేమను, ఆమెకృషినీ ఆశిస్తూ, ఆధారపడే ఎడబిడ్డల బాధ్యత ఒకటి వుంటుంది. ఆబిడ్డను గురించిన శ్రద్ధా వానికేమైనా అస్వస్థత వచ్చినప్పుడు మరీ ప్రత్యేక శ్రద్ధా, ఆమె కాలాన్ని చాలమట్టుకు తీసుకుంటాయి. ఆమె ఇంకా 'ఇంటావిడ'గా చేయవలసిన పనులున్నాయి— వంట, గృహ నిర్వహణ, భర్తకు సహధర్మచారిణిగా నిర్వర్తించవలసిన పనులు, బంధువులు, అతిథి- అభ్యాగతుల్ని ఆదరించే బాధ్యత ఆమె వహించ వలసివుంది. భర్తకుగాని, కుటుంబంలో మరొకరికి గాని రుగ్మత వస్తే, ఆమె ఇంటి వద్ద తప్పక ఆగి పోవలసివస్తుంది; ఆమే గదా కుటుంబానికి ప్రకృతి ప్రసాదించిన దాది (నర్స్)! పనిలో నుంచి



క్రీచీలో వంటశాల

తిరిగి వచ్చిన మగవాడు, తన సులక మంచంమీద ఒరిగి భోజనం కావాలన వచ్చు, కాని స్త్రీ పనిలోనుంచి రాగానే విశ్రాంతి అన్నదే లేక, వండాలి. కడగాలి, బిడ్డల్ని భర్తను సవరించాలి. ప్రకృతి ప్రసాదించిన యీబాధ్యతలను స్త్రీలే ఎక్కువ అవగాహన చేసుకోగలరు. అందుచేత స్త్రీలనే ఎక్కువగా లేబర్ వెల్ఫేర్ ఆఫీసర్లుగా నియోగించాలి. విమెన్ వెల్ఫేర్ ఆఫీసర్లు కావాలన్న ప్రణాళికలు శీఘ్రంగా అమలు జరగాలి.

మన కర్మాగారాల్లో ముఖ్యమైనలోటు యేమిటోమనకి తెలుసు. గంటల తరబడిని అదేపనిగా విసుగు కల్పించే పనియివ్వడం; ఎక్కువ గంటలు అల్లేనిలబడ్డం, దుమ్ము శబ్దం – విశ్రాంతిలేమి, విశ్రాంతి స్థానాల లోపం. వీటన్ని టినీకూడా సరిదిద్దవచ్చు - క్రమంగా సరిదిద్దుతున్నారు. కాని, వీటిని పూర్తిగా సరిదిద్దడానికి చాలాకాలం పడు తుంది. పనిచేస్తున్నప్పుడు విసుగు పుట్టకుండా, పాటలు వినిపించడం, అన్నది మనదేశంలో ఎవరూ ఆలోచిం చరు. ఇతర దేశాలన్నీ ఈ సంక్షేమ సూత్రాన్ని ఆచరిస్తున్నాయి.

ఫాక్టరీ కొంచెం చూడసొంపుగాచేయడం అన్న సమస్య మరొకటి. జపాన్‌లో స్త్రీలు పనిచేసే ప్రతీ వరుసకూ ఒక చేపల్నిపెంచే పెట్టెను వుంచుతారు. చూడ్డానికి ఏదోచక్కగా ఉంటుందని. మన పారిశ్రామిక సంస్థల్లో దుమ్మూ, కళ్ళూ తలా తిరిగించే వాతా వరణం, తప్ప మరేమీ ఉండదు! ఫేక్టరీలు పరి శుభ్రంగా ఉంచడం అన్నది కూడ కలలోని వార్తే, గ్లాసు కిటికీలుంటే గింటే – ధూళి దూసరాలై ఉంటాయి, గోడల కెక్కడ చూచినా తమల పాకుల ఉమ్ముల మరకలు, ఇక ఫాక్టరీల్లో నేల చూడబోతే ఏవంకజూచినా చెత్త చదారాలు! శబ్దానికా లోటు వుండదు. ఒకరి కొకరు మాట్లాడుకున్నది వినబడ కుండా ఉండేటంత శబ్దం! గంటలకొద్దీ అలా నిలువు కాళ్ళపై పడుగాపులు పడి నిలుచుండ వలసిందేగాని పనిచేసేవారు కొంచెం కూర్చుందామంటే వీలుండదు. ఫలితం స్త్రీల అంతరంగాల్లో బాధలు - శాశ్వతమైన నడుంనొప్పి బాధలు!

వృత్తివల్ల సంక్రమించే రోగాలు:– చాలమంది కార్మిక స్త్రీలు "మైనీ" అనే పొడుం (తాటాకులు, పుగాకు కలిసింది) తమ రొంటిని దాచి ఉంచుకోడం చూచాను. దీన్ని తరుచు ఇంతంత నోట్లో వేసుకుని నములుతారు. అది అప్పటికి కొంత హుషారు ఇస్తుందట. అది ఏలాగున్నా దంతాలు పూడడం – నోటికి దుర్గంధం మాత్రం తథ్యం. వృత్తులవల్ల సంక్రమించే రోగాల్ని ఏకరువు పెట్టడం ఇక్కడ సాధ్యంకాదు. కాని తరుచు ఫ్యాక్టరీలలో దుమ్ముధూసరితమైన గాలిపీల్చడం వల్ల అనేక శ్వాశకోశరోగాలు, గొంతుక రోగాలు వస్తాయి; కొన్ని రసాయనికాలు తాకడం వల్ల చర్మ రోగాలు వస్తాయి. నారమిల్లుల్లో నూనెవల్ల వచ్చే చర్మదద్దుర్లు. దక్షిణాన్ని చాలకాలం క్రితం ఒక గ్లాసుఫ్యాక్టరీ చూసేను. దాంట్లో 14 ఏళ్ళలోపు వయస్సు పిల్లలు గ్లాసు గ్లోబులూ, చిమ్నీలు చేయడానికి ఊదడం అదేపనిగా రోజూ గంటల



క్రీచీలో పిల్లలకు ఆహారం పంచుట

కొద్దీ చేసేవారు. వారి దవడలు పడిపోయివుంటాయని, పెదిమెలు పుండుపడి ఉంటాయని నేననుకుంటున్నాను. ఒక చోట కొందరు స్త్రీలు పనిచేస్తున్న ఒక గదిలోకి వెళ్ళేను - ఏవో కొన్ని పొగలవాసనలతో నిండిఉంది ఆ గది — ఒకక్షణంలో ఊపిరాడకుండా కొట్టుకుపోయేను నేను. అక్కడ గంటలకొద్దీ స్త్రీలు ఎలా పనిచేస్తున్నారో దైవానికే ఎరుక! ఇలాంటి సమస్యలు దండిగా ఉన్నాయి - ప్రభుత్వంవారు, యజమానులు, ట్రేడ్ యూనియన్లు, వాలంటీర్లు, లేబరు ఆఫీసర్లు పరిష్కరించవలసినవి. ఇంకా పారిశ్రామిక ప్రభుత్వశాఖల పని చెప్పనేలేదు.

కొంచం శ్రద్ధవహించి చేసే వెల్‌ఫేర్ పద్ధతులవల్ల, పారిశ్రామికుల్ని కొంచం చాకచక్యంతో కనిపెట్టడంవల్ల అపాయాలు జరక్కుండా ఆపడానికి వీలుంది. ఒక్క ఉదాహరణ చెపుతా: ఉత్తర హిందూస్థానంలోని స్త్రీలు ముంజేతుల నిండా బరువైన అలంకారాలుధరిస్తారు. నారను మెత్తగా చేయడానికి మిల్లులో పెట్టేటప్పుడు ఆమె చెయ్యికూడ నారతోబాటు యంత్రంలోకి పోయింది. ముంజేతి గాజులు దాంట్లో చిక్కుకోవడంవల్ల దాన్ని చప్పునలాక్కొందుకు వీలులేదు — ఇలాంటి అపాయాలు ఆ మిషీన్లనునడిపేవారిని తరుచు శ్రద్ధగా పరీక్షించడం వల్లనూ, ఆ స్త్రీలను అలాంటి అనవసరం, బరువుచేటు నైన అలంకారాలు ధరించవద్దనడం వల్లనూ తగ్గించొచ్చు. ఈ రెండోపని చేయాలంటే మాత్రం ఆ కార్మిక స్త్రీల వంశపారంపర్యా సంక్రమించే అలవాట్లు, ఆచారాల్ని అర్థం చేసుకోవాలిసుమండీ! అంతేగాని హిందూస్థానీ స్త్రీలు ముంజేతి అలంకారాలు ధరించరాదని వట్టినే ఉత్తరువు జారీచేసేమంటే - వెంటనే తిరుగుబాట్లు సిద్ధం! ఇలాంటివి నెమ్మదిగా బోధపరచాలి; ప్రశాంతంగా, వాటి అనర్థాలు విశదీకరించి నచ్చజెప్పాలి. ఇలాంటివాటిల్లోనే విమెన్ వెల్‌ఫేర్ ఆఫీసర్లు, యజమానులు యొక్క చాకచక్యం తెల్లమౌతుంది. యదార్థానికి పెర్సొనెల్ ఆఫీసర్లకు కావలసిన ముఖ్యలక్షణం ఏమిటంటే చాకచక్యమూ, కార్మికులపై ప్రేమాను.

వారిజీవిత పరిస్థితులుకూడ తరుచు పరికిస్తూ బాగు చేస్తుండాలి. లేబరు ఆఫీసర్లకు కార్మిక సేవాభిలాష వున్నప్పుడే యివి సాధ్యమౌతాయి. నేనేదో గొప్పదాన్ని, మిమ్మల్ని ఉద్ధరిస్తాను అన్నవి కార్మికుల విశ్వాసాన్ని కూరగొనలేవు. ఆకూలీలైన్లలోను, నారమిల్లుల్లోను కార్మిక స్త్రీలతో కలిసి టీత్రాగుతూ (పిచ్చా-పాటీ) కబుర్లు వేయడంకంటె నాకు ఆనందదాయకమైన పనిలేదు. కార్మిక స్త్రీల సహవాసం సంపాదించాలంటే ప్రయాసపడాలి. ఓపిగ్గా చాలకాలం గడపాలి. కాని వీటివల్ల అమోఘమైన ఫలితం సాధించవచ్చు.

ప్రసూతి సౌకర్యాలు సరిగా యిస్తున్నారా లేదా? క్రేచీలు, క్లినిక్కులు చక్కగా పని చేస్తున్నాయా? అని చూస్తూ తరుచు ఆరోగ్య పరీక్షలు గావించాలి. అంటు రోగాలు వస్తే చప్పున నిరోధక చర్యలు తీసుకోవాలి. హోటళ్ళలో చవగ్గా ఆరోగ్య కరమైన ఆహారం పెడుతున్నారో లేదో గమనించాలి. సహకార సంస్థలూ, డబ్బు సర్దే బ్యాంకులూ ఏర్పాటు చేస్తే, డబ్బు వడ్డీలకిచ్చే వారి చేతుల్లో కార్మికులు చిక్కుకోరు. ఇలా శ్రద్ధ తీసుకోవలసినవి లెక్కలేనన్ని పనులున్నాయి - కార్మిక సంక్షేమోద్యోగినులు (వెల్‌ఫేర్ ఆఫీసర్లు) సాధించవలసినవి.

వెల్‌ఫేర్ సెంటర్లు, క్లబ్బులూ పెడితే స్త్రీలు బాగుపడరనుకోవడం తప్పభిప్రాయం. కార్మిక స్త్రీలకై ప్రత్యేకించిన క్లబ్బులకు వెళ్ళి రేడియో వినడం, ఆటలు ఆడడం, క్రొత్త వంటలు నేర్చుకోవడం, కుట్టడం, చదవడం అంటే వారికి ఎక్కువ సరదా. ప్రథమంలోవుండే సిగ్గు, క్రమంగా తగ్గినకొద్దీ వారికి చలోక్తి కావలసినంత ఉంటుంది. వారు కొంచం కూర్చుని, నవ్వుకొని, మాట్లాడుకొనే అవకాశాలిచ్చే స్నేహపూరితమైన సౌకర్యాలు కల్పిస్తే వారు తప్పక వాటిని సద్వినియోగ పర్చుకుంటారు. వాక్తృత్వ పోటీలన్నా, మీటింగులన్నా, సినీమా ఆటలు చూడ్డమన్నా వారికి చాల సరదా. ఇట్టి అవకాశాలు కార్మిక స్త్రీలకు కల్పిస్తే సంఘ సంక్షేమ కార్యక్రమంలో ముందడుగు వేసామన్నమాటే.

లేబర్ వెల్‌ఫేర్ కృషిలో ఐహికంతోబాటు ఆముష్మికం విలువ ఇమిడి వుంది. కష్టపడి పనిచేసే కార్మికుల్ని ప్రేమించడం అన్నది ముఖ్యం, ఎంత సాంకేతిక విజ్ఞానం ఉన్నా, మానవునిలోని "మానవత్వం" ఉంటేనే అన్నీ రాణిస్తాయి.

"నేను దేవతవలె మాట్లాడవచ్చు. ఎల్లా మాట్లాడమంటే అల్లాగే మాట్లాడుతుంది నాలిక. కాని ఆ మాటలలో ప్రేమ లోపిస్తే అది వట్టి కంచుమ్రోతే సుమా" అని సెయింట్ పాల్‌గారన్నట్లు కార్మిక సంక్షేమ కార్యక్రమానికి గీటురాయి చెమటూడ్చి పొట్ట పోషించుకునే కార్మికుడంటే గౌరవము, ఆదరణ, ప్రేమ.

"స్వచ్ఛంద సేవ ఆంధ్ర ప్రజల రక్తంలోనే ఒదిగి ఉన్నది"

# ఆంధ్రరాష్ట్ర సంఘ సంక్షేమ సలహా సంస్థ సమావేశం, కర్నూలు.

## అధ్యక్షురాలు శ్రీమతి చన్నఘంటమ్మగారి ఆహ్వానోపన్యాసము

గౌరవనీయులైన ముఖ్యమంత్రీ, మంత్రివర్గ సభ్యులారా, ప్రధాన కార్యదర్శీ, రాష్ట్రసంక్షేమ సంస్థ సభ్యులారా,

ఆంధ్ర రాష్ట్ర సంఘ సంక్షేమ సలహా సంస్థ తరఫున మీకందరకు ఈసమయాన హృదయపూర్వక స్వాగతం ఇవ్వగలుగుతున్నందుకు నేను చాల గర్విస్తున్నాను. ఈ సంస్థ స్థాపింపబడిన తర్వాత, ఆంధ్ర రాజధానిలో జరుపుకుంటున్న ప్రథమ సమావేశ కార్యకలాపాలకు ప్రారంభోత్సవం చెయ్యటానికి, వాటిని ఆశీర్వదించటానికి శ్రీ ముఖ్యమంత్రి అంగీకరించటం మహద్భాగ్యం. రాష్ట్ర సంస్థలోని నా సహసభ్యులందరూ ఈ విషయాన్ని తప్పక అంగీకరిస్తారు. మీవంటి ప్రముఖ వ్యక్తులందరూ ఈ సమావేశంలో పాల్గొనటం మా అదృష్టమే. ఇతరమైన బాధ్యతలు మీమీద ఎన్ని ఉన్నా, ముఖ్య కార్యక్రమాలు ఎన్ని ఉన్నా, సంక్షేమ కార్యక్రమాల పట్ల మీకున్న అభిమానాన్ని, ముఖ్యంగా శైశవదశలో ఉన్న ఈ సంస్థ కార్యక్రమంపట్ల మీకున్న ఆదరాన్ని పురస్కరించుకొని మీ అమూల్యమైన కాలమును కొంత ఇక్కడ వినియోగిస్తున్నారు. మీరు చూపుతున్న ఈ వాత్సల్యానికి, గౌరవానికి నేను కృతజ్ఞురాలను.

కేంద్ర సంఘ సంక్షేమ సంస్థ 1953 ఆగస్టులో నెలకొల్పబడి శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్‌గారి అధ్యక్షతను నిర్వహింపబడుతున్నది. ప్రజలను ఉత్తేజపరచి, వారి ఉత్సాహంవల్లను, సౌహార్ద్రంతోను, స్వచ్ఛందసహకారంతోను సంఘసంక్షేమాన్ని జాతీయ విస్తృతంగా నెలకొల్పటమే ఈ సంస్థ ముఖ్యోద్దేశము. ప్రజలకు అవసరమైన సూచనలను, ఆర్థిక సహాయాన్ని ఒక నిర్ణీత సూత్రంప్రకారం అందజేస్తూ, ప్రభుత్వం, వారి సేవా కార్యక్రమాలను గుర్తించి వారికి తమ సహకారాన్ని అందజెయ్యటానికి పూనుకున్నదనే విషయాన్ని వారు గుర్తించి తమ కార్యక్రమమును నూతనోత్సాహంతోను, సులభంగాను నెరవేర్చగలిగేటందుకు పైసంస్థ తోడ్పడుతుంది. మొదటి పంచవర్ష ప్రణాళికలో ఈ కార్యక్రమం నిమిత్తమై నాలుగుకోట్ల రూపాయలు కేటాయించబడినవి. స్త్రీ సంక్షేమం, పిల్లల సంక్షేమం, నిరాశ్రయుల సంక్షేమం, వికలాంగుల సంక్షేమం. బాల్యనేరస్థుల సంస్కరణ నిర్వర్తిస్తున్న స్వచ్ఛంద సంస్థలలో ఈ కార్యక్రమాన్ని వ్యాపింపజెయ్యాలని కేంద్రసంస్థ నిర్ణయించింది.

కేంద్ర సంస్థ నియమించిన పరిశీలనా సంఘాలు వివిధ రాష్ట్రములలో సంక్షేమ కార్యక్రమం కొనసాగిస్తున్న ఎనిమిది వందల స్వచ్ఛంద సంస్థలకు పైగా పరిశీలించి, వారి నివేదికలను, సహాయముచెయ్యవలసిన సంస్థలను గురించిన సిఫార్సులను కేంద్ర సంస్థకు అందజేశారు. ప్రచురించబడిన జాబితాల ప్రకారం, మన రాష్ట్రంలో, చిరకాలమై స్థాపింపబడినవి ఐతేనేమి, క్రొత్తసంస్థలైతేనేమి మొత్తం 66 సంస్థలు రు 2,24,000 ల ఆర్థిక సహాయాన్ని పొందినవి. జూలై నెలలో కేంద్ర సంస్థ మరి22 సంస్థలకు ఇంచుమించు రు1½ లక్షల సహాయాన్ని అందజేసినది. ఈ ధనము రెండు దఫాలుగా అందజేయబడుతుంది. కొన్ని సంస్థలు పూర్తి సహాయాన్ని రెండు దఫాలలోనూ పొందినవి. మరికొన్ని మొదటి దఫా సహాయాన్ని పొంది, మిగిలిన ధనం కోసమై దరఖాస్తు పెట్టినవి. ఈ ధన సహాయము "మేచింగ్" పద్ధతిపై, మొత్తం ఖర్చులో నూటికి 50 వంతులు, సంక్షేమ కార్యక్రమములను విస్తృతం చెయ్యటంలో అవసరమైన సామగ్రి, పరికరాలు కొనుటకై వెచ్చించిన ధనంలో సగభాగం, సాధారణంగా మొత్తం రు 10,000 లు మించకుండను, ప్రత్యేక సందర్భంలో రు 15,000 లు మించకుండను, కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ భరిస్తుంది.

వివిధ రాష్ట్రములనుండి వేలాది దరఖాస్తులు రావటం ప్రారంభించినవి. దీనితో కేంద్ర సంస్థ దీని నంతను నిర్వహించుట అసాధ్యమైపోయింది. సంఘ సంక్షేమ కార్యక్రమంలో పాల్గొంటున్న ఏ సంస్థ సహాయాన్ని పోగొట్టుకోవటానికి వీలు లేకుండగను, ఈయబడిన ధనం నిర్ణీత కార్యక్రమానికే ఖర్చు చేయబడునట్లు చూచుటకు, ధన సహాయాన్ని పొందిన సంస్థలు కోరిన పద్ధతులలోఅభివృద్ధి చెందునటుల చూచుటకుగాను ప్రతి రాష్ట్రంలోను 'రాష్ట్రసలహా సంస్థ' లను నెలకొల్పుట అవసరమైనది.

కేంద్ర సంస్థయొక్క ఈ సూచనను ప్రథమంగా ఆంధ్ర ప్రభుత్వమే అంగీకరించింది. రాష్ట్ర సంస్థను దేశం మొత్తంమీద ప్రథమంగా ప్రకటించటమే కాకుండ సంస్థ

స్థాపనకు, రాష్ట్రంలో సంస్థ ఆధ్వర్యాన సంక్షేమ కార్యక్రమాలను నిర్వర్తించుటకు, అవసరమైన ఆర్థిక సహాయం విషయమై నిశ్చయమైన సూచనలు ఆంధ్ర ప్రభుత్వమే ప్రథమంగా చేసింది. ఇది మన మందరం గర్వించ వలసిన విషయం.

మా మీద మీరు ఉంచిన నమ్మకానికి, ఈ గురుతర బాధ్యతగల స్థానాలకు మమ్ములను నియమించినందుకు రాష్ట్ర సలహా సంస్థ సభ్యులందరము మీకు కృతజ్ఞులము. ఈరంగంలో మేము నిర్వహించవలసిన విధుల విషయంలో మేము పూర్తిగా మెళకువతో ఉన్నామనీ, వాటిని నిర్వర్తించుటకు ఎంత శ్రమనైనా ఓర్చుటకు సంసిద్ధులమే వనీ మీకు హామీ ఇస్తున్నాము.

రాష్ట్ర సంఘ సంక్షేమ సలహాసంస్థ, ఇతర కార్యక్రమాలతోబాటు, రెండు నిర్ణీత ప్రముఖ కార్యక్రమాలకు పూనుకుంటుంది.

1. వివిధ జిల్లాలలో సంక్షేమ విస్తరణ ప్రణాళికలను నిర్వహించుట.

2. కేంద్ర సంఘ సంక్షేమ సంస్థనుండి ఆర్థిక సహాయము కోరిన స్వచ్ఛంద సంస్థల దరఖాస్తులను పరిశీలించి, కేంద్ర సంస్థకు శిఫార్సు చేయుట. ఆర్థిక సహాయం పొందు సంస్థలను అప్పుడప్పుడు పరిశీలించి, ఆ సంస్థలు తమ కార్యక్రమమును విస్తృత పరచుటకుగాను కార్యకర్తలకు అవసరమయే సలహాలనిస్తూ, ధనమును సరిగా వినియోగించునట్లు చేయుట.

ఐతే, ఇంతవరకు మేము ఏమిటి చెయ్యగలిగాము?

జూలై నెలలో ఈ సంస్థ నెలకొల్పబడిననాటినుండి, సంక్షేమ విస్తరణ ప్రణాళికలను ఆంధ్రదేశంలోని ప్రతి జిల్లాలోనూ ఆగస్టు 15 వ తేదీన ప్రారంభించవలెనని మేము చాల తొందరపడ్డాము— ఆగస్టు 15 భారత స్వాతంత్ర్యదినము, కేంద్ర సంఘ సంక్షేమ సంస్థయొక్క మొదటి వార్షికోత్సవ దినముకూడ గనుక ఈ ఉత్సాహము, శ్రద్ధ.

గత సంవత్సరం కేంద్ర సంస్థనుండి సహాయం పొందిన సంస్థలలో ఇంచు మించు అన్ని నగరాలలోను, పట్టణాలలోను, ఇతర నాగరిక ప్రాంతాలలోను నెలకొల్పబడినవి. మన జనాభాలో ముఖ్య భాగం గ్రామసీమలలో ఉన్నారు. ఈ సహాయ కార్యక్రమంవల్ల వారికి ఏవిధమైన ఉపయోగం జరగలేదు. అందువలన కేంద్రసంఘ సంక్షేమ సంస్థ సంక్షేమ కార్యక్రమం పల్లెలలోనికి బాగా వ్యాపించుటకుగాను, చిన్న చిన్న పల్లెలలోను, అభివృద్ధి చెందని బీద గ్రామములలోను ఈ సహాయం లభించుటకుగాను, సంక్షేమ విస్తరణ ప్రణాళికలను తలపెట్టింది. దేశం మొత్తంమీద 300 విస్తరణ ప్రణాళికలు స్థాపించుటకు ఉద్దేశింపబడింది. ఆంధ్ర దేశం 'ఎ' తరగతి రాష్ట్రం కావటంవల్ల, 17 ప్రణాళికలు కేటాయించబడినవి. ప్రతి జిల్లాకు మొదట ఒక్కొక్క ప్రణాళిక ఈయబడుతుంది. మిగిలిన ప్రణాళికలు "బహుమతి ప్రణాళికలు." అత్యంత అభివృద్ధి చూపించిన జిల్లాలకు ఇవి ఈయబడుతవి. ఆంధ్ర దేశంలో ప్రస్తుతం 12 ప్రణాళికలు మేము ప్రారంభించాము. ఆంధ్ర మహిళాసభ, మద్రాసులోని ఇతర ఆంధ్ర సంస్థలు ఈ విస్తరణ కార్యక్రమాలలో అత్యంతోత్సాహం చూపుటవల్ల మద్రాసు నగరానికి అత్యంత చేరువలోనున్న సూళ్లూరుపేట తాలూకాలో వారి ఆధ్వర్యాన ఒక ప్రణాళిక నిర్వహించబడుతోంది.

ఆర్థికదృష్ట్యా, ఒక ప్రణాళికకు రెండు సంవత్సరాలకు రమారమి రు 50,000 లు అంచనావేయబడినదని మీకందరకు తెలుసును. ఈ వ్యయంలో, కేంద్ర సంస్థ 100 కి 50 వంతులు, రాష్ట్ర ప్రభుత్వం నూటికి 25 వంతులు భరిస్తుంది. మిగిలిన 25 వంతులు ఆయా ప్రాంతాలలో ప్రజలనుండి వసూలు చేయబడుతుంది. అది వారి పూచీగా భావింపబడుతుంది. ఇదికాక, కేంద్ర సంస్థ ప్రతి ప్రణాళికకు తన పూర్తి ఖర్చుతో ప్రయాణ సౌకర్యానికి అవసరమయే కారును ఇవ్వగలదు.

20 లేక 30 గ్రామములు కలిగిన ఏక ప్రాంతంలో ఈ ప్రణాళికను అమలు జరుపవచ్చును. లేదా రెండు ప్రత్యేకమైన ఏక ప్రాంత భాగాలలోకూడ ఈ ప్రణాళికను నిర్వహింపవచ్చును. ఈ ప్రాంతంలో 7 సంక్షేమ కేంద్రాలను ప్రారంభించి వేతనాలపై నియమింపబడిన కార్యకర్తలతో వాటిని నిర్వహిస్తారు. ఈ కేంద్రాలు, ప్రసూతి కేంద్రం, పిల్లల సంక్షేమ వైద్యశాల, వికలాంగులకు, అశక్తులకు, గృహపరిశ్రమల శిక్షణ కేంద్రం, శ్రామిక స్త్రీలయొక్క పిల్లలకై విశ్రాంతి గృహము, బాల్యనేరస్థుల సంస్కరణాలయం, మొదలైన రూపాలలో ఆయా ప్రాంతపు అవసరాల ప్రకారం ఏర్పాటుచేయబడుతవి.

# కర్నూలు సమావేశం

ప్రతి ప్రణాళికను జిల్లా ప్రణాళికా నిర్వహణ సంఘం నిర్వహిస్తుంది. దీనిలో 11 గురు సభ్యులు ఉంటారు. వీరిలో 9 మంది అనధికార సభ్యులు. వీరిలో ఒకరు కన్వీనరుగా ఉంటారు. జిల్లా ప్లానింగు ఆఫీసరు, అసిస్టెంటు మహిళా ఆఫీసరు కూడా సభ్యులుగా ఉంటారు. జిల్లాలోని వివిధ సంఘసేవా సంస్థలలో ఉత్సాహంతో స్వచ్ఛంద సేవచేసేవారిని, సంస్థ నిర్వహణ విధానం తెలిసిన వారిని అనధికార సభ్యులుగా ఎంచుకుంటారు.



పశ్చిమగోదావరి జిల్లా రాయలం గ్రామంలో శ్రీమతి చెన్నఘంటమ్మగారు ప్రసూతి శిశు సంరక్షణ కేంద్రం ప్రారంభోత్సవం చేసిన దృశ్యం.

శ్రీకాకుళం :— శ్రీమతి పొన్నమ్మా కరియప్ప.
విశాఖపట్టణం :— ,, దిగుమర్తి జానకీబాయి.
తూర్పుగోదావరి:— శ్రీ ముత్తంగి అయ్యన్న.
పశ్చిమగోదావరి:— శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ.
కృష్ణా :— ,, అయేషా అబ్దుల్ దిర్.
గుంటూరు :— ,, కొండా పార్వతీదేవి.
నెల్లూరు :— డాక్టర్ ఎస్. లక్ష్మి.
చిత్తూరు :— శ్రీమతి రత్నాబాయి శ్రీనివాసరావు.
అనంతపురం :— ,, వెంకటస్వామినాయుడు.
కడప :— ,, సరళారెడ్డి.
కర్నూలు :— ,, బి. నటరాజన్.

ఇతర సభ్యులందరు సమాన ప్రతిభ గలవారే.

ఆగస్టు 15 వ తేదీకి పూర్వమే రాష్ట్రసంస్థ సభ్యులు పదకొండు తెలుగు జిల్లాలలోను పరిశీలనలు సాగించారు. జిల్లా సంస్థలు కేంద్రములు నిర్ణయించుటకు సహాయం చేశారు. ఆయాజిల్లాలలోని కలెక్టర్లు సంపూర్ణ సహకారాన్ని అందజేశారు. అందువలన ఆ దినమున అనుకున్న ప్రణాళికలన్నీ ప్రారంభింపగలిగాము.

**శ్రీకాకుళం జిల్లా**

అంపోలు — మాతాశిశు సంరక్షణ కేంద్రం.
పాత్రునివలస ,,

**విశాఖజిల్లా**

బాలచెరువు - మాతా శిశు సంరక్షణ కేంద్రం.

**తూర్పుగోదావరి జిల్లా**

1. రాజానగరం (అశక్తులకు, వికలాంగులకు పనికేంద్రం.)
2. బూరుగుపూడి- మాతాశిశు సంరక్షణ కేంద్రం.

**పశ్చిమగోదావరి జిల్లా**

1. కాళ్ళకూరు - కొప్పర్రు ప్రసూతి కేంద్రం.
2. రాయలం- ,,

**కృష్ణాజిల్లా**

నున్న - ప్రసూతి కేంద్రం
పోరంకి - ,,
పెనమలూరు- ,,

**గుంటూరు జిల్లా**

మోర్జంపాడు — ప్రసూతి కేంద్రం
తొండపి — ,,

**నెల్లూరు జిల్లా**

సంగం ప్రసూతి కేంద్రం
కోనిమెర్ల ,,
పర్రిపాడు ,,
సిద్ధిరెడ్డిపాలెం శిశు సంక్షేమ కేంద్రం

**చిత్తూరు జిల్లా**

నాంపల్లి ప్రసూతి కేంద్రం.

యాదమర్రి - ప్రసూతి కేంద్రం, పిల్లల విశ్రాంతి కేంద్రం.

కావేరి రాజపురం - పిల్లల విశ్రాంతి కేంద్రం, లైబ్రరీ. స్త్రీల పని కేంద్రం.

**కడప జిల్లా**

వల్లూరు — ప్రసూతి కేంద్రం.

కొప్పర్తి ,,

**కర్నూలు జిలా**

బ్రాహ్మణ కొట్టూరు — ప్రసూతి కేంద్రం.

పర్ల — ,,

**అనంతపురం జిల్లా**

మార్తూరు — ప్రసూతి కేంద్రం, పిల్లల విశ్రాంతి కేంద్రం.

గుగుడు — ,,

**ఆంధ్ర మహిళాసభ**

మాంబట్టు :— ప్రసూతి, పిల్లల విశ్రాంతి కేంద్రం,

చేనిగుంట — ,,

జిల్లా నిర్వహణ సంఘములు చూపిస్తున్న ఉత్సాహం అపరిమితం. ఏ విధమైన బాటలూ లేని గ్రామ ప్రాంతాలలో వీరు సంచరించారు. అరణ్యాలను అధిగమించారు. ఏవిధమైన మార్గాలూ లేని ప్రదేశాలలో మైళ్ళకొద్దీ సంచరించారు. ఈ విధంగా స్వచ్ఛమైన మిషనరీలవలె వీరు సంక్షేమ జ్యోతిని దేవుడు మాని ప్రదేశాలలోనికి కూడ తీసుకుపోతున్నారు.

ఇక గ్రామీణుల ఉత్సాహం, ఈ కార్యక్రమాలపట్ల చూపిస్తున్న ఆసక్తి అత్యద్భుతం, అనూహ్యం అని చెప్పాలి. ఆంధ్ర గ్రామాలలో ఆరోగ్య కేంద్రాలు, ప్రసూతి కేంద్రాలు ముఖ్యావసరాలు. మన ప్రాంతాలలో స్త్రీలు ఈ కేంద్రాలు లేక చాలా అవస్థ పడవలసి వస్తున్నది. ప్రతి చోట ప్రసూతి కేంద్రం కోసమై ప్రజలు కలవరిస్తున్నారు. అనాథ శరణాలయాలు, పిల్లల విశ్రాంతి శాలలు, ఆనాథ గృహాలు మున్నగునవి కూడ అత్యధికముగా ఏర్పాటు కావలెనన్నమాట నిజమేకాని, ప్రసూతి కేంద్రాల ఆవశ్యకత అత్యధికం. ఇంచుమించు అన్ని జిల్లాప్రణాళికలలోను ప్రసూతి కేంద్రములు నెలకొల్పబడినవి.

ఇక మా రెండవ కర్తవ్యం విషయం. ప్రణాళికా ప్రారంభోత్సవాలు జరిగిన తర్వాత, ఈ మధ్యనే దేశంలోని స్వచ్ఛంద సంస్థలను పరిశీలించుట ప్రారంభించాము. కొంతమంది మా సంస్థ సభ్యులు, నేను ఇంత వరకు ఇంచుమించు 35 సంస్థలు పరిశీలించాము. ఇందులో 75 వంతులు కేంద్ర సంస్థనుండి సహాయం పొందినవే. మిగిలినవి క్రొత్తగా ధన సహాయాన్ని అర్థించిన సంస్థలు. ఈ సమావేశంలో 40 సంస్థలనుండి సహాయంకోరుతూ వచ్చిన దరఖాస్తులను పరిశీలించుటకు నిశ్చయించాము.

ఆంధ్ర దేశంలో నేను ఈ మూడు నెలలు పర్యటించి గ్రహించిన విశేషం ఏమిటంటే, స్వచ్ఛందసేవ అన్నది ఆంధ్ర ప్రజల రక్తంలోనే ఒదిగివున్నది. భారత దేశంలోని మరే ప్రాంతంలోను అనాథ శరణాలయాలు, వితంతు శరణాలయాలు మొదలైనవి తలబెట్టని క్రితమే ఆంధ్ర దేశంలో ఇటువంటి సంక్షేమ కేంద్రాలు ఎంతో దిగ్విజయంగా, బహుజన ఉపయుక్తంగా నిర్వహింపబడుతున్నవి. స్త్రీ విద్య, స్త్రీ స్వాతంత్ర్యము, అస్పృశ్యతా నివారణ మొదలైనవన్నీ ఆంధ్ర దేశంలో ఎన్నాళ్ళనుంచో వేళ్ళు పాతుకున్నవి,

అనేక కారణములవలన గడచిన కొద్ది సంవత్సరాలలో ఆంధ్ర దేశంలో అంతఃపురోగతి కనుపించక పోయినా, మనం మన ఆశయాలలోని నిజాయితీని, మన కార్యక్రమాలలో ఆసక్తిని ప్రజలకు చూపించి నమ్మకం కలుగునట్లు చేసి, ప్రజలలో నిద్రాణమై ఉన్న వితరణ, స్వచ్ఛందసేవా గుణాలను తిరిగి పెంపొందింపవచ్చును. ఈ మహత్తర ఆశయాన్ని సాధించుటకుగాను రాష్ట్ర సంక్షేమ సంస్థ మీ సహకారాన్ని, ఆశీర్వచనలను కోరుతున్నాము. ప్రజల సహకారాన్ని సమీకరించి, నిర్మాణయుక్తమైన కార్యక్రమాలపై ప్రజల దృష్టి మరల్చి, ఈ విధంగా ప్రజల గృహములలో సంక్షేమం వ్యాపింప చెయ్యవలెనని ఆశిస్తున్నాము.



"గాంధీజీ సూచించిన నిర్మాణ కార్యక్రమమే సంఘ సంక్షేమానికి ప్రాతిపదిక"

# ప్రధానమంత్రి శ్రీ ప్రకాశం పంతులుగారి ప్రారంభోపన్యాస భాగములు.

సంఘ సంక్షేమ సంస్థ కార్యక్రమం, చిరకాలం క్రితమే గాంధీజీ ఊహించిన నిర్మాణ కార్యక్రమానికి అనుగుణంగా ఉన్నది. మహాత్మా గాంధీ ఆశయాలకు, నిర్మాణ కార్యక్రమానికి ప్రజానీకం తగిన ప్రాముఖ్యతను ఇస్తున్నందుకు నేను చాలా ఆనందిస్తున్నాను. పాశ్చాత్య దేశాలు కూడ గాంధీజీ నిర్మాణ సూత్రాలను వివిధములైన పేర్లతో అనుసరిస్తున్నారు. మన దేశ ప్రజలు కూడ ఆ సూత్రాలనే మన దేశ ప్రజల ఆచరణ నిమిత్తం వేర్వేరు పేర్లతో అనుసరిస్తున్నారు. రాష్ట్ర సంక్షేమ సంస్థ చేస్తున్న ఉత్కృష్ట సేవకు నేను ఆనందిస్తున్నాను

డాక్టర్ నటరాజన్‌తో కలిసి ఆంధ్ర దేశం పర్యటించి సంఘ సంక్షేమం నిమిత్తమై మన ప్రాంతాలలో జరుగుతున్న కృషిని నేను స్వయంగా దర్శించాను. కర్నూలు జిల్లా బ్రాహ్మణ కొట్కూరు గ్రామంలో ఒక ప్రణాళికకు ప్రారంభోత్సవం చేశాను కాని అప్పుడు శరీరంలో అస్వస్థతగా ఉండుటవల్ల దాని విషయమై అంత శ్రద్ధ పట్టించుకోలేకపోయాను. ఈ సంఘ సంక్షేమ కార్యక్రమములు అంటే నాకు అమితమైన ప్రీతి. నా చిన్న తనంలో ఇటువంటి కార్యక్రమాలలోనే పాల్గొనే వాడిని. గాంధీజీ నాయకత్వం క్రింద ఇటువంటి కార్యక్రమాలనే నేను, నా మిత్రులు అమలు జరిపేవాళ్ళం. అందువలన ఈ సంస్థ సమావేశ ప్రారంభోత్సవం చెయ్యటానికి నేను చాలా ఆనందిస్తున్నాను.

ఈ కార్యక్రమ నిర్వహణకు ఆంధ్ర దేశంలో శ్రీమతి ఎ. సి. కృష్ణారావు, శ్రీమతి జమునాబాయి తగిన వారని ఆంధ్ర ప్రభుత్వం నిర్ణయించింది. వీరిద్దరు ఈ కార్యరంగంలో అనుభవశాలురు. ఆంధ్ర మహిళాసభతో చిరకాలం సన్నిహిత సంబంధం కలిగి ఉండటమే కాకుండా అనేకములైన ఇతర సంస్థలలో పనిచేసిన కార్యశూరులు. మేము వారికి నిర్ణయించిన కార్యక్రమమును జయప్రదముగా నిర్వహించగలుగుతారనే మా విశ్వాసానికి ఏమి సందేహం లేదు.

కొంతకాలం క్రితం శ్రీ జవహర్‌లాల్ నెహ్రూకి లేఖ వ్రాస్తూ, గాంధీజీని అందరు ప్రజలు మరచిపోయారని వ్రాశాను. ఐతే గాంధీజీ సూత్రాలను వివిధములైన పేర్ల క్రింద ఈ నూతన పరిస్థితులకు అనుగుణంగా ఆచరణలో పెడుతున్నందుకు నెహ్రూను అభినందించాను. గాంధీజీకి మరణం లేనేలేదు. ఆ వ్యక్తి చనిపోవటానికి జన్మించిన వ్యక్తి కాదు. ఆయన జీవితమంతా ప్రపంచ సౌభాగ్యం కోసమే ధారపోశారు.

నిర్మాణ కార్యక్రమంలో స్త్రీలు నిర్వహించ వలసిన పాత్ర అత్యంత ప్రశంసనీయమైనది. ఈ కార్యక్రమాన్ని జయప్రదం చెయ్యవలెనంటే స్త్రీలే పూనుకోవాలి. వివిధ గ్రామాలలో ఉంటూ ఈ ఉద్యమంలో పనిచేస్తున్న స్త్రీలందరూ వారి సేవా కార్యక్రమాలను నాకు తెలియ జేస్తారని ఆశిస్తాను. సత్ ప్రారంభం జరిగింది. కొలది సంవత్సరాలలో, అంతా సవ్యంగా వెళ్ళిపోతే ఆంధ్ర రాష్ట్రం సమస్త ఐశ్వర్యాలతోను తులతూగుతుంది.

శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ అన్ని తరగతుల ప్రజలను సమీకరించి, ఈ విధమైన కార్యక్రమములను అనేకం జయప్రదంగా నిర్వహించిన "**దేశ సేవకురాలు**". ఇటువంటి కష్టతమమైన కార్యక్రమ సత్వర నిర్వహణకు నెహ్రూ శ్రీమతి దుర్గాబాయి మీదను, ఆమె సహచరుల మీదను ఈ భారం ఉంచాడు. గ్రామ సీమల్లో జరుగవలసిన ఈ కార్యక్రమానికి స్త్రీలే సమర్థులు. ఈ ఉద్యమాన్ని ఒక క్రమ పద్ధతిలో నిర్వహించలేనిచో విజయం సాధించలేము. జాతీయ ప్రణాళికా ఋణం విషయంలో ఆంధ్ర దేశం ముందు చాలా వెనుకబడి వుండేది. ఒక క్రమ పద్ధతి ప్రకారం ఆ కార్యక్రమానికి పూనుకునేసరికి 5 కోట్ల రూపాయలను ఆంధ్ర ప్రభుత్వం వసూలు చెయ్యగలిగింది.

ఈ కమ్యూనిస్టు "కుర్రవాళ్ళు" వాళ్ళ నాయకులు వ్రాసినది. చెప్పినది అర్థం చేసుకోలేకపోయినట్లే, గాంధీజీ సూత్రాలను, ఆచరణ విధానాలను ప్రజలు అర్థం చేసుకోలేకపోతున్నారు. గాంధీజీ తత్వాన్ని ప్రజలు బాగా అర్థం చేసుకోవటం చాలా అవసరం. ఆయన ఆదర్శాలను అవగాహన చేసుకుని, ఆయన నిర్ణయించు కార్యక్రమాలను సరిగా అమలు జరిపి, నిర్మాణ సూత్రాలను ఉత్సాహంతోను, పట్టుదలతోను, క్రమపద్ధతితోను అనుసరించవలసిన అవసరం, బాధ్యత మన అందరిపైనా ఉన్నది.



# తేనెటీగల్ని పెంచడం

తేనె:— ఆది కాలంనుండీ తేనె ఔషధప్రాయమైన అమూల్య పదార్థంగా పరిగణింప బడుతూవుంది. క్రతువుల్లో కూడ ఉపయోగింప బడుతూవుండేది. ప్రశస్తమైన తేనెకు ఎంతైనా గిరాకీ వుంది. ఐతే, బజారులో కొన్న తేనె, బెల్లం పాకం వగైరాలు కలిపించేగాక తేనెతో బాటు తేనెపట్టునుండి దారుణంగా పిండిన తేనెటీగల పిల్లలసారం కూడా కలిసిందై ఉంటుంది!

ఆర్థిక మాంద్యం ఏర్పడ్డ ఈ రోజుల్లో మధ్య తరగతి కుటుంబాలు తమ తీరిక కాలంలో తేనెటీగ పెంపకాన్ని అవలంబిస్తే తమకూ ప్రజలకూ కూడ ఎంతో లాభం.

అదీగాక మన మతం జీవహింసను, పాపాన్నీ సహించదు. మామూలు పద్ధతిలో, తేనె పట్టు పిండి, తేనెటీగల పిల్లల్ని అసంఖ్యాకంగా చంపడం జరుగుతుంది. అందుచేత చాలమంది తేనె త్రాగడానికి సందేహిస్తారు— పాపమనీ— యీగపిల్లల్ని పిండిన సారాన్ని త్రాగాలనీను! ఆధునికంగా శాస్త్రీయమైన పద్ధతిలో యీ యిబ్బందులేమీ ఉండవు.

తేనెటీగ:— తేనెటీగలలో మూడు జాతులు చూచేవుంటారు. మన్యం పట్టు— దీని జోలికి వెళ్ళకండి. చిన్న తేనెటీగలు కొన్ని చూచే వుంటారు. ఇవీ మనకు లాభంలేదు. మామూలుగా చెట్టు తొర్రల్లోను, పుట్టల్లోనూ పట్లు పెట్టేజాతి (ఏపిస్-ఇండికా అంటారు) ఇవే మనకు మచ్చిక అయ్యేవి. ఇవి ఒకదాని ప్రక్క నొకటి వేలాడేటట్లుగా పట్లు కడతాయి. వీటికి మనం యిచ్చే తేనెపట్టు పెట్టెల్లో సహజరీతిని యివి సులభంగా పెంచవచ్చు.

ప్రకృతిలో అనేక పుష్పాలున్నాయి ; కొన్ని మకరందాన్ని హెచ్చుగానూ, కొన్ని పుప్పొడిని హెచ్చుగాను యిస్తాయి. తేనెటీగలకు యివి ఎక్కడ లభ్యమయ్యేదీ ఎరుకే. మనం ఇందుకని అంతగా ప్రయాస పడనక్కరలేదు. తేనెటీగలుకూడా తమ తేనెను తాము తెచ్చుకొని తమ పొట్ట తాము పోసుకోవడమేగాకుండా విస్తారంగా మనకు తేనెను కూడబెడతాయి. కాదంటే పూలంతగా లభించని మండు వేసంగిలోను, తేనె తక్కువయ్యే వర్షాకాలం ఎద్దడి రోజుల్లోనూ యింత బెల్లం పాకమో, పంచదార పాకమో, సాయంత్రపు వేళ ఇస్తేచాలు.

తేనెటీగల పెట్టె :—మన దేశంలో విస్తారంగా న్యూటన్ తేనెపట్ల పెట్టె అని ఏటవాలైన కప్పుతో చిన్న పేకు పెట్టె చూచేవుంటారు. 6-8 రూపాయలకు ఏ వ్యవసాయ డిమాన్‌స్ట్రేటరుదగ్గరైనా లభిస్తుంది. దాంట్లో పట్లు ప్రక్క ప్రక్కగా ఉండటానికి ఏడేసి కర్ర చట్రాలతో రెండు అంతస్తులుంటాయి. క్రింది అంతస్తు పిల్లల్ని పెంచడానికీ, పై అంతస్తు తేనె నిలువచేయడానికీను !

తేనెపట్టు పట్టుకోవడం :— తేనెటీగలు గుంపులు గుంపుల్లాగ వసంతఋతువు లగాయతు- వర్షఋతువు వరకు బయలుదేరుతుంటాయి. మొట్ట మొదటిగా తేనె పెట్లు పెట్టేవారు— పుట్టల్లోను, తొర్రల్లోను ఉండే పట్టు అట్టల్ని— తేనెటీగల్ని సంపాదించే విధానం వ్యవసాయ శాఖ సిబ్బందిని అడిగితే చెపుతారు- అన్ని విషయాల్లోను తగు సహాయంచేసి తగినంత సలహా ఉచితంగాయిస్తారు. తేనెటీగల పెట్టెలో చట్రానికి తేనెతెట్టు కట్టి దానిమీద తేనెటీగల గుంపు ప్రవేశింపజేయాలి. వాటిల్లో ఒక రాణి ఈగ ఉంటుంది. అది ఉండేటట్లు చూచుకుంటే దాని వెంటనే తతిమా ఈగలన్నీ ఉంటాయి. తేనెటీగల గుంపు నెక్కించిన పెట్టెను- ఒక సురక్షిత స్థానంలో సమతలంలో- అంతగా ఎండా వానా, హోరుగాలీ తగలకుండా ఉండే చోట పెట్టాలి. పెట్టె ముఖం, సూర్యరస్మి దాంట్లో ప్రవేశించేటట్లు ఉంచగలిగితే, చాలమంచిది.

తేనెపట్టుపెట్టె మూతతీసి ఒక ప్రక్కనుపెట్టి, చట్రాలు మెల్లగాఎత్తి అప్పుడప్పుడు కొన్నిరోజులకొకసారి చూస్తుండడం మంచిది. భయపడనక్కరలేదు. తేనెటీగల్ని ఏమీ చేయకుండా ఉంటే అవి మనల్ని ఏమీ చెయ్యవు. మీద వాలినా చేత్తో కొట్టరాదు. చాల మచ్చికగా ప్రవర్తిస్తాయి నెమ్మదిగా చూస్తుంటేను. ఒకటేదైనా కుట్టినా, కంగారు పడక, తేనెటీగ ముల్లుతోకూడా తీసేసి, ఒక పచ్చఆకుతో కుట్టినచోట రుద్దడం మంచిది. లేకుంటే ఆవిషం వాసనకు మిగతా ఈగలు రెచ్చిపోయి అల్లరి పర్చవచ్చు. తేనెటీగల కుట్టు కీళ్ళవాతాన్నీ, పక్షవాతాన్నీ కుదుస్తుందంటారు.

పట్లు చిన్నవైనా, రాణీ లేకపోయినా- రెండు పెట్టెల్లోని పట్లను కలిపే మార్గం :—

పిల్లల్ని పెట్టే క్రింది అంతస్తుమీద ఒక చిల్లులు పొడిచిన కాగితం కప్పండి. దానిమీద రెండో పెట్టె తాలూకు

## తేనెటీగలను పెంచే పెట్టె



భూమిలో పాతిన కర్ర. A. పట్టుకు చీమలు వెళ్ళకుండా నీటిగళ్ళాయి ఏర్పాటు.

1. పైకప్పు
2. తేనెకూడ బెట్టే అంతస్తు
3. పిల్లలుండే క్రింది అంతస్తు
4. అడుగు చెక్క
5. ఈగలులోనికి వెళ్ళేమార్గం
6. తేనె తెట్టులుకట్టే చట్రాలు
7. పనిచేసే తేనెటీగ
8. రాణి ఈగ
9. మగఈగ (రెట్టింపు సైజులో)
10. తేనెతీసే చేతియంత్రం
11. తేనె సీసా
12. యంత్రంలోని ఏర్పాట్లు

అంతస్తు ఉంచండి. కాగితం కన్నాలు పెద్దవిగా చింపుకుని పట్టూ పట్టూ కలిసిపోతాయి. లేదా పైనుంచి తెచ్చిన చట్రానికి అటూ ఇటూ చించిన కాగితాలు పెట్టి రాత్రుళ్ళు పెట్టెలో ఉంచేస్తే- ఆ యీగలూ ఈ ఈగలూ కలుస్తాయి. రాత్రుళ్ళు తేనెటీగలు బయటకిపోవు. అందుచేత వాటి శరీర వాసనలు కలిసిపోయి ఐక్యమైపోతాయి. లేకుంటే ఒక పట్టు యీగలు మరోపట్టు ఈగలతో ఒక పట్టాన కలువవు.

కొత్తరాణీని పెట్టడం:— మంచి పిల్లలూ గ్రుడ్లూ వగైరాలున్న ఒక తేనెపట్టు తెట్టెను (తేనెటీగలు లేకుండా చూసి) రాణి లేని పెట్టెలో పెడితే- ఆపిల్లల్లో ఒకటి రాణీ యీగ అయ్యేటట్లు అవే పెంచుకుంటాయి. లేదా పెద్దదిగా కట్టిన రాణీ గదులుండే భాగాన్ని మరొక తెట్టె నుంచి తెచ్చి ఆపెట్టె తెట్టెకు పిన్నువేసి గుచ్చినా అవే కలుపుకుంటాయి ఒక్కొక్కసారి క్రొత్త రాణీని చిన్న పంజరంలో పెట్టి అలాంటి పట్టులో ప్రవేశపెట్టొచ్చు.

తేనెటీగ పెట్టెల్ని స్థానం మార్చడం:— పెట్టెను స్థానంలో నుంచి మార్చరాదు. తప్పనిసరియైతే రాత్రుళ్ళు రోజుకు 1, 2 అడుగుల చొప్పున మారుస్తూ క్రొత్తస్థానానికి క్రమంగా తీసుకెళ్ళాలి. పెట్టె దూర ప్రాంతానికి పట్టుకెళ్ళాలి అంటే రాత్రి, ద్వారం మూసివేయాలి. క్రొత్త ప్రాంతంలో పెట్టేక అడ్డు తీసివేయాలి. ఈగలు మళ్ళీ చుట్టుప్రక్కలన్నీ గుర్తులు పెట్టుకుంటేగాని పని ప్రారంభించవు.

తేనె తీయడం:—పై అంతస్తులో గల తేనెతెట్లలో గళ్లు మూడు వంతులు

మూసివేయబడ్డాక, మనం తేనె తీసుకోవచ్చు. మెల్లగా తేనెటీగలు లేకుండా ఊది తెట్టువేరు చెయ్యవచ్చు. ఆ చట్రాన్ని తేనె తీసే యంత్రంలో పెట్టి గిర గిరా త్రిప్పితే తేనె బయటికి వచ్చేస్తుంది. అసలైన పట్టుతేనె ఇది. మళ్ళీ కాళీ తెట్టెను పెట్టెలో పెట్టేయాలి.

తేనెటీగల శత్రువులు :— మైనం పురుగు, చీమలు, కందిరీగలు, తొండలు, ఏడ్రింక, మరో చిన్న పచ్చటి పిట్ట తేనెటీగల శత్రువులు. మైనంపురుగు పట్లు తినేస్తుంది. తరుచు పెట్టెలోని తెట్లు పరీక్షిస్తుండాలి.

ఇదంతా కొత్తవల్ల సరిగా అర్ధంకానివారు కొంచం శ్రద్ధ వహించి తేనెపట్లు ఇదివరలో పెట్టిన వారిదగ్గర గాని, వ్యవసాయశాఖ మేస్త్రీల సలహావల్లగాని కొద్ది రోజులు అలవాటు పడ్డారంటే— తేనెటీగల పెంపకం చాల సరదాగా ఉంటుంది. చాల లాభకరం. ఏడాదిలో పట్టు ఒక్కంటికి 10-15 రూపాయిలవరకు నికరాదాయం లభిస్తుంది. సరదా తీసుకొని దీన్ని కుటీర పరిశ్రమగా అవలంబించండి.

—సోషల్ వెల్ఫేర్ పత్రికలో స్వామి పరబ్రహ్మానండ్.



## ఆంధ్ర మహిళాసభ సంక్షేమ ప్రాజెక్టు కృషి :—

ఆంధ్ర మహిళాసభ సంక్షేమప్రాజెక్టు క్రింద మాంబట్టు గ్రామంలో మాతాశిశు సంరక్షణాలయంకు ఆగస్టు 15 వ. తేదీని ప్రారంభోత్సవము జరిగినది. అక్కడ ఒక మంత్రసానిని సెప్టెంబరు 15 వ. తేదీని నియమించాము. ఆమె 8 కాన్పులు చేసినది. అన్నియు సుఖముగా జరిగి మాతాశిశువులు సురక్షతముగా వున్నారు. కొందరికి ఉదయము మందులు కూడా ఇచ్చుచున్నది. వారమునకు 4 రోజులు చుట్టుపట్ల గ్రామాలకు వెళ్ళి ఆ గ్రామాలలోని స్త్రీల యొక్కయు, పిల్లల యొక్కయు, క్షేమ సమాచారములను విచారించు చున్నది.

అక్టోబరు 2 వ. తేదీని చేనిగుంట గ్రామములో నెల్లూరు కలెక్టరుగారి సతీమణియైన మిసెస్. మాదప్ప గారు మాతాశిశు సంరక్షణాలయమునకు ప్రారంభోత్సవము జరిపిరి. శ్రీ మాదప్పగారు అధ్యక్షత వహించిరి. శ్రీ వేణుగోపాలరెడ్డిగారు పతాకావిష్కరణ చేసిరి. కన్వీనరు శ్రీ టి. జి. హైమవతి, గూడూరు సబ్‌కలెక్టరు రాజారావు గారు, గూడూరు సివిల్ అసిస్టెంటు సర్జన్ రామచంద్ర రావుగారుమాట్లాడిరి. ఆంధ్ర మహిళాసభ నర్సింగ్‌హోమ్ పిల్లలు బుర్రకథను చెప్పారు. చేనిగుంటపిల్లలు కోలాటం వేసిరి. చేనిగుంట గ్రామస్తులు తేనీటివిందు ఏర్పాటుచేసిరి. జనగణమనతో కార్యక్రమము ముగిసినది.

చేనిగుంట సెంటరు ప్రారంభోత్సవ సమయములో శ్రీమతి ఇందిరాగాంధీగారు పంపిన సుభాకాంక్షలు :—

"మాంబట్టులో ప్రారంభించిన ప్రసూతి కేంద్రానికి అక్కడి ప్రజలు చాల సహకరిస్తున్నారని వినడానికి చాల ఉత్సాహంగాఉంది. ఇది మీకు చాల ప్రోత్సాహకరమైన అనుభవంగా వుండి వుంటుందని తలుస్తాను.

—మీరు మాంబట్టుకు 10 మైళ్ళదూరంలో మరో ప్రసూతి శిశుపోషణ కేంద్రాన్ని తెరవబోతున్నారని వినడానికి చాల సంతోషం. ఆవూరు ప్రజలుకూడ సహకరించి కేంద్రానికి కావలసిన గృహాన్ని, ఆ కేంద్రఖర్చుల నిమిత్తం ఆవూరు పంచాయితీ బోర్డువారు రూ. 500 యిస్తున్నందుకు చాల ఆనందం.

ఈ కేంద్రాన్ని అక్టోబరు 2 వ. తేదీని గాంధీజయంతి నాడు స్థాపించడం చాల సమంజసంగా వుంది. స్త్రీజన సంక్షేమం, శిశుసంరక్షణ - ఇట్టి సేవా కార్య క్రమమందు బాపూజీకి ఉన్న శ్రద్ధ జగద్విదితము. మీ కేంద్రం జయప్రదంగా సాగాలని నేను కోరుతున్నాను. ఈ నూతన కేంద్రంద్వారా సౌకర్యాలు పొందగలిగే తల్లులకు నా అభివందనాలు. పిల్లలకు ఆశీస్సులు —"

ఇందిరాగాంధి.

# ఆజ్రా ఆపా

• సోమీంద్ర •

జంగిడతో కూరగాయలు ముందుంచుకొని, వరండాలో ఒకమూల మంచంమీద కూర్చునివుంది ఆమె. అది మా ప్రథమ సమాగమం. కలుసుకొన్న అరగంటలోనే మేం పరిచితులమయిపోయాం. ఆమే ఆజ్రా ఆపా. మా పొరుగింటి మౌల్వీసాహిబ్ భార్య. పద్య పాఠ పఠనం కోసం మౌల్వీ దగ్గరకి వెళ్ళుతుండే వాడిని. అసలే తీరిక లేని మనిషి కావడంవల్ల మౌల్వీసాహిబ్ నన్ను ఆయన భార్య దగ్గరకి పంపేవాడు — 'పాఠాలు చెప్పుకొందుకు. భర్తని పాండిత్యంలో ఏమాత్రం తీసిపోలేదు — ఆజ్రా ఆపా. సాధారణమైన కుటుంబంలో పుట్టిపెరిగిన ఆజ్రా ఆపా, అతిఛాందసులైన వారికుటుంబంలో అడుగిడింది. పరదా అతిగా అమల్లో వుండేది వారి యింట్లో. ఎప్పుడో కాని ఆమె బైట కనిపించేదికాదు. ఎంతో వినముచ్చటగా మాట్లాడేది. ఆమెకు తెలియని విషయాలు లేవు. ఆ సనాతనాచార పారాయణుల యింట్లో యింతటి ఉదాత్తమైన ఆత్మ ఒకటి ఉందంటే. నమ్మకంకూడా కల్గేదుకాదు. ఇల్లు కదిలి అవతలకి రాకపోయినా. ఆమె స్వేచ్ఛాజీవే. సద్గుణ సంపన్న. విశాల భావాన్విత. తరువాత తరువాత తెలుసుకున్నాను: ఆమెను చూడవచ్చేది నేనొక్కడినే కాదని: అన్నిరకాలవారూ, ఆమె సహాయసలహాలు పొందడానికి వచ్చేవారు. వంటింటి సమస్యలు మొదలుకొని, షెల్లీ ఋూలిబ్‌ల కవిత్వంవరకూ అన్ని విషయాలని గురించీ మాట్లాడ కలిగిన ఆమె చాతుర్యానికి ఆశ్చర్యమే వేసేది. ఆమె స్నేహిత బృందంలో నాలాంటి చిన్నవాళ్ళు మొదలు ఆ పరిసరాల వయసుమళ్ళినవారందరూ ఉండేవారు.

ఆమె దేనినీ కాదనేదికాదు. ఆమె సాంఘిక సేవ అంతా. చేతనయినంతవరకు పేదవారికి అన్ని రీతులా సహాయపడడమే. తన ఉరుదూ అక్షరాల పుస్తకంతో తోటీ వాడి కూతురు వచ్చేది. వంటయింటి సమస్యల పరిష్కరణకై గొప్పయింటి నాగరిక యువతివచ్చేది. అర్థంలేని, సద్దుకుపోని అత్తగార్ని నేర్పుతో నెలా సరిదిద్దుకోవాలో నేర్చుకొందుకు చాకలి భార్యవచ్చేది. ఆజ్రా ఆపా తన స్నేహితులతో, ఏవిషయాలని గురించేనా మాట్లాడకలదు; వేదాంతమైనా సరే, పట్టణ పరిసరాల రాజకీయాలైనాసరే, ఆమె కూర్చునే వరండా ఉదయం నుంచి సాయంత్రంవరకూ, వచ్చీపోయేవారి హడావిడితో ఒక సంస్థలా వుండేది.

మౌల్వీసాహిబ్, చెల్లెలినికూడా, తమలాంటి సనాతన కుటుంబంలోకి యిచ్చి వివాహం జరిపించాలని ప్రయత్నాలు చేశారు. పరదా జీవితం, బందికాన జీవితం నుండి తన ఆడబిడ్డని రక్షించాలని ఆపా కోరిక. తల్లిలేని యీ అమ్మాయి చిన్నతనంనుండీ ఆపా దగ్గిరే పెరిగింది. కాని ఆమెకి వివాహం చేయడానికి మేనమామలు పల్లెటూరు తీసుకువెళ్ళారు. చూస్తూ వూరుకోలేకపోయింది ఆపా. ధైర్యం తెచ్చుకుని పల్లెటూరు వెళ్ళింది. కాని అక్కడి వారు ఆమె మాటలు లక్ష్య పెట్టే స్థితిలోలేరు. ఆపా బతిమాలినా లాభం లేకపోయింది. కాని ఆమె ధైర్యం మాత్రం విడనాడలేదు. ఆ యింటితోటీ పనివారితో కలిసి గూడుపుఠాణీ చేసింది. ఫలితంగా, ఒకరోజు, తెలతెలవారుతూండగా ఇద్దరు బురఖాస్త్రీలు దగ్గిరవున్న రైలు స్టేషనుకి త్వరగా నడిచారు.

సంవత్సరాలు గడిచిపోయాయి. నా చదువూ అయిపోయింది. గందరగోళాలు బయలుదేరి, ముస్లిములు కానివారు పశ్చిమ పంజాబు విడువవలసిన అవసరం ఏర్పడింది. ఆపా గృహం యిరుతెగలవారికీ తలదాచుకొనే ఆస్కారం అయింది. ఆమె అతిజాగ్రత్తగా, తన హిందూ, సిక్కు స్నేహితులు, సురక్షిత ప్రదేశాలు చేరే ప్రయత్నాలు చేయడంలో నిమగ్నమయిపోయింది.

కొన్ని సంవత్సరాల తరువాత, నా స్వంత వూరువెళ్ళే అవకాశం కల్గింది. ఆమెని కలుసుకున్నాను. పూర్వం లాగే జీవించాలని ఎక్కువ తాపత్రయపడుతోంది. కాని, ఆమె ఆరోగ్యం అందుకు అడ్డునిల్చింది. దానికితోడు ఆమె అప్పులలో మునిగివుంది. కాందిశీకులుగ వస్తున్న స్నేహితులకి ఆర్థికంగా సహాయాలు చేస్తూ వచ్చేసరికి ఆమె ఆర్థిక స్తోమత కుంగతీసుకుపోయింది. కుటుంబంతో పోరిపోరి చివరకి, తన ఆడబిడ్డకి ఆమె యిష్టం వచ్చినట్లు వివాహం జరిపించింది. ఆ పెళ్ళి ఖర్చు అంతా ఆమె భరించవలసివచ్చింది. కారణం ఆ పెళ్ళికి కారకురాలు ఆమె అవడం. అదేమంచంలో అనారోగ్యంతో అసహాయురాలిగా పడుకొనివుంది ఆపా. ఆరోగ్యం సరి

చేసుకుందుకి డబ్బు లేదు. భవిష్యత్తు, ఆశాజనకంగానూ లేదు. మృత్యుముఖానవున్న ఆమెను, ఆమె అప్పులవాళ్ళు వెంటాడుతూనే వున్నారు.

యిప్పుడో, అౖజా ఆపా చనిపోయిందని విన్నాను. నా స్మృతిపథాన పాతకాలపుటూహలుకదిలితే, అౖజా ఆపా నిండైన కంఠస్వరం నాచెవులలో మారు్మోగుతుంది. ఆ మాతృహృదయపు అభిమానమూ, ఆదరణా జ్ఞప్తికివచ్చి నా హృదయం ప్రశాంతమవుతుంది. ఆపా మృతితో, ఒక స్నేహితుని, ఒక గురుపుని ఒక సహోదరిని కోల్పోయిన ఏకాకినయ్యాననిపిస్తుంది. ★

# అఖిల భారత సంఘ సంక్షేమ కార్యకర్తల సమావేశం

కేంద్ర సాంఘిక సంక్షేమ సంఘము (సెంట్రల్ సోషల్‌వెల్ఫేర్ బోర్డువారి ఆదేశానుసారము వివిధ రాష్ట్రాలలో నెలకొల్పబడిన రాష్ట్ర సంఘ సంక్షేమసలహా సంఘాల అధ్యక్షురాండ్ర సమావేశము నవంబరు నెల 11-13 తేదీలలో జరుగుతుంది. కేంద్ర సంఘ సభ్యు రాండ్రు, రాష్ట్ర సంఘ సభ్యురాండ్రు కొందరూగూడ యీ సమావేశంలో పాల్గొంటారు. భారత రిపబ్లిక్ అధ్యక్షులు డాక్టరు రాజేంద్రప్రసాద్‌గారు యీ సమావేశానికి ప్రారంభోత్సవం చేయుటకు దయతో అంగీకరించారు.

కేంద్ర సంఘం ఆహ్వానంపై రాష్ట్ర సంఘాధ్యక్షులు, ప్రముఖ సంఘ సేవాభిలాషులు సమావేశం అవడం యిదే ప్రథమం. సంఘ సంక్షేమ కార్యకర్తల నెదుర్కొం టున్న సమస్యలను గురించేగాక వివిధ రాష్ట్రాలలో అమలు జరుగుచున్న సంఘ సంక్షేమ విస్తరణ కార్యక్రమం (సోషల్‌వెల్‌ఫేర్ ఎక్స్టెన్షన్ ప్రాజెక్టులు)యొక్క అభివృద్ధిని గూర్చి గూడా యీ సమావేశంలో చర్చిస్తారని తెలుస్తోంది.

## గ్రామసీమలో సంఘ సేవాసంస్థలు

కేంద్ర సంఘ సంక్షేమ బోర్డువారి కార్యక్రమానుసారం అక్టోబరు 2 వ తేదీని గాంధిజయంతుత్సవసందర్భమున వివిధ ప్రాంతాల్లో 59 కొత్త సంక్షేమ ప్రాజెక్టులు ప్రారంభింపబడ్డాయి. ఆగస్టు 15 వ తేదీని ప్రారంభించిన ప్రాజెక్టులతో సహా ఇంతవరకు స్థాపింపబడ్డవి 137 ప్రాజెక్టులు. ఈ ప్రాజెక్టులయొక్క ముఖ్యోద్దేశం మహిళాభ్యుదయం, శిశు సంరక్షణ, అనాధ రక్షణ, మాతా శిశు సంరక్షణాలయాలు, అనాధ శరణాలయాలువంటి సేవాసంస్థలను గ్రామసీమలో నెలకొల్పి జాతీయ శ్రేయస్సుకు దోహద మివ్వడమే కేంద్ర సంక్షేమ బోర్డువారి ఆశయం.

ఆగస్టు 15 వ తేదీని ఆంధ్రాలో 12, అస్సాంలో 4, బొంబాయిలో 4, మధ్యప్రదేశ్‌లో 8, మదరాసులో 7, ఒరిస్సాలో 10, హైదరాబాదులో 10, పెప్సూలో 10, తిరువాన్కూర్-కొచ్చిన్‌లో 4, భోపాల్‌లో 5, ఢిల్లీలో 2, వింధ్య ప్రదేశ్‌లో 2. మొత్తం 78 ప్రాజెక్టులు వివిధ రాష్ట్రాలలో నెలకొల్పబడ్డాయి. అక్టోబరు 2 వ తేదీని ప్రారంభించిన ప్రాజెక్టులలో అస్సాంలో 2, బొంబాయిలో 3, మధ్యప్రదేశ్‌లో 7, మద్రాసులో 4, ఒరిస్సాలో 7, పంజాబులో 2, ఉత్తర ప్రదేశ్‌లో 13, పశ్చిమబెంగాల్‌లో 5, మైసూరులో 1, సౌరాష్ట్రంలో 10, హిమాచల ప్రదేశ్‌లో 1, కచ్‌లో 2, వింధ్యప్రదేశ్‌లో 2 మొత్తం 59.

ఈ ప్రాజెక్టులు 2760 గ్రామాల్లో, 27 లక్షల 60 వేల ప్రజానీకానికి ఉపకరిస్తాయి. ఇదేగాక ఈ 137 ప్రాజెక్టులలోను సుమారు నాలుగు వేలమంది స్త్రీలకు సంఘసేవా కార్యక్రమంలో పాల్గొనే అవకాశం లభిస్తుంది.

* * *

కేంద్ర సంక్షేమ బోర్డు ప్రచురించే "సంఘ సంక్షేమ" పత్రిక సంపాదకురాలు శ్రీమతి ఫ్రెడబెడిగారు మధ్య ప్రదేశ్, మద్రాసు, ఆంధ్ర, తిరువాన్కూర్- రాష్ట్రాలు పర్యటించి, 1954 అక్టోబరు 17 వ తేదీకి తిరిగి న్యూఢిల్లీ చేరారు. బోర్డువారు సాంఘిక సంక్షేమ కృషికి సంబంధించిన విషయాలు రాష్ట్రభాషల్లో ప్రకటించాలన్న ప్రణాళికను గురించి వారు పర్యటించారు. వీరు రాష్ట్రాల్లో సంక్షేమ విస్తరణ ప్రాజెక్టులు నడిపే కృషి సమీక్షించ డానికై అనేక గ్రామాల్లో సంక్షేమ కేంద్రాల్ని చూచారు. వీరి పర్యటనలో సేవాగ్రాం, గాంధిగ్రాం కూడ దర్శించి, భారత సాంఘిక కృషికి శాఖయైన తిరువాన్కూరు-కొచ్చిన్ యొక్క ప్రథమ సమావేశాలలో పాల్గొన్నారు.



# గాంధీజీ సుభాషితాలు?

స్త్రీలు :— మగవాని కామ సంతృప్తికి ఏర్పడ్డామన్న భావం స్త్రీలో అంతమొందాలి. దీనికి మార్గాంతరం మగ వారి చేతుల్లోగాదు, స్త్రీ చేతిలోనే ఉంది. స్త్రీ నిజమైన సహభాగిని ఐతే మగవానికోసం బొమ్మలాగు సింగారించు కోవడం మానాలి.

స్త్రీలు గృహ రక్షణ కోసరం, తుపాకులు దాల్చడం అన్నది ఆమెకు, పురుషునికి గూడ పతనమే. ఇది పశు త్వానికి తరలిపోవడం అవుతుంది.

జీవితంలో పరిశుద్ధమైనది స్త్రీలల్లో పొందుపర్చబడి ఉంది. ప్రకృతి సిద్ధంగా ఆమె మిత వ్యవహారిణి. "పిచ్చి" నమ్మకాలను వదలడంలో స్త్రీలు చాలా నెమ్మదిగా గావిస్తా రనుకుంటే—జీవితంలో పరిశుద్ధమైనది, పావనమైనది వదులుకోడానికి కూడా వారు చాల నెమ్మదిగానే చేస్తా రనాలి.

పతివ్రతాగుణం పైనుంచి కల్పిస్తే వచ్చేదిగాదు. అది పర్దా అనే గోడలమధ్య పెడితే సంరక్షింప బడేదిగాదు.

భార్య భర్తకు బంధింప బడ్డ సేవకురాలుగాదు. ఆమె అతని స్నేహితురాలు, సహకారిణి; జీవిత సుఖదుఃఖా లన్నిట్లోను సహభాగిని. భర్తలాగే ఆమెకూ తనకు నచ్చిన పంథాననుకరించడానికి పూర్తి హక్కున్నది.

స్త్రీ అంటే ప్రత్యక్ష త్యాగ స్వరూపిణి. ఆమె సక్రమ విధానంలో ఏకార్యమైనా గావించిందీ అంటే మేరు పర్వ తమే కదిలిపోతుంది.

వివాహం :— వివాహం యొక్క ఉద్దేశం తపించే స్త్రీ పురుషుల హృదయాల్ని పరిశుద్ధమొనర్చి, వారినిభగవంతుని దగ్గరకు జేర్చేది. భార్యా భర్తల మధ్య కామేచ్ఛలేని ప్రేమ అన్నది అసాధ్యం కాదు. (ఉదా :— రామకృష్ణ పరమ హంస, శారదా దేవి.) మానవుడు పశువుగాదు. పశుజన్మా లెన్నో ఎత్తి, వాటి తలదన్నిన మానవ జన్మమెత్తినజీవి. అతడు చతుష్పాద జంతువువలె నాల్గు కాళ్ళతోగాక, రెండు కాళ్ళపై నిలబడ్డానికి పుట్టిన వ్యక్తి. భౌతికానికి, భౌతికేత రానికి ఎంత వ్యత్యాసం ఉందో, పశుత్వానికి మానవత్వానికి అంతటి తేడాపుంది.

బర్త్‌కంట్రోల్‌ను గురించి రెండభిప్రాయాలులేవు: గాని యుగయుగాలుగా మనకు సంక్రమించిన పద్ధతి ఆత్మ సంయమమూ బ్రహ్మచర్యమూను.

వివాహం అంటే ఒండొరులపై పవిత్రమైన నిబంధ నలు విధించేది. ఇరువురూ ఏక రీతిని వాంఛించినప్పుడే— జాతి ప్రవృద్ధికే- వారు కలుసుకొనేది.

మోక్ష ప్రాప్తికి వివాహం అంతరాయమే ఔతుంది— అది కేవలం భౌతిక శరీరవాంఛాపరి తృప్తికే ఏర్పడిన దైతేను.

వివాహం యొక్క ఆశయం ఏమిటంటే భౌతికం ద్వారా ఆధ్యాత్మిక సమ్మేళన సాధించేది. వివాహంవల్ల ఉద్భవించే ప్రేమ భావం, దైవ ప్రేమకు, విశ్వ మానవసౌ భ్రాత్రతకు దోహదం కావాలి.

స్త్రీ పురుషుల పరస్పర వాంఛ పవిత్రమైనదే. దాని నుంచి సిగ్గు పడవలసినదేమీ లేదు. కాని, అది జాతి ప్రవృద్ధికై, సృష్టిప్రక్రియకై ఉద్దేశింపబడింది. అంతరంటె ఇతరంగా పరిణమిస్తే-దాన్ని భగవంతునియెడ, మానవ జాతియెడ జరిగే అపరాధం అనవలసిందే. ★

# స్వదేశీ

నాకు 'స్వదేశీ' అంటే, గాంధీజీ చర్కాతో ప్రారంభ మైనా, ఇంకా అనేకమైన వాటికెన్నిటికో వ్యాపిస్తుంది ఈ రోజున దేశంలో నశించిపోతున్న కళలనూ, వృత్తులనూ సముద్ధరించడమంతా స్వదేశీ అనే నా వుద్దేశం. దీని అంత రార్థం— బట్టలకు రంగులు వేయడం, లేసులల్లడం, మీ పెళ్ళిళ్ళకు బాసికాలు తయారు చేయడం, మీ ఉయ్యేల తొట్టెలూ, తెరలూ అల్లడం, మీ గృహ జీవనానికి కావల సిన చిన్న చిన్న వస్తువులన్నీ తయారు చేయడం మొదలైన-వృత్తుల వల్ల జీవించేవారందరికీ భుక్తి కల్పించడం. ఈ రోజున మీనుండి ఏమాత్రపు సహకార సానుభూతులూ పొందక, నిరుద్యోగులై, అన్నిటికీ తెగించే వేలకొద్దీగల, మీ దేశస్థులకు జీవనోపాధి కల్పింపబడి బ్రతుకుతెరువు చూపెట్టబడాలి; 'గుర్తింపబడని చిన్న వృత్తు'లని గాంధీజీ పేరెట్టిన, ఈ నశించిపోతున్న చేతి వృత్తులన్నీ మీ గారడీ చేతులవల్ల పునరుద్ధరింపబడాలి. నాకు 'స్వదేశీ' అంటే, మన సాహిత్యాన్ని పునర్జీవింప జేయడం, మన సంగీతాన్ని పునరుద్ధరించడం, మన ఆధునిక జీవిత ఆశయాలకు అను గుణ్యంగా నుండేటట్లు నూతననిర్మాణ కార్యక్రమాలను సాగించడం. మన దేశంలో నున్న సమస్త ప్రకృతి సంప దలనూ గణకట్టి సద్వినియోగం చేయడానికి ఒక విధమైన ప్రయోగం— నాకు స్వదేశీ అంటేను.

(సోషల్ వెల్‌ఫేర్ పత్రికనుండి)

శ్రవ్యనాటిక

# మధూళి

శ్రీమతి రమా ప్రతాపరావు.

## పాత్రలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| మాధవరావు | .... | ఉపాధ్యాయుడు | .... | వయస్సు | 55 |
| వరదరాజులు | .... | జిల్లాజడ్జి | .... | వయస్సు | 42 |
| మోహన్ | .... | విద్యార్థి | .... | వయస్సు | 20 |
| శ్యామల | .... | మాధవరావు భార్య | .... | వయస్సు | 45 |
| సుందరి | .... | మాధవరావు కూతురు | .... | వయస్సు | 19 |
| ఒక జవాను. | | | | | |

———: o :———

మాధవ : శ్యామా, అమ్మాయేదీ !

శ్యామ : ప్రైవేటు క్లాసేదో ఉందట. కాలేజీకి వెళ్ళింది. ఏం ?

మా : ఏం జేసిందో చూశావా ?

శ్యా : ఏం. ఏమయింది ?

మా : పోస్టాఫీసులో గుమాస్తాగా చేరింది.

శ్యా : అదేమిటీ? ఎప్పుడూ ?

మా : ఇదిగో ఉద్యోగం యిస్తున్నట్టు పోస్టల్ డిపార్టు మెంటువాళ్ళు పంపిన ఉత్తరం. ఈమధ్య వాళ్ళు ఎడ్వర్టయిజు చేశారు. మన అమ్మాయి దరఖాస్తు పెట్టి ఉంటుంది. ఈ ఊళ్ళోనే గాబట్టి ఇంటర్వ్యూ కూడా అయిపోయి ఉంటుంది.

శ్యా : మీతో ఏమయినా చెప్పిందా ?

మా : ఊహు!_ నీకేమయినా తెలుసు ననుకున్నాను. నీతోను చెప్పలేదన్నమాట__ ఊఁ బాగానే ఉంది.

శ్యా : తల్లిని_ నాదగ్గర దాపరిక మేమిటి దానికి ?

మా : ఇంట్లో పరిస్థితులన్నీ గమనించి తనుకూడా ఆర్జిస్తే నేగాని మార్గం లేదనుకొని సాహసించి ఉంటుంది.

శ్యా : నేను నెత్తి నోరు కొట్టుకుని చెప్పాను దానికి పెళ్ళి చెయ్యండీ అని. మీరు నామాట వింటేగా__ పెళ్ళయి ఉంటే దాని మానాన్న అది బ్రతుకునుగదా !

మా : అవును నిజమే__

శ్యా : ఆ మూడు ముళ్ళూ పడి ఉంటే మనకీ గొడవ ఉండకపోను. మనం ఏదన్నా ఉంటే తినేవాళ్ళం_ లేకపోతే చింతగింజంత నల్లమందుతో అన్ని బాధలూ తీరిపోయేవి.

మా : బ్రతక లేకపోతే బడిపంతులన్నారు. చివరికి ఆ సామెత కొచ్చింది నా బ్రతుకు.

శ్యా : చేతులారా మీరు చేసుకున్నదే. ఇప్పుడనుకుని మాత్రం ఏం ప్రయోజనం_ ఎన్నో సార్లు చెప్పాను__ ఆడపిల్లలు గల కొంప_ కాస్త ముందుసంగతి ఆలోచించండీ అని.

మా : ప్చ్...... ఏమిటో......

శ్యా : అప్పుడు నా మాట చెవిని పెడితేగా__ చదువు రాని వాజమ్మ క్రింద కట్టేసి నేనంటేనే ఖాతరుండేది కాదు మీకు. ఆనాడు నిద్రపొక్కకుంటే ఇంత బాధ పడాల్సిన అవసరముండదుగదా !

మా : గొర్రె తోక జీతం__ వచ్చేది కుటుంబానికే సరి పోయేది కాదు గదా_ యింక ఏం మిగుల్చుకుంటాం !

శ్యా : ఎన్నిసార్లు వాగాను ప్రయివేట్లు చెప్పండని- ఆ కంపెనీల వాళ్ళు ఎంత మంది వచ్చి అడిగారు క్లాసు పుస్తకాలు వ్రాయమని. వ్రాశారూ ? ఎంత చేసుకుంటే అంత.

మా : కాని నాకు టైమెక్కడుండేది !

శ్యా : అవును. ఆ కుర్రకుంకలందరికీ రాత్రనక పగలనక డబ్బూ దస్కం లేకుండా చదువు చెప్పడానికి టైముండేది. మనకు లాభించేపని చేయడానికి టైమెందుకుంటుంది ?

మా : ఊఁ...... (నిట్టూర్పు)

శ్యా : వాళ్ళ సంగతి నాకప్పుడే తెలుసు. పంగనామాలు పెట్టే రకమని. పుస్తకాల్లేకపోతే కొనిచ్చారు. బట్టల్లేకపోతే కుట్టించి యిచ్చారు- వాడిమట్టుకు వాడు ఆ వరదరాజులు- ఏళ్ళతరబడి మేశాడే మనింట్లో- వాడికేమైనా కృతజ్ఞతుందా ?

మా : వరదరాజు లిప్పుడు జిల్లా జడ్జి- ఒక వారం క్రిందటే ఇక్కడకు బదిలీ అయిందట.

శ్యా : జడ్జీగాకపోతే గవర్నరవమనండి నాకేం- వాళ్ళేమయితే మాత్రం నాకే మొరిగింది___ ఏం వాడు లేడు రామారావు- మీ శిష్యుడేగా- పోలిసు సూపర్నెంటుగా ఈవూళ్ళో___ వాడు వొలకబోశాడు యిన్నాళ్ళూ - ఇంక మీ వరదరాజులు చెట్టెక్కిస్తాడు మిమ్మల్ని.

మా : వాళ్ళు నన్ను ఎప్పుడూ మర్చిపోరు. పనుల తొందరలో తీరికుండుండదు. తప్పకుండా నన్ను చూడ్డానికి వస్తారు. నా శిష్యులమీద నాకఖండమైన విశ్వాసముంది.

శ్యా : ఆ రోజులు తల్చుకుంటూంటే నా కడుపు తరుక్కుపోతోంది. ఆ వరదరాజులుకు జ్వరమొస్తే, బాలింతనసైనా గమనించకుండా అడ్డమయిన చాకిరీ చేయించారు. (గద్గదంగా వెక్కుతుంది)

మా : ఊరుకో... ఎవరో వస్తున్నారు. మన అమ్మాయే సుందరి వస్తోంది.

(చెప్పులు విడుస్తున్న చప్పుడు)

కాలేజీ అయిపోయిందామ్మా.

సుం : అయింది నాన్నా-

శ్యా : ఏమే___ ఏదో ఉద్యోగం చేయడానికి బయలుదేరావట !

సుం : అవునమ్మా- పోస్టాఫీసులో గుమాస్తా పనికోసం ప్రయత్నం చేశాను.

మా : కాని నువ్వు అలా చేయడం మాకెవరికీ యిష్టంలేదు తల్లీ- ఇప్పుడు నీ కేకష్ట మొచ్చిందమ్మా - నే బ్రతికున్నాగా......

సుం : నాన్నా. మీమనసు నొప్పించినందుకు క్షమించండి. మీకు బాధ కలుగజేసే దేదీ చేయను. మీరు నన్ను కొడుకులా పెంచారు. మీకీ వృద్ధాప్యంలో తోడ్పడదామనే ఉద్దేశ్యంతో అలా చేశాను. మీకు సహాయపడడం నా విద్యుక్త ధర్మమని తలచాను.

మా : ఎంత మంచి మనసమ్మా నీది___ నీ విద్యుక్త ధర్మం నే చెప్పినటల్లా నడుచుకోవడమే. నువ్వా ప్రయత్నాలన్నీ మానేసి శ్రద్ధగా చదువుకో. డిగ్రీ పరీక్షలో క్లాసు రావాలి. నువ్వెంత బాగా చదువుకుంటే మాకంత ఆనందం.

సుం : మీ యిష్ట ప్రకారమే చేస్తాను నాన్నా... ఏమిటమ్మా... యిందాక ఏదో వరదరాజులంటున్నావు.

మా : అవును తల్లీ... అతను నా దగ్గర చదువుకున్నాడు. ప్రస్తుతం యిక్కడ జిల్లా జడ్జీగా ఉన్నాడు. అతని సంగతే మాట్లాడుతోంది.

సుం : ఆయన కొడుకు మా కాలేజీలో ఎం.ఏ. చదువుతున్నాడు. చాలా బ్రిలియంటు స్టూడెంటు. కాలేజీలో ప్రైజులన్నీ అతనివే.

శ్యా : నువ్వెళ్ళి చదువుకోరాదటే-

సుం : అలాగేనమ్మా.

శ్యా : ఏమండీ నాకు తెలియ కడుగుతున్నాను. మిగతా

యిద్దరు పిల్లలకీ పదిహేనో యేటనే పెళ్ళిచేశారుగదా- వీన్నింకా చదివిస్తున్నారేం.

మా : మా బాగా అడిగావు- చెప్పనా. యిదంతా నీ నిర్వాకమే. ఒక్క కొడుకుని కనలేకపోయావు. నిన్ను చేసుకునేటప్పుడే అనుకున్నాను. ఆ కుదుట్లోంచి వస్తోంది, వాళ్ళ ఆనవాయితే వస్తుందేమోనని. అలాగే అయింది. యింకా నయం. మీ అమ్మలాగ పన్నెండు మందిని కన్నావుగాదు. నా పుట మారిపోయేది.

శ్యా : ఎవళ్ళ వ్రాత వాళ్ళది. కొడుకుల్ని కన్నమ్మలందరూ కావాలంటేనే కలిగారా! వాళ్ళ వాళ్ళ అదృష్టం! నాకడుపునే ఒక నలుసుంటే మీరీమాటనరుగదా...

మా : పిచ్చిదానా- వేళాకోళానికంటే కంట తడి బెడ తావు జేనికి - అయినా అందులో నీతప్పేముంది... పోయి వంట సంగతి చూడు. నేనలా బయటికెళ్ళొస్తాను.

## 2 వ రంగం

శ్యా : ఈ రోజెళ్ళి పోయింది. తెల్లవారితే మళ్ళీ తడుముకోవాలి... హాయ్ శ్రీరామచంద్ర...

మా : అమ్మో...

శ్యా : అయ్యో: అదేమిటి వణికిపోతున్నారు జ్వరమొచ్చిందా ?

మా: ఏం ఫరవాలేదు. కొద్దిగా చలిగా ఉంది అంతే.

శ్యా : కంబళీ కప్పుతాను. పడుకోండి... సాయంత్రం అనవసరంగా ఉద్రేక పడ్డారు. అంతా నా తప్పే. నేను ఆవేశంలో తెలియక ఏమిటేమిటో అనేశాను. మీ మనసు నొప్పించాను.

మా : నిజం మాట్లాడావు. నీ తప్పేముంది. నా విద్యార్థుల మీద నా కచంచలమైన విశ్వాసం ఉంది.

శ్యా : ఈ కష్ట సమయంలో ఆ రామకృష్ణ మీమీద గౌరవముంచి ఈ యిల్లు అద్దె లేకుండా యిచ్చాడు. లేకపోతే మరీ నికృష్టంగా ఉండేది మన సంసారం—

మా : ఊఁ అమ్మయ్య. (మూలుగుతాడు)

శ్యా : ఉష్ణం చాలా ఎక్కువగా ఉన్నదండి. అమ్మాయి, సుందరీ !

సుం : ఏమిటమ్మా-

శ్యా : మీ నాన్నగారికి జ్వరమొచ్చిందమ్మా.

సుం : డాక్టరుని పిలుచుకురమ్మంటారా నాన్నా !

మా : అక్కరలేదు. చలిగా ఉంది. అదే తగ్గిపోతుంది... మీరు పోయి పడుకోండి............

సుం : అనవసరంగా ఏదో ఘర్షణ పడి ఉంటారు. నీకు తెలుసు గదటమ్మా ఆయనకు గుండె నొప్పి, జ్వరం వస్తాయని. పాతవన్నీ కెలుకుతావు. వాటివల్ల ఏం ప్రయోజనం లేదని తెలిసికూడా చేస్తావు.

శ్యా : అవునమ్మా- సాయంత్రం నీ పెళ్ళి గొడవ వచ్చిందమ్మా—

సుం : ఇప్పుడు నా పెళ్ళికేం తొందర. నాకీ జీవితంలో పెళ్ళే కాదనే ధోరణిలో మాట్లాడుతావు...ఛా...

## 3 వ రంగం

జవాను : ఏం కావాలయ్యా.

మా : మీ అయ్యగారితో మాధవరావు మాష్టారొచ్చారని చెప్పు.

జ : ఇప్పుడేం లాభం లేదు. అయ్యగా రెవరితోనో మాట్లాడుతున్నారు.

మా : చాలా దూరం నుంచి వచ్చాను. పెద్దవాణ్ణి. మళ్ళీ రాలేను. నువ్వొక్కసారి వెళ్ళి చెప్పిరా. ఆయన కాదంటే వెళ్ళిపోతాను.

జ : చెప్తుంటే నీకు కాదటయ్యా వెళ్ళమని...

మా : పూజారి అనుమతి లేందే దేవుడి దర్శనమవదంటారు. యిక్కడ నువ్వే అడ్డగిస్తే...

జ : ఏమిటయ్యో... మాటలు మా జోరుగా రానిస్తున్నావు. పొమ్మంటే నీలుగుతావెందుకు...

వరద : (లోపలనుంచి) ప్యూన్... ఎవరది... ఏమిటా గొడవ!

మా : వరదరాజులూ_ నేనే మాధవరావుని. నిన్ను చూద్దామని వచ్చాను. (గొంతెత్తి చెబుతాడు)

వర : మాధవరావు... ఏ మాధవరావు.

మా : నేనే... గుర్తు రావడంలేదూ ?

వర : ప్ర్యాన్......

(కారు హారన్ రెండు మూడు సార్లు వినిపిస్తుంది... సడెన్ బ్రేకు...)

ఒక గొంతు : ఎవరీ ముసలాడు...

## 4 వ రంగం

మా : నే నెక్కడున్నాను,

మోహన్ ; జడ్జి వరదరాజులు గారింట్లో.

సుం : అవును నాన్నా.

మా : నువ్వెలా వచ్చావమ్మా యిక్కడికి ?

సుం : ఉదయం మీరు స్పృహతప్పి పోయారని జడ్జిగారు కబురు పంపారు. వెంటనే అమ్మా, నేను వచ్చేశాము.

మా : ఈ యింటి గేటుముందు మాట్లాడుతున్నాను. వరదరాజులు కనుపించలేదు. నిస్పృహ చెందాను. ఇంతలో నల్లగా దెయ్యంలా ఏదో మీదకొస్తున్నట్లు కనిపించింది. కళ్ళు తిరిగినయ్. అంతే. తర్వాత ఏం జరిగిందో నాకు తెలియదు.

మో : ఆకారు డి. ఎస్. పి. రామారావు గారిది. ఆయనకూడా మీ శిష్యుడేనట. ఆయనే మిమ్మల్ని లోపలకు తీసుకొచ్చారు. సర్జను కుటుంబరావు గారొచ్చి మీకు యింజక్షనిచ్చి వెళ్ళారు.

మా : ఈ అబ్బాయెవరమ్మ, సుందరీ.

సుం : ఈయనే వరదరాజులుగా రబ్బాయి. మీతో చెప్పానుగమా కాలేజీలో ఎం. ఏ. చదువుతున్నారని.

మా : ఈమధ్య నే అనుకున్నాము నాయనా నీసంగతి.

వర : నమస్కారం మేష్టారు.

మా : ఎవరు, వరదరాజులు రా రా.

వర : లేవకండి. కదలకూడదు. విశ్రాంతిగా ఉండాలని డాక్టరు చెప్పాడు. డాక్టరు మనకుటుంబరావే. మాతో చదువుకున్నాడు.

మా : వాడా. కుటుంబాయి, మంచి పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్నాడు.

వర : మా జవానుకు తెలియక మిమ్మల్ని లోపలికి రానీయ లేదు. లేకపోతే ఈ ఆపద కలిగేదే కాదు. మీరు నన్ను క్షమించాలి.

మా : దానికేం లే......

వర : కోర్టుకు టైమవుతోంది. సాయంత్రం కలుసుకుంటాను.

మా : మధ్యాహ్నం నేను యింటికి వెడతాను.

వర : అదేం పనికిరాదు మాష్టారూ. మీరు స్వస్థత చేకూరే వరకు యిక్కడే ఉండాలి. మీకు కావలసిన ఏర్పాట్లన్నీ యింట్లో చేస్తారు.

మా : యిక్కడెందుకు నాయనా.

వర : ఏం ఫరవాలేదు... మరి నే వెళ్ళొస్తా.

## 5 వ రంగం.

మో : ఏయ్ పిల్లా, మాట యిలారా.

సుం : అమ్మా వాళ్ళు వింటారు. ఏమిటా పిలవడం.

మో : (వెక్కిరింపుగా) సుందరమ్మగారూ, యిటొకసారి దయచేస్తారా. (యిద్దరూ నవ్వుతారు) పార్టీకి టైమవుతోంది వచ్చే వాళ్ళను రిసీవు చేసుకోవాలి.

సుం : నేను సిద్ధంగానే ఉన్నాను.

మో : ఏమో యింకా అమ్మగారు డ్రెస్సు చేసుకోవా లేమోనని పిలిచాను.

సుం : నాకెందుకు డ్రెస్సింగు నేనేం జడ్జీగారి కూతురినా ?

మో : కూతురివి కాకపోతే కోడలివన్నా అవుతావుగా...

సుం : మీరు డ్రెస్సు చేసుకుంటే చాలు.

(కారు హారన్ మ్రోగుతుంది)

మో : ఎవరో వస్తున్నారు... పదపద... బారిష్టరు రంగనాథంగారు... వరసనే మూడు కార్లొస్తున్నాయ్యే...

సుందరీ వెళ్ళి నాన్నగారితో చెప్పు... ఈలోపుగా వాళ్ళందరినీ పైకి తీసుకెడతాను. రండి సార్...రండి.

ర : హల్లో రంగనాధం... రా రావోయి రామారావు. రామకృష్ణ వచ్చాడా... (ఒక గొంతు) వస్తున్నాడు... రండి డాక్టరుగారు.

అదుగో కలనల్ మనోహర్ కూడా వచ్చేశాడు. వచ్చేశాడు... కలన్... కమాన్... వెల్. మేక్ యువర్ సెల్ఫ కమ్ఫర్టబుల్... **(Make your self Comfortable)**

ర : మిత్రులారా, ఈరోజు చాలా సుదినము. మనమందరము కలుసుకోవడం జరిగింది. ఉద్యోగ ధర్మం వల్ల ఎవరి పనులలో వాళ్ళుంటారు. మన నందరినీ దగ్గరకు చేర్చింది మన మేష్టారు, వారిమీద మనకున్న వాత్స ల్యము. ప్రస్తుతం మనలో అందరూ పెద్ద హోదాలో ఉన్నవాళ్ళే. కాని మనందరికంటె కూడా గొప్పవ్యక్తి మన మాష్టారు. ఆయనకు డబ్బుండకపోవచ్చు. హోదాలుండకపోవచ్చు. అధికార ముండకపోవచ్చు. అయినా ఆయన మహాపురుషుడు. త్యాగధనుడు. మన ఈనాటి జౌన్నత్యానికి ముఖ్యకారణం ఆయనే అంటే అతిశయోక్తి కాదు. చిన్నతనంలో మనకు మంచి శిక్షణ యిచ్చారు. అది పునాదిగా పైకి రాగలిగాం. ఆవిషయం మనంధరికీ తెలుసు. మనలో కొంతమందిని ఆయన స్వంత బిడ్డలకంటే ఎక్కువగా ఆదరించారు.

. ఆయనకు ముఖ్యమైన శిష్యులమందరము ఈ వూళ్ళో ఉండడంచేత నేనీ సమావేశం ఏర్పాటుచేశాను. మీ అందరి తరఫున నేను ఆ మహనీయుడికి మన కృతజ్ఞత తెలియపరుస్తూ ఈ రెండు వేల రూపాయలు గురుదక్షిణగా సమర్పిస్తున్నాను. ఆయనకు చివరి రోజులలో మనం ఉపయోగ పడగలిగితే ధన్యులం.

(చప్పట్లు)

మరోవిషయం. మీ అందరికంటే ఎక్కువగా సహాయం పొందినవాణ్ణి నేను. ఏడెనిమిదేళ్ళపాటు ఆకుటుంబంలో ఒకడిగా మెలిగాను. అది నిజమైన సంబంధం చేయాలని నా కోరిక. మా అబ్బాయి మోహన్, మేష్టారి ఆఖరమ్మాయి కాలేజీ మేట్సట. వారిద్దరి వివాహానికి అంగీకరించమని మాధవరావు గారిని కోరుతున్నాను.

(హియర్, హియర్, వెల్ డన్, వెల్ డన్ అనే నినాదాలు)

మా : అంతకంటేనా వరదరాజులు. ఈ సమావేశం, ఈ గౌరవం చూస్తుంటే ఆనందంతో కన్నీళ్ళొస్తున్నాయి. బడిపంతుల్ని ఎంతవాణ్ణి చేశావు నాయనా......

మీరంతా యింత శ్రద్ధతో యిక్కడకు వచ్చి మీ ప్రేమను వెలిబుచ్చినందుకు మీ కెంతో కృతజ్ఞుణ్ణి. మిమ్మల్నందరినీ చూస్తుంటే కన్నుల పండువగా ఉన్నది. ఆరోజులు గుర్తుకొస్తున్నాయి. ఆనందం ఎక్కువవడంతో మాటలు తడబడుతున్నాయి... మీ అందరికీ నా ఆశీర్వాదములు. చిరంజీవులుగా వర్ధిల్లండి.

## 6 వ రంగం

శ్యా : ఏమండీ ఆ పర్సులో ఎంతుంది ?

మా : మనిద్దరి జీవితాలకి సరిపడినంత.

శ్యా : అబ్బ, చెపుదురూ,

మా : రెండు వేలు

శ్యా : అంతా మీ శిష్యులిచ్చినదే.

మా : అవునే, "అంతా పంగనామాలు పెట్టే రకం"

శ్యా : ఏం ఎత్తి పొడుస్తారండి.

సుం : (వస్తూ) నాన్నా, రండి కారు సిద్ధంగా ఉంది.

మా : ఓహో, జడ్జీగారి కోడలుకాబోలు_ ఎవరికమ్మా కారు ?

సుం : మనందరికీని _ యింటికి వెళ్ళడానికి.

మా : అమ్మా, సుందరిని వాళ్ళ మోహన్ కివ్వడం నా కిష్టంలేదు.

శ్యా : అయ్యో అదేమిటండీ అలా అంటారు ?

మా : అసలు దానికి పెళ్ళి చేయడమే నా కిష్టంలేదు.

శ్యా : పిలిచి పిల్లనడిగితే పెళ్ళి చేయనంటారేమిటండి ఖర్మ !

మా : ఎందుకో చెప్పనా ! దానికి పెళ్ళయిపోతే నువ్వు చింతగింజంత నల్లమందుతో మన బాధలన్నీ తొలగిస్తావేమోనని......

శ్యా : చాల్లెదురూ.

సుం : రండి నాన్నా......

(కారు బయలుదేరిన శబ్దం)

★

# శ్రీ బాలసరస్వతీ స్త్రీ సమాజము

## తణుకు.

కార్యనిర్వాహకవర్గము :

1. శ్రీమతి దేవులపల్లి సత్యవతమ్మగారు. అధ్యక్షులు.
2. ,, చేబ్రోలు సుభద్రమ్మగారు, ఉపాధ్యక్షులు
3. ,, పోతాప్రగడ బాలాత్రిపుర సుందరమ్మ గారు, కార్యదర్శిని.
4. ,, చోప్పెల్ల మహాలక్ష్మమ్మగారు, సహాయ కార్యదర్శిని.
5. ,, మంత్రిప్రగడ వరలక్ష్మమ్మగారు.
6. ,, తమిరిశ ప్రభావతమ్మగారు.
7. ,, ఇరగవరపు లక్ష్మీకాంతమ్మగారు.
8. శ్రీయుత పోతాప్రగడ శ్రీరామారావుగారు.
9. ,, చేబ్రోలు అన్నప్పగారు.
10. ,, ముళ్ళపూడి హరిశ్చంద్ర ప్రసాదరావుగారు.
11. ,, అయ్యగారి వీరేశ్వరరావు గారు.

ఆశయం :_ దేశసాంప్రదాయములు, ఆచారవ్యవహారములు, నేటి స్త్రీల దైనందిన జీవితావసరములతో సమన్వయపరచి విద్యార్థినులకు, సభ్యురాండ్రకు కూడ తగిన పరిపూర్ణమైన జీవన వికాశం కలగడానికి అవకాశం కలిగించడమే మా ఆదర్శం - ఆశయం.

సమాజచరిత్ర - గావిస్తున్నకృషి : - పూజ్య బాపూజీ, బాబూ రాజేంద్రప్రసాదులు ప్రసాదించిన ఆశీస్సుల ప్రభావము నందుకొని, దేశసేవ తత్పరులు, సేవాకార్య దక్షురాలు, శ్రీమతి దేవులపల్లి సత్యవతమ్మగారి ఆధ్వర్యమున తణుకు నగర మాహిళామణులు కొందరు 1932 సం॥లో చిన్న గ్రంథాలయ మొకటి స్థాపించిరి. నాటి తహశీలుదారు శ్రీ ఇంటూరి కోటయ్యనాయుడిగారి సతీమణి, శ్రీమతి ప్రేమావతమ్మగారు తమ పుత్రికారత్నమగు శ్రీ బాలసరస్వతి స్మృతిచిహ్నముగ భూరివిరాళ మొసగి ఈ సంస్థకు శాశ్వత రూపమిచ్చుటకు కారణభూతులగుటచే దీనికి "శ్రీ బాలసరస్వతీ స్త్రీ సమాజము" అను నామకరణము చేయబడినది. ఈ సమాజస్థాపకురాలైన శ్రీమతి ప్రేమావతమ్మగారికి, దీనికి శాశ్వతరూప మిచ్చుటలో సర్వవిధముల తోడ్పడిన శ్రీ అంకరాజుగారికి, ఈ సంస్థ యెంతయో ఋణపడి యున్నది.

శ్రీ జవ్వాది లక్ష్మయ్యనాయుడుగారు తమ ధర్మపత్ని ఆదిలక్ష్మమ్మగారి స్మృతి చిహ్నముగ సాహిత్య భవన నిర్మాణమునకు వలయు భూరి విరాళము నొసగి ఆర్థికముగ అనేక రూపముల తోడ్పడిరి. ఈ భవనమునందు గ్రంథాలయము నడప బడుచున్నది. దీనియందు సుమారు 4000 గ్రంథముల వరకు గలవు. ఈ గ్రంథములతో పాటు దైనిక, సాప్తాహిక పాక్షిక, మాసిక, పత్రికలు తెప్పించుచున్నారు. ఈ పుస్తక భాండాగారమింకను దినదినాభి వృద్ధినొంది మహిళా లోకమున ఇతోధిక విద్యావ్యాప్తికై తోడ్పడుటకు పరిసరగ్రామములందు కూడ గ్రంథముల నందచేయు సంచార గ్రంథాలయముగ నడిపించు కార్యక్రమమునకై పూనుకొన ప్రయత్నిస్తున్నాము.

సమాజ కార్యనిర్వాహకవర్గ శాశ్వత సభ్యులు శ్రీ పోతాప్రగడ అంకరాజుగారు, వారి సతీమణి సమాజ కార్యదర్శిని శ్రీమతి బాలాత్రిపుర సుందరమ్మగారు ఉచిత హోమియోపతి వైద్యశాలకు భవన దానము చేసిరి. శ్రీ ద్వారంపూడి బసివిరెడ్డిగారు ఈ భవన స్థలమును ప్రసాదించిరి. సమాజ కార్య నిర్వాహకవర్గ శాశ్వత సభ్యులు శ్రీ పోతాప్రగడ శ్రీ రామారావుగారు గత పదిహేను సంవత్సరములనుండి ప్రతి సంవత్సరము సుమారు 20 వేలవరకు స్త్రీల_బిడ్డల, వయోవృద్ధుల జీర్ణతరుణ వ్యాధుల నివారణకు ఉచితవైద్య సహాయము చేయుచున్నారు. రాష్ట్ర సంక్షేమ సంఘం (Provincial welfare committee) వారు రు 500_0_0 లు, శ్రీమతి జుజ్జువరపు కన్యారత్నమ్మగారు, రు 200_0_0 లు విరాళమిచ్చి ఈ వైద్యశాల పురోభివృద్ధికి సహాయపడిరి. కేంద్ర సాంఘిక సంక్షేమ సంఘంవారి విరాళ సహాయముతో ఈ వైద్యశాలను దినమంతయు పనిచేయునదిగను, రోగులకు బెడ్సు ఏర్పాట్లుకలిగినదిగను చేయుటకై కృషి సల్పుచున్నాము.

## సేవాసంస్థలు

# శ్రీ బాలసరస్వతీ స్త్రీ సమాజము.

ప్రస్తుతము స్థలాభావముచేత గాంధీ ప్రణాళిక ప్రకారము నవీనవిద్య గరపు పాఠశాలను ఈ వైద్యశాల భవనములో నడపవలసి వచ్చుచున్నది. దీనికి ప్రభుత్వమువారు 400 చ॥ గ॥ ల ప్రత్యేక స్థలమును మంజూరు చేసియున్నారు. ఈ భవన నిర్మాణమునకై పశ్చిమగోదావరి జిల్లా కలెక్టరు శ్రీ జి. సింహాద్రి బి. యే. గారు శంకుస్థాపన చేసిరి. అదే సందర్భమున వారు బాలానంద శాఖకు ప్రారంభోత్సవము చేసి దానికి తమ డిస్ క్రీషనరీ గ్రాంటు నుండి 300 లు విరాళమిచ్చి రేడియో కొనుటకు సహాయపడిరి. దీనితోను శ్రీ నిడదవోలు మృత్యుంజయరావు గారి సహాయముతో ఒక రేడియోసెట్టు సంపాదించ గలిగితిమి. నవీన పాఠశాలయందు 5 వర్గములలో 100 మంది బాలబాలికలు ముగ్గురు ఉపాధ్యాయులు, బేసిక్ విద్యావిధానము ననుసరించి విద్య గరపుచున్నారు. ఇదే ప్రకారముగ నవీన విద్యా పాఠ్యప్రణాళిక ననుసరించి 7 వ వర్గము వరకు దీనియందు నడుపుకొన వచ్చును. దీని పురోభివృద్ధికి భవన నిర్మాణమునకు ధనసహాయ మింకను కావలసి యున్నది.

ఆంధ్ర మహిళాసభ విద్యార్థినుల నృత్య ప్రదర్శన సహాయముతో ఒక గదియున్ను, శ్రీ కడియాల సుబ్బారావు ధర్మపత్ని శ్రీమతి సరస్వతమ్మగారి సహాయముతో అతిథి గృహము నిర్మించ గలిగితిమి.

1950 సం॥లో టంగుటూరి సూర్యకుమారిగారు పాట కచ్చేరి జరిపి సహాయముచేసిన రు 5641 లతో ఫిర్కా డెవలప్ మెంటువారు గ్రాంటు చేసిన రు 2000 లతో సంస్కృత పాఠశాలా భవనము నిర్మించ గలిగితిమి.

సమాజ కార్యక్రమ నిర్వహణమునకు, భవనముల మరమ్మత్తులకు ధన సేకరణకై తమ నృత్య, గాన, నటనా, ప్రావీణ్యముద్వారా తోడ్పడి సమాజ బాలికలకు నృత్యము నందు శిక్షణ యిచ్చిన శ్రీమతి ముడుంబి సీతమ్మగారూ వారి పుత్రికామణులగు భానుమతి, భాస్కరంగారలూ నరసాపురం నవ్యకళా నాట్యమండలివారూ తదితరులుకలరు. తమ ఐ. సి, ఐ. [I. C. I.] కంపెనీ సిబ్బంది ద్వారా సమాజ పురోభివృద్ధికి కృషి సల్పిన శ్రీ పోతాప్రగడ అంకరాజు గారికి, తమ ధర్మపత్ని శ్రీమతి బాలాత్రిపుర సుందరమ్మగారి పేర రు 500 లు విరాళమిచ్చి తోడ్పడిన శ్రీ తాడినాడ సుబ్రహ్మణ్యంగారికి ఈ సమాజ భవనము లన్నిటి యందు విద్యుద్దీపములు వేయించుటకు వలయు ఆర్థిక సహాయముచేసిన శ్రీ చిట్టూరి ఇంద్రయ్యగారికిని, సమాజ శాశ్వత సభ్యులైన శ్రీ వేగేసిన కనకదుర్గ సత్యనారాయణ రాజుగారకిని, సమాజ కార్యనిర్వహణమునకు పలువిధముల అర్థిక సహాయము చేసిన శ్రీ తుమ్మలపల్లి సత్యనారాయణ, వీరభద్రరావుగార్లకు మాహృదయపూర్వక అభివందనములు. ఇంకను ఎందరెందరో పెద్దలు మహిళామణులు మాకు అనేక విధముల సహాయపడిరి; వారందరిని ఉదహరించుటకు ఇటు సాధ్యముకాదు. సంస్కృతాంధ్ర భాషలను విద్యార్థినులకు ప్రధానముగా నేర్పుటకు ఈ సమాజ ఆధ్వర్యమున ఓరియంటల్ పాఠశాల నెలకొల్ప పడినది. హిందీభాషగూడ ప్రచారము చేసి, విద్యార్థినులను పరీక్షలకుపంపు ఏర్పాట్లు చేయబడినవి. సంగీతము, చిత్రకళ, నృత్యము మొదలగు లలిత కళలు నేర్పుటకై తగిన ఏర్పాట్లు చేయబడినవి.

ఈ సంస్థవారిచే నడపబడుచున్న సంస్కృత పాఠశాల ప్రభుత్వము వారిచే ఓరియంటల్ సెకండరీ స్కూలుగా రికగ్నైజు చేయబడింది. హైస్కూలు పాఠ్య ప్రణాళిక ననుసరించి శిక్షణ ఇవ్వబడుచున్నది. కాని సంస్కృతాంధ్ర భాషలకు మాత్రము ప్రముఖస్థానము కలుగ జేయబడినది. హైస్కూలులో చెల్లించ వలసిన జీతములలో సగముతోనే విద్యార్థినులు ఇక్కడ విద్య నభ్యసించుటకు అవకాశములు కల్పించ బడినవి. ఎన్. జి. ఓ. ల పిల్లలకు, ఉపాధ్యాయుల పిల్లలకు ఉచితముగ విద్య నేర్పబడును. ఒకటి రెండు మూడు ఫారము క్లాసులకు సక్రమముగా జరుపుటకు సంస్కృత, ఆంధ్ర, హిందీ, ఆంగ్ల భాషలను, సంగీతము, సామాన్య విజ్ఞాన విషయములను బోధించుటకై సమర్థులగు 5 గురు ఉపాధ్యాయులను నియమించి ఏర్పాట్లు చేసినాము జాతి, మత, వర్ణ వివక్షతలేకుండ హరిజన, క్రైస్తవ, మహమ్మదీయ, హిందూ బాలికలు సుమారు 70 మందివరకు ఇందు విద్యాభ్యాస మొనర్చుచున్నారు. అచిరకాలములో నాలుగు అయిదు, ఆరు, ఫారములు ఏర్పాటు చేయుటకు అటు పిమ్మట ప్రాచ్యవిద్యాకళాశాలగ దీనిని రూపొందించుటకు, వాటికి తగిన భవన వసతి, వసతిగృహము కల్పించుటకు, సహాయ మపేక్షించుచున్నాము.

# శ్రీ బాలసరస్వతీ స్త్రీ సమాజము.

హిందీ సంగీత క్లాసులను ప్రయివేటుగా జరిపించుచున్నాము. హిందీ ప్రాథమిక పరీక్షనుండి విశారద పరీక్ష వరకును, సంగీతం లోయరు, హైయరుగ్రేడు పరీక్షలకు శిక్షణ ఇవ్వబడుచున్నది.

ఈ సంస్థ వారిమణులకు తమ విద్యుక్తధర్మములందు అచంచల విశ్వాసము కలుగజేయుటకు సనాతన అధునాతన సాంప్రదాయములను దేశకాలానుగుణ్యముగ సమన్వయ పరచి వారిని ఉన్నత పథములలో తమ జీవిత యాత్రను గడుపుకొనుటకై ప్రోత్సహించుటకు ప్రతివారము భజనలు, అనుభవజ్ఞులగు పెద్దల ఉపన్యాసములు, దశరా సంక్రాంతి మున్నగు ఉత్సవములు జరిపించుచున్నది.

అర్థాభావముచే తాపత్రయములుపడుచున్న మధ్యతరగతి స్త్రీలకు, అనాథలు, అసహాయులయిన సోదరీమణులకు జీవనాధారము కలిగించుటకు ఒక పారిశ్రామిక భవన నిర్మాణము చేయుటకు సంకల్పించితిమి. కుటీర పరిశ్రమలు, చిన్న చిన్న గ్రామ పరిశ్రమలు విద్యుశ్ఛక్తి సహాయముతో నడుపుచు పై లక్ష్య సిద్ధికి కృషి చేయదలచితిమి. ఈ కార్యక్రమమునకు స్థల భవన, పరికర సేకరణకై సుమారు రు 50,000 లు వ్యయమగునని అంచనా వేసియున్నాము.

అకుంఠిత దేశసేవా దీక్షాపరతంత్రురాలగు శ్రీమతి దుర్గాబాయి దేశ్ ముఖ్ గారి అధ్యక్షతను పనిచేయుచున్న కేంద్ర సంక్షేమ సంఘంవారు ఈ సంస్థచే నడుపబడుచున్న సమాజ సేవాకార్యక్రమ విస్తరణకు, అనాథబాలికా పోషణకు 1954 సం॥ రు 10,000 లు గ్రాంటు నిచ్చియున్నారు. దీనికితోడు ఇంకను రు 10,000 రాష్ట్ర ప్రభుత్వమునుండి, స్థానికసంస్థలనుండి, ప్రజలనుండి, విరాళ రూపమున సేకరించి వెచ్చించవలసి యున్నది.

ఈ సంక్షేమసంఘ శాఖా కార్యక్రమాలతో రాట్నపరిశ్రమ, కుట్టుపని, టైపు, టెలిగ్రాఫీ మొదలగునవి నేర్పుటకై ఏర్పాట్లు చేయబడినవి.

ఈ సంస్థకు ఇంతవరకు మొత్తము రు 50, 000-0-0లు విలువగల భవనములు, తదితర సాధనమును సంపాదించ గలిగితిమి. ఈ సమాజమున జరుగుచున్న వివిధ కార్యక్రమముల నడిపించుటకు నెలకు సుమారు రు 1, 000-0-0 లు వరకు ఖర్చు అగుచున్నది. అంతియేగాక ఈ సంస్థచే యివ్వబడుచున్న వివిధ విషయముల శిక్షణను పొందుటకు పరిసర గ్రామముల నుండి వచ్చిన విద్యార్థినుల సౌకర్యమునిమిత్తమై ఒక వసతి గృహము నిర్మించుటకు తగుసహాయమును మాపేక్షించుచుంటిమి. జాతీయాదర్శ ఆశయములతో పూజ్య బాపూజీకి అత్యంత ప్రియమైన నిర్మాణ కార్యక్రమమును యథాశక్తితో ఆచరించుచు, పాశ్చాత్య పరిపాలన ఆశనిపాతములకు కృంగిపోక, జాతీయకార్య క్రమముల నాచరణలో పెట్టుచు స్త్రీల సాంఘిక, ఆర్థిక, ధార్మిక, వైజ్ఞానికాభివృద్ధికి తోడ్పడుచు నాటి బాలసరస్వతి బాలారిష్టములు దాటి ప్రౌఢయై 1954 సం॥లో 21 వ వార్షికోత్సవము జరుపుకొన కలిగినది.



# ప్రేమచిత్రి

మూలం : వినోదశంకర్ వ్యాస్ — అనువాదం : కుమారి ఎమ్. మంగతాయారు.

డాక్టరుగారు ఉన్నారా ? అని మురళీధర్ కేకవేశాడు.

ఇప్పుడే వీధిలోకి వెళ్ళారు. అని డాక్టరుగారి అమ్మాయి కిశోరి జవాబు చెప్పింది.

మురళి చూస్తున్నాడు. అతనికి మనస్సులో ఇంకేమైనా ప్రశ్న వేయాలని కోరిక కలిగింది. ఎంతసేపటికి వస్తారు ? అని మళ్ళీ అడిగాడు.

సరిగ్గా తెలియదు ఏం పని.... ?

మా అన్నయ్యకు జ్వరం వచ్చింది. ఆయనను తీసుక వచ్చి చూపిద్దామని....

మీరు మీ ఎడ్రస్సు రాసివ్వండి. వచ్చాక ఆయనకు యిస్తాను.

మురళి ఒక కాగితం మీద తన యడ్రసు రాసి కిశోరి చేతికిస్తూ— మర్చిపోరు గదా....? అన్నాడు.

ఉహూ.... అంటూ కిశోరి ఇంట్లోకి వెళ్ళిపోయింది.

మురళి దోవ పొడుగునా కిశోరిని తలుచుకుంటూ ఇల్లు చేరుకున్నాడు. సాయంకాలం డాక్టరుగారు వెళ్ళి రోగిని చూచి మందిచ్చారు.

మురళి రోజూ రోగి పరిస్థితి చెప్పి మందు తేవటానికి డాక్టరుగారి దగ్గరకు వెళుతున్నాడు.

కొద్దిరోజుల్లో డాక్టరుగారితో బాగా చనువు ఏర్పడి పోయింది. ఆయన మందువల్ల మురళీ అన్నయ్యకు తొందరగా నయమైపోయింది. కాని కిశోరిని చూడాలని మురళీకి ఒక క్రొత్త రోగం పుట్టింది. తరచుగా ఏదో ఒక పని కోసమై మురళి డాక్టరుగారిదగ్గరకు వెడుతూండేవాడు.

పరిచయం ముదిరిన తరవాత డాక్టరుగారు తమ సజాతీయులే అన్న సంగతి మురళికి తెలిసింది, సభ్య సమాజంలో ఉండబట్టి డాక్టరుగారి ఆచారాల్లో చాల తేడా ఉంది. ఆయనకు ఘోషా మొదలైన భేషజాలేమీలేవు.

మురళితో ఒక రోజు మాట్లాడిన పిదప డాక్టరుగారు తమకి వాళ్ళకి ఏదో దూరపు బంధుత్వం ఉన్నట్లు తెలుసు కున్నారు. అందువల్ల ఎప్పుడైనా మురళీ వాళ్ళింట్లో ఎవరికైనా జబ్బు అది చేసినా డాక్టరుగారు ఫీజు పుచ్చు కోవడం మానేశారు.

అప్పుడప్పుడు కిశోరి మురళీలకు కూడ సంభాషణ జరుగుతూండేది. మురళీని చూసి కిశోరి వాళ్ళ అమ్మ భవిష్యత్తును గురించి కల్పనలు చేయసాగింది.

పనిపాటలు ఉన్నప్పుడు కిశోరి- వాళ్ళ అమ్మ మురళీ వాళ్ళ ఇంటికి వెళ్ళడం- వాళ్ళు వీళ్ళయింటికి రావడం జరుగుతూండేది. పరస్పరం బంధుత్వం ఏర్పడింది. మురళియొక్క- ప్రేమయే దీనంతటికీ మూలకారణం.

౨

వసంతము- వాడిపోయిన చెట్లను ఓదార్చుతూంది. ఆరోజు మురళీ పుట్టినరోజు పండుగ. మిత్రులూ, బంధు వులు అంతా వచ్చారు. కిశోరి కూడ తల్లితో పచ్చనిరంగు చీరె కట్టుకొని వచ్చింది. మురళీ కిశోరి- వాళ్ళమ్మకి స్వాగతం యిస్తూ- మీరు పైకి మేడమీదకి వెళ్ళండి, అన్నాడు. కిశోరి నెమ్మదిగా- ఇవాళ మీ పుట్టినరోజా ? అని అడిగింది.

అవును. ఇవాళ నేను ఇరవై అయిదేళ్ళవాడినయాను.

కిశోరి చిరునవ్వు నవ్వుతూ తల్లితో కలసి మేడమీదకి వెళ్ళింది.

ఆరోజే మురళీ తన ఫోటో ఒకటి డాక్టరుగారికి ప్రజంటు చేశాడు, ఎందుకంటే అప్పుడప్పుడు కిశోరి దాన్ని తన గదిలో చూస్తూండుగాక, అని దాని అభిప్రాయము.

* * *

డాక్టరు శ్యామ్ స్వరూప్ విద్యాభిలాషి. ఆయన కిశోరిని లేడీ సర్జన్ వరకు చదివించాలని నిశ్చయించుకున్నాడు. ఆయనకు బాల్య వివాహాలంటే పరమ ద్వేషము. కిశోరి 16 ఏళ్ళదైంది. కాని ఇంతవరకు గర్ల్సు స్కూలు చదువే సాగుతూంది, చదువుతూన్నది.

మురళీ కూడ చాల విశేషము ప్రజ్ఞా గల యువకుడు. అతడు ఎమ్. ఏ. చదువుతున్నాడు.

రోజు రోజుకి మురళీ కిశోరీల ప్రణయము గాఢము కాసాగింది.

ఒకరోజు మురళీ కిశోరీ దగ్గరకు వెళ్ళాడు. కిశోరి చదువుకుంటూంది. కిశోరి గదిలోకి వెడుతూ- కిశోరీ! ఏం చేస్తున్నావు? అని అడిగాడు.

ఏం లేదు. ఊరికే పుస్తకం చూస్తున్నాను. బహుకాల దర్శనం....

కిశోరీ, ఇప్పుడే బాగుండటంలేదు. చాల నీరసంగా రోజు గడుస్తూంది.

ఎందువల్ల?

తెలీదు.

మాటల్ని మారుస్తూ కిశోరి ఎల్లుండి హోళీ మీరు వస్తారుకదూ? అన్నది.

ఎందుకు? రంగు కొడతావా?

ఊహు. ఊరికేనే వద్దురూ. పండగగా—?

సరే, వస్తాను.

౩

సన్నాయియొక్క మధుర స్వరంలో మనోహరమైన హోలి పాట మొదలైంది. కొందరు డప్పులు వాయిస్తూ హోళీ పాడుతున్నారు. కొందరు తమ కర్కశ కంఠాలతో కేకాకోళాలు చేసుకుంటూ హృదయంలోని ఉల్లాసాన్నంతా వెలిబుచ్చుతున్నారు. అందువల్లనే ప్రజలు హోళీ అన్నారు.

మురళీ చక్కని మఖ్మల్ షర్టు వేసుకుని కిశోరి దగ్గరకు వెళ్ళాడు. దూరంనుంచే మురళీ రావటం చూసి కిశోరి ఒక గ్లాసెడు కుంకపు నీళ్ళు కుమ్మరించింది. మురళీ గాభరాపడి పైకి చూడటం మొదలు పెట్టాడు. ఏదో అందామనే అనుకున్నాడు. కాని ఏమీ అనలేకపోయాడు. డాక్టరు గారికి ఇవాళ గూడ తీరిక లేదు. ఆయన ఎవరో రోగిని చూడటానికి వెళ్ళారు. మురళీ ముఖం చిట్లించుకుని— కిశోరీ ఏమిటీ అన్యాయం? అన్నాడు. కాని కిశోరి కళ్ళల్లోని చిలిపితనం. పెదవిపైని చిరునవ్వు— కాదు, ఇది అన్యాయం కాదు, అన్నాయి.

కిశోరీ! అదేం పనే? పగటిపూటగాని సాయంకాలం పూట ఎవరైనా రంగు కొడతారటే? అంటూ కిశోరి వాళ్ళ అమ్మ మురళీకి ఫలహారం తేవటానికి వెళ్ళింది.

కిశోరి బుక్కాయి పొట్లం చేతిలో పుచ్చుకుని మురళీకి ఎదురుగా నిలబడ్డది.

చేతిలో ఏమిటి? అన్నాడు మురళీ.

బుక్కాయి.

గోరుచుట్టుమీద రోకలి పోటంటారు దీన్నే.

అట్లా ఎందుకంటారు?

అట్లాగైతే నువ్వు నా తరపున నీ చేతులతో ఆ బుక్కాయికాస్త ముఖానికిపూసుకో. అన్నాడు చిరునవ్వుతో మురళీ.

అప్పుడే కిశోరి వాళ్ళ అమ్మ మురళీకి ఫలహారం తీసుకొచ్చి పెట్టింది. ఇద్దరూ ఏమీ ఎరగని పసికూనల్లాగా ముఖాల్ని పెట్టారు. ఎంతో అమాయకులనిపిస్తుంది. తినిన తరవాత కొంతసేపటికి మురళీ వెళ్ళిపోయాడు.

ఎట్టి పరిస్థితిలో ప్రేమ కోసమై జనం తమ సర్వస్వాన్నీ చివరకు ప్రాణాన్నిగూడ అర్పించేటందుకు సాహసిస్తారో.... ఆ యుగం ప్రారంభమైంది.

మురళీ కిశోరు లిద్దరూ ప్రణయ నిట్టూర్పులు వదలసాగారు.

కిశోరి, మురళీ ఎదుట ఎప్పుడూ తన హృదయంలోని భావాలను ప్రకటించలేకపోతోంది. అందువల్ల అప్పుడప్పుడు ఉత్తరాలద్వారా తన హృదయంలోని గూఢ భావాలను వ్యక్త పరుస్తూంది.

చాలా రోజులు గడిచిపోయాయ్. డాక్టర్ శ్యామ్ స్వరూప్‌కు అలహాబాద్ ఆస్పత్రికి బదిలీ అయింది. వాళ్ళు అక్కడికి వెళ్ళిపోయారు. మురళీకి అప్పుడప్పుడు కిశోరీ దగ్గరనుంచి ఉత్తరం వస్తూవుంది.

ఈయేడు మళ్ళీ హోళీ పండుగ వచ్చింది. మురళీ దీనంగా తనగదిలో కూర్చున్నాడు. పోస్టులో కిశోరి దగ్గరనుంచి ఒక ఉత్తరం వచ్చింది. అందులో బుక్కాయి పొట్లంగూడ ఒకటి ఉంది. ఉత్తరంలో— దీన్ని మీరు మీ చేతులతో తప్పకుండా పూసుకోవలసింది. అని ఉన్నది.

మురళీ ఆలోచనా ప్రపంచంలో ప్రయాణం చేయటం మొదలెట్టాడు. అతను ప్రేమ పూర్వకంగా నుదుటిమీద

బుక్కాయి పెట్టుకుంటూ—— మనస్సులో— అహా! ఆ రోజులు ఎంత హాయిగా ఉండేవి? అనుకున్నాడు.

కిశోరి తన ఉత్తరంలో నేనిప్పుడు డాక్టరు పరీక్షకు వెళ్ళబోతున్నాని గూడ వ్రాసింది.

మురళీ గూడ ఎమ్.ఏ. ప్యాసైనాడు. కాని రోజులు మారిపోతున్నాయి.

౪

అనేక మాసాలు గడిచిపోయినయ్. అకస్మాత్తుగా కిశోరి దగ్గరనుంచి వాళ్ళ నాన్న చనిపోయినట్లు ఉత్తరం వచ్చింది.

మురళీ ఒక్కసారిగా శోక విభ్రాంతుడై ఉలిక్కి పడ్డాడు. అతడు తక్షణము అక్కడికి వెడదామనుకున్నాడు. కాని కాలేజిలో అప్పుడే కొత్తగా ప్రొఫెసరీ లభించింది. మొదట్లో సెలవంటూ దొరకటం అసంభవం. అందువల్ల తన కోర్కెను నెరవేర్చుకోలేక పోయినాడు.

మురళీధర్ యిప్పుడు ఇంగ్లీషు ప్రొఫెసరు అయినాడు. విద్యావంతుల్లో అతడు మంచి పేరు ప్రతిష్ఠలు ఉన్నవాడు.

ఒకరోజు మురళికి ఒక మిత్రుడి దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. దాంట్లో—— ఒకానొకప్పుడు నువ్వు కిశోరిని గొప్పగా పొగిడేస్తుండే వాడివి. కాని యిప్పుడదంతా మారింది. ఇప్పుడామెలో చాల మార్పు వచ్చేసింది. వాళ్ళ నాన్న పోయి రెండు మాసాలు గూడ కాలేదు. కాని ఆమె స్వేచ్ఛగా ప్రవర్తిస్తోంది. ఎన్నో తుమ్మెదలు ఆ గులాబి పువ్వు చుట్టూ తిరుగుతున్నాయి. నీ అభిమానమంతా ఆమె మీదేనా అని!

మురళికి ఇదేమాత్రం అర్థంకాలేదు. అతడు కిశోరికి ఈ సంగతంతా తెలియజేస్తూ జవాబు వ్రాయవలసిందని కోరుతూ ఉత్తరం వ్రాశాడు. కాని కిశోరి ఏమీ జవాబివ్వలేదు. మురళి చాల ఉత్తరాలు వ్రాశాడు. కాని ఒక్కదానికి కూడ జవాబు లేదు. చివరికి విధిలేక మురళికి కిశోరి ప్రవర్తనపట్ల అనుమానం పడవలసివచ్చింది. మెల్ల మెల్లగా ప్రేమ మీద నిర్లక్ష్యం ఏర్పడింది.

ఏడాది తర్వాత మళ్ళీ హోళీ వచ్చింది.

ఈసారి కిశోరి దగ్గరనుంచి ఉత్తరం లేదు. బుక్కాయి లేదు. మొదట్లోని ప్రణయ వాక్కులు మురళి హృదయాన్ని కలిచివేయటం మొదలెట్టాయి. చాల విచారపడ్డాడు. మురళికి ఈ హోళీ నిర్జీవంగా ఉన్నది. కిశోరిలో అకస్మాత్తుగా కలిగిన ఈ మార్పుకి మురళికి చాల ఆశ్చర్యం కలిగింది. "మీకొరకు.........చాల వేదనగా ఉన్నది. రోజులు బరువెక్కుతున్నయ్" వగైరా రాస్తూండే కిశోరి ఆరోజులు లెక్కడికిపోయినయ్. అని అతడు మనసులో చాల బాధపడటం మొదలెట్టాడు. ఒక్కసారి ఎట్లా మర్చిపోయింది? ఆహా! మానవలీల!

కిశోరి నన్ను ఒక్కసారిగా మర్చిపోయింది. ఆమెకు నా ధ్యాసే లేదు. ఎవరో నిజంగా సత్యమే చెప్పాడు. "స్త్రీలను కలలో గూడ నమ్మవద్ద"న్నాడు. నిజమే. వీళ్ళ ప్రేమ చాల విచిత్రంగా ఉంటుంది.

కొంతసేపైన తరువాత మురళి తన అలమారులో నుంచి కిశోరి వ్రాసిన పాత ఉత్తరాలన్ని తీసి తదేక ధ్యానంతో చదవటం ఆరంభించాడు. అన్ని సంగతులు తలపుకి రావటం మొదలెట్టాయ్. నిన్న జరిగినట్లుగా అనిపిస్తూంది. కాని చాల ఏళ్ళు గడిచిపోయినయ్. కిశోరి అంటే అతడికి అపరిమితమైన ద్వేషం పుట్టుకొచ్చింది. ఇప్పుడు తన పాపిష్టి కళ్ళతో కూడ (ఆమెను) చూడలేకుండా ఉన్నాడు. ఇంట్లోంచి నౌకరు వచ్చి అయ్యగారూ! హోళీ మండుతూంది. పూజకు పదండి. అన్నాడు.

మురళి కోపంగా—— ఇప్పుడేం కాదు. తరవాత వస్తానన్నాడు. కిటికీలోనుంచి చూస్తే హోళీ మండుతోంది. వెంటనే బరువైన విచారంనుంచి వేరైనాడు. అతడి మనస్సులో ఒక భావన చెలరేగింది. కిశోరి వ్రాసిన ఉత్తరాలన్నిటిని ప్రోగుచేసి చింపటం మొదలెట్టాడు. ఈ ఉత్తరాలే ఒకానొకప్పుడు జీవిత సర్వస్వమున్నూ. కాని ఈనాడు వీటికి విలువ లేదు.

"సమయం సంగీతంలోని మధురమైన తానం లాగా మనోహరంగా స్ఫురించి మాయమై పోతుంది"

మురళీ ఉత్తరాలన్ని చించి నిప్పంటించాడు. అప్పటికీ అతడికి తృప్తి కలగలేదు. ఇంతవరకు అతడికి ఎదురుగుండా కిశోరి ఫొటో ఉన్నది. మండుతున్న ఉత్తరాల మధ్య ఫొటోను పెడుతూ.... ఇవాళ నేను నా ప్రేమను చితిలో దగ్ధం చేస్తున్నానన్నాడు. అని అతడు ఒక నిట్టూర్పు విడిచి ఆకాశం వైపు చూశాడు.

ఆకాశమంతా హోళీ జ్వాలలతో ఎర్రబారిపోయింది. అతడి హృదయంలోని బరువు తేలికపడింది. అదే సమయంలో మురళి ఎప్పటికి స్త్రీని ప్రేమించనని ప్రతిజ్ఞ చేశాడు.

చూస్తూ చూస్తూండగా చాల నెలలు గడిచిపోయినయ్. ప్రొఫెసర్ మురళీధర్ తన గదిలో కూర్చుని పేపరు చదువుకుంటున్నాడు. ఆరోజు ఆదివారము. కాలేజీకి సెలవు. ఎవరో వస్తున్న చప్పుడైంది. చూడటం మొదలెట్టాడు. క్షణంలో- కిశోరి వచ్చి ఎదట నిలబడి ఉండటం చూచాడు. హృదయం తక్ తక్ లాడింది. కిశోరి నడవడికి విస్తుపోయి చూడసాగాడు. కిశోరి నమస్కారం చేసింది. ఇద్దరూ ఒకళ్ళ నొకళ్ళు చూస్తూ ఉండిపోయారు. మురళి కిశోరిని కూర్చోమన్నాడు. కిశోరి కూర్చున్నది. ఒకరోజు నౌకర్ని పంపి నేను యిక్కడకు వచ్చానని తెలియ జేశాను. కాని తమరు దర్శనభాగ్యం కలుగ జేయలా. అందువల్ల విధిలేక స్వయంగా నేనే వచ్చా నన్నది.

నేను నీనుంచి దూరంగా ఉండాలనుకుంటున్నాను.

కాని నాకు మీయందు ఆ భావమే ఉన్నది.

కాని నీ ప్రణయ స్వరూపము నాకళ్ళ ఎదటనుంచి ఎప్పటికి మాయమైపోయింది. ఇప్పుడు నీలో ఆ నిర్దుష్ట మైన సౌందర్యం లేదు. ఇప్పటి నీలో చాల వ్యత్యాసం ఉన్నది. నేను ప్రేమని ద్వేషిస్తున్నాను. నేను నా ప్రేమని చితిలో దగ్ధం చేసేశాను. అన్నాడు.

కిశోరి నిరుత్తరియై వెళ్ళిపోయింది.



# బాలానందం

## ‘కారల్ స్ప్రింజల్’

* శ్రీ అడివి కనకరాజు *

దక్షిణ జర్మనీ దేశంలో కారల్ స్ప్రింజల్ అనే బాల వీరుడి పేరెప్పుడూ స్మరిస్తూనే ఉంటారు. అతడు చేసిన త్యాగమే దీనికి కారణం.

కారల్ తండ్రి విల్హెలిమ్. అతడొక పెద్ద లోయపై నిర్మింపబడిన రైల్వే వంతెనకి కాపలాదారుగా ఉండేవాడు. ఇది 1867 వ సంవత్సరంలో జరిగిన సంఘటన.

కారల్ స్ప్రింజల్ మామూలుగా రాత్రి 9 గం॥లకు తండ్రికి భోజనం తీసుకు వెళ్తున్నాడు. క్షణంలో ఉరుములూ, మెరుపులతో బ్రహ్మాండమైన గాలివాన ప్రారంభమైంది. అంతా కారు చీకట్లు కమ్మేశాయి. కారల్ స్ప్రింజల్‌కు ఒక కాలు లేదు. ఆ గాలివానలో తండ్రికి భోజనం అందిచ్చే దీక్షతో కర్రల సాయంతో అతడు కుంటుకుంటూ సాగిపోతున్నాడు.

వంతెన దగ్గర కొచ్చేసింది. అల్లంతదూరంలో వంతెన క్రిందనున్న లోయ్యనుండి— నది నీరు పొంగి పైకి వరదలుగా వస్తోంది. మెరుపులు మెరుస్తున్నాయి. ఉరుములు ఘోషిస్తున్నాయి. అతడికిహఠాత్తుగా ఆ మెరుపులవెలుగులో ఒక దారుణ దృశ్యం కనపడింది. అక్కడ వంతెనలేదు. చివరకు దాని ఆకారంకూడా మిగలలేదు. పర్వతపులోయ- ఆ ప్రవాహము మాత్రం ఎడతెగకుండా గోల పెడుతోంది.

కారల్ తన తండ్రి కూడా లోయ ప్రవాహంలో కొట్టుకు పోయాడని గ్రహించగానే చాలాసేపు ఏడ్చాడు. కాని, ఆ మరుక్షణంలోనే అతడి కొక విషయం జ్ఞప్తి కొచ్చింది. రైలు వచ్చే వేళైంది. అతడూపకుంటే రైలు ప్రయాణీకులతోసహా లోయలో పడిపోవడం సంభవిస్తుంది. వెంటనే అతడు లేచి, తన తండ్రి ధర్మం తను నిర్వర్తించాలనుకున్నాడు. రైలు డ్రైవరుకు వంతెనపోయినట్లుగా తెలియజెయ్యాలి. అతడు దుఃఖాన్ని దిగమ్రింగాడు.

రైలంత దూరంలో వస్తోంది. హోరుమనే గాలితో కుంభవృష్టిగా వాన పడుతోంది. కారల్ వెనుదీయకుండా రైలు వచ్చే వేపుకి తన చేతిలో నున్న ఎర్ర దీపముతో కుంటుకుంటూ సాగిపోయాడు. రైలు కనుచూపుమేరలోకి వచ్చేసింది. కారల్ చేతిలో లైటు ఊపుతూ— "వంతెన కొట్టుకుపోయింది, ఆపండి!" అంటూ అరుస్తూ సాగిపోతున్నాడు. డ్రైవరు కారల్‌ను చూచాడు. కాని ఆ గాలి హోరులో అతని మాటలు వినపడలేదు. రైలు వేగాన్ని ఆపలేకపోయాడు. ఇంజను కారల్‌ను ప్రక్కకు విసరివేసి కొంతదూరం సాగి- ఆగిపోయింది. డ్రైవరు దిగివచ్చి చూచాడు. కారల్ ప్రాణం పోయింది. అతని ప్రక్కనే లైటుపడిఉంది. ప్రమాదం దాటిపోయింది.

వందలకొలది ప్రయాణీకుల ప్రాణాలను కాపాడడానికి తన ప్రాణాన్ని త్యాగం చేసిన కారల్‌ను అందరూ మెచ్చుకున్నారు. అతని సాహసాన్ని పొగిడారు.

తరువాత అతనికొక సమాధి కట్టించి క్రిందివిధంగా దానిమీద లిఖించారు.

"వందల ప్రయాణీకులను కాపాడటానికి వీర మరణం పొందిన బాల వీరుడు— "కారల్ స్ప్రింజల్" వయస్సు 14 సంవత్సరములు"

(వాడుకలో నున్న కథ)



# ఇసుక పెస్టు

♦ శ్రీ చేబ్రోలు సూర్యారావు ♦

౧

సంధ్యా సమయము, చల్లటివేళా!
పక్షులు గూడులు చేరేవేళా!
బాటప్రక్కనాబాప డొక్కడూ!
రజకుని కొకనికి ఎదురయ్యాడూ!
రజకుడు బాపడు
సంభాషించిరపుడీలాగూ!

౨

రజ: అయ్యా బాబూ దండాలండీ!
ఎచ్చటికండీ తమరిటుబైలుదేరితి రీలాగూ!

బా: గణితశాస్త్రమున ఘనుండనోయ్!
ఘనముగ, గణితము చెప్పగలనునే
ప్రక్కవూరీ ఏలికకొలువుకు బైలు దేరితినీలాగూ!

రజ: గణిత శాస్త్రమున ఘనులైతే
విప్పిచెప్పుడీ నాకీ సమస్య ఒక్కటీ!

బా: నీదుసమస్యా నాకొకలెఖ్ఖా!
అయితే చెప్పర ఆ లెఖ్ఖా!

రజ: అయ్యా! బాబూ! గుప్పెడయిసుకా!
ఎంతవుండునో సెలవిస్తారా!

బా: ఎవడు లెక్కించగలడురా!
నీగుప్పెడుయిసుకా!
యిదేమి ప్రశ్నర ఒట్టి
చొప్పదంటూ!

రజ: ఇంతచదివినట్టి తమరు,
ఇందులోనె కొట్టితిరి పల్టీబాబయ్యా
గుప్పెడుయిసుకా గుప్పెడుకాక,
ఎంతవుండునో నుడువుడు,
తమరూ బాబయ్యా!

౩

అదివినగానే బాపనిమోమూ!
వెలవెల వెలిగిందీ!
మన పెద్దలందురూ అందుకునే.
మిన్నగ చదివిన వానికన్ననూ!
రజకుడు ఒకదేమేలంటూ!



# శరదృతువు

♦ శ్రీ పి. యస్. రామజోగారావు ♦

చండభానుని సూటిఎండల
నల్లమబ్బులు విచ్చిపోయాయి,
నిండుచందురు పండువెన్నెలఁ
తెల్లమబ్బులు తేలియాడాయి,
చిలిపిజల్లులు నిలిచిపోయాయి;
స్వాగతమ్మ! శరదృతువుక—
పగలు దసర బాణాల్ చిందిన,
పలురకాల పుష్పములె రాత్రి
నిర్మలాకసపు నక్షత్రాలై,
మంచు తెరల ముసుగులోంచి
తొంగిచూస్తూ మిణుకుమన్నాయి.
ఇంతలోనే వచ్చె, నవ్యదీపావళి!
దివ్యశోభావళి! దీపకళికావళి!
నింగిపై తారకలు, భూమిపై దీపికలు,
కోట్ల సంఖ్యలో, అమావాస్య రాత్రిని
కారు చీకట్లను పారదోలాయి.



# తీర్పు

కుమారి పి. సూర్యకుమారి

ఢిల్లీ సుల్తానుల పరిపాలనాకాలంలో కాజీలు అనే ఉద్యోగస్తులు న్యాయపరిపాలన కొరకు నియమింపబడ్డారు. చాలా తెలివైన కాజీ ఢిల్లీ సమీపంలో వున్న గ్రామంలో వుండేవాడు. ఆ చుట్టుపట్ల ప్రాంతంలో అతని పేరు మారు మ్రోగుతుండేది. చాల మంది ప్రజలు అతనికే తమ ఫిర్యాదులను చెప్పుకొనేవారు.

ఆవూళ్ళో బాజీ అనే యువకుడు కట్టెలమ్ముకుంటూ జీవించేవాడు. అతనికి పెండ్లి కాలేదు. కొద్ది కొద్దిగా సొమ్ము నిలవచేసేవాడు. కొంతకాలానికి కూడబెట్టిన ధనం వెయ్యి రూపాలయింది. ఆ ధనంతో యేమిచేయడ మని తన ముసలి స్నేహితుడు సాహూని అడిగేడు. సాహూ కడు మోసగాడు. బాజీ వట్టి అమాయకుడు. ఆ సొమ్మెలాగైనా తస్కరించాలని ప్లాను వేశాడు సాహూ.

ఆముసలి చాల నమ్మకంగా బాజీతో యిలా అన్నాడు "ఆ వెయ్యి రూపాయిలు నాకప్పియ్యి. రూపాయికి అర్ధణా చొప్పున నెలకు వడ్డీ యిస్తాను. సంవత్సరం పూర్తికాగానే నీకు తిరిగి బాకీ తీర్చేస్తాను. ఇక్కడ మాత్రం యివ్వ వద్దు. ఎవరైనాచూస్తే కట్టెల వాడికింత డబ్బెలావచ్చింది. వీడు తప్పక దొంగతనం చేసి వుంటాడని ఖైదులో పెడ తారు. అందుచేత రేపు వూరవతలున్న పెద్ద రావిచెట్టు దగ్గర నాకు రహస్యంగా యియ్యి."

సాక్షులు లేకుండా అప్పిస్తే మోసం జరుగుతుందన్న సంగతి బాజీకి తెలియదు. ముసలి సాహూ బదులు తీసు కుని నెలవారీ వడ్డీ యివ్వకపోవడమే కాకుండా సంవత్స మయ్యేక తన కప్పే యివ్వలేదని అసత్యమాడి బాజీ తన యింటికి వచ్చి బాకీ అడిగితే, కసిరి తరిమివేసాడు.

బాజీ మొఱ్ఱో యంటూ కాజీ వద్దకుపోయి తన సంగతి ఫిర్యాదు చేసుకొన్నాడు. న్యాయాధిపతి మోసగాడైన ముసలి సాహూని పిలిపించి, కట్టెలవానితో యిట్లన్నాడు "నీకు సాక్షులెవరైనా వున్నారా ?" "లేరు ప్రభూ!" అన్నాడు బాజీ. "అయితే నీ వెయ్యి రూపాయిలు పోయి నట్లే. రుజువు లేదంటే తీర్పు జరగదు" అన్నాడు న్యాయమూర్తి. బాజీ మిక్కిలి దుఃఖిస్తూ అన్నాడు "కాయ కష్టపడి కడుపునిండా తిండి తినకుండా కూడ బెట్టాను. న్యాయం విచారించండి ప్రభూ" కాజీ కొంచం ఆలోచించి. "ఎక్కడ వాని కప్పిచ్చేవు" అని అడిగేడు" "వూరవతలున్న పెద్ద మఱ్ఱిచెట్టు క్రింద" అన్నాడు బాజీ. న్యాయపతి అది నిజమేనా అని సాహూ నడిగేడు. తిరుగు ఆలోచన లేకుండ బాజీ చెప్పింది సుద్ద అబద్ధమని, ఆ చెట్టెక్కడున్నది తనకు తెలియదని చెప్పేడు. దేవుడు సాక్షిగా తాను చెప్పింది సత్యమని బాజీ మొరపెట్టుకున్నాడు "అట్లయితే ఆవృక్షాన్నిక్కడకు సాక్ష్యానికి పిల్చుకురా" అన్నాడు కాజీ. ఆ కట్టెలవాడాశ్చర్యంతో "ప్రాణంలేని వృక్షమెలా వస్తుంది" అన్నాడు. "నేను రమ్మన్నానని చెప్పు" అన్నాడు న్యాయాధిపతి. "మాగొప్ప తెలివైన వాడిలావున్నాడే కీర్తిమంతుడైన కాజీ" అనుకున్నాడు ముసలివాడు.

బాజీ వెళ్ళిన తరువాత న్యాయమూర్తి సాహూనిలా అడిగేడు. "బాజీ యీ సమయానికెంత దూరంలో వుంటా డని నీ వుద్దేశం ?" ఆసమయానికి సాహూ పరాకుగా వున్నాడు; "సగం త్రోవలో వుండొచ్చు" అన్నాడు. కొంతసేపటికి బాజీ తిరిగి వచ్చేడు. "తమ ఆజ్ఞ చెట్టుకి చెప్పుకున్నాను. ఆ చెట్టు నామాటలు విని రాలేదు" అని చెప్పేడు అమాయకుడైన బాజీ దుఃఖంతో. "చెట్టే స్వయంగా సాక్ష్యమిచ్చింది. విచారించకు బాజీ" అన్నాడు కాజీ. సాహూ గాభరాపడి "నేనిక్కడే వున్నానుకదా, నాకగుపడకుండా సాక్ష్య మెలాగచెప్పింది ?" అని అడి గేడు. న్యాయాధిపతి యిలా అన్నాడు. "ఆవృక్షమిక్కడికి రాలేదు. నీనోటిద్వారా సాక్ష్యం పలికింది. నీకాచెట్టుసంగతి తెలియకపోతే బాజీ సగం త్రోవలో వుంటాడని యెట్లా చెప్పగలిగేవు. కనుక ఆచెట్టుక్రింద నువ్వు ఆ వెయ్యి రూపాయిలు బదులు పుచ్చుకున్నట్లు రుజువైంది. బాజీకి వడ్డీతోసహా అప్పు తీర్చలేకపోతే పది సంవత్సరాలు జైలు వుండాలి." కాజీయొక్క తీర్పు ప్రకారం సాహూ మారుమాటాడలేక చచ్చినట్టు అప్పు తీర్చేడు. బాజీ తెలివికీ న్యాయానికీ అంతా ఆనందించేరు.

---



# ఆమె రూపచిత్రం

ఎల్. ఎం. బాబూ

నల్లద్దాలు పెట్టుకొని
నీలిచీర కట్టుకొని
రాయపేట వైపు
రిక్షాలో పోతున్న
ఆ అమ్మాయిని నేను
అయిదు నిముషాల కాలం
నాలుగు రోడ్ల మొగలో
నిలబడి చూచాను.
మొగము చంద్రబింబము
ముక్కు బంగారు గరిటె
పెదవులు గులాబి రేకులు
పాదములు పద్మరేకులు
అందంగానే ఉందికాని
తాను కట్టిన నీలిచీరకు
తగిన జాకెట్టుకాదు.

లేత నీలి చీరె మీద
ముతక ఎరుపు జాకెట్టు
ఎందుకు కట్టిందో కాని
అంత బాగుండలేదు.
అందుకే ఆమెవైపు
అయిదు నిమిషాలు చూచాను.

* * *

ఒక సాహిత్య సభలో
ఒక స్నేహితుడు కనబడి
అచ్చువేసిన ఎడ్రసు యిచ్చి
అక్కడకు వెళ్ళమన్నాడు
అతను చెప్పిన ప్రకారం
ఆయింటికి వెళ్ళాను

ఆ యింటిముందు పూలతోట
గేటుదగ్గర కుక్కపిల్ల
"బౌవ్" మని లేచింది.

పనిమనిషి ఎదురు వచ్చి
లోపలకు తీసికెళ్ళింది.
లోపల హాలులో
నల్లద్దాలు పెట్టుకొన్నామె
వాలు కుర్చీలో ఉంది
అక్కడామెను చూసి
ఆశ్చర్య పోయాను నేను
"ఎవరమ్మావారు ?" అడిగిందామె
ఎవరో నాన్నగారి కొరకు ;
జవాబు చెప్పిందీమె.

పైకి వెళ్ళాము మేము
పరుపుమీద ముసలాయన
పలకరించి అడిగాడు
"ఎవరు నాయనా నీవు ?
ఏమికావాలి చెప్పు"
నేను దగ్గరగా వెళ్ళి
నేనెవరినో చెప్పాను.

ఆయన సంతోషంతోలేచి
ఛాయా చిత్రం ఒకటితెచ్చి
ఇది మాఅమ్మాయి ఫొటో
ఇది చూచి అందంగా
పెద్ద చిత్రం చిత్రించు
అద్దంముందు తగిలించాలి
అంటూ ఆ ఛాయాచిత్రం
ఆయన నాకిచ్చాడు.

# ఆమె రూపచిత్రం

నెలరోజుల తర్వాత
తైల వర్ణములతో
ఆమె రూపచిత్రం
అందంగా చిత్రించాను
లేత నీలిరంగు చీర
ముతక నీలిరంగు జాకెట్టు
మామిడిపిందెల డిజైను
ముచ్చటగా ఉన్నాయి.

మల్లె మొగ్గల దండలు
రెండు వరుసలలో మడిచి
కుడి జడనుండి వేసి
ఎడమ జడకు తీసి
కృష్ణానది బ్రిడ్జిలాగ
కలిపి చిత్రించాను.
మెడలో చంద్రహారం
ముక్కులో నక్షత్రం
చెవులకు జువకాలు
చక్కగానే ఉన్నాయి.

నొసటమీద తిలకం
దోసగింజలాగ దిద్ది,
ముక్కుకు ఎడమవైపు
బుగ్గమీద పుట్టుమచ్చ
తేనెరంగులో చక్కగా
తూలికతో అద్దాను.

చిత్రం పూర్తి చేసి
చట్రానికి బిగించాను
మరునాడు ప్రొద్దుటే
ఆరుగంటలకు వెళ్ళి
ఆయనకు చూపించాను.

అద్భుతంగా ఉందనిమెచ్చి
ఆనందంతో ఆమెను పిలిచి
అమ్మాయీ! నీ బొమ్మ
అచ్చు నీలాగే ఉంది
నీ నీలిరంగు చీర
నీ హారంలో తార
ఎంతో బాగున్నాయి
సంతోషంతో ఆయన
వర్ణముల గురించి
వర్ణించి చెప్పాడు.

ఆమె మౌనంగా కూర్చొని
ఆలోచిస్తోందేమిటో!
ఆమె రూపచిత్రానికి
అద్దిన రంగులు చూచి
ఆశ్చర్యపోతుందని తలచి
ఆమెతో అన్నాను నేను
నల్లద్దాలతో చూస్తే
నాలుగు రంగులూ సరిగా
కంటికి కనబడవు.
కళ్ళద్దాలు తీసి
ఓపికతో నెమ్మదిగా
ఒక్కసారి చూడండి.

ఆమె నామాటలు విని
ఆమె తల పైకెత్తి
"నాకెందుకు బొమ్మలు
నాకెందుకు రంగులు"
అంటూ ఆమె మెల్లగా
కళ్ళజోడు తీసి
బల్లమీద పెట్టింది.

నల్లద్దాలు తీయగానే
తెల్లబోయాను నేను
అసలుసంగతేమిటంటే
ఆమె అంధురాలు.






# చెక్కిళ్లు

అద్దాల్లాంటి చెక్కిళ్ళు అంటూ వర్ణిస్తారు. నిజానికిదెంత మాత్ర మతిశయోక్తి కాదు. కొంచెం శ్రద్ధతీసుకొంటే ఆ ఉపమానమును సార్థకము చేయవచ్చును. కొంత మంది చెక్కిళ్ళుదీపకాంతిని ప్రతిబింబిస్తాయి. అదివారిఅదృష్టాన్నే కాకుండా వారి శ్రద్ధనుకూడ నిరూపిస్తుంది. దీని కోసం అట్టే అవస్తపడనక్కర్లేదుకూడ. రోజు కొంత పావుగంట శ్రమపడితేచాలు.

ఈ చెక్కిళ్ళ అందం అనేక రకాలుగా ఉంటుంది. కొంతమందికి పెద్ద బుగ్గలుండటము వలన అందముగా కనిపిస్తారు. మరికొందరు మామూలుగా ఉన్నాకూడ బాగా కనిపిస్తారు. అయితే ఎవరికైనా కూడ ఎత్తు చెంప ఎముక లుండటము అందానికి, ఆకర్షణకి సూచన. ఆలాలేక పోతే అందమే లేదా అనవచ్చు. అలాఅనికాదు. కాని ఒక వింత అందము ఈ ఎత్తుచెంపఎముకల వలన కలుగుతుంది. ఇలాంటి చెంపలున్నవాళ్ళు నవ్వినా, మాట్లాడినా ఆకర్షణీయముగా ఉంటుంది. ఈ చెంపల అందమును కొంత ప్రయత్నము వలన పొందవచ్చు. అది ఏమంత కష్టము కూడకాదు. రోజు ఉదయమున నాలుకను, (ఈనె తీసెటప్పుడు మడిచిన తమల పాకులాగ) మడిచి గాలిని నెమ్మదిగా లోపలికి పీల్చుకొని ముక్కుద్వారా వదిలితే కొద్దిరోజులలో చెక్కిళ్ళ అందము పొందవచ్చును. ఇలా రోజుకి ఐదునిముషాలనుండి పదిహేను నిముషాలవరకు చేయవచ్చును. అయితే నెమ్మది నెమ్మదిగా ఎక్కువ చేయాలికాని ఒకే సారి పావుగంట చేయకూడదు. ఇలా చేయుట వలన త్వరగా కాకపోయినా కొన్నాళ్ళకైనా అందమైన చెంపలను పొందవచ్చును.

ముఖ్యంగా ఈ చలికాలములో ముఖాన్ని జాగ్రత్తగ కాపాడుకోవాలి. ఏమాత్రం అశ్రద్ధ వహించినా ముఖము పగిలి కొన్ని సమయములలో రక్తము కారుటకూడ జరుగుతుంది. అయితే ఈ కాలములో ముఖానికి పౌడరు ఉపయోగించటము తేలిక. స్నో రాసి, దానిమీద కొంచెముగ పౌడరు రాస్తేచాలు. ఎక్కడికి కెళ్ళినా, ఎంతసేపు తిరిగినా జిడ్డుకారకుండ హాయిగఉంటుంది. ప్రొద్దుటపూట అయితే పౌడరు రాయక పోవటమే మంచిది. స్నోమాత్రం రాస్తే చాలు. ఈ స్నో సువాసన వంటికి తగులుతున్న చల్లని గాలితో కలిసి హృదయానందం కలిగిస్తుంది.

ఇక చలికాలములో చర్మాన్ని కాపాడట మెలాగో చూతాము. చాలతేలికైన పని, మంచిపని అయినది - నూనెను రెండుపూటలా ముఖమురుద్దు కొనేముందు మెరుగుగా రాసి రుద్దటము. ఇలా రుద్దటం చాలమంచిది. దీనివలన రక్తము సరిగాపారి మొటిమలు మొదలగునవి రాకుండా ఉండటమే కాకుండా ఎర్రని చెంపలు వస్తాయి. ఈ ఎరుపురంగు బుగ్గలకు ఎంతో ఆకర్షణను కలిగిస్తుంది.

తర్వాత ఓపికను, కాలాన్ని వునియోగించి చేసేవి చాల వున్నాయి. అందులోకొన్ని ప్రయత్నించుదాము. మామూలుగా ఉపయోగించే పద్దతి కోల్డ్ క్రీమ్‌ను రుద్దటము. దీన్ని కొద్ది కొద్దిగా వేలితో తీసికొని చెంపలమీద, ముక్కుమీద, నుదురుమీద, గడ్డంక్రింద, కంటి రెప్పలమీద పట్టించిన తర్వాత నెమ్మదిగా వ్రేళ్ళతో రుద్దాలి. ఒక పావుగంట ఇలా రుద్దినతర్వాత Facial Tissue తోనో, దూదితోనో లేకపోతే తెల్లని గుడ్డతోనో మెల్లిగా పైన మొదలు పెట్టి ముఖమంతా ఉన్న క్రీమ్‌ను తుడవాలి. ఇలా తుడవటము వలన మన్ను ఏమైన ఉంటే వచ్చేస్తుంది. దానిపైన మళ్ళీ కొంచెం కోల్డ్ క్రీమ్‌ను తీసుకొని పై పైన రాసుకొని కొంచెము సేపైన తర్వాత ముఖం సోపుతో రుద్దుకోవటము మంచిది. దీన్ని రాత్రులు పడుకొనేముందుపయోగిస్తే బాగుంటుంది. తెల్లవారి లేచేటప్పటికి మెత్తగా, మెఱుపుగా ఉంటుంది. రాత్రులుపయోగించే టట్లైయితే మర్నాడు ప్రొద్దున సోపుతో రుద్దుకోవటం మంచిది. చాలసేపు క్రీమ్ చర్మాన్ని అంటుకొని ఉండి బాగ పనిచేస్తుంది.

మనవాళ్ళు చేసేది గసగసాల పద్ధతి. ఇది చౌకకి చౌక, ఉపయోగమూ అంటే కోల్డ్ క్రీమ్ కున్నంత ఉంటుంది. స్పూన్ కొలతతో అయితే ఒక టీ స్పూనెడు గసగసాలను తీసుకొని కొద్దిగ నీళ్ళుజల్లి సన్నికెంమీద కాటుకలాగ మెత్తగ నూరి స్నానానికి ముందు ప్రొద్దుట ముఖమంతా మందంగా పట్టించేసి పది నిముషాల తర్వాత స్నానము చేస్తే ముఖమెంతో మెరుపుగ ఉంటుంది. దీనిలో కస్తూరి పసుపును కలిపి ఉపయోగించటముకూడ మంచిది. ఇది ఏ రోజు కారోజు నూరుకోవాలి. దీనివలన ముఖము మీదున్న ఎటువంటి మచ్చలైన మరుగుపడి పోతాయి.

ఇలాంటి మచ్చలెక్కువగా ఉండేట్లయితే తీపి పదార్థాలను తినటము తగ్గించాలి. తర్వాత ప్రొద్దుట కాఫీకి ముందు ఒక గ్లాసెడు నారింజరసమో, బత్తాయి పండ్లరసమో తీసికోవటము వలన త్వరగా మచ్చలు పోతాయి. ఈ పండ్ల రసము ఒంటికి పడకపోయినట్లయితే గోజులోపల ఎప్పుడో ఒకసారి కొద్దిగ తీసికొంటేచాలు. కాని మెండిగా మాత్రం తీసికొనకూడదు.

ఈ పండ్లమీది చర్మమువత్తితే రసము వస్తుంది. ఇది కండ్లలో చిందుతే మండుతుంది. కాని ముఖానికి రాసుకొంటే మొటిమలను రానీయకుండా చేస్తుంది.

ముడతలు పడినట్లు కనుక ముఖముంటే ప్రత్యేక శ్రద్ధ తీసికోవాలి. అలాంటప్పుడు కోడిగ్రుడ్డు లోపలి తెలుపు పదార్థాన్ని బాగ నురుగు వచ్చేటట్లు చిలకరించి దానిని ముఖానికిరాసి కాసేపుంటే ముఖపు ముడతలు పోతాయి. ఇలా వరసన వారం పదిరోజులు చేయాలి. ప్రతిరోజు ముఖాన్ని రుద్దుకొనేముందు పసుపును బాగ రాసుకొంటే మంచిది.

తర్వాత చలికాలములో సోపు నుపయోగించటము తగ్గించి సీకాయను వాడటం శ్రేయస్కరము. ఈ శీకాయి పొడిలోనే కొద్దిగ పసుపు, నూనెవేసి కలుపుకొని దానితో రుద్దుకోడము చర్మానికి మంచిది.

క్రీమ్‌లుగాని, నూనెగాని వాడేటప్పుడు చెంపలమీద చిన్న చిన్న సున్నాలులాగ చేతినిత్రిప్పుతూ రుద్దటము వలన ఫలితము బాగా కనిపిస్తుంది. పై వానిలో ఏదికూడ చేయటానికి సాధ్యము కానప్పుడు తేలికైనపద్ధతి, పొడిగా ఉన్న సోపుముక్కతో తడిలేని ముఖాన్ని రుద్దితే పై వానికికలిగిన ఫలితము కలగకపోయినా పర్వాలేదనిపిస్తుంది. రాత్రులు రుద్ది పడుకోవటం మంచిది. తెల్లవారి లేచి ముఖాన్ని ముందు గోరుచన్నీళ్ళతో బాగాకడిగిన తర్వాత సీకాయితోగాని సోపుతోగాని రుద్దుకొంటే ముఖము మెత్తగ ఉంటుంది. ప్రయత్నించి చూడండి మీ బుగ్గలు ఎర్రగ గులాబి పువ్వులనిపించుకోండి.



# చిన్న మొత్తములలో నిల్వ సేకరణ-

## ఆంధ్ర మహిళా సభలో కార్యాలయము.

చిన్న మొత్తముల నిల్వలు ప్రోత్సాహించి, ప్రభుత్వమువారి పంచవర్ష ప్రణాళికకు తోడ్పడు స్త్రీల ఉద్యమములో ఆంధ్రమహిళాసభ సభ్యురాండ్రు ఎక్కువగా తోడ్పడవలెనని నిశ్చయింపబడినది. ఇందు కొరకై, ఆంధ్రమహిళా సభ ఆవరణలో ఒక ప్రత్యేకమైన కార్యాలయము ఏర్పరుపబడును. ఇందు దైనిక కార్యక్రమాన్ని నిర్ణయించి, స్త్రీ సామాన్యములో యీ ఉద్యమాన్ని గూర్చి ప్రచారం చేయుటకు, నిల్వచేయదలచినవారికి తగు సలహానిచ్చుటకు, సభ తరఫున కొందఱు యువతులు నియమింపబడుదురు. ఈ ఉద్యమంలో ఒక ప్రత్యేక ప్రతినిధిగా వ్యవహరించి, ధనము వసూలు చేయుటకు భారత ప్రభుత్వమువారు, ఆంధ్ర మహిళాసభకు అధికారమిచ్చియున్నారు. సభకు వచ్చిగాని, పోస్టు ద్వారాగాని అన్ని వివరములు తెలిసికొనవచ్చును,

ఇంకొక విషయము— మీరు కొనదలచిన సేవింగ్సు సర్టిఫికెట్లు సభ ద్వారా కొన్నయెడల సభకు 1¼% కమీషను వచ్చును. ఈ కమీషను సభయొక్క కార్యకలాపాలకై వినియోగించుకోవచ్చును. అందువల్ల మీరు నిల్వ చేయుదలచిన మొత్తమునకు సభద్వారా సర్టిఫికెట్లు కొన్నచో, సభకు కూడా సహాయము చేసినవారగుదురు.

ఉత్సాహ వంతులైన సోదరీమణులు, యింత వరకూ సభద్వారా నిల్వ సర్టిఫికెట్లు తీసుకున్న మొత్తము రమారమి రూ. 33,800/- ఇందు మూలముగా సభకు వచ్చిన కమీషను రూ. 423/- ఇంకా పెక్కుమంది సోదరిమణులు యీవిధముగా సభద్వారా సర్టిఫికెట్లుకొని సహాయ పడవలెనని కోరుచున్నాము.

టి. జి. హైమవతి,
ఆర్. లక్ష్మి.



### విజ్ఞప్తి

ఆంధ్రుల ఆదరాభి మానములనందుచు, అల్లారు ముద్దు బిడ్డగా పెరుగుచు 11 ఏళ్ళ ప్రాయమునకు వచ్చిన 'ఆంధ్ర మహిళ' డిశంబరు నెలలో ప్రత్యేక జన్మదిన సంచిక ప్రకటింపనుద్యమించినది. నవంబరు నెలాఖరుకే పత్రిక వెలువడును.

చందా దారులు—పాఠకులు, రచయిత— రచయితలు, పెద్దలు-పిన్నలు చక్కటి వ్యాసములు, పద్యములు, కథలు, నాటికలు, టుప్రీలు, చిత్రములు, వగైరాలు- స్త్రీలకు, పిల్లలకు విజ్ఞాన-ఆనందదాయకములగునవి ఏ శీర్షికతోనైనను వ్రాసి వీలైనంత త్వరలో పంపగలరని ప్రార్థన.

వేరు వేరుగా అందరిని కోరుట సాధ్యము కానందున యీవిజ్ఞప్తి గావించుచుంటిమి.




పెద్దలు ఒక శ్లోకం చెప్పేరు. జ్ఞాపకముందా ? 'అసలే కోతి, కల్లు త్రాగింది, ఆపై పిచ్చి ఎత్తింది, ఆమీదట తేలు కుట్టింది' ఆ కోతికి కొబ్బరికాయకు బదులు కొరివి చేతికి దొరికిందని మనం అనుకోవచ్చు. అలాగు అసలే అహంకార మమకార పూరితుడైన మానవునికి రంగు-మతభేదాల గంగవెర్రులెత్తేయి ; కోలనీలపిచ్చి, శాస్త్ర పిచ్చి బాగా ఎక్కింది. ఆపై, నాచేతిలో ఆటంబాబు ఉన్న దన్న స్వాతిశయం బలిసింది, అభ్యుదయ లక్షణాలని అతడనుకుంటున్నాడు, వినాశకాలబుద్ధులని మనలో విజ్ఞాను లనుకుంటున్నారు. ఏవేళప్పుడు ఇది ఆత్మ వినాశానికి పర పీడనకు దారితీస్తుందోనని దిక్కులుచూస్తూ మార్గాంత రాలు ఆలోచిస్తున్నారు.

ఇది శాస్త్రయుగం అనీ, భగవత్సృష్టిని నాశనం చేయగల ఆటంబాంబు నిర్మించేననీ, మానవుడు నవ-నాగరికతా- వ్యామోహనా- వివశుడైపోయి, కళ్ళు నెత్తి కెక్కి- వ్యవహరించేటప్పుడు, ఈక్రింది హంశాలు నెమరు వేస్తే, మద్యపానమత్తుకు గంజి విరుగుడు లాగున కొంత పని చేయవచ్చును.

భూగోళం చరిత్రలో మానవుని పుట్టుక చూస్తే— 70 ఏళ్ళ పురాతనపుటింటిలో 3 రోజుల క్రితం పుట్టిన పసిబాలు డీతడని తన శాస్త్రమే చెపుతుంది. ఇతడు 'నాగరీకుడ'నదగ్గ కాలం, విద్య-కళలు-శాస్త్ర పరిశోధనలు గావించినకాలం, 5 నిమిషాలు క్రిందటనే. ఇంతలోనే ఇంతటి మహత్కార్యాలూ, మారణయంత్రాలూ చేయ గలిగేనని విర్రవీగడం పిల్లల ప్రగల్భంలాగే ఉంటుం దేమో. అనంత విశ్వంలో మొన్న మొన్ననే ఒక చిన్న గోళం మీద పుట్టిన శాస్త్ర పాపాయికి తెలియవచ్చిన వాటి కంటె తెలుసుకోవలసిన హంశాలే ఎక్కువుంటాయని, కొంత స్వాతిశయం తగ్గించుకోవడం మంచిదేమో. తమ లోనే నిజమైన శాస్త్రజ్ఞులు ఎలాంటి భావాలతో వినమ్రులై యుండేవారో చూచుకోవడంకూడ కొంత మంచి చేస్తుంది: న్యూటన్ మేధావి లాంటివాడు— "సముద్రపు టొడ్డున నున్న గులకరాళ్ళల్లో ఒక రాయిని తీసి పరీక్షించి ఆశ్చర్య పోతూ ఆడుకొనే అబ్బాయిలాంటివాణ్ణినేను— అతని కెంత తెలుసో నాకూ అంతే తెలుసు ననుకొంటున్నాను" అని ఎందుకన్నాడో కొంత ఆలోచించడం మంచిది. సోక్రటీస్ లాంటివాణ్ణి— "మిమ్మల్ని ప్రపంచానికంత టికీ తెలివైనవార"ని ఎందుకంటున్నారు ? అని ప్రశ్నిస్తే— "ఇతరులు తమకెంతో తెలుసునని చెప్పుకొనే ప్రపం చంలో— నాకేమీ తెలియదన్న సంగతి నాకు తెలుసును గనుక" అని ఎందుకన్నాడో కొంత పర్యాలోచించడం మంచిది. "నీకు చదివిందీ—చదవన్దీ, ఒక్కలాగే నున్న ప్పుడు నీవు చదువు మానివేయవచ్చు"నని భారతీయ పండితుడొకాయన అన్నాడట; అలా ఎందుకన్నాడు చెప్మా ? బహుశా అలాగు సర్వజ్ఞుడికైనా ఉంటుంది— లేక శుద్ధ శుంఠకైనా ఉంటుందనిలావుంది : అంతే ప్రాచ్య విజ్ఞులుగాని, పాశ్చాత్య శాస్త్రజ్ఞులుగాని ఇలా వున్నారని కాదుసుమండీ శాస్త్ర పాపాయికి సర్వజ్ఞత్వం యింకా రాలేదనీ, తెలుసుకోవలసిన అసలు విషయాలు అనేకం ఉండొచ్చు— ఉన్నాయి అనీ, అతడి విజ్ఞాన నేత్రం ఇంకా పూర్తిగా విడువలేదనీ అనుకుంటే సత్య దూరం కాకపోవచ్చు.

........విడ్డూరాలు........

మానవలోకాన్నే తగులబెట్టగలశక్తిని సృష్టించగలిగారని శాస్త్రజ్ఞులు అనుకోవచ్చు. కాని మన 'విజ్ఞానం' యింకా శైశవావస్థలోనేవుంది.

● ఎక్స్‌రే కళ్లు :— హిందూదేశ వాసి, 'కుడాబేక్స్' అన్న ఆయన కళ్ళకు పిండిపట్లూ వాటిపై గట్టిగా గంతలూ కట్టించుకుని పుస్తకాలు చదువుతాడు, వస్తువుల్ని ఆనవాలు కడతాడు, బిలియర్డ్సులాంటి ఆటలాడతాడు, సైకిలు తొక్కుతాడు. ఆఖరికి మంచి జనసమ్మర్దంగల బస్తీల్లో కారు నడుపుతాడు! ప్రొఫెసర్ సి.ఇ.యం. జోడ్‌గారి అధ్యక్షతను శాస్త్రజ్ఞుల బృందం ఒకటి 'కుడాబేక్స్' గారి కనుదృష్టిని తెగ పరీక్షచేసి విడిచిపెట్టింది. ఐనా, ఈ ఎక్స్‌రే కళ్ళ రహస్యం ఏమిటో తేలలేదు.

మరో ఎక్స్‌రే కళ్ళ ఆతడున్నాడు. దక్షిణాఫ్రికా నివాసి, పీటర్ వాన్ జార్స్‌వెల్డ్ సామర్ధ్యం ప్రపంచ ఖ్యాతి నందింది. దక్షిణ రొడీషియాలో కొన్నేళ్ళక్రితం వానలులేక క్షామం వచ్చింది. అప్పటికి పీటర్‌కు 14 ఏళ్లు. భూగర్భంలోనున్న నీటిని తాను "చూడగల"నన్నాడు. అది ఉన్నచోట బోరింగు ఎక్కడ వేయాలో కూడ చెపుతానన్నాడు. రొడీషియా ఉద్యోగులు అతని ప్రగల్భాలేమిటో చూద్దామని అవకాశం యిచ్చేరు. పీటర్ ఒక చోటు చూపిస్తే— బోరింగు మొదలెట్టేరు. 60 అడుగుల లోతు కెళ్ళే సరికి నీరు పడింది. అంతా ఇంతా కాదు, గంటకు 2 వేల గేలన్ల నీరు ఇవ్వగల బోరింగు అది!

● రేడియోమెదడు :— 1942 నాటి సంగతి. యునైటెడ్ స్టేట్సులో ఓహియోలో క్లీవ్‌లాండ్ హాస్పిటల్లో మొగోవ్‌స్కీ అన్న ఆయన ఉన్నాడు. తనకు రోజంతా సంగీతమూ కంఠస్వరాలూ వినబడుతున్నాయని పితూరీ చేసేడు. మొదట్లో అతడేదో మతిభ్రమవల్ల బాధపడుతున్నాడనుకున్నారు; కాని కొంచం విశదంగా పరీక్షచేసే సరికి— అతడి మెదడు నిజంగా రేడియో బ్రాడ్‌కాస్టును అందుకుంటూ ఉందని తేలింది! శబ్దం చొరని గదిలో పెట్టి మూస్తేకూడా క్లీవ్‌లాండ్ రేడియో ప్రకటనను ఒక్కమాట తు.చ. తప్పకుండా ఏకరువు పెట్టేడు. అతడి రేడియో బుర్రవల్ల గట్టి చిక్కేర్పడింది. "స్విచ్ ఆఫ్" చేయగల సామర్ధ్యం అతనికి అలవడలేదు! అతడి అవస్థ నివారణకు కొన్ని ప్రత్యేక లోహపుకట్లు అతని బుర్రచుట్టూ అమర్చవలసి వచ్చింది. ఈవిడ్డూరపు బుర్రను గూర్చి శాస్త్రానికేమీ తెలియలేదు.

● ఆకలినిజయించే శక్తి :— అన్నింటికంటే ఆశ్చర్యకరమైన వింత ఏమిటంటే: కూర్గు నివాసి, ధనలక్ష్మి అనే 18 ఏళ్ళ అమ్మాయి ఉంది. 18 మాసాలుగా ఏమీ తినలేదు. డాక్టర్లు ఆమెను పరీక్షించి— పరిపూర్ణారోగ్యవంతురాలుగా ఉంది అన్నారు, ఆమె కేసు ఇండియా ప్రభుత్వం వారి దృష్టి నాకర్షించింది; బెంగుళూరు జనరల్ హాస్పిటల్ లో ఆమె చాలా కాలం పరీక్షలో ఉంచబడింది. తిండి లేకుండా బ్రతుకగలిగే రహస్యం ఎక్కడుందో డాక్టర్లకు ఏమీ ఆచోకీ దొరకలే! "బహుశా ఆమెలో కొన్ని గ్రంధులుండవచ్చు; అవి సూర్యరశ్మినుంచి శరీర వ్యాపారానికి కావలిసిన శక్తిని గ్రహిస్తూ ఉండవచ్చు" నన్నారు!

● జీవితశక్తినిచ్చే సామర్ధ్యం :— పెర్షియాలో ఒకామె ఉంది. ఆమె వేటినైనా శిథిలమైనవి రాలిపోకుండాచేయగలదు. ఆమె తాకిన పూలు, వాడిపోకుండా రోజులకొద్దీ అట్లేఉంటాయి. ఇది మంత్రాలు-తంత్రాలు-పూర్వపు బ్లాక్ మేజిక్ (Black magic) లా గుంది!

● ఆడితప్పని జోస్యం :— 1931 లో 'వార్సా' మెటాఫిజికల్* ఇన్‌స్టిట్యూట్ వారొక పోలెండ్ దేశపు కర్షక యువతి సంగతి రిపోర్టు చేసేరు. ఆస్పత్రుల్లో రోగుల్ని చూచి, ఇక రెండు రోజులకు మరణించే కేసులు చెప్పగలిగేది. ఆమె చేసే పరీక్ష ఏమిటంటే—— రోగిమీదకు వంగి వాసన చూడ్డం! "చావు రాబోతుంది అంటే—— అదొక విధమైన వాసన వేస్తుంది" అనేది.

ప్రథమ ప్రపంచ సంగ్రామంలో జర్మన్ సేనలో మరొక పోలెండ్ దేశవాసికికూడ ఇలాంటి శక్తే ఉండేది. "రోగినుంచి ఒక విధమైన వాసన వచ్చిందంటే ఇక అతణ్ణి చావు కేసుల జాబితాలో చేర్చవచ్చు" అనేవాడు. అతడి జోస్యం నిజమేనని డాక్టర్లు ఋజువు బలికేరు. ఐతే— ఈ చావుల జోస్యం—ఎవరికీ కావలసివచ్చేదిగాదు.

* "మెటా ఫిజిక్సు" అంటే It is like the search of a blind man in a dark room for a black coat which is afterall not there" అని ఒక పాశ్చాత్యుడు వివరించేడు. మనం దాన్ని మెట్ట వేదాంతం అనుకొని, "ఒక చీకటి కోణంలో, ఆసలు అక్కడ లేనటువంటి నల్ల కోటును గురించి గ్రుడ్డివాడి తడుముక్కొట" అని చెప్పుకోవాలి. అంటే శాస్త్ర పరిశోధన అలా ఉంటుందనిగాదు సుమండీ అలా అంటే, ("జగన్మిధ్యా బ్రహ్మసత్యం" అనే 'పిచ్చి' భారతీయుడు ఈ ఇరవయ్యో శతాబ్దంలో ఇంకా ఎవరైనా ఉంటే), అతడిపై ఆటం బాంబులు ప్రయోగించి శాస్త్రజ్ఞుడు తన మజా చూపించ

గలడు ఈరోజున. పెద్ద పెద్దలు బహు ఓర్పుతో గమనిస్తున్నారు— ఈపద్ధతి అతణ్ణి తోటివార్నీ ఎక్కడకు తీసుకువెళ్ళ గలుగుతుందోనని. చంద్రలోకంలోకైనా తీసుకువెళతానంటున్నాడు మరి! ఈపద్ధతిని 'చంద్రలోకం' కాకపోయినా 'మరోలోకం' లోకైనా మనలను అందర్నీ జేర్చడం తథ్యం అని విజ్ఞులు విస్తుపోయి మార్గాంతరాలు అన్వేషిస్తున్నారు!

('హిందూ'లో రేల్ఫ్ మిడ్లిటన్‌గారి వ్యాసంనుండి)



## ★ విశ్వరహస్యం ★

♦ రామ్‌చంద్ ♦

వాకనులేదు చెప్పుడు
నడయాడుతు
కదులాడే
ఈ ప్రవాహ మెపుడు ఆగిపోవునో?
ఘాన ఘోంత రాశాలను
అంటి పెట్టుకుని
అల్లలాడే
ఈ వాయుదేవుని కుప్పిగంతులు
ఎపుడు అణగునో?
అనంతాంబర వీధిని
సంతోషంతో
సంచరించే
ఈ మేఘమాలికల ఆటలెపుడు కట్టువడునో?
ఆశనిరాశల ప్రయాసమయమగు
ఈహృది
తనవిధి
ఎపుడు మరచునో?
విశ్వరహస్య మిమిడియున్న
ఈ పకృతి శోభెపుడు అంతరించునో?
లేదు ...

ఇది ఎప్పటికీ జరిగేదికాదు....
ప్రవాహము ప్రవహించు,
గాలివీచు, సంచరించు మేఘముల్
హృది తనవిధి నిర్వహించు
ప్రకృతిశోభ ప్రజ్వరిల్లు
ఏదీ అంతరించదు
అంతరించదేమీ —
అయితే ఒకటి మాత్రం సత్యం,
మార్పన్నది....నిత్యం
ఈ అనంతకాల గర్భంలో
జరిగేది తథ్యం

*   *   *

ఈ విశాల విశ్వాన్నెవరు సృష్టించారో?
ఎవరికి తెలుసు?
ఎవరు తెలుపగలరు?
ఈ విశ్వం మారిపోపుగాని అంతరించిపోదు....
ఏదీ పుట్టలేదు
గిట్టబోదేమీ —
అయితే ఒక లక్షణం
మార్పది క్షణం క్షణం,



# బిడ్డలు - తల్లిదండ్రులు

కె. వెంకట్రామయ్య

"బిడ్డ ఎదిగెడి విధానము" తరువాయి.

ఒకటిన్నర సంవత్సరముల వయస్సుబిడ్డ

ఈ వయస్సు బిడ్డ ప్రాకుచుండును. తప్పటడుగులు వేయుచుండును. ఇతరులు తన్నుద్దేశించి చెప్పుమాటలను చాలవరకు అర్థము చేసికొనును. తానును కొన్నిమాటలను మాట్లాడ గలిగి యుండును. శరీరావయవములను వాడుట నేర్చియుండును, అతని ఇంద్రియములన్నియు చురుకుగా పనిచేయుచుండును. చుట్టునుగల వస్తువుల ఉపయోగ మతనికి చాలవరకు తెలిసియుండును. పశితనములో అతడితరులపై ఆధారపడి యుండెను. వారికొరకై వేచియుండెడివాడు. ఇప్పుడే విషయములకును వేచియుండడు. ఏది కావసినను స్వయముగ తానేబోయి తీసికొనుట కారంభించును. తాను వినునట్టియు, చూచునట్టియు ప్రతి విషయమును తెలిసికొన గోరును. అందుబాటులోగల ప్రతి వస్తువును తాకియు, పట్టియు పరిశీలించును. ఆకర్షకములగునవి అందుబాటులో లేకున్నను పరిశీలింపగోరును.

బిడ్డకు ఒకటిన్నర సంవత్సరముల వయస్సు రాగానే ఇల్లంతయు తిరుగ నారంభించును. అన్నిటిని తాకియు పట్టియు పరీక్షింపగోరును. ఇది ఇంటిలోని వారికిబ్బందిగ నుండి వారతని కార్యముల కడ్డువచ్చుటయు కూడదనుటయు జరుగుచుండును. ఇట్లగుటచే బిడ్డ తన కార్యములందలి ఉచితానుచితముల నెరుగగలడు. వస్తువులను తాకియు, పట్టియు తెలిసికొనగోరుట బిడ్డకు సహజమేయైనను అవి కూడనివైనచో వాని నందుబాటులో లేకుండ చేయుట మంచిది. బిడ్డ ఈ వయస్సుననే తొందరగా మాటలు నేర్చును. స్వేచ్ఛను గోరుచుండును. బిడ్డకు తగు స్వేచ్ఛ నిచ్చుట ఆవసరమేగాని పట్టుదల పంతగింపు అతనికి పట్టువడకుండ తలిదండ్రులు నేర్పుతో మెలగవలెను.

ప్రాకుచు తప్పటడుగులు వేయుచు నడచు వయస్సు దాటగనే బిడ్డ అతిశీఘ్రముగ నెదుగుచుండును. ఐదేండ్లు వచ్చుసరికి జీవితావసరములగు అలవాట్లన్నియు అతనికి ఏర్పడి యుండవలెను. అన్నిటిని తెలిసి కొనవలెనను కుతూహలముండ వలెను. నేర్పు, ప్రయత్నములతో కూడిన ఆటలాడుటకు తగిన యూహాశక్తి యుండవలెను. పెద్దలయెడ ప్రేమ, తోటివారితోచేరి కలసి మెలసి ఆడుకొనుట, ఒకరినిమిత్తము లేక కులాసాగా నుండుట, బాధ్యతయుతమగు చిన్న పనులను బాగుచేయగలుగుట, ఇష్టమగు నేవిషయమందైనను నలుబది నిముషము లేకాగ్రత జూపగలుగుట, ఇతరులు తన సహాయము గోరిన సహాయపడుటకు సిద్ధముగా నుండుట, ఇత్యాది గుణములతనికి పట్టువడ వలెను. ఒక్క మాటలో చెప్పవలెనన్న బిడ్డకైదేండ్లు రాగానే ఇతరులతో కలసి మెలసి సుఖముగను, ప్రయోజన కరముగను జీవించుట కనువగు అన్ని గుణములు నబ్బ వలెను,

అలవాట్లు — వాని ప్రాముఖ్యత

పుట్టిన నాటినుండియు బిడ్డ తన పరిసరముల కనుగుణముగ ప్రవర్తింపవలసి యుండును. కనుక అతనికేవో కొన్నియలవాట్లు ప్రారంభమునుండియు నేర్పడుచునే యుండును. ఇవి మంచివైనను కావచ్చును. లేదా చెడ్డవి కావచ్చును. మంచియలవాట్లు బిడ్డ మనశ్శరీరారోగ్యమునకును సుఖజీవనమునకును తోడ్పడును. చెడ్డవి బిడ్డ యభివృద్ధి నాటంకపరచును. ఇది తల్లిదండ్రులు గుర్తించి బిడ్డ యలవాట్లనుగూర్చి మొదటినుండియు శ్రద్ధజూపుట చాలయవసరము.

ఆహారము, నిద్ర మొదలగునవి బిడ్డ జీవితములో చాల ముఖ్యమైనవి. వీనియందు బిడ్డకాదినుండియు సరియగు నలవాట్లేర్పడవలెను. ఏలయన నీయలవాట్లమీదనే తక్కిన యలవాట్లనేకము లాధారపడియుండును. బిడ్డ యేడ్చినపుడెల్ల తల్లి పాలుపట్టుచున్నదనుకొందము. దానివలన బిడ్డకసహనము, అత్యాశ, పట్టుదల, ఇత్యాదిగుణములలవడవచ్చును. మరియు బిడ్డ తన తల్లిపై నధికారము జూపుట గూడ నేర్చుకొనవచ్చును. కాలము గడచిన కొలది ఈ యలవాట్లే బలపడి మాన్పుటకతి కష్టమగును.

సహజప్రవృత్తులను సరిదిద్ది అలవాట్ల నేర్పరచుట :

ఏదైనను, చిన్నతనమునకడు సులభముగాపట్టువడును. అందుచే నాకాలమే యలవాట్లనేర్పరచుట కెంతయు తగియుండును. ప్రతి బిడ్డయు కొన్ని సహజ ప్రవృత్తులతో బుట్టుచున్నది. వాని యభివృద్ధి కభ్యాసమవసర మగును.

అభ్యాసము నొసగువిధానమునుబట్టియే బిడ్డకు మంచి యలవాట్లుగాని చెడ్డయలవాట్లుగాని యేర్పడుచుండును. బిడ్డ యాహారమును దీసికొనవలెను. నిద్రపోవలెను. అవయవ సంచలనము గలిగియుండవలెను. ఈప్రవృత్తులు జీవితావసరములు! వీనియందొక క్రమవిధానమేర్పరచుటచే బిడ్డకు మంచి యలవాట్లేర్పడగలవు.

సహజ ప్రవృత్తులలో మార్పుదెచ్చుటచే నలవాటేర్పడుచుండునను విషయమునుగూర్చి వాట్సన్ మహాశయుడొక విచిత్ర ప్రయోగమును జేసెను. అతడొక చంటిబిడ్డకుందేటితో నిర్భయముగనాడు కొనుటనుజూచి సరిగాబిడ్డదానిని తాకబోవు తరినొక ఉక్కుకడ్డీ పైగొట్టి శబ్దము జేసెను. బిడ్డ కొంచము భీతిల్లిన సూచనలను జూపెను. వాట్సన్ వెంటనే కుందేటినిదీసి కర్రఘనములనాడుకొన నా బిడ్డకిచ్చెను. కొంతసేపైన పిదపకుందేటిని మరల బిడ్డ ముందుంచగా నతడు దానిని తిరిగి తాకబోయెను. అదే సమయమున వాట్సన్ పూర్వపు ధ్వనినే మరలజేసెను. ఈసారి బిడ్డపూర్వముకన్న నెక్కుడు భయమే జూపెను. అంత వాట్సన్ కుందేటిని దీసి వేసి బిడ్డకు కర్రఘనముల నాడుకొన తిరిగియిచ్చెను. కొంతసేపైన పిదపకుందేటిని మరల బిడ్డ యెదుటనుంచగా ఏ శబ్దమును జేయకయే బిడ్డ దానిని జూచి భయపడెను. కుందేలన్న బిడ్డకు మొదట భయములేదు. కాని దానిని తాకబోయినపుడెల్ల పెద్ద ధ్వనిని వినుటచేనతనికా జంతువుపై భయముగలిగెను. ఇట్లే అయిష్టమగునొక విషయమును మంచి విషయముతో జతపరచుటవలన బిడ్డకు మంచివిషయముపై నసహ్యము గలుగవచ్చును. బిడ్డకు చాల యిష్టమగు పండ్లరసముతో నొక దుర్వాసన ద్రవ్యమునేదో కలిపి లిపియిచ్చితిమనుకొనుడు. అప్పటినుండియు బిడ్డయారసమునంటడు. కారణమేమన దుర్వాసనపైగల యసహ్యత పండ్లరసముపైకితిరిగినది. బిడ్డ నిద్రబోవుటకెవ్వరును దగ్గరనుండ నక్కరలేదు. కాని తల్లి జోగొట్టుటను జోలపాటలు పాడుటను అలవాటు జేయును. దానివలన బిడ్డాకార్యము జరుగువరకు నిద్రింపక బాధించుచుండును. ఇట్లే చీటికి మాటికి నలుకజెందుట, ఆహారవిషయములలో బాధించుట, మలమూత్ర విసర్జనలనాపుకొనకుండుట, అన్నిటిని పాడుజేయుట, వ్రేళ్ళను చీకికొనుట, మొదలగుదురలవాట్లు బిడ్డల ప్రవృత్తులలో గలుగుమార్పులవలననే యేర్పడుచున్నవి. మర్యాదగా ప్రవర్తించుట, ఇతరుల విషయము గమనించుట. పరిశుభ్రత గలిగియుండుట మొదలగు మంచియలవాట్లును నీవిధముగనే యేర్పడును.

బిడ్డలెదిగిన పిదప వారి ప్రవర్తన యెట్లుండనాశింతుమో దాని కనుగుణముగ నాదినుండియు వారు నడచు కొనునట్లు ప్రోత్సహింపవలెను. బిడ్డ క్రిందపడినదనుకొనుడు. అప్పుడతడు తనంతట తానే లేచుటకు ప్రయత్నించును. కాని యెవరైనను తన్నెత్తుటకువచ్చుట, చూచినంతనే యేడ్వనారంభించును. అప్పుడు బిడ్డను ముద్దు జేసియూరడించినచో యేడ్పుగొట్టుతన మతని కలవడవచ్చును. అట్లుగాక జరిగిన విషయము నల్పముగా జూచితిమేని దెబ్బలకును, పాటులకును లెక్కజేయక ధైర్యముగానుండుట అతనికలవడును. ధైర్యమనునది స్త్రీ పురుషులిరువురకును చాల ముఖ్యమే. దానిని వారికి చిన్నతనమునుండియు తప్పక యలవరచవలెను. బిడ్డకొకవేళ పెద్ద దెబ్బ తగిలిన యెడల తగు జాగ్రత్తదీసికొనవలసినదే. ఐనను దానిని గూర్చి పెద్ద జేయుటయు, ఆందోళన పడుటయు పనికిరాదు.

<u>ప్రయత్నించుట, పొరబాట్లను దిద్దుకొనుట పద్ధతి నలవాట్లేర్పడుట</u> :—బిడ్డ శరీరచలనములు మొదట ఉద్దేశరహితములై ఒడుదుడుకుగా నుండును. కాని ఇంద్రియములును ఇతరయవయవములును అతని స్వాధీనమునకు రాగానే శరీర చలనములలో కొంతయుద్దేశమును, క్రమతయు నేర్పడును. మొదటినెలలో నతడు తన చేతిని నోటి కడకుదెచ్చుకొనుటకు ప్రయత్నించుచుండును. ఆప్రయత్నములను గమనించిన బిడ్డ విషయములనెట్లు నేర్చుకొనునదియు మనకు బోధపడగలదు. మొదట నతడు తనచేతినే యుద్దేశముతోను నోటి కడకుదెచ్చుకొనడు. అనుకొనకుండ చేయినోటిపైబడుట తటస్థించును. వెంటనే దానినతడు చీకగోరును. అప్పటినుండియు తనచేతిని నోటివద్దకు దెచ్చుకొననతడు ప్రయత్నించుచుండును. మొదటచేతి నెన్నోవిధముల కదలించుచుండుటచే దానిని సరిగా నోటికడకతడు తేలేకపోవును. కాని తుదకు చేతిని అనవసరముగ కదలించుట మాని తిన్నగా నోటివద్దకే తేగలుగును. ఇట్లే అతని చేయి తొట్టెపైవ్రేలాడ గట్టిన గిలకపైబడుట తటస్థించును. అదిశబ్దము జేసి ఊగును. అంత దానిని పట్టుకొనుట కాతడు ప్రయత్నింపదొడగును. కండరములింకను తన స్వాధీనమున నుండకుండుటచే

అతడెన్నోసార్లు ప్రయత్నింపవలసియుండును. తుదకా గిలకను చేతితో కొట్టుటనతడు నేర్చుకొనును.

ప్రయత్నములవలనను, పొరబాట్లవలనను నేర్చుకొను నీవిధానము దీర్ఘమార్గమేకావచ్చును. కాని బిడ్డ తన కండరములతో జేయవలసిన కార్యములను మరియేమార్గమునను నేర్చుకొనజాలడు. ఇది తల్లిదండ్రులు గ్రహించి బిడ్డ తనంతట తాను భుజించుటకుగాని, దుస్తులను ధరించుటకుగాని యత్నించుచో నోర్పుజూపుట మంచిది. అల్లుట, కారు నడుపుట, ఇత్యాదిపనులను నేర్చుకొనునప్పుడు మనమెంతో ప్రయత్నింపవలెను. మనకును ఎన్నో పొరబాట్లు, వచ్చును. ఇది జ్ఞప్తియందుంచుకొని బిడ్డ దేదైనను నేర్చుకొనునపుడు మన మతనిని తొందరబెట్టక ఓర్పు జూపుట యవసరము. ఒక వయస్సు రాగానే బిడ్డలు తమ పనులను తామే జేసికొనుటకై యత్నించుచుందురు. అట్టి యెడ వారి నడ్డుటగాని తొందరబెట్టుటగాని పనికిరాదు. దాని వలన బిడ్డ లెదురించుటయు, పట్టుబట్టుటయు నేర్చుకొనగలరు. లేదా వీలైనంతవరకితరులచే పని చేయించుకొనుట కలవాటు పడగలరు.

బిడ్డ లేపనినైనను చేయుటకు ప్రయత్నించునపుడు వారినట్లే చేయనిచ్చినచో తమంతట తామే ఆ పనిని సాధించితిమనుతృప్తి వారికి కలుగగలదు. ప్రయత్నించుచు పొరబాట్లను దిద్దుకొనుచు నేర్చుకొను విధానము బిడ్డలకు చాల మంచిది. ఈ విధమున నేర్చుకొన్నది వారెన్నటికిని మరువరు. మరియు, పనియందు పట్టుదల ఏకాగ్రత జూపుట వారి కలవడును.

ఎవరి సహాయమును గోరక బిడ్డ తనంతట తానే ఒక పని చేయునపుడు స్వేచ్ఛగా చేయనీయవలెను. బిడ్డకది సాధ్యము కాదని తోచినప్పుడు మాత్రము సహాయపడవచ్చును. దీనివలన బిడ్డ సంతోషముగానుండును. సహాయకరముగా నుండును. ఇంటియందు శాంతి యుండును.

**చేసిన దానినే తిరిగి తిరిగి చేయు విధానము :— (Repetition)**

అలవాటేర్పడుటలో నిదియొక ముఖ్య ధర్మము. ఏ పనియైనను అలవాటగుట కభ్యాసమవసరము. బిడ్డ తన చొక్కా గుండీలనో లాగూ గుండీలనో పెట్టుకొనుట నేర్చుకొనవలెనన్న ఆ పని నొక దినము చేసిన చాలదు. ప్రతి దినమును చేయవలెను. అప్పుడే అది బిడ్డ కలవాటగును. ఒక పని చేయునప్పుడు మనకు గలిగిన యనుభవము మరపునకు రాకపూర్వమే మరల నా పనిని చేయవలెను. అప్పుడే మనకది యలవాటగును.

**పద్ధతిలో మార్పులేకుండుట, (Consistancy)**

**(ఎ) వేళకు నిద్రించు అలవాటు :—**

శిశు నిర్వహణములో క్రమవిధాన మత్యవసరము. అది లేకుండుటయే చాల సమస్యలకు కారణమగుచుండును. వేళకు నిద్రించుట బిడ్డ కలవాటు కావలెనన్నచో ప్రతిదినమును వేళ కాతని పరుండబెట్టవలెను, ఒక దినమట్లు చేయుట, మరియొకదిన మూరకుండుట పనికిరాదు. వేళకు పరుండుట బిడ్డ కలవాటైనను మన మజాగ్రత్తగ నుండరాదు. ఒకనాడు, బిడ్డ బ్రతిమాలెనుగదాయని తల్లి యతని నాలస్యముగా పరుండనిచ్చిన అప్పటినుండియు నతడా వేళకు పరుండక పేచీ పెట్టుచుండును.

**(బి) వస్తువులను సర్దియుంచుకొనుట :—**

బిడ్డ తన యాట వస్తువుల నిటునటు పారవేయరాదు. వానిని దీసినచోటనే తిరిగి పెట్టుట కలవాటు పడవలెను. మొదట తల్లియే యీ పని చేయునప్పుడు బిడ్డ సహాయపడవచ్చును. పిదప తానే స్వయముగ నాపని జేయుట కలవాటు పడవలెను. ఒకనాడు బిడ్డనే ఆటవస్తులనెత్తి దాచుకొమ్మనుటయు మరునాడు మనమే ఆ పనిజేయుటయు పనికిరాదు. అట్లు చేసిన బిడ్డ కెట్టి యభ్యాసము నుండదు. బిడ్డ ఆటవస్తువుల నిటు నటు పారవేయుచున్నను మొదట ఊరకుండి అతని కారేండ్లు రాగానే వానినెత్తి దాచుకొను గుణమబ్బలేదని వగచుటలో నర్థముండదు. బిడ్డ స్వయముగా తన పనులను జేయగలిగియున్నప్పుడు మనమే ఆ పనులను జేయుచున్నయెడల ఇతరులపై నాధారపడు గుణ మతని కలవడగలదని ఇదివరకే జెప్పబడెను. తలి దండ్రు లిది గుర్తింపక వర్తించుటచే బిడ్డ సామాన్య విషయములందుగూడ వారిపై నాధారపడుచుండును.

బిడ్డ కొక యలవాటేర్పడవలెనన్న దానికి సంబంధించిన పనులు క్రమానుసరణిని జరుగుటయు వాని నతడు గుర్తించుటయు చాల ముఖ్యము. ఒక క్రొత్త యలవాటును బిడ్డ నేర్చుకొనునపుడు కొన్ని పనుల నతడు మాటిమాటికి చేయవలసియుండును. ఆ పనులను చేయుమని చెప్పునపుడు మన మొకే రీతిగ మాట్లాడుట యవసరము.

ఉదాహరణ వలన నిది బోధపడగలదు. పరుండుటకు ముందు ఆటవస్తులనెత్తి దాచుకొను నలవాటును బిడ్డకు నేర్పవలె ననుకొనుడు. అప్పుడు తల్లి ప్రతిదినము నిద్ర వేళకు "గడియారము పరుండుమని గంటకొట్టుచున్నది. ఆట వస్తువుల నెత్తిపెట్టవలెను. అందులకమ్మ రామునకు సాయపడు"నని ఒకే రీతిగ బిడ్డతో ననవలెను. బిడ్డ కొంచ మెదిగిన పిదప "గడియారము పరుండుమను చున్నది. రాము డాటవస్తువుల నెత్తి పెట్టుటకు సమయ మగుచున్నద"ని కొంచము మార్చి పలుకవచ్చును. బిడ్డ ఈమాటలను వినుటయేగాక విన్నంతనే ఆటవస్తులనెత్తి పెట్టుచుండవలెను, అప్పుడే అతనికా యలవాటు సరిగా ఏర్పడును. అంతేగాక బిడ్డ యెదిగిన కొలది తన పనులను తానే జేసికొనగలుగు చుంటినను సంతోషమెక్కువగుచుండవలెను.

తలిదండ్రుల పద్ధతులు మార్పులేక యేకరీతిగ నుండిన గాని బిడ్డలు సరిగా నుండజాలరు. నియమము లేర్పరచి నది పాటించుటకొరకే, ఔననగా ఔనే, కాదనగా కాదే యని బిడ్డలకు బోధపడునట్లు తలిదండ్రులు ప్రవర్తించవలెను. అప్పుడే బిడ్డలు వారిని బాధించక సుఖముగా నుందురు. నియమములు బిడ్డలను బంధించునవియును బాధించునవియునై యుండరాదు. వారి క్షేమమును, ఆరోగ్యమును కాపాడుట కేర్పడినవిగా నుండవలెను.. అట్టి నియమములను ఏవో కొన్ని ప్రత్యేక సమయములందు దప్ప సాధారణముగా బిడ్డలు పాటించి తీరవలెను. పండుగలు, పుట్టిన దినములు ప్రత్యేకసమయములే కావచ్చును. కాని ఇంటికి చుట్టములు వచ్చిరని బిడ్డలిష్టానుసార ముండరాదు. ఒక్కొక్కప్పుడు బంధువులింటనుండుటయే బిడ్డల సమస్యలకు ముఖ్యకారణమగుచుండును.

బిడ్డకు కార్యసాఫల్యమును, తృప్తియు నవసరము :—

**(The child's Need for Success and Satisfaction)**

బిడ్డలకు సరియగు నలవాట్ల నెందుల కెర్పరుపవలెనను సంగతులనుగూర్చి ఇంతవరకు నాలోచించితిమి. ఇక ఆ యలవాట్లను బిడ్డలు సంతోషముగా నేర్చుకొనుటకై మన మెటు తోడ్పడ వలెనో చూతము. ఏది నేర్చుకొనుటకైనను ప్రయత్నించుట చాల ముఖ్యము. మనము సాధారణముగా బిడ్డలు చేయు ప్రయత్నములను గమనింపక వాని ఫలితములనే గమనించుచుందుము. దాని వలన బిడ్డలు నిరుత్సాహు లగుచుందురు. ఫలితములెటున్నను బిడ్డలొకపనిని సాధించుటకై చేయు ప్రయత్నములను ప్రశంసించుట యవసరము. తన యత్నముల నితరులు గుర్తించి మెచ్చుకొన్నప్పుడే బిడ్డ నిజమైన తృప్తిని బొంది తన పనిని సంతోషముగా నేర్చుకొనును. మరియు, బిడ్డ చేయు పనియందలి లోపములనే యెక్కువగా ఎంచి, చూపుట పనికిరాదు. దాని వలన బిడ్డకాపని యెడ నయిష్టము గలుగును.

తాము జేయు ప్రయత్నముల నితరులు గమనింపనిచో పెద్దవారికే యెంతో నిరుత్సాహము గలుగుచుండును. అట్టి యెడ బిడ్డల ప్రయత్నములను గమనింపనిచో వారెంత నిరుత్సాహ పడునదియు నూహింపనగును. బిడ్డలు చేయు ప్రయత్నములను ప్రశంసించుటచే వారింకను ప్రయత్నించ నుత్సహింతురు. కాని వారు నిజముగ యత్నించినదియు లేనిదియు తెలిసికొనక పొగడుట పనికిరాదు. అట్లు పొగడుచుండిన బిడ్డ లే ప్రయత్నమును జేయకయే, పొగడ్తల నాశించుచుందురు.

దురలవాట్లను మాన్పుటకై కొన్ని సూచనలు :

తలిదండ్రులు తమ బిడ్డలకు మంచి యలవాట్ల నలవడ జేయుటయేగాక వారియందలి దురలవాట్లను తొలగింప వలసిగూడ యున్నది. రోగమును కుదుర్చుటకన్న రోగము రాకుండ జూచుటయే మేలని పెద్దలు జెప్పుదురు. బిడ్డలకు చెడుగుణము లలవడు పరిస్థితులేర్పడకుండ తలిదండ్రులాదినుండియు తగు జాగ్రత్త దీసికొనుచున్నచో అట్టి గుణముల మాన్పు నగత్యమే వారికి గలుగకుండును. పసితనమున పిల్లల కేర్పడిన చెడ యలవాటే వారెదిగిన పిదప ఎదురించుట, ఏకాగ్రతలేకుండ, మాటి మాటికి అలుక జెందుట, చీకటియన్న భయపడుట, అన్నిటిని పాడుజేయుట మొదలగు ప్రవర్తనా దోషములుగ పరిణమించును. ఇదితలిదండ్రులు బాగుగ దెలిసికొనవలెను. ఇక యేర్పడిన యలవాట్లను తొలగించుటెట్లో ఆలోచింతము.

1. చెడ్డ అలవాట్లను తొలగించవలెనన్న అవి యేర్పడుటకు గల కారణముల నెరిగి వానిని తొలగింప ప్రయత్నించవలెను. బిడ్డలు తలిదండ్రుల ననుకరించి యెన్నో దుర్గుణముల నలవరచుకొందురు. అట్టియెడ వారిని దండించుటకంటె తలిదండ్రులే తమ తప్పులను గ్రహించి దిద్దుకొన ప్రయత్నించుట సమంజసమగును.

[సశేషం]

# శారదకు లేఖ

'శ్రీ దత్'

చి. సౌ. శారదకు,

నీకు ఉత్తరం రాసి చాలా కాలమైంది. ఏం చేస్తున్నావో, ఒడుదుడుకు లేమీ లేకుండా మీ నూతన దాంపత్యంలో రోజులు ఎలా గడుస్తున్నదీ తెలియటం లేదు. వీలయినన్ని ఎక్కువసార్లు నీకు ఉత్తరాలు రాద్దా మనుకుంటాను కాని ఎప్పటికప్పుడు టైం దొరకదు. దాంపత్య జీవితంలో తీసికోవలసిన మెలుకువలు, భర్తతో ప్రవర్తించే టప్పుడు తీసికోవలసిన జాగ్రత్తలను గురించి రాస్తాను.

పెళ్ళియైన ప్రతి నూతన జంటలోని యిద్దరి జీవితా లున్నూ, మొదలవబోతూన్న ఒక నవల వంటివి. ఆ నవల సుఖాంతం కావాలంటేనూ, చివరి వరకు మనోహ రంగా ఉండాలంటేనూ, అందులోని పాత్రలు మనోరం జకంగా ఉండాలి. ఉన్నతమైనవిగానూ, ఘనమైనవి గానూ ఉండాలి. అరమరికలు లేకుండా పొందికగా సాగి పోవాలంటే ఇద్దరి మానసిక ఏకీకరణ జరిగిపోవాలి. పర స్పరం అనుమానం, భయాలకు తావు లేకుండా మనస్సు లను నిర్మలంగా ఉంచుకుని నిష్కల్మషంగా మాట్లాడు కోవాలి. ఈ విషయంలో,— అంటే, ఇలా జీవితాన్ని మేళవింప జేయటానికి— స్త్రీ నిర్వహించబోయే పాత్ర చాలా ముఖ్యమైనది.

వాళ్ళ దాంపత్య జీవితంలో, స్త్రీ మాత్రమే. ఏ అంత స్థులో వాళ్ళ హోదాను నిలబెట్టాలో, ఆ అంతస్థులో వారి హోదాను నిలబెట్టగలదనే సంగతి నిజమని నీవు ఒప్పు కుంటావు కదూ? పిల్లలకు తండ్రియందు గౌరవం నేర్పితే, అతడు నీయందు గౌరవ భావం చూపుతాడు. ఒక్క ముక్కలో చెప్పాలంటే అతని డిగ్నిటీని కాపాడటం నేర్చుకో.

నీవు నిజంగా అతణ్ణి లొంగదీసికోవాలంటే ఒకే ఒక మార్గముంది. అది ఏమంటే, ఏదైనా ఒక ప్రత్యేకతను నీవు కలిగి ఉండటమే. కొత్త కొత్త పిండివంటలు ఎలా చెయ్యాలో, లేక ఇంట్లో కొత్త కొత్త పూల మొక్కలు ఎలా నాటాలో, వాటిని ఎలా పెంచాలో మొదలైనవి కొన్ని నీకు, బాగా తెలుసునని అతణ్ణి తెలుసుకోనియ్యి. అంత మాత్రంచేత అతనికి తెలియాలని పనికట్టుకుని ప్రయత్నించకు, అతణ్ణే తెలిసికోనియ్యి. అతను దాన్ని గురించి అడిగినప్పుడు మాత్రమే నువ్వు చెప్పు. అప్పు డాతని హృదయంలో నువ్వొక బాగా తెలిసిన దానివనీ, నీ దగ్గర్నుంచి తెలిసికోవలసిన విషయాలు ఎన్నో ఉన్న య్యనీ, ఒక అభిప్రాయం ఏర్పడుతుంది.

సాధారణంగా ఆఫీసు తగాదాల్లోగాని, మరే చిన్న విష యాల్లో గాని తనశత్రువులమీద, తనఅక్కసు నీ ముందు వెళ్ళ బోసుకుంటాడు. అప్పుడు నీవు చేయకూడని పని ఏమంటే. ఆ విషయాల్లో ఈతని తప్పు ఎంతవరకు ఉందీ విచారించి న్యాయమైనతీర్పు ఇవ్వటం. అతను నీ నుంచి వాంఛించేది కరుణా పూరితమైన ఓదార్పు, మెప్పు. జీవితంలో, ప్రపంచంతో అతను జరిపే ప్రతి పోరాటం లోనూ, నిన్ను తన అడ్వకేటుగా ఉండాలని కోరుకుం టాడు. అంతేగాని అతని జడ్జిగా మాత్రం కాదు. అదే విధంగా నీవుకూడా అవిధమైన సెక్యూరిటీని ఫీలవ వల సిందిగా కోర్తాడు. ఇల్లనేదొక్కటే చేసిన తప్పులకు తాను క్షమాపణ చెప్పుకోనవసరంలేని ప్రదేశం ! కాబట్టి ఇంటిలో ఎటువంటి వాతావరణాన్ని సృష్టించుకోవాలో ఆలోచించు.

అంతేగాక అతనిలోని ప్రమాదం లేని విలక్షణాలను కలిగి యుండనీ. ఉదాహరణకు— అతనికి నీతోపాటు వంట దగ్గరకూచుని సహాయం చెయ్యటం సరదా అనుకో. చెయ్యనీ ! దానివల్ల నీవు నష్టపడేదేమీ లేదుగా ! లేకపోతే ఉన్న కాస్త ఖాళీ స్థలంలోనే మొక్కలను పెంచటం సరదా అనుకో. పెంచనీ ! అంతేగాని, "ఆడాళ్ళకిమల్లే పొయ్యి దగ్గర జేరటమేమిటీ అనిగాని !" అసలే జానెడు, బెత్తెడు బస్తీ కొంపలు. దాంట్లో ఈ మొక్కలుగూడానా" అనిగాని అడ్డు తగలగూడదు. అటువంటి వాటివల్ల నీకు కలిగే నష్టమేముంది ? ఈ చిన్న విషయాలలో అతనికి అడ్డు తగిలి, అభిప్రాయ భేదాలు తెచ్చుకుని, తగాదాలు తెచ్చి పెట్టుకోటం మాత్రం వాంఛనీయంకాదు. అతడనే వ్యక్తికి, నీకూ ఇదివరకే వివాహమైపోయింది. ఇప్పుడు జరగ వలసిందల్లా, అతని మనస్తత్వానికి, నీ మనస్తత్వానికి వివాహం మాత్రమే !

అలాంటి తగాదా తెచ్చే పరిస్థితులు వైవాహిక జీవితంలో సతీపతుల మధ్య ఏర్పడటం సహజమే. అంతే గాక ఆ పరిస్థితులు రాకుండా ఎవ్వరూ తల్లకిందులు తపస్సుచేసైనా అరికట్టలేరు. కాని ఆ పరిస్థితులు ఏర్పడ్డ తరువాత వాటిని సద్దుబాటు చేసుకొని తగాదా రాకుండా చూచుకోగల శక్తి మనచేతుల్లోనే ఉంది. అది, అందుకు సంబంధించిన, ఆ వ్యక్తులిద్దరిమీదా ఆధారపడి ఉంటుంది.

సాధారణంగా అభిప్రాయ భేదాలేగదా వీటన్నిటికి మూలం. భర్త కబుర్లు చెప్పే అలవాటుగలవాడై, భార్య ముంగితనం గలదైతేనూ; భార్య బడబడ వాగగలదై భర్త ఎప్పుడూ గంభీరంగా ఉండి, ఎక్కువ మాట్లాడే అలవాటులేని వాడైతేనూ వస్తుంది చిక్కు. ఇద్దరూ సరి సమానంగా వాగగల వాళ్ళైనా అయి ఉండాలి. లేక పోతే ఇద్దరూ ముంగితనానికి అలవాటుపడ్డ వాళ్ళైనా అయి ఉండాలి, ఇక పరిశుభ్రత విషయంలో, ఇద్దరిలో ఒకరు ఎక్కువ పరిశుభ్రత, ఇంకొకరు తక్కువ పరిశుభ్రత గలవారైతే వస్తుంది చిక్కు. తక్కువ పరిశుభ్రత గలవారు ఎక్కువ పరిశుభ్రత నేర్చుకోవడమే మంచిది.

భర్త ఆఫీసునుంచి వచ్చినప్పుడు ఆఫీసు వ్యవహారాలలో విసిగిపోయి, చిరాగ్గా ఉంటాడు. ఆ చిరాకు పోవాలంటే "గృహమేకదా స్వర్గసీమ" అని అతను భావించాలి. అతనలా భావించేటట్టు చెయ్యటం నీ విధి. అలా చెయ్యలేకపోతే ఆతప్పు పూర్తిగా నీదే. కొందరు మహా తల్లులు భర్త యింటికి వచ్చేవేళకి పిల్లల్ని గొల్లున ఏడిపిస్తూంటారు. ఆదృశ్యాన్ని చూచి భర్త కసురుకోవటం, ఇద్దరిమధ్యా రుసరుసలు, విసవిసలు. మూతి ముడుచుకుంటుంది, భార్య. అతనికి వళ్ళుమండి పోతుంది. ఏ పార్కుకో పోయి సాయంత్రం గడుపుకుంటాడు. దాంతో అంటుకుంటాయ్ కొంపలు. ఇంతకీ చెప్పవచ్చిందేమంటే, భర్త ఇంటికి రావడమనేది, ఇద్దరికీ ఒక ఆనందదాయక సన్నివేశమవాలి.

ముఖ్యంగా నీ భర్త సంగతి తెలుసు గనుక రాస్తున్నాను. అతనికి లలితకళలంటే మంచి అభిరుచి. కొంచెం ప్రవేశమూ ఉన్నవాడు. అందులోన్నూ సాహిత్యమంటే వెర్రి అభిమానం గలవాడు. చేతనైతే నీవుకూడా మంచి మంచి పుస్తకాలు చదివి అతనితో తర్కించు. అతనికి తెలిసిన విషయాలు నీకు చెప్తాడు. ఆవిధంగా నీకు చాలా విషయాలు తెలుస్తయ్; అతనికి తెలియని విషయాలు నీ తెలియ జేయవచ్చును. ఇంగ్లీషులో ఒక మంచి సూక్ ఉంది. "Give instruction to a wise man an he will be yet wiser". నీవు చెప్పే వాటిలో కొని అతనికి ప్రయోజన కారులుగా నుండవచ్చును. నిజం నీవావిధంగా చేసినప్పు డాతడెంత సంతోషిస్తాడు!

స్వేచ్ఛను బాగా అనుభవించు. నిన్ను కాదనడు. కొని కొన్ని వస్తువులు — ఎక్కువ ఖర్చులేనివి — నిర్భయం ఎక్కువ తెచ్చిపెట్టమని అడగవచ్చు. నీకు పెద్ద పె చేమంతి పూలంటే ఒకవిధమైన వెర్రి ఉందనుకో, నీ భ ఒక చిరునవ్వు నవ్వేసి, సంతోష పూర్వకంగా తీసుకొచ్ స్తాడు. నీవు ధరిస్తావు, నిజంగా అందులో ఎంత మా ర్యం ఉంది!

మగవాళ్ళు, ఇతరమగవాళ్ళతో, సాధారణంగా, వా భార్యలను గురించి ఎక్కువ మాట్లాడరు. కాని ప్రతిపు వాడు తన భార్యకు, ఏదో ఒక ప్రత్యేకమైనది, మంచి అసాధారణమైనది ఐన వస్తువంటే ఎక్కువ ఇష్టమ చెబుతాడు. అదీ, సాధారణంగా సగర్వంగా చెప్పుకు టాడు.

సాధారణంగా బస్తీలో ఉండే ఆడవాళ్ళకు స్నోల పౌడర్లు మీద మోజు ఎక్కువగా ఉంటుంది. వాటిమీ డబ్బు ఎక్కువ ఖర్చు చేస్తూ ఉంటారు కూడాను. నీకూ దుర్గుణం అంతో ఇంతో లేకపోలేదు గనగ పోగొ కోమని చెబుతున్నాను. కేవలం వాటివల్లే అందం పు కొచ్చి రంభ, ఊర్వశి అవలేరుగదా! అప్పు జేసైనాస అర్జంటుగా సినిమాకు తీసుకెళ్ళమని పేపుకు తింటారు అటువంటి భార్యలు, భర్తలకు కేవలం గుదిబండలు సిల్కుచీరలు కట్టుకుని షోకుగా అలా బిసెంటు రోడ్డుల తిరిగితేనో, అప్పుజేసి లీలామహల్‌లో సినిమా చూస్తే ఒరిగేదేమిటి. అంతమాత్రం చేత మీరు ధనవంతుల ఎవరూ అనుకోరుగదా! కేవలం డ్రెస్‌ని చూసి వా వాళ్ళ ఆర్థికస్థోమతలను నిర్ణయించేటంత మూర్ఖులు కా ప్రపంచంలోని వాళ్ళంతా! ఒకవేళ అటువంటి వాడె డైనా ఉంటే వాణ్ణి తెలివితక్కువవాడని చెప్పక తప్పదు కాబట్టి అందరి ఆడవాళ్ళలాగా అతన్ని డబ్బుకోస మాత్రం వేధించుకు తినకు.

## శారదకు లేఖ

ఈ సందర్భంలో మొన్ననే జరిగిన ఒక సంఘటన చెప్ప దలిచాను. భార్య చనిపోయిన ఒక భర్తను అతని స్నేహితుడొకడు పలుకరించడానికి వెళ్ళాడు. వెళ్ళిన స్నేహితుడు, "పాపం! నీ హృదయానికి పెద్దదెబ్బ తగిలింది. ఆమెను మరచి పోవటానికి కొంతకాలం పడుతుంది. అప్పుడా భార్యపోయిన వ్యక్తి," ఆమెను నేన ప్పుడే మరచి పోగలిగే వాణ్ణి. కాని ఆమె, బట్టలషాపు లోనూ, నగలషాపులోనూ, చేసి వెళ్ళిన 2 వేలరూపాయల అప్పుమూలంగా ఆమెను నేనెన్నటికీ మరువలేను," అన్నాడు. లోకంలో కొందఱు ఆడవాళ్ళు, వాళ్ళభర్తలను ఎంత విసిగించగలరో ఉదాహరణకు పై విషయం చెప్పాను. కాబట్టి కుటుంబ ఖర్చు విషయంలో పూర్తి స్వేచ్ఛ మగవాడికి లేకపోతే మధ్యతరగతి కుటుంబాలకు అధఃపతనం తప్పదు.

అతను కేవలం మగవాడు గనక, ఎప్పుడైనా ఒక ప్రత్యేక స్త్రీని చూచి, "ఆహా! ఈమె ఎంత అందంగా ఉంది" అన్నాడనుకో. అంతలో దాన్ని నీవపార్థంచేసుకోగూడదు. అవి కేవలం అమాయికంగా వెలువడిన మాటలు. కేవలం అందాన్ని ప్రశంసించటం మాత్రమే అందులో ఉంది. సాధ్యమైనంత త్వరలో పరిస్థితిని అదుపులోనికి తెచ్చుకోవాలంటే, ఒకే ఒక మార్గముంది, అది ఏమంటే: నీవుకూడా ఆమె అందాన్ని ప్రశంసించటమే. ఆమె అందం అతనికి నచ్చిందని నీవూ ఒప్పుకుంటున్నానని చెప్పేసెయ్. అంతేగాని ఆమె నాతడు రహస్యంగా ప్రశంసించనీకు. బయటి వాళ్ళ విషయాలను బహిరంగగా దులిపేసుకోండి, ఇద్దరిముందూను. నీ అభిరుచి కూడా మంచిదేనని అతనికి తెలియజెయ్యటం మంచిది. లేకపోతే ఇటువంటి విషయాలే విషమపరిణామాలకు దారితీసి, దారుణ ఫలితాల నివ్వగలవు. ఇప్పటికే ఈ ఉత్తరంలో చాలా ఎక్కువ రాశానను కుంటాను. విశేషాలతో త్వరలోనే జవాబు రాస్తావుగదూ?

ఇట్లు

"మీ అమ్మ"

---



# మనలో మనమాట



కయ్యానికి కాలు దువ్వటము పురుషలక్షణము కాదు - స్త్రీ లక్షణము అసలేకాదు. పైగా కయ్యము మునలాయనతో -

పదిమంది స్త్రీలు అమాంతంగా దండెత్తితే ఎంత మంత్రి సత్తములైనా పాపమా పురుష పుంగవుడేమి చేయగలడు. స్వరక్షణకు అంగరక్షకులసహాయము అడుగక పోవటము కొంతవరకుమేలే. ఈఫార్సంతా వోతూ వోతూ నెహ్రూ చూచీ చూడనట్లు వూరుకున్నాడు. అటు అనుభవశాలి వృద్ధుడు ఇటు పదిమంది స్త్రీలు. అందులో ఎమ్‌పీలు! ఏమనగలడు పాపము! ఆయనకు అటువంటి సంఘటనలు చూచినప్పుడు వూరుకుండుట సహజము గాకపోయినా ఏమి అనలేక ఓచిరునవ్వు పారేసి తన త్రోవను తా వెళ్ళాడు. ఈరభసంతా ప్రజాలోక సభల భవనములో జరుగుతూవుంటే ఎప్పటికప్పుడు లోకానికి వార్తలు వస్తూనేవున్నవి.

అయినా అయినదానికి కానిదానికి అన్నిటికీ, ఇంత గొడవ చేయటమేనా? మహిళాభ్యుదయవాదులిలా వెర్రి వెర్రి వోకడలువోతే.

ప్రక్కన ఆస్థిహక్కులకు ఒక చిన్న యుద్ధము జరుగు చునే వున్నది. ఇంతలోకే ఈ I.A.S., I.P.S., లలో స్త్రీల ఉద్యోగుల గొడవ ఆరంభము.

ఇంతకీ — సంగతేమిటంటే ఉద్యోగము చేస్తూవున్న స్త్రీలు వివాహము చేసుకుంటే వివాహము వల్ల తను ఉద్యోగ నిర్వహణకు ఎట్టి ఆటంకము కలిగినా వారిని ఉద్యోగ విముక్తులనుగా చేయదగునవి ఇదివరలోనున్న రూల్సు. ఇదేలనో కొందరి స్త్రీ ఎమ్‌పీలకు కంటకముగా కనబడినది. కనబడుచున్నది. మన రాజ్యాంగ చట్టము ప్రకారము స్త్రీలకెట్టి అనర్హతా వుండకూడదుకదా కాబట్టి పురుషుల వివాహానంతరము ఉద్యోగము చేయదగినప్పుడు స్త్రీలకేల ఈ అనర్హతని వారి వాదము.

తెలసినవారికి చెప్పవచ్చును.........................
ఈ ఎమ్‌పీలు - ప్రజా ప్రతినిధులు — పైగా ప్రత్యేకంగా స్త్రీల ప్రతినిధులు - వీరు స్త్రీలకొరకు - భారత స్త్రీకొరకు ప్రజాప్రతినిధుల సభలలో వితండవాదము చేస్తూవుంటే భారతావనిలోని స్త్రీలందరూ వారినిచూచి వారి ధైర్య సాహసాలకు మెచ్చి అభినందించవలయునో లేక తల వంచుకొనవలయునో తెలియకున్నది.

వివాహానంతరము స్త్రీలకేల ఉద్యోగములయందు అనర్హతని బల్లగ్రుద్ది శ్రీకట్జూ గారితో వాగ్యుద్ధము సలుప వచ్చుగాని వివాహానంతరము స్త్రీలకే ఏల మాతృత్వము కలుగవలయునోనని శ్రీ బ్రహ్మగారితో ఎంతమంది స్త్రీలు పోరాడ సంసిద్ధులో తెలసికొనవలసియున్నది. ప్రకృతి మార్చుట మానవతరమా? ఈ రాజ్యాంగ సభలలో చర్చలతో ప్రకృతి సూత్రములను మార్పు చేయగలరా? వివాహానంతరము పురుషులకులేని అనర్హత స్త్రీల కేల యుండవలయునని అడుగుటలో అర్థమేమి? వివాహానంతరము పురుషులలో ఎట్టి మార్పు కలుగుచున్నది? (మానసికము కాదు - శారీరకముగా) వారు బిడ్డలను కనరుకదా? వారిని ఆ కార్యమునకు నియమించుట. భారత రాజ్యాంగ చట్టమునకు తరమా? వారు పూర్వ జన్మలో ఎట్టి పుణ్యము చేసిరో ఈ జన్మమునవారికి బాధ్యతా రహిత జీవనము సంప్రాప్తమైనది. మరి స్త్రీలో అట్టి జీవితము కడపుటకు అనర్హులుగా జన్మించినారు. (అది వారి అదృష్టమో దురదృష్టమో ఎవ్వరు చెప్పగలరు!) కాబట్టి జన్మత సంక్రమించిన అనర్హతలు అనుభవించవలసినదేగాని అంగలార్చిన లాభమేమి?



పదిమంది స్త్రీలు అమాంతంగా దండెత్తితే.........!

మనకు - స్త్రీలకు కొన్ని అనర్హతలున్నవి. వున్నది వున్నట్లు చెప్పితే వులుకెక్కువ - ఎవరికైనా - పురుషులకైనా — స్త్రీలకైనా —

మనము కొన్ని కొన్ని విషయములయందు పురుషులతో పాటు పోటీపడలేము. అట్లే పురుషులునూ స్త్రీలవలే కొన్ని పనులు నిర్వహింపజాలరు.

బిడ్డలు గనుటపెంచుటవారికి చేతగాని పని. నల భీములు మినహా వంట ఇంటిలో వారు చేతులు కాల్చుకొనవలసినదే కాని భుజించతగినవి తయారగుట సూన్యము - శిశుసంరక్షణ గృహ నిర్వహణలో వారికి ప్యాసు మార్కులుకూడ వచ్చుటకష్టమే. నర్సింగు స్త్రీలవలే పురుషులు చేయజాలరు. ఆ విషయము మొగ నర్సుల ముఖముల జూచిననే తెలియకలదు. ఆ పనిలో వారికి 35% మార్కులు రావచ్చును. అంతే — చిన్న పిల్లలకు విద్యగరపుటకు కావలసిన ఓపిక పురుషులకులేదు. స్త్రీలే వారికి బాగుగ విద్యగరుపగలరు. అంతేకాదు. పురుషులకన్న స్త్రీలు సూక్ష్మబుద్ధిగలవారు (క్షమించాలి సోదరులు నిజము చెప్పినందులకు) అది నిర్వివాదాంశము. మనస్తత్వ శాస్త్రవేత్తలు, ప్రపంచానుభవజ్ఞానులు ఒప్పుకొనిన సత్యమే. కాని శారీరకముగా స్త్రీలు పురుషులతో పాటు పోటీ చేయజాలరు. ఇందులకు స్త్రీలేల సిగ్గుపడవలయును? మీరు దుర్బలులని పురుషులు మనలన్నంత మాత్రమున మనకు కలిగిన నష్టమేమి? దేహదౌర్భల్యమునకు బదులు మనకు వారికంటె ఎక్కువ మనోబలము కలందులకు గర్వించవచ్చునే. మొన్న మన ఆరోగ్యశాఖా మంత్రి అమృతకౌరుగారును. పాటియాలా మహారాజాగారూ **Foot ball** స్త్రీలకు తగిన ఆట కాదన్నందుకు వారితోను కయ్యమునకు పోవలసినదేనా?

పాపము కట్జూగారు ఈ సంవత్సరము ఏమి తల పెట్టినా ప్రజాప్రతినిధుల సభలలో ఆయనకు అన్ని ఆటం

కాలే. సరే ఏదో ముసలాయన, అన్నీ ముసలి ఉద్దేశాలే నని అనుకుందాము. మరి నెహ్రూగారు ఈ స్త్రీల ఉద్యోగాల విషయమందు ఎమ్‌పీలు స్త్రీలతో ఏకీభవించ లేకపోయారు. స్త్రీలు గొప్ప గొప్ప ఉద్యోగాలకు అర్హు లేనని ఆయన వప్పుకున్నాడు. కాని ఒక్కొక్కప్పుడు ఉద్యోగమునకు వివాహము ప్రతిబంధమని ఆయన చెప్ప వలసి వచ్చింది. ఎమ్‌పీ స్త్రీల కోరికలు సమంజసము కావని చెప్పాడు. పైగా ఈవిషయము చెప్పుతూ - మన భారత సైన్య దళాలలోకి స్త్రీలను తీసికొనమంటే నేను వెనుకాడవలసి వస్తుందని గూడా అన్నాడు. మొన్న పత్రికలలో ఒక భారతనారి తుపాకీ కాల్పుల పందెములలో (Rifles) ప్రపంచ రికార్డు ఏర్పరిచినట్లు ప్రకటితమైనది. కావున రేపు కొందరు స్త్రీలు ఏమయ్యా నెహ్రూ ! చూడు మా స్త్రీలెంతటి ఘనులో ! భారతభూమిలోనేగాదు, ప్రపంచ రికార్డు ఏర్పరచగల స్త్రీలుండగా వారినీ సైన్యము లోకి ఎందుకు తీసికోవయ్యా. నీ అభ్యంతరమేమి ? గాజులు తొడుక్కున్న మగవారికన్న, యూనిఫారము ధరించిన స్త్రీలు మేలు. ఇకనైనా భారత రాజ్యాంగ చట్టము ననుసరించి స్త్రీలకు మన సేనలలో ఉద్యోగములు ఎర్పాటు చెయ్యి. నీ పుట్టేమి మునగదు. భారతదేశము సురక్షితముగానే యుండగలదని' కొంతమంది స్త్రీలు రేపు నెహ్రూగారిని అడగవచ్చు !

ఇంతకీ స్త్రీలు వివాహానంతరము ఒక్కొక్కప్పుడు వారి ఉద్యోగములకు అనర్హులగుదురన్నంత మాత్రమున స్త్రీజాతికేట్టి అవమానముకాని అన్యాయముకాని జరుగ బోదు. స్త్రీలు అన్ని ఉద్యోగములు పురుషులకన్న బాగు గనే చేయగలరు. శ్రీ నెహ్రూగారు విశ్రాంతి తీసికొన దలచినప్పుడు కావలిస్తే కొన్నాళ్ళపాటు ఓ స్త్రీకి భారత ప్రధానామాత్యుని పదవి వప్పజెప్పితే ఆయనకు దేశానికీ కూడ స్త్రీ శక్తి సామర్థ్యములు తెలియగలవు.

కాని స్త్రీకి ఏ ఉద్యోగము చేయుటకైనా (ప్రధానా మాత్యుని పదవికైనా) వివాహముతోపాటు కొన్ని అనర్హతలు సంప్రాప్తము కాక తప్పవు - స్త్రీలకు ఆఫీసులో ఉద్యోగముతో పాటు గృహమందు ఉద్యోగము తప్పదు. ఈ డబులు డ్యూటీ చేయుటకు మనోబలమెంత నున్నను శరీరబల ముండవలయును కదా ? కావున ఇంతటితో స్త్రీలే రభస ముగించితే మంచిది.

ఇదంతా మనలో మనమాటలే సుమండీ !

కె. లక్ష్మి. ర.



## గృహ విజ్ఞానమునకు బహూకృతి.

దేశంలో కొత్తగా చదువునేర్చుకున్న వయోజనుల ఉపయోగార్థము వివిధ భాషలలో రచియింపబడిన పుస్తకాలలో 35 పుస్తకాలకు ప్రభుత్వము ఎడేసి వందల రూపాయల బహుమతులు ప్రకటించినది. తెలుగులో మూడు పుస్తకాలకు బహుమతులు లభించాయి.

శ్రీమతి కోడూరి లీలావతిదేవిగారు వ్రాసిన గృహ విజ్ఞానమునకు ఒక బహుమతి లభించింది. ఇదివరకే దీనికి తెలుగుభాషా సమితివారు బహుమానం ఇచ్చియుండిరి.

## నమ్మకమంటే ఇదేనా ?

డాక్టరు మత్‌ల్ జూడీలీత్ వేయట్ అనే ముప్పదైదేళ్ళ యువతి ఒక కొత్తరకము హోటలు ఏర్పాటుచేసింది. అక్కడ బిల్లు పద్ధతి లేదు. కావలసినంత తిని ఇష్టము వచ్చినంత ఇచ్చి వెళ్ళ వచ్చునట.

ఈ హోటలు ఆరంభించి ఇప్పటికి అయిదు మాసములైనదట. కుమారి జూడీలీత్ వేయట్‌కు ఈ పద్ధతి సంతృప్తికరముగనేవున్నదట. బిల్లు లిచ్చి వుంటే వచ్చే ఆదాకన్నా ఇంకా నూటికి పది ఎక్కువగానే ఆమెకు ముట్టినవట !




## పుష్పవల్లి

శ్రీ విఘ్నేశ్వరగ్రంథమాలా ప్రచురణము. గ్రంథకర్త ఉభయభాషా ప్రవీణ, విద్వాన్ కోగంటి దుర్గా మల్లికార్జున రావుగారు. భారతీసమితి, పామర్రు. వెల రు 0–8–0.

ఈ గ్రంథకర్తగారు అప్పుడప్పుడు ఆంధ్ర పత్రికలో ప్రకటనకు, తదితర సందర్భాలలోను వివిధ శీర్షికలక్రింద వ్రాసినపద్యాలను యీ 'పుష్పవల్లి'గాగుచ్చి ముద్రించారు. శరీరానికి - మనస్సుకు ఉన్న అవినాభావ సంబంధం వలె ఈ రచనలో భాషాసేవ – దేశసేవ గోచరిస్తున్నాయి. వీరు వెలిబుచ్చిన సంకల్పాలలో ఆంధ్ర రాష్ట్రం వగైరాలు కొన్ని సాకారాం దాల్చాయి.

కె. సు.

## 'హృదయేశ్వరి'

రచన : తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రి
ప్రకాశకులు : సాహితీ సమితి, రేపల్లె
వెల :— రూ 1-8-0

ఈ కావ్యానికి ఇది ద్వితీయ ముద్రణము. ప్రథమ ముద్రణ 1925 లో జరిగింది. నాటికి నేటికి చదువరుల అభిరుచులలోను, కవిత్వ పోకడలలోను వింత మార్పు కలిగింది. అప్పటిరోజుల్లో 'హృదయేశ్వరి' కవిత్వ పద్ధతిలో ఎట్టి సంచలనానికి తావిచ్చినా కథావస్తువు చేతను, రచనా విధానం వల్లను నేటి అభి రుచులకు, దృక్పథాలకు సమయోచితంగానే కనిపిస్తుంది.

కావ్యానికి – ముఖ్యంగా అష్టమ నవమోచ్ఛ్వాసములు కవిత్వ పద్ధతిలో వినూత్న పోకడలను కల్పించి ఆధునిక వాఙ్మయంలో గ్రంథకర్త తమ "హృదయేశ్వరి"ని చిరాయువులుగా చేసుకున్నారు.

గిడుగు లక్ష్మీకాంతమ్మ.

## గాలిమేడల ఆమెరికాలో

రచయిత : ఎల్. ఎన్. రావుగారు, మెంబరు, సర్వెంట్సు ఆఫ్ఇండియా సొసైటీ. వలయువారు పై చిరునామాకు కాజీకోడ్ 2, మలబారు జిల్లా అని వ్రాయవలెను, వెల— రూ 1–8–0.

శ్రీ రావుగారు 1953 ఏప్రెల్ – సెప్టెంబరుల మధ్య ఆమెరికా దేశం పర్యటిస్తూ "సాధన" పత్రికకు వ్రాసిన యిరువై లేఖల సంకలనం. వీరు దేశమున గాంచిన వింతలు, విశేషాలు - ఒక ట్రావెల్ గైడుగా వుండాలనిగాక - విదేశీ యాత్రలకు పోలేని వారికి కొంత విజ్ఞానదాయకంగా ఉండాలనీ, తెలుగుతల్లి పాదములకడ తమ యథాశక్తినొక అడవిమల్లె నిడవలెననీ రచించిన ప్రయత్నము. స్కూళ్లలో నాన్డిటెయిల్డ్‌గా నుంచబడే భాగ్యము లభిస్తే ద్వితీయ ముద్రణలో తగుసవరణలు గావిస్తామని ఆంధ్ర లోకానికి మనవి చేస్తున్నారు.



# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ మద్రాసు

| | |
|---|---|
| మహిళా విద్యాలయము | : హిందీ, కాశీ విశ్వవిద్యాలయపు ఎడ్మిషన్, ఇంటర్మీడియెట్, ఇ.యస్.ఎల్.సి., పరీక్షలు. |
| పారిశ్రామిక విద్యాలయము (గవర్నమెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది) | : కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు, అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చు కూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. బీద విద్యార్థినులకు ఉచితము. |
| వస్త్రములపై అద్దకపుపని మిషనుకుట్టు, మిషను అల్లిక, చేనేత- బుక్ బైండిగు, ఎంబ్రాయిడరీ. | : భారత ప్రభుత్వ పునరావాసశాఖవారిచే ఆంధ్రమహిళా సభ పారిశ్రామిక భవనములు, 7-ఎ రోజరీ చర్చి రోడ్డులో నడుపబడుచున్నవి. |
| టెక్నికల్ ఇన్స్టిట్యూట్ | : స్త్రీలకు మైపు.—గవర్నమెంట్ పరీక్షలకు శిక్షణ. |
| మహిళా మందిరము | : స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము. |
| ఆంధ్ర మహిళ | : స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాసపత్రిక. |
| నిర్మలాదేవి గ్రంథాలయము | : సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంథ సముదాయము. |
| నర్సింగ్ హోమ్ | : స్త్రీ, శిశువుల, సంరక్షణశాల, ప్రసూతిశాల, ఉచిత వైద్యశాల— అడయారులో నిర్మించబడినది. భారత ప్రభుత్వ ఆరోగ్యశాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్స్ఎయిడ్—మంత్రసాని పనులలో శిక్షణ యివ్వబడుచున్నది. |
| ముద్రణశాఖ | : ఆంధ్ర మహిళా సభవారిచే స్వంతంగా స్థాపించబడినది. విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగు, ప్రూఫ్ రీడింగు, మొదలైనవి వుచితంగా నేర్పబడును. |

క్రీడా, క్లబ్బుశాఖలు.

సభ్యురాండ్రుగా జేరి, యీ జాతీయ సంస్థను పోషించండి.

Edited by Mrs. K. Lakshmi Raghuram, B.A.,
Printed & Published by Mrs. A. C. Krishna Rao, M.A., L.T.,
at the Andhra Mahila Press, Mylapore, Madras 4.